# సుగ్రీవ విజయము

ప్రపంచమున యక్షగానములు లక్షలపర్యంతమున్నవి. అయినను సుగ్రీవవిజయ మన్నిటిలో నగ్రస్థానమలంకరించినదని 1920 ప్రాంతపు శారదస్వతిసభలలో శ్రీ చింతా దీక్షితులు మున్నగువారిచే దత్పాశస్త్యము విపులముగాఁ జర్చింపఁబడి పండితజనాదరణీయమై యలరారుచున్నది. అందలి యిష్టదేవతా ప్రార్థనము.

ఉ॥ శ్రీవిభుఁగొల్చి శంకరు భ ♦ జించి చతుర్ముఖుఁ గెంచి భార్గవీ
గ్రావసుతా సరస్వతులఁ ♦ బ్రార్థనసేసి గణేశపాద పూ
జావిధిసల్పి కేశికుల ♦ సంస్తవనంబొనరించి కావ్యవి
ద్యావిదులన్నుతించి కవి ♦ రాజులనిన్నరసెంచి వేడుకన్.

కథా ప్రారంభము.

'త్రిపుట' 'అఖిలలోకాత్ముఁడు శుభచరిత్రుఁడు దళితశత్రుఁడు సుజనమిత్రుఁడు నళిననేత్రుఁడు కందుకూరి జనార్దనుండు.' 1

'ఇందిరాధ్యక్షుఁడు సాధుపక్షుఁడు పృథులశౌర్యుఁడు మేరుధైర్యుఁడు నందితార్యుఁడు, కందుకూరిజనార్దనుండు.' 2.

'ధృతివిశాలుఁడు గానలోలుఁడు దివిజపాలుఁడు ధర్మశీలుఁడు నతదయాళుఁడు కందుకూరి జనార్దనుండు.' 3

వర్ణనము: "ముక్కులు చెక్కులు ♦ మూపులు తీపుల్, ప్రక్కలు పిక్కలు ♦ బరులును దరులున్.
స్వరములు శిరములు ♦ జానులు వీనుల్, కరములు నురములు ♦ కాళ్ళును వ్రేళ్ళున్,
ఎక్కువతక్కువ ♦ లింతయులేకన్, ఒక్కరూపమున ♦ నున్నవి చూడఁగ"

ద్విపద......విఖ్యాతిఁ, దాను కందుకూరి జ ♦ నార్దను పేర, నంకింతంబుగఁ గాళి ♦ కాంబాప్రసాద,
సంకలితకవిత్వ ! చాతుర్యధుర్య, తార్కిక పెదలింగ ♦ నార్యతనూజ,
కోవిద స్తవనీయ ♦ గుణసముద్రధీర, విరచితసుగ్రీవ ♦ విజయాభిధాన
కరుణాభాసురయక్ష ♦ గానప్రబంధ, మాచంద్రతారార్కమై యొప్పఁగాత.
ఆచంద్రతారార్కమై యొప్పఁగాత.

ఈ గ్రంథమిప్పుడు ముద్రితమైయున్నది. ఇందు త్రిపుట, జంపె, కురుచజంపెలు విశేషముగా నున్నవి. విశేషాంశములు వేరొకచో చర్చింపఁబడును.

# స్మరదీపిక

స్మరదీపికను గుఱించి వాత్స్యాయన కామసూత్రములు సంగ్రహించి ముద్రింపించిన శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారి విజ్ఞప్తియందిట్లున్నది. "9. స్మరదీపిక: ఈరుద్రకవియెవ్వరో యెఱుఁగరాదు. కాని యీయన దాదాపు 200, శ్లోకములు గలుగునట్లుగాఁ తన గ్రంథమును రచించి నాఁడు. ఇందుఁగూడ మొట్టమొదట కొక్కోకపండితునివలెనే.

"స్వనారీరక్షణం పుంసాం శాస్త్రేణాం చదనంతరం, బంధభేదేంగితజ్ఞాన మేతత్ఫలముదాహృతమ్"
అని కామశాస్త్రప్రయోజనమును వివరించుచున్నాఁడు. ఇంతయే కాక గ్రంథరచనమునకంతకుఁగూడఁ

కొక్కోకకవియే యీతనికి మార్గదర్శకుఁడు కాఁబట్టి యీయన చాల నవీనుఁడనియు 17 వ శతాబ్దమువాఁడై యుండుననియు ననుకొందును. ఈక్రిందిశ్లోక మితని రచనారీతుల నొక్కింత తెలుపఁగలదని తలంచెదను.

"యానిర్లజ్జాకృతాగాఘం మదనేన మదేనచ, అక్షిణా నాతిపశ్యంసాక్షి, సాకాంక్షితాబుద్ధైః, భవేద్వ్యాసకసజ్జా సా దూతీద్వారేణనిర్గతే, నిశ్చిత్యాగమనం భర్తుస్స్వారేక్షణపరాయణా; ప్రియైకవీతనీచేష్టా ధావత్యస్మాదినీతథా, తత్రైవావధితే కాంతే విరహోత్కంఠితామతా."

వాత్స్యాయనసూత్రపీఠికయందు 17 వ శతాబ్దమువాఁడై యుండునని యూహించుటకుఁ బ్రబలనిదర్శనము లేవియులేవు కాని 14 వ శతాబ్దమువాఁడయిన కొక్కోకునితర్వాతివాఁడని యొప్పుకొనకతప్పదు. "సీ. ప్రతివాద పంచాంగ పఠనసేయుటమాని, కొక్కోకశాస్త్రంబు గొణఁగఁదివిరె" (నిరం) కొక్కోకుని తర్వాతివాఁడయిన మాత్రమున శతాబ్దమును నిర్ణయించుటకు వీలులేదుగదా! 16 వ శతాబ్దమువాఁడయినట్లు నిదర్శనములున్నవికదా.

## సరసజన మనోరంజనము

ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారములో సరసజన మనోరంజనములోని పద్యములు.

ఉ॥ ఎన్నఁడు నేరిచెన్ బెళుకు ♦ లీచెలి కన్నులు కారుకమ్మల
న్నన్నకురుల్ పిఱుందుపటు ♦ వైపట్టువైఖరి గైకొనెంగదే
మొన్నగదమ్మ పిన్నమొల ♦ మొల్కలు నేడిదెవన్నెలాడితేఁ
జన్నులు మిన్నలై పయఁట ♦ సందునదాఁగిలి మూఁతలాడెడున్.

సీ॥ కొప్పువఁజుట్టిన ♦ గొజ్జంగివిరిదండ, నటనతోవీపున ♦ నాట్యమాడ
బటువైన ముత్యాల ♦ పావడవిరజాజి, తీరుగాఁజెంపలఁ ♦ దిమ్మురుగట్ట
ధగధగద్ధగలచేఁ ♦ దనరుకెంపులతాళి, సరులతోఁ బెనగొని ♦ చాకళింప
గబ్బిగుబ్బలమీఁది ♦ కస్తూరి చెమటలఁ, గరఁగిపాసరలచేఁ ♦ గ్రమ్ముకొనఁగఁ

తే॥ వింతమాటలఁదేటల ♦ విభునిఁగూడి, కాంతరతికేళిమిక్కిలి ♦ గారవింపఁ
దప్పితీరంగ నధరామృ ♦ తమునొసంగి, చంద్రబింబాస్యమగలాగు ♦ సలిపెనపుడు.

ఈపద్యములను బ్రౌనుదొరగారుకూడ జాల ప్రశంసించిరి.

## ఆక్షేపములకు సమాధానము

ఇందలి మొదటిపద్యమున 'మొల్కలు' అను ప్రయోగమునుగూర్చి వినుకొండలో గుంటుపల్లి భాస్కరయ్య గారి సముఖమున నొకకవి యిట్లు సమాధానమొసంగె.

చ॥ వెలగకువెల్లయంచు సర ♦ విన్ జలికొండ నృసింహుఁడాడఁగా
మొలకకు మొల్కయంచుఁ గవి ♦ ముఖ్యుఁడు రుద్రయపల్కె దోసమే
భళిభళి మంచిమాటయె ప్ర ♦ బంధమునాజలరాశి యందులో
పలనెరసుల్ గ్రహింతురె య ♦ పారములౌ మణులెన్నొయుండగన్.
అప్పకవి.

చ॥ కొలఁదిగ మున్నుచెప్పెఁ జలి ♦ కొండ నృసింహుఁడు వెల్లయంచుని
వల నగసాలిరుద్రపను ♦ వాఁడును మొల్కలటంచుఁ గూరిచెన్,

దెలియకకొండజెట్లు విక్ర ♦ తింబడదుస్వయమునన్ లకారాదే
ఫలతలపై యకారమును ♦ బాపుదుసాత్త్వలు నవ్వునట్లుగన్. అని వ్రాసియున్నాఁడు.

లక్షణగ్రంథము వ్రాసితినని విఱ్ఱవీగు కవికి గోచరింపని ప్రయోగములెన్నియో కన్పట్టుచున్నవి.

1. నన్నయభట్టు: "చ. నిన్నుగూం, బుసమిని తమ్ముగోల్పడిరి ♦పార్థివవత్సులైన పాండవుల్" భాగ.
ఉ. భోరనవిస్ఫులింగములు ♦ పొడ్మగసుగ్రవిషంబుఁ గ్రక్కుచున్' భార.
2. తిక్కనసోమయాజి: 'చ...వెల్వెలబారెడు మోముతోడవత్తునె' భార.
3. శ్రీనాథుఁడు: 'మ. గణుతింపంగనితండు, ఫాల్కడలికిన్ ♦ గారాపుఁబుత్రుండు' శృ. నై.
'వారిధితటీ కాల్పట్టణాధీశ్వరున్' భీమఖండము.
4. బమ్మెరపోతన: 'శా. వ్రల్గించుచున్ జెప్పిన మానదండగమునఁ బు♦త్రాత్రి కారతన్ వ్యాధిజన్మించెన్'
5. సింగయకవి: 'శా. దీననో, రల్పాపహాల్పిటివంచు' 'వల్లనఁడయ్యె' భాగ. (భాగ.
6. అల్లసానిపెద్దన: 'మ. వెల్వెలఁబారెడిపకళికా ♦ వ్రాతంబుశాతోదరీ'
'చ...వెల్వెలఁబారెవిటాననాబ్జముల్' 'చ...పొల్తుకకెప్పలనప్పళించుచున్' స్వా. మ.
7. కంకంటి పాపరాజు: 'చ. అన్యాయనలముమంటఁజేసి చీర♦మంటిని దానిని దల్పవైరిగా' ఉ. రా.
8. రామరాజభూషణుడు: 'ఉ. పొల్తుకయోమతిశైలకన్యయో' వసు.
9. తెనాలిరామకృష్ణుఁడు: 'ఉ. కాకమూ,కావలిదావకీలలగు ♦ నాల్కలు ముంగల మొల్కలెత్త'
'సీ. జనియించె నొక్క ప ♦ చ్చని మొల్కయనుబుద్ధి' పాం. మా.
10. ముక్కుతిమ్మన: 'చ. వెన్నెలల్, మొలచిన పాదుపాల్కడలి ♦ ముద్దులపట్టి' పారి.
11. కూచిమంచి తిమ్మకవి: 'సీ. నిక్కవంబుగఁ దూర్పు ♦ దిక్కువెల్వెలఁబారె' రాజశే.
12. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు: 'చ. ఉడుపది వంశకర్త మహి♦మోన్నతి కెయ్యది మేరనాడు
పాల్కడలి జనించినప్పుడు' జై. భా.
కీ. శే. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు: 'ఉ. తమ్ముని బిడలంచుదయఁదల్పఁడు' కీ. శే.
కవిబ్రహ్మ యేటుకూరి వేంకటనరసయ్యగారు: 'ఉ. ముత్తెముస్వాతి చినుకలను మొల్కలు
తొల్కరి కమ్మదమ్ములన్'
శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారును: కాటూరి వేంకటేశ్వరరావుగారును:
'చ. మరువము మొల్కపుప్వు సుమ,మారము నాతనువంచు భ్రాంతులై ♦ మురియుదురు'
అప్పకవి యితరకవులనేమనఁజాలక యొకరుద్రకవిని నిందించుటనుగూర్చి:

చ. అకలుషు రుద్రుఁడిట్లగ ప ♦ యాంబునఁబూనితివృత్తెనాని యా
సుకవిని రామకృష్ణకవిఁ జూచియు నాతని మొల్కజంటలో
నొకటియు బైటబెట్టకయ ♦ యూరకయుంటివి తప్పటన్న నా
సిక మొదలంటఁగోయు నొకో ♦ చెప్పనఁగొట్టునో యచుమానితే. (అరుణోదయ)

తెనాలిరామకృష్ణునిపద్యము.

చ. ఒకని కవిత్వమందెనయు ♦ నొప్పులు తప్పులు నాకవిత్వమం
దొకనికిఁదప్పఁబట్టఁబని ♦ యుండదు కాదని తప్పఁబట్టినన్
మొకమటుగ్రిందుగాఁదిగిచి ♦ మొక్కలుపోయినయన్పకత్తితో
సికమొదలంటఁగోయుదును ♦ జెప్పనఁగొట్టుదు మోముదన్నుదన్.

గోకోఁకకవియే యీతనికి మార్గదర్శకుఁడు కాఁబట్టి యీయన చాల నవీనుఁడనియు 17 వ శతాబ్దము వాఁడై యుండుననియు ననుకొందును. ఈక్రిందిశ్లోక మితని రచనారీతుల నొక్కింత తెలుపఁగలదని తలంచెదను.

"యానిర్లజ్జాకృతాగాఢం మదనేన మదేనచ, అభియాతిపతింసాక్షి, సాకి కాకథితాబుధైః, భవేద్వ్యాసకసజ్జా సా దూతీద్వారేణనిర్గ నే, నిశ్చిత్యాగమనం భర్తుస్స్వా వేక్షణపరాయణా; ప్రియైకవీతనీ చోష్ణా ధావత్యున్మాదినీతథా, తత్త్రివావధ తేకాం తే విరహోత్కంఠితామతా."

వాత్స్యాయనసూత్రపీఠికయందు 17 వ శతాబ్దమువాఁడై యుండుననే యూహించుటకుఁ బ్రబలనిదర్శనము లేవియులేవుకాని 14 వ శతాబ్దమువాఁడయిన కోకోఁకునితర్వాతివాఁడని యొప్పు కొనకతప్పదు. "సీ. ప్రతివార పంచాంగ పఠనసేయుటమాని, కోకోఁకశాస్త్రంబు గొణఁగఁదివిరె" (నిరం) కోకోఁకుని తర్వాతివాఁడయిన మాత్రమున శతాబ్దమును నిర్ణయించుటకు వీలులేదుగదా! 16 వ శతాబ్దమువాఁడయినట్లు నిదర్శనములున్నవికదా.

## సరసజన మనోరంజనము

ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారములో సరసజన మనోరంజనములోని పద్యములు.

ఉ॥ ఎన్నఁడు నేరిచెన్ బెళుకు ♦ నీచెలి కన్నులు కాయకమ్మ ల
న్నన్నకురుల్ పిఱుందుపటు ♦ వైపట్టువైఖరి గైకొనెంగదే
మొన్నగదమ్మ పిన్న మొల ♦ మొల్కలు నేడిదెవన్నెలాడిలేఁ
జన్నులు మిన్నలై పయఁట ♦ సందునదాఁగిలి మూఁతలాడెడున్.

సీ॥ కొప్పునఁజుట్టిన ♦ గొజ్జంగివిరిదండ, నటనతోవీపున ♦ నాట్యమాడ
బటువైన ముత్యాల ♦ పావడవిరజాజి, తీరుగాఁజెంపలఁ ♦ దిమ్మురుగట్ట
ధగధగద్ధగలచేఁ ♦ దనరుకెంపులతాళి, సరులతోఁ బెనగొని ♦ చౌకళింప
గబ్బిగుబ్బలమీఁది ♦ కస్తూరి చెమటలఁ, గరఁగ్రివాసనలచేఁ ♦ గ్రమ్ముకొనఁగఁ

తే॥ వింతమాటలఁదేటల ♦ విభునిఁగూడి, కాంతరతికేళిమిక్కిలి ♦ గారవింపఁ
దప్పితీరంగ నధరామృ ♦ తమునొసంగి, చంద్రబింబాస్యమగలాగు ♦ పలికెనపుడు.

ఈపద్యములను బ్రౌనుదొరగారుకూడ జాల ప్రశంసించిరి.

## ఆక్షేపములకు సమాధానము

ఇందలి మొదటిపద్యమున 'మొల్కలు' అను ప్రయోగమునుగూర్చి వినుకొండలో గుంటుపల్లి భాస్కరయ్య గారి సముఖమున నొకకవి యిట్లు సమాధానమొసంగె.

చ॥ వెలగకువెల్లయంచు సర ♦ విన్ జలికొండ నృసింహుఁడాడఁగా
మొలకకు మొల్కయంచుఁ గవి ♦ ముఖ్యుఁడు చంద్రయపల్క దోసమే
భళిభళి మంచిమాటయొ ప్ర ♦ బంధమునాజలరాశి యందులో
పలనెరసుల్ గ్రహింతురె య ♦ పారములౌ మణులెన్నొయుండగన్.

అప్పకవి.

చ॥ కొలఁదిగ మున్ను జెప్పెఁ జలి ♦ కొండ నృసింహుఁడు వెల్లయంచునీ
వల నగసాలిరుద్రపను ♦ వాఁడును మొల్కలటంచుఁ గూరిచెన్,

జెలియకకొంచెపుట్లు వెక్క ♦ తింబదమున్యముకా లకారమే
ఫలతలపై యకారమును ♦ ... సవ్వునట్లుగన్. అని వ్రాసియున్నాఁడు.

లక్షణగ్రంథము వ్రాసినవాని కిట్టి గణించని ప్రయోగములెన్నియో కనుపట్టుచున్నవి.

1. నన్నయభట్టు: "చ. నిస్సగం, బాలుని తమ్ముగ నోల్పడి ♦ పాత్రిభపత్సుతులైన పాండవుల్" భాగ. ఉ. భోగనవిస్ఫులింగములు ♦ పొద్మ ... ప్రక్కచున్' భార.
2. తిక్కనసోమయాజి: 'చ... వెల్వెలబారెను మోముతోడవత్తునె' భార.
3. శ్రీనాథుఁడు: 'మ. గణుతింపంగనితండు పొల్కడలికిన్ ♦ గారాపుంబుత్రుండు' శృ. నై. 'వారిధితటీ కాల్పట్టకాశ్రిత్వయన్' భీమఖండము.
4. బమ్మెరపోతన: 'శా. వ్రాలించుకా కెప్పిన మానఁడంగమునఁ బ్రా♦త్రాతికారతన్ వ్యాధిజన్మించెన్' భాగ.
5. సింగయకవి: 'శా. దీనునో, కల్పావపొల్నిటివంచు' 'వల్లదండయ్యె' భాగ.
6. అల్లసానిపెద్దన: 'మ. వెల్వెలఁబారె కేకిపక్షికా ♦ వ్రాతంబుశాతోదరీ' 'చ... వెల్వెలఁబారె విటీజనాబ్జముల్' 'చ... పొల్తుక కెప్పలనప్పళించుచున్' స్వా. మ.
7. కంకంటి పాపరాజు: 'చ. అయ్యాకలమును మంటఁజేసి చ...♦మంటిని దానిని దల్పరైరిగా' ఉ. రా.
8. రామరాజభూషణుఁడు: 'ఉ. పొల్తుకయోనతిశైలకన్యయో' వసు.
9. తెనాలిరామకృష్ణుఁడు: 'ఉ. కాకయు, కావలిదావకీలలగు ♦ నాల్కలు ముంగల మొల్కలెత్తి' 'సీ. జనియించె నొక్క ప ♦ చ్చనిమొల్కయనుబుద్ధి' పాం. మా.
10. ముక్కుతిమ్మన: 'చ. వెన్నెలల్, మొలచిన పాదుపొల్కడలి ♦ ముద్దులపట్టి' పారి.
11. కూచిమంచి తిమ్మకవి: 'సీ. నిక్కవంబుగఁ దూర్పు ♦ దిక్కు వెల్వెలఁబారె' రాజశే.
12. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు: 'చ. ఉడుపది వంశకర్త మహి♦మోన్నతి కెయ్యది మేరనాఁడు పొల్కడలి జనించినప్పుడు' జై. భా.

కీ. శే. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు: 'ఉ. తమ్ముని బిసలంచుఁదయఁదల్పఁడు' కీ. శే. కవిబ్రహ్మ యేటుకూరి వేంకటనరసయ్యగారు: 'ఉ. ముత్తెముస్వాతి చిన్కులను మొల్కలు తొల్కరి కుమ్మదమ్ములన్'

శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారును: కాటూరి వేంకటేశ్వరరావుగారును: 'చ. మరువము మొల్కపుప్పసుమమారదు నాతనువంచు భ్రాంతులై ♦ మురియుదురు'

అప్పకవి యితరకవులనేమనఁజాలక యొకరుద్రకవిని నిందించుటనుగూర్చి:

చ. అకలుషరుద్రుఁడిట్టుగ ప ♦ యోగమునఁబూనితివంతె కాని యా
సుకవిని రామకృష్ణకవిఁ ♦ జూచియు నాతని మొల్కజంటలో
నొకటియు పైటఁ బెట్టకయ ♦ యూరకయుంటివి తప్పటన్న నా
సిక మొదలంటఁగోయు నొకో ♦ చెప్పనఁగొట్టునో యంచుమానితే. (అరుణోదయ)

తెనాలిరామకృష్ణునిపద్యము.

చ. ఒకని కవిత్వమందెనయు ♦ నొప్పులు తప్పులు నాకవిత్వమం
దొకనికిఁదప్పఁబట్టఁబని ♦ యుండదు కాదని తప్పఁబట్టినన్
మొకమటుక్రిందుగాఁదిగిచి ♦ మొక్కలుపోయినయన్పకత్తితో
సికమొదలంటఁగోయుదును ♦ జెప్పునఁగొట్టుదు మోముదన్నుదున్.

కొక్కోకకవియే యీతనికి మార్గదర్శకుఁడు కాఁబట్టి యీయన చాల నవీనుఁడనియు 17 వ శతాబ్దము వాఁడై యుండుననియు ననుకొందును. ఈ క్రిందిశ్లోక మితని రచనారీతుల నొక్కింత తెలుపఁగలదని తలంచెదను.

“యానిర్లజ్జాకృతాగాఢం మదనేన మదేనచ, అభిసారితిపతింసాభి, సాభిసారికాకథితాబుధైః, భవేద్వాసకసజ్జా సా దూతీద్వారేణనిర్జనే, నిశ్చితాత్యాగమనం భర్తుస్స్వారేక్షణపరాయణా; ప్రియైకవీతనీ చోష్ణా భావత్యున్మాదినీతథా, తత్రైవావధితేకాంతే విరహోత్కంఠితామతా.”

వాత్స్యాయనసూత్రపీఠికయందు 17 వ శతాబ్దమువాఁడై యుండునని యూహించుటకుఁ బ్రబలనిదర్శనము లేవియు లేవు కాని 14 వ శతాబ్దమువాఁడయిన కొక్కోకునితర్వాతివాఁడని యొప్పుకొనకతప్పదు. “సీ. ప్రతివార పంచాంగ పఠనసేయుటమాని, కొక్కోకశాస్త్రంబు గొణఁగఁదివిరె” (నిరం) కొక్కోకుని తర్వాతివాఁడయిన మాత్రమున శతాబ్దమును నిర్ణయించుటకు వీలులేదుగదా! 16 వ శతాబ్దమువాఁడయినట్లు నిదర్శనములున్నవి కదా.

## సరసజన మనోరంజనము

ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారములో సరసజన మనోరంజనములోని పద్యములు.

ఉ॥ ఎన్నఁడు నేరిచెన్ బెళుకు ♦ లీచెలి కన్నులు కారుకమ్మల
న్నన్నకురుల్ పిఱుందుపటు ♦ వైపట్టువైఖరి గైకొనెంగదే
మొన్నగదమ్మ పిన్న మొల ♦ మొల్కలు నేడిదెవన్నెలాడిలేఁ
జన్నులు మిన్నలై పయఁట ♦ సందునదాఁగిలి మూఁతలాడెడున్.

సీ॥ కొప్పువఁజుట్టిన ♦ గొజ్జంగివిరిదండ, నటనతోఁ బిఱుఁద ♦ నాట్యమాడ
బటువైన ముత్యాల ♦ పావడవిరజాజి, తీరుగాఁజెంపలఁ ♦ దిమ్మిరుగట్ట
ధగధగద్ధగలచేఁ ♦ దనరుకెంపులతాళి, సరులతోఁ బెనగొని ♦ చాకచిక్యంప
గబ్బిగుబ్బలమీఁది ♦ కస్తూరి చెమటలఁ, గరఁగివాసనలచేఁ ♦ గ్రమ్మికొనఁగఁ

తే॥ వింతమాటలఁదేటల ♦ విభునిఁగూడి, కాంతరతికేళిమిక్కిలి ♦ గారవింపఁ
దప్పితీరంగ నధరామృ ♦ తమునొసంగి, చంద్రబింబాస్యమగలాగు ♦ సలిపెనపుడు.

ఈపద్యములను బ్రౌనుదొరగారుకూడ జాల ప్రశంసించిరి.

## ఆక్షేపములకు సమాధానము

ఇందలి మొదటిపద్యమున ‘మొల్కలు’ అను ప్రయోగమునుగూర్చి వినుకొండలో గుంటుపల్లి భాస్కరయ్య గారి సముఖమున నొకకవి యిట్లు సమాధానమొసంగె.

చ॥ వెలగకువెల్లయంచు సర ♦ విన్ జలికొండ నృసింహుఁడాడఁగా
మొలకకు మొల్కయంచుఁ గవి ♦ ముఖ్యుఁడు రుద్రయపల్కె దోసమే
భళిభళి మంచిమాటయె ప్ర ♦ బంధమునాజలరాశి యందులో
పలనెరసుల్ గ్రహింతురె య ♦ పారములౌ మణులెన్నొ యుండగన్.
అప్పకవి.

[illegible] కొల్లఁదిగ మున్ను జెప్పెఁ జలి ♦ కొండ నృసింహుఁడు వెల్లియంచునీ
[illegible] నసాలిరుద్రపను ♦ వాఁడును మొల్కలటంచుఁ బూరిచెన్.

దెలియకకొండఱిట్లు విక్ర ♦ తింబడచున్యముకన్ లకాసనే
ఫలతలపై యకసముసు ♦ బాప్రముదాత్యలు నవ్వునట్లుగన్. అని వ్రాసియున్నాఁడు.

లక్షణగ్రంథము వ్రాసితినని క్రొత్తసీసు కవికి గోచరింపని ప్రయోగములెన్నియో కన్పట్టుచున్నవి.

1. నన్నయభట్టు: "చ. నిస్సురం, ఋజమిని త్రిమ్మగొల్పడిరి ♦ పార్థివపుత్రులైన పాండవుల్" భాగ.
   ఉ. భూరనవిస్ఫులింగములు ♦ పొడ్మగనుగ్రవిషంబుఁ గ్రక్కుచున్' భార.
2. తిక్కనసోమయాజి: 'చ... వెల్వెలబారెడు మోముతోడవ్రత్తునె' భార.
3. శ్రీనాథుఁడు: 'మ. గణుతింపంగనితండు పొల్కడలికిన్ ♦ గారాపుఁబుత్రుండు' శృ. నై.
   'వారిధితటీ కాల్పట్టణాకీర్ణమున్' భీమఖండము.
4. బమ్మెరపోతన: 'శా. వ్యర్థంచున్ జెప్పిన మానఁడంగమునఁ బు♦త్రాదికారతన్ వ్యాధిజన్మించెన్'
5. సింగయకవి: 'శా. దీనన్, రల్పాపాల్సిటివంచు' 'వల్లనఁడయ్యో' భాగ. (భాగ.
6. అల్లసానిపెద్దన: 'మ. వెల్వెలఁబారె జెక్కపకళికా ♦ వ్రాతంబుశాతోదరి'
   'చ... వెల్వెలఁబారెవిటానవాబ్జముల్' 'చ... పొల్తుకజెప్పలనప్పళించుచున్' స్వా. మ.
7. కంకంటి పాపరాజు: 'చ. అయ్యనలముమంటఁజేసి చ°ర♦మంటిని దానిని దల్పరైరిగా' ఉ. రా.
8. రామరాజభూషణుఁడు: 'ఉ. పొల్తుకయోమతిశైలకన్యయో' వసు.
9. తెనాలిరామకృష్ణుఁడు: 'ఉ. కాకము, కావలిదావకీలలగు ♦ నాల్కలు ముంగల మొల్కలెత్త'
   'సీ. జనియించె నొక్క ప ♦ చ్చనిమొల్కయనుబుద్ధి' పాం. మా.
10. ముక్కుతిమ్మన: 'చ. వెన్నెలల్, మొలచిన పాదుపొల్కడలి ♦ ముద్దులపట్టి' పారి.
11. కూచిమంచి తిమ్మకవి: 'సీ. నిక్కవంబుగఁ గూర్పు ♦ దిక్కువెల్వెలఁబారె' రాజశే.
12. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు: 'చ. ఉడుపది వంశకర్త మహి♦మోన్నతి కెయ్యది మేరనాఁడు
    పొల్కడలి జనించినప్పుడు' జై. భా.
    కీ. శే. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు: 'ఉ. తమ్ముని బిసలంచుఁదయఁదల్పఁడు' కీ. శే.
    కవిబ్రహ్మ యేటుకూరి వేంకటనరసయ్యగారు: 'ఉ. ముత్తెముస్వాతి చిన్కులకు మొల్కలు
    తొల్కరి కుమ్మదమ్ములన్'
    శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారును: కాటూరి వేంకటేశ్వరరావుగారును:
    'చ. మరువము మొల్కఫుప్ప సుకుమారము నాతనువంచు భ్రాంతులై ♦ మురియుదురు'
    అప్పకవి యితరకవులనేమనఁజాలక యొకరుద్రకవిని నిందించుటనుగూర్చి:

చ. అకలుషు రుద్రుఁడిట్టఁగ ప ♦ యంబునఁబూనితివాతెకాని యా
సుకవిని రామకృష్ణకవిఁ ♦ జూచియు నాతని మొల్కజంటలో
నొకటియు బైటపెట్టకయ ♦ యూరకయుంటివి తప్పటన్న నా
సిక మొదలంటఁగోయు నొకో ♦ చెప్పనఁగొట్టునో యంచుమానితే. (అరుణోదయ)

తెనాలిరామకృష్ణునిపద్యము.

చ. ఒకని కవిత్వమందెనయు ♦ నొప్పులు తప్పులు నాకవిత్వమం
దొకనికిఁదప్పఁబట్టఁబని ♦ యుండదు కాదని తప్పఁబట్టినన్
మొకమటుక్రిందుగాఁదిగిచి ♦ మొక్కలుపోయినయిన్పకత్తితో
సికమొదలంటఁగోయుదును ♦ జెప్పునఁగొట్టుదు మోముదన్నుదున్.

మఱియు నప్పకవీయమున-

క. విరచించెను శ్రీనాథుఁడు, ధరణినిశ్ళంగారనైషధ ♦ ధరబునఁగూర్చెం
జిరియొండొరునని కానక, పరరూపక్రియలఁ బ్రకృతి ♦ భావములలరే. అనుటను.

మ. పగ శ్రీనాథునిఁదిట్టఁజూచెదవుగా ♦ పల్నాటివాఁడొట సా
సుగుణాఢ్యుండు యథార్థవాది సుకవి ♦ శ్లోకానిలవ్యాప్తియుక్
జగదాశ్చర్యకరప్రయోగరచనా ♦ సంపూర్ణుఁడౌ నందులో
నగమా! పాతికయా! శతాంశమగునా! చర్చింప నీకావ్యముల్.

గీ. తాల పెనుచిన్న తెలుఁగఁబో ♦ రాడినావు, కందజాతుల రుచులెల్లఁ ♦ గాంచినావు
చిత్ర బంధానురక్తి పై ♦ చెలఁగినావు, భావ రసహీనుఁడవెకా యు ♦ భాగ్యసుకవి.
(అరుణోదయ)

# రాష్ట్రౌఢవంశ మహాకావ్యము

అందలి యిష్టదేవతా ప్రార్థనము

శ్రీమాన్ భూతసమూహనిర్మితి విధౌ యః సంస్తుతో వేధసా
గోవిందేన చరాచరస్థితి విధౌ యఃసాదరం వందితః
యఃస్వాత్మన్యఖిల ప్రపంచవిలయే సంభావితః శంభునా
సోఽయంవిశ్వజనీన చారుచరితో లంబోదరః పాతు వః

కవితాశైలి తెలియుటకై కొన్ని శ్లోకములిచట నుదాహరించుచుంటిని.

తదీయసూనుర్మహనీయ సేనః, పరాక్రమన్యక్కృత భీమసేనః
శశాసభూమీమథ వీరసేనః, ప్రతాపసంశోషిత వీరసేనః.

"నృపేణ తేనాజని కాంతి వీరః, ప్రచండమార్తాండకులైక వీరః
యాత్రానుపంకీకృత సింధునీరః, పరావలీదీపశిఖాసమీరః"

"తస్మాదభూదద్భుతభాగధేయః, శ్రీసాహసీయార్జున నామధేయః
నారీచకోరీనయనైకపేయః, క్షీరోదధేరిందురివాప్రమేయః"

"సాదితాసురకదంబకీర్తయే, దేవదైత్యనరగీతకీర్తయే
కల్పితత్రిభువనైకపూర్తయే, మామికా ప్రణతిరష్టమూర్తయే."

"కాలాంతకాయకలికల్మష నాశనాయ, బ్రహ్మాదిదేవనుత పాదసరోరుహాయ
విశ్వేశ్వరాయ భవసాగరతారకాయ, భ్రూమధ్యనిలయాయ నమశ్శివాయ,
శంభవాయ చ మయోభవాయ తే, శంకరాయ చ మయస్కరాయ తే
శ్రీశివాయ సకలార్థదాయ తే, సర్వదాశివతరాయ తేనమః"

"భవసాగరస్యపరమంతరణం, కరణంసుఖస్యవిపదాంహరణం
వరణంవిముక్తిసదృశః శరణం, చరణంహరస్య కరవాణిచిరం"

"నమనీయపదాంబుజంసురైః. కమనీయం హిమశైలకన్యయా
భజనీయమనన్యచేతసా, మననీయం మునిభిఃశివంభజే"

"ఆనందసందోహ గలన్మరందే, కాలీచలాపాంగ మిలన్మిలిందే
సానందబృందారక బృందవంద్యే, వందేమహాదేవ పదారవిందే"

"కామాక్ష్యాయనీ కేలివిలాసలోలం, సముల్లసత్కుంజర చర్మచేలం

వక్షస్స్థలవ్యాలఫణాభరణాలిః, చేతశ్చిరం చింతయ చంద్రచూడం'
'సంసారహారి సుఖకారి సుధానుసారి, శ్రీమన్మురారి పదవారినివారితారి
గోదావరీ విమలవారి విపన్నివారి, శేయ స్తనోతు మదనారి శిరోవిహారి'
'రాష్ట్రౌఘక్షితిపాలవంశముకుటాలంకార చూడామణి
శ్రీనారాయణశాహదేవవ విశేః సత్కీర్తిముక్తావలీం
విభ్రత్కంఠతల భూషణాని వికసచ్ఛ్లోకరగుంభద్గుణః
స్సార్కైః పలితమండలాంబుజవిః శ్రీరుద్రనామా కవిః'
'నిస్సారీయతి శారికాపికకులం రంగీయతి వ్యాకులం
హంసాలీపరమాకులీయతి శుకీ మాలాపిమూకీయతి
యామాకర్ణ్య కిలాధరీయతి తరాం శౌధాధరీ మాధురీ
సేయం కాఽపిసుధా స్వలీలపవలీ రుద్రస్యవిద్యోతతే'
'శాకే ఫాగిరసాబ్ధి భూపరిమితే సంవత్సరే పుష్యకే
మాసే చాశ్వయుజే సితప్రతిపదిష్ఠాపే మయూరాచలే
శ్రీమద్లక్ష్మణ పండితో దితకథా మాకర్ణ్య రుద్రః కవిః
శ్రీనారాయణశాహకీర్తిజనకం కావ్యం వ్యధాన్నిర్మలం'

గ్రంథాంతశ్లోకము

శ్రీమద్బాగుల భూమిపాలతిలక శ్రీశాహనారాయణ
స్ఫూర్జత్కీర్తి చరిత్రచిత్రితపదే రాష్ట్రౌఘవంశాభిధే
భవ్యేష్కందపురాన్వయేన కవినా రుద్రేణసృష్టే మహా
కావ్యేఽస్మిన్ కృతవైరివీరవిజయః సర్గస్త్వింశోఽగమత్'

కవి యిట్లె కడమయేకోనవింశతి స్వర్గములయందును బహుచమత్కారముగ నీశ్లోకాంతిమ పాదముచే గథను దెలియఁజేయుచు సర్గసంఖ్యను వివరించుచుఁ జిత్రించినాఁడు. ఇంతకుమున్ను గాని, యిటీవల గాని, యేకవియు నింతటి చాకచక్యముగా నొకశ్లోకపాదము నిరువది విధములుగా మార్చి యుండలేదు. కావ్యనిర్మాణకాలమును దనవంశమును దన శక్తియును దెలియఁజేసిన శ్లోకములు గూడ నిందుఁ జూపఁబడినవి.

ఇవి కవివారివంశమున లభించిన తాళపత్రగ్రంథములందలి శ్లోకములును బొంబాయిలో ముద్రింపఁబడిన గ్రంథమునందలి శ్లోకములును, పరీక్షించి వ్రాయఁబడినవి. బరోడాలో ముద్రితమైన ప్రతియందుఁ జాలవ్యత్యాసములగపడుటయే కాక కవివ్రాయని గద్యమునుగూడ సృష్టించి యందుఁ దాక్షిణాత్యరుద్రకవీంద్ర విరచితే, అనినారు. ది 13-9-1940 వ తేదీన మాకు శ్రీ గైక్వార్ లైబ్రరీ వారొసంగిన సమాధానము. "మాయొద్ద 60 పుటలుగల తాటియాకుల గ్రంథము మాత్రమున్నది. సమగ్రముగా లేదు. గ్రంథముయొక్క కడపట గద్యముగూడ లేదు. ఇంక నెక్కడనైన గొప్పలైబ్రరీలలో విచారింపుఁడు"

# బలవదరీశతకము

బలవదరీ! దళితహార భాస్వద్దరీ! [illegible]దరీహారీ!

ఇందు 3. పద్యములు కీ. శే. వే. ప్రభాకరశాస్త్రి గారికిని 4 పద్యములు కీ. శే. పంచానన పత్రికాధిపతులకును లభించినట్లు ప్రకటింపఁబడినవి.

చ. కలశపయోధిమీఁద దరఁ ♦ గల్ మతిహోయని మ్రోయ వేయుభం
గుల తలపాన్పు పాము బుస ♦ కొట్టఁగ నేగతి నిద్రఁజెందెదో
యలసతఁ దంప్రిడి చీమచిటు ♦ కన్నను నిద్దురరాదుమాకు నో
బలపదరీ! దరీమహర భాస్వదరీ! యదరీదరీహరీ! 1.

చ. కలుష సరిత్తరీ! పుషిత ♦ గంధకరీ! మహిభృత్కిరీ! భవా
చలభిదురీ! దయారసవి ♦ శాలఝురీ! నిగమార్థమాధురీ!
ఖలగజకేసరీ! విభవ ♦ కంపితమేరుగిరీ! లతాదరీ!
బలపదరీ! దరీమహర భాస్వదరీ! యదరీదరీహరీ. 2.

చ. అలపగవానితమ్ముఁడు భ ♦ యాతురుఁడై చనుదెంచినంతనే
బళిబళి వచ్చితీవనుచుఁ ♦ బట్టముఁగట్టనె లంకకప్పుడే
కొలిచిననిన్నె కొల్వవలెఁ ♦ గోరికలిచ్చిన నీవ యీవలెన్
బలపదరీ! దరీమహర భాస్వదరీ! యదరీదరీహరీ! 3.

చ. పిలువని కూటికిన్, వెతలఁ ♦ బెట్టు ధరావరుఁడేలు వీటికిన్
జలములులేని యేటికిని, సారెకు బందుగులున్నచోటికిన్
బలువురతోడి పోటికి, నృ ♦ పాలురసాటికిఁ బోవరాదయా
బలపదరీ! దరీమహర భాస్వదరీ! యదరీదరీహరీ! 4.

# గువ్వల చెన్ని శతకము

రుద్రకవిగారు హంపీయాత్ర నొనర్చుసమయమున నచట యాదవకులస్థుఁడగు గువ్వలచెన్నఁడు కవిగారికి సహాయుఁడుగా నుండెనట. వీరు తిరిగి యింటికివచ్చునపు డతనికిఁ గొంతరొక్కమీఁబోఁగా స్వామీ! మీరు కవీశ్వరులు కనుక మీకు నేనుసాయముచేసినందులకు నా పేరువచ్చునట్లు కొన్నిపద్యముల రచింపుఁడని కోరఁగా నతనిని సంబోధించుచు నీశతకమును జెప్పెనని చెప్పుచుందురు. అందలి పద్యములు నీతియుక్తములు.

క. కలిమిగల లోభికన్నను, విలసితముగఁ బేద మేలు ♦ వితరణియైనన్
జలధికిఁ జెలమే మేలగుఁ, గులపావనమూర్తివన్న ♦ గువ్వలచెన్నా. 1.

క. సారాసారం బెఱుఁగని, బేరజమును మ దలింపఁ ♦ బెద్దలవశమా
నీరెంతపోసి పెంచిన, కూరౌనా నేలవేము ♦ గువ్వలచెన్నా. 2.

క. గుడికూలును నుయిపూడును, వడినీళ్ళను చెరువు తెగును ♦ వనములుఖిలమౌ
చెడనిది పద్యంబొక్కటి, పుడమిపయిఁ జూడకన్న ♦ గువ్వలచెన్నా. 3.

క. కలవిద్య లెన్నియైనను, కులవిద్యకు సాటిరావు ♦ కుంభినియందున్
వెలకాంత లెందరైనను, కులకాంతకు సాటిరారు ♦ గువ్వలచెన్నా. 4.

# జనార్దన స్తోత్రాష్టకము

జనార్దనస్తోత్రాష్టకము కలదని వదంతికలదుగాని చాటుపద్య మణిమంజరియందు 'స్తోత్రపంచరత్నములు' అనియున్నారు. ఏదియైననేమి యిప్పటికి లభించినదొకటేపద్యము.

పంచచామరము. అనాథనాథనాగతల్ప ♦ యజ్ఞకల్పమానిరం
జనాజనార్తినాశనాది ♦ శాపతీవ్రదార్ఢ్యశా
సనాసనాతనాయనాది ♦ సత్యకందుకూరి శ్రీ
జనార్దనాజనార్దనాస ♦ సాహసాసిమర్దనా.

# శృంగార జనార్దనాష్టకము

చాటుపద్య మణిమంజరియందు ముద్రితమైనవి.

"సిరులుమించిన పసిమిబంగరు ♦ జిలుఁగుమువ్వటిజారఁగా
చరణపద్మమువీఁద దేహము ♦ చంద్రకాంతులు దేరఁగా
మురువుచూపఁగ వచ్చినాఁడవో ♦ మోహనాకృతి మీరఁగా
గరుడవాహన దనుజమర్దన ♦ కందుకూరి జనార్దనా" 1.

"ఆనపెట్టినరాకపోతివి ♦ ఆయెఁబో అటుమొన్ననూ
పూనిపిలువఁగ వినకపోతివి ♦ పొంచిపోవుచుమొన్ననూ
నేనుజూడఁగ గడచిపోతివి ♦ నీటుచేసుక నిన్ననూ
కానిలేరా దనుజమర్దన ♦ కందుకూరి జనార్దనా" 2.

"నిన్నరాతిరి చవికెలోపల ♦ నీవు చెలికూడుంటిరా
ఉన్న మార్గములన్నియును నే ♦ నొకతెచేతనువింటిరా
విన్నమాత్రమె కాదురా నిను ♦ వీధిలోఁగనుగొంటిరా
కన్నులారఁగ దనుజమర్దన ♦ కందుకూరి జనార్దనా" 3.

"దబ్బులన్నియుఁదెలుసుకొంటిని ♦ తప్పుబాసలు సేయకూ
మబ్బుదేరెడి కన్నెగవతో ♦ మాటిమాటికిడాయకూ
ఉబ్బుచేసుక తత్తరంబున ♦ నొడలిపైఁ జెయివేయకూ
గబ్బితనమున దనుజమర్దన ♦ కందుకూరి జనార్దనా" 4.

"బిత్తరంబున మొలకకెంపులు ♦ పెదవినెవ్వతెయుంచెరా
గుత్తమైన మిటారిగుబ్బల ♦ గుమ్మ యెవ్వతె మెచ్చెరా
చిత్తగించక జీరువారను ♦ జెక్కులెవ్వతె నొక్కెరా
కత్తిగోరుల దనుజమర్దన ♦ కందుకూరి జనార్దనా" 5.

"జంటనేత్రము లంటిచూచితె ♦ జాజిపూవులు పూసెరా
మింటిత్రోవను జూచుచుండఁగ ♦ మేఘవర్ణము గప్పెరా
కంటిలో నొక పండువెన్నెల ♦ కాయుచున్నదియేమిరా
కంటిలేరాదనుజమర్దన ♦ కందుకూరి జనార్దనా" 6.

"అండబాయక కూడియుంటిమి ♦ ఆయబోయెనునాటికి
ఖండిమండిపడంగ నేటికిఁ ♦ గదలు మెప్పటిచోటికి
ఉండరా నీమాటలకునే ♦ సూర్యజాలను మాటికి
గండిదొంగవు దనుజమర్దన ♦ కందుకూరిజనార్దనా" 7.

"అలుకలన్నియు దీఱ నిపుడా ♦ అండకెప్పుడు వస్తివి
పిలిచి నవరత్నాలసొమ్ములు ♦ ప్రేమతో నెపుడిస్తివి

వలచి వలపించియును గూరిమి ♦ వపలకప్పుడు మెస్తివి
కలసి వేడుక దనుజమర్దన కంపసూరి జనార్దనా" గ.

## కావ్యప్రామాణికత్వము

ఉ. కోమలవర్ణభామయును. నిరం. ప్ర. 19 అని కవియే వచించియుండెను. విశ్వశ్రేయః కావ్యమ్ అని జగత్ప్రసిద్ధియే కనుక ప్రామాణికత్వమును గురించి వేఱెయాలోచింపఁదగినంతటి యగత్యము లేదుగదా? కీ. శే. బహుజనపల్లి సీతారామాచార్యులుగారు తమ శబ్దరత్నాకరమున (మూఁడు) అను శబ్దమును నిర్బిందుకమని భ్రమించి వాదింప. బ్ర. భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారు (శ్రీసూర్యా రాయాంధ్ర నిఘంటు కార్యస్థానస్థితవిద్వాంసులలో నొకరు) స్వకీయ సంస్కృతాంధ్ర సంఖ్యార్థ బోధినియందు "క. వాఁడా నాలుగు గడియలు, నేఁడాదిగఁగడిపి సూర్యుఁ ♦ డిఁకఁ దూర్పునకున్, రాఁడో యని విలపింపఁగ, మూఁడవజాముయ్యె నంత ♦ మోద మెలర్పన్" నిరం. అని యథానుస్వార ప్రాసముగల పద్యమునుదహరించి భారతకర్ణపర్వములోని "క. మూఁడక్షౌహిణులిమ్మెయి" అను పద్యమును, జైమినీభారతములోని "ఉ. వాఁడిమితోడ వెండియును ♦ వారణ నెంతయు నాగ్రహించి ము, మ్మూఁడు శరంబులేయ "అను పద్యమునుదాహరించి సార్ధబిందుకముగాఁ దేటదెల్లమొనర్చి యానిరాధారవాదమును మాన్పించుటయే కాక సంఖ్యార్థబోధకములగు 'జతబారాపదిదచ్చియి త్రిసదుగా చౌవంచతీవంచబొం,కితినా నర్తకియంచు నాడెను భయాంగకారమేపారఁగ్గ.' నిరం. ఇట్టి ప్రమాణముల నెన్నింటినో చూపి భాషాభివృద్ధికిఁ దోడ్పడిరి. ఆంధ్రవాఙ్మయ సూచికయందు సుప్రసిద్ధ కవులలో రుద్రకవిగారు చేర్పబడియుండుటయే గాక తద్విరచిత నిరంకుశోపాఖ్యానమును శృంగార ప్రధానకావ్యమును, భక్తిరస ప్రధానమగు బలవదరిశతకమును, గూడఁ బ్రశంసింపబడియుండెను. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువునందు గందుకూరి రుద్రయగారి నిరంకుశోపాఖ్యానము ప్రమాణ గ్రంథముగాఁ గైకొనఁబడినది. శబ్దరత్నాకరమున కందని శబ్దములు నిరంకుశోపాఖ్యానమునఁ జాలకలవు. కాని యేకారణముననో శ్రీ ఆచార్యులుగారికి 'మూఁడు' పదమునకు సార్ధబిందుకత్వము గోచరింపనట్లే నిరంకుశోపాఖ్యానముఁగూడ నగపడకుండుట కెంతయు జిత్రము. మహాకావ్యములయందుఁ బ్రయోగింపఁబడిన శబ్దజాలము నాధారముగాఁ జేసికొనియే నిఘంటువులు, వ్యాకరణములు సృష్టింపఁబడుచున్నవి.

### శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువునందలి యుదాహరణములు

ఇల్లటము— "సీ. అఖిలలోకాధీశ..............నిలిపె, నిరం. ప్ర. 6
చేల— "మ. హేమపుఁజేలల్ దిగజాఱ" నిరం. ద్వి. 69
గుదిగుంపులు— "క. అదిగనుక దివిజవేశ్యల.........గుదిగుంపులుజేసి" నిరం. ద్వి. 92
గుమగుమ— "క. గుమగుమమనిశోకవహ్ని గుబ్బతిలంగన్" నిరం. ద్వి. 99
చూఱపుచ్చు— "గీ. కటకటాచూఱవిడిచి" నిరం. ద్వి. 52
తురుఫీ— "ఉ. మందరధీర...............తురుఫీలుకొన్ని" నిరం. చ. 63
చేర్వ— "సీ. ఛిచ్ఛార్పఁగాఁబోవు చేర్వచుట్టములునా" నిరం. చ. 69.

ఆంధ్ర వాచస్పత్యమునను 1089 వ పుటలో నుదాహరించిరి. గుదిగుంపులుచేయుట. జా. అవిచ్ఛిన్నముచేయుట. "అదిగనుక.........మధింపదె" నిరం. శ్రీ శ్యామల కామశాస్త్రిగారి గ్రంథ పీఠికయందు దాహృత గ్రంథములలో నిరంకుశోపాఖ్యానమును జూపకుండుట ప్రమాదవశమైయుండ నోపునని యూహింపవలసి యున్నది.

# కావ్యోత్కర్షము

“యేనామ కేచిదిహనః ప్రథయంత్యవజ్ఞాం, జానంతి తేకిమపి తాన్ ప్రతినైషయత్నః
ఉత్పత్స్యతేఽస్తి మమకోఽపిసమానధర్మా, కాలోహ్యాయం నిఃవధిర్విపులాచపృథ్వీ”

విశాలమైన విశ్వమునందు దేశకాలపాత్రల స్థితులననుసరించి కావ్యములేర్పడుచున్నవి. వానిని గూడఁ జదువువారుందురు. సృష్టియందలి పదార్థములవలె వాఙ్మయప్రపంచమునందలి కావ్యములేదో కొంత ప్రయోజనము నొసఁగూర్చుట నిశ్చయము. స్వల్పప్రయోజనము సమకూర్చెడు గ్రంథములు చిరంజీవిత్వములేక యంతరించును. మహాప్రయోజనమును సమకూర్చెడి సత్కావ్యములు చిరంజీవిత్వము గలిగి ప్రకాశించును. ‘చ. సుకవికృత ప్రబంధములు ♦ కొందఱు ప్రనూతులలోని నీశ్వరా, చితకాలి కొక్కఁజాలక చ ♦ లింపనునుందు నిజస్థలంబులన్, సుకవికృత ప్రబంధములు ♦ శోభిలు దిక్తటి ఘోరంబుల, ట్లుకలుపక్వస్త్రీబూని మహి ♦ యందు సమస్తజనుల్ నుతింపఁగన్’ గానసిద్ధసత్కవులు చిరంజీవులు. జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్. కావ్యమువ్రాయుట యనఁగాఁ బుష్పమాలనుగూర్చుటవంటిది. ఒకప్పుడు బాలుఁడైనను గావ్యమును వ్రాయఁగలుగును. ‘జన్మజన్మ యదభ్యస్తం’ అనివ్యక్తి కాదు. జన్మాంతరీయమైనసత్త్వముచే నట్టిప్రతిభ లభించుచున్నది. ఎవనికి నిపుణతాభ్యాసము లసంభవమైయుండెనో యతనికిజన్మాంతరీయమనియే చెప్పవలయును. ఈకావ్యమునుజూచి నామిత్రులు కొందఱు ముద్రకవి స్వానుభవముతో నిక్కావ్యమును వ్రాసియుండెనేమోయని శంకింప నేను చ. ‘అని మునిధర్మశీల వసు ♦ ధాధిపమాళికి నేర్పుమించి చె, ప్పినకథ బాల్యచాపలము ♦ పెంపున స్వామికి విన్నవించితిన్’ ఈపద్యమును చదివి మనకు వర్ణనాతీతముగఁ గన్పట్టుచున్నను బరమేశ్వరుఁడట్టిశక్తి యాకవికొసంగియుండెనని యు. 16. సం. వయస్సుగల నిడమర్తి సుబ్బారావు విచిత్రరత్నావళి వ్రాసియుండెనుగదా కొందఱు 60. సం. వయస్సుగలవారు సైతము అంతటి రసవత్తరముగ బద్యములను వ్రాసియుండలేదుగదా! అనిసమాధానమొసంగితిని. కావ్యమనఁగా కర్మవాశౌచం మౌనమిత్యాదివత్ కవేర్భావః కర్మవాకావమితిప్రాప్నోతి తత్కథం కావ్యమితి ‘కవిశబ్దస్య బ్రాహ్మణాదిత్వాత్ గుణవచనబ్రాహ్మణాదిభ్యః కర్మణిచ’ అనుసూత్రముచేత ష్యఞ్ విధానమువలనఁ గావ్యము అగును. సామాన్యముగాఁ గావ్యపదము సాధ్యమైనను దన్నిబంధనముల ననుసరించవలసి యున్నది. ఎట్లనఁగా సర్వదా ఆర్షగ్రంథానుసరణ మన్నౌచిత్యమనువాక్యమునుబట్టి రామాయణమునందును రామకృతమయిన వాలివధాదుల ననుగమింపఁదగదనియు, రావణకృతమైన శివపూజాదికమును గ్రహింపవలయుననియు, నిట్లు గుణవిశిష్టముగాఁ గావ్యములలరారినఁగాని లోకకల్యాణము లభింపదు. శాస్త్రము రథగజతురగ ఖడ్గాదులవలె నలరు ఛందోవ్యాకరణాభిధాన కోశ కలాచతుర్వర్గ యుతమైనను గావ్యమునకు సరిరాదు. ఛందోవ్యాకరణాది విరోధాభావమాత్రగుణకపద్యములు గలది దానికంటెశ్రేష్ఠము. అంతకంటె దోషాభావగుణాలంకార విశిష్టమై రసోద్బోధ సమర్థమునై లక్ష్యమగు కావ్యముశ్రేష్ఠము. కావున సామర్థ్యాధిక్యముచే రచింపఁబడిన కావ్యము సహృదయంగమమై నీతిదాయకమై, చిరంజీవియై ప్రకాశించును. అందువలననే శాస్త్రజ్ఞు

లుత్తమమధ్యమాధమకావ్యముల నిర్ణయించిరి. ఉత్తమకావ్యమునందును, ఉత్కృష్టత్వము, ఉత్కృష్ట తరత్వము, ఉత్కృష్టతమత్వము, అని మూఁడుభాగములుచేసిరి. వ్యాసమహర్షియు 'అదోషంగుణవత్కావ్య మలంకారైరలంకృతం, రసాన్వితంకవిః కుర్యాత్ కీర్తింప్రీతించవిందతి' అనియుండెను. దోషయుక్తములైనవానికిని గావ్యత్వమున్నది. కాని దోషయుతములగు కావ్యములు కీటవేధగలరత్నములవలె దూష్యములు. 'కీటానువిద్ధరత్నాది సాధారణ్యేన కావ్యతా, దుష్టేష్వపిమతాయత్ర రసాద్యవగమస్ఫుటః' రత్నములకుఁ గీటవేధవలన జాతిత్వముపోనట్లే కావ్యమునకు వ్యంగ్యములేనందునఁ గావ్యత్వము పోదని కొందఱువచించిరి. 'గుణదోషౌబుధోగృహ్ణ న్నిందుక్ష్వేడావివేశ్వరః శిరసాశ్లాఘతేపూర్వం పరంకంఠేనియచ్ఛతి' సూ. సం. అనగా గుణమును శిరసావహించి దోషమును వెలిబుచ్చవలదనిరి. 'త్యజంతిశూర్పవద్దోషాన్ గుణాగ్యాహ్యంతిసాధవః దోషగ్రాహీగుణత్యాగీ చాలనీఇవ దుర్జనః' చాణ. స్వల్పలోపములున్నను వానినెంచక గుణములనే గ్రహించుట యుత్తమమనిరి. కాని దోషరహితమయిన రత్నముతో సమానముగఁ గీటవేధగలరత్నము గౌరవింపఁబడదుకదా! 'వాక్యం రసాత్మకంకావ్యం' ప్రస్తుతః నీరసమై యలంకారస్ఫుటమైనను గావ్యముకాదు. రసానుగుణ విశేష నిబంధనమలంకార రహితమునందును ఛాయాతిశయముచేతఁ బోషింపవచ్చును. 'మునిర్జయతియోగీంద్రో మహాత్మాకుంభసంభవః, యేనైకచులుకేదృష్టౌ దివ్యౌతౌమత్స్యకచ్ఛపౌ' ఇచట నద్భుత రసానుగుణమేకచులుకమునందు మత్స్యకచ్ఛపదర్శనమును ఛాయాతిశయముచేతఁ బోషించినాఁడు. నీరసమునందదిస్ఫుటాలంకారముకాదు. చమత్కారముతోఁగూడినదేకాని కావ్యముకాదనిరి. 'శబ్దచిత్రం వాచ్యచిత్ర మవ్యంగ్యమవరంస్మృతం' వ్యంగ్యహీనమున నధమకావ్యమగుచున్నది. కనుక సర్వేషాం ప్రాయశోఽర్థానాం వ్యంజకత్వమపీష్యతే' అని చెప్పఁబడియున్నది. 'శబ్దార్థామూర్తి రాఖ్యాతా జీవితం వ్యంగ్యవైభవమ్' అనియు వివరించిరి. మహాకవియగు రుద్రయ్య తనప్రప్రథమ కావ్యమగు నిరంకుశోపాఖ్యానమున వ్యంగ్యమును జూపుటచేత నదియుత్తమోత్తమ కావ్యముగ గణింపఁబడుచున్నది. ఇంతేకాక 'ప్రతిపాద్యమహిమ్నాచ ప్రబంధో హి మహత్తరః' అను వాక్యమునుబట్టియు నీకావ్యము శ్రేష్ఠతమమై యలరుచున్నది. అల్పజ్ఞులకీకావ్యములందలి గూఢభావములు తెలియకున్నను మహాకావ్యగుణములు మహాకవులేగ్రహింతురు. 'గూఢభావాస్పదత్వేన యదనాదేయవద్భవేత్, నజానతే తత్కవయో గూఢంసారస్వతామృతమ్' అని కవిరాక్షసుఁడు. కావ్యము లోకోత్తరవర్ణనానిపుణ కవికర్మ. 'ఉ. వెం. నరసింహాచార్యులుగారు గత ముద్రితపీఠికయందు ఈతని కవిత్వము మిక్కిలి రసవత్తరమును, మృదుమధురపద భూయిష్టంబును, కైశికీవృత్తిప్రవిష్టంబును, ద్రాక్షాపాకోపశోభితంబును నైపశితృశ్రోతృజనంబుల హృదయంబుల మహానందాంబుధి నోలలాడించుచున్నది. ప్రౌఢపద ప్రయోగమును, సమాససంవిధాన చాతుర్యమును, బట్టిచూడ నీతని వ్యాకరణశాస్త్ర పాండిత్యమపారమని తోఁచుచున్నది. వర్ణనాసందర్భములయందు సమయానుగుణముగఁ జక్కని లోకోక్తులనిమిడ్చి రసభావాదులఁ బోనాడక స్వభావోక్తిని వర్ణించుకవులలో నీతని నెవ్వరుఁబోలరనఁదగును. ఈ గ్రంథమున విటజనుల వేషభాషలును, వారిపై వేశ్యాకాంతలు ప్రయోగించు మాయోపాయములును, నెంతముచ్చటగ నెంతరమ్యముగ వర్ణింపఁబడియున్నవో చూడుఁడు. ఈగ్రంథము నెట్టివేశ్యాలంపటుఁ

డైనను జక్కఁగఁ జదివి యర్థము గ్రహించినచోఁ దోడన వారియందాతనికి రోఁతజనించుట యబ్రము గాదు. ఈతని కవిత్వమును గుఱించి సక్రమముగ నెంతేని వ్రాయవలసియున్నను దీఱికలేమిఁ గాలాంతరమున నగుఁగాక యని మందూకప్లుతి యొనర్చినందుల కెంతయుఁ జింతగనే యున్నది" అనియుండిరి.

1901 స॥ కాకినాడ బాలసరస్వతీ ముద్రాక్షరశాలయందు ముద్రితమైన ప్రతియందు "ఈతని కవిత్వము మిక్కిలి రసవత్తరమై వినువారి చెవులకు జవులు తెల్పుచున్నయదికాని యచ్చటచ్చటఁ గొన్నిపద్యములు వ్యర్థపదభూయిష్ఠములై చప్పగానుండుటకుఁ గారణమూహింపరాదు. ఇందుగల స్ఖాలిత్యములన్నియు యథామతినస్మదాస్థానకవులు శతావధానులగు బ్ర॥ తిరుపతి వేంకటేశ్వరకవుల సహాయమున బరిష్కరించి సరస్వతియను మాసపత్రికలో ప్రచురించితిమి."

కొ. రా. వేంకటకృష్ణారావు.

వీరి పరిష్కరణమునుగూర్చి 'పూర్వముద్రణము - సవరణ, అనుపట్టిక చూచినఁ జాలును. కొన్నిపద్యములు వ్యర్థపదభూయిష్ఠములైనవనుట యెంతయుచిత్రము. కీ. శే చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారితో నీవిషయమునుగూర్చి నేను ప్రస్తావించగా సవరణవిషయమే నాకుఁ దెలియదనిరి.

# ప్రయోజనము

కవి సమస్తధర్మముల నుపదేశింపనర్హుఁడు. "కవేర్వచః పరంశుచిమతంవిద్యాత్" మహాకవుల యొక్క సద్వాక్యలను శ్రవణానందముగా నాకర్ణించి యందలి రహస్యము లెఱిఁగినగాని కావ్యప్రయోజనముబోధపడదు. అది మూడు విధములు. 1. ప్రభువువలె శాసించుట, 2. స్నేహితునివలె బోధించుట, 3. ప్రియురాలు మందహాసముచేతను, క్రేగంటిచూపులచేతను, కచకుచవిక్షేపములు మున్నగు విలాసములచేతను, ప్రియునిమనము నొవ్వనిరీతిఁ దన యిష్టమును దెలియఁజేయునట్లు కావ్యముఖమున మనోహరముగ నుపదేశించుట. దానినే పెద్దలు ప్రభుసమ్మితము- సుహృత్సమ్మితము - కాంతాసమ్మితము" అనిరి. విషయోపరక్తిచేతనుఁ గావ్యశ్రవణానంతరమునఁ దన్మహిమవేద్యాంతరమున నేమియుఁ బ్రకాశించదు. కావ్యశ్రవణానంతరమే వృక్షారోహణాదివద్వివేకముగల వాఁడగుచున్నాఁడు. సుఖలాలసులకు నీరసములైన నీతిశాస్త్రములననుసరించి ప్రవర్తించుట యశక్యమైనను, అట్టివాని సైతము కావ్యము కాంతవలె సరసాపాదనముచేత నభిముఖులనుగా నొనర్చుకొని యుపదేశమొనర్చుచున్నది. శిశువుల కౌషధమును మధురమిశ్రమముచే నొసంగినట్లు బోధించునది స్వాదుకావ్యము. "స్వాదుకావ్యం రసోన్మిశ్రం వాక్యార్థముపభుంజతే, ప్రథమాలీఢమధవః. పిబంతికటుభేషజమ్" కవి సమస్తమైనవారిని మెప్పింపకుండినచో యశము నార్జించలేఁడు. "కింకవేస్తస్యకావ్యేన కింకాండేన ధనుష్మతః, పరస్యహృదయేలగ్నం నఘూర్ణయతి యచ్ఛిరః" కవివాక్యము పరులయొక్క హృదయమునఁ దగిలి తలయూఁపింపనిది కవిత్వముకాదు. శత్రునియొక్క హృదయమును భేదించి తలయూఁపింపనిది ధనుస్సుకాదు. "ఇమ్మహాకావ్యమాదికావ్యమగు రామాయణము పితృభక్తి యాశ్రితసంరక్షణము మున్నగునీతులనువలె లోకములో నెంతధనికుఁడైనను వేశ్యాలోలుఁడెయ్యేనేని నిష్కదరిద్రుఁడై

మహాపమానమునంబడి చెడుననియు. మూర్ఖుఁడు చేతనైనను భగవద్భక్తి గలిగినచో దరిద్రుఁడైననుఁ భగవత్కటాక్షంబున నత్యంతైశ్వర్య సంపన్నుండగుననియు- నిట్టినీతుల నత్యంతమనోహరముగ నుపదేశించుచున్నది." అని పూర్వపుపీఠికలో శ్రీ ఉ. వెంకటనరసింహాచార్యులు గారిచే వ్రాయఁబడియుండెను. కావ్యములయొక్క శక్తిని విమర్శించువారందురు. కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారు తమ ఆంధ్రవాఙ్మయసూచికయందు "పెద్దనకావ్య నిర్మాణమునకుఁ బరమార్థమును గల్పించియుండలేదు." "వసుచరిత్ర హృద్యములైన పద్యములతో నిండియున్నను కావ్యప్రయోజనము సంకుచితమైనది." "వేమనహస్తములయందాటవెలఁది యాటబంతియైనది" "కళాపూర్ణోదయము కళాపూర్ణమై ప్రకాశించుచున్నది." అనియుండిరి. ఈప్రబంధమును 1914 సం॥ కాలేజీలలో బి. ఏ. తరగతికి పఠనగ్రంథముగా నియమించిరి. దీనినిబట్టియే చెళ్ళపిళ్ళవారి శ్రవణానందము, కాళ్ళకూరివారి చింతామణి. బహులాశ్వచరిత్రము. రంభాగర్వభంగము సినిమాకథ - అవతరించినవి. "నిందతు నందతు వాసన్న సూయు సనసూయు రత్రకిం తేన యత్సన్మానస గమనాయైవేదం సుమతు సత్యముపాదేయమ్"

వ్యాఖ్యాత.



# కథాసంగ్రహము

## ప్రథమాశ్వాసము

ద్వాపరయుగమునందు భూలోకములో మాణిక్యపురమను నగరరాజమొండు విలసిల్లుచుండెను. ఆ పట్టణమునందు బుద్ధివైభవమున బ్రహ్మను బోలినవాఁడగు సురశర్మయను బ్రాహ్మణుఁ డొక్కఁడుండు గలఁడు. అతఁడు నాలుగు వేదములను, అఖిల శాస్త్రములను జదివి కావ్యనిర్మాణముసేయ సమర్థుఁడై, విష్ణుసేవా పరతంత్రుఁడై యుండెను. అనుకూలురాలగు నాతని భార్యయుఁ బ్రతిదినమును భక్ష్యభోజ్యమునుచేసి యతిథులకుఁ బెట్టుచు భర్తయుం దానును వారి యాశీస్సు లందుచుండును. ఎంత యైశ్వర్యమున్నను సంతానము లేనందున సురశర్మ సంసారము రాయంచలేని కాసార మయ్యెను. అతఁడు బిడ్డలకోసమై విష్ణుదేవుని బ్రార్థించుచుండెను. ఒకనాటి వేకువను శ్రీమహావిష్ణువు సురశర్మకుఁ గలలో నగపడి నీకొక కొడుకుదయింపగలఁడని యొక పండతనికిచ్చెను. ఆకల తెఱంగును సురశర్మ భార్యకుఁజెప్ప నామెయు సంతసించినది. ఇట్లుండఁ గొన్నాళ్లకాసతి గర్భవతియై యొక్క శుభదినమునఁ గుమారుని గనెను. ఆతనికి నిరంకుశుఁడని పేరువెట్టిరి. అన్నప్రాసన చౌలోపనయనాదులుచేసి వేదశాస్త్ర ములు పఠింపించిరి. సంగీతము, కవిత్వముగూడ నేర్పిరి. వైదికకులావిఖ్యాతయు, చక్క నిదియు, గుణవంతురాలునగు నొక్క కన్నెనుదెచ్చి పెండ్లిచేసిరి.

## ద్వితీయాశ్వాసము

నిరంకుశుఁడు విద్యాప్రభావమునఁ దనకీర్తి దిక్కుల వ్యాపింపజేయుచుండెను. ఇంతలో నాతనికి యౌవనమంకురించినది. మన్మథుని సైతము తిరస్కరించునట్లాతని యందచందములు విజృంభించెను. అట్టి పడుచుప్రాయమున నాతఁడు వైదికాచార మును గట్టిపెట్టి విటచర్యయందుఁ జిత్తముజేర్చెను. వాని వైదికవేషము మాఱి శృం గార వేషముగాఁ బరిణమించినది. వాఁడు బ్రాహ్మణ స్నేహము మాని కాముకు లతోడి సంగాతమునకు దిగెను. వింత వింత విలాసములతో సాయంసమయముల, రాత్రుల వేశ్యావీథులఁ జరించుచుండును. వేశ్యాలోలుఁడగు నాతనికి గ్రమముగా గురు జనమునందును, సంధ్యావందనాది వైదికాచారములందును ఏవ జనించినది. వారవనితల కోసమై యింటఁగల ధనధాన్యములను, సొమ్ములను ఆతఁడు హరింపమొదలు పెట్టెను. నిగమశర్మకు వేశ్యాంగనలందఱిలో చంపకగంధి యెంతయు నచ్చినట్టిది. ఆమె సంగీత సాహిత్యముల సాటిలేనిది. విలాస విభ్రమముల దేవవేశ్యల ధిక్కరింప జాలునది. ఈ చంపకగంధి తల్లి విటుల ప్రాణములగొఱకు రాక్షసి.

నిరంకుశుడిట్లు పెక్కువత్సరములు దుర్వ్యాపార పరాయణుడై యుండ నాతని భార్యయోపికపట్టజాలక కొడుకునుమందలించుమని యత్తగారినిఁ బ్రేరేపించెను.ఆతల్లియు నొకనాడర్ధరాత్రమున నింటికివచ్చిన సుతునికి నీతులుపదేశించి చక్కఁబడినాఁడని తలంచి, యలంకరించి కోడలి పడకటింటిలోనికి ననిపెను. నిరంకుశుని భార్యయు తన యదృష్టము పండినదని భావించి మడుఁగులు ధరించి, నగలువెట్టుకొని, పూవులుదాల్చి యాతనిని సమీపించెను. భర్త మాటాడలేదు. అయినప్పటికి నామె తాంబూల మీయబోయెను. ఆతఁడా వీడ్యమునుగూడ నొల్లక నిట్టూర్పువుచ్చి మాఱుమొగము వెట్టెను. ఆయిల్లాలును తన దురదృష్టమును నిందించుకొనుచు కొంగుపఱచుకొని యా గదిలోనే పండుకొనెను. వేకువజాముననే నిరంకుశుఁడు మేల్కాంచి, భార్యపై నున్న నగలు నల్లపూసాదిగా నొల్చుకొని వేశ్యావాటికేగెను. ఇట్లాతఁడు క్రమక్రమముగా నున్న సొమ్మునంతయు చంపకగంధికి సమర్పించి దరిద్రుఁడాయెను. ఇంతలో చంపక గంధికి గర్భముగూడ వచ్చెను. ఈ దరిద్రుడెట్టులయిన నిల్లు వెడలింపబూని వేశ్య మాత కాఱులుఁ బ్రేలి యాతని పై విజృంభించి, కూఁతును మందలించు నట్లామెను బెత్తముతో మొత్తబోవ, నిరంకుశుఁడు దనకును నట్టి ప్రాయశ్చిత్తమగునని యెటకో పోయెను.

## తృతీయాశ్వాసము

ఆతఁడట్లు పోయిపోయి యొక భయంకరారణ్యమున పాడువడియున్న గుడిని, అందు స్వచ్ఛమై వెలుగుచున్న లింగమును గాంచి యా శివునితో సొగటాలాడ బూనెను. ఇరువురి పందెములును నిరంకుశుడే యాడుట. ఓడినవారు గెలుపరికి లంజను పణముగా నీయవలయును. ఈ జూదములో శివుడే యోడెను. నిరంకుశుఁడు లంజగా రంభను దనకీయవలసినదని పట్టువట్టెను. ఊయిమగు శివుఁడు పలుకఁడాయెను. అంత నిరంకుశుఁడు తన యుత్తరీయమును లింగమునకుఁ జుట్టి పన్నిదమీయుమని లాగ జొచ్చెను. సత్యవాక్కగు శివుఁడు వాని తెగువకు మెచ్చి వృషభవాహనారూఢుఁడై ప్రత్యక్షమాయెను. ఆయనవెంట బ్రహ్మ విష్ణ్వింద్రాదులును వచ్చిరి. నిరంకుశుఁడు వీరినందఱినిజూచి భయభ్రాంతుఁడగుచు మోక్షమిమ్మని శివుని గోరెను. శివుడు నీవుకోరిన రంభనే యిచ్చెదనని, యింద్రునితో నిరంకుశునికి రంభనిమ్మని జెప్పెను. ఆ యింద్రుడును రంభంగాంచి నిరంకుశునికి గౌఁగిలి నిచ్చిరమ్మని యాజ్ఞాపించెను. పిమ్మట రంభా నిరంకుశులు ఆకాంతారమున నభిమత సురతక్రీడాపరులైయుండ రంభ యాతని సురతకౌశలమునకుఁ దన్మయురాలై మన్మథకేళికి "నీతో నలకూబరాదులు గూడ సాటిరార"ని నిరంకుశుని మెచ్చుకొనుచుండెను. ఇట్లు వారొకరినొకరు పొగడి కొనుచు గొంతదూరము పోవునప్పటికక్కడ నొక నగరము గానుపించెను: వారాపట్టణమున నింద్రభోగములఁ దేలుచు సుఖులై యుండిరి.

## చతుర్థాశ్వాసము

ఒకనాఁడు రంభా నిరంకుశులా పురము వెలుపలనున్న సుందరోద్యానమున కేగి రతిక్రీడా పరాయణులై యుండిరి. ఆసమయమున రంభ నిరంకుశుని తన పయ్యెదకొంగుతో వీచుచు నాతని సురతకళాపాండిత్యమును మెచ్చుకొనుచుండెను. అప్పుడే యాకాశ మార్గమునబోవు నారదుంగాంచి, నిరంకుశుఁ డీతఁడెవ్వఁడని రంభను బ్రశ్నించెను. రంభ నారదుఁడు తన్ను గుర్తించునేమోయని నిరంకుశుని కన్నుగీటెను. అంతనారదుఁడు వీరిం గాంచి రంభా నిరంకుశులనుగా నెఱింగి, తనకు నమస్కరింపనందులకుఁ గోపించినవాఁడై యీ సంగతి నింద్రునితో జెప్పి రంభ గర్వమునణంపఁ దలఁచి స్వర్గమున కేగెను. రంభయు నిరంకుశునిగాంచి "నీ తెలివి యేమయ్యెను? నాలుకమీఁద నువుగింజయు నానని తగవులమారిగదా యాతఁడు. అట్టి నారదుఁడు వినునట్లు నన్ను బేర్కొన వచ్చునా? ఈ విషయ మింద్రుడువిన్న మనకుఁ జేటురాదే?" యని మందలించెను. స్వర్గమున కేగిన నారదుఁ డింద్రునిగాంచి రంభ నిరంకుశునిపై గాఢానురాగముగలిగి యున్నదనియు, అంతేఁబోక సురతనయుల సంభోగమును సైతమూమె నిరసించుచున్న దనియును జెప్పి యింద్రున కాగ్రహము గలిగించెను. ఇంతలో కథయడ్డము తిరుగునని యూహించిన రంభ చెచ్చెఱ నింద్రుకడకువచ్చి నమస్కరించి, సిగ్గుపెంపున దూరమున నిలిచియుండెను. నారదునిగాంచి యామె మనసట్టిట్టయ్యెను. అంత నింద్రుడు రంభం గాంచి యీ సాహసకార్యమునకు ఫలముగా నిరంకుశుఁడున్న పట్టణమున భయంకర పాషాణమవు కమ్మని శపించెను. ఆశాపమునకంతము శిల తున్మురై పోవుట. ఇట్లు భయంకర శాపమునుబొందిన రంభ నిరంకుశునిఁజేరి యంగలార్చెను. నిరంకుశుఁడామె నూఱడించి శాపమోక్షము చేసెదనని యభయమిచ్చినాఁడు. రంభ శాపప్రకారముగా శతతాళప్రమాణమగు శిలయై పోయినది. అట్టి మహాశిలంగాంచి పౌరులాశ్చర్యపడి యదియొక దుర్నిమిత్తమని భావించిరి. ఆపట్టణమునేలు ధరిందముఁడను రాజు మంత్రి సామంతులతో నా పెనుశిలను జూడవచ్చెను. అద్దానిం జూచినంతనే రాజునకు జడుపుదయించినది. ఈ సందుగనిపెట్టి యక్కడి రావిచెట్టుపైనున్న బ్రహ్మరాక్షసుఁడు నరనాథు నావహించెను. బ్రహ్మరాక్షసుఁడావేసించినందున రాజొనర్చు పిచ్చికళలిన్నిన్ని గావు. కార్యము దప్పివచ్చినదని మంత్రులాతని నింటికిఁజేర్చిరి. చికిత్సలు ప్రారంభ మైనవి. భూతవైద్యులు, మంత్రగాండ్రు పలువురువచ్చి తమ సామర్థ్యమును బ్రకటించు చున్నారు. కాని భూతముమాత్ర మెవ్వరికిని లొంగుటలేదు. ఈ వార్త నెఱింగిన నిరంకుశుఁడు రంభ శాపమోక్షముఁజేయ నిదియ యదనని తలంచి, మంత్రులవద్ద కేతెంచి, తనకొక దైవశక్తిగలదనిచెప్పి యావులించి దేవత యావేశించినవాఁడువోలె నటనమొనర్చి "ఇపుడు పుట్టిన పాషాణమును పగులగొట్టి పొడిపొడిచేసినచో రాజుఁ బట్టిన బ్రహ్మరక్షస్సు వదలు" నని చెప్పెను. ఆపన్నులగు మంత్రులును జోఁగాములు

విచారింపక ఆ తాతిని జూర్ణము చేయించిరి. అందుండి రంభ వెలువడి నిరంకుశుని జేరి కౌఁగలించుకొని, యాతనిం బలుంభగులఁ బొగడి స్వర్గమున కేగివచ్చెదనని పోయెను. ఇంద్రుఁడీ వృత్తాంతము నెఱుంగనందున రంభనుగాంచి శాపము ననుభవింపకేల వచ్చితివని కోపించినాఁడు. ఆమెయు నిరంకుశునిచే శాపమోక్షమైన విషయమును మనవి చేసెను. ఇంద్రుఁడు నిరంకుశుని యుపాయశాలిత్వమున కచ్చెరువుపడి, ఎంతవాడు కాకున్న శివుని నెత్తమున గెలుచునా! యని సరిపుచ్చుకొని యైరావతమునెక్కి నిరంకుశుంజూడ బయలుదేఱెను. ఆయనవెంట తమతమ వాహనములతో వేల్పులెల్లరును వచ్చిరి. అట్లు తనకుఁ బ్రసన్నుఁడయిన యింద్రుని నిరంకుశుఁ డనేకభంగుల స్తుతింప, నద్దేవతాసార్వభౌముఁ డభీష్టవరముం గోరుకొమ్మనియెను. అంత నాతఁడు రాజును గ్రహవిముక్తునిచేయ ప్రార్థింప నయ్యింద్రుఁ డట్లుచేసి యొండొకవరము గోరుకొమ్మనెను. నిరంకుశుఁ డో దివిజనాయకా! రంభపై నాకింకను మక్కువ తగ్గలేదు. కావున రంభ నొసంగుమని ప్రార్థించెను. ఇంద్రుఁడును దివిజకాంతలు భూలోకమున నుండరాదు. అయినను నీకోరికదీర్ప వచ్చుచుఁ బోవుచుండునని చెప్పి దిక్పాలాదులతో దివికేగెను. అరిందముఁడును గ్రహ నిర్ముక్తుఁడై నిరంకుశుని సమ్మానించెను. రంభ నిరంకుశునసేక విధంబులఁ బొగడి వచ్చుచుఁబోవుచుందునని దేవలోకమున కేగెను. ఈసంగతినంతయు నెఱింగిన నిరంకుశుని తల్లిదండ్రులు సంతోషించి, పుత్రునిఁ గౌఁగిలించుకొని యనేక రీతుల నాతని సామర్థ్యమునగ్గించిరి. నిరంకుశుఁడును తల్లిదండ్రుల సత్కరించి రంభ యనుమతితో నిజభార్యయందు నీతియుతులగు సుతులగాంచి ధన్యుఁడై యొప్పెను.

సత్తెనపల్లి<br>10—10—1951<br>ఖర, ఆశ్వయుజ మహానవమి.

కొండూరు వీరరాఘవాచార్యులు<br>కార్యదర్శి<br>శిల్పకళా పరిషత్తు.



# కావ్య విమాంస

విశ్వశ్రేయోనిదానమైనది కావ్యము. ఇట్టి కావ్యజగత్తులో నాదికావ్యము వాల్మీకిరామాయణము. ఆది కవియగు వాల్మీకి మహోదాత్త నాయకులగు సీతారాములచరిత్రము నభివర్ణించి లోకమున కాదర్శమునుజాటినాఁడు. వాల్మీకిరామాయణముదయించిన పిమ్మట పురాణములును, భారతాదీతిహాసములును వెలసినవి. ఆ పురాణేతిహాసములయం దెన్నికావ్యములుపాఖ్యానభూతములు లేకపోలేదు?

సహృదయులు వేదవాఙ్మయమును బరిశీలించినచో అందే కావ్యములనిచెప్పఁదగిన—లేక, కావ్యలక్షణ లక్షితములైనకథలు, గాథలు, చరిత్రలు నెన్నియోకలవు. వానిలో పెక్కులు రసప్రచురములు, నుపదేశప్రధానములునై కావ్యములనఁ జాలియున్నవి. వేదములో కథోపాఖ్యానములేగాక, పెక్కువర్ణనలు, సౌందర్యోజ్జ్వలములగు ననేకశబ్దార్థాలంకార గుణాదులుగూడఁ గలవు. ఇట్లు కావ్యలక్షణములు బీజభూతముగా వేదమునందే యున్నను అయ్యది అలౌకికమగుటచేత అలంకారికు లద్దానిని కావ్యముగా భావింపరైరి. మఱియు శబ్దప్రధానమగు నావేదము ప్రభుతుల్యమగుట వలనను అలంకారిక సిద్ధిష్టకావ్యస్థితికి భిన్నము కావలసివచ్చినది. వేదము తరువాత పురాణాదుల నర్థప్రధానములుగా నెన్ని అవి స్నేహితునివంటివనినారు. ఇఁక కావ్యమో, రసప్రధానమై సహృదయుల మానసముల ననిర్వచనీయానందము గలిగించుచు కాంతవలె స్వసౌందర్య గుణవిలాసములచేత హితాహితములను మృదువుగా బోధించుచున్నది. ఇట్లాలంకారికులు వేదపురాణాదులకన్న కావ్యమును ప్రత్యేకించి లక్షించినను పై గ్రంథములయందే యీకావ్యలక్షణములు లేకపోలేదు. ఉన్నను ఆలక్షణముల కందు సమగ్రతగాని, ప్రాధాన్యముగాని లేదు. వానియందానుషంగికముగా కావ్యధర్మమాభాసించిన నాభాసించవచ్చును. అందలి కథాంశమునుమాత్రము బంగారమువలెఁ గైకొని, దానిని కావ్యశిల్పముచే రమణీయమొనర్చి రసప్రచురముచేసినఁగాని అది కావ్యముగాదు. అనఁగా కావ్యమున శబ్దార్థములుగాని, గుణాలంకారరీతి వృత్తిపాకాదులుగాని రసప్రధానములు కావలయుననుట. కనుకనే—

> "రసప్రధానాశ్శబ్దార్థాగుణాలంకార వృత్తయః
> రీతయశ్చే యతీ కావ్యప్రమేయం శాస్త్రపద్ధతిః.

అనియు "సావాగ్ యారసవృత్తిః" అనియు లాక్షణికులన్నారు. రసము నవ్యాహతముగా సాధించుటలోనే కవియొక్క కృతార్థత. పండితరాయలు రమణీయార్థమును బ్రతిపాదించినంతమాత్రముననే శబ్దము కావ్యవ్యపదేశమునందునని నుడివియున్నాఁడు. ఈతనిలక్షణమునుబట్టి చూచిన వేదమునందెన్నియో కావ్యములను మనము గాంచఁగల్గుదుము. రమణీయార్థ ప్రతిపాదన కావ్యత్వసిద్ధికి లక్షణమన్న

పండితరాయలు సైతము రసవ్యతిరేకి కాఁడు. మహాకావ్యములో సాధ్యము రసమనుట నాతఁడును ప్రతిఘటింపఁడు. కావున కవులకు రసము సాధ్యమనుట తథ్యము.

ఈదృష్టితోఁజూచిన నాదికావ్యమగు రామాయణమునందుఁగాని, భారతము నందుఁగాని రసము వ్యాహతముగా సాధింపబడినదని తెలియగలదు. వానియందనేక కథోపాఖ్యానములలో ననేకవిధముల నాయారసములు సాధింపఁబడి సహృదయుల మానసముల నలంకరించుచున్నవి. కావున కావ్యమునందు ముఖ్యధర్మ మీ రసము సిద్ధించుట. రససిద్ధిసందని కావ్యము గుణీభూతమగుట నుత్తమకావ్యము కాఁజాలదు. నానా రసోల్లాసియగు భారతములో శాంతరసమవ్యాహతముగా సాధింపఁబడినదని ఆలంకారికాగ్రగణ్యుఁ డానందవర్ధనాచార్యుఁ డబాధ్యమగు సిద్ధాంతము చేసినాఁడు.

కావ్యమున కాత్మ రసము. (ధ్వని) అయినను అద్దాని శరీర మష్టాదశవర్ణనలతో నిండియుండవలయుననియు లాక్షణికులన్నారు. ఈపదునెనిమిది వర్ణనలును ప్రధానమగు కావ్యరసమును బరిపుష్టమొనర్చుటకే యుపయోగింపవలయును. గాని శాస్త్రకారుని లక్షణతా సిద్ధికోసము కారాదు. అట్లగునేని ఆకావ్యము సర్వాలంకార శోభితమగు చిత్తరువు (చిత్రము) కాఁగలదు. చిత్రము చైతన్యరహితమయిన ట్లీ కావ్యమును జీవ రహితము. ఇట్టిది అధమకావ్యవర్గమునకుఁ జేరును. అందుచే రసనివిష్టబుద్ధియగు మహాకవి రసోపనిబంధనైకతానహృదయుఁడై అంగభూతములగు గుణాలంకారముల నిబంధించుటయందేమి, అష్టాదశవర్ణనలు సేయుటయందేమి ఔచిత్యమును బాటించును. కాళిదాస మహాకవి రఘువంశాదికావ్యములయందును, శాకుంతలాది నాటకముల యందును ఈ లక్షణమును మనము భూయిష్ఠముగాఁ గాంచఁగలము. కాళిదాసునికిఁ బిమ్మటివారగు మాఘు, భారవి, శ్రీహర్షాదులుకొందఱు శబ్దార్థాలంకారములకును, ఔచిత్యదూరములగు సుదీర్ఘవర్ణనలకును లోఁగి తమకావ్యముల సౌందర్యమును గొంత చెడఁగొట్టుకున్నారనక తీఱదు. ఈ రహస్యమును గమనించియే ఆనందవర్ధనాచార్యుఁడు కావ్యమున కాత్మ ధ్వనియని నిరూపించుచు "ఈ ప్రపంచములో నేటివఱకును మహాకవులనఁదగినవారే యిద్దఱుగురో" అనినాఁడు. ఇట్టి వీరికావ్యములే దేశకాలభేదము లేక సాహిత్యపీఠమునం దుపాస్యములై యొప్పును. సంస్కృత మహాకావ్యముల స్థితియే యిట్లున్నప్పుడు తెలుఁగువానిమాట చెప్పెడిదేమి?

## కావ్యప్రబంధములు

సంస్కృతములో రఘువంశాదులకు కావ్యములని వ్యవహారమున్నది. తెలుఁగు కవులు తమకృతులను కావ్యములనియు, ప్రబంధములనియుఁ బిలుచుచువచ్చిరి. అష్టాదశవర్ణనములతోఁ గూడినది మహాకావ్యమని చెప్పుకొంటిమి. కావ్యశబ్దముయొక్క వ్యుత్పత్త్యర్థమును విచారించినచో, ఒకవిషయమును మనసునకెక్కునట్లు వర్ణించువాఁడు కవియనియు, అట్టికవి చేయు రసప్రధానము రమణీయము నగుగ్రంథము కావ్య

మనియుఁ దెలియుచున్నది. అట్లే ప్రబంధమన్న కల్పనాత్మకమగు కథ. (ప్రబంధః కల్పనాకథా) యని తోఁచుచున్నది. వీని లక్షణములిట్లు ఇంచుక భిన్నముగా నగపడు చున్నను, సంస్కృతభాషలోనే వీనిని పర్యాయపదములుగా వాడినట్లు పెక్కు ప్రయోగము లగపడుచున్నవి.

> "ప్రబంధానాం ప్రబంధౄణామపికీర్తి ప్రతిష్ఠయోః
> మూలం విషయభూతస్యనేతుర్గుణ నిరూపణమ్"

ఆంధ్రమునఁగూడ నీరెంటిని పర్యాయపదములుగనే వాడినారు. ఈరెంటికిఁ దోడు "కృతి" శబ్దమునుగూడ దెనుఁగుకవులు పర్యాయపదముగనే యుపయోగించిరి. తెలుగున కావ్యమును వ్రాసిన ప్రతికవియును షష్ఠ్యంతములయినపిమ్మట "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన...మహాప్రబంధమునకుఁ గథాక్రమంబెట్టి దనిన" అనుట సామాన్యమయినది. ఆంధ్రమున పెక్కుకృతుల నొనర్చిన శ్రీనాథుఁడు తన కాశీఖండమున "నాయొనర్పంబూనిన కాశీఖండంబు" అనినాఁడు. ఆశ్వాశాంత మునమాత్రము తనగ్రంథ మే జాతిదో సూచించుటకుఁగాఁబోలు "కాశీఖండంబనుమహా కావ్యంబునందు" అన్నాఁడు. ఆతఁడే హరవిలాసములో "నాచెప్పంబూనిన హరవిలా సంబను ప్రబంధమునకు" అనినాఁడు. అల్లసానిపెద్దనయు "స్వారోచిషమనుసంభవం బను మహాప్రబంధమునకుఁ గథాక్రమంబెట్టిదనిన" అనినాఁడు. తెనాలిరామకృష్ణకవి "నాయొనర్పఁబూనిన పాండురంగ మాహాత్మ్యంబునకుం గథావిధానం బెట్టిదనిన" అని ఆశ్వాసాంతగద్యమునకు ప్రబంధశబ్దమును వాడలేదు. కళాపూర్ణోదయములో సూరన తనది ప్రబంధమనియే చెప్పుకొనినాఁడు. వసుచరిత్రకారుఁడును తనది ప్రబంధ మనియే చెప్పుకొనినాఁడు. రుద్రయ్యతనగ్రంథములో కృతి, కావ్యము, ప్రబంధము, అనుమాటని బర్యాయపదములుగనే నుపయోగించెను. పై ప్రయోగములంబట్టిచూడ కావ్యప్రబంధ శబ్దములలో లాక్షణికముగా నర్థభేదము కొంచెమున్నట్లు తెలియుచున్నను కవులు మాత్రము వానిని బర్యాయపదములుగనే భావించినట్లు తోఁచుచున్నది.

## మొదటి ప్రబంధకర్త యెవఁడు ?

తెలుఁగులో తొంటి ప్రబంధకారుఁడెవ్వఁడను నదియొక ప్రశ్న. తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు మనుచరిత్ర పీఠికలో ప్రబంధమనగా కొంతకల్పనతో గూడిన కావ్యమనియు, నట్టి ప్రబంధములలో తెలుగున నవతరించిన మొదటి ప్రబంధము మనుచరిత్రమనియును వ్రాసినారు. దీనింబట్టి ప్రబంధమును మొదటగా నిర్మించిన వాఁడు పెద్దనార్యుఁడు గావలయునుగదా! ఇది సమంజసమా? ఆలోచించిచూచిన పెద్ద నకుఁబూర్వుఁడగు శ్రీనాథ కవిసార్వభౌముఁడే "నైషధాది మహాప్రబంధములు పెక్కు"లు వ్రాసినవాఁడుగదా! ఆయనకించుక పూర్వుఁడగు నెఱాప్రెగడ ప్రబంధరచనామార్గ

ములు వెలయించి "ప్రబంధపరమేశ్వరుఁడని బిరుదమునుగూడ నందియున్నాఁడనుట నిర్వివాదము. ఈతని నృసింహపురాణము, రామాయణమును గావ్యములుగావా? నృసింహపురాణములో నీతఁడు "అట్టి మహాప్రబంధకల్పనాయత్తంబగు చిత్తంబుతో"

ఉన్నత సంస్కృతాది చతు ♦ రోక్తిపదంబులఁ గావ్యకర్తనై,
యెన్నికమైఁ బ్రబంధ పర ♦ మేశుఁడనంగ నరణ్యపర్వశే,
షోన్మయమంధ్రభాష నుఖ ♦ నోత్సవమొప్పగ నిర్వహించి యా,
నన్నయభట్టు తిక్కకవి ♦ నాధులకెక్కిన భక్తిపెంపునన్."

"కావున ప్రబంధరచనా ప్రావీణ్యము నీకు సహజపరిణతసిద్ధమై వెలసినయది."
"అస్మదీయప్రబంధసామాగ్రివలన" అని ప్రస్తావించియు ప్రస్తావింపఁబడియును నున్నాఁడు. కావున నీతఁడు ప్రబంధరచనకు మార్గదర్శకుఁడు కావలయుఁగదా? ఇంకను ఆలోచించి నచో కవిబ్రహ్మయగుతిక్కన మొదటి ప్రబంధకారుఁడు కాఁదగుననితోఁచును. ఆతఁడు తన భారతములో ననేకప్రబంధములున్నవని సూచించుచున్నాఁడు. నిజముగా నందనేక ప్రబంధములున్నవనుటయు రూఢియే. తిక్కన—

క॥ అని రచనాకౌతుకమున,
మనమలరఁగ నీ ప్రబంధ ♦ మండలి కథినా
థునిగను నే పురుషునిజే,
ర్కొనువాఁడనో యను తలంపుఁ ♦ గూరినమదితోన్.

అనియును, "వ. అనిపూని యీ దృశ్యంబులగు పుణ్యప్రబంధములు దేవరసన్నిధిం బ్రసంసించుటయునొక్కయారాధన విశేషంబగుటంజేసి" అనియును జెప్పి తనభారతమనేక ప్రబంధముల సమూహామని స్పష్టపరచినాఁడు. ఇంకను "ఏను విన్నపంబుసేయు తెఱంగుగా నంతస్సన్నిధి గలిగించుకొని యమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబుచేసెద." అని తనది మహాకావ్యమనియును నుడివినాఁడు. తిక్కనకుఁ బూర్వుఁడును తెలుఁగున నాదికవియని ప్రసిద్ధినందినవాఁడును నగు నన్నయభట్టుగూడ భారతరచన సందర్భమున "......నానేర్చు విధంబున నిక్కావ్యంబు రచించెద." నని తనది కావ్యమనియును జెప్పుకొనినాఁడు. ప్రబంధశబ్దమును మాత్రమీతఁడు ప్రయోగింపలేదు. అయినను నీతని భారతభాగమునందును కావ్యములని చెప్పుకొనఁ దగిన పెక్కు కథలు లేకపోలేదు.

కవిత్రయమును, సోమన శ్రీనాధులనుగూడ నటుంచిచూచిన మొదటిప్రబంధ కారుఁడుగా మనకుఁబొడకట్టువాఁడు కవిరాజశిఖామణియగు నన్నెచోడదేవ మహాకవి. ఈతని కాలనిర్ణయము వివాదాస్పదమైయున్నది. ఈతఁడు నన్నయకంటెను బూర్వుఁడని కొందఱు విమర్శకులు తలంచుచున్నారు. కాని ఆవాదనకు—

క॥ మునుమార్గ కవిత లోకం, బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయం, బున జన చాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

అను పద్యము [illegible]. ఈ దేశికవితఁ బుట్టించిన ఘనులు రాజరాజులకంటె నన్నెచోడుని [illegible], [illegible] అప్పకవి [illegible] భారతమునకును బిమ్మటి దేశిని [illegible]. కాని నన్నెచోడకవి పై కవిద్వయమును జేర్కొనలేదు. [illegible]? ఎటుచూచినను నన్నెచోడఁడు తిక్కన్నకంటెఁ బూర్వుఁడనుటకు [illegible]. ఈకవి తిక్కన్నకుఁ బూర్వుఁడనువాదమును [illegible] ప్రబంధ కర్తగాఁ జేర్కొనఁదగిన [illegible]. ఈతఁడు తన కృతిని కావ్యమనియును, ప్రబంధమనియును జెప్పి కావ్యప్రబంధములు సమానార్థకములని భావించినట్లగపడుచున్నది.

ఉ॥ జంగమ మల్లిఖార్జునుని ♦ సద్గురుమూర్తి [illegible] యు
త్కీంగొని యాడి, సత్కవికిఁ ♦ గేవలు లేకను [illegible] భా
షాంగనఁ దక్కనేలిన మ ♦ హత్వము లోకమునం బ్రసిద్ధిగా
భంగిగ విస్తరించెదఁ బ్ర ♦ బంధము సజ్జన బంధురంబుగాన్.

అనియు,

"రవికులశేఖరుండు కవిరాజ శిఖామణి కావ్యకర్త,
సత్కవి భువి నన్నెచోడుఁడట, కావ్యము దివ్యకథం గుమార సంభవమట."

అనియును జెప్పినాఁడు. ఈతని కుమారసంభవ మష్టాదశవర్ణనములతోడను నింక విశేషలక్షణములతోడను గూడియున్నది. తన కావ్యములో

క॥ వన, జలకేళీ, రవి, శశి, తనయోదయ, మంత్ర, గతి, రత, క్షితి, పరిణాం
బునిధి, మధు, ఋతు, పురో, ద్వాహ, నగ, విరహ, దూత్యవర్ణనాష్టాదశముల్.

అను నష్టాదశవర్ణనలు నున్నవని చెప్పి యట్ల చేసినాఁడు. ఇంకను దన కావ్యము "దశప్రాణంబుల సప్రాణమనియు, నవరసభావభరితమనియు, షట్త్రింశదలంకార" ములుకలదనియును జెప్పుకొనినాఁడు, కవిత్వమునుగూర్చియు నీతనికి విశేషాభిప్రాయములుకలవు.

క॥ ముదమున సత్కవి కావ్యము, సదరఁగ విలుకానిపట్టి ♦ నమ్మునుబర హృ
ద్భిదమై తలయూపింపని, యదికావ్యమె? మలరిపట్టి ♦ నది యుంగరమే?

ఈ పద్యమునకు సంస్కృత మూలమునుం గలదు. మొత్తముమీఁద నీతని కుమారసంభవ మద్భుతమైన కావ్యము. చిత్ర విచిత్రములగు వర్ణనలు, పాత్రల సంభాషణలు, కల్పనలు, సంవిధానములు కలిగి యిది తరువాతి కవులకు మార్గదర్శకమైనది. తిక్కన, నాచన, సోమనాది మహాకవులే యీతని ననుసరించి తమ కృతులలో పెక్కు పద్యములను, గవితారీతులను జిత్రించుకొన్నప్పు డాతఁ డెంతవాఁడు కాఁడు? కాని ఆతని ననుకరించిన తిక్కనగాని, సోమనగాని వానిని బేర్కొనరైరి. ఇందుకీతఁడు బ్రాహ్మణేతరుఁడగుట కారణము కాఁబోలు. ఆహా! కులతత్త్వమహిమ! కావున తెలుఁగున మొదటి కావ్యకర్త, లేక ప్రబంధకర్త నన్నెచోడ మహాకవి. తరువాత నిర్వచనోత్తర రామాయణమును, భారతమును వ్రాసిన తిక్కన, పిమ్మట ప్రబంధ పరమేశ్వర, సోమన, శ్రీనాథాదులను ననుట సముచితమై యుండును.

## ప్రబంధయుగము

ఇట్లాంధ్రమున తొలిప్రబంధము కుమారసంభవమైనను, తిక్కన, యెఱ్ఱన, సోమన, శ్రీనాథాదులు తరువాతి ప్రబంధ కర్తలైనను, విశేషించి యెఱ్ఱన ప్రబంధ పరమేశ్వరుఁడయినను, శ్రీకృష్ణదేవరాయల యుగమునకే ప్రబంధయుగమని పేరువచ్చినది. "నన్నయ తిక్కనాదుల రచనలు పురాణేతిహాసముల కనువాదములగుటను, కథావస్తువుమాత్రము గైకొని స్వకపోలకల్పితములగు వర్ణనాదులతో కథలోమార్పులు చేర్పులుచేసి వ్రాసినకావ్యములు పూర్వము విశేషించిలేనందున కృష్ణరాయలకుపూర్వపు కాలము ప్రబంధయుగము కాలేద"ని కవిచరిత్రకారులు, నాంధ్రవిమర్శకులును వ్రాయుచున్నారు. వావిరిఁబుట్టురత్నములవంటి ఆద్యసత్కథలు సత్కవి కల్పనా విశేషావహములై సానలదీరిన జాతిరత్నములగుచున్నవని రామరాజభూషణుఁడు పల్కినాఁడు. ఈసానబెట్టుస్థితి పూర్తిగా కృష్ణరాయలయుగముననే జరిగినదనియు, నందు మొదటగా సానదీరిన జాతిరత్నము మనుచరిత్రమనియు తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారి మతము. రచనా వైచిత్రియెంతయుండినను, కల్పనానైపుణ్యములేని పూర్వవృత్తము ప్రబంధముకాదని మనవారుకొందఱు భావించినట్లగపడుచున్నది. వారి లక్షణముననుసరించి యట్టిది ప్రబంధము కాకపోయినను, మహాకావ్యమగుటలో నెట్టి విరోధమును లేదు. ఏకొంచెపాటి కల్పనమునో గైకొన్నమాత్రమున మనుచరిత్రము తొలిప్రబంధ మనుటయు సరసముగాలేదు. పెద్దనార్యుఁడు రచనా వైచిత్రియుఁ, గల్పనానైపుణియు, వర్ణనవిశేషమును గలిగిన ప్రబంధము వ్రాసిన వ్రాయవచ్చును. అది యుత్తమ ప్రబంధమైనంగావచ్చును. కాని తొంటిప్రబంధమే ఆతఁడనుట యెంత యుక్తిసహము? సవిమర్శముగాఁ జదివిచూచినచో పై లక్షణములు కుమారసంభవములో నద్భుతముగా నున్నవి. మహాకవులకు ననుసరణీయములైన కావ్యగుణములు, కవితావిశేషములు

నందెన్నియో కలవని మనవిచేసియుంటిని. కావున మొదటిప్రబంధ కారుఁడనుగౌరవము నన్నె చోడదేవునిదే యనియును, అతని కుమారసంభవమే తెలుఁగున తొలిప్రబంధ మనియు నాకుఁ దోఁచుచున్నది.

ఇట్లు కృష్ణరాయల యుగమునకుఁ బూర్వమే ప్రబంధములు పుట్టినను, కృష్ణ రాయలకాలము ప్రబంధయుగమనుట తథ్యమే. ఆనాఁటికి పురాణాదులనూదితము లైనవి. సాహితీసమరాంగణ సార్వభౌముఁడగు నాతనికాలపు కృతులన్నియు నించు మించు కల్పనామహితములును, వర్ణనప్రధానములును, రసబంధురములునగు ప్రబంధ ములే. పురాణేతిహాసములనుండి యేకథనో గ్రహించి, దానిని కవిప్రతిభావశమున కావ్య గుణములాపాదించి సౌందర్యోజ్జ్వలము చేయుట అనుక్రియ ప్రచురముగా ప్రచార మునకు వచ్చినది రాయలకాలముననే. ఇట్టి నూతనప్రబంధముల రుచివిశేషమును గ్రహించి అనేకకావ్యములను వెలువరింప నవకాశము కల్పించిన ఆంధ్రభోజుఁడాంధ్రుల కాచంద్రార్కమారాధనీయుఁడు. ప్రబంధముల రసమహత్తను గుర్తించి, స్వయముగా నాముక్తమాల్యదవంటి సత్ప్రబంధమును వ్రాసియు, పెద్దనార్యునిచే లోకోత్తరమగు మనుచరిత్రమును రచింపఁజేసియు, ముక్కుతిమ్మనచే ముద్దుపలుకుల పారిజాతాపహరణ మును వెలయింపఁజేసియు, పెక్కుప్రబంధముల నంకితమందియు నానావిధముల నాంధ్ర సరస్వతి నర్చించి వన్నెకెక్కిన యిమ్మహనీయుఁడు ఆంధ్రప్రబంధ యుగాచార్యుఁడు కాఁడా? "మనుచరిత్రం బందుకొను వేళఁ బుర మేఁగఁ బల్లకిఁ దన కేలఁ బట్టియెత్తె"న యిమ్మహాకవి స్రష్టప్రబంధకవితాప్రీతి యెంత దొడ్డదోగదా!

రాయలయుగమున వెలసిన రసవత్ప్రబంధములలో మనుచరిత్రము మొదటిదిగా నగపడుచున్నది. కాని యిందు మూఁడుతరములవారి కథలు ప్రస్తావింపఁబడి చిట్టచివ రకు మనుసంభవముతో కథాంశము ముగియుచున్నది. అయినను రసోత్తరమగు నుజ్జ్వల ఘట్టము వరూథినీ ప్రవరులదే. స్వారోచిషమను వెట్లుపుట్టినను వానికథాంశము పాఠకు లను బ్రధానముగా నాకట్టుటలేదు. పెద్దన "కుమారసంభవము" ననుసరించి తనగ్రంథ మునకు "స్వారోచిషమనుసంభవ" మని పేరిడినట్లున్నది. అయినను కుమారసంభవ ములో కుమారునికథవలె నిందు స్వారోచిషమనువుకథ విస్తరింపఁబడి పాఠకుల నాక ర్షించుటలేదు. ఆకర్షించునది వరూథినీ ప్రవరులవృత్తాంతమే. మూఁడాశ్వాసముల వఱకునుకథ. వర్ణనాదులు, మహనీయముగా నడచిపోయినవి. తరువాత పఠనోత్కంఠ కలుగదయ్యెను. కవి కావ్యములోని ప్రధానకథ ననుసరించి కావ్యమునకుఁ బేరు పెట్ట వలయును. అట్టి సముచిత నామకరణ మీ కావ్యమునకుఁ బొందుపడలేదు.

మనుచరిత్రము తరువాత కృష్ణరాయల ఆముక్తమాల్యద వెలసియుండును. ఇది యొక అసదృశ ప్రబంధము. ప్రౌఢపాకమున బద్ధస్ఫుటికిని కావ్యగుణములు, విశిష్టా ద్వైతమహిమము నిందు ప్రముఖముగా బ్రస్తావింపఁబడినవి. కావ్యముపదేశ బహు

ముగా నున్నదిగూడను. అట్లే తిమ్మనాచార్యుఁడుగూడ పారిజాతాపహరణముతోఁ గృతకృత్యుఁడయినాఁడు. పెద్దన మనుచరిత్రమునవలెఁగాక తన కావ్యమునకుఁ దాను పెట్టుకొన్న పేరు సార్థకమగునట్లు నాతఁడు కృతిని సరసముగను, ఔచితీయుతముగను నిర్వహించుకొని ధన్యుఁడయినాఁడు. అట్లే రుద్రయ్య నిరంకుశోపాఖ్యానము, తెనాలికవి పాండురంగ మాహాత్మ్యము, నృసింహకవి, కవికర్ణ రసాయనము, రామరాజభూషణుని వసుచరిత్రము, పింగళిసూరన్న ప్రభావతీప్రద్యుమ్నము, కళాపూర్ణోదయములుమున్నగు ప్రబంధములుగూడ రాయలయుగమున వన్నెకెక్కినవి వీనిలో కళాపూర్ణోదయ మాంధ్రమున నసదృశమగుకృతి. అద్భుతకల్పనలతోఁ గూడిన ప్రబంధము. వీని విమర్శకిది తావుగామి విరమించి ప్రకృతము ననుసరింతును.

## కల్పనాకథలు నింద్యములుకావు

"కేవలకల్పనా కథలు కృత్రిమరత్నములు" లను నీసడింపు సమంజసముకాదు. కథ కల్పితమైనంతమాత్రమున కృత్రిమ రత్నమగు. ఇట్లనుట మనవారికి ప్రాచీనవస్తువులయెడ గల భక్తిని, నవీనములయెడలగల విరక్తిని సూచించుచున్నది. సంస్కృతములోని కల్పితములగు కాదంబరీ,— మాలతీమాధవాదుల కద్భుతమగు గౌరవమున్నది. అవి మహాకావ్యలక్షణ లక్షితములు. కవిలోకమునకు గురుస్థానముగదా కాదంబరి! పై మాటనుబట్టి ఇంకను తెలుఁగులోని నిరంకుశోపాఖ్యాన, కళాపూర్ణోదయాదులును కృత్రిమరత్నములవలె నింద్యములు కావలసివచ్చునే. అట్లుకాక వానికి లోకమున సాటిలేని ప్రతిష్ఠయున్నదే! కథ ప్రఖ్యాతముగాని, కల్పితముగాని, మిశ్రముగాని కవి ప్రతిభాశాలి యగునేని దానిని తన కావ్యశిల్పముచే రమణీయమొనర్చి, సహృదయులకుపాదేయముచేసి కావ్యప్రయోజనమును సంపాదింపఁగలఁడు. ప్రతిభలేనివాఁడు ప్రఖ్యాతవస్తువునుగూడ పాడొనర్చి భంగపాటునందును. కావున కావ్యవస్తువు కల్పితమైనను, ప్రఖ్యాతమైనను కవి కవితాకల్పనా శిల్పములను బట్టియే తత్కావ్యముపాదేయముకాని, అనుపాదేయముగాని కాఁగలదు. ఇట్టి కల్పితవస్తువుగల కావ్యములలో నగ్రేసరము కాఁదగిన కృతులలో నిరంకుశోపాఖ్యాన మొకటి.

## నిరంకుశోపాఖ్యానము

ఇందలికథ పూర్తిగా కల్పితమే యనవలయును. ఇట్టి కథలు పురాణేతిహాసములందు కొన్ని యగపడుచున్నవి. శ్రీనాథుని కాశీఖండములోని "గుణనిధి" కథయు, రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యములోని 'నిగమశర్మ' కథయునిట్టివే. శ్రీనాథుని గుణనిధి జూదగాఁడై, డబ్బుకొల్లవెట్టి దురాచారపరాయణుఁడాయెను. రామకృష్ణుని నిగమశర్మ వ్యభిచారియై కులముచెడి భ్రష్టుఁడగును. శివమహిమను ప్రకటించుటకు

గుణనిధికథ చెప్పఁబడినది. అతఁడు శివరాత్రినాఁడు శివాలయములో పక్వాన్నమును దొంగిలించి తలారులచేఁ జంపఁబడును. శివరాత్రినాఁడన్నము దొరకకైనను ఉపవసించి దొంగతనముకొఱకైనను శివదర్శనము చేసికొన్నాఁడు. గావున వానికి సద్గతికలిగినది.

నిగమశర్మ నృసింహతీర్థమున మరణించుటవలన తన్మహిమచేత వైకుంఠమున కేగినాఁడు. కావున ఆ కథలకు దేవ కేశవుల మహిమను ప్రకటించుటతో సఫలత చిక్కినది. మన నిరంకుశుని కథకును, నిగమశర్మ కథకును మూలభూతము గుణనిధి కథ యనవచ్చును. నిగమశర్మ కథకు సంస్కృత స్కాందపురాణములోఁగూడ కథ యుండియుండును. దేవతాతీర్థముల మహిమలఁ ప్రకటించుటతో పై రెండు కథలును ముగియుచున్నవి. అందు కథానాయకుల శక్తిగాని, ప్రతిభాచాతుర్యముగాని వ్యక్తమగుటలేదు. అట్టి కథలను మూలముగా, గైకొన్న మనకవి నిరంకుశోపాఖ్యానమును లోకోత్తరముగాఁ జిత్రించినాఁడు. వేశ్యామాతచే వెడలగొట్టఁబడిన నిరంకుశునకింకను వెలయాండ్రమీఁద వ్యామోహము తగ్గలేదు. అఁదుకాతఁడొక ఘోరారణ్యములో శివునితో జూదమాడి గెలిచి రంభను తనకిమ్మని కోరినాఁడు. రంభనుబొంది దానితో దివ్యసౌఖ్యముల ననుభవించి కృతకృత్యుఁడైనాఁడు. ఇఁతియేకాని నిగమశర్మవలె త్రాగుబోతై ప్లవకన్యనుగూడి కులముచెడఁగొట్టుకొనలేదు. పై పెచ్చు రంభకు శాప మోక్షమును గూర్చుటలో తన తెలివితేటల నగపఱచి, ఇంద్రుని మెప్పునంది వాని యనుగ్రహముచేత అరిందమునికిఁ బట్టిన బ్రహ్మరాక్షసునిగూడ వదలించి రాజసన్మానమునొంది ప్రకాశించెను. ఈ విధముగ నిరంకుశుని కథ భూలోకమునుండి స్వర్గలోకమువఱకు ప్రాకినది.

ఆంధ్ర ప్రబంధములు పెక్కులు కథావైచిత్రిలేనివనియు, నొక్కటి చదివినచో తక్కినవి చదువవలసిన యక్కఱలేదనియు నొకయపప్రథయున్నది. ఈమాట నన్యథాకరించు గ్రంథములలో నిరంకుశోపాఖ్యాన, కళాపూర్ణోదయము లగ్రేసరములు. కవి యీ నిరంకుశోపాఖ్యానమును "సమస్త రససిస్తంద్రంబు" గా రచింపఁబూనినాఁడు అనేకరసములు కథలోసిద్ధినందవలయునన్న ఆకథయెంతయో పెద్దదైనట్లు యెన్నియో సన్నివేశములతో నలరారవలయును. ఆయా సన్నివేశములఁ గల్పించుకొని కథ నటునిటుమలిచి కవికృతకృత్యత నందెనాయనుటకుఁ దొలుత కథాసంవిధానాదికమును బరిశీలింతము.

# కథాసంవిధానము.

ఈ కావ్యకథకు నాయకుఁడు వేదాది విద్యలలో నిరంకుశుఁడగు నిరంకుశుఁడు. వైదిక శేఖరుఁడగు సురశర్మకును-ఉత్తమగృహిణియగు నాదర్శమాతకు లేకలేక కలిగిన యల్లారుముద్దుఁగొమరుఁడు. వేదములు, శాస్త్రములు చదివినవాఁడు. కవిత్వము వ్రాయఁగలవాఁడు. సంగీతము పాడఁగలవాఁడు. ఇఁక చక్కదనములోనో చక్కెరవింటివాని నెకసక్కెములాడఁగలవాఁడన్న నొక్కమాటలో సరిపోవును. ఇట్టి నిరంకుశునకు ఆకారసంపదుపేతయగు కన్య భార్యయైనది. ఈతని విద్యా విశేషమును గాంచిన యానాటి పండితులీతఁడు సాక్షాత్తు బ్రహ్మయేకాని బ్రాహ్మణమాత్రుఁడు కాఁడని భావించినారు.

అసలే చక్కనివాఁడు. దానికిదోడు నవయౌవనము. ఇఁక నాతని యందచందము లెంతగా నాకర్షణీయములైయుండునో యూహింపుఁడు. సర్వానర్థములకు మూలమగు నాయౌవనములో నిరంకుశుఁడు వైదికాచారముఁ గట్టిపెట్టి, శాస్త్రపురాణపరిశ్రమము నిస్సారమని తలంచి విటచర్యకుఁ జిత్తము చేర్చినాఁడు. ఏమి! పడుచుఁదనపుమహిమ!! ఆతని వేషమంతయు మారిపోయినది. నీర్కావి ధోవతులు గట్టుటమాని సన్నని చల్వధోవతులు మరగినాఁడు. గోపిచందనము దట్టముగా మొగమున మెత్తుటమాని కొనగోటితో తిరుమణి దిద్దమూనినాఁడు. పచ్చడము పైనవేసుకొనుటమాని దుప్పట్లు, ఖండువాలు తాల్చబూనినాఁడు. ప్రతిదినమును బంచాంగమును బఠించుటమాని కోకోకమును జదువసాగినాఁడు. బ్రాహ్మణస్నేహముమాని కాముకులతోడి నేస్తమునకు దిగినాడు. సమిధలకటనట నరుగుటమాని లంజమందులకుఁ దిరుగబూనినాఁడు. నిన్నటివరకును సదాచారసంపన్నుడు. యౌవనభూతమావేశించి యా యాచారమును గూలఁద్రోసి క్రొత్తపిచ్చి రేకెత్తించినది. అయినను చూచువారేమనుకొందురు? అందుకే విటవృత్తిలోఁ దనచాతుర్యమును జూపుచు కొంతకాలమొదిగియొదిగి చాటుమాటుగఁ దిరిగినాఁడు. ఈ చాటుమాటు లెంతకాలముచెల్లును? ప్రజలు గుర్తింపరాయేమి? గుర్తించిననేమి? కాముని ప్రభావమట్టిది. కాముకవృత్తి తనకు రాచబాటకాగా నిరంకుశుఁడు నానాఁటికి చవివిడిచి తిరుగఁజొచ్చినాఁడు.

ప్రతిసాయంకాలము నాతఁడు బాగుగా నలంకరించుకొని, చెరకువింటినిదాఁచి శరీరముతో మారుఁడు విహరించుచున్నాఁడా యనునట్లు వారవనితల గబ్బిగుబ్బలమీఁద చూపులు వోలయించుచు వీథికి వచ్చుచుండును రాత్రులయందు వేశ్యావీథుల జరించు నిరంకుశుని వేషమెంత సుందరమో! చూడుఁడు.

సీ॥ చల్లడమామీఁదఁ జలువఁబట్టిన దట్టి, దలిమంపుదుప్పటి దానిమీఁద
మొలజముదాళి చాయల పిడియంబుచేఁ, బడగ సూరియుఁ జిల్లబటువుచేతఁ
దనువున మంచిగందము దానిపై గంద, వొడియందు మీద గప్పురపురజము
వలకారి సిగతాయెతులు వానిపై జాజి, విరులంపుపై నొంటిపొర రుమాలు

గీ॥ మీర ఘనసార తాంబూల సౌరభ్ర, వాహవహగంధ వాహప్రదోహ మోహ
వశవిశాలేక్షణా జనస్వాంతుడగుచు, రాత్రుల జరించుచుండునా బ్రాహ్మణుండు.

తెల్లవారు వఱకును వేశ్యాంగనలతో వివిధ సంభోగములదేలి ప్రభాతమున వీథికివచ్చు నీ విటశేఖరుని సొంపు బరికింతము.

సీ॥ జాఱిన వెండ్రుకల్ సవరించి చుట్టిన, పసిమిఁబ్రాఁతరుమాలు మసికిలంగ
నిదురచాలమి మూఁగన్ను మోడ్పుజూచెడు కన్ను, లధరకెంపుదమ్మి విరులుదాల్ప
వాఁడు జూపిన లేఁతవాతెరపలు కాంక్షి, జిలుగుకెంపుల జిమచిమ యసంగ
వలిపెపుప్పటి వల్లెవాటుజాఱి యుండుయారి, చిగురుఁగెంపుఁబూత చెలువమమర.

గీ॥ మారశాస్త్రాధికార దుర్వారవార, నారిజా స్వాతి సారస్యవచనరచన
కృతపరీరంభ సంభోగకేళి దేలి, వీధికేతెంచు వేకటివేళఁ దలఁచు.

ఇట్లు కామపరతంత్రుఁడైన నిరంకుశునికి పవలేమి, రాత్రియేమి తీఱిపని. వెలయాండ్రతో పాచికలాడుచుండును. ఒకతెయొడికి కస్తూరితిలకము దిద్దును. ఇంకొకతెకు క్రొమ్ముడిలో పన్నీరుపూలు తురుముచుండును. వేఱొకతెకు జక్కవలవంటి చన్నులమీఁద హారములచిక్కులు సవరించును. మఱొకతెకు శరీరమున గప్పుగంధములలఁదుచుండును. ఒకర్తెకు చెక్కులమీఁద మకరికలు వ్రాయుచుండును. ఒకతెకు జడబందులు చిక్కులుతీయును. అది యిది యననేల? అతఁ డెప్పుడును మోపవదరము గాని కార్యభారముతోఁ గ్రుంగుచుండును.

ఇట్టివానికి కులాచారముపై మనసు నిలుచునా? వేదములు చెప్పిన గురుపవగపడిన కోపము, తీర్థయాత్రల కేగువారింగాంచిన మదిలోమంట, వైదికాచారపరాయణునిగాంచిన నేవగింపు, శమాన్వితుడగు సన్న్యాసింగాంచిన ఎన్నడునులేని కనరు, సంధ్యయన్న తలనొప్పి, విభూతిధారణమన్న తీపరము. దేవపూజయన సేద్యము. ఆహా! ఎంతటిమార్పు!

తన విటవ్యాపారము సాగుటకు చక్కదనము, ప్రాయము, మాటలుమాత్రము చాలవుగదా? అదియు వేశ్యలతోడి పొత్తుగావున విత్తముకావలయును. తలిదండ్రులకు నచ్చజెప్పి అతిథి సత్కారమునకని కొంతధనమును గైకొనును. పొరుగూళ్ళలోని మాన్యములందు వచ్చు ధాన్యములమ్మి కొంత సొమ్ము పడయును. ఇంటివారు పరాకుగానున్నప్పుడు ఆయాయివస్తువులు తీసికొనిపోయి యమ్ముచుండును. ఒక్కసెల్లెండ్రను లాలించి వారిచ్చిన ధనముగైకొనుచుండును. ఇన్నిమాటలేల? బలపమును గత్తినిబట్టి వాఁడు ప్రజలయిండ్లకు గన్నములు వేయలేదన్నమాటేకాని తక్కిన దుర్వృత్తులన్నియు నేర్చి డబ్బు కొల్లవెట్టెను.

నిరంకుశుఁడు సంగీతసాహితీ విశారదుఁడు. కేవలము సౌందర్యమునకే- విలాసవిభ్రమములకే దానుఁడగునట్టివాఁడుకాఁడు. గుణములయందుగూడఁ బ్రేమమీతనికగ్గలము. కావుననే అఖిలవారాంగనా మనోహర విహార నిరతుఁడైనను గాన విద్యలో సాటిలేనిదగు చంపక గంధికీతఁడు మేటివాఁడయినాఁడు. చంపకగంధిమాత్రము సామాన్యురాలనుకొన్నారా? పురుషుల ధైర్యసారమును డిందుపఱచుట కామెకు మన్మథుఁడుగాని, చంద్రుఁడుగాని, చల్లగాలిగాని ఇంకేయుద్దీపకములు నక్కఱలేదఁట. ఆమెకడకంటిచూపులలోనే యన్నింటి ప్రభావమున్నది.

క॥ మరుఁడేల చంద్రుఁడేటికి, మరుదంకురమేమి పనికి మనుజేశ్వరయా
తరుణి కడకంటఁగాదె. పురుషుల ధైర్యంబులేదు పొమ్మనిపింపన్.

గాన విద్యావిశారదయగు నామె అమృతరసము లుట్టిపడునట్లు వీణవాయించుచు గీతముఁ బాడుచో నెవ్వనికిఁగాని దమకము పుట్టకుండదు. ఎవనికేనిపుట్టదో! వాని హృదయముఱాయన్నమాట! ఇన్నిమాటలెందుకు? అదిగనుక దేవవేశ్యలయిండ్లలో నున్నచో మునుల తలంపులు గుదిగుంపులుచేసి మథింపఁజాలును. ఇట్టి చంపకగంధి:-

సీ॥ వాలుఁగన్నులచేత వలలఁబెట్టుటెకాక, యభ్యసించినదొక్క యదలుఁజూపు
ముఖచంద్రరుచులచే ముళ్ళువెట్టుటెకాక, సంతరించినదొక్క వింతనవ్వు
బటువుగుబ్బలచేత బ్రమలఁబెట్టుటెకాక, సంఘటించినదొక్క జారుఁబైట
వెలిద్రొక్కు సిగ్గుచే వెతలఁబెట్టుటెకాకఁ యలవరించినదొక్క కులుకుఁబలుకు.

గీ॥ గాఢయౌవనమున గాసివెట్టుటెకాక, నేర్చుకొన్నదొక్క నెఱతనంబు
తరుణి విభ్రమంబుఁ దలఁపోయశక్యమే, ధాతకైన వాని తాతకైన.

నాయికావర్ణనముసేయు పట్టుల నిటీవలి కవులుకొందఱు ముక్కునకొకటి మోమునకొకటిగాఁ బద్యములుచెప్పి తమ కావ్యముల నౌచిత్యమును జెఱచుకొన్నారు. ఔచితీధర్మ మర్మజ్ఞుడగు రుద్రకవి యాతెఱువు ద్రొక్కక యొకటిరెండు పద్యములలోనే రసవంతముగాఁ దనపాత్రల గుణసౌందర్యములు తల మున్కలగునట్లు వర్ణించును. ఈచంపకగంధి వర్ణనము అట్టిది. ఆతరుణి విభ్రమము తలపోయుటకు ధాతకు మఱి వాని తాతకుఁగూడ సాధ్యము గాదనుటలో దాని విలాసమహిమ మిన్నుల కంటిపోయినది. ఇట్టి చంపకగంధికి విటుల నెలయించుట కనేకమార్గములున్నవి. సంగీతము, సాహిత్యము, వీణపాట, సొగటాలాట, వింతమాటలు. ఓ! ఒక్కటేమి? ఇన్నింట నావెలఁది రసికురాలు. ఎంతగొప్పది! ఇంతయే కాదు. తగవరి, మాటకారి, కంతుకేళిలో గడిదేఱినజాణ రసజ్ఞుల మెప్పులనందినదిట్ట. ఇట్టి సకల విద్యావిశారద మనవానికి నచ్చుటలో వింతయేమి? ఈతఁడును సంగీతసాహితీ ధర్మమర్మజ్ఞుడును, రతి కళాపండితుఁడునుగదా! పూర్తిగా చంపకగంధి కీతఁడమ్ముడుపోయినాడు. కాని చంపకగంధి తల్లిమాత్ర మొకబ్రహ్మరాక్షసి. ధనముమీఁదికోరికచేత నది యిప్పటికొక లక్షకాఁపురములు జెఱిచి యుండును. కుబేరకుమారుఁడైనను కాంచనభూషణాంబర నికాయములిచ్చి యా లంజతల్లిని మెప్పింపలేఁడు. దాని యాశయట్టిది. ఇట్టితల్లియును, చంపకగంధియు నిరంకుశుని సర్వస్వము దోఁచినారు. వారడుగుటయేతడ వీతనికీయరాని వస్తువేలేదు. అయినను చంపకగంధి చాలమంచిది. అడుగదుగాని పాపము ప్రాణమైన నొసంగునట యీబాపఁడు.

ఇట్లు పెక్కువత్సరములు నిరంకుశుని దుర్వ్యాపారము సాగిపోయినది. పాపమాతనిభార్య ధైర్యము వహించి యోపికపట్టినది. మగని నడవడిలో మార్పులేదు: తానేమి కుంటియా? కురూపియా? త్రిభువనాశ్చర్యకర సౌందర్యగదా! తన సౌందర్య విలాసములు బుగ్గిపాలు కావలసినదేనా ? పతివ్రతాధర్మమునకుఁ గట్టువడి తాను మిన్నకుండుటేటిపాడి? అయినను అది పతివ్రతాలక్షణముగూడ కాదు. మగనిని మందలింపఁ దలచిన యీ పతిదేవత స్వయముగాఁగాక అత్తగారిచే నాపనిచేయింప దొరకున్నది. ఈ యత్తయోగ్యత పాఠకులెఱుంగుదురు, ఒకనాడీ కోడలు కన్నుల నశ్రువులుఁగ్రమ్మ కరుణాయత్తయగు నత్తగారింగాంచి కొడుకు నడవడిమార్ప ప్రార్థించినది. కోడలిమాటల నేర్పుసందర్భమునకుఁ దగిన పలుకుల పొందికయందెంతయో సహజముగను, సముచితముగను గవి వర్ణించినాడు. "అత్తా నీకొడుకు మూఢతమాన్పవమ్మ! ఆతడు రోతొత్తులమారియై యొకొకదానిని గుత్తగా నుంచుకొని కోకలు, రూకలు నిచ్చుచున్నాఁడు. ఇట్టివానిని బరిభవింప కూరక చూచివిడుచుట మీకు న్యాయముకాదు"

ఉ॥ కోరికమీఱగాఁ గుడిచి, కుంకుమ సంకుమదాంకగంధ మొ
య్యారముగా నలందుకొని, యాకులుఁ బోఁకలుఁజాలునట్లు దు
ర్వారతరేచ్ఛ బుచ్చుకొని, వారలతాంగుల యిండ్లకేగఁగా
నూరకచూచుచుండెదర, యో యదలింపక మీరు మామయుఁన్.

మగఁ డన్యనాయికాసక్తుఁడగుటచే యిట్లాంతర్యమునఁ దలఁచెను. అట్టిస్థితిలో నిరంకుశుని యీ చేఁత నామె యెట్లు సహించును? అందుచే నీకును భాగ్యముకాదలచిన వస్తువాయెను. ఆ భోగానుభవము లన్యాక్రాంతమగుటనే వైధవ్యము ననుభవించుచున్నది. అతనిదెంటలో పైకెత్తిగా "ముస్తాబై" తత్ఫలము నన్యులకందించుచు దినములు గడపుచున్నాను. తన నోరునుమాట యటుంచినను "ధరణిసుర కులాచారధర్మము నాచరింపవలెనని యెరుగనట్టి భర్తృసేవకు నాయుష్యము పసుపుకుంకుమలతో నాసాటు రాదా?" యని యామె భయపడుచున్నది. తానె పంచాంగము పరాయణత మెచ్చఁదగినది. "మామగారైనను, మీరైనను, వదినెలైనను కులాచార ధర్మములైనను నుండవలెను మనయింటి నాతడింత శిష్టేతరాచారమునకుఁ బాల్పడెను. అత్తా! నన్నుఁ జేయఁ గూడనకుకో మాట కాదు. మగఁడు సంసారమునుఁ జాలించి యిట్లు తిరిగినచో నేనుగనాలు సహించియుండునా?" అని అత్తగారిపై నెప్పుడును నెత్తిపడక "అత్తవు సర్వ లక్షణసమగ్రగుణాఢ్యవు నన్నుఁగన్నతల్లి వలెనే కాని నీకొడుకు మూర్ఖుడని మానుపవలె" నని మెత్తగా నెత్తి పొడిచినది. ఇట్లు హృదయములోని సంతాపమును నెమ్మదిగ్రక్కి మనసులోని దుఃఖమాపలేక కన్నుల నీరు జలజలప్రవహింప వలవల యేడ్చినది.

ఆయుత్తమాంగన యాడిన పలుకులకు, ఆమెయేడ్పునకు అత్తమామలే కాదు, ఎవరు కరఁగిపోరు? అత్తగారును "అమ్మా! ఎందుకేడ్చెదవు? నీకు నావ్యథ నేనెఱుగుదును. వానికిమ్మ నెట్లున్నదో కాని ఆణిముత్యము మసిబొగ్గయినది." అని కొడుకు గుణమును, నేటి ప్రవర్తనను సూచించినది. ఆతనిదగు రీతి మందలింతునన్నది.

నిరంకుశుఁ డర్థరాత్రమగుదాఁక వేశ్యలయిండ్ల విహరించి చంపకగంధియింటికిఁ బడుక కేగఁ దలంచి భోజనముకోసమై యింటికివచ్చినాఁడు. అతఁడెంత దుష్టుఁడైనను మాతృప్రేమ దొడ్డదికదా! ఆతల్లి కొడుకాఁకలిగొనెనని మిడుకుచు మెత్తనిమాటలఁ బలుకుచుండ సిగ్గరియై దగ్గరకువచ్చినతనయున కన్నపానాదులొసఁగి పీటముపైఁ గూర్చుండఁజేసి వైదికధర్మ సమన్వితుఁజేయఁ దలఁచి తగురీతి మందలించినది. "ఇంటనెన్నడులేనియీహీనవిద్య యెన్నఁడభ్యాసమాయెరా కన్నతండ్రి!" అని ఒక్క మాటలో పూర్వగౌరవమును ఆతని చెడునడవడిని సూచించి—

శా॥ శేరా భోగపరాయణుల్ జగతిలో, లీలావినోదంబుగాఁ
బోరా వేశ్యలయిండ్లకుక్ వివిధ సం, భోగార్థులై గుట్టుతో
రారా వైదికధర్మమార్గ పథిక, ప్రావీణ్యముం జూపరా
యేరాతండ్రి పరిత్యజింతురటరా?, యీరీతి సత్కర్మముల్?

అన్నది. ఇంట వైదికధర్మమును నెఱపుచు వేశ్యావాటికలో గుట్టుగా విటధర్మమును జఱుపుమనుట యిచ్చట తల్లియుద్దేశ్యముకాదు. అమె సామాన్యముగానన్నది. "నాయనా యెందఱు భోగాసక్తులం లేరు? వారుగుట్టుగా వేశ్యలయిండ్లకేగివచ్చి ధర్మము ననుసరించుటలేదా? ఇట్లు సత్కర్మములు వీటి పుత్తురా?" అని. ఈమందలింపుచేత ఆతనిలోనొంత మార్పువచ్చినచోఁ దరువాత ఒండు రెండుపన్యాసములలో వానిఁ జక్కఁజేయవచ్చునని యామె తలంపు. లేకపూర్తిగా నిప్పుడే వేశ్యాసంగము మానుమన్నా కామాంధుఁడు తనమాట నాలకింపడని యాతల్లి యీమార్గము త్రొక్కినది, ఇదియెంతయు నుచితము. ఈరహస్యమును గ్రహింపక ఆతల్లికొడుకును గుట్టుగా వేశ్యలయిండ్లకు బొమ్మనదని భావించుట సహృదయధర్మముగాదు.

ఆమెయెన్నిమాటలు చెప్పినను గోడలిపై ననురక్తి గలిగించుట ప్రధాన ప్రయోజనముకావున ఆమె గుణశీల సౌందర్యములనుగూర్చి—

క॥ చక్కనిదికాదొ, మదిపెం పెక్కనయని కాదొ, కులసమీహితకాదో,
యక్కట యిన్నిగుణంబులఁ, జొక్కటమగుసతిని విడువఁజూతురె తండ్రీ!

క॥ రతిగదయాకృతి, మతిభారతిగద, హైమవతిగద నిరంతరసమ సం
భృతి, పతియందు నరుంధతిగద యిన్నియునుగలవు తావకసతికిన్.

తగుకీర్తిఁబొగడినది. "ఇదిమొదలు వారకాంతాసదన వ్యాపారచింత చాలించి సంసారస్థితి వదలక వైదికమణివై చరియింపుము"ని చెప్పి తనమంత్రము పాటించదనుకొన్నదా పిచ్చితల్లి. మొదట గుట్టుగా వేశ్యలయిండ్లకుఁబోయిరారా యన్నయామె యిపుడు వారకాంతాసదన వ్యాపారచింతయే చాలించుమన్నది. ఆమె హృదయము నిపుడైనను మనము గ్రహింపవచ్చును. మాతృబోధనాలించిన నిరంకుశుఁడు ఆమెమాటల నంగీకరించిన వాఁడువోలె మనస్సులో చంపకగంధిని ధ్యానించుచు మౌనమువూనెను. ఆతల్లి యాతని నలంకరించి కోడలి పడుకటింటికిఁ దీసికొనిపోయి సంసారము జరుపుకొనుము నాయనా యనినది. నిరంకుశుఁడానాఁడు ప్రొద్దుపోవుటంజేసి తలారులకు వెఱచి యెట్లో యింటనేయుండఁ దలంచినాఁడు.

కామోపవాసములచే కాఁగి కాఁగియున్న యాతని తరుణియు "జలకంబాడి మడుంగుగట్టి వరభూషాసంఘముల్ దాల్చి చెంగలువల్ గొప్పున గీలుగొల్పి" రతికాంతుతోఁ బాన్పుఁజేరవచ్చినది. వచ్చిననేమి? మాటా? పలుకా? పాపమాయిల్లాలు లజ్జాభయాభిమానములు ముప్పిరిగొనఁ దాంబూల మీయఁబోఁగా నాతఁడు దయావిహీనుఁడై యొకనిట్టూర్పుపుచ్చి యవ్వలిమోమయినాఁడు. అవును, వారాంగనాభోక్తకు కులసతులు రుచింతురామఱి? ఇక నీగృహిణి యేమిచేయును? శోకాగ్నిగుబ్బ తిలఁగా కామకేళివాంఛ చాలించి, చంపకగంధిని మెచ్చుకొనుచు విధిని దూఱుచు పాన్పునకు దగ్గఱగా నున్న నేలపై వికలచిత్తయై పండుకొన్నది. అంతఁ దెల్లవాఱుజామున నిరంకుశుఁడు మేల్కాంచి భార్యవద్దకేఁగి ముసుఁగుఁదీసి నల్లపూసాదిగా నామెనగలూల్చుకొని వేశ్యావాటికేగినాఁడు. చంపక గంధికి రాత్రినడచిన తెఱంగెఱింగించెను. నిరంకుశుఁడిట్లు చంపకగంధికి దాసుఁడై ధనమంతయుఁ గోలుపోయెను. చంపకగంధి చుట్టపక్కములుగూడ నీతని సర్వస్వమును దులిపివేసిరి.

సీ॥ అత్తవారిచ్చిన యపరజిగంటీలు, సంశయింపక వేగఁ జమునఁబెట్టె
తండ్రిచేయించిన దర్భాంగుళీయకం, బావృత్తిగాఁగఁ దానమ్ముకొనియె
మేనమామ ప్రియంబుతో నొసంగినపైఁ, మొలత్రాడు ప్రాంతియుప్పులకుఁ గట్టె
జననిచేయించిన జాళువాతాయెతుల్, వడ్డిలెక్కకుఁ జిందువందుచేసె

గీ॥ తులసిపోఁగులు మొదలుగాఁ గలుగువెట్టి, చిక్కుబాకీలు పిదప నిశ్శేషపఱచె
బ్రతిదినము దాని సంసారబాధలెల్ల, నెత్తుకెత్తుగ నడపె దుర్వృత్తి నతఁడు.

ఇప్పద్యమెంతయు హృద్యము. దీనినీనాఁటి కవులు కొందఱు పూర్తిగా ననుకరించిరి. ఇట్లు చేతికాసెల్లఁదుల్లఁజేసికొన్న నిరంకుశుని నింక వేశ్యమాత చేరనిచ్చునా? ఆమెవానిని "జేపర మేకా" అనిపింపనెంచి తనయౌద్ధత్యమును జూపినది. ఈసందర్భమున నిరంకుశుని కనేక కపటనీతులు బోధించినది. విటవ్యాపారమువాఁడు ఎందఱినేడ్పింపవలయునో చూడుఁడు_

సీ॥ కడుఁ బిన్నప్రాయమప్పుడ తాళిగట్టిన, కులము నిల్లాలెంత కుందవలయు?
పుట్టినిల్లని పెట్టుపోతలాసించిన, యక్కసెల్లెండ్రెంత యడలవలయు?

తనయుండు మాకు ముప్పునకందుననియున్న, తలిదండ్రులెంత చింతిలఁగవలయు?
అండజాండ్లకు నాసయైయుండు నితఁడని, సిక్కుబందుగులెంత పొక్కవలయు?

గీ॥ చల్లఁగాఁ జేతికాసెల్లదుల్లి పోనె, కాడనై యిఁకనైన నీకాఁపురంబు
బ్రదుకు పని విచారింపకీపనికిఁ జొరఁగ, బడినవానికి నెక్కడి భారబుద్ధి.

విత్తముడివోయినందున నిట్లాయాకీతులు బోధించి చివరకన్నది—

గీ॥ జపతపంబులుగావు శాస్త్రములుగావు, వేదములుగావు సత్క్రియావిధులుగావు
వైదికపు బాపలేడ భూవరకుమార, యోగ్యసౌభాగ్యలగువార యువతులేడ?

ఇట్లాతని మనస్సు నొవ్వనాడి తుదకు తన యభిప్రాయము తెలియపఱచినది—

గీ॥ చదువుకొన్నాఁడవటుమీఁద సరసముద్ర, కొంతయామీఁద భూసుర కులవరుండ
వయ్యయో నీవెఱుంగవే యర్థమీక, యూరకే పిల్చునే లంజవారి పడుచు.

అని వేశ్యమాతయౌద్ధత్యమును నిరంకుశుఁడు సహింపలేక పోయినాఁడు. మీఁదుమిక్కిలియామె తన్ను కొట్టుననియు భయపడినాఁడు. అట్లు భయపడి పలాయనమంత్రము పఠించెను. ఇట్లు పర్వెత్తిన యాతఁడు నాలుగుకాసులు సంపాదించుకొని మఱల వేశ్యాంగనదరిఁ జేరునేమోయని మనము భావింతుము. కాని అట్లొనర్చినచో కథలో కల్పన లోపించినదగును. పాఠకులదృష్టిని కథ ఆకర్షింపలేనిదగును. కవి ప్రతిభగాని, కావ్యనాయకుని చాతుర్యముగాని వ్యక్తముకానిదగును. అందుకని కవి యీభూలోక వృత్తాంతమునకు స్వర్గసంబంధమును గల్పించి నిరంకుశుని కాముకతా ప్రౌఢిమను, లోకోత్తర ప్రతిభనుజాటుచు పాఠకుల నాశ్చర్యచకితులనొనర్చి తుట్టతుదవఱకుఁ గథ చదువకుండ వదలనట్లు చేయుచున్నాఁడు. ఈ ఘట్టములో నీకల్పన మద్భుతమైనది. కవి ప్రతిభకిది యొఱపిడిరాయి. నిరంకుశునకు భోగలాలసత తగ్గలేదు. మాణిక్యపురమునఁ దనయాటలు సాఁగనందున నాతఁడీశ్వర సంఘటనముగా నెట్టి సహాయసంపదలు వెంటఁదీసికొనక యొక ఘోరారణ్యమున కేగినాఁడు. అట నొక పాడుగుడి యగపడినది. అందొక శివలింగముం జూచినాఁడు. మన కావ్యనాయకుఁడు జారత్వములోవలె జూదమునందును మేటియే. కావున శివునే సత్తమాడఁ బిలిచినాఁడు. ఇరువురి పందెములును దానయొడ్డుచు ఓడినవారు గెలిచినవారికి లంజెనిచ్చు పన్నిదముతో ఆటకుఁబూనినాఁడు. దైవగతిచే గెలుపు నిరంకుశునిదేయైనది. ఇఁకనేమి? తానుజేసిన ప్రతిజ్ఞననుసరించి లంజెనిమ్మని పట్టుపట్టినాఁడు. అయిననెవ్వతెయో యీవిటి? లోగడతాననుభవించినవారవనితలలోనొకటియా? లేకచంపకగంధియా? ఇంకక్రొత్తపడుచా? భూలోకముననున్న విలాసవతుల శృంగారములు తనకుభుక్తప్రాయములే. అందును సకలవిద్యావిశారదయగుచంపకగంధిశృంగారమును జవిచూచిన తనకు పెఱవనితలునచ్చుదురా! అదియుంగాక తానిపుడు శివునంతవాని నోడించినాఁడు. మర్త్యాంగనలనిమ్మని యేల కోరవలయును? నాకవనితలతోడి సౌఖ్యమెట్లుండునో ఈశరీరముతోన యనుభవింపవలయును. సముద్రమున మునిఁగి కాకిచిప్పలేరుకొనుట నీతియా? నవరత్నములను బొందుట లెస్సయా? అందుకని నలకూబరు నంతవాఁడేరికోరివరించిన త్రిభువనాశ్చర్య సౌందర్యవతియగురంభనిమ్మని కోరినాఁడు. పెద్దనగారిప్రవరుఁడు చేజిక్కిన సశరీర స్వర్గమును గాలఁదన్నిన విరాగి. రుద్రయ్యగారి నిరంకుశుఁడు సశరీర స్వర్గసుఖమును జవిచూడ నిచ్చగించిన మహాభోగి. ఈ భోగవాంఛతో కథ స్వర్గమునకుఁ బ్రాకినది. నిజముగాఁ జెప్పవలయునన్న స్వర్గమునే భూతలమునకు దింపించవలయును. లేకున్న రంభాసంభోగమునకై నిరంకుశుఁడే కామగమనమునుపొంది నాకమునకు నడువవలసివచ్చును. అట్లుచేసినచో రంభకు శాపమును, తద్విముక్తిని గల్పించి నాయకుని మహిమను విస్తరించుటకు వీలుండదు. కావున నీమహాకవి యిమ్మార్గమును ద్రొక్కినాడు. సెబాస్! కల్పనయన్న నిట్లుండవలయును.

నిరంకుశుఁడెంత మొత్తుకొన్నను శివుఁడు పలుకలేదు. చివరి కాతఁడు మోటుఁదనమునకు దిగి తనయుత్తరీయమును లింగమునకు వేసి లాగఁబూనినాఁడు. సత్యశీలుఁడగు శంకరుఁ డీతని తెగువకు మెచ్చి వృషారూఢుడై దర్శనమిచ్చెను ఆయనవెంట బ్రహ్మ విష్ణ్వింద్రాదులును వచ్చిరి. ఈ దేవగణమును గాంచి నిరంకుశుఁడు భయభ్రాంతుఁడై "శంకరా! లక్ష్మీపతిసేవ్యమానమగు నీరూపము గన్నంత నాపాపము లోపమైనది. కావున నీపదపద్మములయందు నన్నుజేర్చుకొని రక్షింపు" మన్నాఁడు. శివుఁడందు కంగీకరింపలేదు. నేనొసఁగినదానినే యిత్తుఁగాని నొండీయననినాఁడు. నిరంకుశుఁ డందుకొప్పుకొనక తప్పెడిదేమి? అయినను యుక్తిగా "నిన్ను జూచినపిమ్మట మోక్షమున కనుమానమా?" యని పెక్కుభంగుల శివునిస్తుతించెను. అంత శివుఁడింద్రునితోఁ జెప్పి నిరంకుశునికి రంభనిప్పించెను. ఇంద్రుడొకసారి విప్రునకు కౌఁగిలిచ్చిరమ్మని రంభ కాజ్ఞ యొసంగినాడు. దేవతాగణ మంతర్ధానమైనది.

రంభా నిరంకుశు లావనములలోనే విహరించుచుండిరి. నిరంకుశుని లోకోత్తర సంభోగకళాతిరేకమునకుఁ దనిసిన రంభ మనసుండఁబట్టలేక—

క॥ ఈతీరున సుకృతనయుల, చేతను దనియంగనేరఁ జెప్పెడిదేమీ
రాతిరి పగలై పగలే, రాతిరియై వెలయుచుండె రతిపరవశతన్.

క॥ మనసిజకేళికి భూసుర, తనయా నీసాటిరారు దలఁపఁగ నేలా
యనరాదుగాని దాసులు, వినుమీ నలకూబరాది విజయవిశాలుల్.

అని వానిం బొగడినది. ఆతఁడంత కామకళాపండితుఁడు గావుననే రంభను గోరినాఁడు. కోరి దాని మనస్సునాకర్షించికరగించినాఁడు. ఇట్లు దేవతరుణీలలామచేత మానవుల సురతకళాపాండిత్యము నగ్గింపఁజేసి కవి మనుష్యజగత్తునకు విశిష్టతను సూచించినాఁడు. అసలు ఒకజాతికి మఱొకజాతిమీఁదనే మక్కువయెక్కువగానుండునేమో! మానవస్త్రీయగునహల్యగూడ దేవేంద్రుఁడు తన్నుగలియవచ్చినపుడు దేవసంభోగ ప్రీతిచే లొంగిపోయినదని వాల్మీకి వ్రాసియున్నాడు. (మతించకారదుర్మేధా దేవరాజకుతూహలాత్,) మనరుద్రయ్య వాల్మీకి యభిప్రాయమునకుఁ బ్రతీకారముగా మనుష్యభోగముగూడ లెస్సయినదేయని నిరూపించుటకే వర్ణనము చేసినాఁడో! ఎట్లయినను నిది ప్రశంసనీయమే. కళాపూర్ణోదయములో మణికంధరుని గలసినరంభ ఆతనిమది చివుక్కురుమనునట్లు "నలకూబర విడువిడురా యలసితినని" మన్మధవివశయై పలికినది. మణికంధరుని గలసికొన్నను నలకూబరుఁడే ఆమెచిత్తములో నున్నాఁడన్నమాట. అతని సంభోగమే ఆమెకు ప్రీతికరమైనది కనుకనే సంభోగసమయమున దనకిష్టుఁడైన నాయకునే స్మరించినది. ఇక్కడనో, కవి నలకూబరాదులు దాసులని ఆ నాలుకచేతనే చెప్పించి మానవజగమునకు వాటిల్లిన లోటును దీర్చినాఁడు.

ఇఁక నాయరణ్యములోనే వారినుంచినచో రంభ కాఁకలిదప్పులు లేకున్నను నిరంకుశుని కున్నవి. కావున వారినొక నగరమునకుఁ జేర్చినాఁడు కవి. అది యుపమాశూన్యమగు నరిందమునిపురము. రంభమాత్రమపుడపుడు స్వర్గమునకుఁ బోవుచు వచ్చుచునే యున్నది. ఒకనాఁడు వీరిరువురు పురమునకు వెలుపలి యుద్యానకుఁ బోయినారు. యిష్టభోగములఁ దృప్తులయినారు. తమచేతలకుఁ దామె నవ్వుకొనుచున్నారు. అపుడు రంభ—

ఉ॥ జారిన కుంతలంబులు పొ, సంగఁగ దువ్వుచుఁ జల్వపయ్యెదన్
దోరపుఘర్మబిందువులు, దూలఁగ వీవుచు వీడియంబుక
ర్పూరపువాసనల్ దిశలఁ, బొల్పడనించి మనోభవాహవో
దారకళా విశారదుఁడ, వౌదువురాయని తన్నుమెచ్చుచో.

నభోమార్గమున నేగు నారదుడు చూచినాఁడు, కామకేళి పరతంత్రుఁడైయున్న నిరంకుశుని తెలివి కుంటువడ్డదిగాఁబోలు "రంభా! ఆకాశవీధి నేగునాతఁ డెవ్వఁడని" యడిగినాడు. ఆమాటచే నీవనిత రంభ యనియు వాఁడు నిరంకుశుఁడనియు మానికిఁ దెలియకుండునా? రంభ మాటాడవలదని నిరంకుశుని కన్నుగీటినది. పైపెచ్చు నారదునికి నమస్కారములేదు, పురస్కారము లేదు. ఆతఁడలిగి కలహభోజనుఁడు గావున నీసంగతి నింద్రునితోఁ జెప్పి రంభ మదమడంప తంత్రము దొరకినదని నాకమునకేఁగినాఁడు. ఇక్కడ రంభయు నిరంకుశుని మందలించి యిది యింద్రుఁడువిన్న చేటుమూడునని యెంచి తానును దేవలోకమునకేగి లజ్జాభయభక్తులతో నింద్రునికి నమస్కరించి యొదిగినిలిచినది. ఇఁక ముందటికథ వినుటకుఁ బాఠకులెంతయుఁ దొందరించుచుందురు. శాపమువచ్చునని సామాన్యముగాఁ దెలిసియున్నను అదెట్టి శాపమో, తన్నివృత్తియెట్లో, అది ప్రధానకథతో నెట్లు కలియునో యని మనకు వేగిరపాటెక్కువగుచుండును. ఇంద్రుఁడును రంభను మందలించి—

ఆ॥ చంచలింపకిట్టి సాహసకృత్యంబు, చేసినావుగాన నోసి! పోయి
భయదరూపమైన పాషాణమై పుట్టు పల్లవుఁడు వసించు పట్టణమున.

అని శపించినాఁడు. శాపములు, వరములు, మహిమలు కథలు నడుచుటకును సంవిధానములు సృష్టించుకొనుటకును చక్కనియుపాయములు. వీనిసాయమున నెంతలేసి పనులయినను సాధ్యములగునుగదా! సరే! ఈ శాపమున కంతమేమి? అది తుమురై ధరణిఁబడుట. ఇట్టిశాపమున కంతముండదని రంభ తలఁచినది. తానొక పెనుగొండకావలయును. అది యెన్నటికిఁ బగులగొట్టఁబడి దుమ్మగును? రంభ దుఃఖమణచుకొనలేక పోయినది. నిరంకుశునివద్దకువచ్చి సొలవక యేడ్చినది. ఆతఁడును రంభకు ధైర్యముచెప్పి నీవు జాయివగుము. పైపని నేను చూచుకొందునన్నాడు. సరే. రంభ నూరుతాళ్ళ ప్రమాణమగు పాషాణమైనది. దానింజూడ పౌరులెల్లరు గుంపులుగూడి వచ్చిరి. ఇదియేదో కీడుమూడఁ జేయు దుర్నిమిత్తమని భావించిరి. కాకున్న, నిన్నటివరకేమియు లేదాయె, నేఁడిదియేమి వింత! ఆ వింతనుగాంచ మంత్రివర్గముతో రాజుగారుగూడ వచ్చినారు. పాపమా పిటికిరాజునకు పెనుశిలను జూడఁగనే జడుపుదయించినది. వెంటనే చేరువనున్న రావిచెట్టుమీఁది బ్రహ్మరాక్షసుఁడు సందు చేసుకొని భూపతి నావేశించినాఁడు. శాపమోక్షమునకు మార్గమెట్లేర్పడుచున్నదో చూడుఁడు. మాంత్రికులు వచ్చిరి. మంత్రములు ప్రయోగించిరి. భూతముమాత్రము వదలలేదు. అందఱిని దిట్టియుఁ గొట్టియుఁ బంపుచున్నది బ్రహ్మరక్షస్సు. ఈ సంగతి నిరంకుశునికిఁ దెలిసినది. అతఁడు మంత్రులవద్దకు వచ్చి తనకొక దైవలీలగలదనిచెప్పి, నిట్టూర్పుపుచ్చి ఆవులించి దేవతయావేశించినట్లభినయించి—

గీ॥ ఇప్పుడ్డుబుట్టిన పాషాణమెల్లఁగొట్టి, తుమురుగాఁజేసి ధరణిపైఁ దూడ్చిపెత్త
రాజుఁబట్టిన యాబ్రహ్మరాక్షసుండు, విడుచుఁగాని మారేమిట విడువఁడని" నాడు.

ఆపన్నులకాగాములు తోఁచవుగదా! మంత్రులట్లే చేయించిరి. కొండపిండియగునప్పటి కందుండి—

సీ॥ గబ్బిగుబ్బలమీఁది కస్తూరికాపంక, మాణిముత్తెపుసౌర్ల నంటుకొనఁగ
జాళువాబంగారు జలపోతకుచ్చుపై, నొడిదారములకాంతి జడికొనంగ
కులుకుఁజెక్కులలోన గురివెంద తాటంక, రోచులు దాఁగిలి ముచ్చులాడ
ఉడురాజుచెంగట నున్నరోహిణిమాడ్కి, మోముపై ముంగర ముత్యమలర

గీ॥ కాలఘునశిల్ప కైశికా కల్పకల్ప, పుష్పగంధంబు దిక్కులఁ బుగులుకొనఁగ
వెలఁది పాషాణచూర్ణంబు వెడలి నాఁడు, కడలిలోపలఁ బుట్టినక్రమమున...".

రంభయుదయించినది. ఇందు కవివర్ణించిన రంభ పొలుపద్భుతము. రంభ శాపము తీఱినది. మఱి రాజుగతియో! శాపముక్తిఁబొందిన రంభ నిరంకుశుని సంభావించి స్వర్గమునకేగినది. ఇంద్రుఁడామె శాపము ననుభవింపలేదని తలంచి యాగ్రహించినాఁడు. రంభ గడచినవృత్తాంతమును వినిపించెను. ఇంద్రుడాశ్చర్య చకితుఁడై సొగటాలాడి హరుంజయించిన వానికిదియొక లెక్కకాదనిభావించి వానింజూడ నైరావతమునెక్కి ధాత్రికేతెంచినాడు. ఆయనవెంట దేవలోకమంతయుఁ గదలినది. ఇంద్రుఁడు నిరంకుశునిగాంచి మెచ్చుకొని వలసిన వరము వేడుకొమ్మన్నాడు. నిరంకుశుఁడు రాజును గ్రహనిర్ముక్తుఁజేయ వేఁడెను. అదెంతపనియని యట్లుచేసి యింద్రుడింకొకవరము వేడుకొమ్మనెను. సందుదొరకినదని సంతసించిన నిరంకుశుఁడు తనకు రంభమీద కామముచల్లారనందున నాసారసగంధినే తనకిమ్మని ప్రార్థించెను. ఇంద్రుడందుకు సమ్మతించి దివిజకాంతలు వసుధాస్థలి నుండరాదని సాకు చెప్పి వచ్చుచుఁ బోవుచునుండుననియు, పూర్వపురీతినే భోగముఁ జేకొనుమనియు ననుగ్రహించెను.

కవి యిట్లు రంభకుఁ దగినశాపమును గల్పించి ఆ శాపమునకు విముక్తి సంపాదింప బ్రహ్మరక్షస్సును సృష్టించియు, దానిని వదలింప యింద్రునే భూతలమునకు దింపియు నద్భుతమగు కల్పనాచాతురిం బ్రకటించినాడు. తుదకు నిరంకుశుని మఱల గృహధర్మమును నిర్వహింపఁజేసి సంతానవంతు నొనర్చి యాదర్శమునుగూడఁ జాటెను.

## ఒక్క యసంగతి

ఇంత హృద్యమగుకథలో-రమణీయమగు కల్పనలోనొకయసంగతి కన్పట్టుచున్నది. తృతీయాశ్వాసముచివర రంభానిరంకుశులు ఉపవనమును బోలినయొకకానలో విహారపరవశులై యుండిరని వర్ణింపఁబడినది. ఆసమయముననే రంభ నిరంకుశుని సురతకళా పాండితికలరి "మనసిజకేళికి భూసురతనయా నీసాటిరారు." అని ప్రశంసించినది. ఆమాటలు నారదుఁడు వినలేదు. తరువాతవారు ఆవిపులారణ్యము చెంగటనుపమాశూన్యమగు నొక పురముగాంచిరి. అదియే అరిందమునిపట్టణము. అటనుండి యొకనాఁడు తనతోఁ గ్రీడింప తిదివంబుననుండి వచ్చిన యనిమిషాంగనతోగూడి యాతఁడు పురమునకు వెలుపలనున్న యొకయుద్యానమునకు వచ్చెను. అప్పటి రంభానిరంకుశుల విహారములో రంభ "మనోభవాహవోదార కళావిశారదుఁడ" వౌదువని నిరంకుశుని మెచ్చుకొన్నది. ఈమెచ్చుకోలును మింటనేగు నారదుడు విన్నాఁడు. నారదుడు విన్నప్పుడు రంభ నలకూబరాదులు దాసులనియనలేదు. కాఁగా నారదుఁడు సురపురికేతెంచి యింద్రునితో— "సురతనయుల సురభోగము నిరసింపఁగవింటి దానినేమనఁగలమో సురనాథ" అనియు, "మననలకూబరాదు లవమానమునందెదరంచుఁ బల్కెనో యనిమిషలోకనాథ, యదియాధరణీసుర పుత్రుతోడనాడిన వచనంబులెల్లఁ బ్రకటింపను వానినిబైటఁ బెట్టఁగా మునులకు మాకునేల" అనియు పలికినాఁడు. నారదుఁడీ మాటలెప్పుడు విన్నాఁడు?

నారదుఁడు విన్నప్పుడుగూడ రంభ మఱల పూర్వపాఠమునే యేకరువుపెట్టెనని సమాధానము చెప్పుకొనవలయునా? నారదుఁడువిన్నప్పుడు రంభయన్నమాటమనమెఱిగినంతలో "మనోభవాహవోదారకళావిశారదుఁడవౌదు" వనునదియే కావున నీయసంగతిమాత్రము వారింపరాకున్నది. వారింపవలెనన్న పూర్వవచనము లన్నియు నామె యిప్పుడుగూడ నన్నట్లూహించుటకన్న గత్యంతరములేదు. ఇది యెంతవఱకు సమంజసము? అంతమాత్రముచేత కథాకల్పన లోపభూయిష్ఠమనఁగాదుగాని మహాకవుల విషయమున నట్టివుండుట యోగ్యముగాదు. దీనికి "ఏకోహిదోషోగుణ సన్నిపాతేనిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అనుకొందము.

కవి యీకావ్యమును సమస్త రసనిస్తంద్రముచేయ నెంచినాఁడు. కాని అదియట్లు కాలేదు. ఇందుప్రధానరసము శృంగారము. అది చంపకగంధి నిరంకుశులయెడను, అంతకన్న రంభానిరంకుశుల

విషయమునను సముజ్జ్వలముగాఁ బరిపుష్టమయినది. ఈశృంగారమున కాలంబనములయిన యిరువురి నాయికలలో రంభ అగ్రేసర. ఈ మెసంగతి తరువాత ముచ్చటింతము. రంభకుశాపము సంప్రాప్తమయి నప్పుడొకింత కరుణమును, తరువాత నొకింతయద్భుతరసమును నీకావ్యమునఁగలవు. నిరంకుశుని భార్యయు కొలది కరుణము నగపఱచినది. నిరంకుశుఁడు సొగటాలాడి శివునిగెలిచి తన మనోరథమును బండించు కొనుటయు నద్భుతమే. ఆతని శివస్తుతిశాంతము ఇట్లటనటఁ బ్రసక్తములైన కరుణాద్భుతములు రెండును సంగభూతములై ప్రధానమైన శృంగారమునకే పరిపుష్టినిచ్చినవనవలయును.

## కవిత్వము

ఈకవి కృష్ణదేవరాయల యాస్థానములో నష్టదిగ్గజములలో నొక్కరుఁడుగా నుండఁదగిన యర్హత సంపూర్ణముగాఁ గలవాఁడని ఈకావ్యముచెప్పుచున్నది. దీర్ఘదీర్ఘసమాసములతోడను, అలఁతి యలంతి పదములతోడను గూడ నీతఁడు కవిత్వమల్లి, సహృదయుల మెప్పింపఁగలడనుట కింద నేక దృష్టాంతములున్నవి. అఖండమగు వ్యాకరణశాస్త్ర పాండితి యీకవికిఁగలదు. వేదశాస్త్రాదులయం దీతని కపారమగు ప్రవేశమున్నట్లు పెక్కుఘట్టములు సాక్ష్యమిచ్చుచున్నవి. శ్రీనాథునినాఁటి నుండియు తెలుఁగుకవిత్వము సంస్కృతభాషా ప్రచురమయినది. తిక్కయజ్వనాటి తెలుఁగు కులుకు తరువాతఁగానము. పోతన సోమనాదులు కొంత తెలుగుఁదనమును వెలయించిరి. కృష్ణరాయల ప్రబంధ యుగముగూడ మఱల సంస్కృతభూయిష్ఠ రచనకే పట్టాభిషేకమొనర్చెను. రాయలుమాత్రమాముక్త మాల్యదలోఁ దెలుఁగుఁదనమును నింప యత్నించినాఁడు. రుద్రయ్యయు సమకాలీనప్రభావమునకు లోఁగక దప్పదయ్యెను అయినను తెలుఁగుపలుకుల కులుకును ఆవసరమయినపట్టుల నీతఁడువెలయించె ననుట కనేకపద్యము లుదాహరింపవచ్చును. తెలుఁగుసొగసును గుర్తించి దానినింపుమెయి కావ్యమున నిముడ్చుకొనకున్న నాకావ్యమును తెలుగు గబ్బమనుట వింతగానుండును. తెలుఁగుఁదనములో హొయలుగులుకు రుద్రయ్యపద్యములు 2 వ యాశ్వాసములో 10, 21, 74, 116, 128, 129 నాల్గవ యాశ్వాసములో 39 మొదలగు సంఖ్యలవిచూడఁదగినవి. శృంగారరసమును వర్ణించుచున్నట్లున్న దిగువ పద్యముల నుదాహరింపకుండఁజాల—

సీ॥ జోటజోటఁ గురియునో జుంటితేనియ మోవి, నొదవునో జాబిల్లి కొదమ నుదుట
విసరునో శృంగార రసవృష్టికొప్పునఁ, దొలఁకునో యమృతంబు పలుకులందు
రాలునో కుముదపత్త్రిములు చూపులయందు, వెడలునో సింగిణి విండ్లుబొమల
వెల్లఁబెట్టునో పూర్ణవిధుకాంతి మొగమున, దిగఁబాఱునో పైఁడి తెలివిమేన

గీ॥ వెడలఁబొంగునొ చెక్కులవిమలరత్న. దర్పణద్యోత నిగనిగల్ తఱచుగాఁగ
జోడుకూడి చెలంగునోచూడఁ జూడ, గబ్బిగుబ్బలఁ గోడె జక్కవలకవలు.

ఇది శాపవిముక్తింగన్న రంభ చెలువమును వర్ణించుపద్యము. ఇందు తెలుగుసొగసు పిక్కటిల్ల రంభ సౌందర్యము చవులూరించుచున్నది. ఇట్టిదే మఱొక్కపద్యము.

ఉ॥ గుత్తపుగుబ్బలాడి, సుమకోమలి, ముద్దులగుమ్మ, మల్లెపూ
గుత్తి, మెఱుంగుఁదీఁగె, లతకూన, మనోజురవాళి, జాళువా
ముత్తెపుఁగోల, చంద్రకళ, మోహనమంత్రము, కాంతిరాశి యీ
పుత్తడి బొమ్మయేకరణిఁ, బుట్టెనొకో యుపలంపుధూళిలో!

కాళిదాస మహాకవీంద్రుని "అనాఘ్రాతంపుష్ప" మనుపద్యమువలె నిదియు ధ్వనిప్రధానమై రుద్రయ్యకవితా సామర్థ్యమునకు నికషోపలమై యొప్పుచున్నది. ఎంతటి దీర్ఘసమాసములనుగాని సృష్టించి, పద్యమునకు నగ్దమునకుఁ జెలువమును ఘటించి పఠితల నాకర్షించు నేర్పు కవికి వలసినంత యున్నది. ఇట్టి సంస్కృతభూయిష్ఠ రచనకు ప్రథమాశ్వాసములోని 29,44,62, తృతీయాశ్వాసములోని 5,52, చతుర్థాశ్వాసములోని 5,7,37 సంఖ్యలపద్యము లారయఁదగినవి. తెలుగున పెద్దన్నతోఁ బ్రారంభమయిన రతివర్ణనము నాయాకవీశ్వరులు ననుకరించి చేయుచునేవచ్చిరి. రుద్రయ్యయు రతివర్ణనమును "వదనచత్వర విసృత్వర" అనుపద్యములో సంప్రదాయము చెడకుండఁజేసినాఁడు. మొత్తముమీఁద నీకవి యద్భుతమగు కవితాప్రతిభ గలవాఁడు. ఔచిత్యమును గుర్తెఱింగిన యీకవి శబ్దార్థాలంకారాదుల నుపయోగించుటలో పిచ్చిపోకడపోఁడు. ఈతఁడుపయోగించిన యలంకారములు, ఉపమ, అతిశయోక్తి, అర్థాంతరన్యాసము, కావ్యలింగము, ఉత్ప్రేక్ష, దృష్టాంతము మున్నగుప్రసిద్ధములు కొన్నిమాత్రమే. తనకృతికన్య "సముజ్వాలాలంక్రియాభిరామ"మని చెప్పుకొన్నను ఈతఁడు మఱుగులతెరబడి సొమ్ములతో నాకన్నెను వికృతమొనర్పలేదు. "ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్యజీవితం" అన్న క్షేమేంద్రుని సూక్తిని జీర్ణింపజేసికొన్న యీకవి వర్ణనాదులలో చక్కఁగా నౌచితినిపాటించి ఆయా పాత్రములను బోషించినాఁడు. శృంగారానుగుణమైన కైశికీవృత్తిలో ద్రాక్షాపాక శోభితమైన కవనమునల్లి, రసానుగుణరచనమునుజేసి యీతఁడు కవులకు మార్గదర్శకుఁడాయెను. కావుననే తనకృతి "కోమలవర్ణధామయును కోవిదసంస్తవనీయ" అని యీతఁడు చెప్పుకొనగలిగెను. రుద్రుని కవితలోని వర్ణనములు నిజముగా కోమలములే. ఆతని కృతియును గోవిదసంస్తవనీయయె.

## పాత్రచిత్రణాదులు

ఈ కవి కథాసంవిధానమునను గల్పించుటయందువలెనే ఆయా పాత్రలను జిత్రించి వారిస్వభావాదులను దిద్దితీర్చుటలోను, ఆయా సందర్భములందు రసభావానుగుణమగు వర్ణనలు వర్ణించుటలోను సిద్ధహస్తుఁడు. వర్ణింపఁబోవు కథకు బీజభూతములగు విషయములనీతఁడు ముమ్మొందుగనే సూచించి పాఠకులకుత్కంఠఁ బెంచును. మాణిక్యపురమును వర్ణించునపు డీతఁడు వేశ్యలను వర్ణించినాఁడు. ఈవేశ్యావర్ణనము కావ్యమాత్ర సాధారణమైనను తన కృతిలోని నాయకునకు వారు పరమాదర పాత్రములుగాఁగాన వారిని రెండుపద్యములలో నింపుమీఱ వర్ణించెను. "చెక్కుటద్దములపైఁ జిఱువ్వుచినుకులు వాఱమావిచలించు పాటపలుకు" నా వెల వెలందులు "కచభార కుచభార కటిభారములచేత కాయంబుత్రైభంగికంబుగాఁగ" నిలిచినారఁట. ఏమి యీ త్రైభంగికము సొంపు? వీరియందెంతగా నింపుసొంపులు పొంపిరివోవకున్న మన నిరంకుశుఁడు వీరిని వదలకుండును? కవి యీ యొక్కపద్యముతో వారిని విడువడయ్యెను.—

ఉ॥ ఒక్కొకవేళ దేవపతియొద్దకు నారదుఁ డేగుదెంచి యా
జక్కవగబ్బిగుబ్బెతల చక్కఁదనంబును, నాట్యవిద్యయున్
జక్కవసేఁతలున్ విటులమక్కమెఱుంగుటలున్ గణింపఁగా
గ్రక్కున దేవలోక గణికల్ తలవంతురు సిగ్గుపెంపునన్

దేవవేశ్యలకుగూడ సిగ్గుగలిగించు వారుగావుననే యీ వేశ్యలను మఱగి నిరంకుశుఁడు భార్యానురాగమునుగూడ వీడినాఁడు కాఁబోలును. ఈ వేశ్యల వర్ణనలో నారదుని ప్రసక్తియేలనో? రానున్న కథలోఁగూడ నారదుఁడు స్వర్గమునకేఁగి రంభవృత్తాంతమును వినుచునుగావున కవివాని నిక్కడనే పాఠకుల దృష్టిపథమునఁ బడవేయుచున్నాఁడు. అట్లే నిరంకుశుని తల్లినిగూడ కవి ముందు

గనే పాఠకులకుఁ బరిచయముచేయును. ఈమె ప్రవరుని భార్యవలెనే అతిథిసంతర్పణ పరాయణ. ప్రతివారము భక్ష్యభోజ్యముల నమర్చి వచ్చువారికి వడ్డింప నలసటలేని యిల్లాలు. ఇంకను గుటుంబ ములోని కష్టసుఖములలో భర్తతోఁ బాలుపంచుకొను నుత్తమాంగన. కావుననే కోడలిప్రేరేపణమునఁ గొడుకును చక్కఁగా మందలించినది. ఆ మందలింపుగూడ నెంతసుకుమారముగ! ఎంతసహజముగ! ఈమె కల్పితగుణములులేని సామాన్యసంసారిణి. ఈయత్తకుఁ దగినకోడలే దొరికినది. నిగమశర్మభార్య వలెఁగాక యీమె యథాశక్తిమెలఁగి మగనిని సన్మార్గమునకుఁ ద్రిప్పుకొని సంసారమును జక్కఁజేసి కొనఁ బ్రయత్నించినది. అత్తగారిద్వారా కార్యము సాధింపఁజూచినది. కాని ఫలములేదు. ఈకోడలి పాత్రమును జిత్రించుటలో కవి కృతకృత్యుఁడయినాఁడనవలయును. పతివ్రతా ధర్మమని మగఁడెట్లు చేసినను మూగమొద్దువలెనుండి కర్తవ్యమును విస్మరింపక యీమె తనుకీర్తినొందుట యెంతయొప్పి యున్నది! ఈమె అంతమూఁగగాని, అంతవాగగానికాక నేటి యిల్లాండ్రకును నాదర్శభూతురాలయిన దనవచ్చును.

ఈకావ్యములో వేశ్యమాతసృష్టి అద్భుతము— అసదృశమును. పాఠకుల మనస్సులకు వేశ్యలపై రోఁతఁబుట్టించుటకును, తన కావ్యకథానాయకునికి గలిగిన విఘ్నమును నిరూపించుటకును కవి దీనిని లోకోత్తరముగాఁ సృష్టించినాఁడు. ఆమె నేడెనిమిది పద్యములలో వర్ణించి యామె దుష్టత్వమును బెక్కుతెఱంగులఁ బ్రకటించెను. ఈదిగువపద్యము నొక్కదానిని గమనించినచో వేశ్యామాతల క్రూర స్వభావము సుస్పష్టమగును.

సీ॥ కాలకూటమునందుఁగల మేలు విసమెల్ల, రాలలోఁగల్గు కార్కశ్యమెల్లఁ
పైశాచసమితిలోపలి వికారంబెల్లఁ, గపికోటిలోనుండు కాంక్షలెల్ల
సెలయేళ్లలోన వర్తిలెడు వక్రతలెల్ల, మయశంబరులలోని మాయలెల్ల
ధార్తరాష్ట్రులలోనఁ దనరు మత్సరమెల్లఁ, బంచపాతకులలోఁ బాపమెల్ల

గీ॥ దీసి విటదోషరాశిచే ద్విగుణిఁజేసి, యనృతపంకంబులోఁ గల్పి యశుచిభావ
రసముఁ జిల్కించి నిర్మించె బ్రహ్మకృపణ, తరుణహృద్భల్లియగు లంజతల్లిగాఁగ.

ఈమెను బ్రహ్మయెట్లు సృష్టించినను కవిబ్రహ్మమాత్రముదారుణముగనే సృష్టించినాఁడు. ఇది నిజముగా విటులప్రాణములుగొను రాక్షసియే. రంభనుదీర్చుటలోను, ఆమె యనురాగమును వ్యక్త పఱుచుటలోను గవికి ప్రత్యేకోద్దేశ్యమున్నట్లున్నది. నిరంకుశుని సురత చాతుర్యమునకు రంభలోఁబడి పోయినది. కావుననే యింద్రుఁడు ఒకసారి విప్రునికి కౌఁగిలిచ్చి రమ్మనిచెప్పినను చాటుగనో మాటుగనో "పదే పదే" యామె నిరంకుశునిగలయవచ్చి తుదకు భయంకర శాపమునకును గుఱియైనది. ఇట్లు చేయుటకామెకును నిరంకుశునకును శరీరములతోఁబాటు మనస్సులునుగలియుటయే కారణము. ఆసంగతి నామె.

"వనితకు నిన్నువంటి మగవాని కవుంగిలి గల్గుటల్ మనం
బునఁదలపోయఁ బూర్వకృతపుణ్య విపాకముగాక కొంచెమే."

క॥ తనువుం దనువుం గూడుట, ఘనతర సంసర్గఫలముగాదు తలంపన్
మనమున్ మనముం గూడుట, యనుపమ సంసర్గమహిమ యవని సురేంద్రా!

క॥ అదిగాక మనకు మదియున్,
మదియుం గలసినది యింక మఱపులు గలవే ?

క॥ అనిపలికి ధారణీసుర, తనయాగ్రణి! పూర్వమైనదయఁ దప్పకుమీ
నిను మఱవ నేనెవత్తున్, గనియుఁ గనకుండగా నొకానొక వేళన్.

అని వ్యక్తముచేసినది. రంభమనస్సు నింతగా కవి తనకావ్యనాయకునిపై ననురక్తముచేయుటఁ జూడ మనస్సులుగలసిన ప్రేమయే మహనీయమనియు, నట్టిది సర్వసాధారణము కాదనియుఁ దెలుప నెంచినట్లున్నది. నిరంకుశుఁడింతవఱ కనుభవించిన వేశ్యాసంగమసుఖము నిష్కళంకముగాదు. వారు స్వార్థముతో నీతనిఁజేరఁబట్టిరి. ఇప్పుడు రంభయో యీతనిలోని విశేషము నెఱింగి నిర్వ్యాజముగా వీనిని బ్రేమించుచున్నది. కనుకనే వారికి మనస్సులును గలసినవి. దేవతలకంట దుమ్ముచల్లియైనను అప్పుడప్పుడు దాను దన నాయకుని గలయవత్తుననుట సామాన్యమా మఱి ?

ఈకావ్యమునకు మనుచరిత్రముతోఁ గొన్ని పోలికలున్నవి. కథలోఁగాకపోయినను పెక్కువిషయముల దానిని మించవలయునని యీకవి తలంచినట్లున్నది. అట్టిప్రయత్న మీకావ్యరచనములో నున్నదని నిరూపింపవచ్చును. మనుచరిత్రములోని స్వరోచి మనోరమాదులగు మువ్వురు భార్యలతో విహరించునప్పుడు చక్రవాకదంపతులు వారిప్రేమనుగూర్చి చర్చించి తుట్టతుదకిట్లు తేల్చుకొన్నవి.

ఆ॥ తగులు సెప్పఁడొక్కతరుణికి నొకనికి, మెలఁతవలచు నదియ మేలనంగ
వచ్చుఁగాని పెక్కువనితలపైఁగూర్మి, గలుగుననుట బొంకుగాదె తరుణి!

మను ఆ ౬. ప ౭౮.

ఒక్కస్త్రీయందనురాగము గలవాఁడును, ఒక్కపురుషునియందు ప్రేమగలదియు నగువారే దివ్యసుఖమనుభవింతురని పైపద్యము తెలుపుచున్నది. కాని అట్టి నాయికానాయకులను సృష్టించునవకాశము మనుచరిత్రములో పెద్దనకుఁ జిక్కలేదు. ఆ కొఱఁత నీకవి యీకావ్యమున నిట్లు తీర్చినట్లున్నాఁడు. మనసులు గలసిన యనన్యమగు నాయికానాయకులప్రేమ యిందిట్లు నిరూపింపఁబడినది. కావున నిందలి రంభతీర్పు ప్రత్యేకత నందినదని నాతలంపు.

రుద్రకవి ఆయాసందర్భములను, పాత్రలను వర్ణించుటలో మేటి యనుకొంటిమి. రసమును భంగముసేయు ననుచితవర్ణనముల నీతఁడుసేయఁడు. ఇటీవలి ప్రాబంధికులవలె అవయవమునకొకటిగాఁ బద్యముల నల్లుటయు నీతనికిఁ గిట్టనిపని. నిరంకుశుని వర్ణించుటలో నీతఁడొకటిరెండు పద్యములను మాత్రమే వ్రాసినాఁడు. అందీపద్యము లోకోత్తరము.

ఉ॥ ఆతరుణావనీసురుఁడొకప్పుడు వీథికి రా విలాసినీ
వ్రాతకఠోర ధైర్యకుధరంబులు తుత్తుమురైచనం దయా
ర్ద్రేతర వృత్తినేయు నతఁడింటికిఁ బోవ నిరస్తచాపుఁడై
చేతులు తీయఁగా మరుఁడు సెజ్జపయింబడు భూవరోత్తమా.

నిరంకుశుఁడు పీఠికవచ్చినప్పుడు దోషములుతెలియక విలాసినులఁజేసిన మన్ననఁదలఁచి అతఁడింటికి నేగిన పిమ్మట తానుజేసినపనికి చేయలుకోయుఁగా పశ్చాత్తాపముఁబడుచున్నాఁడట! ఎంతయథార్థమయిన వర్ణనము! కావ్యనాయకుని సౌందర్యదృష్టిని యావర్ణనము తెలుపుచున్నది. అట్లే చంపకగంధిని వర్ణించు నప్పుడును ఒక్కమాటలో నామె ప్రాభవమును జెప్పినాఁడు. రంభనుగూర్చి చెప్పునప్పుడును "త్రిభువనాశ్చర్య సౌందర్యరేఖ చంద బాలతాంగులలో యింతి సేబబంతి" అని సంక్షేపముగఁ బలికినాఁడు.

వీలున్నను లేకున్నను కావ్యములో నష్టాదశవర్ణనము లిఱికించి పాఠకులను విసిగించు పాపము నీతడు కట్టుకొనలేదు. అవసరమైన పట్టుల సూర్యోదయాది వర్ణనములను చక్కఁగా సందర్భమును గుదుర్చుకొని చేసినాఁడు. నిరంకుశుఁడు వేశ్యావాటికలో సంచరించుట కనుపఱచుటకు సాయంసంధ్యావర్ణనము చేయఁబడినది. అతని కాముకత్వోద్దీప్తికి కాముపీడ్వనము, అతఁడారాత్రి నిద్రించి, తెల్లవారుజామున వేశ్యయింటికేగు సమయమున సూర్యోదయవర్ణనము, అట్లే కావనోద్యానవర్ణనాదులును సందర్భశుద్ధిని బొసఁగించుకొన్నవి. లక్షణశాస్త్రకోసమీఁత నే వర్ణనమునుగానిచేసి యౌచిత్యమును జెడఁగొట్టలేదు.

వర్ణనీయమగు నేఘట్టమునుగాని రసోజ్జ్వలము సేయుట మహాకవిధర్మము. ఆఘట్టమున పాఠకుల నాసక్తులనొనర్చి దానితో సహానుభూతిని గలిగించినచే కాని కవి చరితార్థుఁడుగాఁడు. ఈ శక్తి రుద్రకవి కవ్యాహతముగాఁగలదని యీకావ్యమునందలి ప్రతిఘట్టమును, పద్యమును జాటుచునే యున్నవి. సంతానహీనుల దుఃఖము, పుత్రవంతుల సౌభాగ్యము ప్రథమాశ్వాసమున హృద్యముగా వర్ణితమయినది. "సుతహీనతవలని చింతిలు లెంతవారు మానరుసుమ్మీ!" "పురుషుండాత్మజహీనుఁడై సుగతికింబోనేరఁ డుర్వీశ్వరా!" "పరసుఖకారణము తనూభవుఁడుసువ్వే!" "కొడుకుబుగల్గిన మనుజుఁడు బడుగైనను మేలు కుముద బంధుకులీనా!" వైపవ్యపాపము లెంతమనోహరములు! వేశ్యాలాలసులకుఁ బాటిల్లు ననర్థములును వేశ్య మాతృముఖమునఁ గవిహుంపరముగాఁ జెప్పించినాఁడు. అట్లే శివుఁడు ప్రత్యక్షమయినప్పుడు నిరంకుశుఁడొనర్చిన స్తోత్రఫణితి భక్తకోటికెల్లరకును ధ్యేయమై యొప్పుచున్నది. దిగువ పద్యములను జిత్తగింపుఁడు.

మ॥ అపరాధంబులు పెక్కుచేసితి మహాహంకార కామక్రియా
విపులాంభోనిధిఁ గ్రుంకువెట్టి జడతావేశంబునన్ మిమ్ము ది
వ్యపథోద్వృత్తిని గొల్వనైతిని మనోవాక్కాయకర్మంబులన్
జపలాత్మున్నను బ్రోవ మీదయయకా సాక్షాత్కటాక్షేక్షణన్.

మ॥ నిలుపంజాలను నీశివాఖ్యమదిలో, నిక్కంబుగా నీకథల్
బలుకంజాలను వాక్కులన్, వెలయనీపాదాబ్జ సంసేవనల్
గెలువంజాలను దేహకర్మములు దుష్కృత్యాత్ముఁడన్ నా మన
శ్చలనంబుల్ దొలఁగించి ప్రోవవె శివా సద్భక్తరక్షాచణా!

సందర్భవశమున శతకఫక్కికంబోలిన యొండొక సుందరపద్యము నుదాహరింప కుండఁజాలను.

ఉ॥ ఆపదకైన బంధుజన, మక్కఱదీర్చు ధనంబు, రోగమున్
బాపఁగఁజాలు నౌషధము, పాపవిముక్తినిఁ జేయు పుత్రుఁడున్
గోపమడంచు తెల్వి, బుధకోటికి మెచ్చగువిద్య, దీన సం
తాపముఁ జూడలేని దయ దైవ వశంబునఁ గాక కల్గునే.

ఈకవి కవనమేమి, వర్ణనలేమి మిక్కిలియు స్వభావోక్తి సుందరములు. స్వభావసిద్ధస్థితిని వర్ణించుటలో నీతఁ డందెవేసినచేయి. ఈయంశము ప్రతిపాత్రము విషయమునను, ప్రతిసందర్భమునను దేటతెల్లమగును. శాపమునుగన్న రంభ దుఃఖఘట్టము, మాంత్రికులు బ్రహ్మారక్షస్సును వదలించు నప్పుడు చేయుప్రయత్నములు, నిరంకుశుని మాతృబోధ మున్నగునవిందుకు దృష్టాంతములు. ఈస్వభావ వర్ణనములలో నీతఁడు ముద్దుముచ్చటలు గూర్చు లోకోక్తులను, జాతీయములను జక్కఁగా నిమిడ్చి సుందరతరము చేయును.

"కాదు లాఁటిపిటకూల రోకండ్లఁగాని" "ఆణిముత్తెము మసిబొగ్గు నయ్యెనేఁడు" "పచ్చ పయికంబు గుజ్జుము చచ్చినదాఁక నెయటన్న సామెతవినవే." 'నాలుకపయి న్నువుగింజయు నానదట్టి,' "జగబిరుదుముండ మొట్టయు, అఱచేతంబండ్లువచ్చినప్పుడు మమ్మంగఱచెదవుగాక, గుల్లగుట్టగదిను" "గుదిగుంపులు చేయు" అవశ్యంపితురాచారం, ఆశాపరమందుఃఖం, పృష్ఠతాడనాద్దంతపతనం, మన సత్సునాంఘ్రుతి మరోచకం" ఇట్టివీతని కవనమునకొక సొంపుగూర్చినవి. అదనెఱింగి వానినీకవి వాడి నాడు. 'దుచింతురే కులసతుల్ వారాంగనా భోక్తకున్' 'చపలాత్మంగని పెట్టి యుండుఁగదయస్వా పంబులై యాపదల్' ఇట్టి యర్థాంతరన్యాసముల నీతఁడు పొందికగానదికి మనము సంభాషణలో వాడుకొనుటకు నుపయోగించుచున్నట్లు చేసెను.

## ప్రబంధాంతర సాదృశ్యములు

ఒకరి రచనమునకు మఱొకరి రచనముతోఁ గొన్నికొన్ని విషయములందు సాదృశ్యములుండుట సాహిత్యసాధారణమైన ధర్మము. పూర్వాపూర్వకవుల రచనముల నుత్తరోత్తర కవులు చదువుచుండుట సామాన్యము కావున నాపూర్వకవుల రచనావిధానము లుత్తరకవులకృతులలో బొందుపడుచుండును. మఱియు నాయాసమానఘట్టములను, సమానాంశములను వర్ణించుచున్నచో పూర్వరచనల పరిచితి లేకున్నను విషయ సాదృశ్యమునుబట్టి యట్టి రచనారీతులు దొరలుచుండును. ఈధర్మము వేదకాలము నుండి వెలువడిన గ్రంథములయందునుగలదు. మొట్టమొదటిదగు ఋగ్వేదములోని రచనావిధానములు, వర్ణనాదులు తరువాతివగు యజుస్సామాథర్వములలో పూర్వరూపములతోడను, గ్రొత్తపరిణామముల తోడను నిరవుకొన్నవి. వేదవాఙ్మయమునందలి కొన్నివర్ణనలు బ్రాహ్మణారణ్యకములందు, నుప నిషత్తులయందును సదృశములైయున్నవి. ఆ ప్రాచీనవాఙ్మయములోని రచనారీతులు రామాయణ, భారతాదీతిహాసములయందును, బురాణములయందును వ్యాసవాల్మీకాది కవులచే ననుసృతములై యొక క్రొత్త చెలువమును నేకరించుకొన్నవి. తరువాత భాస, సౌమిల్లక, కాళిదాసాది సంస్కృతకవులు ఆర్షవాఙ్మయములోని సొగసులకు బుణికిపుచ్చుకొని కొన్నికొన్ని ఘట్టముల బూర్తిగా వ్యాసవాల్మీ కాదుల ననుకరించియు కావ్యసాహిత్యమును సృష్టించియున్నారు. అట్లే తెలుఁగులో నాదికవులని

చెప్పఁదగిన నన్నయ, నన్నెచోడకవుల రచనములను తరువాతి తిక్కన, సోమన, పోతన, శ్రీనాథాదు లనుసరించినారు. ఎవరేయే సందర్భముల నెట్లనుకరించినదియు, ఏయేపద్యముల కెట్టిపద్యములను దమ కృతులలోఁ దీర్చుకొన్నదియు నిక్కడ వివరింపఁజాలను. సమ్యగ్దృష్టితో సాహిత్యమును బరిశీలించిన వారికిది తెల్లముకాఁగలదు. పెద్దనార్యుఁడు శ్రీనాథుని కవితామార్గములను బెక్కింటి ననుసరించి తన మనుచరిత్రమును సుందరతర మొనర్చుకొన్నాఁడనుట మన మెఱుఁగనిదికాదు. పెద్దన మనుచరిత్రములోని పద్యములకు, వర్ణనములను దరువాతివారగు రామరాజభూషణ, రామకృష్ణాదికవులు పెక్కురనుసరించిరి. ఇంతమాత్రముచేత నీకవులను గ్రంథచౌర్యదోషమంటఁగట్టఁ బూనుట సాహసము. ఎంత ప్రతిభాశాలియైనను పూర్వమార్గములపై నవ్యసృష్టి సేయఁజాలునే కాని సమస్తమును నూతనముగా సృష్టించి కృతార్థుఁడు కాలేఁడు. కావున పూర్వగ్రంథముల రచనావిధానాదుల ననుసరించినంతమాత్రమున నది కవులకపకర్షకాఁజాలదు. అట్లే యైనఁ గాళిదాసాదులే గణ్యతకు రాకపోవలసివచ్చును. ఈ రహస్యము నెఱింగియే పూర్వకవుల గౌరవమును గుర్తించిన కవికులశిరోమణి కాళిదాసుఁడు తనరఘువంశములో వినయసూచకముగను, కృతజ్ఞతాబుద్ధితోడను— "అథవాకృత వాగ్ద్వారే వంశేఽస్మిన్ పూర్వసూరిభిః మణౌవజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తిమేగతిః" అని పూర్వుల కంజలించినాఁడు, నిరంకుశోపాఖ్యానములో మనుచరిత్రను దలపించునంశము లలంతిగానున్నవని పూర్వమే చెప్పియుంటిని. సురశర్మవైదికప్రీతి, అతిథి సంతర్పణ పరాయణత, ఆతని గృహిణీ లలామము యోగ్యత, భక్ష్యభోజ్యములు వండిపెట్టు శీలము, ప్రవరదంపతులను దలపించుచున్నవి. సురతవర్ణనములో మనుచరిత్రమునకును దీనికిని సాదృశ్యమున్నదని యంటిని.

నిరంకుని కథతోఁ గొంతవఱకెక్కువ సాదృశ్యముగలది రామకృష్ణుని నిగమశర్మకథ. ఈ యిరువురి కథలలోను నాయకులు వేశ్యాలంపటులే. ధనమును కొల్లబెట్టువారే. అందుచేఁ బెక్కింట సాదృశ్య మనివార్యము. నిగమశర్మకు ఆతనియక్క హితబోధ చేసినది. నిరంకుశునికిఁ దల్లి హితము చెప్పినది. నిగమశర్మ భార్య మాటపలుకాదని యమాయిక. నిరంకుశుని చెలువ నలుపులేని శీలముగలిగి, యుక్తిశక్తులతో వాచాప్రాగల్భ్యమును జూపి, యత్తగారిచేనైనను జెప్పించి మగనిని తనమార్గమునకుఁ ద్రిప్పుకొనఁజూచిన నేర్పరి. ఈమె మనయింటికోడండ్రను బోలిన వధువు. ఇంతవరకే కథలో నాయకులకు సాదృశ్యము. ఈ యిరువురి బోధలైనపిమ్మట కథాంశములు భేదించుచున్నవి. వర్ణనాదులలోను, ఇతివృత్త నిర్ణయములోను ఎవరెవ్వరి ననుకరించిరోయని సిద్ధాంతీకరింపవలెనన్న నీకవుల పౌర్వాపర్యమును మొదట గుర్తింపవలయును. ఏతద్గ్రంథవ్యాఖ్యాతలు శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారు, రుద్రకవి శ్రీకృష్ణదేవరాయలు కాలమువాఁడని నిర్ణయించుచున్నారు. అనఁగా కృష్ణదేవరాయల కాలము నాటికీతఁడు పిన్నవాఁడయి యుండవలయును. ఈ కృతిని తాను "బాల్యచాపలము పెంపున స్వామికివిన్నవించితి" ననుచున్నాఁడుగదా కవి ఈ కృతివ్రాసినపిమ్మట కృష్ణదేవరాయల యాస్థానమున కేగెనో, లేక యటకేగినపిమ్మట నీకృతిని రచించెనో ఎట్లయినను మనుచరిత్ర రచింపఁబడి ప్రసిద్ధి నందినతరువాతనే యిది రచితమైనదని నా యభిప్రాయము. ఈతఁడు కృష్ణరాయల యాస్థానముననే యున్నచో రామకృష్ణునికించుక పూర్వుఁడు కావలయును. అప్పుడు పాండురంగకవియే యీతని ననుసరించినాఁడనవలసి వచ్చును. లేదా ఉభయులును సమకాలమువారైన నొకరిరచనము నొకరు చూచుకొనక యథేచ్ఛముగా వ్రాసికొన్నారన వలయును. దేశకాలముల భిన్నులైన కవులు సదృశ రచనముల నొనర్చుట వింతకాదనియు నేఁదలంతును. నిగమశర్మకథా సాదృశ్యము నటుంచి చూచి

నచో రంభావృత్తాంతమునుబట్టి కళాపూర్ణోదయము పోలికయు నిందుకొంచెముగపడుచున్నది. అందును నీకవిని సూరనే యనుసరించెనో, లేక సూరన్ననే యీతఁడనుసరించెనో తేల్చవలయునన్న నిర్బాధముగా కాలనిర్ణయము గావలసి యున్నది. కీ॥ శే॥ వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారు బళ్ళారి జిల్లాలోని 'గినిగెర' యను గ్రామములో శ్రీ సాంబమూర్తి స్వాములవారియొద్ద నొక తామ్రశాసనమును గాంచితి మనియు, నందు నలుగురు మంత్రులతో రుద్రకవి. కృష్ణరాయల సంతకములున్నవనియు వ్రాసినారు. ఆ శాసనము లభించినచో మన సందేహములన్నియును దీఱును. అంతవఱకును ఎవ్వారెవ్వరి ననుకరించిరో సిద్ధాంతీకరించుట సాహసమేమో. ఏదియెట్లయిననగుఁగాక. రుద్రకవి, పాండురంగకవుల రచనల సాదృశ్యములను దిగువ నుదాహరింతును.

"............................ మీ బావయుఁ
నీరాకల్ మదిఁగోరు చంద్రుపోడు పున్నీరాకరంబుంబలెఁ."

—పాండు.

క॥ నందను నిన్నుఁగనుంగొను, నందనుకను నెదురుచూచు నకట సముద్రం
బిందునకుఁబోలె జనకుఁ,డిందునకా నీ మహత్త్వమేమన నేర్తున్."

—నిరం.

"కలదు లేదను వాదములకోర్చి మీను మీ
సమువంటి యొంటి జందెము మెఱవఁగ" —పాండు.

"జాఱినవెంద్రుకల్ సవరించికట్టిన, పసిడి వ్రాతరుమాలు దుసికిలంగ" —నిరం

"తలిదండ్రులకు సమ్మతంబుగా నతిథి స,
త్క్రియయటంచు నొకింత గిలుబుసేయు" —నిరం

"దినవెచ్చమునకునై తన మేనఁగలసొమ్ము
కొదుకకబచ్చింటఁ గుదువవైచు" —పాండు

"వృద్ధానుసారంబు విడిచి కొంచెపుఁగాని, నీతులుగై కొంటివే తనూజ" —నిరం

"పరమేష్ఠినుండి నీతరముదాఁక విశుద్ధ, తరమైన వంశంబుదలఁచవైతి" —పాండు

"లేరాభోగపరాయణుల్ జగతిలో లీలావినోదంబుగా" —నిరం

"కామవికార మాత్మనవగాఢతఁ దాల్చినయేని" —పాండు

"కఠినకాకోలూకికావి లోకనసాథ్య, సాకీర్ణకోకిలాకోకిలంబు" —నిరం

"కఠినకంఠీరవాక్షత నఖక్షతజర, త్కరశ్శిరశ్శుక్తి శార్కరిలతలము" —పాండు

పై పద్యములంతయు సాదృశ్యముగలవై యొప్పుచున్నవి. పాండురంగ మాహాత్మ్యములోఁగూడ మనుచరిత్రలోని పద్యములం బోలినవి కొన్నిగలవు. కావున నీరెండు కృతులును మనుచరిత్రకుఁ బిమ్మటివనుటలో సందేహములేదు,

# కావ్యగౌరవము

ఆంధ్రమునఁగల యుత్తమోత్తమ కావ్యములలో నొక్కటగు నిరంకుశోపాఖ్యానము వేశ్యా సంగమముచేఁ గలుగు ననర్థములను గంటగొట్టి చెప్పుచున్నది. దీనిని పఠించిన వాఁడెట్టి కామియైనను తప్పక వెలయాండ్ర నేవగించుకొని గృహస్థధర్మపరాయణుఁ డగుననుట నిజము. ఈ కావ్యమున నుపదేశము కలదెను కావ్యశిల్పము, కథాకల్పనాపటిమ, రచనావైచిత్రి ఒకదానినొకటి మించి యున్నవి. ఇంత చిన్న కావ్యము నింత సహృదయ మనోరంజకముగా వ్రాసి సాహిత్యసేవచేసిన కవి తెలుఁగువారికిఁ జిరస్మరణీయుఁడు.

ఈ కవి చక్కని శీలముగలవాఁడుగను, వేదాది వివిధవిద్యావినోదిగను నగపడుచున్నాఁడు. ఈతడు శివభక్తిపారాయణుఁడు. పెక్కుప్రబంధకారులవలెఁ దనకావ్యము నేరాజునకో, రంగప్పకో యంకితమీయలేదు. దీనింబట్టిచూడ నీగ్రంథమును రచించునప్పటి కీతనికిఁదగిన యార్థికపుష్టియు నుండి యుండునని యూహింపవచ్చును. తన యిష్టదైవమగు కందుకూరి సోమేశ్వరస్వామికిఁ దన కావ్యకన్య నిచ్చి ధన్యుఁడాయెను. బాల్యకాలముననే యింతటి శివభక్తితత్పరుఁడగు నీతని తత్త్వదృష్టి యెంతగాఢ మైనదో. ఆ శివుఁడైనను దనకృతి కన్యం బరిగ్రహింప నర్హుఁడౌనా, కాదాయని యీ కవి శంకించి నాఁడు. "శూలినామ ధన్యుఁడర్హుండు కాఁడె మత్కావ్యమునకు" అనుట యెంతవింత! ఆతనికైనను స్వప్నములో నడిగించుకొని పతియిచ్చినాఁడు. కావున నితనికి తన కృతిపై పవిత్రభావమగ్గలము.

# గ్రంథపాతమా?

ఈ కావ్యము కవి వ్రాసినదున్నదున్నట్లు తోఁచుటలేదు. దిగువ పద్యములో—

క॥ అని యిట్లు దేవతా ప్రార్థన మాపాదించి, గురులఁ బ్రణుతించి పురా
తన కవులనెంచి దుష్కవి జనపశువుల నోసరించి సమ్మద మొదవన్.

అని దేవతాప్రార్థనము, గురుప్రణుతి, పూర్వకవిస్తుతి, దుష్కవినిందఁ చేసినట్లు కవి కథోక్తిగాఁ జెప్పినాఁడు. కాని గ్రంథములో దేవతాప్రార్థనానంతరము కవి ప్రస్తావనమాత్రమే యున్నది. గురు ప్రణుతిగాని, పురాకవిస్తుతిగాని లేదు. ఆపద్యములు అచ్చుప్రతులందుగాని, వ్రాతప్రతులందుగాని యగుపడుటలేదు. దీనింబట్టి గ్రంథపాతమున్నదేమోయని నాయూహ. లేకున్న తానుజేయని గురు, పూర్వకవిస్తుతులనేల కవి యీపద్యములలోఁ జేర్కొనును? తాళపత్రలేఖకులప్రమాదము వల్లనో, ఒకటిరెండు పత్రములు జారిపోయి నశించినందుననో ఆ స్తుతులుగల పద్యములు నశించియుండ వచ్చును. లేఖకులు విమర్శదృష్టిలేక ఉన్నవానినున్నట్లే వ్రాసికొనియుండవచ్చును. అట్లే లోఁగడ నేనుచూపిన "నారదుఁడు విననిమాటలింద్రునితో జెప్పినాఁడన్న" యసంగతిగూడ గ్రంథపాతమునకు సంబంధించియో లేఖకుల తారుమారు వ్రాఁతలనుబట్టి కలిగినట్టిదై యుండునని నా యుద్దేశ్యము. లేకున్న కవియే యెఱిఁగి యెఱిఁగియు యిట్టి యసంగతినేల దొరలనిచ్చును? ఈ విధముగా నిరంకుశో పాఖ్యానము లేఖకప్రమాదభూయిష్ఠమై పెక్కులపపాఠములతో నిండియున్నది. సమర్థులగు పండితు లద్దానిని జక్కఁగా బరిష్కరించి పరిశుద్ధమొనర్ప మొనమొన్నటివఱకును గృషిచేయలేదు. ఈసంగతి

నెఱింగి, విమర్శకాచార్య బిరుదాంకితులగు శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారు బహుకాల పరిశ్రమచే పెక్కు సంస్కరణములు చేసి, సుధాతరంగిణీ వ్యాఖ్యానమును వ్రాసి ముద్రించి యాంధ్ర సారస్వత సేవచే ధన్యులయినారు. ఆంధ్రిశిల్పకళా పరిషత్సభ్యుఁడగు నీపండిత ప్రకాండుని సేవ నాంధ్రులు కొనియాడుదురని నమ్ముచున్నాను. ఈ కవిగారు శిల్ప సారస్వత శాఖలలో బహుళకృషి చేసి యున్నారు. అనేకగ్రంథములను కంఠస్థముచేసినబహుశ్రుతులు. ఇట్టివీరు నాయందలి సదభిప్రాయముచే నీ నిరంకుశోపాఖ్యానమునకు విమర్శయు, గథాసంగ్రహమును వ్రాయవలసినదని కోరియున్నారు. పెద్దలయాజ్ఞమీఁది గౌరవముచేత నే నీ కావ్యమును యథామతిఁ బరిశీలించి, నాకుఁదోచిన యభిప్రాయముల వెలువరించితిని ఈ కావ్యమునుగూర్చి సూత్రప్రాయముగా నేను కొంతవ్రాసితిని. ఇంకను బహుళముగా వ్రాయవలసిన విమర్శాంశములు లేకపోలేదు. అయినను గ్రంథము పెరిగిపోవునని విరమించినాఁడను. ఆంధ్రకావ్యములమీఁద సమగ్రమగు విమర్శలులేని లోపము చాలపెద్దదని నాయభిప్రాయము. ఒక్కొక్క కావ్యముపై నించుమించు ఆకావ్యములంత విరివిగల సద్విమర్శలు వ్రాసి ప్రకటింప వీలున్నది. ఇట్టి విమర్శలు పాఠకులకత్యంతోపకారు లగుటయేకాక, సాహిత్యలక్ష్మి యొక్క సర్వాంగసుందరతకును గారణభూతములగును. ఈ విధమగు నాయుద్దేశ్యము నెఱింగి నన్నే యీపనికిఁ ప్రోత్సహించిన ఈ గ్రంథ వ్యాఖ్యాతలకు హృదయపూర్వక ధన్యవాదముల నర్పించుచున్నాను. సుధాతరంగిణీ వ్యాఖ్యాసమలంకృతమగు నీ నిరంకుశోపాఖ్యానమును శిల్పకళాపరిషత్పక్షమున నాంధ్రలోకమునకు సమర్పించుకొనుచున్నందుల కెంతయు సంతోషము.

సత్తెనపల్లి<br>
ఖర, ఆశ్వయుజ విజయదశమి.<br>
10—10—51

**కొండూరు రాఘవాచార్యులు**<br>
కార్యదర్శి<br>
ఆంధ్ర శిల్పకళా పరిషత్తు.



# నిరంకుశోపాఖ్యాన

## విషయసూచిక

### ప్రథమాశ్వాసము



### ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము

శ్రీ ర స్తు

# నిరంకుశోపాఖ్యానము

## సుధాతరంగిణీవ్యాఖ్యానసమేతము

### ప్ర థ మా శ్వా స ము

### —॥ ఇష్ట దే వ తా స్తు తి ॥—

శ్రీభాషారమణీవిమృష్టపదరా ♦ జీవోత్తమాంగార్చ్యుఁ డా
ర్యాభామాపరిణేత సర్వజగదా ♦ రాధ్యుండు మూర్తిత్రయీ
శోభాకందము కందుకూరినగరీ ♦ సోమేశ్వరస్వామి లో
కాభీష్టంబులొసంగుఁగాతఁ గరుణా ♦ యత్తైకచిత్తంబునన్. 1.

రుద్రకవి యీ కావ్యమును బరమేశ్వరున కంకితముగా రచించువాఁడై "మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే," అను ప్రమాణము ననుసరించియు, శిష్టపరంపరాగత మయిన యాచారముంబట్టియు, నంతరాయములు దొలఁగి యీ కావ్య మభివృద్ధినొందుటకును, నాది యందు మంగళ మాచరింపఁబూని యదియు "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశోవా౽పితన్ముఖమ్" కావ్యారంభమున నాశీర్వాదమైనను, నమస్కారమైనను, వస్తునిర్దేశమైనను గావచ్చును, అని మూఁడువిధములగుటంజేసి యందాశీర్వాదరూపమంగళము నిందుఁ గల్పించెను.

అర్థము: శ్రీభాషారమణీ........గార్చ్యుఁడు. శ్రీ–లక్ష్మీదేవిచేతను, భాషారమణీ–సరస్వతి చేతను, విమృష్ట–పరిశుద్ధిచేయబడిన, పదరాజీవ–కమలములవంటి పాదములును, ఉత్తమాంగ–శీర్షమును – అనఁగా ముఖమును, శరీరమునఁగల యవయవములన్నింటిలో నుత్తమమైన దనిభావము. ని. 'ఉత్తమాంగః శిరః శీర్షం' అమ. ఇచట లక్ష్మి రాజీవములయం దుండునది కావునఁ బదరాజీవ మనియు సరస్వతి ముఖమం దుండునది కావున నుత్తమాంగ మనియుఁ జెప్పఁబడినది. అర్చ్యుఁడు–పూజింపఁ దగినవాఁడును, ఆర్యాభామాపరిణేత. ఆర్యాభామా–పార్వతియొక్క, పరిణేత–నాథుఁడును, 'వ్యా. అరణీయా విలాసినీ రభిగమ్యే త్యార్యా. ని. ఆర్యా షోడశవర్షాతు' అమ. అయియుండుటవలనఁ బదియాఱువత్సరముల ప్రాయముగల జవ్వనికి మనోహరుఁడనియు భావము. సర్వజగదారాధ్యుండు. సర్వజగత్–సమస్తప్రపంచముచేత, అనఁగా నఖిలజగజ్జనులచేత ననుట. ఆరాధ్యుండు–సేవింపఁబడు చున్నవాఁడును, మూర్తిత్రయీశోభాకందము. మూర్తిత్రయీ–బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుఁడు, అను

మూఁడురూపములయొక్క, శోభా-కాంతికి, కందము-దుంపయును, అనఁగా మూలస్థాన మనుట. అగు కందు.........స్వామి. కందుకూరినగరీ-కందుకూ రనుపట్టణమునఁగల, సోమేశ్వరస్వామి-సోమేశ్వరుఁ డనుపేరుగలదేవుఁడు, కరుణా.........చిత్తంబునన్. కరుణా-దయకు, ఆయత్త-అధీన మయిన, అనఁగా దయతోఁగూడినయనుట. ఏక-ముఖ్యమైన, చిత్తంబునన్-మనస్సుతో, లోకా.........గాతన్. లోక-జనసమూహముయొక్క, 'ని. లోకస్తు భువనే జనే' అని. అభీష్టంబులు-కోరికలు; ని. అభీష్టేఽభీప్సితం హృద్యందయితం వల్లభం ప్రియమ్' అని. ఒసంగున్‌గాతన్-ఇచ్చును గాక, ఇందు'లోకాభీష్టంబు లొసంగుఁగాక.' అనుట నిరపేక్షత్వము. 'సర్వకర్మా ణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః. మత్ప్రసాదా దవాప్నోతి. శాశ్వతం పద మవ్యయమ్, భగ. సమస్త కార్యములను నిష్కామముగా నెల్లప్పుడు నొనరించువాఁడు నాయందు నియమింపఁబడిన మనస్సుగలవాఁడై నాయనుగ్రహమువలన నిత్య మైనదియు, శాశ్వత మైనదియు నగు నాయొక్క ప్రాప్యస్థానమును బొందుచున్నాఁడు. కాఁబట్టి 'విశ్వశ్రేయః కావ్యమ్, విశ్వమునకు శ్రేయస్సు నొడఁగూర్చెడి సత్ప్రబంధములు మాత్రమే కావ్యార్హములై చిరంజీవిత్వమునకుఁ దగియుండు ననియుఁ, బరమేశ్వరుఁడు భాషాప్రపంచమును గూడ నభివృద్ధి యొనర్చుఁ గాక యనియుఁగవిభావము. 'కందుకూరినగరీ సోమేశ్వరస్వామి' అనుటకు 'సూ. భవేద్బిరుదశబ్దేషు యథేచ్ఛం వర్ణకల్పనా గ్రామమానుష్యబిరుద శబ్దానా మపి సో మతః'' 'సూ. గ్రామ నామ్న స్సమాసేతు. వి కారో ఽపిక్వచి ద్ధితః'' ''క్వచిత్స్వ దుత ఈదిచ్చ యణ్వాన్యస్మి న్నయణ్మతః'' స్వరూపత స్సమానస్యాస్య ద్వికారస్య శ్రుతావపి, అథ. ఉదా'యాగంటిపట్టణమహేశ మహం భజామి, 'యాగంటిపట్టణంబున। నేఁగంటి నశేషదైవతేశు మహేశున్, ఇంకను 'విరూరిపట్టణపతిన్-విరూపిమందిరు జగద్విఖ్యాతకీర్తీశ్వరున్, పాం. మా. ప్రథమపాదమున శ్రీ భాషా.........య్యుఁడు, అనుటలో సరసయతి సెప్పఁబడినది. 'ఆ. వణలు సెల్లుఁగమల*నాభ యొండొంటికి, నయహ లొనరఁ జెల్లు*హస్తివరద, శషస లొందు నంద్రు చఛజఝంబులతోడ, సరసయతులు నాఁగ * జలధిశయన, అనం. చతుర్థపాదమున 'లోకాభీ.........యత్తైక, అనుటచే స్వరప్రధానయతియు, ఉదా'తే. అతులగుణధామ భానువంశాబ్ధిసోమ' అప్ప. పద్యాదియందు మగణము శ్రీప్రదము. ''మోభూమి స్త్రిగురు శ్శ్రియం వితనుతే'' ''సర్వమూలంతుమగణం ప్రాప్యసర్వేగణాశ్శుభాః'' అని లక్షణము. మగణసగణములపొందిక యింకను శ్రేయోదాయకము, క'రసలుం జెప్పిన మేలగు. మసలుం జెప్పినను గర్త*మండల మేలున్, సుల. కనుకనే మగణసగణములపొందిక గలది యగుశార్దూల విక్రీడితవృత్తమును జెప్పినాఁడు. ''సారాచార విశారదా యినయతిఁ*శార్దూలవిక్రీడితా। కారం బైమసజమ్ములిమ్ముగసతా*గప్రాప్తమై చెల్వగుఁ'' సుల. కావ్యారంభమున శ్రీకారము సంపత్కరము 'క. శ్రీకారము కృత్యాదిని, బ్రాకటముగ నున్నఁ జాలు * బహుదోషములం। బోకార్చి శుభలొసఁగును, సుల. శ్రీకారము విధి యనియుఁ జెప్పఁబడుచున్నది. 'తే. వేదముల కెల్ల నోంకార*మాదియైన' కరణిఁ గృతులకునెల్ల శ్రీ*కారమాది। గానఁ గవివరులెల్లను * దానిఁ దక్క। నితరవర్ణంబు లిడరు సత్*కృతుల మొదల, అప్ప. సోమేశ్వరస్వామి యొక్క పాదపద్మములను లక్ష్మియు, ముఖమును సరస్వతియును, బరిశుద్ధి యొనర్చుచున్నా రని చెప్పుటలో వాణి సితాంభోజనివిష్టయై చిరస్థాయిగను, లక్ష్మి పద్మాసనాసీనయై చిరస్థాయిగను నుండు రనుభావప్రకటితముచే నీశ్వరునియొక్క సర్వోత్కర్ష వర్ణనమున నుదాత్తాలంకారము. 'క.

విశ్వోన్నత మై చెలఁగెడు। నైశ్వర్యము గలుగువస్తు॥వభినుతి నేయన్। శాశ్వతమగుచునుదాత్తము' కా. సం. 'ఉదాత్త మృద్ధిమచ్చరితంశ్లాఘ్యం చాన్యోపలక్షణం' ప్రతా. మఱియుఁ బద్యమునందలివిశేషణ విపులవలనఁ బరికరాలంకారము 'అలంకారః పరికరః సాభిప్రాయవిశేషణైః' ప్రతా. ఇంకను 'క సాకూతము లై సఫలత।చేకొన్నవిశేషణములు॥చెలఁగఁ బరికరం।బై కృతుల వెలయుచుండు మహా కవిసంస్తుత్య మగుచు' కా. సం.

ఇందు శంకరునకు గంగాపార్వతుల నిరువురినే చెప్పక త్రిమూర్త్యాత్మకునిగా వర్ణించి, యార్యా నాథుండనియు, లక్ష్మీసరస్వతులచేత మిక్కిలినిర్మలముగాఁ జేయఁబడినచరణములును, ముఖమును, గలవాఁడనియుఁ, జెప్పుటచేత నిమ్మహాకావ్యము శృంగారరసప్రధానము గలది యగుటయేకాక కథా నాయకుఁడు సమస్తవిద్యలయందు సంపూర్ణుఁడును, విశేషశృంగారలోలుఁడును, సర్వజ్ఞుండును, నగుచు ముఖ్యనాయికపాణిగృహీత కులశీలాదులు గలదియు, నొకనాయిక విద్యాకౌశలము గలదియు, నింకొక నాయిక సమస్తసంపదలకు నిధియు, నైయుండుననియు, మఱియు నార్యాసమేతుండనక నాథుఁ డను టచే ముఖ్యనాయికకు నాయికాప్రకాశత్వ మల్పమనియుఁ, గడమయిరువురు వారి నేర్పరితనమును వెల్ల డింపఁజేయుచుందురనియు, నీతీరున కావ్యము ప్రకాశించగల దని యిందు ధ్వనించుచున్నది. "మహా కావ్యమునకు ధ్వని ప్రాణమువంటిది. ఓజోమాధుర్యాదిగుణములు శౌర్యాదికములవంటివి. అలంకా రములు హారములవంటివి. శబ్దార్థము లంగములు. రసము ఆఁగి. మాధుర్యాదిగుణము లెప్పుడును రస మును విడువవు. రసముండినచోటనే యవియును, అవియుండినచోటనే రసమును, బుట్టును. అలంకా రము లట్లుగాక యంగద్వారమునమాత్ర మొకానొకప్పుడు రసము నభివృద్ధిచేయును. గుణములు రసముయొక్కధర్మములుకాకున్నను రసములేనితావున నవియుండవు. అలంకారములు రసము నుత్పత్తి చేయకున్నను గుణములుమాత్రము రసమును బుట్టించును రస మనునది కావ్యమున కాత్మయగును. ఉత్తమకావ్యమునకు ధ్వనిప్రధానము. ఎందువాచ్యార్థమునకంటె వ్యంగ్యార్థమెక్కువ రమణీయముగ నుండునో యదియే యుత్తమకావ్యము. దీనినే గుణీభూతవ్యంగమందురు. ఇట్లులేనిది యధమకావ్యము. ఉపమాద్యలంకారము లన్నియు వాచ్యార్థమున సిద్ధింపవచ్చును. వ్యంగ్యార్థమున సిద్ధింపవచ్చును. మొదటిది యలంకారము. రెండవది ధ్వని." అం. వి. స. 'శబ్దార్థౌ మూర్తిరాఖ్యాతౌ. జీవితంవ్యంగ్య వైభవమ్ః ప్రతా. 'క. తను వగుశబ్దార్థంబులు। ధ్వని జీవ మలంక్రియావి॥తానముసొమ్ముల్। దనరు గుణంబులు గుణములు। ఘనవృత్తులు వృత్తు లౌర॥కావ్యందిరకున్, కా. సం.

తా॥ లక్ష్మీదేవిచేత నిర్మలముగాఁ జేయఁబడినపాదములు గలవాఁడును, సరస్వతీదేవిచేత స్వచ్ఛముగాఁ జేయఁబడినముఖముగలవాఁడును. ఆర్యాదేవిని వివాహము చేసికొనినవాఁడును, పదు నాలుగు లోకములచేఁ గొనియాడఁబడుచున్నవాఁడును, బ్రహ్మ విష్ణు మహేశ్వరులను మూఁడురూపము లకు మూలమైనవాఁడును,అగు కందుకూరి సోమేశ్వరస్వామి దయతో జనులకోరికలు నెఱవేర్చునుగాక.

## —: విష్ణుస్తవము :—

సీ॥ పక్కిరాతేజిపై ♦ నెక్కెడునభ్యాసి, చాణూరుఁ ద్రుంచిన ♦ సత్త్వరాశి
- సిరిమనోధనము ద్రము ♦ చ్చిలినకన్నపుదొంగ, గొల్లచేడెలతోడు ♦ కోడెకాఁడు

భువనమంతయుఁ గన్న ♦ పుత్త్రుఁగాంచినతండ్రి, స్వర్ణాంబరముఁ గట్టు ♦ వన్నె బెట్టు
పౌరస్త్యభోగిపైఁ ♦ బవళించుసుఖవాహి, పరమపదం బేలు ♦ పాదుసాహి
తే॥ మానవుల కెల్ల నిజపద ♦ స్మరణమాత్ర, నైహికాముష్మికము లిచ్చు ♦ నట్టిదాత
కందపురజనార్దనుఁడు భీ♦కరవిరోధి, మర్దనుఁడు భక్తలోకంబు ♦ మనుచుఁ గాత. 2.

అ॥ పక్షి—రాతేజిపైన్ — పక్షులకు రాజయిన గరుడవాహనముమీఁద, ఎక్కుడు నభ్యాసి— ఆరోహించు నలవాటు కలవాఁడును, అనఁగా నున్నతస్థానాధిష్ఠాతయనుట. ఇట గరుడునిపై నెక్కుట దివ్యతరయోగాభ్యాసులకుఁ దక్క నొరుల కసాధ్యము. ఏల యనఁగా యోగాఁగము లగు యమ, నియ, మాసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణా, సమాధుల నధికుఁడైనఁగాని ఖేచరుఁ డగు వైనతేయునిపై నెక్కఁజాలఁడు. అట్టియభ్యాసము మహత్తర మైనదికనుక నే కవి యిందు వర్ణించినాఁడు. 'ఎక్కుడు నభ్యాసి, యనుటకు సూ. "తద్ధర్మప్రథమే స్యాతాం. డుడివర్ణాచ నాంతకా" డోస్తు భేదకతాపిస్యాదితి కేచిం చిదిరితమ్ అథ. ఇట(అభ్యాసి, అనియున్ననుసమన్వయమేయగును) చాణూ...రాశి. చాణూరున్ — చాణూరుఁ డనుమల్లుని, త్రుంచినసత్త్వరాశి — చంపినట్టి బలమునకుఁ బ్రోవయినవాఁడును, 'ని. ద్రవ్యాసువ్యవసాయేషు సత్త్వం, అ. సిరి...దొంగ. సిరి మనోధనమున్ — లక్ష్మీదేవి యొక్క మనస్సనెడిసొమ్మును, ముచ్చిలినకన్నపుదొంగ — దొంగిలించినట్టి కన్నము లువేసెడి చోరుఁడును, ఇచట మనోధన మొడలిపైనుండునగలవలెఁ గాక లోపలనుండునది కావునఁ గన్నపుదొంగయని కవివర్ణించినాఁడు. ఇచ్చట 'ముచ్చిలిన, అనుచోట నవర్ణకమువచ్చుటకు 'సూ॥ భూతార్థానాంతునః క్రియాణాంస్యాత్' శబ్దచిం. గొల్లచేడెలతోడు. తోడు — గోపికాంగనలకుఁ జేకయైన యువకుఁడును. అనఁగా నెప్పుడును దాపుననుండెడివాఁ డనుట. భువ...తండ్రి. భువనమంతయున్ — ఈ లోకము నెల్లను, కన్నపుత్త్రున్ — పుట్టించినకొమరుని, కాంచినతండ్రి — కనిన జనకుఁడును, అనఁగాఁ బ్రపంచమును నిర్మించినబ్రహ్మకుఁ దండ్రి యనుట. ఇది పురాణప్రసిద్ధము. స్వర్ణాం...బెట్టు. స్వర్ణాంబరమున్ — పసిఁడిపుట్టమును, కట్టువన్నెబెట్టు — తాల్చునట్టి కాంతియొక్క యతిశయము కలవాఁడును, పౌర...వాహి. పౌరస్త్యభోగిపైన్ — మొదటిది యైనపాముమీద, అనఁగా నాదిశేషునిపై ననుట. ఇచటఁ బౌరస్త్యభోగియనఁగాఁ బౌలస్త్యనామకకుండలిపైననియుఁ జెప్పనొప్పు. 'రలయోరభేదః, అనుమాత్రముచేతఁ బౌరస్త్యయనియున్ననుసహజమే 'యమకాదౌ భవేదైక్యం రలోర్వబో ర్డలో స్తథా, సా, ద. పవళించుసుఖవాహి — శయనించునట్టిసుఖానుభవముగలవాఁడును, అనఁగా శేషుఁడే భోగానుభవమున నధికుఁడు. అతనిపై శయనించువాఁడగుటచేత నత్యధిక సుఖానుభవశాలి యని భావము. పర......సాహి. పరమపదంబున్. ఉత్కృష్టమైన స్థానమును, అనగా వైకుంఠమును, ఏలు పాదుసాహి — పాలించునటువంటి చక్రవర్తియును, ఇది హిందూస్థానిపదము. 'పాదుసా' ను రూపాంతరము. మానవులకెల్లన్ మనుజుల కందఱికిని, నిజపదస్మరణమాత్రన్ — తన చరణములపూజ యొక్క తలంపుగల్గుటతోడనే, ఐహికాముష్మికములు — ఇహలోక సంబంధ మగుసుఖమును, బరలోకసంబంధ మగునానందమును, ఇచ్చునట్టిదాత — ఒసంగునట్టి యుదారస్వభావముగలవాఁడును, భీకర......నుఁడు. భీకర—భయమును బుట్టించువారయిన, విరోధి — శత్రువులయొక్క, మర్దనుఁడు — నలుపుటగలవాఁడు. అనఁగాఁ బగతురఁజంపువాఁడు ననుట, (అయిన) కందపురజనార్దనుఁడు — కందుకూర్యను గ్రామమునఁగల జనార్దనస్వామి, భక్తలోకంబున్ — తనయొక్క భక్తులైనజనులను, మనుచున్

గాతఁ - పోషించునుగాక. ఈపద్యమున 'కోడెకాఁడు, అనుటకు సూ|| కాఁడు గ్గాఁడు గ్భవే దీఁడురస్త్రీత్వా ద్వర్థబోధకాః, ఏకత్వవాచకా త్పుంసిస్యా దాఁడు స్త్వన్యథా మతః' అథ. ఉదా, చ.ధను లగుకోడెకాఁడ్రకును దంగెటిజున్నులు, రామాభ్యు. "ఐహికాముష్మికము లిచ్చునట్టిదాత" అనుచోట ద్వితీయకుఁ బ్రథమ చెప్పినందులకు "సూ|| 'క్వచి దన్యవిభక్త్యర్థే ప్రథమాదిః ప్రదృశ్యతే' అథ. "సిరిమనోధనము ముచ్చిలిన కన్నపుదొంగ" అనుచోట మిశ్రసమాసము చేయుటకు సూ|| సంస్కృతవైకృతశబ్దై ర్మిశ్రసమాస స్సఏవ విజ్ఞేయః" నన్న. పద్యాంత నకారలోపమునుగూర్చి 'సూ|| వాక్యావసానగస్య స్యాల్లోపో న ప్రాయశో ఽత్రహి' అథ. 'కందపుర మనుటకు 'సూ|| గ్రామనామ్న స్సమాసేతు వికారోఽపి క్వచిద్ధితః' అథ. 'మానవులకెల్లన్, అనుటలో మానవు లకుఁ + ఎల్లఁ - మానవులకెల్లఁ. అని సంధిఁగూర్పగా ద్రుతము లోపించినది. 'సూ|| అచాం సంధౌ ద్రుతో ఽదృశ్యస్థితో ఽపి చ భవే త్సదా' అథ. ఇందలి కందపురజనార్దనస్వామియొక్క విశేష ణము లన్నియు నుత్కృష్టతను బ్రతిపాదించుచున్న వగుటచే నుదాత్తాలంకారము 'ఉదాత్తం వస్తునః సంపత్. మహతాం చోపలక్షణమ్' కా|| ప్ర|| ఈపద్యమునం దంతట ననుప్రాసాలంకారము "వర్ణ సామ్య మనుప్రాసః" కా|| ప్ర|| "సిరిమనోధనము" రూపకాలంకారము.

తా|| గరుడవాహనము నధిష్ఠించునలవాటుగలవాఁడును, చాణూరమల్లునిఁ జంపిన బలశాలి యును, లక్ష్మీదేవికి నత్యంతప్రియుఁడును, గోపికాంగనలను వెంటనంటియుండుయువకుఁడును, బ్రహ్మ దేవునకుఁ దండ్రియును, పసిఁడిపుట్టములు గట్టినవాఁడును, శేషునిపై శయనించినవాఁడును, వైకుంఠ మును బాలించువాఁడును, తన్నుదలంచినంతనే జనులందరికి నిహపరసౌఖ్యముల నొసంగువాఁడును, భయంకరు లైనశత్రువుల నశింపఁ జేయువాఁడును, అయిన కందుకూరిజనార్దనస్వామి దయతో భక్తుల రక్షించునుగాక.

## —: బ్రహ్మస్తుతి :—

కం|| శతకోటి కల్పవాటీ, శతకోటిద్యుతుల నవ్వు ♦ సతి గల్గిన యా
✓ చతురాస్యు నఖిలవిద్యా, చతురాస్యుఁ దలంతుఁ గావ్య ♦ సర్గంబునకున్. 3.

అ|| శత.. ...తులఁ|| శతకోటి-వజ్రాయుధముయొక్కయు, 'వ్యు|| శతం కోటయో ధారా యస్య స శతకోటిః' 'ని|| శతకోటి స్స్వరు శ్శంభో దంభోళి రశని ర్ద్వయోః' అమ|| కల్పవాటీ- వేలుపుఁజెట్లు గలతోఁటయొక్కయు, శతకోటి-అనేకకోట్లయొక్క, ద్యుతులఁ-కాంతులను, నవ్వు సతి-పరిహాసముచేయునట్టిభార్య, అనఁగా మిక్కిలి తెల్లగా నుండునది యనిభావము. 'శుభ్రాణిభారతీ ధర్మ శ్శేషేశతరుణేందవః......రేణుఃకేతకఖర్జూరో్యఃకటాక్షావహాసభస్మనీ' కా|| క|| ల|| ఇందు 'శత కోటికల్పవాటి,అనునది ద్విపదేతరయోగద్వంద్వసమాసము.కల్గినయాచతురాస్యుఁ-ఉండినట్టి నాలుగు మోములుగలవానిని, 'ని|| వక్త్రాస్యవదనంతుండమాననంలపనంముఖమ్, అ|| అఖిలవిద్యాచతు రాస్యుఁ-అఖిల-సమస్తమైన, విద్యా-విద్యలయందు, చతుర-నేర్పుగల. అస్యుఁ-వాక్యములుగల వానిని, అనఁగా బ్రహ్మను, అనుట. 'ని|| ఆస్యం వక్త్రే వక్త్రిబిలే వక్త్రిభవే త్రిషు' నానా|| కావ్య సర్గంబునకుఁ-నాప్రబంధముయొక్క నిర్మాణమునకొఱకు, అనఁగా సర్వతోముఖపాండిత్యముతోఁ

గావ్యమును రచించునట్టి సామర్థ్యముకొఱకు, తలంతుఁన్-స్మరించెదను, 'శతకోటి కల్పవాటీశత కోటి-చతురాస్య నఖిలవిద్యాచతురాస్యున్, ఇవి పదయమకాలంకారము. 'యమకం పౌనరుక్త్యేతు స్వరవ్యంజనయుగ్మయోః' ప్రతా॥ 'అర్థేసత్యర్థభిన్నానాం వర్ణానాం సా పునః శ్రుతిః' కా॥ ప్ర॥ 'శత......ద్యుతులన్ నవ్వుసతి, అనుటచే నుపమాలంకారము "స్పర్ధతే జయతిద్వేష్టి ద్రుహ్యతిప్రతి గర్జతి ఆక్రోశ త్యవజానాతి కదర్థయతి నిందతి, తస్యచానుకరోతీతి। శబ్దాఃసాదృశ్యవాచకాః॥ ఉప మాయామిమేప్రోక్తాః కవీనాంబుద్ధిసౌఖ్యదాః" కావ్యాద. మఱియు 'అఖిలవిద్యాచతురాస్యుఁ దలంతుఁ గావ్యసర్గంబునకున్' అను వాక్యార్థమువలనఁ బరికరాలంకారము 'అలంకారః పరికరః సాభిప్రాయవిశేషణైః। సుధాంశుకలితోత్తంసఃస్తాపం హరతు వశ్శివః' కువ॥ 'విశేషణై ర్యత్సాకూతై। రుక్తిః పరికరస్తు సః', కా. ప్ర. కావ్యనిర్మాణమునకుఁ జాతుర్య మవసరము కనుక నఖిల విద్యాచతురాస్యుని స్మరించుచున్నా నని కవి వచించినాఁడు. ఆనందవర్ధనాచార్యుఁడు నిట్లే స్తుతించినాఁడు. 'సరస్వతి ప్రసాదం మే స్థితించిత్తసరస్వతి, సరస్వతికురుక్షేత్రకురుక్షేత్రసరస్వతి' దేవీ (ఓ వాగ్దేవీ! నీయొక్కయనుగ్రహము బాగుగానుండనిమ్ము. క్షేత్ర మగుకురుక్షేత్రమున సరస్వతీనది ప్రవహించినట్లు నాయొక్కశరీర మనుకురుక్షేత్రమునుండిహృదయసముద్రమువకు బ్రవహించి నిలఁవుము నదులు సముద్రమునకుఁజేరుట యుక్తమేకదా : అనిభావము)

తా॥ అనేక వజ్రాయుధములయొక్క కాంతులను, గల్పవృక్షములయొక్క కాంతులను, బరిహ సించునట్టిస్వచ్ఛమైనశరీరకాంతిగల సరస్వతితోఁగూడినవాఁడును, సమస్తవిద్యలయందు సమర్థత గల వాక్కులు గలవాఁడును నగు నలుమోముల వేల్పును మత్కావ్యనిర్మాణముకొఱకుఁ బ్రశంసించుచున్నాను.

## —: కాళికా ప్రార్థనము :—

సీ॥ చంద్రరేఖానమా♦సంగరంగన్మౌళి, శోభితహారవ♦క్షోజపాళి
శమదమాన్వితమన♦స్సుమధూళిసమదాళి, లసమాననానాక♦ళాప్రతోళి
ప్రతిపక్షరాక్షస ♦ ప్రాణానిలవ్యాళి, దీప్రానుకంపార♦సప్రణాళి
రాజీవగేహాస♦రస్వతీముఖ్యాళి, నతజనవ్రాతమా♦నసమరాళి

తే॥ రాజశేఖరచేతఃప♦యోజహేళి, సకలనిగమార్థ కుసుమభా♦స్వన్మధూళిఁ
జిరకృపాలోకపోషిత♦సేవకాళిఁ, గాళిఁ బ్రణుతింతు సుపదరిం♦ఛోళికొఱకు. 4.

అ. చంద్రరేఖా......మౌళిన్. చంద్రరేఖా - చంద్రునికళయొక్క, అనఁగా సన్ననిగీర వంటి చంద్రశకలముతో ననుట. 'ని. రేఖాస్యాదల్పకే ఛద్మన్యాభోగోల్లేఖయోరపి' విశ్వ. సమా సంగ - మిక్కిలి కలయికతో, రంగత్ - ఒప్పుచున్న, మౌళిన్ - కిరీటముగలదానిని, 'ని. చూడా కిరీట కేశాశ్చ సంయతా మౌళయః కచాః, అ. మౌళిః కిరీటేధమ్మిల్లే, విశ్వ. శోభి........... పాళిన్. శోభిత - ప్రకాశించబడిన, ప్రకాశించుచున్నయనుట, సూ,, కర్తరిక్తః. హార-పేరులతోఁ గూడిన, వక్షోజపాళిన్ - స్తనప్రదేశముగల్గినదానిని. శమద........దాళిన్. శమ- ఓర్పుతోను, దమ - ఇంద్రియ నిగ్రహముతోను, అన్విత - కూడుకొనియున్న మనః—|—సుమధూళి=మనస్సనెడి

మకరందమునకు, సమదాళిన్ - సంతోషముతోఁగూడుకొనిన తుమ్మెదయైన దానిని, అనగా శమదమాన్వితులగు మహాత్ములయొక్క హృదయమందుండుదానిని యనుట. ఇచట సంతోషార్థమున మదశబ్దప్రయోగమును. గూర్చి ని. మదో రేతసి కస్తూర్యాం గర్వే హర్షేభదానయోః, విశ్వ. మఱియు ని. గజదానం గర్వ హర్ష దేవో మృగమదా మదాః నానా. అళిశబ్దమునుగూర్చి ని. అలిర్భృంగ శ్శిలీముఖః భ్రమర షట్పదో జ్ఞేయో ద్విరేఫశ్చ మధువ్రతః, ధనం. అసమా............తోళిన్. అసమాన- ప్రకాశించుచున్న, నానాకళా - పలువిధము లగువిద్యలకు, ని. కలా స్యాన్మూలవైవృద్ధౌ, శిల్పాదావంశమాత్రకే. షోడశాంశే చచంద్రస్యకలనా కాలభేదయోః॥ విశ్వ. ప్రతోళిన్- రాజవీధియైనదానిని, ని. రథ్యాప్రతోళీవిశిఖా, అ. ప్రతి.....వ్యాళిన్. ప్రతిపక్షరాక్షస- శత్రులగు నసురులయొక్క, ప్రాణానిల- అసువు లనెడు వాయువులకు, వ్యాళిన్- సర్పమైనదానిని, దీప్ర.....గాళిన్- దీప్ర- ప్రకాశించుచున్న, అనుకంపారస- దయారసమునకు, ప్రణాళిన్ - ద్రవమార్గమగు కాలువయైనట్టిదానిని, రాజీవ........ఖ్యాళిన్ - రాజీవగేహ- కమలమే యిల్లుగాఁ గలలక్ష్మియును, సరస్వతీ- వాగ్దేవియును, ముఖ్య - ప్రధానమయిన, ఆళిన్- చెలికత్తెలు గలదానిని, నత........రాళిన్ - నతజనవ్రాత- నమస్కరించుచున్న జన సమూహముయొక్క, ని. స్తోమౌఘనికరవ్రాత వారసంఘాతసంచయాః, అ. మానస - మనస్సనెడి సరోవరమునకు, మరాళిన్- రాజహంస యైనదానిని, మానసము మానససరోవరము. హంసకు మానస సరోవర మునివాసమగుట సుప్రసిద్ధము, రాజ...హేళిన్- రాజశేఖర- చంద్రుఁడే సిగయందుఁ 'గట్టఁబడిన పూలదండగాఁ గలశివునియొక్క, ని. రాజా నృపే లతాభేదే. పత్రౌ క్షత్రియచంద్రయోః, నానా. చేతఃపయోజ- చిత్తమనెడి కమలమునకు, హేళిన్- సూర్యుఁడైనదానిని, సకల.....ధూళిన్, సకల- సమస్తమైన, నిగమార్థ కుసుమ- వేదములయొక్క యర్థములనెడి పుష్పములయందు, భాస్వత్మధూళిన్ - ప్రకాశించుచున్న మకరందమైనదానిని, చిర...కాళిన్. చిరకృపాలోక - ఎల్లప్పుడునుదయతోఁగూడిన చూపులచేత, చిర-|-కృపా-|-ఆలోక. అనిపదచ్ఛేదము ని. ॥ఆలోకౌదర్శనద్యోతౌ, అ. పోషిత-రక్షింపఁబడిన, సేవకాళిన్ — ఊడిగముచేయు వారియొక్క వరుసగల్గినదానిని ని. ఆళి స్సేతు స్సఖీ పంక్తిః, నానా. కాళిన్- పార్వతీదేవిని, ఇచట దీర్ఘముహ్రస్వమగుటకు సూ. ఈదన్తాఇద్వదేవ కృతహ్రస్వాః,, నన్న. సుపదరింఛోళికా అకున్- మంచిశబ్దములయొక్క సముదాయమునిమిత్తము. ప్రణుతింతున్- స్తోత్రము చేయుదును. ఇందుఁ గవి సుపదరింఛోళికా అకుఁ గాళిఁ బ్రణుతింతు నని చెప్పుట యుక్తమే. క. పలుకునది భాగవతమట. 'పలికించెడువాఁడురామభద్రుండట నేఁ, బలికిన భవహరమగునట, అనిన బమ్మెర పోతనామాత్యుఁడు సయితము ఉ. అమ్మలగన్నయమ్మ ముగు*రమ్మలమూలపుటమ్మ చాలపెద్దమ్మ సురారులమ్మ కడు*పారడిపుచ్చిన యమ్మమిమ్ములో, నమ్మినవేల్పుటమ్మల*మనమ్ములనుండెడి యమ్మ దుర్గ మా,యమ్మ కృపాబ్ధియీవుతమ*హత్త్వకవిత్వ పటుత్వసంపదల్, అనిప్రార్థించియున్నాఁడు.

ఈపద్య మంత్యానుప్రాసాలంకారముతోఁ జెప్పఁబడినది. 'ప్రతిపక్షరాక్షసప్రాణానిలవ్యాళి, ఇత్యాదులు రూపకాలంకారము. 'తద్రూపక మభేదో య ఉపమానోపమేయయోః, అతిసామ్యాత్ (అనపహ్నుతభేదయోః) అభేదః, కా॥ ప్ర॥ 'రాజీవగేహసరస్వతీముఖ్యాళి, అనుటచే నుదాత్తాలంకారము.

తా॥ బాలచంద్రుని గిరీటమున ధరించినదియును, స్తనములపై దివ్యమణిహారములు గలదియును, శమదమాన్వితులహృదయమున నుండునదియును, సమస్తవిద్యలకు విశాలమార్గమైనదియును, శత్రుదానవులప్రాణముల హరించునదియును, దయారసము గలదియును, లక్ష్మీసరస్వతులే ముఖ్యస్నేహితురాండ్రుగాఁ గలదియును, నమస్కరించునట్టిభక్తులయొక్క హృదయములం దుండునదియును, ఈశ్వరునియొక్క మనస్సును వికాసము గలుగఁజేయునదియును, సమస్తవేదములయందుఁ బ్రకాశించుచున్నదియును, సేవించువారి నెల్లప్పుడును గాపాడునదియును, అయిన పార్వతీదేవిని నాకుఁ బరిశుద్ధమైనవాక్కుల నిచ్చుటకై ప్రస్తుతించెదను.

ఉ॥ ఏలికసానియై యనిమి ♦ షేందునిభాస్యల కాదరంబుతో
వాలికచూపులం బనుల ♦ వైపులు దెల్పుసమస్తదేవతా
పాలికఁ జంద్రజూటకుల ♦ పాలిక రాజదురోజపాళికం
గాళికఁ బాదసేవకశి ♦ ఖావళికాళికఁ బ్రస్తుతించెదన్. 5.

అ॥ ఏలికసానియై-దొరసానియై. అనిమిషేందునిభాస్యలకున్ - ఱెప్పపాటులేనివారయిన దేవతాస్త్రీలకు, 'ని॥ సురమత్స్యావనిమిషౌ, అ॥ ఆదరంబుతోన్-గౌరవయుక్తమగుస్వభావముతో, వాలికచూపులన్-వాలుచూపులతో, సొగయయినవీక్షణములతో, ఉదా 'చ॥ వనజదళాయతాక్షినిదు వాలికచూపు' వసు॥ 'చ॥ అవ్వనరుహనేత్ర కన్నుఁగవ వాలిక ఱెప్పలఁగప్పి' విష్ణుపు. వ్రాతప్రతియందు "వ్రాలికచూపులన్, అనియున్నది. పనులవైపులు కార్యములయొక్క యుపాయములను, తెల్పుసమస్తదేవతాపాలికన్-తెలియజేయునట్టి దేవతలందఱిని బాలించునట్టిదానిని, చంద్రజూటకుల పాలికన్-శివునియొక్క భార్యయయినదానిని, 'ని॥ కులస్త్రీ కులపాలికా, అమ॥ రాజదురోజపాళికన్-ఒప్పుచున్నస్తనప్రదేశము గలదానిని, పాదసేవకశిఖావళికాళికన్ పాదసేవక-తనయొక్క చరణములనుగొలుచుచున్న, శిఖావళిక-నెమిళ్ళయొక్క, అళికన్-చాలుగలిగినదానిని, అనగా గమన నైపుణ్యమును గాంచి నెమిళ్ళు పదసాన్నిధ్యమునకుఁ జేరినవనుట. కాళికన్-పార్వతిని, ప్రస్తుతించెదన్-స్తోత్రముచేసెదను, ఇందు "వాలికచూపులంబనుల, అనుచోటబిందువువచ్చుటకు 'క॥ నాంతములైనపదంబుల, పొంతంబై యున్నశబ్దములఁ గచటతపల్,దొంతి గజడదబ లగున,య్యంతన కారంబు సున్న యభినవదండీ" అని శాస్త్రము. ప్రథమపాదమున స్వరయతి చెప్పఁబడినది. "గీ॥ ప్రాదినిత్యసమాస శబ్దములుగాక, పెరపదంబులపై నచ్చు పెనసినప్పు, డన్నియును స్వరయతు లగుసాంబ గురుఁడ,ఇంద్రుఁ .డమరాన్వయాబ్ధిపూర్ణేందుఁ డనఁగ' అనం॥'పనుల వైపులుదెల్పు,అనుచోటద్వితీయకుఁ బ్రథమచెప్పబడుటకు 'సూ॥ ఇతరత్ర చద్వితీయా తస్యాః ప్రథమాచ జడపదానాంస్యాత్' వన్ను ఈపద్యమున ద్విప్రాసమును, పాలికన్-పాలికన్, పాలికన్-కాళికన్-కాళికన్ ఇవి యంత్యానుప్రాసాలంకారమును జెప్పఁబడినవి.

తా॥ దివ్యలోకప్రభుత్వాధికారిణియై దేవతాస్త్రీలకు గార్యముల నియమించి పనులనేర్పుచు సన్మానముగ గటాక్షదృష్టియుంచి పాలించుచుండునదియును, ప్రకాశించుచున్న వక్షస్థలముగలదియును, పరమేశ్వరునకు, బత్నియును, పాదముల నాశ్రయించియున్నమయూరసముదాయము గలదియును, అగు పార్వతిని స్తుతించుచున్నాను.

—॥ లక్ష్మీ స్తోత్రము ॥—

సీ॥ కొమ్ముపైఁ సవతిఁ ♦ గైకొనినిల్చె నని నాథు, ఱొమ్ముపై నిల్చెనా ♦ రూఢిమహిమ
నఖిలలోకాధీశుఁ ♦ డగునాయకునిఁ దెచ్చి, యిల్లటం బిచ్చిపు ♦ ట్టింటనిలిపెఁ
దనపేరు మున్నుగా ♦ ననిమిషాదులచేతఁ, బ్రణుతింపఁగాఁ జేసెఁ ♦ బ్రాణవిభుని
వినమజ్జనులఁ బ్రోవ ♦ నొనరించెఁ బతివాలుఁ, గన్నుదామరలందుఁ ♦ గాఁపురంబుఁ
తే॥ జక్కఁదనమున నీరేడు ♦ జగములందు, సవతుగాంచనిసుతుఁ గాంచె ♦ ధవునికరుణఁ
దలఁపఁ జెల్లదె గుణధన్యఁ ♦ గలుషశూన్య, సాధుమాన్యఁ గృపానన్య ♦ జలధికన్య. 6.

అ. కొమ్ముపైన్ – భర్త తనయొక్క కొమ్ముమీఁద, సవతిన్ – తనసవతి యైనభూదేవిని, కైకొనినిల్చెన్ – గ్రహించి నిలుచుండెను, అని – ఇట్లుదలంచి, యజ్ఞవరాహరూపమున విష్ణువు భూదేవిని కొమ్ముపై నిల్పినాఁ డనిభావము. ఆరూఢిమహిమన్ – నిశ్చయ మైనమాహాత్మ్యముచేత, నాథుఱొమ్ముపైన్ – పెనిమిటియొక్క యురస్స్థలముమీఁద, నిల్చెన్ – ఉండెను, అఖిలలోకాధీశుఁడు. అఖిల – సమస్తమైన, లోక – జగములకు, అధీశుఁడు – ప్రభువు. అగునాయకునిన్ – అయినట్టి తనయొక్క భర్తను, తెచ్చి – రప్పించి, ఇల్లటంబు – వరునికి శ్వశురగృహావాసము, అల్లుఁడు తనభార్యతో నత్తవారియింటనే కాఁపురముండుట. ఇచ్చి – నిర్ణయించి, ఇచట ఇల్లు + అటు – ఇల్లటము. పుట్టింటన్ – తానుజన్మించిన గృహమునందు, నిలిపెన్ – నిలుకడయగునట్లు చేసెను, అనఁగా నెల్లప్పుడును బాలకడలియం దుండునట్లుచేసె ననుట. 'ఇల్లటంబుగఁ బుట్టి ♦ నింట నిలిపె' అని వ్రాఁతప్రతి. ఉదా. 'గీ. అర్యపైఁ బ్రేమ యొట్టిదో ♦ యద్రియింట, నిల్లటంబుండెఁ ద్రిభువనాధీశ్వరుండు" హర. అనిమిషాదులచేతన్ – దేవతలు మొదలగువారిచేత, తనపేరు – తనయొక్క నామధేయము, మున్నుగాన్ – ముందువచ్చునట్లుగా, ప్రాణవిభునిన్ – తనయొక్క పతిని, ప్రణుతింపన్ గాన్ – స్తుతించునట్లుగా, చేసెన్ – చేసెను, అనఁగా లక్ష్మీనారాయణ యనునట్లు చేసిన దనుట తా నెల్లప్పుడును విడువకయుండుటచేతనే లక్ష్మీనారాయణుఁ డనఁ దగియుండె ననియూహ్యము. వినమజ్జనులన్ – నమస్కరించుచున్నవారలను, ప్రోవన్ – రక్షించుటకొఱకు, పతివాలుఁగన్నుదామరలందున్ – పెనిమిటియొక్క వాలుచూపులు గలకన్నులనెడు పద్మములయందు, కాఁపురంబున్ – నివాసమును, ఒనరించెన్ – చేసెను, ధవునికరుణన్ – పతియనుగ్రహముచేత, చక్కఁదనమునన్ – సౌందర్యమునందు, ఇచట 'చక్కఁదనము అనుటకు "సూ. తనేచతుత్రచిదతో వికారాచ్చాపికేచన, అమిత్రేత్రీ సమాత్కేచిత్ ప్రయోగశ్శరణంకవేః" అథ. ఈరేడుజగములందున్ – పదునాలుగు భువనములయందును, సవతుగాంచనిసుతున్ – సామ్యములేనికుమారుని, 'ని. గీ. సవతు నాఁగ సమానము సామ్య మాను' ఆం. వ. ని. ఉదా 'వ. సవతు లేని యభినవాకారంబుతోడ' భోజ. కాంచెన్ – కనెను, అట్టి గుణధన్యన్ – పుణ్యవంత మగుగుణములుగలదానిని, 'ని. ధన్యం పుణ్యవతి త్రిషు' 'మే. కలుషశూన్యన్ – పాపరహితయైనదానిని, సాధుమాన్యన్ – సజ్జనులచేతఁ గొనియాడఁ దగినదానిని, కృపానన్యన్ – దయచేత అధికురాలగుదానిని, 'ని. అనోన్య భిన్నసమానయోః' విశ్వ. జలధికన్యన్ – కడలిపూఁతు రగులక్ష్మీదేవిని, తలఁపన్ + చెల్లదె – స్మరించుట యొప్పదా.

ఇందు 'గుణధన్య - కలుషశూన్య - సాధుమాన్య - కృపానన్య' అను శబ్దములను నాలుగుపాదములకుఁ గ్రమముగా నన్వయింపఁబడి యుండుటచే యథాసంఖ్యాలంకారము. "యథాసంఖ్యం క్రమేణైవ క్రమికాణాం సమన్వయః" కా. ప్ర. లక్ష్మీదేవియొక్క సర్వోత్కర్ష వర్ణనముచేత నుదాత్తాలంకారమును, 'ధన్య - శూన్య - మాన్య - నన్య - కన్య' ఇవియనుప్రాసాలంకారమును 'అఖిలలో......నిలిచె' అనుటచే లక్ష్మీదేవిని స్వాధీనపతికగా వర్ణించినాఁడు. "వరుఁడు కైవసమైనవనిత స్వాధీనభర్తృక" కా. సం. ఏకాయత్తోఽనుకూలఃస్యాత్' అనియుండుటచే విష్ణువునను కూలనాయకునిగను వర్ణించినాఁడు. 'కొమ్మపై......మహిమ' అనుటచే దక్షిణ నాయకత్వము కూడవిశదమగుచున్నది. 'తుల్యోఽనేకత్రదక్షిణః' ప్ర. తా. అయినను కవిసమర్థనమే ముఖ్యమైనది.

తా॥ తనసవతి యగుభూదేవిని విష్ణుమూర్తి యాదివరాహరూపముతోఁ దనకొమ్మిుఁద నిలిపె, నని తానును గుణగరిష్ఠయగుటచేఁ బతియక్కునసే వసించినదియును, జగన్నాథుఁ డగుయజమానునిఁ దనపుట్టింటికి రప్పించి కాఁపుర ముండున ట్లొనరించిన నిష్కళంకయును, దేవతలు మున్నగువారిచేఁ దనపేరు ముందుగా వచ్చునట్లు పతిని బిలువఁ జేసిన సజ్జనగణనీయయును, నాయకుని నేత్రకమలముల యందుండి భక్తులను గాపాడుచున్న దయామయయును, పదునాలుగులోకములయందు సాటి లేని యందగాఁడగు కొడుకునుగనినదియును, అగు కడలిపట్టిని స్తుతించెదను.

## —: సరస్వతీ ప్రార్థనము :—

శా॥ భూషామౌక్తికకాంతి దేహరుచితోఁ ♦ బోరాటమాడన్ మరు
ద్యోషారత్నకిరీటఝాటసుషమా ♦ యోయుజ్యమానాంఘ్రి ని
శ్శేషశ్రీ) వికచమ్మగద్దియ సమా ♦ శ్లేషింపఁ గొల్వుండు నా
భాషాదేవిఁ దలంచెదన్ రసలస ♦ ద్భాషావిశేషార్థినై. 7.

అ॥ భూషామౌక్తికకాంతి. భూషా - అభరణములయందలి, మౌక్తిక - ముత్యములయొక్క, కాంతి - శోభ, దేహరుచితోఁ - తనయొక్కశరీర కాంతితో, పోరాటమాడన్ - సాటిరావలయు నని ప్రయత్నించఁగా, (పాఠాం. పోరామిఁజూపన్ - స్నేహమును దెలియఁజేయఁగా) మరుద్యో...
......షశ్రీ. మరుత్ + యోషా - దేవతాస్త్రీలయొక్క, రత్నకిరీట - మణిమయము లగుమకుటములయొక్క, ఝాట - సమూహముయొక్క, 'ని. ఝాటము - స. సమూహము' శ. చం. సుషమా - అధికమైనకాంతిని, 'ని. సుషమాపరమాశోభా' అమ. యోయుజ్యమాన - మిక్కిలి కూడుచున్న, అంఘ్రి - పాదములయొక్క, నిశ్శేషశ్రీ - సంపూర్ణమైనసంపద 'ని. విశ్వమశేషం కృత్స్నం సమస్తనిఖిలాఖిలాని నిశ్శేషం' అ. వికచమ్మగద్దియన్ - వికసించిన సితపద్మపీఠమును పుండరీకపీఠమును, సమాశ్లేషింపన్ - మిక్కిలి కలియఁగా 'నా. శ్లిషఆలింగనే' ఉదా 'పతిం సమాశ్లిక్షదుపాంతికస్థమ్' రాఘ. కొల్వుండునాభాషాదేవిన్ - కొలువుదీరియున్న సరస్వతీదేవిని, రసలసద్భాషావిశేషార్థినై. రస - శృంగారాది నవరసములచేత, లసత్ - ఒప్పుచున్న, భాషా-పలుకులయొక్క, విశేష-రమ్యమును, 'ని.విశేష స్త్రిలకే ఒవ్యక్తౌ ప్రతీకేఒత్యంతభేదకే' విశ్వ. అర్థిన్ + ఐ-కోరువాఁడనై, తలంచెదన్ - స్మరించెదను, ఇందు "భూషా......పోరాటమాడన్" అనుటచే

నుపమాలంకారము, "స్పర్ధతేజయతిద్వేష్టి ద్రుహ్యతిప్రతిగర్జతి, ఆక్రోశత్యవజానాతి కదర్థయతినిందతి తస్య చానుకరోతీతి శబ్దాః సాదృశ్యవాచకాః, ఉపమాయామిమేప్రోక్తాః కవీనాంబుద్ధి సౌఖ్యదాః" అనినండి. 'విశదమ్మగద్దియ' రూపకాలంకారము.

తా॥ అభరణములయందలి ముత్యములకాంతి శరీరచ్ఛాయతో సాటిరాఁదలఁచుచుండఁగాను, దేవతాస్త్రీలయొక్క మకుటములయందుఁగూర్పఁబడిన వివిధమణులయొక్క కాంతులతోఁ గూడినవై పాదములసంపద పుండరీకాసనమునఁ గలియఁగాను, గొలువుదీరియున్న వాగ్దేవతను నవరసపూరితములై మనోహరము అగు వాక్కుల నొసంగుటకొఱకుఁ బ్రణుతించెదను.

ఉ॥ చెక్కిటఁ బత్త్రివల్లరి సృ ♦ జింపఁగఁబూని మనోజకేళి నా
యక్క అదీర్ప వేఁయనుచు ♦ నక్షరపఙ్క్తి లిఖింపఁగాఁ దద
న్యక్కృతకైతవంబు హృద ♦ యంబున నారసి ప్రాణనాథుతో
నొక్కపిసాళినవ్వు నస ♦ లొత్తఁగనవ్వెడువాణిఁ గొల్చెదన్. 8.

అ॥ బ్రహ్మ అధ్యాహారము. చెక్కిటన్–చెక్కిలియందు, పత్త్రివల్లరి–(కస్తూరితో) మకరికాపత్త్రములయొక్క తీఁగలను, 'ని॥ పత్త్రావళిః పత్త్రలతాపత్త్రభఙ్గశ్చపత్త్రికమ్' అమ॥ శే॥ ని, వ్రతతీవల్లరీ లతా। వల్లీనామాని యోజ్యాని. ధనం. సృజింపఁగన్–లిఖించుటకు వ్రాయుటకు, పూని–కడంగి, మనోజకేళిన్–మన్మథక్రీడయందు, నాయక్క అదీర్ప వే–నాపనిసవరించుము, అనుచున్–ఇట్లు తెలియఁజేయుచు, అక్షరపఙ్క్తిన్–అక్కరములచాలును, లిఖింపఁగాన్–వ్రాయఁగా ; తదన్యక్కృతకైవతంబు తత్ – అయొక్క, అన్యక్కృత–తిరస్కారముగాని– ఇష్టమైనయనుట, కైతవంబు–మర్మమును, 'నికటోఽ స్త్రీ వ్యాజదంభోపధయశ్ఛద్మకైతవే, అ॥హృదయంబునన్–తనమనస్సున, అరసి–పరిశీలించి, ప్రాణనాథుతోన్–తనవల్లభునితో. భర్తవంకఁజూచియనుట. ఒక్కపిసాళినవ్వు – ఒకనెపముతో గూడినవ్వును, నసలొత్తఁగన్–ఆచెక్కిలిపై వ్రాయఁబడిన చిగురుటాకులను ద్రోచునట్లు, నవ్వెడు వాణిన్–హాసముచేయుచున్న సరస్వతిని, కొల్చెదన్–సేవించెదను, ఇందు 'నవ్వునసలొత్తఁగనవ్వెడు వాణిఁ' అనుటకు "సూ॥ప్రసిద్ధాస్వా ద్విశేషస్య పునరుక్తిర్నదోషకృత్' అధ॥ ; గీర్వాణభాషయందును. "వాచ మాచేసు ధారారాంవధురాం మధుసూదనః, ఇత్యాదులుదాహరణములు.ఇచట 'చెక్కిట...దీర్ప వే, అని యక్షరములను లిఖించుటచే బ్రహ్మయనుకూలనాయకుఁడుగా వర్ణింపఁబడినాఁడు. "ఒక్క కాంతకే, వలచి గుణాభిరాముఁ డగు♦వాఁ డనుకూలుఁడు, శా॥ సం॥ ఉదా "లోలయన్నలకాన్ప్రోష్టాన్ రచయన్పత్త్రమంజరీః, ఏకాంవినోదయన్కాంతాఁ ఛాయావదనువర్తతే. సరస్వతియు "అన్యక్కృత...వాణిన్, అనుటచేఁ బ్రియునిచేలాలింపఁబడుటవలన స్వాధీనపతికగా వర్ణింపఁబడినది. 'ప్రియోపలాలితా నిత్యం స్వాధీనపతికా మతా, ప్రతా. ఈభావముచే నరస్వతి స్వీయగా వర్ణింపఁబడినది.పత్త్రవల్లరివ్రాయుము నక్షరములంలిఖించుటచేత నిచట బ్రహ్మకువిభ్రమమను చేష్టాభావముచెప్పఁబడినది. 'త్వరయాహర్షరాగాదే ర్దయితాగమనాదిషు, అస్థానభూషణాదీనాం విన్యాసో విభ్రమో మతః సా॥ ద॥ "క॥ త్రపా। సాముగ్రీశీలార్జవ। కోమలకమనీయ స్వీయ♦గుణములఁ జెలఁగున్, నరస. సరస్వతిని శృంగారప్రసంగావస్థలో నున్నట్లు వర్ణించుటచేతఁ దనకావ్యము శృంగారరస భూయిష్ఠమై ప్రకాశింపఁగల దనిభావము. ఈ కవియే మఱొకచోట "కల్యాణి వాణి కరవాణి తవాపికాపం

దుర్వారజాడ్యహరణం చరణప్రణామం, ఏషానవీనరచనా మమ యేన విద్వ, శ్శ్వేతచ్ఛమత్కృతికరీ ప్రసరీ సరీతి, అని ప్రార్థించినాఁడు.

తా॥ బ్రహ్మ తనచెక్కిలియందు మకరికాపత్త్రములను వ్రాయుచు రతికేళియందు నాకొరికి దీర్పు మను నక్షరములను వ్రాయఁగా నది కనుఁగొని యందులకు సమ్మతించినభావముతో నేదియో యొకనెపమునఁ దనచెక్కిటఁగల మకరికాపత్త్రములు తుడుచుకొనునట్లు నవ్వుచున్న సరస్వతీదేవిని సేవించెదను.

## —♦ కుకవిదూషణము ♦—

ఉ॥ శుష్కవచశ్శిలాతతుల ♦ సూటిగఁ జూచి మహాకవిశ్రవ
శ్శష్కులికావిదారణము ♦ సల్పఁగ నేర్చినజాణలార మీ
ముష్కరతాసమున్నతికి ♦ మ్రొక్కెద నాయెడఁ జూపరాకుఁడీ
దుష్కవులార సాధుజన ♦ దూషణభూషణ భూషితాత్ములై. 9.

అ॥ శుష్కవచశ్శిలాతతులన్. శుష్కవచః - శిలాతతులన్-వ్యర్థమైనవాక్కులనెడు రాలయొక్క సముదాయముతో, సూటిగన్-గుఱిగా, చూచి - కనిపెట్టి, మహా..............ణము. మహాకవి-గొప్పకవీశ్వరులయొక్క, శ్రవశ్శష్కులికా-కర్ణరంధ్రములను, విదారణము-బ్రద్దలుచేయుట, సల్పఁగన్-ఆచరించుటను, నేర్చినజాణలార-అభ్యసించిన చాతుర్యముగల పురుషులారా, 'సూ॥ ఆమన్త్రిణసుజసోస్తః క్రమేణచాదారదాగమావన్తే' శబ్ద చి.॥ మీముష్కరతాసమున్నతికిన్-మీమూఢత్వముయొక్క యధికమునకు, ఇచట ముష్కరశబ్దమునుగూర్చి 'సూ-ఊషసుషిముష్కమధోరః, సిద్ధాం॥ 'ఊషరః-సుషిరః-ముష్కః-అణ్డఃముష్కరః మధు-మాధుర్యంమధురః, ఉన్నతిశబ్దమునుగూర్చి. 'ని॥ఉన్నతి స్త్వార్యదారేషు. సమృద్ధావుదయేఽపిచ, విశ్వ. మ్రొక్కెదన్-సమస్కరించెదను, దుష్కవులార-దుష్టత్వముగలకవులారా, దుష్కవులనఁగా నిషేధింపఁ దగినకవులు 'ని॥ దుర్నిషేధే చ కష్టేచ, మేది. సాధు..........లై. సాధుజన-మంచివారియొక్క - సజ్జనులయొక్క, దూషణ-నిందలే, భూషణ-ఆభరణముగా భూషణములుగా, భూషిత- అలంకరింపబడిన, ఆత్మలై-దేహములుగలవారై, నాయెడన్-నాయందు, చూపరాకుఁడీ-కనఁబఱచుటకుఁ బ్రయత్నింపకుఁడు, ఇందు 'శుష్కవచశ్శిలాతతు, అనుటచే రూపకాలంకారము. 'తద్రూపకమభేదోయ. ఉపమానోపమేయయోః అతిసామ్యాదభేదః. కా॥ ప్ర॥ 'మీకఠోరవాక్కులచే మాశ్రవణరంధ్రముల బ్రద్దలుసేయకుఁడు మీసంపూర్ణమూఢత్వమునకు మ్రొక్కెద, ననుటచే వ్యాజస్తుత్యలంకారము. 'క॥ సతతంబు నిందచేతను। స్తుతియున్ స్తుతిచేత నిందఁజెప్పడ వ్యాజ। స్తుతి యై చెలువగు, నరస. కువలయానందమునను 'ఉక్తి ర్వ్యాజస్తుతిర్నిందా. స్తుతిభ్యాంస్తుతినిందయోః, అని వచింపఁబడియున్నది. ఉదా 'సీ॥ ఏమహాత్ములు గల్గ♦ భూమీశసభలలోఁ। గవులకు మిగులవిఖ్యాతిగల్గె, ఇది పైకిస్తుతిగా నున్నను నిజముగ నిందయే. దుష్కవులు పుట్టుటవలననే కవులకు సుకవు లనుప్రసిద్ధి కలిగినదనిభావము. ఇమ్మహాకవియే వేఱొకచోట యెట్లుచెప్పెనో తిలకింపుఁడు 'సంత స్సమస్తనిగమాగమతత్త్వనిష్ఠాః। శ్రీ మత్ప్రణామవిధయే కరపుటోఽసౌ। ఏనం మయాభినవనిర్మిత మాదరేణ। నిర్మత్సరేణ మనసా పరిశీలయంతు, రాష్ట్రా.

పింగళిసూరనార్యుఁడు శ్లేషకావ్యము వ్రాయఁగలిగియు దుష్కవుల నింత మృదువుగాఁ దిట్టనేరక రాఘవపాండవీయమున "క॥ ఈవిధి నభీష్టసిద్ధికి, దైవతకవి నుతియొనర్చి ♦ తప్పొప్పుమదిన్, భావించి దిద్దుకుండను, దేవానాంప్రియుల మ్రొక్కి ♦ తెలతుఁ గుకవులన్" "అనినాఁడు_బట్టుమూర్తిమాత్రము.

సీ॥ ఏమహాత్ములుఁగల్గ ♦ భూమీశసభలలోఁ, గవులకు నధికవి ♦ ఖ్యాతిగల్గె
నేకృతార్థులుఁగల్గ ♦ నెల్లపామరులకు, గణనమీరుప్రబంధ ♦ కములుఁగల్గె
నేవాఙ్నిధులుగల్గ ♦ నిరనొందురసికుల. కమితలీలావినో ♦ దములుఁగల్గె
నేప్రవీణులుగల్గ ♦ నిలనలంకృతికృతో, ద్యములకు దోషల ♦ క్ష్యములుఁగల్గె
తే॥ నేదయాళులుఁబుధవ్రా ♦ హేతిచకిత, విసరదపశబ్దభరణలా ♦ లసముఖాబ్జు
లట్టినిఖిలోపకారధీ ♦ రాత్ములయిన, సకలకవిధూర్వహులకునం ♦ జలియొనర్తు" అనినాఁడు.

తా. మహాకవులచెవి సోఁకినంతనే కఠోరములుగాఁ దోఁచునపశబ్దముల నచ్చటచ్చట నేర్పుగాఁ గూర్చుచు సత్కవులచే నెల్లప్పుడు నిందింపఁబడుచుండుటయే యలంకారముగాఁ గల యో చెడ్డకవులారా! మీయొక్క యవివేకాతిశయమునకుఁ గేలు మోడ్చుచున్నాను. మీచతుర్తను మాత్రము నాపొత్తమునఁ జూపకుఁడు.

క॥ అని యిష్టదేవతాప్రార్థన మాపాదించి గురులఁ ♦ బ్రణుతించి పురా
తనకవుల నెంచి దుష్కవి, జనపశువుల కోఁడించి ♦ సమ్మదమొదవన్. 10

అ॥ అని=ఈప్రకారంబుగా, ఇష్టదేవతాప్రార్థనము_ఇష్టదేవతలను వేఁడుకొనుట, ఇచట 'అని+ఇష్టదేవత, ఈపదములకు సంధిలేదు 'సూ॥ సంధిర్నాచోచ్యనుత్తః'' నన్న. ఆపాదించి–చేసి, వైసూత్రము చేత నేయిచ్చట సంధినిత్యము, 'సూ॥ ఙుఙ్మహత్పదానాంవా, నన్న। గురులన్–గురువులను, ప్రణుతించి–స్తోత్రముచేసి, పురాతనకవులన్–మునుపటికవీశ్వరులను–తొల్లింటికవులను, ఎంచి–తలంచి, దుష్కవిజనపశువులన్, దుష్కవిజనపశువులన్–చెడ్డకవులయొక్క సమూహమనెడి పశువులను, అనఁగాఁ బశువులవంటి దుష్కవిసముదాయము ననుట. కోఁడించి – అపహసించి, 'కోరసించి, అనివాండ్రప్రతీతి, ఈపద్యమున, క్త్వార్థకపదప్రయోగములనుగూర్చి 'సూ॥ క్రియయా ఉపచారస్యాత్ ప్రథమాపదసంగతః, అకర్మకత్వం ప్రాయస్స్యాత్ పరతోఽభయసమ్మతిః'' అని, సమ్మదము – సంతోషము, ఒదవన్ — కలుగఁగా. ఇందు 'దుష్కవిజనపశువులు, రూపకాలంకారము 'దించి–తించి–నెంచి–డించి, అను ప్రాసాలంకారము.

తా॥ ఈప్రకారముగా నిష్టదేవతల నర్థించి గురువులను స్తుతించి పూర్వకవులఁ దలంచి దుష్కవుల నపహసించి సంతసముతో.

వ॥ ఏనొక్కమహాప్రబంధంబు సేయ నూహించియున్న సమయంబున. 11

అ. ఏను, ఒక్కమహాప్రబంధంబు – ఒకమహాకావ్యమును, చేయన్– రచించుటకు, ఇచట ద్వితీయకుఁ బ్రథమ చెప్పఁబడినది. 'సూ॥ ఇతరత్ర చ ద్వితీయా తస్యాః ప్రథమా చ జడపదానాంస్యాత్'' శబ్దచిం. ఊహించి+ఉన్నసమయంబునన్ – భావించియుండిన కాలమునందు,

## —♦ కృతిప్రశంస ♦—

సీ॥ శార్దూలచర్మమో ♦ జాళువాచేలయో, కాని నిద్దపుమేనఁ ♦ గట్టినాఁడు
కమనీయ భస్మమో ♦ గంధచూర్ణము కాని, వాసనల్ వెదఁజల్లఁ♦బూసినాఁడు
ధవళ భుజంగమో ♦ తారహారము కాని, మృదుతరగ్రీవ ధ ♦ రించినాఁడు
తతజటాజూటమో ♦ ధమ్మిల్లమో కాని, పొలుపార నౌదలఁ♦బూనినాఁడు

తే॥ చంద్రఖండంబొ పుష్పగు ♦ చ్ఛంబొ కాని, మూర్ధసీమ నతిప్రేమ♦ముడిచినాఁడు
జంగమొక్కండు నిర్జితా ♦ నంగమూర్తి, నిదురవోవంగ వచ్చి నా♦యెదురనిల్చె 12.

అ॥ శార్దూల చర్మమో – (పసుపు యెఱుపు నలుపు గూడిన మూఁడువన్నెలు గలదియైన) పెద్దపులియొక్క యజినమో' 'ని॥ 'అజినంచర్మకృత్తిః స్త్రీ' అ॥ జాళువాచేలయో – అపరంజివ స్త్రమో, కాని – ఇదిసందేహార్థకము. 'ని॥ గీ॥ కాని కానీ యనంగ వి♦కల్పమునకు, నెమటివాగ్విరుద్ధమునకు, ఆం. ప. ని. అంతటనిల్లైగ్రహించునది. నిద్దపుమేనన్ – నున్ననిశరీరమున, కట్టినాఁడు– ధరించినాఁడు, కమనీయభస్మమో – మనోహరమైనభూతియో, గంధచూర్ణము – పరిమళముగల గంధపుఁబొడియో, కాని, వాసనల్ – పరిమళములు, వెదఁజల్లన్ – చెల్లాచెదరు కాఁగా, అంతట నిండఁగాననుట, పూసినాఁడు – రాచినాఁడు, ధవళభుజంగమో – తెల్లనిదైన పామో, తారహారము– ముత్తెములయొక్క సరమో, కాని, మృదుతరగ్రీవన్ – కోమలమైనకంఠమున, ధరించినాఁడు – తాల్చినాఁడు, తతజటాజూటమో – విస్తారముగాఁ జుట్టిన జడలయొక్క ముడియో, ధమ్మిల్లమో – పూవులు మొదలగునవి చుట్టినముడియో, కాని, పొలుపారన్ – ఒప్పునట్లుగా, ఔదలన్ – తలమీఁద – నడితలను, పూనినాఁడు – తాల్చినాఁడు, చంద్రఖండంబొ – చంద్రునియొక్క కళయో, పుష్పగుచ్ఛంబొ – పువ్వులయొక్క గుత్తియో, కాని, మూర్ధసీమన్ – తలయందు, అతిప్రేమన్ – మిక్కిలి పేరిమితో, ముడిచినాఁడు – ఆకుంచనము చేసినాఁడు, నిర్జితానంగమూర్తి – ఓడిపోఁగొట్టఁబడిన మన్మథుఁడు గలశరీరముతోఁ గూడినవాఁడు, జంగమొక్కండు – ఒకజంగముదేవర, ఇచట 'ఒక్కండు, అనుశబ్దమునుగూర్చి 'సూ॥ విశేషణానాంమహతో డుజ్స్యాదుభయథాఽపిచ, క్వచిడ్డుజ్మాత్రకే స్వార్థవిశేషణ మిహోచ్యతే॥' అథ. నిదుర+పోవంగన్ – నేను నిద్రించుచుండఁగా' వచ్చి – అగతుఁడై, నాయెదురనిల్చెన్ – నాముందరనిలఁబడెను, అనఁగా స్వప్నమునఁబ్రత్యక్షమయ్యెననుట. ఇందు 'నిదురవోవంగన్, అనుటకు 'సూ॥ గసడదవా స్స్యుః ప్రథమమాత్రా దాత్మాస్మదోర్వైసె వేతే, నన్న; 'ఎదురనిల్చె, అనుటకు 'సూ॥ ప్రకృత్యుక్తప్రకారేణ. రచనా రసరంజనీ, అథ. ఉదా. 'క॥ అమ్మనియెదుర నిలువ భయపడి, విష్ణు పు. ఇందు 'జంగమొక్కండు నిర్జితానంగమూర్తి అనుటచే నిశ్చయాంతసందేహాలంకారము. 'విషయే విషయీ యత్ర' సాదృశ్యాత్కవిసమ్మతాత్ సందేహగోచరో స్యాత్తాం సందేహాలంకృతిశ్చ సా, ప్రతా ''ససందేహస్తుభేదోక్తౌ. తదనుక్తౌచ సంశయః, ఉదా 'ఇందుఃకింక్వకళంకః సరసిజమేతత్కిమంబు కుత్రగతం. లలితవిలాసవచనై ర్ముఖమితి హరిణాక్షి నిశ్చితం పరతః,, కా॥ ప్ర॥ 'క్రిమస్థికాలాకిముకౌస్తుభంవా, పరిష్క్రియాయాంబహుమన్యసేత్వం, కింకాలకూటః కిమువా యశోదాస్తన్యం తవ స్వాదువదప్రభో మే,

తా॥ పులితోలువలువయో పసిఁడిదోవతియో కాని తననునుపైనమేనఁ గట్టికొనినాఁడు. ఇం పైనబూడిదయో మంచిగంధపుపంకమో కాని తావు లెల్లెడ నిండున ట్లలఁదుకొనినాఁడు. సర్పహారమో ముత్తియములహారమో కాని కోమల మగుకంఠమున ధరించినాఁడు. జడలను జుట్టియుండెనో పువ్వులు కట్టి ముడివైచికొనెనో కాని శిరోమధ్యమున నొప్పుచున్నది. బాలచంద్రుఁడో పూగుత్తియో కాని తలయందు ముడిచినాఁడు. ఇట్టి సోయగముతో మన్మథునిఁ గెలిచినయొకజంగముదేవర నేను నిద్రించుచున్నతఱి స్వప్నమున సాక్షాత్కరించెను.

క॥ నిలిచినఁ దచ్చరణాంబుజ, ములకు ననేకప్రణామ ♦ ములు సేసి కృతాం
జలినైన నన్నుఁ గని కో, మలవిరళగభీరధీర ♦ మధురోక్తులచేన్. 13

అ॥ నిలిచినన్ — అట్లునిలువఁబడఁగా, తచ్చరణాంబుజములకున్ — ఆయనయొక్క కమలముల వంటి పాదములకు, 'ని॥ పదంఘ్రిశ్చరణోఽ స్త్రియామ్. అ. అనేకప్రణామములు — అనేకములగు నమస్కారములు, చేసి — ఒనరించి, కృతాంజలిన్ అందలిబద్ధుఁడను, ఐననన్నున్ — అయినట్టి నన్ను, కని — చూచి, కోమ.........లచేన్. కోమల — మృదువైనట్టియు, విరళ — ఎడమైనట్టియు — నిలుపుదలగలిగినట్టియు, గభీర — గంభీరమైనట్టియు—అనఁగా విశేషభావముకలిగినట్టియు ననుట, 'ని॥ నిమ్నం గభీరగంభీరం, అ. ధీర — ధైర్యముతోఁగూడినట్టియు, మధురోక్తులచేన్— తీయనిమాటలతో, మీఁదిపద్యముతో నన్వయము. ఇట్లన్వయించుటకు "సూ॥ పద్యంబులకుఁగులకం బగు" పౌ॥ వ్యా॥ ఇందుఁ బద్యాంతమున 'మధురోక్తులచేన్, అనిద్రుతముతో నుండుటకు 'సూ॥ పద్యభేదావసానేతు శ్లిష్టతా నస్య కథ్యతే, అథ. ఉదా॥"క. ఏతాదృశగుణమహిమ, ఖ్యాతాసమస మరవిధికిఁ♦గరుణాంబుధికిన్, గీతపద్యాదులయందుమాత్రము నకారములోపించును, 'కోమల...... మధురోక్తులు,ఉపమాలంకారము 'సాధర్మ్యముపమాభేదే, కా॥ ప్ర॥ ధీరధీర, అనుప్రాసాలంకారము.

తా॥ అట్టియెడ నాయెదుటనున్న యాశంకరునకు సాష్టాంగనమస్కారములొనర్చి దోసిలొగ్గి యున్న నన్నుఁ జూచి మృదువైనతీయనిమాటలతో గంభీరభావమును జూపుచుఁ దిన్నఁగా.

వ॥ కవీంద్రా! సమస్తరసనిస్తంద్రంబుగా నీవు సృజింపంబూనిన కావ్యకన్యాలలామంబున కుంకువగా నాయురారోగ్య మహాభాగ్యంబు లొసంగెద నన్నుం బరిణేతం జేయు మనియానతిచ్చెఁ దదనంతరంబ. 14.

అ॥ కవీంద్రా—కవులలో శ్రేష్ఠుఁడవైనవాఁడా, సమస్తరసనిస్తంద్రంబుగాన్. సమస్తరస—సమస్తమయిన రసములచేత, నిస్తంద్రంబుగాన్—ఏమఱుపాటులేకుండునట్లు — జాగ్రతతప్పకుండునట్లు, నీవు, సృజింపఁబూనిన—నిర్మించుటకుయత్నించిన, కావ్యకన్యాలలామంబునకున్ — ప్రబంధమనెడి శ్రేష్ఠమగు కన్యకు, 'ని॥ లలామోఽస్త్రీలలామాపి ప్రభావేపురుషేధ్వజే, శ్రేష్ఠభూషాపుండ్ర శృంగపుచ్ఛచిహ్నాశ్వ లింగిషు, యా॥ ఉంకువగాన్—కన్యాశుల్కధనముగా. అనఁగా వధువునకు వరుఁడిచ్చు ధనముగాననుట. ఉదా 'ఉ॥భవదీయశౌర్యమే. యుంకువచేసి కృష్ణపురుషోత్తముచేకొనిపొమ్ము, భా॥ ఆయురారోగ్య మహాభాగ్యంబులన్ — ఆయుష్యమును, ఆరోగ్యమును, గొప్పయైశ్వర్యమును, ఇది బహుపదేతరేతర యోగద్వంద్వసమాసము. ఒసంగెదన్ — ఇచట భాగ్యము అనుశబ్దమును 'భాగ్యంబు, అనుటకు సూ॥ స్యాదమహతాంవిభక్తౌసోఽ్వమ్, తదుపరి పునరుమ్బూప్రాచాం"నన్ను, ఇచ్చెదను, నన్ను, పరి

కేతన + చేయుము - భర్తగానొనరించుము. అని యానతిచ్చెన్-ఇట్లాజ్ఞయొసంగెను, తదనంతరంబ-అటుపిమ్మట, ఇచట 'కావ్య............లొసంగెద, అనుటచే రూపకాలంకారము.

తా॥ ఓకవిశ్రేష్ఠుఁడా శృంగారరసప్రధానముగా నీవు సృష్టింపయత్నించిన కావ్యమను శ్రేష్ఠమైనకన్యను శుల్కముగా నాయురారోగ్యైశ్వర్యముల నిచ్చెద నాకొసంగు మనిసెలవిచ్చె.

క॥ తలతల మనుచీఁకటితోఁ, దెలతెలవాఱంగ లేచి ♦ తెలియఁగ నపుడా
కలచందము నామనమునఁ, గలచందము నొక్కటైనఁ ♦ గడువేడుకతోన్. 15

అ॥ తలతలమనుచీఁకటితోన్ - తళుకుతళుకుమను కాంతిగలతిమిరముతో, ఇది. తళతళమను టకు రూపాంతరము. ద్విరుక్తినిగూర్చి 'సూ॥ క్వచిదర్థవిశేషేతు. పునరర్థసమాగమః, అథ॥ ఉదా 'క॥ ధళధళమని జలములలో, బలరిపువజ్రాయుధంబు♦ప్రతిబింబింపన్' శృం॥ నై॥ తెలతెలవాఱఁగన్-తెల్లఁగాఁదెల్లవాఱఁగానే, ఉదా 'క॥ తొలివేల్పులమొగములు తెల, తెలవాఱఁగఁ దెల్లవాఱెఁ♦దెలవలమోముల్, అచ్చ॥ తె॥ రా॥ లేచి-మేల్కాంచి, తెలియఁగన్-తెలిసికొనఁగా, అపుడు-ఆసమయమున. వచ్చినదైన, అకలచందమున్-ఆయొక్క స్వప్నము తెఱఁగును, నామనమునన్-నాయొక్క హృదయమునందు, కలచందమున్-ఉన్నవిధమును, ఒక్కటైనన్-ఏకము కాఁగా, కడువేడుకతోన్-మిక్కిలికుతూహలముతో, ముందరిపద్యముతో నన్వయము. ఇందు 'అకలచందము నామనమునఁ గలచందము, ఇది పదయమకాలంకారము. యమకం పౌనరుక్త్యేతు. స్వరవ్యంజనయుగ్మయోః; ప్రతా॥ 'తలతల మనుచీఁకటితోఁ, దెలతెలవాఱంగ, అనుటచేత ననుప్రాసాలంకారము. 'వర్ణసామ్య మనుప్రాసః, కా॥ ప్ర॥

తా॥ ఆచీఁకటియంతయుఁ బోయి తెల్లవాఱఁగానే యాకలతెఱంగును, నాహృదయమునఁగల తెఱంగును, ఏక మైనందున మిగులఁ గోరికతో.

ఉ॥ ముంగలనిల్చి సర్వజన ♦ మోహనదేహనవీనకాంతి మీ
రం గరుణానిరీక్షణప ♦ రంబుగ నీగతిఁ బల్కినట్టియా
జంగమసార్వభౌముని భు ♦ జంగమభూషణుఁ గా నెఱింగి యు
ప్పొంగి తరంగితప్రమద ♦ పూరితమానసపంకజుండ నై. 16

అ॥ ముంగలనిల్చి-నాప్రొలనిలువఁబడి, సాక్షాత్కరించియనుట, ముందు + కలను ముంగల. ఇది ముంగడయొక్కరూపాంతరము. ఉదా 'ఉ॥ మోదమునం దనూభవుని ♦ ముంగలిగా నడపించుఁ దాను, నిర్వ॥ సర్వ..............కాంతి. సర్వజన - సమస్తమైనమానవులకు, మోహన-భ్రాంతినిగలిగించునట్టి, దేహ-తనువుయొక్క, నవీన-నూతనమైన, క్రొత్తదియైనయనుట, కాంతి-శోభ, మీఱన్-అతి, శయించఁగా, కరుణానిరీక్షణపరంబుగన్, కరుణా - కృపతోఁగూడిన, నిరీక్షణ - చూపులయొక్క, పరంబుగన్-ప్రధానముగా, 'ని॥ పర స్స్యా దుత్తమానాత్మవైరిదూరేషు కేవలే, విశ్వ. 'పరందూరాన్యముఖ్యేషు. యా॥ ఈగతిన్-ఈతీరున, పల్కినట్టియాజంగమసార్వభౌమునిన్ - సంభాషించినటువంటి యాయొక్కజంగములలో మిగులశ్రేష్ఠుఁ డయినవానిని, భుజంగమభూషణుఁగాన్ - పాములే భూషణమ్ములుగాఁ గలశివునిగా, ఎఱింగి-తెలిసికొనినవాఁడనై, ఉప్పొంగి - మిక్కిలి సంతోషించి.

ఉబ్బి+పొంగు-ఉప్పొంగు. తర.........డవై-తరంగిత - అలలుగాఁజేయఁబడిన, ప్రమద - సంతోషముచేత, పూరిత - నిండింపఁబడిన, మానసపంకజుండవై - పద్మమువంటి హృదయముగలవాఁడవై, 'ని॥ స్వాంతంహృన్మానసంమనః, అ॥ ఇందు 'ముంగిల, అనుప్రయోగమునకు 'సూ॥ ఆచ్ఛికసమాసంబులం దఱమగ వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్యవైకల్పికములుగాఁ బెక్కులుగానంబడియెడి, ప్రౌ॥ వ్యా. 'మానసపంకజుండను, ఇది యుపమాలంకారము. 'మోహనదేహ, అను ప్రాసాలంకారము. జంగమసార్వభౌముని భుజంగమభూషణు, యను కాలంకారము, 'ఎగ్గి-ఉప్పొంగి-తరంగిత ,వృత్త్యనుప్రాసాలంకారము 'వర్ణసామ్య మనుప్రాసః. ఛేక వృత్తి గతో ద్విధా, సో ఽనేకస్య సకృత్పూర్వః. ఏకస్యాప్యసకృత్పరః, మాధుర్యవ్యంజకై ర్వర్ణై రుపనాగరికేష్యతే, ఓజః ప్రకాశకైస్తైశ్చపరుషా, కోమలాపరైః, కా॥ ప్ర॥ ఉదా 'తతో ఽరుణపరిస్పంద మందీకృతవపుః శశీ, దధ్రే కామపరిక్షామ కామినీగండపాండుతామ్, మ॥ భార॥

తా॥ ప్రత్యక్షమై సమస్తజనులకు నాశ్చర్యమునుగలిగించునటువంటి యందముతోఁగూడిన శరీరముయొక్క ప్రకాశముగలిగి దయాదృష్టితో నిట్లాజ్ఞయొసంగిన యాజంగమశ్రేష్ఠుని శివపరమేశ్వరుఁ డని తెలిసికొని సంతోషాతిశయ మనునలలతోఁ గూడిన హృదయకమలము గలవాఁడవై.

ఉ॥ నామది నెప్పుడుం బ్రమథ ♦ నాయకు నిష్టసుఖప్రదాయకున్
సోమశరీరు దానవస ♦ మూహశరారుఁ గృతీశుఁ జేయఁగాఁ
బ్రేమజనించు నాదరణ ♦ పేశలుఁ డమ్మహనీయమూర్తియే
మామకభాగ్యసంపద ను ♦ మాసముదంచితవామభాగుఁ డై. 17.

అ॥ నామదిన్ - నాయొక్కమనస్సునందు, ఎప్పుడున్-ఎల్లప్పుడును, ప్రమథనాయకున్-పారిషదులకు యజమానుఁ డైనవానిని, 'ని॥ ప్రమథా స్స్యుః పారిషదాః, అమ. ఇష్టసుఖ ప్రదాయకున్. ఇష్ట - కోరఁబడిన, సుఖ - సంతోషములను, ప్రదాయకున్ - ఇచ్చునట్టివానిని, సోమశరీరున్ - పార్వతితోఁ గూడినమేను గలవానిని, 'వ్యు॥ ఉమయా సహ వర్తత ఇతి సోమః, దానవసమూహశరారున్ - రాక్షసులను జంపువానిని, "ని॥ 'శరారు ర్ఘాతుకో హింస్రః, అమ. ఇచట దైత్యులను, దానవులను, దితి దనుల పుత్రులను గలిపి యొక రాక్షసశబ్దముతోనే సమన్వయముచేయుట ప్రసిద్ధియైయున్నది. "కమలాసంపదోః, కామ ధ్వజే మకరమత్స్యయోః, దానవాసురదైత్యానా, మైక్యమేవాభిసమ్మతమ్" కా. క. ల. మఱియు. దానవసమూహః - శరఇవ - దానవసమూహశరః, దానవసమూహశరారున్ - అనఁగా బెబ్బులివంటి దైత్యులసముదాయమున కంగారకుఁ డైనవానిననియుఁ జెప్పవచ్చును, ఇది యుపమానోత్తరపద కర్మధారయ సమాసము. ఆరున్ - అంగారకుఁ డైనవానిని 'ని॥ ఆరః క్షితిసుతే ఽగ్నిజే, విశ్వ. ఇచట షష్ఠీతత్పురుషసమాసము అనఁగా రాక్షసుల సంహరించువాని ననుట, కృతీశున్ - నాప్రబంధమునకధిపతిని; అనఁగా నంకితముచు బొందినవానినిగా, చేయఁగాన్ - ఒనరించుటకు, ప్రేమజనించున్ - ఇష్టముకలుగుచుండును, ఆదరణ పేశలుఁడు. ఆదరణ - భక్తులు మొదలయినవారియందు దయగలిగియుండుటయందు, పేశలుఁడు - నేర్పుగలవాఁడు, అమ్మహనీయ మూర్తియే - (అయినట్టి) గొప్పవాఁడయిన యాయీశ్వరుఁడే, మామకభాగ్యసంపదన్. మామక - నాయొక్క; భాగ్యసంపదన్ - పుణ్యముయొక్క యధికమువలన, ఉమాసము

దంచిత వామభాగుఁడై. ఉమా – హైమవతితో, సమదంచిత – ఒప్పుచున్న, వామభాగుఁడై– ఎడమవైపుగలవాఁడై, పైపద్యముతో నన్వయము.

ఇందు ద్వితీయపాదమున 'సోమశరీర దానవసమూహశరారు, అని నిత్యసమాసయతి సెప్పం బడినది. సోమశబ్దమునందలి. 'ఉ,కారమునకును, సమూహశబ్దగతమైన 'ఊ.కారమునకును యతియొప్పుచున్నది. "వ్యు॥ సమ్యక్ + ఊహ్యతే + ఏకత్ర + ఇతి – సమూహః" 'గీ॥ ఒక్క సమసనమున శబ్దయుగము గూడి. పదము తేర్పాటుగాఁ గానఁ బడని ప్రాణ, సంధులను నిత్యసమసన క్రాంతు లును నఖండవిక్రమములు నన రెండుఁ జెల్లు, అప్పు. 'నాయకున్, దాయకున్, ఇత్యాదు లను ప్రాసాలంకారమును 'దానవ........శరారున్, అనుచోట నుపమాలంకారమును.

నా॥ నామనస్సున నెల్లప్పుడును గామితార్థప్రదుఁడును, త్రిపురధ్వంసకుండును, పార్వతీ సహితుఁడును, అగు శంకరుని కంకితమీయఁ గోరిక గలుగుచుండఁగా నింతలో నాయదృష్టమువలన, దయామయుఁ డగు నామహానుభావుఁడే పార్వతీసహితుఁడై,

తే॥ వచ్చి కృతికన్యకాసము ♦ ద్వాహమునకు, శుల్కముగ నాయురారోగ్య ♦ సుప్రసిద్ధు
లిత్తు నని యల్లుఁ డగుటకు ♦ నిచ్చగించె, నింతకంటెను సౌభాగ్య ♦ మెందుఁ గలదె? 18

అ॥ వచ్చి – నాసమీపమున కాగతుఁడై, కృతికన్యకా సముద్వాహమునకున్ – కృతికన్యకా– కావ్యమనెడు కన్యయొక్క, సముద్వాహమునకున్ – కల్యాణమునకు. శుల్కముగన్ – వధువున కొసంగునట్టి ధనముగా – పెండ్లికూఁతురి కిచ్చునట్టి సొమ్మునకు బదులుగా ననుట. ఆయురారోగ్య సుప్రసిద్ధులు – ఆయుష్యమును, ఆరోగ్యమును, అత్యంతప్రఖ్యాతియును, ఇత్తునని – ఒసంగెదనని, అల్లుఁడగుటకున్ – నాకుజామాతయగుటకును, 'ని॥ జామాతాదుహితుఃపతిః, అను. ఇచ్చగించెన్– సమ్మతించెను, ఇంతకంటెను – ఇంతకు మించినట్టి, సౌభాగ్యము – గొప్ప యదృష్టము, ఎందున్– ఎచ్చటనైనను, కలదె – ఉన్నదా–లేదనుట.

తా॥ సాక్షాత్కరించి నా యీ కావ్యకన్యను బాణిగ్రహణ మొనర్చుకొని యుంకువగా నాయు రారోగ్య సత్కీర్తుల నిత్తు నని ప్రేమపూర్వకముగా నిష్టపడెను. ఇంతకన్న గొప్పయదృష్ట మెంద యినఁ గలదా?

ఉ॥ కోమల వర్ణధామయును ♦ గోవిదసంస్తవనీయ లక్షణ
స్తోమఫలాభిరామయును ♦ శుంభదలంకరణ ప్రసాధన
క్షేమయు నప్రతర్క్యగుణ ♦ సీమయు నైన మదీయకావ్యక
న్యామణి నిచ్చి మంచుమల ♦ యల్లుని నల్లుని గానొనర్చెదన్. 19

ఈపద్యమునఁ గావ్యమునకుఁ గన్యాత్వ మారోపించి యర్థద్వయమునకు నభేదాధ్యవసాయ ముగాఁ జెప్పినాఁడు.

అ॥ (కా) కోమల వర్ణధామయును. కోమల – మృదువైన, 'ని॥ సుకుమారంతు, కోమలం మృదులంమృదు, అ. వర్ణ – అక్షరములకు – శబ్దములకుననుట, ధామయును – ఉనికిపట్టయి నట్టి యును, (క) కోమల – సుకుమారమైన, 'వ్యు॥ కామ్యతే జనై రితి కోమలమ్, వర్ణ – వంశమును,

ధామయును - పుట్టుక, గలదియును, 'ని॥ ధామ జన్మ ప్రభా స్థాన ప్రభావ సుఖసద్మసు, నానా, (కా) కోవిద........యును. కోవిద - విద్వాంసులచేత, సంస్తవనీయ - పొగడఁదగిన. లక్షణ- కవిత్వ లక్షణములయొక్క, స్తోమ—సమూహముయొక్క, ఫల - ప్రయోజనముతో, అభిరామ యును — రమ్యమైనట్టి యును. (క) కోవిద - తెలిసినవారిచేత, సంస్తనీయ - నుతింపఁదగిన, లక్షణ- శుభలక్షణములయొక్క, స్తోమ - సమూహముతోను, ఫల - భోగములతోను, 'ని॥ ఫల మిష్వగ్రే సస్యే ఫలకే జాతిఫలే ధనే ఫాలే. భోగబీజే లాభహేతూత్పన్నే ఫలీతు ఫలినీ స్యాత్, నానా, అభి గామయున్ - మనోహరమైనట్టిదియును, (కా) శుంభద............మయున్, శుంభతో - ఒప్పు చున్న, అలంకరణ - ఉపమాద్యలంకారములయొక్క, ప్రసాధన - ఉపాయములందు, స్థేమయున్- సామర్థ్యయుతమైనట్టియు, (క) శుంభత్ - ప్రకాశించుచున్న, అలంకరణ - అభరణాదులుధరించుట యందును, ప్రసాధన-వస్త్రమార్జ్యాదుల నలంకరించుకొనుటవలని యొప్పిదమునందును-అనఁగా వేష మును ధరిఁచిన కాంతియందును, 'ని॥ ఆకల్ప వేషౌ నైపథ్యం ప్రతికర్మ ప్రసాధనమ్, అమ॥ 'నేపథ్యంతు ప్రసాధనే రఁగభూమావేషభేదే, హై॥ స్థేమయున్-శక్తిగలదియును, (కా) అప్రత...మయున్. అప్రతర్క్య-ఊహింపసలవిగాని, గుణ - కావ్యప్రసిద్ధమైన శ్లేషప్రసాదాదిగుణములకు 'శ్లేషప్రసాద స్సమతా మాధుర్యం సుకుమారతా అర్థవ్యక్తి రుదారత్వం తథాకాంతి రుదాత్తతా 'ఓజః సుశబ్దతా ప్రేయా, నార్జత్య మథవిస్తరః సమాధి స్సౌక్ష్మగాంభీర్యే సంక్షేపో భావికంతథా' సమ్మితత్వం తథా ప్రౌఢీ రీతి రుక్తి ర్గతి స్తథా చతుర్వింశతి రేతే స్యు ర్గుణాః కావ్యప్రకాశకాః' ప్రతా॥ సీమయున్-ప్రదేశమైనట్టియును, (క) అప్రతర్క్య-ఊహింపఁదగని, గుణ-సద్గుణములకు, సీమయున్- ప్రదేశమైనదియును, ఐనమదీయ కావ్యకన్యామణిన్ - అయినట్టినాయొక్క-ప్రబంధమనెడి కన్యారత్న మును, ఇచ్చి-దానముచేసి, కన్యాదానమొనర్చియనుట. మంచుమలయల్లునిన్ - హిమవంతునికిజామాత యయినశివుని,ఇచట 'మంచుమలయల్లు'డు, అనుటకు 'సూ॥ షష్ఠీభవేద్ద్వితీయా తుల్యాతత్పురుషసంస్థితా నామ్నామ్' నన్న. అల్లునిగాన్-నాయొక్క-యల్లునిగా, ఒనర్చెదన్-చేసుకొనెదను, శ్లేషాలంకారము 'క॥ ప్రకృతములప్రకృతంబులు, ప్రకృతాప్రకృతములుశబ్ద ♦ పాటవమాత్ర, ప్రకటితసామ్యముఁజెందిన, నకలంకతిశ్లేషమయ్యె, కా॥ సఁ॥ 'శ్లేషః పవాక్యేఏకస్మిన్ యత్రానేకార్థతాభవేత్, కా॥ ప్ర॥

తా॥ మృదుపదభూయిష్టమైనదియును, పండితులచేఁ బ్రశంసింపఁదగినలక్షణములతోఁ గూడి యింపొలయునదియును, శబ్దార్థాలంకారములకు నిధియైనదియును, ఊహింపనలవిగాని యోజో మాధుర్యాదిగుణములచే నలరారుచున్నదియును, అయిన నాయొక్క-శ్రేష్ఠమైన కావ్యకన్యను బర మేశ్వరున కంకితముగా నొసంగి యంతటివాని నల్లునిగఁజేసికొని యానందించెదను.

సీ॥ తలపై వియద్గంగ ♦ గలుగునిత్యస్నాత, కైలాసగిరిదుర్గ ♦ మేలు నేత
త్రిపురంబు లోకకోలఁ ♦ ద్రెళ్లనేసినవాఁడు, కందర్పు గెల్చిన ♦ యందకాఁడు
పాఁపరాఁ దాల్చిన ♦ పసుఁడువిక్రమరంహుఁ, గరిదైత్యుఁబొరిగొన్న ♦ పురుషసింహు
డంబుజాక్షికి దేహ ♦ మర్ధ మిచ్చినదాత, కలితసారుఁ గుమారుఁ గన్నతాత

తే॥ మదవదరిదరిద్రాణదో ♦ ర్మండలాగ్ర, జాగ్రదసురాగ్రచరనిహిం ♦ సనవిశాల
శూలరాజపరిష్కార్య ♦ శూలినామ, ధన్యుఁడర్హుండు కాఁడెమ ♦ త్కావ్యమునకు 20

తా॥ తలపైన్ — నెత్తిమీఁద, వియద్గంగ — మిన్నువాఁక, కలుగు నిత్యస్నాత — ఉండినయెడ తెగని మజ్జనము కలవాఁడును, అనఁగా నిత్యస్నానము చేయువారలలో నెవ్వరును శివునివలె నాకాశగంగా జలములతో నెడతెగక చేయువారులే రనిభావము. కైలాసగిరిదుర్గమున్ — వెండికొండమీఁదికోటను, ఏలునేత — కాపాడునట్టిప్రభువును, అనఁగా నొరుల కెవ్వరికి శక్యముగాని రజతాచల శిఖరమున దుర్గమునిర్మించుకొని యచ్చటఁ బరిపాలన మొనర్చుచుండె ననిభావము. త్రిపురంబులు — దానవులవైన మూఁడునగరములు, 'సూ॥ తద్ధితార్థోత్తరపద సమాహారేచ, ఇతి సమాహారసమాసః. పాత్రాదిత్వాన్న పుంసకమ్. 'త్రయాణాంపురాణాంసమాహారః త్రిపురం, సిద్ధాఁ ఒకకోలన్ — ఒక్క — బాణముతో, త్రెళ్ళ నేసినవాఁడు — పడునట్లుగాఁ గొట్టినయతఁడును అనఁగాఁ బూర్వమొకప్పుడు దేవతలను నోడి యసురులు మయునిశరణుజొచ్చిరి. దయామయుఁ డగునమ్మయుఁడు వారికి గగనమున వెండితో నొకపట్టణమును, బంగారుతో నొకపట్టణమును, ఇనుముతో నొకపట్టణమును, నిర్మించి యవియదృశ్యములగా సంచరించునట్లొనర్చియిచ్చెను. అసురు లాపట్టణములచేఁ బోయి దేవాదులను బాధించుచుండఁగా బ్రహ్మయును విష్ణువును మాకుశక్యముకా దనిరి. అప్పుడు దేవతలందఱును శివునిఁ బ్రార్థింప నతఁడు భూమి రథముగను, మహామేరువు విల్లుగను, విష్ణువు సాయకముగను, సూర్యచంద్రులు రథచక్రములుగను, బ్రహ్మ సారథిగను శేషుఁడు వింటినారిగను, వేదములను గుఱ్ఱములుగను, అమర్చికొని వారితో యుద్ధముచేసి చంపినట్లును, ఆపట్టణముల మూఁడింటిని దనయగ్నినేత్రముచే నిర్మూలమొనర్చినట్లును, పురాణములయందుఁ జెప్పఁబడియున్నది. కనుక నట్టిజయశీలుఁడనిభావము. కందర్పున్ — మన్మథుని, గెల్చినయందకాఁడు — జయించినట్టి సౌందర్యవంతుఁడును, అనఁగా నీ మూఁడులోకములయందును లోకోత్తరసుందరుఁడు మన్మథుఁడుగనుక నట్టివానినిజయించినవాఁ డగుటచే నిట్లువర్ణించినాఁడు, పాఁపరాన్ — పాములకురాజయిన శేషుని, తాల్చినవఁడు — ఆభరణముగాధరించిన పరమాత్ముఁడును, ప్రపంచమున సహజముగా సర్పమును జూచి భయపడుచుందురు గదా. అట్టిసర్పములకురా జగు శేషునిజూచి యెంతభయపడవలయును ? ఆశేషుని సొమ్ములుగాధరించినవాఁ డెంతటిమహనీయుఁడో వర్ణింపఁదరముగాదుగదా ! అనిభావము. విక్రమరంహున్ — శౌర్యముయొక్క యధికము గలవానిని, కరిదైత్యున్ — గజాసురుని, పోఁగొన్న పురుషసింహుఁడు — నాశముచేసినట్టి పురుషశ్రేష్ఠుఁడును, ఇచట శౌర్యసమృద్ధిగలగజాసురుని సంహరించినసింహవిక్రముం డనిభావము, అంబుజాక్షికిన్ — పార్వతీదేవికి, దేహమున్ — తనయొక్క — శరీరమును, అర్ధము — సగపాలు, ఇచ్చినదాత — ఒసఁగినయుదారస్వభావము గలవాఁడును, లోకమున దాతలు ధనమో ధాన్యమో యేవో యిచ్చుచుందురు. వారివలెఁగాక తనదేహములో సగ మిచ్చినవాఁ డగుటచే నింతటిమహాదాతలేఁ డనిభావము. కలితసారున్ — పొందఁబడినబలముగలవానిని, కుమారున్ — షణ్ముఖుని, కన్నతాత — కనినతండ్రియును, అనఁగా శివుఁడు పంచముఖుఁ డగుటచేఁ దనకంటె నెక్కువశక్తి గలషణ్ముఖునిఁ గనినతండ్రి యనిభావము, మదవ........ధన్యుఁడు. మదవత్ — అహంకారముతోఁగూడిన, అరి — శత్రువులయొక్క, దరిద్రాణ — అల్పముగాఁజేయబడిన, దోర్మండల — భుజప్రదేశముగలవారిలో. అగ్ర — ముందర, జాగ్రత్ — తెలివి గలిగిపదిలపడుచున్న, అసుగ — రాక్షసులలో — అగ్రచర — ముఖ్యులైనవారిని, ఉదా 'గీ॥ జాగ్రదుగ్రప్రతాపుఁడీజనవిభుండు. శృం నై॥ నిహింసన — చంపునట్టి. విశాల — విరివియైన. 'ని॥ విశాలః పృథులేఽన్యవత్, విశ్వ. శూలరాజ — శ్రేష్ఠమైనశూలముతో, పరిష్కార్య — అలంకరింపఁబడిన, శూలి నామ — శూలముధరించువాఁడనుప్రసిద్ధిగల, 'ని॥ నామ ప్రాకాశ్యసంభావ్యకుత్సాభ్యుపగమేషుచ,

విశ్వ. ఉదా 'హిమాలయోనామ నగాధిరాజః, కుమా. ధన్యుఁడు-పుణ్యవంతుఁడు, మత్కావ్యము
నకున్-నాయొక్క ప్రబంధమునకు, అర్హుండు కాఁడె - తగినవాఁడు కాఁడా. ఇంతకంటె నెవ్వరుకల
రనుట, ఈపద్యమున అంద కాఁడు, అనుప్రయోగమునకు 'సూ॥ కాఁడుర్గాఁడుభివేదిఁడు. రక్తి
త్యాత్యర్థబోధకాః. ఏకత్వవాచకాత్పుంసి. స్యాద్వాఁడుస్త్వన్యథామతః అథ॥ ఇచటఁ గృతిపతియొక్క
శీల, సౌందర్య, పరాక్రమ, దాతృత్వాది సర్వోత్కర్ష వర్ణింపబడినందున నుదాత్తాలంకారము.
పద్యమునందంతట ననుప్రాసాలంకారము. 'కరిదైత్య........సింహుఁడు, ఇచట నుపమాలం
కారము. మఱియుఁ గృతినాయకుని లక్షణములు వర్ణింపఁబడినవి. 'క॥ కులము మహాభాగ్యము ను,
జ్జ్వలత యుదారత మహోవిశాలత ధర్మా, కలనయు వైదగ్ధియు నన, నిలనాయకగుణము
లమరు, నరస.

తా॥ శిరమున నాకాశగంగను ధరించి యెడతెగని స్నాన మాచరించుచున్న పవిత్రుండును,
వెండికొండపైఁ బట్టణమును గట్టుకొని యందుఁ గాఁపురముసేయుచుఁ ద్రిజగముల నెల్లప్పుడు నేలు
చున్న ప్రభువును, దానవులయొక్క మూఁడుపురముల నొక్కయమ్మున నే కూల్చిన పరాక్రమవంతుఁ
డును, మన్మథుని జయించిన సౌందర్యవంతుఁడును, సర్పరాజగు శేషుని భూషణములుగా ధరించిన
పరమాత్ముఁడును, గొప్పశౌర్యవంతుఁ డగు గజాసురుని సంహరించిన మహాబలశాలియును, హిమ
వత్పుత్రికకు సగముమేను నొసంగిన దాతయును, మిగులసమర్థుఁ డయిన కుమారస్వామిని గనినతండ్రి
యును, శత్రుబాహుబలమును దృణప్రాయముగాఁ జేయఁగల దానవులలో ముఖ్యులను జంపునట్టి
త్రిశూలముతోఁ బ్రకాశించుచున్నశూలి యను ప్రసిద్ధనామముగలవాఁడును, అగు శంకరుఁడు నాకా
వ్యమును గ్రహింపఁదగినవాఁడు కాక యింకెవ్వండగును?

వ॥ అని యుద్దేశించి. 21

అ॥ అని. ఈప్రకారముగా, ఉద్దేశించి - నామనస్సులో నిశ్చయించినవాఁడవై,

## —షష్ఠ్యంతములు—

క॥ దుస్సాధు ప్రథమసుధా, భిస్సారిబలాతిరేక ◆ భీదానునకున్
నిస్సీమకామదోహిప, యస్సురధేనునకు నాశ్రి ◆ తాధీనునకున్. 22

అ॥ దుస్సా........ నకున్. దుస్సాధు. భరింపనలవిగానిదయిన. మహాభయంకరమైనదయి
నయనుట. ప్రథమసుధాభిస్సా - మొదటి యమృతాన్నముచేత, ప్రథమసుధయనఁగా సముద్రమున
ముందుపుట్టినది. ఉదా "నిర్మథ్యమానా దుదధేరభూ ద్విషం, మహోల్బణం హాలహలాహ్వ
మగ్రతః, తదుగ్రవేగం దిశిదిశ్యుపర్యథో. విసర్పదుత్సర్పదసహ్యమప్రతి, భీతాః ప్రజా దుద్రువు రంజసే
శ్వరాః, అరక్ష్యమాణాః శరణం సదాశివమ్" తతఃకరతలీకృత్య, వ్యాపిహాలాహలంవిషం, అభ
క్షయ న్మహాదేవః. కృపయా భూతభావనః, భాగ. సం. కనుక హాలహలాన్నముచేతననుట, "ని॥
భిస్సా స్త్రీ భక్తమంధోఽన్న మోదనోఽస్త్రీ సదీదివిః, అ॥ ఉదా "క. పరమాన్నభైక్ష్యభిస్సా, పరిపూ
ర్ణతరంబులయిన◆ పాత్రములయ్యె, వ్వరు నిత్యంబు నివేదింతురు దల్లికిఁ గరముభక్తి◆ తో వినయము
నన్, భార. అరిబల - శత్రువులయొక్క సైన్యమునకు, అనఁగా రాక్షససమూహమునకనుట. అతి

రేక — అత్యధికమయిన, 'ని॥ అతిరిక్తః, సమధికః, అమ॥ భీ-భయమును, దానునకున్ - కలిగించిన వానికిని, నిస్సీ........నకున్. నిస్సీమ - మేరలేని, కామ - కోరికలను, దోహి - పిదుకుచున్న, పయః - పాలుగల, సురధేనునకున్ - వేల్పులయొక్క - లేఁగటియావునకును, ఇచట దోహిశబ్దమును గూర్చి 'సూ॥ అచః కర్మకర్తరి, 'దుహశ్చ,' సిద్ధాం. ఉదా 'అకారియత్రాతిథిపూజ నంఘనం మనోరమశ్చ స్వయమాలయోఽకృశః, అదుగ్ధధేనుః స్వయమాగతాంగనం. మృగీయథాఽదోహినిరీక్ష్యశాబకమ్'' రావ అ. కామదోహిపయస్సురధేనునకున్, అనుప్రయోగముగను 'సూ॥ లింగభేదోభవేదిష్ట అరోపేయదివారుచిః'' అథ. ఆశ్రితాధీనునకున్ - ఆశ్రిత - ప్రాపుచేరినవారికి, అధీనునకున్ - వశమైనవానికిని, ఇందు 'నిస్సీమకామదోహిపయస్సురధేనునకున్,' అనుచోట నుపమాలంకారము.

క॥ ధూపాయిత గోపాయిత, పాపాయిత తనుజ సుకృత ♦ భాసిత దనుజా
టోపున కగజాపున కగ, చాపున కాసక్తభక్త ♦ సల్లాపునకున్. 23

అ॥ ధూపా........ పునకున్. ధూపాయిత - తపింపఁజేయఁబడినట్టియు, గోపాయిత — రక్షింపఁబడినట్టియు. పాపాయిత - పతనముగాఁజేయఁబడినట్టియు, ఇచట ధూపాయితాది శబ్దము లనుగూర్చి 'సూ॥ గుపూధూపవిచ్ఛిపణిపనిభ్య ఆయః, సిద్ధాం. ఉదా. ధూపాయతి తేజసా విపక్షం, గోపాయతి సారరత్న భాండం, రాఘ. తనుజ - మన్మథుఁడును, సుకృతభాసిత - పుణ్యముచేతఁ బ్రకాశింపఁబడినవారును, దనుజాటోపునకున్ - అసురులయొక్క - గర్వమును, గలవానికిని, అగజాపునకున్ - పార్వతికి నాథుఁడైనవానికిని, ఇచట 'అగజా + పః — అగజాపః, తెలుఁగునఁదుప్రత్యయముగాఁగా నగజాపుఁడగును. అగజాపునకున్ - కొండయే విల్లుగాఁగల వానికిని, ఆసక్తభక్త - అధికమైన యాశతోఁగూడినభక్తులయొక్క, సల్లాపునకున్ - విహితమైన సంభాషణములు గలవానికిని, ఇందు మొదటిశబ్దములు మూఁడింటికిఁ గ్రమముగ నన్వయము వచ్చునట్లు మూఁడుశబ్దములను గూర్చుటచే యథాసంఖ్యాలంకారము 'క॥ సమముగ నేవురుసఁ బదార్థము లుద్దిష్టంబులయ్యెఁ ♦ దగ నా పర్యాయ, యమున ననూద్దిష్టము లై, యమర యథాసంఖ్య మయ్యె, కా. సం: మఱియు 'యథాసంఖ్యం క్రమేణైవ. క్రమికాణాం సమన్వయః, శత్రుం మిత్రం విపత్తించ, జయ రంజయ భంజయ, చంద్రా. 'ధూపాయిత గోపాయిత పాపాయిత, ఇచట ననుప్రాసాలంకారము॥ 'టోపున - జాపున. చాపున. లాపున, అంత్యానుప్రాసాలంకారము.

క॥ రంగత్కరుణారసహృద, యంగమ భృంగారునకు ల ♦ తాంతాయుధఘూ
సాంగారున కాశ్రితగిరి, శృంగారున కపరిమేయ ♦ శృంగారునకున్. 24

అ॥ రంగత్క.........నకున్. రంగత్ - ఒప్పుచున్న, కరుణారస - దయారసము నెడి రసమునకు, హృ - కుర్వంత్యాత్మాన మధీనమనేనేతి కరుణా, రసశబ్దమునుగూర్చి 'ని॥ శృంగారముఖ్య మధురాది సువర్ణరేతో, నిర్యాసరాగ గరళద్రవపారదేషు, ఆస్వాదనధ్వని సుధాంబుర సాఖ్యధాతు, ష్విష్టోరసోఽథ రససాధరణీ రసాస్యాత్, నానా। హృదయంగమ - మనోహరమైన, భృంగారునకున్ - సువర్ణ కలశమైన వానికిని, 'ని॥ భృంగారః కనకాలుకే, విశ్వ. ఇచట దయను సువర్ణకలశ కలశమును బోల్చినాఁడు. ''ఉదా. ''సాగరే మధ్యమానేతు. పీయూషార్థం సురాసురైః. పీయూష ధారణార్థాయ. నిర్మితా విశ్వకర్మణా'' కలాకలాస్తుదేవానా, మసితాసాః పృథక్ పృథక్.

యత్ర కృతాస్తు కలశా. స్తత్ర స్తే పరికీర్తితాః'' కాళి పు. అమహచ్ఛ ద్దుగు. 'భృంగార, మనకు 'భృంగారుఁడు, అని డుప్రత్యయమునుజేయుటకు ''సూ॥ తత్రాసు రఁజనాతుఎంసాం. డుజ ప్యమ హాతో భవేత్'' అథ, లతాం.........నకుఁ. లతాంత – పుష్పములే, ఆయుధ – బాణములుగా గల మన్మథుఁడనెడి, ఘాస – లేఁతపచ్చికకు, అంగారునకుఁ – అంగార కగ్రహమైనవానికిని. ఆశ్రితగిరి శృంగారునకుఁ. ఆశ్రిత – ఆశ్రయింపఁబడిన వారలకు, గిరిశృంగారునకుఁ – పర్వతశిఖరము వలె భయరహితుఁడైన వానికిని, 'గిరిశృంగ + అ + రః, అని పదచ్ఛేదము, దరిజేరిన వారలకుఁ కొండవలె నండయై భయమును బోఁగొట్టువాఁడని భావము. అపరిమేయ శృంగారునకుఁ. అపరిమేయ—మితి చెప్పశక్యముగాని, శృంగారునకుఁ – నాట్యరస ప్రధానమైన వానికిని, 'ని॥శృంగారః సురతే నాట్యరసేచ, మే. అనఁగా మహానటుఁడ నిభావము – ఇందు 'కరుణా.........భృంగారునకుఁ, రూప కాలంకారము, లతాంతాయుధ ఘాసాంగారునకుఁ, ఉపమాలంకారమును 'సాధర్మ్యముపమా, కా. ప్ర.

క॥ కటకాయితఫణికి శిఖా, ఘటితామృతఘృణికి నర్ధ ♦ కాంతామణికిన్
గుటిలాఖిల దనుజగజ, స్ఫుటనకళాసృణికి దేవ ♦ చూడామణికిన్. 25

అ॥ కటకాయిత ఫణికిఁ. కటకాయిత – కంకణముగాఁజేయఁబడిన, ఫణికిఁ – సర్పము గల వానికి, శిఖా.........ణికిఁ. శిఖా – సిగయందు, ఘటిత – కూర్పఁబడిన. పొందించఁబడిన యనుట, అమృతఘృణికిఁ – సుధాకిరణములుగల వాఁడయిన చంద్రుఁడు గలవానికిని, అర్ధ కాంతామణికిఁ — సగము పార్వతిగలవానికిని – అనఁగా బార్వతితోఁగూడిన మేనుగలవానికిని, 'శిఖా, తటశీతల ఘృణికి భృతన తగ్రామణికిన్, అని పాఠాం. కుటిలా.........ణికిఁ కుటిల– కృత్రిమముగల, అఖిలదనుజ – రాక్షసులందఱిలో, గజ – గజాసురుని, స్ఫుటనకళా — భేదించునట్టి విద్యయనెడు, సృణికిఁ – అంకుశముగలవానికిని, దేవచూడామణికిఁ – దేవతలందఱు శిరమున దాల్చు రత్నమైన వానికిని, అనఁగా దేవతలలోశ్రేష్ఠుఁడైనవానికిననుట, ఇందు 'దనుజ.........సృణికిఁ. దేవచూడామణికిఁ, ఉపమాలంకారము.

క॥ ప్రేయస్స్మితగల్లునకుఁ, సాయకముఖ దళితరాత్రి ♦ చరమల్లునకుఁ
గాయజగురు భల్లునకుఁ, మాయాభిల్లునకు మంచు ♦ మలయల్లునకుఁ. 26

అ॥ ప్రేయస్స్మిత గల్లునకుఁ – ప్రియతమమైన చెక్కిళ్ళుగలవానికిని, ని॥ ప్రేయః ప్రియతరాఖ్యానం, దండిగల శబ్దప్రయోగమునుగూర్చి 'సూ॥ అతి ప్రయుక్తం దేశభాషాపదమ్, హాలా శబ్దము దేశ్యమయినను గాళిదాస ప్రయోగమువలన సాధువైనట్లే గల్ల శబ్దమును మహాకవి ప్రయోగములచే సాధువుగా గ్రహింపఁదగినది. ఉదా 'సీ॥ అతివేలమణికయాష్టారగల్లచపేటము, స్వా. మ, 'గల్లపాళీల సత్కాఁమముద్రాంకురా, శృం. నై. 'మశకీ మంగళగీతైః, మక్షికలలనారదక్షుత్తైః శ్చాపి. మాషీగల్లచపేటైః, నిద్రాం నాప్నోతి కుంభకర్ణోఽపి, ప్రాస్తావికశ్లోకము. సాయక.........నకుఁ. సాయకముఖ – బాణములయొక్క అగ్రములచేత, దళిత – చీల్చివేయఁబడిన, రాత్రిచరమల్లునకుఁ – రాక్షసులయొక్క జెట్టీలుగల వానికిని, రాక్షసశ్రేష్ఠులుగలవానికి ననుట, 'సాయకముఖదళిత. అని వ్రాఁతప్రతి, కాయజగురు భల్లునకుఁ, కాయజగురు – విష్ణువే, భల్లునకుఁ – బాణము

గాఁగల వానికిని, 'ని॥ భల్లోభల్లీచ బాణేస్యాత్, విశ్వ, మాయాభిల్లునకున్ - మాయచే బోయ వానివేషము ధరించిన శివునకును, మంచుమల యల్లునకున్ -- హిమవంతుని కల్లుఁడైన వానికిని. ఇందు నాలుగు పాదములను. 'గల్లునకున్ - మల్లునకున్ = భల్లునకున్ - యల్లునకున్, అనుటచే, త్ర్యక్షు రాంత్యాను ప్రాసాలంకారము.

క॥ కాశీపట్టణముఖ్యని, వేశున కవనీశసౌధ ♦ వేశునకు వియ
త్కేశునకుఁ గందపురసో, మేశునకుఁ బ్రభానిరస్త ♦ హిమకాశునకున్. 27

అ॥ కాశీపట్టణముఖ్యనివేశునకున్. కాశీపట్టణ-కాశియను పేరుగలనగరమే, ముఖ్యనివేశునకున్- ప్రధానమైనవసతిగలవానికిని 'ని॥ కాశీర్వారాణసీవారణాసీశివపురీతిసా, హేమ. ఇచటఁగాశినిగూర్చి 'అయోధ్యామధురామయా కాశీకాంచ్యవంతికా, పురీద్వారవతీచైవ సప్తైతా మోక్షదాయికాః, సాం॥ అ॥ అవనీశసౌధవేశునకున్. అవనీశ-రాజులయొక్క-సౌధ-మేడలయందు, వేశునకున్-నివాసము గల వానికిని, వియత్కేశునకున్-ఆకాశమే సిగ గాఁగలవానికిని, శివుఁడు వ్యోమకేశుఁ డగుట ప్రసిద్ధము. ప్రభానిరస్తహిమకాశునకున్. ప్రభా-తనయొక్క-కాంతిచేత, నిరస్త-తిరస్కరింపఁబడిన, హిమ కాశు నకున్-మంచును, పూచిన రెల్లును, గల వానికిని, 'విభానిరస్త, అని పాఠాంతరము కందపురసోమేశునకున్ - కందుకూరను గ్రామమునం దుండిన సోమేశ్వరుఁ డను దేవునకును, ఇందు షష్ఠీవిభక్త్యంతముగలపద్యముల నాల్గింటిని జెప్పుటకు 'సూ॥ ద్వికం చతుష్కం షట్కం వా, ష్యష్టకం వాఽత్ర విన్యసేత్, అవృత్త్యా వా మధికతా త్వైచ్ఛికీ సమతా మతా, నైషాం విషమ విన్యాసః, కర్తృనాయకయోర్హితః, అథ॥ 'వేశునకున్-వేశునకున్-కేశునకున్-మేశునకున్-కాశు నకున్, అనుటచే, త్ర్యక్షురాంత్యానుప్రాసాలంకారము.

వ॥ సముజ్జ్వలాలం క్రియాభిరామంబుగా నాసమర్పింపంబూనిన నిరంకుశో పాఖ్యానం బను కృతికన్యాలలామంబున కాజన్మకథ యెట్టిదనిన. 28

అ॥ సము.........బుగాన్. సముజ్జ్వల-మిక్కిలిప్రకాశించుచున్న, అలంక్రియా-ఉపమా ద్యలంకారములతో, భూషణాద్యలంకారములతోనని భావము. అభిరామంబు గాన్ - రమణీయమగు నట్లు, నాసమర్పింపంబూనిన-నేనుభక్తితో నీయఁగడఁగినటువంటి, నిరంకుశోపాఖ్యానంబు అను కృతి కన్యాలలామంబునకున్-నిరంకుశోపాఖ్యాన మను పేరుగల శ్రేష్ఠ మయినకావ్య మనెడుకన్యకకు, ఇచట లలామము, అను శబ్దమునుగూర్చి సూ॥ త్రిషులింగేషురమ్యస్స్యాన్ముఖ్యసామర్థ్యలక్షసు, అథ. ఈసూత్రము లలామశబ్దమునకే కాని 'లలామము' అనుశబ్దమునకన్వయింపఁబడలేదు. ఉదా॥ రాముఁడు దేవలలాముండు-భూమిజకాంతాలలామ - పక్షిలలామంబు నెక్కి బలియునిదలఁతున్, కనుక లలా మము, అనుశబ్దమునుగూర్చి. 'ని॥ లలామంచలలామచ, అమ. ఉదా 'అక్కాంతాలలామంబు - రాజ హంసియుంబోలెరమణీలలామంబు, శృం॥ నై॥ఉదా 'శా-పాతివ్రత్యగుణాభిరామయగు నాభామాలలా మంబు, పాం॥ మా॥ ఆజన్మకథ-పుట్టుక మొదలుగాఁగలవృత్తాంతము, ఎట్టిదనినన్ - ఎటువంటిదనఁగా- చెప్పఁబోవుచున్నాను వినుమనుట, ఇచటఁ గవి సాలంకృతకన్యాదాన మొనర్చుచున్నా ననివచిం చుచున్నాఁడు. రూపకాలంకారము.

-: ధర్మశీలుఁడుకొలువుండుట :-

మ॥ అసహాయాపరిమేయదుర్జయబలా ♦ హంకారదుర్వారవై
రి సహస్రప్రతిఘప్రమారణచణో ♦ ద్రేకాశివిద్యుత్సము
ల్లసనానంతర జాయమానమహిత ♦ ద్రాఘిష్ఠగర్జాఘనుం
డసమానాకృతి ధర్మశీలుఁడనురా ♦ జత్యంతసంతుష్టుఁ డై. 29

ఈ పద్యమున రాజునకును, మేఘమునకును, అభేదాధ్యవసాయముచేసి చెప్పినాఁడు.

అ॥ అస.........నుండు. అసహాయ-సహాయరహితమైన, అపరిమేయ - మితిచెప్పనలవిగానట్టియు, దుర్జయ-గెలువనశక్యమైనట్టియు, బల-శరీరపాటవముచేతను, అహంకార - మదముచేతను, దుర్వార-నివారింపనలవిగాని, వైరిసహస్ర - అనేకశత్రువులయొక్క, ప్రతిఘప్రమారణచణ - నిత్యమును జంపుటయందు నేర్పుతోఁగూడిన, ని॥ ఘస్రోదివాహనీవాతుక్లీబేసివసవాసరా, అ॥ ఉద్రేక-దుడుకుతనముగల, అసివిద్యుత్ - మెఱుపువంటి ఖడ్గముయొక్క, సముల్లసన - ప్రకాశముయొక్క, అనంతర-పిమ్మట, జాయమాన-కలుగుచున్న, మహిత-గొప్పదియైన, ద్రాఘిష్ఠ-అతిదీర్ఘమైన, 'ని॥ అతిశయేనదీర్ఘః ద్రాఘిష్ఠః, గురు. 'సూ॥ ప్రియస్థిరస్ఫిరోరు బహులగురువృద్ధతృపృదీర్ఘబృందారకాణాం ప్రస్థస్ఫవర్బంహిగర్వర్షిత్రబ్ద్రాఘివృన్దాః, అష్టా సిద్ధాం. (వ్యా॥ ప్రియాదీనాం క్రమాత్ప్రాదయ్యః స్యురిష్ఠాదిషు.ప్రేష్ఠః. స్థేష్ఠః. స్ఫేష్ఠఃవరిష్ఠః.బంహిష్ఠః.గరిష్ఠః.వర్షిష్ఠః త్రపిష్ఠః ద్రాఘిష్ఠః.వృందిష్ఠ.ఏవమీయసుఙ్.ప్రియోరుబహులగురుదీర్ఘాణాంపృథ్వాదిత్వాత్ ప్రేమాఇత్యాది)గర్జాఘనుండు-గర్జకుఘనుఁడయినవాఁడు, 'ని॥ గర్జితంబృంహితే మేఘధ్వనౌ నాతు మదద్విపే, నానా. ఇచట సింహనాదముచేత రాజును,గర్జచేత మేఘమును, అని తెలియవలెను. ధర్మశీలుఁడు-ధర్మముగాఁ బ్రవర్తించుటయే స్వభావముగాఁ గలవాఁడగుటచే ధర్మశీలుఁ డనుసార్థకనామమును వహించినయారాజు, అసమానాకృతిః-సమానములేని చక్కఁదనముచేత, అత్యంతసంతుష్టుఁడై - అధికమైనసంతోషముగలవాఁడై, మీఁదికన్వయము. ఇందుఁ బ్రథమపాదమున సరసయతి సెప్పఁబడినది. 'క॥ హయ లత్వమునకు శషసలు. నయవర్తనచఛజఝలకు ♦ నలి మధ్యసువ, గ్గయుతానునాసికము ని, శ్చయముగ ద్రుతమునకుఁ జెల్లు♦ సరసవళులనన్, అప్ప. మఱియుఁ జతుర్థపాదమున 'సము, ల్లసనా.................. మహిత♦ ద్రాఘిష్ఠ, అనుచోట వికల్పయతి 'గీ॥ వ్యాకరణసూత్రములసంధు♦లతుకునపుడు, రెండువిధముల రూపంబు♦లుండెనేని,వసుధ నయ్యక్కరముల క♦ వ్వలవికల్ప, సంధి విరమణ మన రెండు♦ సాగుచుండు, అప్ప. 'ఉదా 'గీ నందనుకుమార గూఢపా♦ న్మదవిహార, దళితశిశుపాల గోత్రభి♦ న్మణివినీల, నాగపర్యంకశాయి స♦ న్మార్గయాయి ,ధాతృనుతనామ యోగిహృ♦ న్మధ్యధామ, మఱియు 'మ.ఒకనాఁ డిందుధరుండుఁ బార్వతియు లీ♦ లోద్యానకేళీసరి, న్నికటానేకవనప్రదేశముల దై♦ తేయేంద్రకన్యాప్సరో, నికురంబంబులు,ఆదిపు. ఇందు అశ్లిష్టకేవలపరంపరిత రూపకాలంకారమును 'క॥ కాతరతర విమతధ్వజి, నీ తత కాంతారతతికి♦ నీచేతిమహా, హేతిదవజ్వాలనోజ్జ్వల, హేతిసుమీరయోబ ధారు♦ణీశ్వరనరసా, నరస. శ్లిష్టకేవలపరంపరితరూపకాలంకారమును. 'క॥ ఇల సంధిగూడిపదములు సెలకొని యొకపదమురీతి♦ నిలిచినశ్లేషం, బలరు, నరస. 'నియతారోపణోపాయః. స్యాదారోపకుర్ధస్యయ్యః,తత్పరంపరితంశ్లిష్టే♦వాచకేభేదభాజివా, కా॥ ప్ర॥ ఉదా 'విద్వన్మానసహంస వైరి♦

పాలునీరుఁ - పాలనునీటిని, ఏర్పఱిచినట్లు - విభజనచేసినవిధముగా, ఎవ్వఁడు - ఏపురుషుఁడు, ఏర్పఱప నేర్చెఁ - వేఱుచేయుటకుఁదగియుండెను, అమరాదికమనీయము - దేవతలు మొదలగువారికిమనోహరము, అగుతపస్సామ్రాజ్యపట్టంబు - అయినట్టితపస్సనెడి సమస్తమైనప్రదేశమునకు దొరతనము, (పట్ట మనఁగా రాజ్యాభిషేకసమయమున నొసటఁ గట్టెడుపట్టె) ఎవ్వాఁడుకట్టుకొనియెఁ - ఎవ్వఁడు కట్టుకొనియుండెను, అనఁగాఁ దపస్సుచేయువారలలో శ్రేష్ఠుఁడవనుట, లోకంబునకుఁ - ఈప్రపంచమునగలజనులందఱికిని, దురాలోకంబు - చూడ నశక్యమైనది, బ్రహ్మవలోకము - బ్రహ్మనుజూచుట, ఎవ్వఁడుసేయుఁ - ఎవఁడుచేయఁగలిగెను, ఇందు 'మీరు, అనుబహువచనప్రయోగమునకు 'సూ॥ స్యాత్పూజ్యత్వవివక్షాయాం. మహతాం బహుతా మతా'', అథ॥ మీరుచక్కంగఁ - అనుటకు 'సూ॥ అవ్యయస్యాపిగమ్యత్వం. రూఢశబ్దేషు కుత్రచిత్, అథ॥ ఉదా 'శా॥ ఈపాండిత్యము నీకుఁదక్క మఱి యెం♦దేఁ గంటిమే''స్వా. మ. సంబోధనమేకవచనమున నుండుటకు 'సూ॥ పూజ్యతయుఁదొక్కచో నామతదేతద్యుష్మ దస్మచ్ఛబ్దంబుల యేకవచనంబునకు బహువచనంబగు, అగుచో సంబోధ్యవాచకంబునకు బహువచనాంతరంబు కాదు.'' ప్రౌ॥ వ్యా॥ ఉదా ''క॥ అతఁడు, మీకుఁబ్రియశిష్యుఁడటయ ♦ మిథ్యావచనా,, భార. ''సీ॥ మహితాత్మ మీరలి ♦ మ్మహినుఁడ''కళా' ఇందుధర్మాధర్మములను బాలునీరువిభజించిన,ట్లనుటచే ననుపాత్తవాచకధర్మోపాదాన లుప్తోపమాలంకారము 'ధర్మోపమానయో ర్లోపే, వృత్తౌ వాక్యేచదృశ్యతే, కా॥ ప్ర॥ పులహ - కలహ, అనుప్రాసాలంకారము. 'తపస్సామ్రాజ్యపట్టంబు, రూపకాలంకారము. 'లోకఁబునకు దురాలోకంబు బ్రహ్మవలోకము, అంత్యానుప్రాసాలంకారము. ఇందుఁ బులహునియొక్క మహోత్కర్ష వర్ణింపఁబడినది.

తా॥ ముల్లోకరహస్యములఁ జూచునొసటికన్ను గలశివునియందలిభక్తిచే నరిషడ్వర్గమును జయించినయోపులహమహర్షీ! మీరుగాక యీప్రపంచమున షడ్శాస్త్రములలో స్వైచ్ఛట నేయంశమునుగూర్చి ప్రశ్నించిన నిదియి ట్లనిచెప్పువాఁడును, శాస్త్రములఁ జదివిన నందలి న్యాయాన్యాయముల క్షీరనీరముల వేఱుపఱచురాజహంసతెఱంగున విభజించి చెప్పఁగలవాఁడును, దేవతలుమున్నగువారి కిష్టమైనతపస్సు నొనరించినవాఁడును. జగజ్జనులచేఁ గనుఁగొనశక్యముగాని పరమాత్మ దర్శనము జేసిన వాఁడును, లేఁడుగదా!

క॥ ఒకవేదమె యొకశాస్త్రమె, యొకధర్మమె యొక్కనయమె ♦ యొకవినయంబే
యొకశమమె యొక్కదమమే, సకలము నీయందకలవు ♦ చాతుర్యనిధీ. 34.

అ॥ చాతుర్యనిధీ - నేర్పునకునిధియైనవాఁడా, ఒకవేదమె - ఒకవేదార్థవివరణమునందు మాత్రమా, కాదనుట. ఒకశాస్త్రమె - ఒకశాస్త్రపరిశీలనమునందా, ఒకధర్మమె - ఒకధర్మవిచక్షణయందే యనుకొందుమా, ఒక్కనయమె - ఒకనీతియందువిమర్శింపఁగలమా, ఒక వినయంబే - ఒకనమ్రత్వము నందూహింతుమా, ఒకశమమె - ఒక్కసహనమునందుఁజెప్పఁగలమా, ఒక్కదమమే - ఒక్క యింద్రియ నిగ్రహమునందాలోచింపఁగలమా, సకలముఁ - అన్నియును, నీయందకలవు - నీయందేయున్నవి. ఇంకొకరియందిన్నిగుణంబులులేవనుట. 'అంగానివేదాశ్చత్వారోమీమాంసాన్యాయవిస్తరః, పురాణం ధర్మశాస్త్రం చ విద్యాహ్యేతాశ్చతుర్దశః, ఇట్లు చతుర్దశవిద్యలని చెప్పఁబడుచున్నవి.

తా॥ ఓమహర్షీ ! శ్రుతులయర్థమును వివరించుటయందును, శాస్త్రములఁ జర్చించుటయందును, వేదోక్తవిధి నిర్ణయమునందును, న్యాయప్రవర్తనమునందును, నమ్రతయందును, సహనమునందును, జితేంద్రియత్వమునందును, నీకుఁదప్ప సమర్థు లెవ్వరునులేరు.

ఉ॥ ఓమునిసార్వభౌమ సుజ ♦ నోత్పలశీతలధామవాక్ఫణి
స్వామి తలంక కేను మది ♦ సందియ మొక్కటి విన్నవించెదన్
దామరసాక్షుకీర్తనమొ ♦ తత్త్వరహస్యమొ యిస్సిరో యితం
డేమి తలంచె నిప్పుడని ♦ యెన్నకుఁడీ మిముఁ జాల వేఁడెదన్. 35

అ॥ ఓమునిసార్వభౌమ-ఋషులలోఁజక్రవర్తివైన యోపులహుఁడా, సుజనోత్పల శీతలధామ. సుజనోత్పల-సజ్జనుల నెడు కలువపూవులకు, శీతలధామ-చంద్రుఁడవైనవాఁడా, వాక్ఫణిస్వామి-వాక్కు-అందు సర్పములకురాజయిన శేషునివంటివాఁడా అనఁగా శేషుఁడు వేయినోళ్ళుగలవాఁ డగుటచే సంభాషణమునం దధికుఁడని భావము. ఏను-నేను, ఇచట 'ఏను, అనుటకు 'సూ॥ నీమీనేమే హల్లులకు లోపంబు విభాషనగు' ప్రౌ॥ వ్యా॥ 'సూ॥ క్వచిదన్య స్యచాన్యస్యాల్లోపోదీర్ఘశ్చక్వచిత్, అధ. తలంకక-భయపడక, తమవంటిగొప్పవారితో నిట్టియల్పవిషయమునుగూర్చి నిర్భయముగాఁ బ్రసంగించుటకు సందేహింపక యనుట, మదిన్-నామనస్సున, సందియము-సంశయము, ఒక్కటికలదు-ఒకటియున్నది. విన్నవించెదన్-అది యిప్పుడు తమతో మనవిచేసుకొనుచున్నాను, తామరసాక్షుకీర్తనమొ - నారాయణునియొక్క స్తుతియా, కాదనుట, తత్త్వరహస్యమొ - పరమాత్మయొక్క యేకాంతమా, ఇస్సిరో-విసికి దేవునిఁదలఁచునప్పుడనునది. ఇప్పుడు-ఈసమయమున, ఇతండు-ఈ రాజు, ఏమితలంచెన్-ఎందుకిట్లు విచారించుచున్నాఁడు, అనియెన్నకుఁడీ-అని మీమనస్సులోఁ దలంపకుఁడు, అన్యథా తలంపకుఁ డనిమనవిచేసికొనుట, మిమ్మున్-మిమ్ము, చాలవేఁడెదన్-అత్యంతముగాఁ బ్రార్థించుచున్నాను. ఈపద్యమున| మిమ్మున్, అనుటకుబదులు మిముఁ అని ప్రయోగించుటకు 'సూ॥ అన్యతరలుక్ప్రయుక్తస్య, నన్న. 'సూ॥ నిన్ను నన్నుఁదన్ను వీనియందలి ద్విత్వమునకేని ద్విత్వయుక్త నువర్ణంబునకేనియు, మిమ్ముమమ్ముఁదమ్ము వీనియందలి ద్విత్వమునకును లోపంబువై కల్పికంబు. ప్రౌ॥ వ్యా॥ ఇందు 'భౌమ-ధామ-స్వామి, ఇవి యంత్యానుప్రాసాలంకారము. 'సుజనోత్పలశీతలధామ, వాక్ఫణిస్వామి, అనుచోట్లనుపమాలంకారము.

తా॥ సజ్జనులమనంబును రంజిల్లఁజేయువాఁడవును, ప్రసంగమునందు శేషునివంటివాఁడవును, అగు నోయతీశ్వరుఁడా! పెద్దలైనతమతో నొకసందేహమును విన్నవించుకొనఁ దలఁచి జంకులేక ప్రశ్నించుచున్నాను. ఇదియొక బ్రహ్మజ్ఞానమా? భగవద్ధ్యానమా? అని తాము విసుగుఁజెందకుండు రని ప్రార్థించుచున్నాను.

—: ధర్మశీలుని ప్రశ్నము :—

క॥ వ్యసనములలోన బ్రథమ, వ్యసనము సంభోగకాంక్ష ♦ యది దోషమలీ
మస మనఁగ నిందు నందుం, బ్రసరించినవాఁడు పాప ♦ బాహ్యుఁడుకలఁడే ? 36

అ॥ వ్యసనములలోనన్ – అత్యాసక్తిగల స్త్రీ ద్యూత పాన మృగయా వాగ్దోష దండదోష నిరర్థకవ్యయము లను నేడింటిలో, ప్రథమవ్యసనము – మొదటిది యగువిచారము, సంభోగకాంక్ష – స్త్రీసంగమవాంఛ, అది – అకోరిక, దోషమలీమసము – పాపముతో మాసినది. అనఁగా పాపమనెడు మలినముతో నిండినదగుటచే, నపకీర్తియని తెలియవలెను. 'ని॥ మలీమసంతు మలినం. కచ్చరం మల దూషితం, అమ॥ అనఁగన్ – ఇట్లుశమవంటి పెద్దలు చెప్పుచుండఁగా, విందున్ వినియున్నాను. ఇచట దద్ధర్మార్థకమున భూతార్థము స్ఫురించినది. 'సూ॥ తద్ధర్మార్థకవిశేషణం బసహాయతం త్రికాలవాచి యగు.' ప్రౌ॥ వ్యా॥ అంటన్ – అట్టివ్యసనమునందు. ప్రసరించినవాఁడు – తనయొక్క – మనస్సును వ్యాపింపఁజేసినవాఁడు, ప్రవర్తించినవాఁడనుట, పాపబాహ్యుఁడు – కలుషమునుండి బహిర్గతుఁడైనవాఁడు, పాపవిముక్తుఁడైనవాఁడనుట, కలఁడే – లోకమునందెచ్చటనయిననున్నాఁడా? ఈపద్యమున 'విందున్. అంటన్' అను ప్రాసాలంకారము.

తా॥ స్త్రీలఁగోరుట, జూదమాడుట, కల్లుద్రాగుట, వేఁటాడుట, పరులనిందించుటయుఁ, గొట్టుటయు, నిష్ప్రయోజనమగువ్యయము, అగు నీయేడింటిలో మొదటిది యగు స్త్రీవాంఛ పాపపూరితమయినదని తమవంటి పెద్దలు చెప్పుచుండఁగావినియున్నాను. అట్టి వ్యసనమునఁ బ్రవర్తించి పాపవిముక్తినొందినవాఁ డెచ్చటనయినను గలఁడా?

—: పులహుని ప్రత్యుత్తరము :—

క॥ నా విని మునిశేఖరుఁ డో, భూవల్లభ వెఱవనేల ♦ బుధసంస్తుత్యం
బీవాక్య మేమి యల్పమె, నీ వడిగినయంత మోహా ♦ నిర్ణిద్రుఁడవే? 37

అ॥ నాన్ – అనఁగా ఇట్లుపలుకఁగా, విని – ఆకర్ణించినవాఁడై, మునిశేఖరుఁడు – ఋషులలో శ్రేష్ఠుఁడయిన యాపులహుఁడు, ఓభూవల్లభ – ఓరాజా 'ని॥ వల్లభోదయితేఽధ్యక్షే సల్లక్షణతురంగమే, మే. వెఱవన్ + ఏల – భయమును జెందుట యెందులకు, భయపడనక్కఱలే దనుట, బుధసంస్తుత్యంబు – పండితులచేత నెక్కుడుగా గణింపఁదగినది, అయిన, ఈవాక్యము – ఈమాట, ఏమి + అల్పమె – స్వల్పమైనదాయేమి, తృణీకరింపఁదగినది కా దనుట, నీవు, అడిగినయంతన్ – ప్రశ్నించినమాత్రముననే, మోహనిర్ణిద్రుఁడవే – వలపునందు జాగరూకతగలవాఁడవా, అడిగినంతమాత్రముననే నీ వట్టిభ్రాంతిగలవాఁడ వని నేను దలంప ననుట.

తా॥ ఇట్లడుగఁగా విని యాయతీంద్రుఁ డోరాజా! భయపడనవసరములేదు. పండితులచే మన్నింపఁదగిన యీప్రశ్న యల్పమైనది కాదు. నీ విట్లుప్రశ్నించిన మాత్రముననే కామాతురుఁడవగుదువా?

చ॥ అడిగిననేమి దోసమె స ♦ మస్తధరాతలనాథ! కోరిక
ల్నుడువులనున్నవే మనసు ♦ లోపలఁ గాక రతిప్రసంగము
ల్గడవనియంతమాత్రనె వి ♦ దారితమోహుఁడె యీ విచారముల్
విడువుము వాగ్విశేషమును ♦ విశ్రుతవేషము మోక్షహేతువే? 38

అ॥ సమస్తధరాతలనాథ - ఈపుడమియంతటికినధిపతివైనవాఁడా, అడిగిననేమి-నీవు ప్రశ్నించిన మాత్రముననే యేమయినని, దోసమె - ఇదియొకనేరమా, కాదనుట, కోరికల్-మనుజులకుఁ గల యపేక్షలు, మనసులోపలఁగాక-చిత్తమునందుఁగాకుండఁ నుడువులన్-మనను ప్రసంగించెడుమాటల లోనే, ఉన్నవే-ఉన్నవారయేమి, అనఁగా నన్నియు మనస్సునం దుండును గాని వాక్కులలో నేమిలే దనుట, రతిప్రసంగముల్-సురతసంబంధమైనవాక్యములు, తడవనియంతమాత్రనె-విచారించక యుండినంతలోనే, విదారితమోహుఁడె-భేదింపఁబడినమోహము గలవాఁడా, అనఁగా మోహరహిత మైనవాఁడా యనుట, ఈవిచారముల్-ఈయాలోచనలు, విడువుము-వదలిపెట్టుము, వాగ్విశేషమును-మాటలయొక్క-యధికమును-వాగాడంబరమును, విశ్రుతవేషమున్-ప్రసిద్ధిగల వస్త్రభూషణా ద్యలంకారమును, మోక్షహేతువే-ముక్తికిఁగారణమా-కాదనుట, ఇందుఁబ్రథమపాదమున 'అడిగిన...... సమస్త ధరాతలనాథ, అనుచోట 'అ, కారమునకు మ కారముతలపైఁగల 'అ, కారముతో విశ్ర మము సెప్పఁబడినందుకు 'అ॥ నాస్తియనక మహిన • నంతసంపదలు నా,రాయణుండొసంగు • రమ్య మగుర, సాయనంబు బుధులకతఁ డన నిత్యస, మాసయతులు రెంటి • నంటియుండు, అనం॥ ఇందు 'విశేషము-వేషము, అంత్యానుప్రాసాలంకారము. కోరికలు మనస్సున నుండును గాని వాక్కుల యందుండునా ? మాటలాడనియంతమాత్రమున మోహబంధవిముక్తుఁడగునా ? వాచాడంబరమును, వేషధారిత్వమును, మోక్షహేతువులా ? అనుటచే అర్థాంతరన్యాసాలంకారము 'సామాన్యం వా విశేషో వా తదన్యేన సమర్థ్యతే యత్రసోఽర్థాంతరన్యాసః. సాధర్మ్యే ణేతరేణ వా, కా॥ ప్ర॥

తా॥ ఓరాజా ! ఈయంశమునుగూర్చి నీవు ప్రశ్నించినంతనే నేరముగాదు. మానవులకుఁ గోరిక లన్నియు మనస్సులోనుండును గాని మాటలలోనుండవు. సంభోగసంబంధమయిన ప్రసంగములు బయ టికిఁ గనుపఱచనంతమాత్రముననే స్త్రీవాంఛారహితుఁ డగునా? ఈయాలోచనల మానుము. అధిక ప్రసంగాడంబరమును, డాంబికవేషమును; మోక్షసాధనములు కావు.

క॥ కావున విచారమేటికి, భూవర విను సకలదోష • ములకు నిరాఘా
టావాసమానె శివకరు, ణావేశధురీణచిత్తుఁ • డైన ధరిత్రిన్. 39.

అ॥ కావునన్-అటులగుటంజేసి, కాఁబట్టియనుట, విచారము-ఆలోచన, ఏటికిన్-ఎందునకు, భూవర-ఓరాజా, విను-ఆలకించుము, ధరిత్రిన్-భూమియందు, శివకరుణావేశధురీణచిత్తుఁడు. శివ కరుణా-ఆపరమేశ్వరునియొక్క దయతోఁగూడిన, ఆవేశ-ఒడలెఱుఁగమియొక్క, ధురీణ-భారమును వహించిన, చిత్తుఁడు-మనస్సుగలవాఁడు: ఐనన్-అయినయెడల, సకలదోషములకున్-సమస్త మయినపాపములకు, నిరాఘాట+ఆవాసమానె-అడ్డములేని నివాసమగునా, 'ని॥ ఆఘాటస్తుఘటోఽ వధిః. అంతేఽవసానసీమాచ మర్యాదాపిచసీమని; హేమ॥ ఈపద్యమున 'విను, అనుచోట. మధ్యమపురుషైకవచన మయినందున మువర్ణము రావలసియున్నను 'సూ॥ ప్రార్థనార్థే ము రేకత్వే కథ్యతే మధ్యమార్థకః, విభాషాంతం పదం త్వేకే, న ప్రాణేషు కదాచన, అను నథర్వణవచనము వలన బాల్లుపర మగుచుండఁగా వైకల్పిక మువర్ణము రాదయ్యె. 'ఏటికిన్, అనుప్రయోగమునకుదా 'వ॥ నీవితరులఁగొలువనేటికి, భార. మఱియు "ఉ 'నీ, కింతభయంబులేకడుగ • నెల్లిదమైతిమి ఘాటలేటికిన్, స్వా॥ మ॥

తా॥ కనుక దీనినిగుఱించి యాలోచింపవలసినపని లేదు. ధర్మశీలా! వినుము లోకమునఁ బరమేశ్వరానుగ్రహసమృద్ధిగల హృదయముతోఁగూడినవానికి నేలాటి కలుషములు నంటవుగదా!

చ॥ కలరుసుమీ మనోజశర ♦ కంపితధైర్యశరవ్యులై తలం
పుల వచనంబులం గ్రియల ♦ భోగవతీజనమంద యిచ్ఛ ని
చ్చలముగఁ బూని తక్కినవి ♦ చారము దూరము చేసినట్టిమొ
క్కలపుమనుష్యులుం బుధులు ♦ గాననిసద్గతిఁ గన్నవారిలన్. 40

అ॥ ఇలన్-భూమియందు, మనోజశరకంపితధైర్యశరవ్యులై. మనోజశర - మన్మథునియొక్క-బాణములచేత, కంపిత-చలింపఁబడిన, ధైర్యశరవ్యులై-ధైర్యమనెడిలక్ష్యముగలవారై, కామోద్రేకులై యనుట, 'ని॥ లక్షం లక్ష్యంశరవ్యంచ, అ॥ వేధ్యంలక్ష్యంశరవ్యంచ, హాలా, ఉదా 'వ॥ కుసుమబాణపరంపరా శరవ్యంబైనకనహృదయంబు, శృ॥ నై॥ తలంపులన్ - కోరికలయందును, వచనంబులన్-పలుకులయందును, క్రియలన్-పనులయందును, అనఁగా మనోవాక్కాయకర్మంబు లనుమూఁడింటియం దనుట, భోగవతీజనమంద - భోగముగాండ్రయందే, ఇచ్ఛ - కాంక్షను, నిచ్చలముగ-స్థిరముగా, ఉదా 'ఉ॥ నిచ్చలమున్మహామహుని ♦ నేత్రముబజ్జను లౌట, కవిక. పూని-వహించి, 'భోగవతీజనసంగమేచ్ఛ, అని పాఠా॥ తక్కినవిచారమున్ - శేషించినచింతను, దూరముచేసినట్టిమొక్కలపుమనుష్యులున్ - ఎడముచేసినటువంటిమూఢమానవులు సైతము, బుధులుగాననిసద్గతిన్-పండితులుగూడఁ గనుఁగొనలేని స్వర్గలోకసౌఖ్యమును, మంచిజ్ఞానము ననియుఁ జెప్పవచ్చును, కన్నవారు-కనుఁగొనినవారు, కలరుసుమీ-ఉన్నారుచూడుమా, ఇందు 'మొక్కలపుమనుష్యులుం బుధులుఁగానని, అనుటలో సరళమునకు వెనుక నున్ననకారము బిందు వగుటకు 'సూ॥ ఆద్యే తృతీయేచకపా స్తృతీయా స్యుః కపేతరే, ఆద్యే తృతీయే తుర్యే చ. ప్రాప్నువంతి నిమిత్తతామ్, అథ॥ ఉదా 'ఉ॥ ఎక్కడివాఁడో యక్షతన ♦ యేందు జయంతవసంత కంతులం, జక్కదనంబునం గెలువఁజాలెడువాఁడు, స్వా॥ మ॥ ఇంకను 'చ॥ మెలఁతలు శైలరాట్తనయ ♦ మేపడియొత్తఁగఁ గూర్చనిండు వె, న్నెలపారవంటిపువ్వులవ♦ నిద్దపుగుబ్బలవ్రాలుచుం గళం, బలముచు, వసు. ఇందు 'ఇచ్ఛనిచ్చల-చారముదూరము, అనుప్రాసాలంకారము. బుధులనఁగా దేవతలు. వారికినివాసము నక్షత్రగమనము గలస్వర్గము. (ఆకాశము) కనుక దివ్యులకు సయితము లభించనిశాశ్వతపరమపదమును బొందినవారని భావము.

తా॥ ఈ పుడమియందుఁ గామవశులై నిరంతరము మనోవాక్కాయకర్మంబులం దేమఱక కాముకీజనమునందే నిక్క మగుకోరికతోఁ బ్రవర్తించుచుఁ గడమయాలోచనలను గడఁద్రోచినమోటువాండ్రు సైతము విద్వాంసులకు లభించని మోక్షమును బొందిన వారున్నారు చూచితివా!

మ॥ అది యీజన్మమునందుఁ జేసినవివే ♦ కాయత్తసద్వృత్తసం
పదకాదోసరపాల పూర్వకృత మా ♦ మాహాత్మ్యవిస్ఫూర్తి యెం
తదురాచారధురీణుఁ డైన నఘసం ♦ తాపంబు రాదేని య
మ్మదనారాతికృపావిపాక మది సం ♦ భావ్యుండు వాఁడేరికిన్. 41

అ॥ ఓనరపాల-ఓ రాజా, అది-అట్టిపుణ్యఫలప్రాప్తి, ఈజన్మమునందున్-ఇప్పటిపుట్టుకయందు చేసినవివేక+ఆయత్త+సద్వృత్త+సంపద కాదు, ఆచరించినటువంటి జ్ఞానమునకధీనమయిన మంచి నడతయొక్క-యతిశయము కానేరదు, ఆమాహాత్మ్యవిస్ఫూర్తి - ఆ గొప్పతనముయొక్క సమృద్ధి, పూర్వకృతము - క్రిందటి జన్మమునఁజేయఁబడినది, ఎంత+దురాచార+ధురీణుఁడు+ఐనన్ - ఏలాటిచెడ్డనడతగలవాఁడయినప్పటికిని, అఘసంతాపంబురాదేని - పాపమువలని దుఃఖము రాకుండినట్లయిన, అది-అట్టిగొప్పయదృష్టము, అమ్మదనారాతికృపావిపాకము-ఆపరమేశ్వరునియొక్క-దయవలన లభించినభాగ్యము, 'అఘసంతాపంబునుఁజెందఁడ ◆ మ్మదనారాతి, అని పాఠాం. వాఁడు-అట్టిపురుషుఁడు, ఏరికిన్-ఎవ్వరికైనను, సంభావ్యుఁడు-మిక్కిలి కొనియాడఁదగినవాఁడు, ఈపద్యమున ద్వితీయ చతుర్థ పాదములయందు బిందుయతి చెప్పఁబడినది. లక్షణము 'క॥ పనిఁబూని నిలుచుఁ దమతమ, యనునాసికములకు బిందు ◆ యతులను వెనుకన్, గనుపట్టు నాల్గలిపులను, బెనుసున్నలు డాసితమకుఁ ◆ బిలుఁదఁ గదియుచ్చోన్, అప్ప॥ ఉదా 'గీ॥ మనసిజాతాయగోపడిం ◆ భా యనంగ, దేనినే సులక్షణసారమున ననుస్వరయతి యని చెప్పఁబడియున్నది 'క॥ పంచమవర్గాక్షరములు, పంచమవర్ణములఁ గూడి ◆ పరఁగ నటించున్, వంచింపక పెర్వనాలుగు, నంచితముగఁ బిలుఁదసున్న ◆ లంటినచోటన్, ఉదా 'గీ॥ మాకు వడిసెల్లువిజితశం ◆ బరుఁడనంగ, ఇందు 'ఆయత్త సద్వృత్త-దురాచారధురీ-కృపావిపాక, ఇవి యనుప్రాసాలంకారము.

తా॥ప్రథమిఠేఁడా, అట్టి మహాభాగ్య మీజన్మమునఁ జేయఁబడినదాన యజ్ఞ తపోనియమాదులవలన లభించునదిగాదు. పూర్వపుణ్యసాఫల్యము. ఏలాటిదుష్ప్రవర్తనము కలవాఁ డయినను నతనికిఁ బాపభార మంటనియెడల నది పరమేశ్వరానుగ్రహోత్కర్షము. అతఁ డెవ్వరిచేత నయినను స్తుతింపఁ దగినవాఁడుసుమా !

వ॥ దీని కొక్క-యితిహాసంబు కలదు. చెప్పెద సావధానంతరంగుఁడ వై వినుమని యిట్లు చెప్పందొడంగె. 42

అ॥ దీనికిన్-ఈవిషయమునకు, ఒక్క-యితిహాసంబు - ఒకపురాతనకథ, కలదు - ఉన్నది, చెప్పెదన్ - దానిని వచింపఁబోవుచున్నాను, సావధాన+అంతరంగుఁడవై - ఎచ్చరికతోఁగూడిన మనస్సుగలవాఁడవై-శ్రద్ధతోఁగూడినహృదయము గలవాఁడవై యనుట, వినుము- ఆకర్ణింపుము, అని యిట్లు-అనియీప్రకారముగా-చెప్పఁబోవురీతిగా ననుట,చెప్పందొడంగెన్-చెప్పుటకు నారంభించెను.

—:◆ మాణిక్య పురవర్ణనము ◆:—

సీ॥ కమలాకరము తోట ◆ కమలాకరము తోట, జలజాతవిస్ఫూర్తిఁ ◆ దెలియఁబడక
రాజమండల మాట ◆ రాజమండల మాట, కువలయప్రియవృత్తి ◆ వివరపడక
మాణిక్యచయ మాట ◆ మాణిక్యచయ మాట, క్రొత్తడాలు సెలంగ ◆ గుఱుతుపడక
యమరదీర్ఘిక తోట ◆ యమరదీర్ఘిక తోట, ఘనసువర్ణాబ్జతఁ ◆ గానఁబడక

తే॥ గోపురము లౌటమణిమయ ♦ గోపురంబు, లౌట గురుసమున్నతిమెయిం ♦ దేటపడక
ద్వాపరంబున విలసిల్లు ♦ ద్వాపరంబు, గరిమఁదనరారుమాణిక్య ♦ పురమనంగ. 43

ఇందు మాణిక్యపురమునకును, స్వర్గమునకును, అభేదాధ్యవసాయము చేసి చెప్పినాఁడు

ఆ॥ జలజాతవిస్ఫూర్తిన్—జలమునందుఁ బుట్టఁబడినపద్మములయొక్క, ప్రకాశముచేత, 'ని॥ వార్వారిజలమంభోఽంబు. కమర్ణస్సలిలంపయః. శరంవనంకుశంతోయం. నీరంజీవనమబ్విషమ్, తత్పర్యాయోద్భవం పద్మం, ధనం. కమలాకరములౌట—లక్ష్మీనివాసములగుటయును, 'ని॥ లక్ష్మీపద్మాలయా పద్మాకమలాశ్రీర్హరిప్రియా, అమ॥ జలజాతవిస్ఫూర్తిన్ — జలసమూహముయొక్క పరిపూర్ణతచేత, 'ని॥ జాతంజనిసమూహయోః, శాశ్వ. కమలాకరములౌట—తటుఁగనిజలము గలవి యగుటయును 'ని॥ సలిలంకమలంజలమ్, అమ॥ తెలియఁబడక—బోధపడక, ఇచటఁ గమలములయొక్క శోభచేతఁ గమలాకరసార్థకనామమును బొందినదియునెఱుకపడక యనియుఁ జెప్పవచ్చును. 'ని॥ సహస్రపత్త్రం కమలం శతపత్త్రం కుశేశయమ్, అమ॥ కువలయప్రియవృత్తిన్—కలువలకు నిష్టమైనప్రవర్తనముచేత, 'ని॥ స్యాదుత్పలంకువలయం, అమ॥ రాజమండలమౌట — చంద్రునియొక్క బింబ మగుటయును, కువలయప్రియవృత్తిన్—భూవలయమునందుఁ గలజనులకు సమ్మతమైనవ్యాపారముచేత 'ని॥ గోత్రా కుః పృథివీ పృథ్వీ, అమ॥ రాజమండల మౌట—రాజులయొక్క సమూహము గలది యగుటయును, 'స్యాన్మండలం ద్వాదశరాజకేచ, దేశేచ బింబేచ కదంబకేచ, విశ్వ. వివరపడక—విభజనము కాక, క్రొత్తడాలుసెలంగన్—నూతనమైనకాంతులతోఁ బ్రకాశించుచుండఁగా, మాణిక్యచయమౌట—మాణిక్యములయొక్క సముదాయమైయుండుటయును, ఇచట మాణిక్యములు దేవలోకములోనివిగ వర్ణింపఁబడుటకు 'క॥ ధరఁ బద్మరాగ మొందును, దొరకదు కలియుగమునందు, అని వచింపఁబడియుండుటను బట్టి దివ్యలోకముననే యుండు నని గ్రహింపవలయును. క్రొత్తడాలుసెలంగన్—నవీనమైన కోటబురుజులతో నొప్పుచుండఁగా, మాణిక్యచయమౌట — మాణిక్యపురజనమై యుండుటయును, అని చెప్పవచ్చును, గుఱుతుపడక—ప్రత్యేకము కాక, ఘనసువర్ణాబ్జతన్—అధికమయిన యపరంజితామరపూవులచేత 'ని॥ స్వర్ణం సువర్ణం కనకమ్, అమ అమరదీర్ఘికలౌట — ఆకాశగంగా ప్రవాహములగుటయును, 'ని॥ స్వర్ణదీ సురదీర్ఘికా, అమ॥ ఘనసువర్ణాబ్జతన్ — గొప్పవైనమంచివన్నెలుగల పద్మములచేత, 'ని॥ వర్ణో ద్విజాదిశుక్లాది. యశోగుణకథాసుచ, మే. అమరదీర్ఘికలౌట—ఎన్నఁటికి నాశములేకుండునట్టి గొప్పనడబావు లగుటయును. వ్యు॥ అమ్రియం తీత్యమరః, 'ని॥ వాపీతు దీర్ఘికా, అమ॥ దేవతలచేఁ ద్రవ్వఁబడిన లోతయిన నడబావులగుటయు నని చెప్పనొప్పును. కానఁబడక—ఆనవాలు తెలియక, గురుసమున్నతిమెయిన్—బృహస్పతియొక్క యతిశయముచేత 'ని॥ గురుస్త్రిలింగ్యాం మహతి దుర్జరాలఘునోరపి, పుమాన్నిషేకాదికరే. పిత్రాదౌ సురమంత్రిణి, మే. 'గురుస్తుగీష్పతౌ శ్రేష్ఠేగురౌపితరి దుర్భరః, శబ్దా॥ గోపురములౌట—స్వర్గపట్టణము లైయుండుటయును, 'ని॥ గౌః స్వర్గే వృషే రశ్మౌ, విశ్వ॥ గురుసమున్నతిమెయిన్—అధికమైన యౌన్నత్యముచేత, మణిమయగోపురంబులౌట—రత్నములతోఁ గూడినపట్టణద్వారములు గలిగియుండుటయు, 'ని॥ పురద్వారంతు గోపురమ్, అమ॥ తేటపడక—స్పష్టము కాక, ద్వాపరంబునన్—ద్వాపరయుగమునందు, విలసిల్లుద్వాపరంబుగరిమన్ — ఒప్పుచున్నసంశయముయొక్క గొప్పతనముచేత, 'ని॥ ద్వాపరౌ యుగసంశయౌ, అమ॥ మాణిక్యపుర మనంగన్—

మాణిక్యపుర మనునట్టిపేరుగల పట్టణము, తనరారన్ – ప్రకాశించుచుండెను, ఇదియు [illegible]. ఆను ప్రయోగమునకు 'సూ॥ వాయి రవృ [illegible] [illegible] [illegible] శ్లేషాలంకారమను 'శ్లేష స వాక్యే ఏకస్మిన్ యత్రానేకార్థతా భవేత్, [illegible] [illegible] [illegible] శ్రితః, సర్వదోమాధవః పాయాత్సయో [illegible] [illegible] [illegible] వచుటచే శుద్ధసందేహమును 'ససందేహస్తుభేదోక్తౌ తదనుక్తౌచసంశయః [illegible] [illegible] [illegible] గవిమతిః విహితసామ్యా, దీప్తసందేహమొంద సందేహ మనియు, [illegible] నిశ్చయాంతంబునగు, నరస. ఉదా 'పంకజం వా సుధాంశు ర్వే [illegible] [illegible].

తా॥ ద్వాపరయుగమునందు సంప్రాప్తజలముతోను వివిధ [illegible] [illegible] [illegible] యనున ట్లొప్పుచున్న కోనేళ్ళును, భుజాజ [illegible] [illegible] [illegible] లన వెలయుచున్న రాజులును, నూతనము అగుకోటబురుజులతో మాణిక్యము [illegible] [illegible] ప్రజను లును, కర్బురవర్ణము అయినపద్మములతోఁ బ్రకాశించుచు [illegible] జలసమృద్ధిచేత [illegible] వలె నొప్పుచున్నలోతయిన నడబావులును, మిక్కిలియెత్తుగల [illegible] [illegible] యనునట్లు దీపించుచున్నరత్నమయ మగుగోపురములును, గలిగి దేవమానవలోక [illegible] [illegible] యనితెలంగునఁ బ్రకాశించుచున్న మాణిక్యపుర మనునొకపట్టణము [illegible].

శా॥ మాణిక్యక్రియమాణ సౌధసుషమా ♦ మాయాసరిత్ప్రస్ఫురా
న్మైణాక్షీసహభీతి సంభ్రమభర ♦ వ్యాలోకమానాభ్రగా
క్షీణానర్గళ హాసభా విదళిత ♦ స్ఫీతాంధకార త్రియా
మాణాభూత్సితాన్య పక్షతతికం ♦ బాపట్టణం బల్పమే. 44

అ॥ మాణి.........కంబు. మాణిక్య–మానికములచేత, క్రియమాణ–కల్పింపఁబడుచున్న, సౌధ–రాజభవనములయొక్క 'ని॥ సౌధోఽ స్త్రీ రాజసదనం, అమ॥ 'వృ॥ సుధాయోగా త్సౌధః, సుధయనఁగాసున్నము. అదిగలది. సుషమా–ఎక్కువయినకాంతియును, 'ని॥ సుషమాపర మాశోభా, అమ॥ వృ॥ సుష్ఠుసమంసర్వమస్యాస్సుషమా, అంతటసమానముగా సుసమైయుండునది, మాయాసరిత్–ఇంద్రజాలపునదిని, కృత్రిమప్రవాహమునుసుట, ని॥ స్యాన్మాయాశాంబరీ. అ॥ (ఇచట సూర్యునికాంతివలన నెండమావు లెట్లేర్పడుచున్నవో యటులే మాణిక్యకాంతులకు మాయాప్రవా హము లేర్పడుచున్న వని తెలియవలయును. తర్హ్హ కాము–దాఁటనిచ్ఛగించువారయిన. ఏణాక్షీ–లేడి కన్నులవంటి కన్నులుగలస్త్రీలయొక్క, సహ–శాంతముయొక్కయు, భీతి–భయముయొక్కయు, సంభ్రమ తొట్రుపాటుయొక్కయు, 'ని॥ సంభ్రమస్త్వరా, అ॥ భర–అతిశయమును, వ్యాలోక మాన–ఎక్కువగాఁజూచుచున్న, అభ్రగ–ఖేచరులయొక్క, ఆకాశమునందిరిగెడువా రయినదేవతల యొక్క, అక్షీణ–అల్పముగాని, అనర్గళ–అటంకములేని, హాస=నవ్వుయొక్క, భా–కాంతిచేత, విద ళిత–పగులఁగొట్టఁబడినదయిన, స్ఫీతాంధకార–అధికమైనచీఁకటికల, ఇచట హాసముచేతఁ జీఁకటి పోవు ననుటను హాసము స్వచ్ఛమైనది కనుక నిట్లుచెప్పఁబడినది. 'శుక్లత్వంకీర్తిహాసాదౌ కార్ష్ణ్యం దుష్కీర్త్యఘాదిషు, ప్రతాపే రక్తతోష్ణత్వే రక్తత్వం క్రోధరాగయోః, కా॥ క॥ అ॥ 'ని॥

'ద్యామప్రహరేసమా, అ. సూ॥ ఆదంతయోరర్ధయామయో ర్దినవ్యవహారా త్త్రియామా; అనిక్షీర స్వామి. త్రియామా-రాత్రులచేత, వ్యు॥ త్రయోయామాః యస్యాంసా త్రియామా, యామమనఁగా జాము. మూఁడుజాములగలది. రాత్రియందుఁ బ్రథమయామము చేష్టాకాలముగనుకను, అంత్యయామము విబోధకాలము గనుకను. ఈరెండుయామములందు సగము దివససమానము గావున త్రియామ, అనంబడును. ఉదా. 'క్వచిదసమేత పరిచ్ఛదస్త్రియామాం. అని కాళిదాసోక్తి. అణూభూత—లేశముగాఁగాఁబడిన-అల్పముగా నయిన యనుట. సితాన్యపక్ష—శుక్లపక్షేతరముయొక్క, అనఁగాఁగృష్ణపక్షముయొక్క తతికంబు-సమూహముగలది, ఆపట్టణంబు-ఆపురము, అల్పమే-సామాన్యమైనదా, ఈపద్యముయొక్క ద్వితీయపాదమున సమాసవశమున వచ్చినయైత్వమునందుఁ గలయేత్వమునకును, సమాసగతదీర్ఘమునకును, యతిసెప్పఁబడినది. ఇది వృద్ధియతి 'క॥ తలకట్టులపై సంస్కృత, ములఁగదియుపదాదివర్ణ ములకు వరుసతో, నెలకొను వక్రతమఁబుల, కిలనుభయముఁ జెల్లుచుండు, వృద్ధివళులనన్, అప్ప. ఉదా 'ఉ॥ ఆకమలాక్షిరూపమహి మాతిశయంబు మనోహరఁబు భో, గైకపరాయణుల్ పురుషుఁ డంగజుఁ డప్రతిమానచేష్టిత, స్వీకృతలోకుఁ డట్లగుటఁ జేటుపురంబునవారికెమ్మెయిన్, గాకెటులుండు నిట్టియెడ గాఢపుఁబొత్తు మనంగవచ్చునే, భార. తృతీయపాదమున సంయుక్తయతి చెప్పఁబడినది. 'క॥ వెలయఁగ సంయుక్తాక్షర, ములలో నెద్దానినైన మునుకొని వడిగా, నిలుపందగుఁ బాదంబుల, నలఘుగుణాన్వితుఁడ లేచ యసదృశదానా, సుల. చతుర్థపాదమున స్వరయతి 'గీ॥ ప్రాదినిత్య సమాసశబ్దములు గాక, పెరపదంబులపై నచ్చు బెరసినప్పు, డన్నియును స్వరయతులగు సాంబగురుఁడ, యింద్రుఁ డమరాన్వయాబ్ధిపూర్ణేందుఁ డనఁగ, సుల॥ ఇందు మాణిక్యకాంతులచే మాయాప్రవాహ మేర్పడిన దనుటచే విశేషాలంకారము 'ఆధార రహితాధేయ, మేకంచానేకగోచరం, అశక్యవస్తుకరణం. విశేషాలంకృతి స్త్రిధా, ప్రతా. ఆమాయాప్రవాహమును దాఁటుటకు స్త్రీలు భయపడుచున్నారనుటచే భ్రాంతిమదలంకారము. 'క॥ అలయుపమేయము ఛన్నత, నలరఁగనారోప్యమాణ మగునుపమానం, బిల నెఱుకపడఁగ భ్రాంతిమ, దలంకరణ మయ్యె. కా॥ సం॥ ప్రతాపరుద్రీయమునను 'కవిసమ్మతసాదృశ్య విషమే పిహితాత్మని, ఆరోప్యమాణానుభవో, యత్రసభ్రాంతిమాన్మతః, అని చెప్పినాఁడు. ఉదా 'కపాలేమార్జారః పయఇతికరాఁల్లేఢి శశిన, స్తరుచ్ఛిద్రప్రోతాన్ బిసమితి కరీ సంకలయతి, రతాంతేతల్పస్థాన్ హరతి వనితాఽప్యంశుకమితి, ప్రభామత్తశ్చంద్రో జగదిదమహో విభ్రమయతి, శార్ఙ్గ. మఱియు "అత్తే సీమంతచిహ్నేమరకతినికృహే హేమతాటంకపత్రే, లుప్తాయాం మేఖలాయాం ఝటితి మణితులాకోటియుగ్మే గృహీతే, శోణంబింబోష్ఠకాంత్యా త్వదరిమృగదృశా మిత్యరీణామరణ్యే, రాజన్ గుంజాఫలానాం స్రజఇతి శబరా నైవహారం హరంతి, ఖండ. గగనచరులహాసము చీఁకటినిఁ బోఁగొట్టుచున్న దనుటలో హాసము తెలుపు గనుక కవిసమయము. ఇచట నధికాలంకారము 'ఆధారాధేయయో రాను రూప్యాభావో ఽధికో మతః, ప్రతా. కూచిమంచి తిమ్మకవియు నిట్లె వర్ణించినాఁడు. 'మ॥ శశికాంతోపలజాలనిర్మితమహా సౌధాగ్రభాగోల్లస, ద్విశదాబ్జారిముఖీజనాంచితముఖా విర్భూతమందస్మితా, తిశయప్రస్ఫుటకౌముదీముదితహృ ద్దేశానిశోద్యచ్ఛకో, రశకుంతావళియై తనర్చుఁ జెలువా రందత్పురం బెంతయున్, భిల్లా. రుద్రకవి సంస్కృతమున మయూరాచలము నున్నతమైనదానినిగా నిట్లువర్ణించెను. 'యత్తుంగశృంగస్ఖలనప్రసంగ, ప్రకామసంభావితభంగభీత్యా. దినేశ్వర ప్రార్థితవిశ్వకర్మా, చక్రే నిజస్యందన మేకచక్రమ్, రాష్ట్రౌ.

తా॥ అందుఁ గలస్వచ్ఛమైనసౌధములయందు మాణిక్యములయొక్క కాంతులు సమృద్ధిగాఁ బ్రసరించుటచే నేర్పడినమాయాప్రవాహము నప్పురాంగన లిది నిజమైనయొకనది యని దాఁటనిచ్ఛగించి వెంటనే భయమును, తొట్రుపాటును, నిదానమును గలిగి వెనుకకుఁ దగ్గుటను జూచి, యీపాటి మాయను దెలిసికొనఁజాలక యిన్నియవస్థలకు లోనైతి రని పకపకనవ్వుచున్న వియచ్చరుల నవ్వులయొక్క తెల్లనికాంతులచేతఁ బోఁగొట్టఁబడిన కృష్ణపక్షము గలదియగు నాపురి సామాన్యమయిన దని వచింపఁగలమా.

సీ॥ వైడూర్య కల్పిత ♦ ద్వారదీప్తులు పుష్య, రాగకవాటజ ♦ ప్రభలఁ బెనుప
మరకత కుడ్య సం ♦ పాతదీధితి మహా, నీలవేదిశ్రీకి ♦ నెనరుఁ జూపఁ
బద్మరాగోజ్జ్వల ♦ ప్రాసాదరుచి విద్రు, మ స్తంభ కాంతుల ♦ మమతఁ బ్రోవ
వజ్రకుట్టిమశోభ ♦ వర్తమాక్తికస్యంద, నచ్ఛాయ కేప్రొద్దు ♦ నట్టుసేయ
తే॥ దీప్రగోపురగోమేధి ♦ కప్రకాశ, మనుదినంబును దనకుఁ దో ♦ డభిలషించు
నిఖిలమణిసంపదలు నందు♦నెరయుకతన,మణిపురంబగ్రదు దానినా♦మమునృపాల 45

అ॥ నృపాల. ఓరాజా, వైడూర్యకల్పితద్వారదీప్తులు—వైడూర్యములచేతఁ జేయఁబడిన ద్వారములయొక్క కాంతులు, పుష్యరాగకవాటజప్రభలన్ – పుష్యరాగములయొక్క తలుపులయందుఁ బుట్టినప్రకాశమును. పెనుపన్—వృద్ధిచేయఁగా, అనఁగాఁబుష్యరాగము చకచకాయమాన మగు చిత్రకాంతిగలది వైడూర్యము తెరబారునది కనుక బ్రకాశమధికమైనదనుట, 'క॥ మకరందబిందుసమరుచిఁ, బ్రకటంబగుఁ బుష్యరాగరత్నము, అనియును 'అ॥ పగలు గొండిఁ గానఁ♦బడెడుబిడాలంబు, కన్నుఁబోలె వెల్గు♦గల్గినూలు, దిరుగునట్టుమీఁదఁ♦దెరబారు వైడూర్య, రత్నమునకు దీప్ర♦యత్నమునకు, అనియును.,రత్నప. మరకతకుడ్యసంపాతదీధితి – మరకతపుగోడలమీఁదనుండి చక్కఁగాఁబడిన కిరణప్రసారము, ని॥సంపాతఃపతనేవేగే ప్రవేశేభేదనంవిదోః శబ్దా॥ మహానీలవేదిశ్రీకిన్—మహానీలపుటరుఁగుసందలిసంపదకు, నెనరుఁజూపన్—ప్రేమను గనుపఱచఁగా, అనఁగా మహానీలమునలుపు మరకతము పసరుచాయగలది. కనుక నీరెంటికిని జతకూర్పఁబడినది. 'క॥ కప్పెసఁగుపెన్నపెదిరికిఁ, బుష్పారవన్నియకు సవతుఁ♦బోలుననంగా, ముప్పాతికరంగులతో, నొప్పు మహానీలము, అనియును. 'క॥ దినకరునకెదురుబెట్టిన, ఘనముగ నిరుదెసలనిగుడు♦ కాంతుల నిచ్చున్, గనకమణిఘటపటాదులఁ, దనవన్నెకుఁ దెచ్చు మరక♦తము శుద్ధ మిలన్, అనియును. రత్నప, మరకతము విషహారమనియుఁ జెప్పియున్నది. 'విషరోగోపశమనే,కర్మస్వాథర్వణేషుచ, శంస్యతేమునిభిర్యస్మా, దయం మరకతో మణిః, రత్న, పద్మరాగోజ్జ్వలప్రాసాదరుచి. పద్మరాగ + ఉజ్జ్వల + ప్రాసాదరుచి—పద్మరాగములచేతఁ బ్రకాశించుచున్నరాజగృహములయొక్క శోభ, 'ని॥ హర్మ్యాదిర్ధనినాంవాసః ప్రాసాదోదేవభూభుజాం, అ॥ విద్రుమస్తంభకాంతులన్—పగడపుస్తంభములయొక్క ప్రకాశమును, మమతఁబ్రోవన్—ప్రేమాతిశయములతోఁ గాపాడుచుండఁగా, అనఁగాఁ బ్రవాళము లెఱ్ఱనివియైనను వానికంటెఁ బద్మరాగము నకుఁ గాంతియధికము. 'సీ॥ ఉదయార్కబింబస♦ ముజ్జ్వలప్రభ గల్గి, కరమొప్పుఁ బద్మరా♦గంబు, అని రత్నప. వజ్రకుట్టిమశోభ—రవలతో నిర్మింపఁబడిన కట్టడపునేలయొక్క వెలుఁగు, 'ని॥ కుట్టిమో౽స్త్రీనిబద్ధాభూః. అ॥ వరముక్తికస్యందనచ్ఛాయకున్—శ్రేష్ఠమయిన ముత్యములతోఁ గల్పిం

చఁబడిన రథములయొక్క — ప్రకాశమునకు, ఎప్రొద్దున్ — ఎల్లప్పుడును, నట్టుసేయన్ — నిలుకడయగునట్లు సేయఁగా, అనఁగా ముత్యములు వజ్రములు తెల్లనివైనను రవలకే తేజమధికము. 'క॥ ఒప్పెసఁగుఁ బలుజెఱంగులఁ, జిప్పల స్వాతివానచినుకులు మున్నే, చొప్పనఁబడునప్పరుసున, నొప్పావదవును మౌక్తికంబు లొక్కొకభంగిన్" "క॥ రూపాదవి చులుకనై మెఱు, గేపారఁగ వానిధార లెనిమిదియగుచున్, దాపొల్చు మూల లారై, చూపట్టుట వజ్రమణికి, శుద్ధగుణంబుల్, అనిరత్న ప. దీప్రగోపురగోమేధిక ప్రకాశము — రాజద్వారమునందలి గోమేధికములయొక్క తేజస్సు, అనుదినంబున్ — ప్రతిదినమును, తనకున్ — తనకు, తోడభిలషించున్ — సహాయము నపేక్షించుచుండును, అనఁగా గదమ రత్నములన్నియు జతలయ్యెను. నాకుఁ దోడులేకుండెను గదా యనుట, గోమేధికము గోమూత్రచ్ఛాయగలది 'క॥ గోమేధిక మణివర్మల, గోమూత్రచ్ఛాయఁజాలఁగొమరై, అనిరత్నప, నిఖిలమణిసంపదలు — సమస్తమైనరత్నములయొక్క — సమృద్ధులు, అందున్ — అనగరమున, నెరయుకతనన్ — వ్యాపించుటచేత, దానినామమున్ — దానియొక్క — పేరును, మణిపురంబండ్రు — మణిపురమనిచెప్పుదురు, 'పురంబు, అనుటకు 'సూ॥ స్యాదమహాతాం విభక్తౌ సోఽచ్చ ము తదుపరి పునర్మ్ంబూ ప్రాచామ్, అని నన్న. 'అండ్రు, అనుటకు సూ॥ నాత్పరస్య భవేద్దస్య డాదేశో వారువర్ణకే, అథ. ఇందు వైడూర్య ........................బెనుప, ఇట్లునాలుగుపాదములయందుఁ జెప్పఁబడియుండుటచేతనిది తద్గుణాలంకారము "సముత్సృజ్య గుణం యోగా. దత్యుజ్జ్వలగుణస్య యత్, వస్తు తద్గుణతా మేతి, భణ్యతే సతు తద్గుణః" కా॥ ప్ర॥ ఉదా 'విభిన్నవర్ణాగరుడాగ్రజేన, సూర్యస్య రథ్యాః పరితః స్ఫురంత్యా, రత్నైః పునర్యత్రరుచారుచంస్వా, మానిన్యరేవంశకరీరనీలైః, మాఘ. మఱియు ఉ॥ కానలకేగి నీవిమత కాతరలోచన ప్రాణనాథుఁడుం, దాను భుజింపఁగా ఫలవితానముఁ గోసెద నంచుఁ బోయి నా, నానిరవద్యకోకనద నగ్మసఖాంగుళిపాటలాంశురే,ఖానిబిడంబులైనకసు కాయలె కోయు నృసింహభూవరా, కా॥ సం॥ దీనినే యనుగుణాలంకార మనికొందఱు 'ప్రాక్సిద్ధస్వగుణోత్కర్షో,ఽనుగుణః పరసన్నిధేః. నీలోత్పలాని దధతే, కటాక్షై రతినీలతాం. చంద్రా 'క॥ స్వగుణము విడిచి యొకటియు, న్యగుణంబుం గొనినఁ దద్గుణాలంకృతియౌ, మగువకు ముంగఱ యధరపు, జిగిచేతం బడసెఁ గెంపుసింగారంబున్. అని. అల॥ సా॥ సం॥ ఇట్లుండుటంబట్టి తద్గుణాలంకారమనుటయేసమంజసము. ఆపట్టణ మమూల్యరత్నమయ మైనదని వర్ణించుటచేత నుదాత్తాలంకారము. 'ఉదాత్తంవస్తునఃసంపత్, కా॥ ప్ర॥ ఇట'దీప్రగోపురగోమేధికప్రకాశ, మనుదినంబును దనకుఁ దోడభిలషించు, అనుటచే నీకావ్యమునఁగల ప్రధాననాయిక నిరంతరముఁ దనపతికై యభిలషించుచుండుననియు సూచించుచున్నది. వైడూర్యము సువర్ణచ్ఛాయకు దాదాపుగ నుండును. తదితరరత్నములకు దోషము లుద్దేశింపఁబడినవి'రత్నానామిహసర్వేషాం దోషాః సామాన్యతో నవ, రేఖా బిందుః కలంకశ్చ. కాకాంఘ్రి క్షతధూళయః. తుషార త్రాస రంధ్రాణి. యత్నాద్రత్నేషు వర్జయేత్, రేఖా బిందుః కలంకంచ, త్రాసః కాకపదం క్షతం, ఖద్యోతో మక్షికాఛాయా, భేదాః సంధి తుషారకే, నిమ్నమస్తకతా చేతి దోషా రత్నభవాస్తథా, శు॥ ర॥ గోమేధికమున కీచెప్పఁబడినదోషము లేవియు నుండవని రత్నములఁ బరీక్షించువారు చెప్పుచుండుటయే కాక రత్నపరీక్షయందు గోమేధికమునకు దోషములు వివరించియుండలేదు. కనుకనే కవి ద్వి 58. 'తే॥ నలుపు నాకేయోషలనైనఁ, దెలుపఁగలరె, అనువాక్యముతో సమన్వయ మగునట్లొనర్చినాఁడు.

కవిసార్వభౌముఁడును జాలవఱకుశ్రమపడి వర్ణించెను గాని యింతటిమనోజ్ఞత్వమురాదయ్యె.

సీ॥ రమణీయమౌక్తిక ♦ రచితసౌధంబులు, మేలైనహరినీల ♦ జాలకములు
విమలచంద్రోపల ♦ వేదికాస్థలములు, గురుతరాంబుజరాగ ♦ కుడ్యములును
సురుచిరవైడూర్య ♦ సోపానవితతులుఁ, బాటింపవజ్రక ♦ వాటములును
బటుపుష్యరాగసం ♦ ఘటితార్గళంబులు, భూరిగారుత్మత ♦ ద్వారములును
తే॥ శుంభదున్నతవిద్రుమ ♦ స్తంభములును, గలిగిసంతతశృంగార ♦ కరిమతోడఁ
బొలుపుమీఱుశుభశ్రేణి ♦ పురవరంబుఁ, దగఁ బ్రవేశించె నగ్గజ ♦ దైత్యహరుఁడు, రాజ.

ఇంకను

సీ॥ చాలుచాలునఁజాల ♦ నీలంపుఁబగడంపుఁ, గంబముల్ మితిలేని ♦ కాంతిదనర
గారుత్మతపుమణుల్ ♦ గడియించినట్టిమే, ల్మేడగోడలసొంపు ♦ మీఱి యలర
నిందుకాంతములఁ బొ ♦ ల్పొంద నొనర్చిన, సోపానములు వింత ♦ శోభలెసఁగ
వెలలేనివజ్రంపు ♦ వేదికల్ చెలువార, గోమేధికపుగవా ♦ క్షులు చెలఁగ
తే॥ నతులవైడూర్య పుష్యరా ♦ గాదినీల, రత్నవస్తువు లెంతయు ♦ రమణమెఱయఁ
గొత్తముత్తెపుఁబొత్తులు ♦ కొమరుమిగులఁ, గొలువుకూటమునందునఁ ♦ గూర్మితోడ, రాజ.

శ్రీనాథుఁడును మాణిక్యముతోఁ దాంబూలపుఁబెట్టెను జేయించినట్లు వర్ణించినాఁడు 'తే॥ మలఁచి యేకాండముగనొక్క ♦ మానికమున, వేడ్కనెద్దానినిర్మించె ♦ విశ్వకర్మ, యట్టి దేవేంద్రదత్త మ ♦ హార్ఘ్యరత్న ♦ వీటికాపేటి మామ భూ ♦ విభున కొసఁగె' శృం॥ నై॥

తా॥ నవరత్నమయ: మైనయాపట్టణమునఁ గల మేడలయొక్క ద్వారబంధములు వైడూర్యములతోఁ జేయఁబడిప్రకాశించుచుఁ బుష్యరాగములచే నిర్మించఁబడినతలుపులయొక్క కాంతులను వృద్ధి చేయుచున్నవి. గరుడపచ్చలతోఁ జిత్రించినగోడలయొక్క శోభ యింద్రనీలములతోఁ నమర్చఁబడిన యరుఁగులతేజమును పెంపొందించుచున్నది. పద్మరాగములతోఁ సృజించఁబడినరాజభవనములయొక్క దీప్తి యచటఁగల పగడపుస్తంభములయొక్క కాంతులనభివృద్ధియొనర్చుచున్నది. వజ్రములతోఁ రచించఁబడిన శిరోగృహముయొక్క ప్రకాశ మచ్చటఁగలముత్తెపుఁదేరలయొక్క తేజస్సు నతిశయింపఁజేయుచున్నది. పట్టణద్వారమున నున్నగోమేధికములు తమ కీడయినరత్నములు దొరకనందున నిజగుణముతోనేవిరాజిల్లుచున్నవి. ఇట్లు నవరత్నములచేత నొప్పుచుండుటం గని దానినిమణిపురమని పిలువసాగిరి.

## —♦బ్రాహ్మణవర్ణనము♦—

క॥ గురుతరము తత్పురాంతర, ధరణీసురశాస్త్రకోవి ♦ దత్వం బాహా
గురుతరముగాదు నారద, గురుతరముంగాదు వారి ♦ గూడివచింపన్. 46.

అ॥ తత్పు........త్వంబు. తత్పురాంతర-ఆపట్టణములోనున్న, ధరణీసుర-బ్రాహ్మణుల యొక్క, శాస్త్రకోవిదత్వంబు-శాస్త్రములన్నింటియందుఁ గలపాండిత్యము, గురుతరము-అధికమయినది, ఆహా-ఔరా. ఇదిప్రశంసార్థకము. వారిన్-ఆవిద్వాంసులను, కూడివచింపన్-కలసిప్రసంగించుటకు, గురుతరముగాదు-బృహస్పతికిని శక్యముగాదు, అనఁగాబృహస్పతికి గీష్పతి యనుప్రసిద్ధి

తా॥ ఆపట్టణమున నున్నరాజకుమారు లందఱు మిక్కిలిచిన్నతనమునందే శత్రురాజులు విభ్రాంతినొందునట్టి పరాక్రమముగలవారును, యౌవనారంభమున శృంగారాతిరేకముచే భయంకరస్వభావమును మఱుఁగుపఱచి భూజనులందఱు దాపుచేరునట్టి బలసంపన్నులై ప్రపంచమునఁ గల యెల్లవారలచే సన్మానింపఁబడిన ప్రదేశమున నుండి యత్యున్నతు లనుప్రఖ్యాతివహించి సముద్రునికంటె గంభీరత్వమును బొంది ఘనతగలరాజచిహ్నములఁ ధరించి ప్రతిభావిశేషమునఁ గుబేరునిమించినవారై దుష్టుల నరికట్టుచు నత్యంతబలసమృద్ధిచే రాజ్యాభిషేకమునుబొంది పూర్వపురామునివలెఁ జరిత్రాత్మక ప్రసిద్ధపురుషు లనున శ్లాఘ్యమ్నుండిరి.

## —♦వైశ్యవర్ణనము♦—

క॥ ఇచ్చెద నని సురశైలముఁ, దెచ్చియుశోధించి విలువఁ ♦ దీర్పఁగ నడుగన్
బుచ్చుకొనఁ దిరుగ నమ్మఁగ, నచ్చటఁగలవైశ్యులందు ♦ నధముఁడె చాలున్. 48.

అ॥ ఇచ్చెదనని-అమ్ముచున్నానని, సురశైలమున్-దేవతలకు నివాస మయిన బంగారపుకొండను సైతము, తెచ్చియున్-తీసికొనివచ్చి, శోధించి-పరీక్షించి, విలువఁదీర్పఁగన్-వెలను జక్కపఱచుటకును, అడుగన్-ఇంకొకరు తెచ్చిరేని కొనుటకై యడుగుటకును, పుచ్చుకొనన్-తీసికొనుటకును, తిరుగన్-మరల, అమ్మఁగన్-విక్రయించుటకును, అచ్చటన్-అపురమునందు, కలవైశ్యులందున్-ఉండిన వణిగ్వ్యాపారులలో, అధముఁడే-అల్పుఁడైనను, చాలున్-తగియుండును, గొప్పధనవంతు లవసరములేదనుట. 'క్రియవిక్రయములయందు సువర్ణపర్వతము నైన సరకుసేయనివారును నాపట్టణమున నల్పధనవంతులే, అనుటచే. అతిశయోక్త్యలంకారము. 'నిగీర్యాధ్యవసానంతు. ప్రకృతస్య సమేనయత్, ప్రస్తుతస్య యదన్యత్వం. యద్యర్థోక్తౌ చ కల్పనమ్, కార్యకారణయో ర్యశ్చ, పౌర్వాపర్యవిపర్యయః. విజ్ఞేయాతిశయోక్తిః సా, కా. ప్ర.

తా॥ ఆనగరియందుఁ గలవైశ్యులలో నల్పుఁడైనను బంగారపుఁగొండను దెచ్చి దీని నమ్మెదనని సరిచూచి యింతవెల యనినిర్ణయించుటకును, మఱియొకరు తెచ్చినప్పుడు కొనుటకును, దాని నెవ్వరైన నడిగిరేని మరల విక్రయించుటకును దగియుండును.

## —♦శూద్రవర్ణనము♦—

క॥ అందరుదారుజఘన్యజు, లందఱు దారుణబలాఢ్యు ♦ లగుదురు ధృతిచే
మందరములయ్యుఁ దెలియ న, మందరము ల్వింతగాదె ♦ మహిమండలిలోన్. 49.

అ॥ అందున్-అపురియందు, అరుదారుజఘన్యజులు-వింతగలశూద్రులు, వ్యు॥ బ్రహ్మణఃజఘన్యాంగే జాతాః జఘన్యజాః, బ్రహ్మయొక్క యల్పావయవమునఁ బుట్టినవారు. అందఱున్-ఎల్లరును, ఇదినిత్య బహువచనాంతము 'సూ॥ అందఱ్వాదులు నిత్యబహువచనాంతములు'' ప్రౌ॥ వ్యా. ఇచట శకట రేఫాదేశమునుగూర్చి 'సూ॥ అంతాదులకు వారుపరంబగుచో వాతులోపంబును, రరలకుఱు లాదేశంబునగు'' 'వాలోపంబుతఱివాని తకారంబునకు దకారంబగు,'' ప్రౌ. వ్యా.

దారుణజలాఢ్యులు-భయంకరమయినశరీరపాటవముయొక్క సంపన్నతగలవారు, అగుదురు-అయియున్నారు, ధృతిచేన్-ధైర్యమునందు, మందరములయ్యున్-మందరపర్వతముతో సమానులైనప్పటికిని, తెలియన్-చూడఁగా, మనుష్యులయొక్క దృష్టికిమాత్రము, అమందరముల్-మందరగిరివంటి యాకృతి కలవారుకారు, ఇట్లు కనఁబడుట. మహీమండలిలోన్-భూమియందు, వింతగాదె-అచ్చెరువు గాదా, ఈపద్యమున 'అందరు........అందఱు, మందరము...మందరముల్', ఇవియమకాలంకారము. ద్విప్రాసమును జెప్పఁబడినది. భేదాభేదాతిశయోక్తియు, వ్యతిరేకాలంకారమును 'వ్యతిరేకో విశేషశ్చే దుపమేయోపమానయోః, చంద్రా. 'ఉపమానా ద్య దన్యస్య వ్యతిరేకః స ఏవ సః, హేత్వో రుక్తా వనుక్తీనాం. త్రయే సామ్యే నివేదితే, శబ్దార్థాభ్యా మథాక్షిప్తే. శ్లిష్టే తద్వత్త్రిరష్టసః, కా. ప్ర. ఉదా "అఖండమండలః శ్రీమాన్. పశ్యైషపృథివీపతిః, ననిశాకరవజ్జాతు. కలావైశద్యమాగతః"

తా॥ అపట్టణమునఁ గలశూద్రులు బలమునందును ధైర్యమునందును మందరపర్వతమువలె నొప్పుచుందురు. ఆకృతియందు మాత్రము సామాన్యమానవులే.

## —♦వేశ్యా స మూ హ వ ర్ణ న ము♦—

సీ॥ చెక్కుటద్దములపైఁ ♦ జిఱునవ్వు చినుకులు, వాఱ మోవిచలించు ♦ పాటఁబలికి
కనుఱెప్ప లరవంచి ♦ కర్ణాంతములు దాఁట, నలుసాల నృత్యంబు ♦ దొలుకఁ జూచి
కొదమజక్కవవంటి ♦ గుబ్బచంటికెలంకు, గానరా జిలుఁగుచెం ♦ గావి గప్పి
కచభార కుచభార ♦ కటిభారములచేతఁ, గాయంబు త్రైభంగి ♦ కముగ నిలచి

తే॥ ప్రియవయస్యాభుజాసమ ♦ ర్పితకరాబ్జ, లగుచుఁ దమయిండ్ల ముంగిళ్ల ♦ నప్పురమున
విటులతో మాటలాడెడు ♦ వెలవెలందు, లన్యవేశ్యలకుఁ గొలందు ♦ లాజయింప.50

అ॥ అప్పురమునన్-అపట్టణమున, చెక్కుటద్దములపైన్ - అద్దములవంటి చెక్కిళ్ళమీఁద,విచిఱునవ్వు-మందహాసము, చినుకులువాఱన్-ధారలుగావ్యాపించగా, మోవిచలించుపాటన్-పెదకదలునట్టిగానమును, పలికి-వీణాదిస్వరయుక్తముగాఁబలికి, కర్ణాంతములు దాఁటన్ - చెవులయొక్క తుదలు అతిక్రమించునట్లుగా, కనుఱెప్పలు+అరవంచి కంటిఱెప్పలు రెండును సగముమూసి, అనఁగా నేత్రము అర్ధనిమీలన మొనర్చి, 'సస్మితా చ భవే త్తారా, కించి దున్మిషితా పుటా, స్యాదర్ధముకుళాదృష్టి, శ్చానందాహ్లాదగోచరా, అభి॥ ద॥ నలుసాలన్-చుట్టుకొల్లారుగా వేయఁబడిన చావడియందు, 'నాలుగు+సాల-నలుసాల, మఱియు 'నలువు+సాల-నలుసాల, ఈయర్థమువలన నొప్పిద మైనచవికయం దనియుఁ జెప్పవచ్చును. నృత్యంబు-శరీర హస్త నేత్రాభినయములచేతఁ బాడునట్టిపాటయొక్క-భావమును దెలియంజేయుచు నాడెడునాటను, తొలుకఁజూచి-వర్షించునట్లు చూచి, అనఁగా నాట్యమును దట్టముగాఁగనఁబఱచియనుట, 'రసభావవ్యంజకాదియుతం నృత్యమితీర్యతే, అభి॥ ద॥ రసము, భావము. అభినయము, ఈమూఁడును గూడినదియే నృత్యము. 'ఖడ్గకందుకవస్త్రాది దండి కా చామరస్రజః, వీణాదిధృత్వాయత్కుర్యా న్నృత్యంత ద్దాలికంభవేత్, నృ॥ స॥

శుభకార్యములయందీ నృత్యమును జూడవలయు నని శాస్త్రప్రసిద్ధము. 'నృత్యం తత్ర నరేంద్రాణా, మాభిషేకమహోత్సవే, యాత్రాయాం దేవయాత్రాయాం, వివాహే ప్రియసంగమే, నగరాణా మగారాణాం, ప్రవేశే పుత్త్రజన్మని, శుభార్థిభిః ప్రయోక్తవ్యం, మాంగళ్యం సర్వకర్మసు, అభి॥ ద॥ కోదమజక్కవవంటి గుబ్బచంటికెలంకు – చక్రవాకపక్షియొక్క పిల్లలకంటి వక్షోవస్త్రములయొక్క పార్శ్వములు, కానరాక – అగపడునట్లు, జిలుఁగు చెంగావి – వివిధవర్ణములతోఁ జిత్తరువు వ్రాయఁబడిన కుంకుమవంటి యెఱ్ఱనివస్త్రమును, కప్పి – ఆచ్ఛాదనమొనర్చి, కచభార కుచభార కటిభారములచేతన్ – కొప్పుయొక్కయు, స్తనములయొక్కయు, పిఱుఁదులయొక్కయు, బరువులచేత, కాయంబు – మేను, త్రైభంగికముగన్ – మూఁడు వంకలుగా, నిలిచి – నిలువఁబడి, అనఁగాఁ గచకటిభారములొక వైపునకును, కుచభార మొకవైపునకును, వంచుచుండుటచేత శరీరము మూఁడు వంకలు గలదయ్యె ననుట, ఇట్టిసౌందర్యముల నెల్లోరాదిగుహాలయందుఁ జిత్రింపఁబడియున్న స్త్రీప్రతిమలను నాట్యాభినయములయందు నేర్పరులై యెయ్యోమున్గా నిలచిన యందగత్తెలను జూచిననే తప్ప వినినమాత్రమున సంపూర్ణముగా విశదము కాదు. ఇచటఁ గచకుచభారములనుగూర్చి 'పుష్పాక్షీ కేశహీనాచ, పీనోష్ఠీ లంబకస్తనీ, అతిస్థూలా హ్యతికృశా, హ్యత్యుచ్చా హ్యతివామనా, కుబ్జాచ స్వరహీనాచ, వేశ్యా నాట్యవివర్జితా, అని చెప్పఁబడియుండుటచే కేశహీన, అతికృశ, లంబకస్తని, మున్నగువారు నాట్యమున కుపయోగింప రని తెలియుటయే కాక 'తన్వీ రూపవతీ శ్యామా పీనోన్నతపయోధరా, ప్రగల్భా సరసా కాంతా, కుశలా గ్రహమోక్షయోః, చారుతాళలయాభిజ్ఞా మండలాస్థానపండితా, హస్తాంగస్థాననిపుణా, కరణేషు విలాసినీ విశాలలోచనా గీత, వాద్య తాళానువర్తినీ, పరార్థ్యభూషాసంపన్నా, ప్రసన్నముఖపంకజా. నాతిస్థూలా నాతికృశా, నాత్యుచ్చా నాతివామనా, ఏవం విధగుణోపేతా, నర్తకీ సముదాహృతా' అభి॥ ద॥ ఇట్లు సర్వాంగసుందరియైనంగాని నాట్యస్త్రీగాఁ బరిగణింపఁబడ దని వచియుండుటనుబట్టి శరీరసౌష్ఠవముతోఁ గూడిన త్రైభంగికత్వము వర్ణించినాఁడు. ప్రియవయస్యా భుజాసమర్పిత కరాబ్జలు. ప్రియవయస్యా – తమ నెయ్యపుఁజెలికత్తెలయొక్క, భుజా – బాహువులయందు, 'ని॥దోర్దోషా బాహు బాహాచ, భుజాభుజ ఇతీరితః, ధనం. సమర్పిత – ఉంచఁబడిన, కరాబ్జలు – పద్మములవంటి హస్తములుగలవారు, అగుచున్ – అయి, ఇది వర్తమానార్థకముకనుక. చు, వచ్చును. సూ॥ చరితిక్రియాపదానాం సర్వేషాంవర్తమాన కాలే స్యాత్, నన్న॥ తమ యిండ్లముంగిళ్ళన్ – వారివారి గృహాంగణములయందు, విటులతోన్ – కాముకులతో, మాటలాడెడు శలశలందులు – సంభాషించుచున్నట్టువంటి గణికాంగనలు, అన్యవేశ్యలకున్ – ఇతరవారకాంతలకు, జయింపన్ – గెలుచుటకు, కొలఁదులా – శక్యముగుదురా, ఈపద్యమున 'చెక్కుటద్దము, అనుటకు 'సూ॥ సమానాధికరణ్యేషూ దంతానాం టుగాగమో చిస్యాత్, శబ్ద చిం॥ 'ఇండ్లన్, అనుటకు 'సూ॥ సలలో ర్బిందుయుతో డుర్వా యోలులః, అనియును 'సూ॥ ఉల్లుగపితయోః పరతః, అనియును, నన్న. 'ముంగిళ్ళన్, అనుటకు 'సూ॥ డలటా ముదితాం తస్యచ వాలుక్, శబ్ద చిం॥ ఈపద్యాంత గీతముయొక్క కడపటిపాదమున 'అన్యవేశ్యలకుఁ గొలందులా జయింప, అనుచోటఁబ్లుతయతి చెప్పఁబడినది. 'క॥ పలుకులతలఁ గల ప్రాలను, వలనగుచోఁ బ్లుతమునిలిపి వానికి రెండున్, వళులుగఁ జెప్పినఁగావ్యం, బులు నదికాకుస్వరంబు ప్లుతవళియు నగున్, అప్ప॥ ఉదా హరణ॥ అనుమానింపక తోడఁబుట్టులనె కాదా తున్మ తూటాడె, భార॥ 'శలశలందు లన్యవేశ్యలకుఁ

గొలందులా, అనుటచే. అంత్యానుప్రాసాలంకారము. 'చెక్కుటద్దములు—కొదమజక్కవవంటి గుబ్బచఁటికెలంకు, ఇత్యాదులుపమాలంకారము. పద్యమంతయు స్వభావోక్త్యలంకారము, అన్యవేశ్యలకుఁ గొలంకులా, అనుటచే నతిశయోక్త్యలంకారము. 'క॥ ఉపమేయ మింతవడవడ, యుపమానమె నుడువనతిశ॰ యోక్తి'' కా. సం. ''స్వభావోక్తిరసౌచారు. యథావద్వస్తువర్ణనమ్'' ప్ర. తా.

తా॥ ఆపురమునఁ గలవేశ్యలు తమనిద్దంపుచెక్కిళ్ళయొక్క ప్రకాశము నతిశయింపఁ జేయునట్టి లేనగవుతోఁ బెదవిగదల్చిపాడుచు మిగులగొప్పపైననేత్రములు సగముమూసి చతుశ్శాలయం దధికముగా నాట్యముచేసి చక్రవాకపోతములవంటి వట్రువ స్తనములయొక్క ప్రక్క లగపడునట్లు చిగిరి లేఖనము గలచెంగావిచలువను గప్పికొని కేశబంధము యొక్కయుఁ, జన్నులయొక్కయుఁ, పిఱుఁదులయొక్కయు, భారములచేత నొడలు మూఁడువంకలుగాఁగ నిలిచి తమగృహాంగణము లయందలి చెలికత్తెలయొక్క భుజములమీఁదఁ బద్మములవంటిహస్తములను వైచి సోయగమునఁ గోడెగాండ్రతో ముచ్చటించు చున్న వెలయాండ్ర జయింప నితరవేశ్యలకుఁ దరమగునా?

ఉ॥ ఒక్కొకవేళ దేవపతి ♦ యొద్దకు నారదుఁ డేఁగుదెంచి యా
జక్కవగబ్బిగుబ్బెతల ♦ చక్కఁదనంబును నాట్యవిద్యయున్
మక్కువసేఁతలున్ విటుల ♦ మర్మ మెఱుంగుటలుం గణింపఁగా
గ్రక్కున దేవలోకగణి ♦ క ల్తలవంతురు సిగ్గుపెంపునన్. 51.

అ॥ ఒక్కొకవేళన్ ఒక్కొకసమయమున, దేవపతియొద్దకున్ — ఇంద్రునిదగ్గఱకు, నారదుఁడు—నారదమహర్షి, ఏఁగుదెంచి—పోయి, ఆజక్కవ గబ్బిగుబ్బెతలచక్కఁదనంబును — చక్రవాకపక్షులవలె గుండ్రముగానై బిగువైన గుబ్బచనులు గల యావేశ్యలయొక్క సౌందర్యమును, గుబ్బ+ఎత—గుబ్బెత, గుబ్బలాడి, నాట్యవిద్యయున్ — నృత్యవిద్యయును, మక్కువసేఁతలున్ — ప్రేమను గనఁబఱచుచేష్టలును, విటులమర్మ మెఱుఁగుటలున్ — వ్యభిచారపురుషులయొక్క రహస్యములను దెలిసికొనుటయును, గణింపఁగాన్—పొగడుచుండఁగా, గ్రక్కునన్—వెంటనే, దేవలోకగణికల్—స్వర్గలోకమునం దుండెడురంభ మొదలుగాఁగలవేశ్యలు, సిగ్గుపెంపునన్—లజ్జయొక్క యధికముచేత, తలవంతురు—తలలువంచుకొనెదరు, ఇందు 'జక్కవగబ్బిగుబ్బెతల చక్కఁదనంబున్, అనుచోటఁ గేవలాంధ్రపదములతోఁ గూడినసమాసము 'సూ॥ కేవలవికృతిపదై ర్య స్సమాసకం తిం బ్రువన్తి వాక్యజ్ఞాః, నన్న॥ 'గణికల్ తలవంతురు, అనుచోట సమాసగతపూర్వపదం బగు బహువచనమున కుత్తరపద మగునేకవచనముతో నన్వయముగుచున్నది. 'సూ॥ ఒక్కొకచో సమాసగత పూర్వపదంబు వ్యవహితోత్తరపదం బొంటితోడను వానిపెక్కింటితోడను నన్వయించెడి, ప్రౌ॥ వ్యా॥ ఉదా 'క॥ నాయింటం బడిగడకల, సేయఁ బెరుఁగుఁ బాలుఁ ద్రావె, నీప్రియతనయుండు, హరివం॥ 'క॥ ఒక్కొక కన్నును జెవియును, జెక్కును జనుబొడ్డు మూఁపుఁ♦ జెలువగుచేయున్, బ్రక్కయుఁ బిఱుఁదును గాలును, నక్కజముగ మనుజశకల ♦ మపు డుదయించెన్, భార॥ మర్మ మెఱుఁగుటలుఁ గణింపఁగా, అనుచోట సరళాక్షరమును బొందినద్రుతము బిందువగుటకు 'సూ॥ లుగ్వాద్రుతప్రకృతికా త్పరత స్సరళే, స్థిరేచ నస్య స్యాత్, అలుకిచ సంశ్లేషస్స్యాత్ బిందుం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్' శబ్దచిం॥ ఉదా॥ ఉ॥ ఇంతి ఝరిం గిరిం బొడముఁ♦ నే యనిపల్కిరి, వసు॥

ఈపద్యమున 'వేశ్యలగుణముల వర్ణించినంతనే దేవవేశ్యలు తలలువంతురనుటచే అసంబంధ సంబంధాతిశయోక్తి ఉదా॥ 'చ॥ చందనశైలసానువులఁ♦జాలఁజెలంగుభుజంగబాలికా, బృందము శ్రీ నృసింహవిభుఁ♦జేర్కొనిపాడఁదదీయగానని, ష్యందములానువేడ్కఁ బెర♦యంగఁగురంగతురంగమేగమిన్, మందగతిప్రసంగములఁ♦మానవు దక్షిణగంధవాహముల్॥ నరస.

తా॥ ఒకొక్కసమయమున స్వర్గలోకమునఁ గలయింద్రసభకు నారదుం డరిగి యామణిపురమునం దుండినవేశ్యాంగనలయొక్క సొంపును, నాట్యవిద్యానిపుణత్వమును, వలపును గలుగఁజేయు వ్యాపారములును, కాముకులయొక్క రహస్యముల నెఱుంగుటయును, పొగడినతోడనే దేవలోకముననున్నరంభ మున్నగువేశ్యలు సిగ్గుతోఁ దలలువంచికొందురు. అట్టివెలయాండ్ర వర్ణింప నెవరితరము.

## —: పుష్పలావికావర్ణనము :—

ఉ॥ దండకు నేఁగుదెంచి విరి ♦ దండకు విల్వయొసంగి పుష్పకో
దండనిశాతమార్గణ వి ♦ దారితభావముఁ జెందలే మయో
దండకు నీకు నోయబల ♦ దండము దండము దండ మంచు దో
ర్దండము లెత్తిమ్రొక్కుదురు ♦ ప్రక్కఁ గన్గొని పౌరపల్లవుల్. 52

అ॥ పౌరపల్లవుల్—ఆనగరమునఁ గలవిటకాండ్రు, ప్రక్కన్—పూలదండ లమ్మెడుపడుచులను, కన్గొని—వీక్షించి, దండకున్—వారిసమీపమునకు, ఏఁగుదెంచి—పోయి, విరిదండకున్—పూలసరమునకు, విల్వయొసఁగి—వెలయిచ్చి, పుష్పకోదండ నిశాత మార్గణ విదారిత భావమున్, పుష్పకోదండ—మన్మథునియొక్క, నిశాతమార్గణ—వాఁడియైనబాణములచేత. విదారితభావమున్ — భేదింపఁబడినచిత్తమును, చెందలేము—పొందియుండఁజాలము, అయో—ఇది సంతాపమును దెలియఁజేయును. ఓయబల—ఓచిన్నదానా, దండకున్—ఈపుష్పహారమునకును, నీకున్—నీకును, దండము దండము దండమంచున్—మరలమరల నమస్కారములనుచు, దోర్దండములు—దండములవంటి తమబాహువులను, ఎత్తి—మీఁదికెత్తి, మ్రొక్కుదురు—నమస్కరించుచుందురు 'పౌరపల్లవుల్, అనుచోటఁ గడపటియుకారలోపమునకు 'సూ॥ పదాంతంబులై యసంయుక్తంబు అయిన నులురులయుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు' బా॥ వ్యా॥ ఇందు 'దండకు, అనిపలుమారుచ్చరింపఁబడుటచే వృత్త్యనుప్రాసాలంకారము. పుష్పలావికలను సమీపించి పూదండకు వెలయిచ్చి గ్రహించునంతలోనే విటులు కామోద్రేకు లగుదు రనుభావముచే విభావనాలంకారము. 'విభావనా వినాఽపిస్యా త్కారణం కార్యజన్మచేత్, హేతూనా మసమగ్రత్వే కార్యోత్పత్తి శ్చ సా మతా, కువ॥ 'క్రియాయాః ప్రతిషేధేఽపి ఫలవ్యాప్తిర్విభావనా, కా॥ ప్ర॥ ఉదా 'దివమప్యుపయాతానా మాకల్ప మనల్పగుణగణాయేషాం, రమయంతి జగంతిగిరః కథమివ కవయో నతే వంద్యాః, రుద్ర.

తా॥ ఆపురమునఁ గలజారులు పూవులమ్మెడుయువతులం గని వారినిసమీపించి యొకపూదండకు వెలయిచ్చి దానిం బట్టికొనయత్నింప వాఁడియైనమన్మథబాణములు విశేషముగా మేనఁసోకుటచేఁ గలిగినమనోవ్యాకులతలను సైఁచుకొనలేక యోకాంతా ! నీవిరులదండకును నీకు ననేకదండనములనితలోన్మెడ్చి యూఁగకపోవుచుందురు.

## —: గజవర్ణనము :—

తే॥ ప్రకటకటకంబుఁ బాదవి ♦ భ్రాజితంబు, నైనయగసంఘ మనిచూచి ♦ యచల
భావ, హైన్యమున నాగసంఘాత ♦ మంద్రు సుకవు, లచటిమదకుంజముల నే ♦
మనినుతింతు. 53

ఇందుఁ బర్వతములకును, గజసమూహమునకును, అభేదాధ్యవసాయము చేసి చెప్పినాఁడు.

అ॥ సుకవులు-గొప్పపండితులు, ప్రకటకటకంబుల్-స్ఫుటమైనదంతములయొక్క యలంకారమును 'ని॥ ప్రకాశంప్రకటంస్పష్టం. విశదంస్ఫుట ముల్బణమ్, యా॥ 'ని॥ కటకం వలయే సానౌ. రాజధానీ నితంబయోః, సాముద్రలవణే దంత. మండనే దంతినా మపి" విశ్వ. (పర్వ) ప్రకటకటకంబుల్-స్పష్టమైనపర్వతసానువులను-అనఁగా విభజింపఁబడిన కొండచరియల ననుట. 'ని॥ కటకో ఽస్త్రీ నితంబో ఽద్రేః" అమ. పాదవిభ్రాజితంబుల్-పాదములయొక్క ప్రకాశమును, (పర్వ) కొండసమీపమునందుఁ జుట్టువారి నుండెడుచిన్నతిప్పలప్రకాశమును, 'ని॥ పాదాః ప్రత్యన్తపర్వతాః, అమ. ఐన+అగసంఘము-అయినట్టి కదలకయుండు సముదాయము, (పర్వ) ఐన+అగసంఘము-అయినట్టి కొండలయొక్కగుంపు, 'వ్యు॥ నగచ్ఛంతీత్యగః, అని-అనుకొని, చూచి-బాగుగాఁబరిశీలించి, అచలభావహైన్యమునన్-చలింపనిస్వభావముయొక్కలేమిచేత, అనఁగాసంచరించుచుండుట చేతననుట, నాగసంఘాతము-ఏనుఁగులయొక్క సమూహము, (పర్వ) నాగసంఘాతము-అగముల యొక్కగుంపుగాదు, అనఁగాఁ బర్వతములయొక్కసముదాయము కాదనుట. అంద్రు-అనిచెప్పుదురు, అచటిమదకుంజరములన్-ఆపురియందుఁ గల మదపుటేనుఁగులను, ఇచట కుంజరశబ్దమును గూర్చి 'సూ॥ ర ప్రకరణే ఖ ముఖ కుఞ్జేభ్య ఉపసంఖ్యానమ్, (సిద్ధాం. వా) ఖరః, ముఖరః, కుఞ్జో హస్తిహనుః కుఞ్జరః, ఏమనినుతింతున్-ఏవిధముగా వర్ణింపఁగలను, ఇచటఁబాదములును, దంతములును, గనఁబడుటచేతను, నడచునట్టిస్వభావముచేతను, గుర్తించుటయే కాని లేకుండినఁ బర్వతములనియే చెప్పవచ్చుననుటచే నసంబంధ సంబంధాతిశయోక్త్యలంకారమును, శ్లేషాలంకారమును, మరియుఁ బర్వతములకుఁ జలనముండినఁగాని కుంజరములనుబోల వనునర్థముచే. ప్రతీపాలంకారమును. "ఆక్షేప ఉపమానస్య ప్రతీప ముపమేయతా, తస్యైవ యది వా కల్ప్యాతిరస్కారనిబంధనమ్, కా. ప్ర.

తా॥ ఆపురమునందలి గొప్పయేనుఁగులు దంతములతోఁ బ్రకాశించుచుఁ జక్కఁగా నడచుచుండఁ బాదములు గలపర్వతములవలె నుండెను. అదిచూచి తెలిసినవారు వానిని నాగము లనివ్యవహరింపసాగిరి. అట్టివానిని నే నేమనివర్ణింపఁగలను.

## —♦అశ్వవర్ణనము♦—

క॥ మనస్సైన నీడుగుఱ్ఱముఁ, గనుఁగొనలే రచటిఘోట ♦ కములకు భువిలో
మనస్సైన నీడుగాదా, యనిశ నిరాఘాటజవస ♦ మగ్రతచేతన్. 54.

అ॥ అచటిఘోటకములకున్-ఆపురమునఁగల గుఱ్ఱములకు, అనిశనిరాఘాటజవసమగ్రతచేతన్. అ-ఆయొక్క, అనిశ-ఎడతెగని, నిరాఘాట-అనర్గళమైన, అడ్డములేని, జవసమగ్రతచేతన్-శీఘ్రిము

యొక్క-సమృద్ధిచేత, మనసైనఁ-మనోవేగమయినను, ఈఁడుగాదు-సమానము కానేరదు, ఇచట 'ఈఁడు, శబ్దము నిత్యైకవచనాంతము. 'సూ॥ సమానార్థకములయిన యీడెనసరిసాటిలోనగు దేశ్య విశేషణ శబ్దములును" ప్రౌ, వ్యా. భువిలోన్-ఈపుడమియందు, మనసైనఁ-మదిలో వాంఛగల్గినను, ఈఁడుగుఱ్ఱముఁ-ప్రాయపువారువమును, కనుఁగొనలేరు-చూడఁజాలరు, ఇందు 'మనసైన-మనసైన, యమకాలంకారము. వానివేగమునకు మనోవేగముఁకూడఁ జాల దనుటచే భేదాతిశయోక్త్యలంకారము, "క॥ సాధారణ మగుదాని క, సాధారణతోక్తి భేద. కాతిశయోక్తిఁ" అలం. సా. సం.

తా॥ ఆనగరియందలి యశ్వములయొక్క యధికమైనగమనవేగమునకు మనోవేగమయినను సమముగాదు, ఇఁకఁ బ్రాయపుగుఱ్ఱములఁ జూడవలె నన్నఁ నీప్రపంచమునం దెవ్వరికిని వలనుపడదు.

క॥ ఒకకొన్ని మదికిఁదోఁచినఁ, బ్రకటించితిఁ గాని యచటి ♦ బహువస్తుసమృ
ద్ధికత శతపత్త్రిసంభవు, నకునైన గణింపరాదు ♦ నరనాథమణీ. 55.

అ॥ నరనాథమణీ-రాజులలో శ్రేష్ఠుఁడవైనవాఁడా, మదికిఁ-నామనమునకు, తోఁచినఁ-స్ఫురించఁగా, ఒకకొన్ని-కొన్నిఁటినిమాత్రమే, ప్రకటించితిఁ-వివరించితిని, కాని-ఇదిపర్యంతార్థకము, అచటిబహువస్తుసమృద్ధికత-అపురమునందలి యనేకము లగు వస్తువులయొక్క సంపూర్ణత్వము, శతపత్త్రిసంభవునకుఁ-బ్రహ్మదేవునకైనను, గణింపరాదు-ఎంచనలవి కాదు, ఇందు 'ఒకకొన్ని, అనుటకు 'సూ॥ ఒకశబ్దం బొక్కచో నల్పార్థకం బగు, పౌ॥ వ్యా॥ ఉదా "మ॥ ఒకముహూర్తంబు గదల్చి తెచ్చినలలా♦ టోగ్రాక్షుచాపంబు, భాగ♦ 'ఒకనూఁడుల్, మార్కం. 'కొన్ని, యనుటకు "సూ॥ జడతావాచకత్వేతు న్న్యంతతాత్రదృశ్యతే" అథ. అచటిబహువస్తుసమృద్ధికత శతపత్త్రిసంభవునకునైన గణింపరాదు, అనుటచే నతిశయోక్త్యలంకారము:

తా॥ రాజా! నాకు జ్ఞాపకమున్నవఱకే కొన్నింటిని మాత్రము చెప్పితిని గాని యాపురమునఁ గల వివిధవస్తుసముదాయమును వర్ణింప బ్రహ్మదేవునకైన శక్యము కాదు.

## —♦సురశర్మవర్ణనము♦—

క॥ ఆపురమునందుఁ జేయుం, గాఁపురము సమస్తజనులు ♦ గణుతింప బుధ
క్ష్మాపతి మతిరెండవభా, షాపతి సురశర్మ కర్మ ♦ సౌష్ఠవగురుఁడై. 56.

అ॥ ఆపురమునందుఁ-ఆనగరమున, సమస్తజనులుఁ-మనుష్యులందఱును, గణుతింపఁ-స్తుతింపఁగా బుధక్ష్మాపతి-పండితులలో రాజయినవాఁడును, అనఁగాఁ విద్వాంసులలో శ్రేష్ఠుఁడనుట. మతిఁ-ప్రజ్ఞయందు, 'ని॥ ధీః ప్రజ్ఞా శేముషీ మతిః, అమ॥ రెండవభాషాపతి-ద్వితీయుఁడైన చతుర్ముఖుఁడును, అగు సురశర్మ-సురశర్మ యనుపేరుగలబ్రాహ్మణుఁడు, కర్మసౌష్ఠవగురుఁడై-సత్కర్మములను జక్కఁగాఁజేయుటయందధికుఁడై, కాఁపురముచేయుఁ-నివాసముచేయుచుండెను. ఇందు 'కాఁపురము, అనుపదమునుగూర్చి 'సూ॥ పురవర్ణకంబు కాఁచు♦ దాఁచు♦ దాయాద్యాదులకగు, పౌ॥ వ్యా. 'ఆపురమునందుఁ జేయుం గాఁపురము-బుధక్ష్మాపతి మతి రెండవభాషాపతి, ఇవియను ప్రాసాలంకారము. 'మతి రెండవభాషాపతి, అనుటచేత నుభయతాద్రూప్యరూపకాలంకారము,

తా॥ ఆమణిపురంబునందుఁ గల ప్రజలందఱిచే స్తుతింపఁబడుచుఁ బండితశ్రేష్ఠుఁడును, ప్రజ్ఞయందు బ్రహ్మదేవునిబోలినవాఁడును, సత్కర్మముల నొనర్చుచుండువాఁడును, అగుసురశర్మయను భూసురోత్తముఁడు నివసించుచుండెను.

శా॥ చాతుర్వైద్యపరాయణుండు బహుశా ♦ స్త్రగ్రంథనిర్ణేతవి
ఖ్యాతాచారధురంధరుండు హరిపా ♦ దాంభోజసేవాకళా
సాతత్యప్రథితుండు లక్షణవిరా ♦ జత్కావ్యసర్గక్రియా
ద్వైతీయీకసరోజసుంతి యతఁడే ♦ తన్మాత్రుఁడే భూవరా. 57

అ॥ భూవరా-ఓరాజా, చాతుర్వైద్యపరాయణుండుఁ- నాలుగువేదములనుజదివినవాఁడును 'చతురోవేదానధీతే చతుర్వేదః. స ఏవచాతుర్వైద్యః, "సూ॥ చతుర్వేదస్యోభయపదవృద్ధిశ్చ, గణసూత్రము. బహుశాస్త్రగ్రంథనిర్ణేత-అనేక మయినశాస్త్రములను, ప్రబంధములను, నిర్ణయము చేయువాఁడును, విఖ్యాతాచారధురంధరుండుఁ-ప్రసిద్ధిగల మంచినడవడికయొక్క భారము వహించినవాఁడును, అనఁగా సత్ప్రవర్తనము గలవాఁడనుట, హరిపాదాంభోజసేవాకళాసాతత్యప్రథితుండుఁ. హరిపాదాంభోజ--శ్రీమహావిష్ణుమూర్తియొక్క పద్మములవంటి చరణములయొక్క, సేవాకళా-పూజించుట యనెడువిద్యయందు, సాతత్యప్రథితుండుఁ-ఎడతెగకయుండెడు ప్రసిద్ధుఁడైనవాఁడును, లక్షణ.........సూతి. లక్షణ-కావ్యములకు వలయులక్షణములతో, విరాజత్-ప్రకాశించుచున్న, కావ్యసర్గక్రియా-ప్రబంధములను రచించునట్టి పనియందు, ద్వైతీయీకసరోజసూతి-ద్వితీయుఁడుగానయి సబ్రహ్మ గలవాఁడు, అనఁగా బ్రహ్మదేవునికంటె శ్రేష్ఠుఁడనుట, "వా॥ సూ॥॥ తీయాదికక్ స్వార్థేవావాచ్యః, ద్వైతీయీకః, ద్వితీయః, సిద్ధాం, అతఁడు-ఆబ్రాహ్మణుఁడు ఏతన్మాత్రుఁడే-ఈపాటి ఆపాటి వాఁడా, సామాన్యమానవులవంటివాఁడు కాఁడనుట, ఇందు 'లక్షణ......సూతి, అనుటచే నధికతాద్రూప్యరూపకాలంకారము, 'అతఁడేతన్మాత్రుఁడే, అనుటచే భేదకాతిశయోక్త్యలంకారము. సామాన్యుఁగు నేయసామాన్యునుట భేదకాతిశయోక్తి యని శాస్త్రప్రసిద్ధి,

తా॥ నాలుగువేదములఁ జదివినవాఁడును, వివిధశాస్త్రములను, ప్రబంధములను, ధ్రువపఱచువాఁడును, సత్ప్రవర్తనమునం దధికుఁడును, శ్రీమహావిష్ణువుయొక్క పాదకమలములను నిరంతరము సేవించువాఁడును, లక్షణయుక్తముగాఁ గావ్యములసృజించుటయందు బ్రహ్మదేవునికంటె మిన్నయైన వాఁడును, అగు నాసురశర్మ మానవమాత్రుఁడని యెట్లు చెప్పఁగలము.

క॥ పరకాంతాముఖదోషా, కరకాంతిస్పర్శనమునఁ ♦ గడుమొగుడుచునా
ధరణీసురునేత్రంబులు, సరసిజము లన్నమాట ♦ సహజముగాదే. 58

అ॥ పర.........నమునఁ. పరకాంతా-ఇతరస్త్రీలయొక్క, ముఖదోషాకరకాంతి-వదనమనెడుచంద్రునికాంతియొక్క, స్పర్శనమునఁ-తగులుటచేత, (శ్లేషార్థము) పరకాంతాముఖ-అన్యస్త్రీలముఖముయొక్క, 'ని॥ ముఖంతు వదనే ముఖ్యే ద్వారేతారాభ్యుపాయయోః, యా. దోషాకర-పాపములకునివాసమయిన, 'ని॥ దోషః స్యాద్దూషణే పాపే. దోషా రాత్రౌ భుజే ఉ-పిన, మే. దా. దోషాఉ-పిసూన మహిమాంశు ర్నిశాకరేతి. వ్యాకోచకోకనదతాం దధతే నలిన్యః" మాఘ

కాంతి–కోరికయొక్క 'ని॥ కాంతిశ్శోభాభిలాషయోః. విశ్వ. స్పర్శనమునన్–సోఁకుటచేత, కడు మొగుడుచున్–అధికముగాముకుళించును, ఆధరణీసురునేత్రంబులు–ఆబ్రాహ్మణునియొక్క–కన్నులు, సరసీజములు—తామరపూవులు, అన్నమాట–అనునట్టివాక్యము, సహజముకాదే–న్యాయమేకదా, పరాంగనలను జూచుటతోనే యతనినేత్రములు నిమీలనము అగు ననుటలోఁ గమలములకుఁ జంద్రునిప్రకాశము విరుద్ధమైనందున ముకుళించుటయే కాక శ్లేషానుప్రాణితమై చంద్రునకు దోషాకరత్వము వివక్షితమైనందునఁ బరాంగనాముఖదర్శనము పాపములకు నివాసమైనకోరికలను బుట్టించునది కనుకఁ దద్దర్శన మెఱుఁగఁ డనునపుడు నిరుక్త్యలంకారము. 'క॥ యోగముచే నామములకు, బాగుగ నన్యార్థక్షప్తి పరఁగునిరుక్తిన్. ఈగతి వేఁపురు వీవువి, యోగుల దోషాకరాఖ్య యొప్పవె నీకున్, అలం. సా. సం. సురశర్మ పరస్త్రీముఖమును జూడఁ డనుటను గూర్చి "మాతృవత్పరదారాశ్చ, పరద్రవ్యాణి లోష్టవత్, ఆత్మవత్సర్వభూతాని, యః పశ్యతి స పండితః, చాణ.

తా॥ ఆబ్రాహ్మణునియొక్క కన్నులు చంద్రునివంటిముఖము గలపరస్త్రీలదర్శనముచేత మిక్కిలి మూఁతలుపడును. కనుక నతనినేత్రములు పద్మము లనిచెప్పుట యుక్తమే కదా.

శా॥ శిష్టత్వంబున వేదశాస్త్రపఠన ♦ శ్రీచేత నాధాతకుం
దృష్టింపంగ నశక్యుఁడైన ధరణీ ♦ దేవోత్తముఁ శ్రౌతని
ర్దిష్టాచారధురంధరత్వమున నా ♦ర్త్విజ్యంబు సల్పంగ న
గ్నిష్టోమాదులు సేసె నాతఁడు భువిన్ ♦ గీర్వాణసంతుష్టిగన్. 59.

అ॥ శిష్టత్వంబునన్ – సదాచారసంపన్నత్వమునను, వేదశాస్త్రపఠన శ్రీచేతన్ – వేదములను, శాస్త్రములను, చదువుటయొక్క–సమృద్ధిచేతను, ధరణీదేవోత్తమున్–బ్రాహ్మణులలో శ్రేష్ఠుఁ డయిన యాసురశర్మను, దృష్టింపఁగన్ – చూడఁగా, పరిశీలింపఁగాననుట, ఆధాతకున్ – ఆయొక్క–బ్రహ్మదేవునకు సైతము, ఇచట ధాతృశబ్దమునుగూర్చి ' సూ. డాబవిధాత్రాదేరః, 'తస్యచవా, 'తావు ఖౌరమేళసమా, అనుసూత్రములచేత ధాత, యగును. అశక్యుఁడైనన్ – సాధ్యము కానివాఁ డైనప్పటికిని, అతఁడు–ఆబ్రాహ్మణుఁడు, శ్రౌతనిర్దిష్టాచారధురంధరత్వమునన్ – శ్రౌతనిర్దిష్ట - శ్రుతులనుండి నిర్ధారణచేయఁబడిన, ఆచార–మంచినడవడికయొక్క–, ధురంధరత్వమునన్ – భారమును వహించుటచేత, ఆర్త్విజ్యంబు – యజ్ఞకర్మమునందుఁ గర్తచే ధనముపుచ్చుకొనియజ్ఞమును జేయించునట్టిపనిని, సల్పంగన్–ఆచరించుటకుఁ గాను, ఇచట 'చలుపు – సలుపు, అను రెండురూపములు కలవు. భువిన్–భూమియందు, గీర్వాణసంతుష్టిగన్ - వేల్పులకు సంతోష మగునట్లు, అగ్నిష్టోమాదులు చేసెన్–అగ్న్యాధానము మున్నగాఁగలవి చేసెను. అనఁగా వసంతకాలమునం దైదుదినములలోఁ జేసి ముగించెడుయాగము మొదలగునవి యాచరించె ననుట. 'అగ్నిష్టోమ, మనుటకు 'సూ. అగ్నేః స్తుత్స్తోమసోమాః. సిద్ధా. వ్యా। అగ్నేః పరేషామేంషాసస్యషః స్యాత్ సమాసే। అగ్నిష్టుత్ – అగ్నిష్టోమః–అగ్నిషోమా–అగ్నీవరుణౌ, ఉదా 'అగ్నిషోమచ్ఛాయయా త్వం పరీత, స్తాపహ్లాదౌ శత్రుమిత్రేతేషు కుర్వన్–అగ్నిష్టోమద్వేషినా, రావ. ఇందుఁ దృతీయపాదమున నిరుపోష్ఠఁ గలసంయుక్తములతో యతి సెప్పఁబడినది. 'అ॥ ఒకటి రెండు జడ్డులుండెనువర్ణంబు, విశ్రమస్థలమున కెల్లసెన్ని.

యశల దాని కెద్దియైన సంయుక్తవి, ప్రాకృతకృతిగ సంగనుమంతా. అప్పు, 'అధాశకుఁ డ్రుష్టింపఁగ నశక్యుఁడు, అనుటచే. అసాధారణోపమాలంకారము.

తా॥ అతఁడు విధివిహితకర్మాచరణమునందును, వేదశాస్త్రపఠనమునందును, బ్రహ్మదేవునకు నైతము సాధ్యము కానివాఁడయినప్పటికిని, వేల్పులకు సంతోషమగునట్లగ్ని ష్టోమాదియాగములనొనర్చెను.

మ॥ అతిభక్తిన్ గృహిణీశిరోమణిపద ♦ వ్యాసంగచంగాత్మయై
ప్రతివారంబును భక్ష్యభోజ్యములు సం ♦ పాదించి వడ్డింపఁగా
నతిథుల్ భోజనమాచరించి సుఖులై ♦ యాశీర్వదింపంగ నా
చతురాస్యాన్వయవార్ధిచంద్రమునకున్ ♦ సంతోష మెంతేయగున్. 60.

అ॥ గృహిణీశిరోమణి–గృహస్థురాండ్రలో శ్రేష్ఠురా లయినయతనిభార్య, అతిభక్తిన్–ఎక్కువ వినయముతో 'ని॥ భక్తిర్నిషేవణేభాగే–రచనాయాం, శ్రద్ధా. పదవ్యాసంగసంగాత్మయై. పదవ్యాసంగ–అతనిపాదముల నాశ్రయించుటయందు. చంగ–నేర్పరితనముగల, ఆత్మయై–మనస్సుగలదియై, ప్రతివారంబును–నిత్యమును, భక్ష్యభోజ్యములు – పిండివంటలను, అన్నమును, సంపాదించి–సమకూర్చి, వడ్డింపఁగాన్–అన్నము మొదలగువానిని భోక్తము పంచఁగా, అతిథుల్–భోజనార్థమింటికి వచ్చినవారు, అతిథి–అస్థితి–ఒకచో (స్థితి) నిలకడలేనివాఁడు. కావున అతిథి యని మనుస్మృతి. అత ధాతువునకు సతతగతియని యర్థము కావున (ఒకచో నిలువక) నిరంతరము దిరుగుచుండువాఁడు. అతిథి యని శబ్దశాస్త్రజ్ఞులు వ్యుత్పాదింతురు. 'ని॥ స్యాదావేశికఆగంతు రతిథిర్నాగృహాగతః, అ. అతిథి లక్షణము. 'యస్య నజ్ఞాయతే నామ, న చ గోత్రం న చ స్థితిః, అకస్మాద్గృహ మాయాతః, సోఽతిథిః ప్రోచ్యతే బుధైః.' మను॥ 'అజ్ఞాతకులనామాన మన్యతస్సముపస్థితం. పూజయేదతిథింసమ్యక్నైక గ్రామనివాసినం, సం. విష్ణు. తనయొక్కవంశము, నామధేయము, అధికారము, మున్నగునవి తెలియనీయక తటాలున గృహమునకు వచ్చినవాఁడే యతిథి యని చెపఁబడుచున్నాఁడు భోజనాపేక్షచేఁ దనకులనామప్రతిష్ఠాద్యుత్కర్షములను దెలియఁజేయఁగూడ దనికూడ మనుస్మృతియందే వచింపఁబడియున్నది. అతిథికి భోజనమును బెట్టవలయునా? అనుప్రశ్నకు 'దూరాగతం పథిశ్రాంతం, వృథా చ గృహమాగతః, అనర్చయిత్వా యో భుంక్తే, స వై చండాల ఉచ్యతే' చాణ. భోజనమాచరించి–ఆపదార్థములనుభుజించి, సుఖులై–ఆనందముగా నుండినవారై, ఆశీర్వదింపఁగన్– దీవించుచుండఁగా, ఆచతురాస్యాన్వయవార్ధిచంద్రమునకున్–బ్రహ్మవంశమనెడుసముద్రమునఁ జంద్రునివలెఁబుట్టినవానికి 'ని॥ అన్వవాయోఽన్వయోవంశో గోత్రంచాభిజనంకులమ్, హలా. 'ని॥ హిమాంశుశ్చంద్రమాశ్చంద్రః, అ॥ సంతోషము–ఆనందము, ఎంతేయగున్–ఎక్కువగాఁ గలుగుచుండును. ఇందు నాల్గవపాదమున సరసయతి సెప్పఁబడినది. 'గీ॥ నణలు సెల్లఁ గమల♦నాథనొండొంటికి, నయహ లొనరఁజెల్లు♦ హస్తి వరద, ; శషసలొందు నంద్రు♦ చఛజఝంబులతోడ, సరసయతులు నాఁగ♦జలధిశయల, సు॥ 'చతురాస్యాన్వయవార్ధిచంద్రముఁడు, అనుటచే నుపమాలంకారము. 'గృహిణీశిరోమణి, అనుప్రాసాలంకారము.

తా॥ మిక్కిలిశ్రేష్ఠురా లయినయతనిభార్య నిత్యము నతిథులకుఁ బిండివంటలును. భోజనమును, బరిశుద్ధముగాఁ దయారుచేసి వడ్డించినంత వారు భుజించి యానందముతో నాశీర్వాదము లొసంగుచుండఁగా నాబ్రాహ్మణున కెంతయో సంతోషము గలుగుచుండును.

ఉ॥ ఎంతకృపావిపాకభర ♦ మెంతనిరంతరధైర్య మాదరం
బెంత వివేకమెంత భయ ♦ మెంత ససమ్మదభావమెంత యా
శాంతమనస్కమాళికి ని ♦ శాంతమునన్ ధరణీసుపర్వు ల
శ్రాంతము భోజనోత్సవము ♦ సల్పుతఱిన్ గణనాధికంబుగన్. 61.

అ॥ ఆశాంతమనస్కమాళికిన్–ఓర్పుగలవారిలో శ్రేష్ఠుండయిన యా బ్రాహ్మణునకు, నిశాంతమునన్–తనయింటియందు, ధరణీసుపర్వులు–పుడమికి వేల్పులైనవారు. అనఁగా బ్రాహ్మణులు, అశ్రాంతమున్–ఎల్లప్పుడును, గణనాధికంబుగన్–లెక్కకుమించినవారై, భోజనోత్సవము–భుజించుటవలనిపండుగను. సల్పుతఱిన్–చేయునట్టిసమయమున. ఎంతకృపావిపాకభరము–ఎంతటిదయయనెడు భాగ్యముయొక్క భారము, ఎంత నిరంతరధైర్యము–ఎంతటి యెడతెగనిధీరత్వము, ఆదరంబెంత–ఎంతటిగౌరవము, ఎంతవివేకము–ఎటువంటిజ్ఞానము, భయమెంత–ఎంతటిభీతి, అనఁగా నతిథుల క్షేమలోపముజరుగునో యనుభయము, ససమ్మదభావమెంత–ఏలాటిసంతోషముతోఁగూడినభావము, ఈ చెప్పినగుణము లన్నియు నతనియం దధికముగ నున్న వనుటచే ద్వితీయసముచ్చయాలంకారము. ఇందు 'ఎంత–ఎంత, అని పలుమారుచ్చరింపఁబడుటచేత ననుప్రాసాలంకారము. 'శాంతమనస్కమాళికి నిశాంతమునన్, అనుచోట యమకాలంకారము.

తా॥ మిక్కిలియోర్పుగలవాఁడయినయా బ్రాహ్మణుఁడు దనయింట మితిమించినబ్రాహ్మణసంఖ్య భుజించుచుండుసమయమున నానందమును దయయును గౌరవమును ధీరతను గనఁబఱచుచు. జ్ఞానసంపత్తితో మెలఁగుచుండును గాని యేపాటిగర్వమును జెందఁడు.

## ——♦సురశర్మ గృహావర్ణనము♦——

సీ॥ అభ్యాగతారాధ ♦ నాపాద్యమానార్ఘ్య, పాద్యపాథః పూర ♦ పంకిలంబు
భోజనానంతర ♦ భాజనస్రుతఘృత, స్వచ్ఛమధుద్రవ ♦ పిచ్ఛిలంబుఁ
బరిశీలితాగమో ♦ పన్యాసపరశిష్య, బృందవాక్సందర్భ ♦ తుందిలంబుఁ
గాంచనవేద్యలం ♦ కారచూర్ణాయిత, ప్రకటితకర్పూర ♦ సికతిలంబు

తే॥ దేవపూజావసరసము ♦ ద్దీప్యమాన, చారుమణిరంగవల్లికా ♦ శర్కరిలము
మహిప!నుతిసేయఁజెల్ల దే♦యమరవహంబు,నాతనిగృహంబుసకలభా♦గ్యావహంబు62

అ॥ మహిప–ఓరాజా, అభ్యా........కిలంబున్- అభ్యాగత–అతిథులుగావచ్చినవారిని, ఆరాధన–పూజించుటకు, ఆపాద్యమాన–ఏర్పడుచున్న, అర్ఘ్య–పూజార్థమయినయుదకముయొక్కయు, పాద్యపాథః–పాదోదకముయొక్కయు, పూర–ప్రవాహముచేత, ఇచట 'అర్ఘ్యపాద్యశబ్దములకు 'మా॥ పాదార్ఘాభ్యాంచ, సిద్ధాం. పాదార్థముదకంపాద్యం. అర్ఘ్యం. పంకిలంబున్–బురదగాఁజేయఁబడినదానిని, 'అతిథింతత్రసంప్రాప్తం పూజయేత్ స్వాగతాదినా, అర్ఘ్యాసనప్రదానేన పాదప్రక్షాళనేన చ శ్రద్ధయాచాన్నదానేన, ప్రియప్రశ్నోత్తరేణచ, గచ్ఛంతంచానుయానేన, ప్రీతి

ముత్పాదయేద్గృహీ" పరా. భోజ......చ్ఛిలంబుల్, భోజన-భుజించుటయొక్క, అనంతర-తరు
వాత, భాజన-విస్తృత్యవలన, 'ని॥ భాజనంయోగ్యపాత్రయోః, విశ్వ. ప్రసృత-కాఁజఁబడిన, 'ని॥ స్యన్నం
రీణంప్రసృతంస్రుతే. ఆ॥ ఘృత-ఆజ్యముతోఁగూడిన, స్వచ్ఛ-నిర్మలమయిన, మధుద్రవ-తీపిపదార్థముల
యొక్క-రసముచేత, ఇచట మధుశబ్దమునకు క్షీరమనియర్థమును జెప్పుట యుక్తము "ని॥ మధు
క్షౌద్రే జలే క్షీరే. మద్యే పుష్పరసే మధు" విశ్వ॥ పిచ్ఛిలంబుల్-పేరుడుగలదానిని, అనఁగా
జిడ్డుతోఁ గూడినదాని ననుట, పరి.........లిలంబుల్. పరిశీలిత-అంతటను వెదకఁబడిన, ఆగమ-
శాస్త్రములయొక్క, ఉపన్యాస-విస్తరించిచెప్పుటయందు, పర-ఉత్కృష్టులైన, శిష్యబృంద-ఛాత్ర
సమూహముయొక్క, వాక్-పలుకులచేత, సందర్భ-అనుకూలమైన, 'ని॥ సందర్భము-అనుకూలము,
ఆం. దీ. తుందిలంబుల్-పెద్దబొజ్జలుగలవారు కలదానిని, ఇచట తుందిలశబ్దమునుగూర్చి 'సూ॥ తుం
దాదిభ్యఇలచ్చ, ఉదా. 'సాతుందిలంసిధ్మలమాత్మకాయం, రావ. కాంచ......రిలంబుల్! కాంచన
వేది - బంగారపుటరుఁగునందు' అలంకార-శృంగారముగ, చూర్ణాయిత- పిండిగానయిన, ప్రక
టిత-ప్రసిద్ధమయిన, కర్పూర-కప్పురముయొక్క, సికతిలంబుల్-ఇసుకగలదానిని, దేవ.........రిల
ముల్. దేవపూజా-దేవతార్చనయొక్క, అవసర-సమయమున, సముద్దీప్యమాన-మిక్కిలిప్రకాశించు
చున్న, చారుమణి-సుందరమయినరత్నములయొక్క, రంగవల్లి కాశర్కరిలముల్-ముగ్గులనెడుమొరము
గలదానిని, మొరము, అనఁగా గండ్రయిసుక ఇచట 'సికతిలము-శర్కరిలము, అనుశబ్దములనుగూర్చి
'సూ॥ సికతా శర్కరాభ్యాంచ, సిద్ధాం. సైకతో ఘటః శార్కరః. 'సూ॥దేశేలుబిలచౌచ, సిద్ధాం.
చాదణ్మతుప్చ సికతాః సంత్యస్మిన్దేశే సికతాః-సికతిలః. సైకతః,సికతావాన్. ఏవం శర్కరేత్యాది.
శబ్దరూపరహస్యాదర్శమున'శర్కరిలః-శార్కరిలః, అనిరూపద్వయముగపడుచున్నది. 'జప్యందేవార్చనం
హోమం స్వాధ్యాయంచైవమభ్యసేత్, ఏకద్విత్రిచతుర్విప్రాన్ భోజయేత్స్నాతకాన్ ద్విజః, పరా॥
అహరహంబుల్-ప్రతిదినమును, సకలభాగ్యావహంబుల్-సకలభాగ్య-సమస్తమయినసంపదలను, ఆవ
హంబుల్-కలిగించునట్టిదానిని, ఆతనిగృహంబుల్-ఆవిప్రునియొక్క-నివాసమును, నుతిసేయఁ జెల్లదే-
స్తోత్రముచేయుట యొప్పదా, అనఁగాఁ బ్రశంసింపఁ దగిన దనుట, ఈపద్యమంతయు నంత్యాను
ప్రాసముగఁ జెప్పఁబడినది. 'ఆతనిగృహంబు సకలభాగ్యావహంబు, అనుటకు. "స్వర్గస్థితానా
మిహ జీవలోకే,చత్వారి చిహ్నాని వసంతి గేహే,దానప్రసంగో మధురా చ వాణీ, దేవార్చనం బ్రా
హ్మణతర్పణం చ, చాణ. ఏగృహమునందు దానము, మధురవాక్కులు, దేవతాపూజనము, బ్రాహ్మ
ణులను తృప్తిపఱచుట, కలదో యది స్వర్గముతో సమానము. 'న విప్రపాదోదకకర్దమాని,న వేద
శాస్త్రధ్వనిగర్జితాని,స్వాహాస్వధా కారవివర్జితాని, శ్మశానతుల్యాని గృహాణితాని, చాణ. ఏగృహము
లయందు విప్రపాదమును గడుగకుండుట, వేదశాస్త్రములఁ బఠింపకుండుట, స్వాహాస్వధా, అనుశబ్ద
ములు వినఁబడకుండుట, కలవో అగృహములు శ్మశానముతో సమానములు. 'యథామాతరమా
శ్రిత్యసర్వేజీవంతిజంతవః, వర్తంతేగృహిణంతద్వ దాశ్రిత్యేతర ఆశ్రమాః, మను. ఇందు 'కాంచనవేది-
చారుమణిరంగవల్లికాశర్కరిలము, ఇత్యాదులచే నుదాత్తాలంకారము. 'ఉదాత్తంవస్తునఃసంపత్,
కా. ప్ర. ఉదా'ముక్తాఃకేలి విసూత్రహారగలితాఃసమ్మార్జనీభిర్హృతాః, ప్రాతఃప్రాంగణసీమ్నిమంథరచ
లద్బాలాంఘ్రిలాక్షారుణాః, దూరాద్దాడిమబీజశంకితధియః కర్షంతికేలీశుకాః, యద్విద్వద్భవనేషు
భోజనృపతేస్తత్త్యాగలీలాయితమ్."

తా॥ అతిథులఁ బూజించిన పాదోదకము యొక్క ప్రవాహముచేత బురదయైనదియును, బ్రాహ్మణ సముదాయమంతయు భుజించిన వెనుక తీసివేయఁబడుచున్న విస్తళ్ళనుండి స్రవించుచున్న నేతితోఁ గూడిన మధురపదార్థములయొక్క జిడ్డుకలదియును, సమస్తశాస్త్రములఁ బరిశోధించి యుపన్యసించుచున్న శిష్యసమూహముయొక్క పలుకులు విని సమ్మతించిన పెద్దబొజ్జలుగలవారు కలదియును, పసిఁడియరుఁగునం దలంకారముగా నమరినకప్పురపుఁబిండి కలదియును, దేవతార్చనాసమయమున మిగులఁ దేజరిల్లుచున్న చక్కనిరత్నములయొక్క ముగ్గులు గలదియును, నిరంతరము సమస్తసంపదలు గలదియును, ఆయినయా బ్రాహ్మణునియిల్లు పొగడ్తకుఁ దగినదిసుమా;

క॥ అలరెండువేలజిహ్వాలు, గలవానికినైనఁ దరమె ♦ గణుతింపఁగఁ ద
జ్జలజాసనకులజార్పిత, కలమాన్నసమోదవేద ♦ గర్భశ్రేణిన్. 63.

అ॥ తజ్జల......శ్రేణిన్. తత్-ఆయొక్క, జలజాసన-బ్రహ్మదేవునియొక్క, కులజ-వంశమునం దుబుట్టినవాఁడయిన యాబ్రాహ్మణునిచేత, అర్పిత-సమర్పించఁబడిన, కలమాన్న - వరియన్నముచేత, ని॥ శాలయఃకలమాద్యాశ్చ షష్టికాద్యాశ్చ పుంస్యమీ. అ॥ సమోద-సంతోషముతోఁగూడినవారయిన, వేదగర్భశ్రేణిన్ - గర్భమునందు వేదములుగలవారి సమూహమును. అనఁగా వేదములను జక్కఁగాఁ జదివినవారి సముదాయమననుట. గణుతింపఁగన్-వర్ణించుటకు, అలరెండువేల జిహ్వాలుగలవానికిన్-ఆయొక్క-ద్విసహస్రసంఖ్యతోఁగూడిన నాలుకలుగలశేషునకు, ఐనన్ - అయినప్పటికిని, తరమే-శక్యమగునా: కాదనుట. అతిశయోక్త్యలంకారము. 'జలజాసనకులజార్పిత కలమాన్నసమోద వేద, అను ప్రాసాలంకారము.

తా॥ ఆబ్రాహ్మణునియింటికి నిత్యము నతిథులుగా వచ్చి భుజించి సంతోషపడుచుండెడు వేదాధ్యయనపరులగు బ్రాహ్మణులసంఖ్యను వర్ణింప రెండువేలనాలుకలు గలవాఁడయిన శేషునకు సైతము సాధ్యముగాదు.

—ం: సురశర్మకు సంతానహీనత్వచింత :ం—

క॥ అది యెంతైననుగలదో, కదనజయాధార తజ్జ ♦ గన్నుతమహిమా
స్పదచరితుఁడు సుతహీనత, మదిఁ జింతిలు నెంతవారు ♦ మానరుసుమ్మా. 64.

అ॥ ఓకదనజయాధార-యుద్ధమునందు గెలుపునకు మూలమైనయోరాజా, అది - అప్రశంస, ఎంతైననుగలదు-చాలఁగలదు, తజ్జగన్నుతమహిమాస్పదచరితుఁడు. తత్ - ఆయొక్క, జగన్నుత-ప్రపంచమునఁ గలజనులందఱిచేఁ బొగడఁబడిన, మహిమా-మహాత్మ్యమునకు, ఆస్పద-నివాసమైన, చరితుఁడు-చరిత్రముకలవాఁడు; సుతహీనతన్-బిడ్డలులేకపోవుటచేత, మదిన్ - మనస్సునందు, చింతిలుట-విచారపడుట, ఎంతవారున్-ఎంతటిధైర్యముగలవారయినను, మానరుసుమ్మా - విడువరుసుమా, సంతానము లేనప్పు డెవ్వరయినను వ్యసనపడుదు రనుట, అర్థాంతరన్యాసాలంకారము.

తా॥ ఓరాజా! ఆ బ్రాహ్మణునియొక్క ప్రసిద్ధిగల వర్తనమునుగురించి యెంతయైనను జెప్ప వలసియుండును. అదియట్లుంచి యతనికి సంతానములేనందున మనస్సులో విచారపడుచుండెను. అలాగున విచారపడుట లోకమునం దెవ్వరికైనను గలదుగదా?

తే॥ విప్రుఁడింటికివచ్చిన ♦ విమలభక్తి, నన్నపానాదు లొసఁగి నె♦య్యమునఁ జేరి
యయ్య; పుత్త్రులుమీకెంద♦ఱనుటకాని, యితరమేమియునడుగఁడా♦ క్షితిసురుండు.65

అ॥ క్షితిసురుండు - ఆబ్రాహ్మణుఁడు, విప్రుడు - ఒకబ్రాహ్మణుఁడు, ఇంటికిన్ - తన యొక్క గృహమునకు, వచ్చినన్ - వచ్చినట్లయిన, రాఁగానేయనుట, విమలభక్తిన్ - పరిశుద్ధమైన భయముతోఁగూడిన స్నేహముతో. అన్నపానాదులు - భోజనమునిడుట మున్నగునవి, ఒసఁగి- సమర్పించి, నెయ్యమునన్ - ప్రేమతో, చేరి - అతనిని సమీపించి. అయ్య - అయ్యా. ఇది గౌరవమును దెలియఁజేయు సంబోధనము. మీకున్ - తమకు, పుత్త్రులు - కొడుకులు, ఎందఱు- ఎంతమంది కలరు, అనుటకాని - అనుటయేతప్ప, ఇతరము - ఇంకొకటి, ఏమియున్ - ఏమాటయును, అడుగఁడు - ప్రశ్నించఁబోఁడు.

తా॥ ఆవిప్రుఁడు తనయింటి కొకయతిథి వచ్చెనేని భక్తియుక్తముగా భోజనాదుల నిడి యతనిచెంకకుఁ జేరియయ్యా: మీకుసంతాన మెందఱని యడుగుటయేతప్పవేఱియొకమాటయడుగఁడు.

సీ॥ నందనుం డాత్మాభి ♦ నందనుండై ముద్దు, మాటలఁ గరఁగింప ♦ మలయువారిఁ
దనయుండు సముదంచి ♦ తనయుఁడై చదువనా, గమపురాణాదులు ♦ గఱపువారి
సూనుండు వాక్యప్ర ♦ సూనుఁడై పెద్దలఁ, బూజింప వేడుకఁ ♦ బొందువారి
నాత్మజుం డధికరూ ♦ పాత్మజుండై భార్య, యును దాను మెలఁగంగఁ ♦ దనరువారిఁ

తే॥ జూచి హాకృష్ణ! బ్రహ్మాది ♦ సుతులఁగాంచి, నట్టిత్రైలోక్యగురుని దే ♦ వాధినాథు
నిన్ను సేవించువారికి♦నిస్తనూజ, భావమా? యంచుఁ జింతించు♦బ్రాహ్మణుండు. 66.

అ॥ బ్రాహ్మణుండు - అసురశర్మ, నందనుండు - కుమారుఁడు, ఆత్మాభినన్దనుండై - మనస్సునకు సంతోషమును గూర్చువాఁడై, 'ని. నందనోహర్షకేసుతే, విశ్వ. ముద్దుమాటలన్ - ముచ్చటయిన పలుకులచేత, కరఁగింపన్ - హృదయమును ద్రవముగాఁజేయఁగా,-సంతోషపెట్టఁగా, మలయువారిన్ - సంచరించునట్టివారిని, తనయుండు, పుత్రుఁడు, సముదంచితనయుఁడై - అత్యంతముగాఁ బ్రకాశింపఁబడినసీతి గలవాఁడై, చదువన్ - పఠించునట్లు, ఆగమపురాణాదులు - శాస్త్రములును, పూర్వపు చరిత్రములును, మొదలగునవి, కఱపువారిన్ - బోధించువారిని, అధ్యాపింపఁ జేయువారిననుట. సూనుండు - కొమరుండు, వాక్యప్రసూనుఁడై - సద్వాక్యము లనెడుపుష్పములు కలవాఁడై, పెద్దలన్ - తెలిసినవారిని, పూజింపన్ - సేవచేయఁగా, అనఁగాఁ బెద్దవారియెడ వినయభాషణములతోఁ బ్రవర్తించువాఁడు కాఁగాననుట, వేడుకన్ - వినోదమును, పొందువారిన్- కూడినట్టివారిని, ఆత్మజుండు - కొడుకు, అధికరూపాత్మజుండై - ఎక్కువయిన చక్కఁదనముతోఁ గూడిన మన్మథునివంటివాఁడై, భార్యయును - తయినల్లాలును, తానున్ - అతఁడును, మెలఁగంగన్ - ప్రవర్తించుచుండఁగా, తనరువారిన్ - ఒప్పుచున్నవారిని, చూచి - వీక్షించినవాఁడై, హాకృష్ణ - ఓకృష్ణా, ఇది శోకమునుదెలియఁజేయు సంబోధనము, 'ని. హా విషాదేచ శోకేచ, అమ. బ్రహ్మాదిసుతులన్ - బ్రహ్మదేవుఁడు మొదలగుబిడ్డలను, కాంచినట్టి త్రైలోక్యగురునిన్ -

కనినవాఁడవైనట్టువంటి మూఁడులోకములకుఁ దండ్రివైనవానిని. దేవాధినాథున్ - వేల్పులకుఁ బ్రభువైనవానిని, నిన్నున్ - నిన్ను, సేవించువారికిన్ - పూజించునట్టివారికి, నిస్తనూజభావమూ - సంతానములేని మనోవికారమూ, అంచున్ - ఇట్లుపలుకుచు, చింతించున్ - తనమనస్సులో విచారపడుచుండును, ఈపద్యమునఁ ముద్దుమాటలఁ గరఁగిపన్, అనుటకు దా "ఎ, గీ. ప్రథమ సురతంబు గంధర్వపతిఁ గరంచె" స్వా. మ, 'నందనుం డాత్మాభినందనుండై' ఇట్లు నాలుగు పాదముల యందును యమకాలంకారము. "యమకం పౌనరుక్త్యతు, స్వరవ్యంజనయుగ్మయోః" ప్రతా. ఇట్టిచోట్ల వే. వెంకటరాయశాస్త్రిగారు శబ్దావృత్తి లాటానుప్రాసమనియు, వృత్త్యనుప్రాసమనియు వ్రాసిరి. '.వలయములవియాలవాలవలయములయ్యెన్' శృం. నై. 'బ్రహ్మని సుతులఁ గాంచిన త్రైలోక్యగురుని నిన్ను సేవించువారికి నిస్తనూజభావమూ, అనుటచేఁ బరికరాలంకారము. "విశేషణై ర్యత్సాకూతై రుక్తిః పరికరస్తు సః" కా. ప్ర.

తా॥ ఆవిప్రుఁడు దనయూరివారిలోఁ గొడుకు తండ్రికి సంతోషమునుగలిగించు ముద్దుమాటలతోఁ దిరుగుచుండువారిని, బిడ్డఁడు మిగులనీతిపరుఁడై చదువున ట్లితిహాసాదులు బోధించువారిని, సుతుఁడు వినయభాషణములం దధికుఁడై కులకాంతతోఁ గాఁపురముసేయుచుండ నెలయువారిని, గాంచి హా శ్రీహరీ బ్రహ్మకులఁ గనిననీవంటి ముల్లోకజనకుని సురనేతను సేవించుచున్ననాకు సంతానములేకుండుటయా! అని తనమనస్సులో విచారపడుచుండును.

ఉ॥ ఏమిజపంబుఁ జేసిరొకో ♦ యేమితపంబొనరించిరొక్కొ యే
మేమిసపర్య లార్యతతి ♦ కిచ్చిరొకో జగదేకపూజ్యులై
తాముఁ దనూజరత్నములుఁ ♦ దామరతంపరలై చెలంగువా
రీమహిఁ దొల్లి యంచు నుతి ♦ యించు మహీసురుఁ డాత్మలోపలన్. 67.

అ॥ మహీసురుఁడు-ఆబ్రాహ్మణుఁడు, ఆత్మలోపలన్ - తనమనస్సునందు, ఈమహిన్-ఈ భూమియందు, జగదేకపూజ్యులై-లోకమున ముఖ్యముగాఁ బూజింపఁదగినవారై, తామున్-వారును, తనూజరత్నములున్-వారియొక్క-శ్రేష్ఠు లయినకుమారులును, తామరతంపరలై-అభివృద్ధితోఁ గూడినవారై, ఉదా 'వ॥ తామరతంపరైనచెలులుఁ జుట్టలుఁ గలసి, భార. చెలంగుచున్నవారు - ఒప్పుచున్నవారందఱును, తొల్లి-పూర్వజన్మమున, గతకాలమున. ఏమిజపంబున్-ఎంతటియుత్కృష్టమైన మంత్రపఠనమును, చేసిరొకో-అనేకపర్యాయములుచ్చరించినారో కదా, ఏమితపంబున్ - ఏయొక్క-కష్టతరమైనతపస్సును, ఒనరించిరొక్కో-ఆచరించినారోకదా, ఆర్యతతికిన్-పెద్దలయొక్క-సముదాయమునకు, ఏమేమిసపర్యలు-ఏయేఘనమైనపూజలు, ని॥ పూజానమస్యాపచితిః సపర్యాఽర్చాఽర్హణాః సమాః, అ॥ ఇచ్చిరొకో-అర్పించియుండిరోకదా, ఇచట 'ఏమిజపంబు, అనుటకుదా 'క॥ ఏమితపంబొనరించితి, భూమీశ్వర' భార, అంచున్-ఇట్లు తలంచుచు, నుతియించున్-పొగడుచుండును. ఇచట 'నుతించు. ననుట కికారాదేశంబగుటనుగూర్చి 'సూ॥ లఘ్వేకాక్షరపూర్వక్రియా న్తిమస్యావయోభవేదిద్వా' శబ్ద చిం॥ ఇందుఁ గడపటిపాదమున భిన్నయతి సెప్పఁబడినది. 'తే॥ గుడుసుపైఁ గ్రియనడుమ నాగుడుసువచ్చి, భిన్నయతి యగు రాన్నిహోఁ.బెఱయతి యగు, నెవను లచ్చిని హరిధరియించె ననఁగ, రిపులనెల్లను బోరహరించె ననఁగ' అప్ప॥ 'క॥ అంచితలకముశౌరిధ, రించెననన్

జగణమధ్య•రేఫ విరతియే, యంచితతిలకము హరి భర, యుఁచె నన౯ శిఖ్నవడికి•నిత్యము వచ్చు౯॥
అనఁ॥ 'చేసిరో కో' ఇత్యాదులు బ్రయోగించుటను గూర్చి 'సూ॥ అన్యే వ్యర్థవిశేషే. స్యురంతే శ్రుతి మనోహరాః' అథ॥ అతఁడు సత్సంతానయుతులఁ జూచి వీర లేమహాపుణ్యఫలప్రాప్తిచే నిట్లుసంతాన ముతోఁ దులఁదూఁగుచుండిరో ? అటులఁ గానిచో వీరి కేమహోన్నతదశ యెట్లులభించును ? అను టచేతఁ గావ్యలింగము. 'కావ్యలింగం హేతోర్వాక్యపదార్థతా' ఉదా॥ వపుః ప్రాదుర్భావా దను మిత మిదం జన్మని పురా, పురారే నప్రాయః క్షణమపి భవంతం ప్రణతవా౯, సమన్మ్రక్తః సంప్ర త్యహ మతనురగ్రేప్యనతిభా౯, మహేశక్షంతవ్యం తదిద మపరాధద్వయ మపి' కా॥ప్ర॥

తా॥ ఆవిప్రుఁడు ప్రపంచమునఁ బుత్రపౌత్రాభివృద్ధిగ నున్న కుటుంబములఁ జూచి తనమనస్సులో వీరలు పూర్వజన్మమున నేలాటిగొప్పమంత్రమును జపించిరో, యేకఠినతర మైనతపము నాచరించిరో, యేవిధముగాఁ బెద్దల బూజించిరో' యని స్తుతించుచుండును.

ఉ॥ ఓరమణీమనోభవ స ♦ మున్నత దుష్కృత దావపావకా
సారము పుత్త్రుఁ డా ప్తవన ♦ చైత్రుఁడు గల్గమి నంచలేని కా
సారమువోలె నాసరసి ♦ జప్రభ వాన్వయవార్ధిచంద్రసం
సార మసారమై మిగుల ♦ సన్నుతి కెక్కకపోయె దుస్థితిన్. 68.

ఆ॥ ఓరమణీమనోభవ-సుందరులైన స్త్రీలకుమన్మథునివంటివాఁడా, సమున్నతదుష్కృతదావ పావకాసారము. సమున్నత-అధికమయిన, దుష్కృతదావపావక-పాపమనెడుదవానలమునకు, దవా నలమనఁగానడవిగాల్చుకాఱుచిచ్చు. 'ని॥ దావస్తు, దవోవనహుతాశనః, అ॥ దావశబ్దమునకువనమని నను వనవహ్నియేయగును 'ని॥ వనేచవనవహ్నౌచ దవోదావఇహేష్యతే, యా. అసారము-ఎడ తెగనివర్షమైనవాఁడు, అనఁగా జడివాన యైనవాఁ డనుట. "॥ ధారాసంపాత ఆసారః" అమ. "వ్యు. ఆసమంతాత్ సరతీ త్యాసారః" అంతటను వ్యాపించునది. పుత్త్రుఁడు-కుమారుఁడు, ఆప్తవన చైత్రుఁడు-కోరిక యనునట్టియడవికి చైత్రమాస మయినవాఁడు, అనఁగా వసంతర్తు లైనవాఁ డనుట, "ని॥ ఆప్త స్సత్యే హితే లబ్ధే, విశ్వ.కల్గమి౯-పుట్టకుండుటచేత, ఆసరసిజప్రభవాన్వయవార్ధిచంద్ర సంసారము. ఆ-ఆయొక్క, సరసిజప్రభవాన్వయవార్ధి-బ్రహ్మవంశమనుసాగరమునకు, చంద్ర-చంద్రుఁ డైనవానియొక్క, సంసారము-కుటుంబము. అంచలేని కాసారమువోలె౯-హంసలేకుండినకొలనువలె, మిగుల౯-ఎక్కువగా, అసారమై-సారములేనిదై, "వ్యు.నవిద్యతే సారో ఽస్యేత్యసారం" దుస్థి తి౯-నిషేధింపఁబడినయునికిచేత, ని॥ దు ర్నిషేధే చ కష్టేచ,"మే. అనఁగా. "అపుత్త్రస్య గతి ర్నాస్తి" అని చెప్పఁబడియున్నది కనుక సంతానహీనునకుఁ బుణ్యలోకప్రాప్తి లేదు. కావుననే "వ్యు.పుంనామనరకా త్త్రాణా త్పుత్త్రః" సన్నుతికి౯. స౯-శ్రేష్ఠులయొక్క "ని॥ స౯ సత్య విదుషి శ్రేష్ఠే సాధౌ భవతి చ త్రిషు"నానా. నుతికి౯-పొగడ్తకు, చక్రవిస్తోత్రమునకు ననియుఁ జెప్పవచ్చును. ఎక్కకపోయె౯-ఇష్టము కాకపోయెను, ఇక్కడఁ జంద్రుఁ డనిచెప్పుటలో 'సంసా రము-నిండారినశక్తియగును. "ని॥ సార శ్శ్రేష్ఠే బలే విత్తే క్లేశే జలచరస్థితే" ధనం. అసారమై-హీ నమై, అనఁగాఁ గృష్ణపక్షమునందుఁ జంద్రుఁడు క్షీణించుటచే ననుట. దుస్థితి౯-కూడనియునికి యందు, అనఁగాఁ గృష్ణపక్షచంద్రుఁడు శుభకార్యములయందు నిషేధింపఁబడువాఁ డని జ్యోతి

శాస్త్రప్రమాణప్రసిద్ధము. సత్-నక్షత్రములయొక్క, 'స॥ సత్ క్లీబ మృక్షేచ'' నానా. నుతికిన్ - స్తోత్రమునకు. ఎక్కకపోయెన్-పనికిరాకపోయెను, ఇందు ద్విప్రాసము చెప్పఁబడినది. మఱియు. 'సార-సార, అని పెక్కుమారు లుచ్చరింపఁబడుటచే వృత్త్యనుప్రాసాలంకారము. 'దుష్కృతదావ పావకాసారము-అంచలేని కాసారము, ఇవియుపమాలంకారము. 'చంద్రుఁ డనిచెప్పి సన్నుతి కెక్క కపోయె ననుటచే శ్లేషాలంకారము. పొగడ్త కెక్కకపోయె ననుటకు "అపుత్త్రస్య గృహం శూన్యం దిశః శూన్యా స్త్వబాంధవాః, మూర్ఖస్య హృదయం శూన్యం సర్వశూన్యం దరిద్రతా, చాణ. మఱియు, "నతజ్జలంయన్న సుచారుపంకజం నపంకజంయద్వ్యదలీనషట్పదం, నషట్పదోఽసౌకలగుంజితోనయః,నగుంజితంతన్న జహారయన్మనః'' భట్టి. పుత్త్రుఁడులేనిసంసారము నిస్సారమైయంచలేని కాసారమువలె లెక్కకురాకపోయె ననుటచే అచారుతావినోక్త్యలంకారము. "వినోక్తిః సా వినాఽన్యేన, యత్రాన్యః సన్న నేతరః'' కా. ప్ర. ఉదా "అరుచి ర్నిశయావినాశశీ,శశినా సాఽపి వినా మహత్తమః, ఉభయేనవినా మనోభవ, స్ఫురితంనైవచ కాస్తి కామినోః'' మూర్తికవియునిట్లె, క. సంబంధి బాసి మఱియొక, సంబంధికిఁ జారుతయు నచారుతయుం బ్రా, ప్తంబుగఁ బ్రజ్ఞాధికులను, తంబున నదియగు వినోక్తి'' అనినాఁడు. ఉదా. "క॥ కవిలేని రాజుకీర్తియు, రవిలేనినభంబు రూపరసభావములుం, జవిలేనిభామపొందును, రవలేనివిభూషణంబు రహి నరిసింపవే'' కా. సం.

తా॥ నక్కనివాఁడ వైనయోరాజా ! దవానలమువంటి సంతానహీనదుఃఖమును నిర్మూలింపఁ దగినజడివానను బోలినవాఁడును, కోరకలనెడువనమును జిగిరింపఁజేయుటకు వసంతర్తువువంటి వాఁడును, అగుసుతుఁడు జనింపకుండుటచే నతనిసంసారము సారములేనిదై లోకమునఁ బూజనీయుఁడైనను గణ్యతకెక్కకయుండెను,

మ॥ నరలోకంబునఁగల్లు తీర్థముల మా ♦ న్యప్రక్రియంగ్రుంకనీ
నరకక్లేశనివారకంబు లగు నా ♦ నాక్షేత్రముల్ మెట్టనీ
యురరీకారముతోడ యజ్ఞములు వే ♦ దోక్తంబుగాఁ జేయనీ
పురుషుం డాత్మజహీనుఁడై సుగతికిం ♦ బోనేరఁ డుర్వీశ్వరా. 69.

అ॥ ఉర్వీశ్వరా-ఓపుడమిఱేఁడా, పురుషుండు-మానవుఁడు, నరలోకంబునన్-భూలోకమున, కల్లుతీర్థములన్ - ఉండినపుణ్యనదులను, మాన్యప్రక్రియన్ - గౌరవింపఁదగిన శ్రేష్ఠమయిన కార్యములతో, గ్రుంకనీ-మునుంగనిమ్ము, నరకక్లేశనివారకంబులు. నరకక్లేశ-దుర్గతివలనిదుఃఖములను, నివారకంబులు-రానీయక యడ్డగించునవి, అగు నానాక్షేత్రముల్-అయినట్టి యనేకపుణ్యభూములను, మెట్టనీ-త్రొక్కనిమ్ము, సంచరించనిమ్ము, ఉరరీకారముతోడన్-జనాంగీకారముతో, మనుజులందఱికి సమ్మతిగా ననుట. యజ్ఞములు-యాగములు, యజ్ఞము లనఁగా దేవతలకుఁ బ్రీతికొఱకుఁ జేయఁబడునవి, వేదోక్తంబుగాన్-వేదములందుఁ జెప్పఁబడినట్లుగా, చేయనీ-చేయనిమ్ము, ఆత్మజహీనుఁడై-కొడుకులులేనివాఁడై, సుగతికిన్-పుణ్యలోకమునకు, పోనేరఁడు-పోఁజాలఁడు, మానవుఁడు పుణ్యకార్యము లెన్ని చేసినను సంతానహీనుఁడైనచో స్వర్గప్రాప్తిలే దనుటకు ప్రమాణము. "దుర్గతిః కథితా పూర్వ,మపుత్త్రాణాం చ పాపినాం,పుత్త్రిణాం ధార్మికాణాంతు, న కదాచి త్ఖగేశ్వర'' పుత్త్రజన్మావరోధస్స్యా,ద్యది కేనాపి కర్మణా. తదా కశ్చిదుపాయేన, పుత్త్రోత్పత్తిం

ప్రసాధయేత్" [illegible] ప్రశ్నా, [illegible] పుత్త్రో ముత్పా దయేచ్ఛన్తి,, పుణ్యాన్యన్యాని [illegible] న్యస్తాని, [illegible] ప్రాయణే [illegible] తస్మాత్ తత్పుత్త్రో ఇతి ప్రోక్తః, స్వయమేవ స్వయంభువా,, [illegible] త్రాయతే కులం, పుత్త్రేణ లోకాన్ జయతి, [illegible] ఇతి [illegible] ప్రోక్తం. పుత్త్రమాహాత్మ్య ముత్తమం, తస్మాత్పుత్త్రముఖం దృష్ట్వా, ముచ్యతే పైతృకా దృణాత్,, పౌత్త్రస్య స్పర్శనా త్స్వర్గో, ముచ్యతే చ ఋణత్రయాత్, లోకానన్త్యం [illegible] పుత్త్రపౌత్త్రప్రపౌత్త్రకైః,, గరు. పుత్త్రులు లేనివా రెన్నిసత్కర్మముల నాచరించినను స్వర్గప్రాప్తి లే దనుటచేత నప్రస్తుతప్రశంసా లంకారము. "అప్రస్తుతప్రశంసా యా, సా సైవ ప్రస్తుతాశ్రయా" కార్యేనిమిత్తే సామాన్యే, విశేషే ప్రస్తుతే సతి, తదన్యస్య వచస్తుల్యే, తుల్యస్యేతి చ పంచధా" [illegible] ఉదా "ఆదాయవారి పరితః సరితాం ముఖేభ్య,, కిం తావదర్జిత మనేన దురర్ణవేన, [illegible] హుతం చ, పాతాళకుక్షికుహరే వినివేశితం చ,, భట్టైః.

తా॥ ఓధర్మశీలా! మనుజుఁ డీలోకమునఁ గల పుణ్యనదు లన్నింటి లోఁ [illegible]మునిఁగినను; పాప రహితము లగు ననేక పుణ్యహోమములఁ జేసినను. ఎల్లవారును మెచ్చునట్లు యజ్ఞములు వేదోక్తముగా నాచరించినను, సంతానహీనుఁ డైనవాఁడు పుణ్యలోకములకుఁ బోఁజాలఁడు.

సీ॥ సిద్ధాంజనము వేఱె ♦ సిద్ధింపవలయునే, పుత్త్రుండు గలిగిన ♦ భూవరేణ్య
సురమహీజము వేఱె ♦ దొరకంగవలయునే, తనుజుండు గల్గిన ♦ మనుజనాథ
యమరరత్నము వేఱె ♦ సమకూరవలయునే, తనయుండు గల్గిన ♦ ధారుణీశ
దైవధేనువు వేఱె ♦ దక్కఁగవలయునే, సూనుండు గల్గిన ♦ మానవేంద్ర

తే॥ సుతుఁడు గల్గినఁ బరలోక ♦ సుఖముఁ గాంచు, నాత్మజుఁడు గల్గఁ గులమెల్ల ♦ నతిశయిల్లుఁ
గొడుకు గల్గిన ఋణశుద్ధిఁ ♦ బడయవచ్చుఁ, బరమసుఖకారణము తనూ ♦ భవుఁడు సువ్వె.

అ॥ భూవరేణ్య—ఓ రాజా, పుత్త్రుండుగల్గినన్—కొడుకుపుట్టినట్లయిన, సిద్ధాంజనము—ఓషధుల యొక్క—శక్తితోను, మంత్రములయొక్క—సామర్థ్యముతోను, మహాయోగీశ్వరులచేతఁ జేయఁబడిన కాటుక. ఇది నేత్రములకుసోఁకినమాత్రముననే స్వర్గమర్త్యపాతాళలోకములలోని నిధి (ద్రవ్యాదులు తెలుగ కుండునట్టిగని) నిక్షేపము (పాతిపెట్టఁబడినధనము) మున్నగు రహస్యములన్నియు తెలుకపడును. అది వేఱెసిద్ధింపవలయునే—విభజనగా దొరకవలెనా, దొరకినట్లేయనుట. మనుజనాథ—ఓనృపాలా, తను జుండుగల్గినన్—సుతుఁడుగలిగెనేని, "ని॥ స్త్రీయాం మూర్తిస్తనుస్తనూః" అమ॥ సురమహీజము—దేవ లోకముననుండెడుకల్పవృక్షము, ఇది యెల్లప్పుడును అమృతఫలంబులొసంగుచుండును. ఈ ఫలముల భుజించినవారికే నాఁటికిని మృత్యువురాదు. అట్టిది వేఱె దొరకంగవలయునే—ఇంకొకవస్తువుగా లభించ వలయునా, లభించినట్లేయనుట ధారుణీశ—ఓపుడమిఱేఁడా, తనయుండుగల్గినన్ — కొమరుఁడు జన్మించెనేని, అమరరత్నము—స్వర్గలోకముననుండెడు చింతామణి, ఇది కోరినవానినెల్ల నెడతెగక యిచ్చునది. అలాటిది వేఱెసమకూరవలయునే — నిడిగా ప్రాప్తించవలెనా, ప్రాప్తించినట్లేయనుట. మానవేంద్ర—మనుజులకుఁ బతియైనవాఁడా, సూనుండుగల్గినన్ — బుధుతఁడుద్భవించినట్లయిన, దైవ

ధేనువు- దేవలోకమందుండెడు పాఁడియావు (కామధేనువు) ఇది యెల్లప్పుడును క్షీరము నిచ్చుచుండును అటువంటిది వెలె దక్కఁగవలెయునే-ప్రత్యేకముగాఁ బ్రాప్తించి యనుభవయోగ్యమై యుండవలయునా, దొరకి యనుకూలమై యుండినట్లేయనట. సుతుఁడుగల్గినన్ - పుత్త్రుఁడు సంభవించినయెడల, పరలోకసుఖముగాంచున్ - పుణ్యలోకమునందుఁగలయానందమును బొందును, ఆత్మజుఁడుగల్గన్ - కుమారుఁడు జన్మించినపక్షమున, కులమెల్లనెలయిల్లన్ - వంశమంతయును వృద్ధిబొందును, కొడుకు కుమారుఁడు, ఇచట డుప్రత్యయముతోఁ గూడుకుండ టనఁగూర్చి "సూ|| హితాః ప్రత్యయభేదేన, శబ్దా ఏకార్థవాచకాః" అర్థ|| కల్గినన్-కలిగెనేని, ఋణశుద్ధిన్-పితౄణవిముక్తిని, పడయవచ్చు - పొందవచ్చును, పరమసుఖకారణము-ఉత్కృష్టమయినయానందమునకు మూలము, తనూభవుఁడు సువ్వె-కొడుకు సుమా, ఇందు 'సువ్వె' అనుప్రయోగమునకు "సూ|| చర్దేశోర్వధ్యమార్థేతు ప్రార్థనే సుమ్మడుఃజ్ స్థితః, ఏతి వాఁటో హ్రస్వదీర్ఘో ద్విత్వ మూదంతతా క్వచిత్" అర్థ|| ఉదా 'ఉ|| సంపదచేతఁ గాని కొనసాగవు సువ్వె గృహస్థధర్మముల్" పా|| మా|| "శ్లోః క్రీడనకైః కళ్మకలాలాపైర పిశ్రుతిః, వపురంగరజోభిశ్చ న్నాకులంజగదాకులం" హా.సు. ఇందు 'పరమసుఖకారణము తనూభవుఁడు సువ్వె, అనుటచే. అప్రస్తుతప్రశంసాలంకారము. "నచంద్రశ్చంద్రమాః పుత్త్రం, చంద్రమాహుర్మనీషిణః. దృష్టేస్పృష్టేశ్రుతేచోక్తే హ్లాతేయత్రేంద్రియోత్సవః" హా.సు.

తా|| ఓధర్మశీలా గృహస్థునకుఁ గొడుకుజన్మించెనేని సిద్ధాంజనము, కల్పవృక్షము, చింతామణి, కామధేనువు, ఇవియన్నియు లభించినట్లే. స్వర్గలోక సౌఖ్యమునను, వంశాభివృద్ధికిని, పితౄణ విముక్తికిని, సుతుఁడే మూలముగదా! అటు లగుటచేతనే పుత్త్రుఁడు పరమానందమునకుఁ గారణ భూతుఁడు సుమా.

ఆ|| కొడుకులు లేనిమనుష్యుఁడు, విడిముడి గలఁడైనకంటె ♦ విశ్వములోనన్
గొడుకులు గల్గినమనుజుఁడు, బడుగైనను మేలు కుముద ♦ బంధుకులీనా. 71.

అ|| కుముదబంధుకులీనా-తెల్లకలువలకుమిత్రుఁడయిన చంద్రునివంశమునఁబుట్టిన యోరాజా. విశ్వములోనన్-ప్రపంచమునందు, కొడుకులు లేనిమనుష్యుఁడు-సంతానహీనుఁడయినమానవుఁడు, విడిముడిగలఁడైనకంటెన్-ధనముగలవాఁడయినదానికన్న, ఉదా 'క|| కొడుకులు పుట్టనిమానిసి, తొడుకులుబల్మియునునిండ్లుఁదొడవులుమావుల్, పుడమియు నెక్కుడుమెకములు, విడిముడియుం జుట్టములును, వితగాఁదలఁతున్" అచ్చ|| తె|| రా|| కొడుకులుఁగల్గినమనుజుఁడు-సంతానయుతుఁడయిన మనుష్యుఁడు, బడుగైనను-అశక్తుఁడయినప్పటికిని, ఉదా 'మ|| అడుగన్నిన్ను వరంబువేగమ యుహాలాగ్యజార విచ్ఛేయునా, కుడురాజార్ధవిభూషణుండు వరమీను నాఁడుయుష్మద్పృశుల్, బహుగుల్ వాంఛితమీస మర్థలె" కా|| శి|| మేలు-యోగ్యము-ఇదిప్రశంసార్థకము. ఇందు "సంతానహీనుఁడగుధనవంతునికంటె సంతానయుతుఁడగు దరిద్రుఁడేశ్రేష్ఠుఁడు. అనునర్థముచే, అప్రస్తుతప్రశంసాలంకారము. "అప్రస్తుతప్రశంసాయా సాసైవ ప్రస్తుతాశ్రయా' కార్యే నిమిత్తే సామాన్యే విశేషే ప్రస్తుతే సతి, తదన్యస్య వచస్తుల్యే తుల్యస్యేవేతి పంచధా" కా|| ప్ర|| ఉదా "సుహృద్వధూబాష్పజలప్రమార్జనం, కరోతి వైరప్రతియాతనేనయః, సఏవపూజ్యః స పుమాన్ స నీతిమాన్, సుజీవితంతస్య సభాజనం శ్రియః"

"పుంనామ్నోనరకాదేవపుత్త్రాస్త్రాణకారిణః, విస్మారయంతి శ్రీకాంత నరకక్లేశమప్యహో"
"బాలైఃపరిహృతంవేశ్మ నశ్మశానాద్విశిష్యతే,యత్రస్థాదేహినోనిత్యందహ్యంతేగతచేతసః" హరి.సు.

తా॥ సంతానహీనుఁ డగువానవుఁడు సంపద్యుక్తుఁడయినను వానికంటె సంతుగల్గినమనుష్యుఁడు బీదవాఁ డయినను శ్రేష్ఠమే.

క॥ కావునఁ దనయావాప్తికి, భావంబున నమ్మహాను ♦ భావుఁడు ధరణీ
దేవుఁడు నతగతి శ్రీయో, షావల్లభు దూఱ నతని ♦ స్వప్నమునందున్. 72.

అ॥ కావునన్-కాఁబట్టి, అమ్మహానుభావుఁడు-ఆయొక్క గొప్పసామర్థ్యముగలవాఁడు, ధరణీదేవుఁడు-బ్రహ్మణుఁడైన సురశర్మ, తనయావాప్తికిన్ - పుత్త్రులను గాంచుటకు, భావమ్మునన్-తన మనస్సునందు, శ్రీయోషావల్లభున్-లక్ష్మీదేవికి నాథుఁడగువిష్ణుమూర్తిని, నతగతిన్-నమస్కారరీతిని, దూఱన్-నిందింపఁగా, అతనిస్వప్నమునందున్-తనయొక్క-కలలో, మీఁదిపద్యముతో నన్వయము. 'సూ॥ పద్యంబులకుఁ గులకం బగు' ప్రా॥ వ్యా॥ కులకం బనఁగాఁ బద్యమునకుఁ బద్యాంతరముతో నన్వయము. ఇందు 'భావమ్మున నమ్మహాను-భావుఁడు ధరణీదేవుఁడు - నతగతి, వృత్త్యనుప్రాసాలంకారము.

తా॥ కనుక నామహనీయుఁడు తనకు సంతు లేమికి మనస్సున భగవంతుని దీనత్వముతో నిందింప నారంభించఁగా నొకనాఁటిరేయిఁ దనకలలో.

—: సురశర్మకు స్వప్నమున భగవంతుఁడు సంతానఫలమొసఁగుట :—

ఉ॥ ఓనియమానుషంగ భవ ♦ నోన్నత భాగ్యతరంగ దీనర
క్షానిపుణాంతరంగ సుతుఁ ♦ గాంచెదు చంచదుపాయశాలి భా
షానతసర్వమౌళి హిత ♦ సారసహేళి నటంచు నిందిరా
ప్రాణసఖుం డొసంగె ఫల ♦ రాజము నద్భుతదివ్యతేజమున్. 73.

అ॥ ఇందిరాప్రాణసఖుండు-లక్ష్మీదేవికి నాథుఁడగు విష్ణువు. ఓనియమానుషంగ-ఓవ్రతనిష్ఠలతోఁగూడినవాఁడా; భవనోన్నతభాగ్యతరంగ, భవన-గృహమునందు, ఉన్నత-అతిశయమైన, భాగ్యతరంగ-పుణ్యములనెడు తరంగములుగలవాఁడా, అనఁగానలలవలె నెడతెగని పుణ్యములయొక్క పరంపరలుగలవాఁడాయనుట. దీనరక్షానిపుణాంతరంగ. దీనరక్షా-దిక్కులేనివారిని గాపాడుటయందు, నిపుణ-నేర్పరితనముతోఁగూడిన, అంతరంగ-మనస్సుగలవాఁడా, చంచదుపాయశాలిన్-ప్రకాశించుచున్న చాతుర్యముతో నొప్పుచున్నవానిని, భాషానతసర్వమౌళిన్. భాషా-వాక్కులయందు, నత-వంగిన, సర్వమౌళిన్-సమస్తజనులకు శిరోభూషణమైనవానిని, హితసారసహేళిన్-మంచివారనెడుపద్మములకు సూర్యుఁడైనవానిని, సుతున్-ఒకకుమారుని, కాంచెదు-కనియెదవు, అటంచున్-ఇట్లుపలుకుచు, అద్భుతదివ్యతేజమున్-ఆశ్చర్యకరమైనట్టిమనోహరమైన కాంతిగలదానిని, ఇందుఁదేజశ్శబ్దమునకు సకారములోపించుటనుగూర్చి "సూ॥ సాన్తా దపయః ప్రభృతే స్లోపః" నన్న. ఫలరాజమున్ - శ్రేష్ఠ

పుయిననందను, ఒసంగెన్-ఇచ్చెను. ఈపద్యమున 'సుతుఁ గాంచెను, అని ప్రయోగించుటకు 'సూ॥ భావిక్రియాసు యస్య స్యాదేత్వమేవ ప్రయోగతః, డుడ్యాదివణ్ణే భూతార్థే చాపి తద్వద్భవేత్సదా॥' అథ॥కడపటిపాదమున నణలకు మైత్రిఁగూర్చినందులకు 'సూ॥ ఆంధ్రపద్యావళౌ ప్రాసం. ద్వైతీయీకం తథా ఉఉదిమం, కటం తన్నియమస్థానే తద్ధి తన్నియతః విదుః'' అథ॥ ఉదా. ''క. పోనుద్యోగము చేసిన, ప్రాణంబా యింకనీకు' మధుసే. 'ఆ॥ విను మతిగుహ్యము నారా, యణకవచకము' శృం॥ ష॥ ఇందు 'అనుషంగ-తరంగ-అంతరంగ, ''శాలి-మాలి-హేళి, 'రాజమున్ - తేజమున్, ఇవి యంత్యాను ప్రాసాలంకారము. 'కాంచెను-చంచను, ఇది వృత్త్యనుప్రాసాలంకారము.

తా॥ శ్రీమనోహరుఁడు వ్రతనిష్ఠలతోఁ గూడినవాఁడవును, గృహమునం జెడతెగని సుకృతములు గలవాఁడవును, బీదల రక్షించువాఁడవును, అగు నో బ్రాహ్మణుఁడా! మిక్కిలి యుక్తి గలవాఁడును, సమస్తజనులచే నెన్నఁదగినమాటలు గలవాఁడును, సజ్జనులకు సంతోషమును గూర్చువాఁడును, అగు పుత్త్రునిఁ గనియెదవని యెక్కువప్రకాశముగల యొకశ్రేష్ఠమైన ఫలమునొసంగెను.

74.

వ॥ ఇట్లిచ్చిన.

అ॥ ఇట్లు - ఈప్రకారము, ఇచ్చినన్ - ఇయ్యఁగా.

—: సురశర్మ స్వప్నవృత్తాంతము తనభార్యతోఁజెప్పుట :—

మత్తకోకిల॥ లేచి యంతకుమున్నె మేల్కని ♦ లీల నాస్యపదద్వయీ
సేచనాదులు దీర్చి ధౌతపుఁ ♦ జీరఁ గట్టి రయంబ కా
లోచితం బగు గేహకృత్యము ♦ లోలిఁ జేయుసతీమణిన్
జూచి యిట్లను వింటివే యొక ♦ చోద్యపుంగల యంగనా. 76.

అ॥ లేచి - నిద్రనుండి మేలుకొనినవాఁడై. అంతకుమున్నె - అంతకుఁబూర్వమే, మేల్కని-మేలుకాంచి, లీలన్ - విలాసముగ, ఆస్యపదద్వయీసేచనాదులు. ఆస్య - ముఖమును, పదద్వయీ - రెండుపాదములును, సేచనాదులు - కడుగుట మొదలయినవి, తీర్చి - చక్కఁబఱచుకొని, ధౌతపుఁజీరన్ - ఉతికిన పరిశుద్ధమైనకోకను, 'ని. ధౌతముద్గమనీయంస్యాత్' హలా॰ కట్టి - ధరించినదై, రయంబ - శీఘ్రముగా, కాలోచితంబు - సమయమున కనుకూలము, అగుగేహకృత్యములు - అయినట్టి యింటియొక్కపనులు, 'ని. కృత్యాక్రియాదేవతయోః కార్యేస్త్రీకుపితే త్రిషు, యా. ఓలిన్-వరుసగా, చేయుసతీమణిన్-చేయుచున్నట్టిశ్రేష్ఠురాలయినతనభార్యను, చూచి-వీక్షించి, ఇట్లనున్-ఈవిధముగాఁబలికెను, అంగనా-ఓచక్కనిదానా, ఒకచోద్యపుంగల-ఆశ్చర్యమైనయొకస్వప్నమును, వింటివే-విన్నావా, ప్రభావతీప్రద్యుమ్నమునందుఁగూడనిట్లె 'చ. కమలదళాక్షిరో వినవు•గా!కలయొక్కటి గంటి వేకువన్'' అనియున్నాఁడు. ఇందు 'తీర్చి, అనుటకు ''సూ॥ చౌరే రుపధాత్మనశ్చ లుగ్వా స్యాత్'' నన్న. స్వభావోక్త్యలంకారము. ''స్వభావోక్తిరసౌచారు యథావద్వస్తు వర్ణనమ్'' ప్రతా..

తా॥ అతనికింకేమి మనుజుకే మేలుకాంచి కాలుచేతులఁ గడిగికొని యుక్తవేషము దాల్చి యాయనయాయన కనుకూలము గునింటికిఁ బిలుచుకొని చక్కఁబెట్టుకొనుచుండిన తనభార్యను జూచి యోకాంతా: నాకొక స్వప్న మయినది యది వచ్చి నడిగెదా యనెను.

ఉ. ఓకలకంఠకంఠి జల ♦ జోదరుఁ డాదరపూర్ణచిత్తుఁడై
నాకలలోన వచ్చి నలి ♦ నప్రభవాన్వయ చింతయేటికిన్
నీ కొకపుత్త్రుఁ డార్యమహ ♦ నీయచరిత్రుఁడు గల్గు నంచు ల
క్ష్మీకుచగంధలిప్త మగు ♦ చేత ఫలం బొకటిచ్చె నావుడున్. 77.

అ॥ ఓకలకంఠకంఠి - కోకిలవంటి కంఠస్వరముగలదానా, జలజోదరుఁడు - కమలనాభుఁడయినవిష్ణువు, నాభియుదరమునఁగలదియే కనుకనిట్లు ప్రయోగించినాఁడు. ఉదా 'ఏ. గీ. అంబుజోదరు దివ్యపాదారవింద" భాగ. మఱియునుదా "ఉ.........దీనశరణ్యుఁ డంబుజోదరా" భార. ఉద్యో. ఆదరపూర్ణచిత్తుఁడై-దయతోనిండినమనస్సుగలవాఁడై. నాకలలోనన్ - నాయొక్క స్వప్నమునందు, వచ్చి-ప్రత్యక్షమై, నలినప్రభవాన్వయ-బ్రహ్మయొక్క వంశమునందుఁబుట్టినవాఁడా, చింతయేటికిన్-నీకువిచారమెందులకు, వలదనుట. నీకున్-నీకు, ఆర్యమహనీయచరిత్రుఁడు-పూజింపఁదగినగొప్పచరిత్రముకలవాఁడు, ఒకపుత్త్రుఁడు-ఒక్కకొడుకు, గల్గునంచున్-పుట్టునని చెప్పుచు, లక్ష్మీకుచగంధలిప్తము-లక్ష్మీదేవియొక్క స్తనములయందలి పరిమళద్రవ్యముతోఁబూయఁబడినది, అగుచేతన్-అయినట్టి తనహస్తముతో, ఫలంబొకటిచ్చెన్-ఒక్కపండును దానముచేసెను, నావుడున్-ఇట్లు చెప్పఁగా, స్వప్నమునందలివృత్తాంతమునంతయుఁ జెప్పఁగాననుట. ఇందు "లక్ష్మీకుచగంధలిప్త మగు చేత ఫలం బొకటిచ్చె" ననుటచేత సూచించుచున్న నిరంకుశునియొక్క శృంగారప్రధాననాయకత్వము ధ్వనించుచున్నది. 'జలజోదరుఁ డాదర, అనుప్రాసాలంకారము 'పుత్త్రుఁడు-చరిత్రుఁడు, అంత్యానుప్రాసాలంకారము.

తా॥ ఓ కాంతా! శ్రీపతి దయాపరిపూర్ణుఁడై నాయొక్క స్వప్నమున సాక్షాత్కరించి యోబ్రహ్మవంశజా! నీవు విచారపడవలదు. నీకుఁ బెద్దలచే స్తుతింపఁదగిన గొప్పచరిత్రము గలయొకపుత్త్రుఁడుదయింపనున్నాఁ డని పల్కుచు లక్ష్మీవక్షస్స్థలమునందలి సుగంధముతోఁ గూడినయొక ఫలము నొసంగె నని చెప్పఁగా.

## —♦ భార్యసంతానముకలుగునని నిర్ణయించుట ♦—

క॥ మనపాలిటనున్నాఁ డా, వనరుహాలోచనుఁడు లోక ♦ వంద్యుఁడు లేకుం
డిన వచ్చునె దయ నిట్లి, చ్చునె పక్వంబైనఫలము ♦ సుతఫల మనుచున్. 78.

అ॥ లోకవంద్యుఁడు-ప్రజలందఱిచేనమస్కరింపఁదగినవాఁడు, 'ని॥ లోకస్తుభువనేజనే, అమ॥ అవనరుహాలోచనుఁడు-పద్మములవంటికన్నులుగల యావిష్ణువు, మనపాలిటన్-మనపక్షమున, ఉన్నాఁడు-కలఁడు, లేకుండినన్-అటులఁగానియెడల, వచ్చునె-సాక్షాత్కరించునా, దయన్-కరుణతో, సుతఫలమున్-పుత్త్రులయొక్కలాభమునుగలిగించుదానిని, 'ని॥ ఫలంజాతీఫలేసస్యే హేతుకృత్యేవ్యుష్టిలాభ

యోః" మే. పక్వంబైనఫలమున్-బాగుగాఁబండినపండును, ఇట్లిచ్చెనె-ఈవిధముగానొసంగునా, అనుచున్-ఇట్లనుడువుచు, ఇందు 'వచ్చెనె-యిచ్చెనె, ఫలము-సుతఫలము, ఇవి యనుప్రాసాలంకారము. 'వనరుహలోచనుఁడు, ఉపమాలంకారము,

తా॥ ఈలోకమునఁ గలజనులందఱిచే స్తుతింపఁబడుచున్న శ్రీమన్నారాయణుఁడు మనపాలిటఁ గలఁడు. అటులఁగానిచో స్వప్నమునఁ బ్రత్యక్షమగుటయు, సంతానప్రాప్తికర మగుఫలము నొసంగుటయుఁ, గలుగునా? అనిపలుకుచు.

ఉ॥ ఓసరసీరుహాసనకు ♦ లోదధికల్పమహీజ భక్తర
క్షాసముదగ్రమానసుఁడు ♦ శౌరి దయాగుణహారి మీనిధి
ధ్యాసకుఁ జాలమెచ్చి వర ♦ దానమొసంగె నొసంగఁజెల్లదే
దాసులఁబ్రోచుచింత మురదానవహంతకు నేఁడు వింతయే. 79.

అ॥ ఓసర.........హీజ. సరసీరుహాసన - కమలమే పీఠముగాఁగల బ్రహ్మదేవునియొక్క, కులోదధి - వంశమనెడి సముద్రమునకు, కల్పమహీజ - దేవతావృక్షమైనవాఁడా, అనఁగా బ్రహ్మవంశమనెడు పాలసంద్రమునందుఁగల్పవృక్షమువలెఁ బుట్టినవాఁడాయనుట. భక్తరక్షాసముదగ్రమానసుఁడున్. భక్తరక్షా - తనయొక్కసేవచేయువారిని రక్షించుటయందు, సముదగ్ర మానసుఁడున్ - మిగులశ్రేష్ఠమైన మనస్సుగలవాఁడును, ''సం ÷ ఉత్ ÷ అగ్ర - సముదగ్ర' అని తెలియవలెను. దయాగుణహారి-కారుణ్యముయొక్క యధికముచేత రమ్యమైనవాఁడును, అగుశౌరి-అయినట్టి విష్ణువు, మీనిధిధ్యాసకున్ - మీయొక్క తలఁగనిధ్యానమునకు, చాలమెచ్చి - ఎక్కువగాఁ బ్రశంసించి, వరదానమొసంగెన్ - వరమనెడు దానమునిచ్చెను, ఒసంగఁజెల్లదే - ఆప్రకారమొసంగుటయొప్పదా, దాసులన్ - నమ్మిసేవించెడువారిని, బ్రోచుచింత - కాపాడునట్టి యాలోచన, మురదానవహంతకున్ - మురాసురునిఁజంపినట్టి యావిష్ణువునకు, నేఁడువింతయే - ఈదినమున నిట్లు వరమిచ్చుటయాశ్చర్యమా, అనఁగా భక్తులఁ బాలించుయోచనయెల్లప్పు డుండునదియేకదా యనుట. ఇందు 'శౌరి హారి, 'ఒసంగె, నొసంగ' చింత - హంత - వింత' ఇవి వృత్త్యనుప్రాసాలంకారము. 'కులోదధికల్పమహీజ' ఉపమాలంకారమూ.

తా॥ బ్రహ్మవంశ మనుపాలకడలియందుఁ గల్పతరువువలె జనించినవాఁడా! నిరంతరము భక్తులఁ గాపాడునట్టియాలోచన గలవిష్ణువు యెడతెగని మీయచంచల స్మరణమునకు మిగులసమ్మతించి యీవర మొసంగెను. సేవించువారలఁ బ్రోచునట్టి యాలోచన యాభగవానునికి నేఁడు క్రొత్తగాఁగలిగినది కాదుగదా! ఇం దాశ్చర్య మేమియున్నది.

సీ॥ అన్నచేఁ బరిభూతుఁ ♦ డగుదైత్యుఁ గాచిన, శరణాగతత్రాణ ♦ పరిచయంబు
మకరపీడిత మైన ♦ మదదంతిఁ బ్రోచిన, యార్తరక్షానము ♦ ద్యమనిరూఢి
తండ్రినిర్బంధింపఁ ♦ దనయు రక్షించిన, భక్తలోకాధీన ♦ భావరేఖ
రారాజువలన ధ ♦ ర్మజు నుద్ధరించిన, యాశ్రితపక్షపా ♦ తానువృత్తి
తే॥ మఱచెఁగాఁబోలు ననుచున♦వ్వారె సమస్త, జనులు నవపత్యదురితదు♦స్సహసమీర
సముదయోద్ధూతచేతోంబు♦జాతుబుధవి,నీతుమునుఁగావకున్ననో♦నిర్మలాత్మ. 80.

అ॥ వినిర్మలాత్మ - విమలస్వరూపమైన మనస్సుగలవాఁడా, అనప........జాతున్. అనపత్య-సంతానములేమియొక్క, మరిమనస్సహసమీర - పాపములనెడు వడిగొన్నదరముగాను వాయువులయొక్క, సముదయ - సమూహముచేత, ఉద్ధూత - బాగుగాఁ గదలింపఁబడిన, చేతోంబుజాతున్ - చిత్తమనెడు కమలముగలవానిని, బుధవినీతున్ - విద్వాంసులలో వినయముగలవానిని, మిమున్ - మిమ్ము, కావఁగన్నన్ - రక్షించుటకుఁ దక్షమున, సమస్తజనులు - మనుష్యులందఱును, అన్నచేఁబరిభూతుఁడు - అగ్రజునిచేతఁ దిరస్కరింపఁబడినవాఁడు, అగుదైత్యున్ - అయిన దానవుని, అనఁగా విభీషణుని, కాచిన శరణాగతత్రాణపరాయణము - రక్షించినట్టి శరణుజొచ్చినవారిని గాచినటువంటి స్నేహపూర్వకవిశ్వాసమును, మకరపీడితము - మొసలిచేత బాధింపఁబడినది, ఐనవారదదంతిన్ - అయినట్టి మదపుటేనుఁగును, ప్రోచినయార్తరక్షాసముద్యమనిరూఢి - కాపాడినట్టి దుఃఖమునొందినవారిని రక్షించుటయొక్క యత్నమునందలి నిశ్చయమును, "ని॥ గురణముద్యమే," అ. తండ్రిని హింసింపన్-జనకుఁడు బలవంతపెట్టఁగా, తనయున్-కొడుకును, రక్షించిన భక్తలోకాధీన భావరేఖ-పాలించినట్టి భక్తులయొక్క సమూహమున కధీనమయిన యభిప్రాయముయొక్క సౌష్ఠవమును, రారాజువలనన్-దుర్యోధనునుండి, ధర్మజున్-యమునికిఁ గొడుకైనధర్మరాజును, 'ని॥ ధర్మరాజః పితృపతి స్సమవర్తీ పరేతరాట్,' అను. ఉద్ధరించినయాశ్రితపక్షపాతానువృత్తి-పైకిలేవదీసినట్టి దాపుచేరినవారియొక్క ప్రక్కనుండివారి ననుసరించి నడచెడువ్యాపారమును, 'ని॥ పక్షపార్శ్వగరుత్సాధ్య సహాయబలభిత్తిషు, కేశవ. 'పక్షః సహాయేఽపి, అ. మఱచెఁ గాఁబోలున్-విస్మృతిఁ జెందియుండెనేమో, అనుచు నవ్వరె-అని హేళనముచేయరా, ఈపద్యమునమిము, అను బహువచన ప్రయోగమునకు "సూ॥ స్యాత్పూజ్యత్వవివక్షాయాం మహతాం బహుతా మతా" అథ. ఎత్తుగీతియొక్క ప్రథమపాదమున రేఫద్వయమైత్రిఁగల్పించుటకు "సూ॥ కశ్చిద్వదతిసాంగత్యం. యతావేవానయో స్తథా, అవదచ్చాత్రసాంగత్యం, ప్రాసేష్వపిచకశ్చన" అథ. ఉదా "క. పురసతులవిలోకనములు, సరసాలాపములు నర్మ ♦ సంభోగంబుల్, మఱగి హరిమనల నొల్లఁడు, నరవర లోయమ్మ నూతననప్రియులు గదే" భాగ. పెద్దనామాత్యుఁడును "ఉ॥ సురపొన్నక్రొన్ననల్ ♦ సొచ్చి నలుగడ వెదకు, తఱుఁగదండులతావి ♦ తంపంబుక్రొమ్మావికు" స్వా. మ. బట్టుమూర్తియు "గీ॥ వేఱ వివరింపనేల బంగారమునకు" అనియును, "శా, శ్రీరంగప్రభుతిమ్మశౌరిభుజకా ♦ త్క్షేయంబుచే నాజులన్, వీరారాతులఁ ద్రుంపనాక్షితిపతుల్ వేవేగమార్తాండునిం, దూఱందూఱ" అనియును. నరస. కూచిమంచి తిమ్మకవియు "చ. సురచిరపల్లవప్రకట ♦ చూతలతాస్థిత కోకిలావళు, ల్వరుసఁజెలంగ మాధవుఁడు ♦ వావిరినవ్వనలక్ష్మికాంతయున్, గుఱుకుగఁ బ్రేమతోడుతను ♦ గూర్చియొసంగిన శోణనీరజ, స్ఫురదసితోత్పలౌఘములు ♦ పొల్పగుమాలికలో యనంగడున్" చ. పురములు వాహనంబులును ♦ భూషణముల్ ధనధాన్యముల్ నవాంబరములుఁ బాఁడిధేనువులుఁ బ్రార్థనసేయకజంగమయ్యయే, తెలుఁగునవేశ్యఁ గోరె" రాజ. కూడదనిన యప్పకవియును దప్పింపకొనలేక "సీ. అట్టడికానునూరి పెద ♦ రంగయ" అని యప్పకవీయమునను బ్రయోగించియుండిరి. ఇందు 'అనపత్య... జాత, అనుటచే సావయవరూపకాలంకారము. 'జాతున్-నీకున్-వృత్త్యనుప్రాసాలంకారము. నీకు సంతాన మీయకున్నచో నార్తరక్షణపరాయణత్వ మతనియందు లేదనిలోకులు నవ్వెద రనుటచే, నీకువరమిచ్చినాఁడు. అర్తరక్షణపరాయణత్వ మాయునయం దున్నది. అనుభావ ముత్పన్నమైనది. వాక్యార్థహేతుకకావ్యలింగము. "కావ్యలింగం. హేతో ర్వాక్యపదార్థతా" కా. ప్ర.

తా॥ ఓపరిశుద్ధమైనమనస్సుగలవాఁడా సంతానహీనత్వమువలని పాపముచే వికలమనస్కుఁడవైననిన్నుఁ గావనిచ్చో ప్రపంచమునఁ గలజనులెల్లరును, అన్నదూషింపఁగావచ్చినవిభీషణుని రక్షించుటయును. మొసలిబాధింపఁగాఁ బ్రార్థించినయేనుఁగును గాపాడుటయును, తండ్రియగుహిరణ్యకశిపుఁడు కష్టపెట్టఁగాఁ గొడుకగుప్రహ్లాదునిఁ బాలించుటయును, దుర్యోధనునిబారినుండి ధర్మరాజు నుద్ధరించుటయును, మఱచియుండెనేమో యని యెగతాళిచేయరా?

క॥ అక్కమలాక్షుం డాద్యుఁడు, దక్కఁగఁ బోషకులు గలరె ♦ తలపోయంగా
నిక్కల నిక్కల సందియ ♦ మొక్కింతయు లేదు కోర్కు ♦ లొనఁగూర్చుఁజుమీ. 80.

అ॥ తలపోయంగాన్ - ఆలోచింపఁగా, ఆద్యుఁడు - మొదటివాఁడు, ఈప్రపంచమునకు మూలమయినవాఁడనుట. అక్కమలాక్షుండు - పద్మములవంటి కన్నులుగలవాఁడగు విష్ణువు, తక్కఁగన్ - కాకుండ, ఇదివిసార్థకము. పోషకులుగలరె - రక్షించువారులేరు, కనుక. ఇక్కల - ఈస్వప్నము, నిక్కల - కన్నదియనుభవమునకుఁదెచ్చెడుకల. నిక్కము + కల = నిక్కల. ఉదా. "క. నాకలనిక్కలమయ్యెడు ♦ శోకింపకుమమ్మ" భార. సందియము - సంశయము, ఒక్కింతయు లేదు - కొంచమైనను లేదు, కోర్కులు - మనసుఁగలవాంఛలు, ఒనఁగూర్చుఁజుమీ - లభింపఁజేయును సుమా, ఇందు 'నిక్కల' అనుటకు 'సూ. నిక్కలామలు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు, బా.వ్యా. 'నిక్కలనిక్కల' ఇది యమకాలంకారము.

తా॥ మనోహరా! ఈచతుర్దశభువనములకుఁ గారణభూతుఁ డయినపుండరీకాక్షుఁడు గాక మనల రక్షించువా రింకొకరున్నారా? కనుక నీస్వప్నము నిశ్చయముగ ఫలము నొసంగునదియే కాని వేఱుకాదు. ఇందేమాత్రము సంశయింపఁ బనిలేదు.

చ॥ అని యనిరోధబోధమహి ♦ మాన్వితమానస యైనయాదళ
ద్వనజదళాక్షి భర్తఁ గల ♦ వాక్కలనంబునఁ దేర్చి మించి య
త్యనుపమితాన్నదానవిభ ♦ వాతిశయంబున విప్రకోటులన్
దనుపుచు నెప్పటట్ల సము ♦ దగ్రత నుండఁగఁ గొన్నినాళ్ళకున్. 81.

అ॥ అని - ఇట్లుచెప్పి, అనిరోధబోధమహిమాన్వితమానస. అనిరోధ - ఆటంకములేని, బోధమహిమా - తెలియఁజెప్పునటువంటి మాహాత్మ్యముతో, అన్విత-కూడుకొనియున్న, మానస-మనస్సుగలిగినటువంటిది, ఐనయాదళద్వనజదళాక్షి - అయినట్టి వికసించుచున్న తమ్మిరేకులవంటి కనులు గలదైనయాతనిభార్య, భర్తన్ - తనయొక్కపెనిమిటిని, కలవాక్కలనంబునన్ - మధుర భాషణంబుల పొందికచేత, తీయనిమాటలయొక్క పొంకములచేత ననుట. తేర్చి - స్వస్థపఱచి. నిలుకడ కలవానినిగాఁ జేసి యనుట. మించి - అతిశయించి, అత్యనుపమితాన్నదాన విభవాతిశయంబునన్. అత్యనుపమిత - బొత్తిగాసమానములేని - ఏమాత్రము సాటిరానియనుట, అన్న... బునన్. అన్నదానవిభవ - అన్నదానమనెడుసంపదయొక్క, అతిశయంబునన్ - ఎక్కువచేత, విప్రకోటులన్ - మితిలేనిబ్రాహ్మణులగుంపులను, తనుపుచున్ - తృప్తిపఱచుచు, ఎప్పటట్లన్ - ఎప్పటి [illegible] యథాప్రకారముగానే యనుట. సముదగ్రతన్ - ఒప్పిదముగా, ఉండఁగన్ - ఇట్లుం

డఁగా, కొన్నినాళ్ళకున్ — కొంతకాలమునకు, వైపర్యముతో సన్వయము. ఇందుఁగడపటిపాదమున నిత్యసమాసయతి చెప్పఁబడినది. 'శే|| ఒక్క పదమునను శబ్ద ♦ యోగము గూడి, పదము తేర్పాటుగాఁ గానఁ ♦ బడనిప్రాణ, సంధులకు నిత్యసమాస ♦ క్రాంతులును న,ఖండవిశ్రమములు నవ ♦ రెండుఁ జెల్లు" అప్ప. ఉదా. ఉ. మానుగ విక్రమాక్షరస ♦ మంచితమై స్వరమాదినం దదీ, యానుగుణాక్షరంబుఁ గొని ♦ నైనను జెప్పఁగనొప్పు నీక్రియన్, భానుసహప్రభాసి వృష ♦ భాధిపుఁ డన్నటు లర్థయుక్తమై, పూనినప్పొ నపుంసకము ♦ పొల్పగు నాదికవిప్రణీతమై" కవిజ. ఇందు 'దళద్వనజదళాక్షి' ఉపమాలంకారము. ఇందు 'అదళద్వనజదళాక్షి భర్తఁగలవాక్కులనఁబునఁదేర్చి' యనుటను గృహిణినిగూర్చి యిట్లుచెప్పఁబడియున్నది. "తపత్యపరిసంసార దుఃఖసంభారభాస్వతి, పూర్వపుణ్యతరుచ్ఛాయా సాధ్వీ జాయా సుజన్మనః" హారి. సంసారభారదుఃఖమునుండి తపించు సజ్జనునకు సాధ్వియగుభార్య పూర్వపుణ్యమను వృక్షముయొక్క నీడయనిభావము. "సుకృతేనసతీ భార్యా" హారి. సు.

తా|| హితవాక్యములను ధారాళముగాఁ జెలియఁజెప్పునట్టి నేర్పుకలది యైనయతనిభార్య మృదుమధురభాషణంబులతోఁ బూర్వోక్తప్రకారంబుగా నాథునకుఁ జెప్పి యతనిని మనశ్శాంతిగల వానినిగా నొనర్చి తా నెప్పటివలెనే యధికమైనయన్నదానముతో బ్రాహ్మణసముదాయములను దృప్తిపఱచుచు నుండఁగాఁ గొన్నిదినంబులకు.

### —:బ్రాహ్మణపత్ని గర్భమునుధరించుట:—

క. శరణాయిత భరణాయత ♦ కరుణారతుఁ డైనదనుజ ♦ ఘస్మరుకృపచేఁ
దరణి భరియించుప్రాగ్దిశ ♦ కరణిన్ భూసురునితరుణి ♦ గర్భముదాల్చెన్. 82.

అ|| శరణా......తుఁడు. శరణాయిత — రక్షణముకొఱకు సిద్ధముగానున్నవారిని, భరణ — భరించుటకు, అనఁగా భారమునువహించుటకనుట. ఆయత — విస్తారమయిన, కరుణారతుఁడు—దయతోఁ గూడినవాఁడు, ఐనదనుజఘస్మరుకృపచేన్ — అయినట్టి అసురుల సంహరించువాఁడయిన విష్ణువుయొక్కయనుగ్రహముచేత, 'ని. భక్షకోఘస్మరోఽద్మరః' అ. తరణిన్ — సూర్యుని, 'వ్యు. తరంత్యనేనతమ ఇతి తరణిః' అంధకారము నితనిచేఁ దరింతురు. "ధాతు॥ తౄ ప్లవనతరణయోః" భరియించుప్రాగ్దిశకరణిన్ — గర్భమునునుంచుకొని మోయుచున్నట్టి తూర్పుదిక్కువలె, భూసురునితరుణి — ఆబ్రాహ్మణునియొక్కభార్య. గర్భముఁదాల్చెన్ — గర్భమునుధరించెను, ఇందు 'శరణాయిత భరణాయతకరుణారతుఁడు, ఇది వృత్త్యనుప్రాసాలంకారము. "ఏకద్విప్రభృతీనాంతు వ్యంజనానాం యథాభవేత్, పునరుక్తి రసౌ నామ వృత్త్యనుప్రాస ఇష్యతే" ప్రతా. 'తరణి భరియించుప్రాగ్దిశకరణిన్ భూసురునితరుణిగర్భము దాల్చెన్' అనుటచే నుపమాలంకారము. 'సాధర్మ్యముపమా' కా. ప్ర. వాక్యగతపూర్ణార్థియని తెలియవలయును.

తా|| దాపుచేరినవారిని గాపాడునట్టిదయామయుఁడయిననారాయణునియొక్క యనుగ్రహముచే నాబ్రాహ్మణునిభార్య సూర్యుని గర్భమునందుఁ దాల్చిన తూర్పుదిక్కువలె గర్భమునుధరించెను

క॥ నలుపెక్కెం జనుముక్కులు ♦ తెలుపెక్కెఁ జెక్కు లారు ♦ తీరు వహించెన్
బలిసె నునుగౌను శశికళ ♦ గెలసెన్ నెమ్మేను గమన ♦ ఖేలన మొలసెన్. 83.

అ॥ చనుముక్కులు - స్తనములయొక్క చివరలు, నలుపెక్కెన్ - నల్లనయ్యెను, "ఆశ్లేష్టతా స్తనాపీనా సుందరాకృష్ణచూచుకా" బా. చెక్కులు - గండస్థలములు, - చెక్కిళ్ళు తెలుపెక్కెన్ - తెల్లనయ్యెను, ఆరు - నూగారు, తీరు - చక్కఁదనము, వహించెన్ - పూనెను, నునుగౌను - నున్ననినడుము, బలిసెన్ - అధికవయ్యెను, నెమ్మేనన్ - దివ్యమైనయొడలియందు, నెఱి + మేను నెమ్మేను. శశికళ - చంద్రునియొక్క కాంతివంటిప్రకాశము, కెలసెన్ - విజృంభించెను, గమన ఖేలనము - నడకయొక్క క్షీణత్వము, అనఁగా మాంద్యము. ఒలసెన్ - ఒప్పెను, గర్భలక్షణము "క్షామతా గరిమా కుక్షేర్మూర్ఛా ఛర్దిరరోచకం, జృంభా ప్రసేకః సదనం రోమరాజ్యాః ప్రకాశనమ్" బా. ఇది స్వభావోక్త్యలంకారము. "స్వభావోక్తి రసౌ చారు, యథావ ద్వస్తువర్ణనమ్" ప్రతా. 'బలిసె - గెలసెన్ - మొలసెన్' అనుప్రాసాలంకారమును.

తా॥ గర్భవతి యైనయాబ్రాహ్మణునిభార్యకుఁ గుచాగ్రములు నల్లఁబడెను, చెక్కిళ్ళు తెల్లనయ్యెను. కన్నులు విశాలములై నూగారు చక్కఁబడెను నడుము పెంపొందెను. మేను దెల్లగాఁ జంద్రకాంతివలె నొప్పెను. నడక మందగించెను.

తే॥ వామలోచనమధ్యంబు ♦ లేమిచేతఁ, జాలకృశమై రమామన ♦ స్స్వామికరుణ
గలిగినప్పుడెయభివృద్ధిఁ ♦ గనియెనౌర, హరికటాక్షేక్ష దారిద్ర్య ♦ హరణదీక్ష. 84.

అ॥ వామలోచనమధ్యంబు - మంచికనులుగలదయిన యాస్త్రీయొక్క నడుము, లేమిచేతన్ - బీదతనముచేత, చాలకృశమై - విస్తారముగాఁజిక్కినదై, సన్నగిలినదైయనుట. రమామనస్స్వామికరుణ - లక్ష్మీదేవికి హృదయేశ్వరుఁ డగువిష్ణువుయొక్క యనుగ్రహము, కలిగినప్పుడె - ప్రాప్తించినంతనే, అభివృద్ధిఁగనియెన్ - సంపద్వృద్ధినిబొందెను, అనఁగాఁ బెంపుగలదయ్యెననుట. కనుక దారిద్ర్య హరణదీక్ష - పేదతనమును బోఁగొట్టునటువంటి నియమముగల, హరికటాక్షేక్ష - నారాయణుని యొక్క క్రేగంటిచూపు, ఔర - ఔరా, ఇదియాశ్చర్యమును మెచ్చుటను తెలియఁజేయును. ఇందు 'కటాక్షేక్ష - దీక్ష' అంత్యానుప్రాసాలంకారము. 'ఆస్త్రీయొక్క కృశించిననడుము హరి కటాక్షవీక్షణమున నైశ్వర్య ముప్పొంగెనోయనున ట్లప్పుడే యభివృద్ధియయ్యెను,' స్వరూపోత్ప్రేక్షా లంకారము. "యత్రాన్యధర్మసంబంధా దన్యత్వే నోపతర్కితమ్, ప్రకృతం హి భవే త్ప్రాజ్ఞా స్తాముత్ప్రేక్షాం ప్రచక్షతే" ప్రతా. "సంభావన మథోత్ప్రేక్షా ప్రకృతస్యసమేన యత్" కా.ప్ర. హరికటాక్షవీక్షణము లేమిని బోఁగొట్టునది గనుకనే కృశించినమధ్యము వెంటనే యభివృద్ధినొందినది. కావ్యలింగము "క. హేతువు వాక్యార్థంబై, యాతతవిస్ఫూర్తితోఁ బ ♦ దార్థంబును నై, ఖ్యాతిఁ గనఁ గావ్యలింగం, బై తగు" నరస. "కావ్యలింగం హేతో ర్వాక్యపదార్థతా" కా.ప్ర.

తా॥ ఆస్త్రీయొక్క నడుము బీదతనముచేఁ జిక్కి లక్ష్మీపతియొక్క దయగలిగినవెంటనే సంపదలు పొంగి పెంపొందెను. ఔరా విష్ణువుయొక్క యనుగ్రహదృష్టియందలి లేమిని బోఁగొట్టు నియమసంపన్నత.

ఆ॥ పౌలఁతులెల్లఁ మెచ్చ ♦ భూమిభృత్సారంబు, సంగ్రహించె విప్ర ♦ సారసాక్షి
యద్దిరయ్యవింత ♦ యాఁడురాజఱికంబు, నిర్వహించె సతుల ♦ ఖర్వమతులు. 85.

అ॥ విప్రసారసాక్షి - ఆబ్రాహ్మణునియొక్కపత్ని, పౌఁతులెల్లమెచ్చన్ - స్త్రీలందఱును శ్లాఘించునట్లు, భూమిభృత్సారంబున్ - భూమివలనధరింపఁబడుచున్న సత్త్వమను, సంగ్రహించెన్ - సంపాదించెను, భూమిభృత్సారమనఁగా రాజులయొక్కన్యాయమని భావము. "ని. సారోబలేస్థిరాంశేచన్యాయేక్లీబేత్రిషుప్రవరే" అమ. సంగ్రహించెన్ - స్వీకరించెను, ఆడురాజఱికంబున్ - స్త్రీ ప్రభుత్వమును, నిర్వహించెన్ - సహించెను, అద్దిరయ్య - ఔరా, వింత - ఆశ్చర్యము, ఇచట 'అద్దిరయ్య' అనుప్రయోగమునకు "సూ. హ్రస్వవ్యస్త త్రికంబుమీఁది దివులకు ద్విత్వంబునగు" ప్రౌ. వ్యా. ఉదా. "అద్దిరావగలు" శశాం. సతులు - ఆడువారు, అఖర్వమతులు - విస్తారమైనబుద్ధిగలవారు, ఇందు 'భూమిభృత్సారంబుసంగ్రహించె, అనుటచే శ్లేషాలంకారము. "నానార్థసంశ్రయశ్శ్లేషో వర్ణ్యావర్ణ్యోభయాశ్రితః చంద్రా.

తా॥ ఆబ్రాహ్మణునిభార్య మంటిపెళ్ళలను దిననారంభించెను. అదిచూచువారలకు భూమిభృత్సారమును గ్రహించి స్త్రీప్రభుత్వమును నిర్వహించునేమో యనునట్లుండెను. ఇదియొకచోద్యము. కనుక స్త్రీలు విస్తారమైన బుద్ధిగలవారు సుమా!

మ॥ హృదయేశప్రమదంబుతోఁ గుచయుగీ ♦ హేరాళనీలత్వసం
పదతో నాననపద్మపాండిమముతోఁ ♦ బ్రస్తూయమానాంగరా
గదుకూలాదిజుగుప్సతో జడిమతోఁ ♦ గార్శ్యంబుతోఁ బ్రావృడం
బుదకల్పాలక గర్భ ముద్ధురధురా ♦ పూర్ణత్వముం జెందఁగన్. 86.

అ॥ ప్రావృడంబుదకల్పాలకగర్భము. ప్రావృడంబుద - వర్షర్తువునందలి మేఘముతో, కల్ప - సమానమయిన, ఇచటఁ గల్పశబ్దమునకు "ని. కల్పస్తు ప్రళయే న్యాయే శాస్త్రే బ్రహ్మదినే విధౌ, సురద్రుమే వికల్పే చ ప్రత్యయశ్చేత్సమార్థకః" నానా. ఈశబ్దము వ్యాకరణశాస్త్రమున విధింపబడినకల్పప్రత్యయ మాయెనేని సమానార్థకము. అనఁగా "ప్రభాతకల్పారాత్రిః-అగ్నికల్పశ్శత్రుః" ఇత్యాదిస్థలములయందుఁ బ్రాతఃకాలసమానము రాత్రియనియును, అగ్నితుల్యుఁడు శత్రువనియును, తెలిసికొనునది. ఉదా. 'చ. అలజడిఁబొందఁగాఁదగనిచుట్టిది ద్రౌపదిమేరుకల్పలం. గొడుకుల" భార. అలక - ముంగురులుగలదయిన యావిప్రునిభార్యయొక్క, గర్భము - చూలు, కడుపులోనిపిండము, 'ని. గర్భఃకుక్షిస్థజంతుః' 'గర్భోఽపవరకేఽన్నేఽగ్నౌ సుతే పవనసంకటే, కుక్షౌకుక్షిస్థజంతౌచ,'యా. హృదయేశప్రమదంబుతోన్ - తనభర్తయొక్క సంతోషముతోను, 'ని. హృదయంజీవితేచిత్తే వక్షస్యాకూత వృక్కయోః' శబ్దా. కుచయుగీ హేరాళనీలత్వసంపదతోన్. కుచయుగీ - స్తనములజంటయొక్క, హేరాళ - అధికమైన, నీలత్వసంపదతోన్ - నలుపుయొక్కసమృద్ధితోను, ఆననపద్మపాండిమముతోన్ - ఆననపద్మ - తామరపూవువంటిముఖము యొక్క, పాండిమముతోన్ - తెలుపుతోను, ప్రస్తూ.....ప్సతోన్. ప్రస్తూయమాన - స్తోత్రముచేయఁబడుచున్న, అంగరాగ - మేననలందికొనునట్టి సుగంధద్రవ్యములయందును, దుకూలాది -

వెలిపట్టువస్త్రము మొదలగువానియందును - సన్ననివస్త్రములు మొదలగువానియందును, జుగుప్స
తోన్ - అసహ్యముతోను, అనాదరముతోను, జడిమతోన్ - మాంద్యముతోను, కార్శ్యంబు
తోన్ - చిక్కుటతోను; కృశత్వముతోను, ఉద్ధురధురాపూర్ణత్వమున్. ఉద్ధుర - భరింపశక్యము
గాని, ధుర - భారముయొక్క, ఆపూర్ణత్వమున్ - మిక్కిలినిండారుటను, చెందఁగన్ - పొం
దఁగా, నవమాసములు పూర్తి కాఁగాననుట. ఇందు 'ఆననపద్మపాండిమముతో' ఉపమాలంకా
రము. స్వభావోక్త్యలంకారము. 'స్వభావోక్తి రసౌ చారు యథావద్వస్తువర్ణనమ్'' ప్రతా.
"ప్రమదంబుతో - సంపదతో'' ఇత్యాద లంత్యానుప్రాసాలంకారము.

తా॥ ఆ బ్రాహ్మణునిభార్య గర్భమునుధరించి యది తనపతికానందము కలిగించుచును
మిక్కిలినల్ల నగుచున్నచనుదోయితోను, ముఖపద్మముయొక్క తెలుపుతోను, స్రక్చందనాది పరి
మళవస్తువులయందును, సన్ననిపట్టుచీరలు మొదలగువానియందు ననాదరముతోను, మాంద్యము
తోను, కృశించుటతోను, మోయలేనిబరువుగలదియై వృద్ధినొందెను. తరువాత.

—: బ్రాహ్మణుని భార్యకుఁబుత్త్రుఁడుదయించుట :—

క॥ అమృతపయోధిలలామం, బమృతకరుం గాఁచినట్లు ♦ హరికృపవలనన్
సుముహూర్తంబున భూసుర, రమణీరత్నంబు పుత్త్రి ♦ రత్నముఁ గాంచెన్. 87

అ॥ భూసురతరుణీరత్నంబు - శ్రేష్ఠురాలయిన యాబ్రాహ్మణునిభార్య, 'ని. రత్నంశ్రేష్ఠే
మణావపి' అమ. హరికృపవలనన్ - పాపములను బోఁగొట్టువాఁడయిన భగవానునియొక్క దయ
వలన, సుముహూర్తంబునన్ - శుభకరమయిన యొకలగ్నమున, 'ని. ముహూర్తమల్పకాలేస్యా
ద్ఘటికా ద్వితయేఽపిచ' శబ్దా. అనఁగాఁ బదియవమాసమున 'శ్రు. దశమేమాసిసూతవః'
అమృతపయోధిలలామంబు - శ్రేష్ఠమయిన పాలకడలి, అమృతకరున్ - సుధాకిరణములుగలచం
ద్రుని, కాంచినట్లు - కనినవిధముగా, పుత్త్రిరత్నమున్ - శ్రేష్ఠుఁడయినకొడుకును, కాంచెన్ -
కనెను, ప్రసూతియయ్యెను. ఇందుఁరమణీరత్నంబు పుత్త్రిరత్నముఁగాంచెన్ - అనుటలో మహతీ
మహచ్ఛబ్దములపైఁ గలరత్నశబ్దమునుగూర్చి "సూ. క్వచిదర్థ విశేషేతు ♦ క్లీబేతూభయరూపతా" అధ
ఉదా. "క. నీమాఱుదల్లి త్రిభువన ♦ భామారత్నంబు" హరివం. "వ. అదియట్లుండె వినుము
గృహస్థరత్నంబ'' స్వా. మ. ఇచట క్షీరసముద్రము చంద్రునిఁ గనినవిధమున నాబ్రాహ్మణపత్ని
కళానిధియగు నిరంకుశునిఁ గనెననుటచే నుభయత్ర సమానధర్మము గనుక నుపమాలంకారము.
"సాధర్మ్యముపమా'' కా.ప్ర. వాక్యగతపూర్ణార్థి.

తా॥ ఆబ్రాహ్మణునిభార్య భగవానునిదయవలన శుభప్రద మైనయొకవేళయందుఁ బాల
కడలి చంద్రునిగనినవిధమున శ్రేష్ఠుఁ డయినయొకకొడుకును గనెను.

క॥ వైదికశేఖరునకుఁ బు ♦ త్త్రోదయకాలమ్మునందు ♦ నుద్భూతము లౌ
మేదురపులకాంకురములు ♦ మోదారంభంబునకును ♦ మొలకలుపోలెన్. 88

అ॥ వైదికశేఖరునకున్ — వేదమునభ్యసించినవారిలో శ్రేష్ఠుఁడయినయాసురశర్మకు. పుత్రోదయకాలమ్మునందున్ — కొడుకుపుట్టినట్టిసమయమున, ఉద్భూతములు — పుట్టినవి, ఔ—అయినట్టి, మేదురపులకాంకురములు — దట్టమయినగగుర్పాటు యొక్క—మొలకలు, ఉదా. 'వ. మేనంబులకలిప్ప దుంబొడమెడు'' స్వా. మ. మోదారంభంబునకును — సంతోషము యొక్క— మొదలికి, మొలకలు వోలెన్ — అంకురములోయనునట్లుండెను. ఈపద్యమున 'కాలమ్మ' అనుప్రయోగమునకు ''సూ. స్యాదమహతాం!విభక్త్యాసోశ్చమ. తదుపరి పునస్మబూప్రాచాం''నన్న. ''సూ. ముర్వనాదికశబ్దేభ్యో ముబూస్యాతాంచతత్పరం, బౌపరేమస్యబిందుస్స్వ న్మాపరేమేశసంభవేత్'' అథ. 'మొలకలు వోలెన్' అనుప్రయోగమునకు ''సూ. క్వచిత్సాదృశ్యశబ్దస్య తమత్క్షైవ్యవస్థితిః'' అథ. ఉదా. ''ఎ. గీ. కమలషండంబు నాగలో ♦ కంబువలెను, బాన్పుకల్పాంతమునజము ♦ బానసంబు, నింటిలోపలవోలె'' నిర్వ. ''ధవుఁగూర్మిఁ గొసరుచున్నవివోలె'' స్వా మ. 'ఔ' అనుటకు ''సూ. వాయి రవు ర్వక్రతమా'' శబ్దచిం. ఇందు 'పులకాంకురములు మోదారంభమునకును మొలకలు వోలెన్'' అనుటచేనుత్ప్రేక్షాలంకారము. ''సంభావనమథోత్ప్రేక్షా ప్రకృతస్యసమేనయత్'' కా. ప్ర.

తా॥ వేదాధ్యయనపరులలో శ్రేష్ఠుఁడయినయాసురశర్మకు సుతుఁడు జన్మించినకాలమునఁ బుట్టినగగుర్పాటు దనయానందమున కంకురమువలె నుండెను.

## —: సురశర్మ సుతునకు జాతకర్మంబు సేయుట :—

వ॥ ఇట్లపరిమితసంతోష సంతర్పితాంతఃకరణుండును, సంభృతసమయసమానేయ సమపరతకరణుండును, దనయోత్సవ సమాలోకనోత్సాహ సాహచర్యసమాయాత సమీపగ్రామ సకలగోత్రామరసన్నిధి సంకల్పితహరిప్రసాద ప్రసంగుండును, గలిత కర్పూర తాంబూలదాన సంతోషస్వాంతనిరర్గళపురంధ్రీ జనపరంపరా నిరాఘాట కోలాహల శ్రీప్రసాదిత గృహాంగణరంగుండును, భూరిదానచంగుండును, నై పెన్నిధానంబుఁ గన్న పేదచందంబున మేఘోదయంబుఁ గాంచినమయూరంబుకరణిఁ, గోమలవలాహకంబుం గనుంగొన్నచాతకంబుకై వడి, హరిప్రసాదవిధంబు నాలోకించు యోగీశ్వరునిపోలిక, నభినవభానుబింబంబు వీక్షించుకమలాకరంబు విధంబునఁ, బూర్ణచంద్రుని దర్శించుకలశాంబుధి తెఱంగున, సరోవరంబు నిర్వర్ణించు తర్షకునిమాడ్కి, ఫలితసహకారంబు నిధ్యానించు రాజకీరంబువడువునఁ, బ్రియనందన సందర్శనానంద కందళితుందిల హృదయారవిందుండై, యావిజ్ఞానస్వచ్ఛందుండు జాతకర్మంబు యథాశాస్త్రంబుగా నిర్వర్తించి తదనంతరంబ. 89.

అ॥ ఇట్లు—ఈప్రకారముగా, అపరి.........డును. అపరిమిత—అధికమైన, సంతోష—ఆనందముచేత, సంతర్పిత—మిక్కిలితృప్తిఁ జెందబడిన, అంతఃకరణుండును—మనస్సు గలవాఁడును, సంభృ... డును. సంభృతసమయ—చక్కగాభరింపఁబడిన కాలమును, సమానేయ, సరిచూడఁగలిగి, సమపరతకరణుండును — నిలుపుదల చేయుటగలవాఁడును, తన.........డును. తనయ — కుమారుని యొక్క, ఉత్సవ—జాతకర్మమహోత్సవమును, అనఁగా జాతకర్మమును వేడుకను, సమాలోకన — చూచుటను,

ఉత్సాహ-ఉద్రేకముతోను, సాహచర్య-కూడఁదిరిగెడుమైత్రితోను, సమాయాత-రాఁబడిన-వచ్చిన, సమీపగ్రామ-చెంతనుండిన యూళ్ళయ దుఁగల, సకలగోత్రామర-సమస్తమైన విప్రులయొక్క, సన్నిధి-దాపున, సంజల్పిత-విస్తారముగాఁజెప్పఁబడిన, హరిప్రసాద-నారాయణుని యనుగ్రహము యొక్క, ప్రసంగుండును-ప్రశంసకలవాఁడును, మాట్లాడుటగలవాఁడును, కలి.........డును. కలిత-పొందఁబడిన, కర్పూరతాంబూల-కప్పురపు తములముయొక్క, దాన-ఈవివలన, ఇచ్చుటవలన, సంతోషిత-ఆనందమునుజెందఁబడిన, స్వాంత-మనస్సుగల, నీరంధ్ర-ఎడములేని, పురంధ్రీజనపరంపరా-కుటుంబముగల ముత్తైదువలవరుసలయొక్క, నిరాఘాట-ఆటంకములేని, కోలాహల-కలకల ధ్వనియొక్క, బహుజనములవలనఁబుట్టిన గొప్పధ్వనియొక్క, 'ని॥ కోలాహలఃకలకలః'' అమ॥ శ్రీ-సంపత్తిచేత-అధికముచేత, ప్రసాదిత-సంతుష్టము కాఁబడిన, గృహాంగణరంగుఁడును — ఇంటి ముంగిలి ప్రదేశముగలవాఁడును, భూరిదానచంగుండును - విస్తారమైన యీవులయందు నేర్పుగల వాఁడును, ఇచట. ఈవులనుగూర్చి "దేవాశ్చ పితర శ్చైవ పుత్రే జాతే ద్విజన్మనాం, ఆయాంతి తదహ స్తస్మా త్పుణ్యం పూజ్యం చ సర్వదా'' తత్ర దద్యా త్సువర్ణం తు, భూమిం గాం తురగం రథం, ఛత్రం ఛాగం వస్త్రమాల్యే శయనం చాసనం గృహమ్'' ఖిలయజ్ఞే, వివాహే చ సంక్రాంతౌ గ్రహణే మృతౌ, పుత్రే జాతే వ్యతీపాతే. దత్తం భవతి చాక్షయమ్'' వాక్యమ్. యత్తు కుమార ప్రసవే నాభ్యా మచ్ఛిన్నాయాం గుడ, తిల, హిరణ్య, గో, ధాన్య, వాసః, ప్రతిగ్రహే ష్వదోష ఇతి'' శంఖ 'పుత్రజన్మనియజ్ఞే చ, తథాచాత్యయకర్మణి రాహోశ్చదర్శనేదానం ప్రశస్తంనాన్యథానిశి, పరా. ఐ-అయియుండి, పెన్నిధానంబున్-ధనముగల పెద్దపాఁతఅను, కన్నపేదచందంబునన్— చూచినబీదవానివిధమునను, మేఘోదయంబున్-మొయిళ్ళయొక్క-పుట్టుకను, కాంచినమయూరంబు కరణిన్-కనుఁగొనిన నెమిలితెఱంగునను, కోమలవలాహకంబున్-మృదువైనమబ్బును, కనుఁగొన్న చాతకంబుకైవడిన్-వీక్షించిన వానకోయిలవలెను, హరిప్రసాదంబున్-భగవంతునియొక్క-కృపను, ఆలోకించుయోగీశ్వరునిపోలికన్-నిరీక్షించుచున్నట్టి ఋషీశ్వరునిపగిదిని, అభినవభానుబింబంబున్-క్రొత్తదియైన సూర్యమండలమును, వీక్షించు కమలాకరంబువిధంబునన్-దృష్టించునట్టి తామరపూవులకు నివాసమయిన కొలనుపోలికను, పూర్ణచంద్రునిన్-నిండుచందురుని, పున్నమనాఁటి చంద్రుని, దర్శించుకలశాంబుధితెఱంగునన్-విలోకించునట్టి పాలకడలిరీతిగాను, ఇచట. కలశాంబుధినిగూర్చి 'సాగరే మథ్యమానేతు, పీయూషార్థం సురాసురైః, పీయూషధారణార్థాయ, నిర్మితా విశ్వకర్మణా'' కలాః కలాస్తు దేవానా మసితా స్తాఃపృథక్ పృథక్ యతః కృతాస్తుకలశా, స్తతస్తేపరికీర్తితాః'' కాళి. పు. కలశము పాలకడలియొక్క యమృతమును బోసియుంచుటకై విశ్వకర్మచేసృజింపఁబడిన యమృతఘటము. దానికిసంబంధించినదిగానఁ గలశాంబుధియనుప్రసిద్ధినొందినది. సరోవరంబున్-సరస్సును, మడుఁగును. నిర్వర్ణించుతర్షకునిమాడ్కిన్-వీక్షించునట్టి దాహముఁగొన్నవానిసరణిని, ఫలిత సహకారంబున్-పండినతియ్యమామిడిచెట్టును, నిధ్యానించురాజకీరంబు వడువునన్-అవలోకించునట్టి శ్రేష్ఠమైన చిలుకవలెను, ప్రియ.........దుండై. ప్రియనందన-ఇష్టముగల తనకుమారుని, సందర్శన-వీక్షించుటవలని, ఆనందకందళ - సంతోషముయొక్క-వికాసముతో, తుందిల-పెద్దదియైన, హృదయారవిందుండై-కమలమువంటి మనస్సుగలవాఁడై, అవిజ్ఞానస్వచ్ఛందుండు-శిల్పశాస్త్రాది జ్ఞానము [illegible] స్వతంత్రుఁడగునాసురశర్మ, "ని॥ విజ్ఞానం శిల్పశాస్త్రయోః'' అమ॥ జాతకర్మంబున్ - జాత

కర్మయనెడు సంస్కారము. అనఁగా [illegible] చేయుటకు వేదవిహితక్రియయనుట. యథా శాస్త్రం — శాస్త్రోక్తముగ [illegible] ప్రకారముగా, 'శ్రీ యథాశాస్త్రమయోగ్యత్వపిహ్వా [illegible], యా॥ [illegible]. [illegible] — జటుపిమ్మట, ఇందు 'భూరిదాన [illegible], ఇత్యాది [illegible] "సూ॥ ప్రయత్నాత్ప్రతిపత్త్యచిచ్ఛాత్ర [illegible] బా॥వ్యా. ఇందు 'సంతోష — సంతృప్తి, [illegible] — [illegible] ఇవి శబ్దాను ప్రాసాలంకారము 'అ[illegible], [illegible] — [illegible], ఇవి యంత్యాను ప్రాసాలంకారము "సంయోగ్యనానాసంయుక్తం [illegible] యాప్తిజ్ఞానస్వచ్ఛందముండు" ఇది వృత్త్యనుప్రాసాలంకారము. "[illegible]" ఇత్యాదిబహూపమానముల చేతనభిన్నధర్మమాలోపమాలంకారము. "సాధర్మ్యముపమా" కా॥ ప్ర॥ తత్రతత్రోపమాయత్ర ఇవ [illegible]వర్ణనమ్, నిరు.

తా॥ ఈవిధముగా మితిలేనియానందముతో నిండినమనస్సుగలవాఁడును, ప్రసవవేదనాసమయమును జక్కఁగా బరిశీలించి యున్న వాఁడును, కొడుకుపుట్టిన కాలమున జరుపవలెనను జూచుటచే సంతోషముతో స్నేహము వలనఁ దెంతగ్రామమునుండి వచ్చినబ్రాహ్మణులందఱియెదుట భగవానునియొక్క యనుగ్రహము నుగూర్చివిశేషముగా స్తుతించుచున్న వాఁడును, కుటుంబినీసమూహమునకుఁ గప్పురపుఁదాంబూలముల నొసంగి సంతోషించి యుంగిటనిలిచి యొకరితోనొకరు పెద్దధ్వనిగాఁ బ్రసంగించుచుండుట గలవాఁడును, విస్తారముగా దానములనొసఁగినవాఁడును,అగు నాబ్రాహ్మణుఁడు ద్రవ్యముతలుగనియొక పెద్దసొమ్ముల గనినపేదవానివలెను, మెయిచ్చిపుట్టుకను గనిన నెమిలివలెను. ఘృదుపైన మబ్బులఁ జూచిన వానకోయిలవలెను, భగవదనుగ్రహము నిరీక్షించు యతీశ్వరునివలెను, నూతనసూర్యబింబమును గాంచుపద్మాకరమువలెను, నిండుచందురుని జూచుపాలవెల్లివలెను, మడుఁగును గనుఁగొన్న దాహాతురునివలెను, పండినతియ్యమామిడిని గనినచిలుకవలెను, తన యింపయిన కుమారుని గనినసంతోషముతో వికసించినమనస్సుగలవాఁడై శిల్పశాస్త్రోక్తములయాం దధికుఁడైన యాతఁడు శాస్త్రము నతిక్రమింపక జాతకర్మ మహోత్సవ మొనర్చినతరువాత.

## —: సురశర్మ సుతునకు నామకరణము సేయుట :—

తే॥ పదిదినంబులు సూతక ♦ ప్రాప్తిఁగడపి, పదునొకండవనాఁడఘా ♦ పహాజలాభి
షేక మొనరించి బాంధవ♦ నైకపరివృ, తాత్ముఁడై యుండుసతనితో♦నవనిసురులు. 90.

అ॥ పదిదినంబులు – పదిరాత్రులు, సూతకప్రాప్తిఁ – జాతాశౌచమునుబొందియుండుటను, కడపి – పోఁగొట్టి, అనఁగాఁ బురిటిమైలనుబోఁగొట్టియనుట. "ఆశౌచేతువ్యతిక్రాంతే నామకర్మ విధీయతే" శం॥ పదునొకండవనాఁడు – ఏకాదశదినమున, అఘాపహాజలాభిషేకము – పాపము అను బోఁగొట్టునదయిన మంత్రపూర్వకముగా జలమును బ్రోక్షించుకర్మమును, అనఁగా దైవాదికర్మ ప్రారంభమున మంగళార్థముగాఁ బుణ్యాహమను శబ్దమును ముమ్మారుచ్చరించువది కనుక నద్దానిచే యనుట. ఒనరించి – ఆచరించి, బాంధవనైకపరివృతాత్ముఁడు. బాంధవ – చుట్టములయిన, నైక.

అనేకులతో, 'ని. ఏకో ముఖ్యాన్యకేవలాః' అ. "ఏకోఽన్యార్థే ప్రధానేచ ప్రథమే కేవలేతథా సాధారణేసమానేఽల్పే సంఖ్యాయాంచప్రయుజ్యతే" విశ్వ. ఇట నఞ్ఞునకు 'తత్సాదృశ్యమభావశ్చ తదన్యత్వం తదల్పతా అప్రశస్తి ర్విరోధశ్చ నఞర్థాః షట్ప్రకీర్తితాః' అనిశాస్త్రము. పరివృతాత్ముఁడు – చుట్టుకొనఁబడినవాఁడు, ఐయుండునతనితోన్ – అయినట్టి యాసురశర్మకు, అవని సురులు – బ్రాహ్మణులు, మీఁదిపద్యముతో నన్వయము. ఇట్లు పైపద్యముతో నర్థమును జెప్పుటకు "సూ. క్వచి త్కులకసంబంధోఽప్యత్ర సాహితకృద్భవేత్, అధ్యాహారస్య సంయోగ స్త్వత్ర నైవ సుఖావహః" అధ. ఇందు 'ఆత్మన్' శబ్దమునకు డుప్రత్యయము కల్పించుటకు "సూ. ఆత్మన ఇమ న్నన్తానాం డా వా" నన్న. 'సూ. ఆత్మేమనిజంతంబులకు నాంతము అగు మహజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు" బా.వ్యా.

తా॥ పదిరాత్రులు జాతాశౌచమును వెళ్ళఁబుచ్చి పదునొకండవదినంబునఁ బుణ్యాహవాచనమును జేయుఁగా నతనిబరివేష్టించియున్న బంధువులందఱు నాసురశర్మతో నిట్లు చెప్పిరి.

మ॥ అశనప్రగ్రహదానధర్మ సురశ ♦ ర్మా కర్మసంపన్న పం
చశరాకారుఁడు నీకుమారుఁడు వచ ♦ స్సంభారదుర్వారుఁడై
విశదానర్గళశేముషీమహిమచే ♦ వేదాదివిద్యానిరం
కుశుఁ డౌనన్న నిరంకుశుండె యనియెన్ ♦ క్షోణీసురుం డాఖ్యయున్. 91.

అ॥ అశనప్రగ్రహదానధర్మ – అన్నార్థులైవచ్చినవారలకు ఈవులనిచ్చుటయు సత్కార్యము ననుజేయుటయుఁగలవాఁడా, కర్మసంపన్న – సత్కర్మములయొక్క సమృద్ధిగలవాఁడా, సురశర్మా – సురశర్మయను పేరుగలవాఁడా, పంచశరాకారుఁడు – మన్మథునివంటి చక్కనివాఁడు, నీకుమారుఁడు – నీయొక్కపుత్త్రుఁడు, వచస్సంభారదుర్వారుఁడై. వచః – వాక్కులయొక్క, సంభార – సమృద్ధియందు, దుర్వారుఁడై – నివారింపనలవిగానివాఁడై, విశదానర్గళశేముషీమహిమచేన్. విశద – స్వచ్ఛమైన, అనర్గళ – అడ్డములేని, శేముషీమహిమచేన్ – ప్రజ్ఞయొక్క యతిశయముచేత, వేదాదివిద్యానిరంకుశుఁడు – శ్రుతులుమున్నగాఁగల విద్యలయందసాధ్యమయినవాఁడు, ఔనన్నన్ – కాఁగలఁడనిచెప్పఁగా, క్షోణీసురుండు – ఆబ్రాహ్మణుఁడు, ఆఖ్యయున్ – ఆపిల్లవానికిఁ బేరును, అనఁగా నామకరణసమయమునఁ బెద్దలుచెప్పఁగా విని యాప్రకారముగానేయనుట. నిరంకుశుండెయని యెన్ – నిరంకుశుండెయని నామకరణమొనర్చెను. "ప్రజాభివర్ధనాత్పుంసో జాతకర్మవిధీయత" మను. ఇందుఅనియెన్, అనుటకు "సూ. య స్యాద్దేశ్యక్రియాంతే తు భూతఏకత్వవాచకే, ఇత ఏవ పరస్స స్స్య దిద్భవే న్నాంత కా త్వరే" అధ. 'పంచశరాకారుఁడు' ఉపమాలంకారము. 'ధర్మ; శర్మ' 'కారుఁడు–మారుఁడు' అంత్యానుప్రాసాలంకారము.

తా॥ అన్నార్థులైవచ్చినవారలకు దానములొసంగుచు సత్కార్యములఁజేయుచున్నవాఁడవును విధ్యుక్తకర్మంబులన్నింటిని విడువక యాచరించుచున్నవాఁడవును. అయినయో సురశర్మా! నీసుతుఁడు మన్మథునివంటి సుందరుఁడును, అటంకపఱుపనలవిగాని వాక్సమృద్ధితోను, ప్రకాశమైనప్రజ్ఞతోను, [illegible] మొదలగువిద్యలయందు నిరంకుశుఁ డగుచున్నాఁ డాతండును నిరంకుశుఁడే యని పేరిడెను.

క. ఈరీతి నమ్మహీసురు ♦ డారూఢచరిత్రపాత్రు ♦ డగుపుత్త్రునకున్
బేరొసఁగె నాణిముత్తెపుఁ ♦ బేరొసఁగినకీర్తి బుధులు ♦ పేరుకొనంగన్. 92.

అ॥ అమ్మహీసురుఁడు – ఆవిప్రుఁడు, ఆరూఢచరిత్రపాత్రుఁడు. ఆరూఢ – ప్రసిద్ధమైన, చరిత్ర – మంచినడతను దెలియఁజేయు గ్రంథమునకు, పాత్రుఁడు – అర్హుఁడు; తగినవాడు, అగుపుత్త్రునకున్ – అయినట్టితనకుమారునకు, ఆణిముత్తెపుఁబేరొసఁగినకీర్తిన్ – గుండ్రని ముత్యములయొక్క హారమును మెడలోవైచినంతటిసొంపుగా, బుధులు – తెలసినవారు, పేరుకొనంగన్ – స్తుతించఁగా ఈరీతిన్ – ఈవిధముగా, పేరొసఁగెన్ – నామకరణమొనర్చెను, ఇందు 'చరిత్రపాత్రుఁడగు పుత్త్రుఁడు' అనుప్రాసాలంకారము 'పేరొసఁగెనాణిముత్తెపుఁబేరొసఁగినరీతి' యమకాలంకారము. పునరుక్తవదాభాసాలంకారము.

తా॥ ఆబ్రాహ్మణుఁడు ప్రఖ్యాతిగలచరిత్రార్హుఁ డయినతనకుమారునకు మంచిముత్తెముల పేరును మెడలోవైచినంతటి యలంకారముగా నుండె నని పెద్దలు శ్లాఘించుచున్నట్లు తగిన పేరును బెట్టెను.

—: అన్నప్రాశన చౌలోపనయములు చేయుట :—

క॥ అన్నప్రాశనచౌలము, లున్నతిగావించెఁ జేసె ♦ నుపనయనము వి
ద్వన్నుతులెసఁగఁ దనూజున, కన్నలినాసనకులీనుఁ ♦ డాగమసరణిన్. 93.

అ॥ అన్నలినాసనకులీనుఁడు – కమలమే యాసనము గాఁగల బ్రహ్మవంశమునఁబుట్టిన యామురశర్మ, తనూజునకున్ – తనకుమారునకు, విద్వన్నుతులు – పండితులయొక్క పొగడ్తలు, ఎసఁగన్ – ఒప్పునట్లు. ఆగమసరణిన్ – శాస్త్రోక్తప్రకారముగా, ఉన్నతిన్ – అధికతరముగా, అన్నప్రాశన చౌలములు – అన్నమునుదినిపించుటయును, పుట్టిననాఁటివెండ్రుకలు దీయుటయును, కావించెను–చేయించెను, "చూడాకార్యాద్విజాతీనాం సర్వేషామేవధర్మతః ప్రథమేఽబ్దేతృతీయేవా కర్తవ్యా శ్రుతిచోదనాత్" మను. ఉపనయనమున్ – వడుగును, చేసెను. 'గర్భాష్టమే ప్రకుర్వీతబ్రాహ్మణస్యోపనాయనమ్" మను. ఈపద్యమున 'అన్నలినాసనకులీనుఁడు' అనుటలో దీర్ఘమునకు హ్రస్వము వచ్చుటనుగూర్చి "సూ. ఇదమదసేతద్యతచ్ఛబ్దాః శబ్దాంతరాన్వయే బహుళం హ్రస్వం ప్రపద్యదీర్ఘా ద్విత్వముపర్యక్షరస్యజనయంతి" శబ్దచిం. "సూ. ఊష్మరేఫాన్వినాద్విత్వమయుక్తస్యహలోమతమ్" అధ.

తా॥ ఆవిప్రుఁడు బుధజనులు మెచ్చునంతటి శాస్త్రోక్తముగాఁ దనసుతున కన్నప్రాశనమును, కేశఖండనమును, ఉపనయనమును చేసెను.

—: సమస్తశాస్త్రములు నేర్పుట :—

మ॥ చదివించెంద్రయివాక్యముల్ గఱపెశా ♦ స్త్రంబుల్ పఠింపించె సా
మ్యదవిష్టప్రతిభం గవిత్వము రచిం ♦ పం జేసె గానక్రియా
విదురుం గా నొనరించె వైదికకులా ♦ విర్భూత నాకారసం
పదు పేర్తన్ గుణాధన్యుఁ గన్యుఁ గరమె ♦ ప్పం జేసె నుద్వాహమున్. 94.

అ॥ త్రయివాక్యముల్ - ఋగ్యజుస్సామవేదములు మూఁడింటియొక్క మంత్రములను, "వ్యు. త్రయో వేదా అవయవాః అస్యాఇతి త్రయీ" మూఁడు వేదములయొక్క యవయవములు గలది, చదివించెన్ - పఠింపఁజేసెను, "వేదానధీత్య వేదౌవా. వేదం వాఽపి యథాక్రమం. అవిప్లుతబ్రహ్మచర్యో గృహస్థాశ్రమమాశ్రయేత్" మను. శాస్త్రంబుల్ - వేదాంత, వైశేషిక, భాట్ట, ప్రాభాకర, పూర్వోత్తరమీమాంసాది సమస్తమయినశాస్త్రములను కఱపెన్ - బోధించెను, సామ్యదవిష్టప్రతిభన్. సామ్యత్ - సమానముగాఁజేయఁబడుచున్న, అవిష్టప్రతిభన్ - స్వచ్ఛమయినబుద్ధివిశేషమును గూర్చి, పఠింపించెన్ - కొన్నిగ్రంథములను చదువునట్లుగాఁజేసెను, కవిత్వము రచింపన్ జేసెన్ - ప్రబంధములు వ్రాయునట్లొనరించెను, గానక్రియావిదురున్ గాన్ - సంగీతమును పాడుటయందుఁ దెలిసినవానినిగా, ఒనరించెన్ - చేసెను, వైదికకులావిర్భూతన్ - వేదములను జదివినవారివంశము నందుఁ బుట్టినదానిని, ఆకారసంపదుపేతన్ - చక్కఁదనముయొక్కసమృద్ధితోఁ గూడినదానిని, గుణధన్యన్ - సద్గుణములయందు సంపన్నురాలయినదానిని, కన్యన్ - ఒకచిన్నదానినిగూర్చి, కరమొప్పన్ - యోగ్యముగునట్లు, ఉద్వాహమున్ - వివాహమును, చేసెన్ - చేసెను. "గురుణానుమతస్స్నాత్వా సమావృత్తో యథావిధి ఉద్వహేత ద్విజో భార్యాం సవర్ణాం లక్షణాన్వితాం" మను. ఇందుద్వితీయపాదమున ననుస్వారయతి చెప్పఁబడినది. 'పంచమవర్గాక్షరములు, పంచ మవర్ణములఁ గూడి ♦ పరఁగనటించున్, వంచింపక పెఱనాలుగు, నంచితముగఁ బిఱుఁదనున్న ♦ లంటినచోటన్" ఉదా. "గీ. మానుపడిసెల్లు విజితశం ♦ బరుఁడనంగ" సుల. 'పఠింపించె' అనుటకు "సూ. క్త్వాభూతయోః క్రియాంతస్యేత్" శబ్దచిం. "ఆవిర్భూతన్-ఉపేతన్-గుణధన్యన్-కన్యన్' ఇవి యంత్యానుప్రాసాలంకారము.

తా॥ తదుపరి మూఁడువేదములయొక్క మంత్రములను, సమస్తశాస్త్రములను నేర్పి కావ్యములనువ్రాయునంతటి ప్రజ్ఞావంతునిగను, సంగీతము పాడుటయందు నిపుణునిగను, చేసి వేదములఁ బఠించువారియొక్క కుటుంబమునఁ బుట్టినదియును, అందకత్తెయును, గుణవతురాలును అగు కన్యను దెచ్చి యోగ్యముగాఁ గళ్యాణమొనరించెను.

—: ధర్మశీలునిప్రశ్నము :—

తే॥ అనినవిని ధర్మశీలుఁ డో ♦ మునివరేణ్య, విప్రతనయుండు వేదాది ♦ విద్యలందుఁ
జతురుఁడై మించె నట్టిశై ♦ శవమునంద, యద్భుతంబందెఁ దద్వార్త ♦ లానతీవె. 95.

అ॥ అనినన్ - ఇట్లువచింపఁగా, విని - ఆకర్ణించినవాఁడై, ధర్మశీలుఁడు - ధర్మశీలుఁడను రాజు, ఓమునివరేణ్య - ఓమహర్షులలోశ్రేష్ఠుఁడయినవాఁడా, 'ని. ముఖ్యవర్యవరేణ్యాశ్చ' అ. విప్రతనయుండు - ఆబ్రాహ్మణునియొక్క కుమారుఁడు, అట్టిశైశవమునంద-అంతటి బాల్యప్రాయముననే, 'ని. శిశుత్వం శైశవం బాల్యం' అ. 'సూ. ప్రాణభృజ్జాతివయోవచనోద్గాత్రాదిభ్యోఽఞ్ శిశోర్భావశ్శైశవమ్" సిద్ధాం. వేదాదివిద్యలందున్ - వేదములుమున్నుగాఁగల విద్యలలో, చతురుఁడై మించెన్ - నేర్పుగలవాఁడైయతిశయించెను, అద్భుతంబందెన్ - నామనస్సున కచ్చెరువయ్యెను, తద్వార్తలు - అటుతరువాతి సమాచారములు, ఆనతీవె - సెలవిమ్ము, ఇందు 'ఆనతీవె' అనుటకు "సూ. ఏధౌతౌ వ్యతిరేకాదపి సంప్రార్థన పరాక్రియాణాంస్థః" నన్న.

"సూ. అవాంతరేకథాస్థాన విశ్రాంత్యా శ్వాస ఉచ్యతే, ప్రత్యంతపూరణం భిన్న వృత్తై ర్దజదుదీరితైః" అథ. ఇట్లం గోట నెఱుంగవలయును. ఇందు 'ఈశ–కేశ' 'యశోవిపాక – ధన్యావలోక' 'కాలకూట – దైత్యాద్ఘాట' ఇవి యనుప్రాసాలంకారము.

శా॥ కార్ష్ణీబంధురకంఠ మన్మథదిధ ♦ క్షాదక్షువీక్షా శిఖా
తార్ష్ణవ్యజ్జ్వలదంబకజ్జ్వలనసి ♦ ద్ధ్యత్పాదసేవా కళా
తార్ష్ణాద్య స్తవగమ్య వాంఛితనితాం ♦ తస్వాంతమందారకా
పార్ష్ణిస్థానవిభాసమాన మధుహా ♦ బ్రహ్మాదిబృందారకా. 97.

అ॥ కార్ష్ణిబంధురకంఠ – నలుపుచేతరమ్యమైనకంఠముగలవాఁడా, మన్మథదిధక్షాదక్షవీక్షా – మన్మథునిదహింప నిచ్ఛగలనేర్పుతోఁగూడిన, దృష్టిగలవాఁడా, శిఖా...సేవా. శిఖా – అగ్నిజ్వాలలయందు, తార్ష్ణ – ఇచ్ఛచే, వ్యజ్జ్వలత్ – అధికముగాఁ బ్రకాశించుచున్న, అంబక – నేత్రమునందలి, జ్వలన – అగ్నిహోత్రునిచేత, సిద్ధ్యత్ – లభించుచున్న. పాదసేవా – పాదములనుబూజించుటగలవాఁడా, అనఁగా నగ్నినేత్రముచేత జడలయందున్న గంగయుష్ణంగి యాయుష్ణోదకము పదములపైఁబడుచున్నదనిభావము. కళాతార్ష్ణాద్య – విద్యలయందలి కోరికలకు మొదటివాఁడా, స్తవగమ్య – స్తోత్రములకు నివాసమయినవాఁడా, వాంఛితనితాంతస్వాంత మందారకా. వాంఛిత – కోరఁబడిన, నితాంతస్వాంత – అతిశయమయినచిత్తముగలవారలకు మందారకా – కల్పవృక్షమయినవాఁడా, పార్ష్ణి.........రకా. పార్ష్ణిస్థాన – కాలియొక్క చీలమండకు దిగువభాగమున, అనఁగాఁబాదములయొక్క సమీపమున, విభాసమాన – ప్రకాశించుచున్న, మధుహా – విష్ణువును, బ్రహ్మ – బ్రహ్మయును. ఆది – మొదలుగాఁగల, బృందారకా – దేవతలుఁగలవాఁడా ఇందు 'దిధక్షాదక్షవీక్షా' ఛేకానుప్రాసాలంకారము. 'నితాంతస్వాంత' అనుప్రాసాలంకారము.

క॥ కవితృముఖకేళివన సం, భవితృవచఃకుసుమపూజ్య ♦ పదయుగ దమున
స్సవితృహరిణాంకలోచన, భవతృష్ణాహరణచణ కృ ♦ పాపరిపూర్ణా. 98.

అ॥ కవితృ............యుగ. కవితృ–కవిత్వముతోఁగూడిన, ముఖ–వదనమనెడు, కేళివన–ఉద్యానవనమునందు, సంభవితృ–కలుగునట్టి, వచఃకుసుమ–వాక్కులనెడు పువ్వులతో, ని॥ స్త్రియః సుమనసఃపుష్పం ప్రసూనం కుసుమంసుమమ్, అ॥ పూజ్య–పూజింపఁదగిన, పదయుగ–చరణద్వంద్వము గలవాఁడా, దమునస్సవితృహరిణాంకలోచన, దమునః–అగ్నిహోత్రుఁడును, 'ని॥ సప్తార్చిర్దమునాశ్శుక్రః, అమ॥ "వ్యు. దామ్యతిగ్లాపయతీతిదమునాః, సవితృ–సూర్యుఁడును, హరిణాంక–చంద్రుఁడును, లోచన–కన్నులుగాఁగలవాఁడా, అనఁగా శివునకుఁ జంద్రసూర్యాగ్నులు మూఁడునేత్రము లనుట, భవతృష్ణాహరణచణ, భవతృష్ణా–సంసారబాధమనెడు దప్పిని, హరణచణ–నాశమొనర్చుట యందు నేర్పరితనముగల, కృపా–దయారసముయొక్క, పరిపూర్ణా–సమృద్ధిగలవాఁడా, ఈపద్యము తోద్విప్రాసముఁజెప్పఁబడినది. ఇందు 'కవితృముఖకేళివనసంభవితృవచః కుసుమపూజ్యపదయుగ, అనుటచేత, ఏకదేశవర్తిసావయవరూపకాలంకారమును. పార్ష్ణిస్థానవిభాస..........బృందారకా, [illegible] నుదాత్తాలంకారమును 'ఉదాత్తంవస్తునఃసంపత్, మహతాంచోపలక్షణమ్, కా॥ ప్ర॥

పంచచామరము॥ చరాచరాదరానుషక్త ♦ సాధులోకవజ్ర పం
జరా జరానిరాసిదేహ ♦ సత్యనిత్య నాక్ప్రియం
కరా కరాళరాక్షసాప ♦ కారకాహవక్రియా
పరా పరాశరాదిమౌని ♦ భక్తియుక్తితత్పరా. 99.

అ॥ చరాచరాదరానుషక్త. చర–తిరిగెడుమనుష్యాదిజంతువులయందును, అచర–కదలని వృక్ష పర్వతాదులయందును, ఆదర–దయతో, అనుషక్త–సంగతమైనవాఁడా, సాధులోకవజ్రపంజరా. సాధులోక–సజ్జనులయొక్క సమూహమునకు, వజ్రపంజరా–వజ్రముతో నిర్మింపఁబడినపంజరాయమైన వాఁడా–జరానిరాసిదేహ.జరా–ముదిమియొక్క, నిరాసి–నిరసనముగల, దేహ–శరీరముగలవాఁడా, అనఁగా నిరంతరముయౌవనముతోనే యుండువాఁడాయనుట, దేవతలకు సహజముగా (త్రిదశులు) ముప్పదివత్సరముల వయస్సుగలవారనిప్రసిద్ధి. సత్యనిత్యనాక్ప్రియంకరా.సత్య–నిజమైనట్టియు, నిత్య–శాశ్వతమైనట్టియు, వాక్–మాటలచేత, ప్రియంకరా–ఇష్టమునుగలిగించువాఁడా, కరాళరాక్షసాప కారకాహవక్రియాపరా♦కరాళరాక్షస–భయంకరులైన యసురులయొక్క, అపకారక–కీడుచేయు నటువంటి, ఆహవక్రియా–యుద్ధకార్యమునందు, పరా–ఉత్కృష్టుఁడవైనవాఁడా, పరాశరాదిమౌని భక్తియుక్తితత్పరా. పరాశరాదిమౌని–పరాశరుఁడు మొదలగు ఋషులయొక్క, భక్తి–వినయముతోఁ గూడినసేవతో, యుక్తి–కూడుటయందు, 'ని॥ యుక్తిర్న్యాయేచయోజనే, విశ్వ.తత్పరా–ఆసక్తిగల వాఁడా, ఇందు 'చరాచరాదరానుషక్త–సత్యనిత్య–భక్తియుక్తి, ఇవి యనుప్రాసాలంకారము. 'సాధు లోకవజ్రపంజరా, ఉపమాలంకారము. ఈపద్యము ముక్తపదగ్రస్తముగాఁ జెప్పఁబడినది.

గద్యము. ఇది శ్రీమత్కాళీవరప్రసాదలబ్ధ లబ్ధవర్ణవర్ణనీయ కవిత్వతత్త్వధౌరేయ, పెదలింగనార్యగర్భార్ణవపూర్ణిమాత్రేయ, గురువరాచార్యపదారవింద మిళిందాయమానమానసాశ్రేయ,పండితమ్మన్యేతరాజేయ,సకలవిద్వజ్జనవిధేయ,రుద్రయనామధేయప్రణీతంబయిననిరంకుశోపాఖ్యానంబనుమహాప్రబంధంబునందుఁబ్రథమాశ్వాసము.

అ॥ ఇది. శ్రీమ........లబ్ధ. శ్రీమత్ – సంపద్యుక్తమైన, కాళీవరప్రసాద – కాళికా దేవియొక్కయిష్టముతోఁగూడిన యనుగ్రహముచేత, 'ని॥ దేవాద్వృతేవరః శ్రేష్ఠేత్రిషుక్లీబే మనా మనాక్ప్రియే.అ,ప్రసాదోఽనుగ్రహే కావ్య:ప్రాణస్వాస్థ్యప్రసక్తిషుమే.లబ్ధ–పొందఁబడినట్టియు, లబ్ధ వర్ణ వర్ణనీయ–లబ్ధవర్ణ–పండితులచేత, వర్ణనీయ – గుణలక్షణాదులను బ్రశంసింపఁదగినట్టియు, కవిత్వ తత్త్వధౌరేయ – కవనముయొక్కస్వరూపమనెడు భారమునువహించినవాఁడును, పెదలింగనార్య గర్భార్ణవపూర్ణిమాత్రేయ. పెదలింగనార్య – పూజ్యుఁడయినపెదలింగనయొక్క, గర్భార్ణవ – గర్భ మనెడుసముద్రమునకు, పూర్ణిమాత్రేయ – పున్నమనాఁటిచంద్రుఁడును, గురువరాచార్య...విధేయ. గురువరాచార్య – విద్యనుపదేశించినట్టి వేదమంత్రాద్యుపదేశకునియొక్క, పదారవింద – తామర పూవులవంటిపాదములకు, మిళిందాయమానమానస – తుమ్మెదగాఁజేయఁబడుచున్న మనస్సుచేత, ఆశ్రేయ – ఆశ్రయింపఁదగినవాఁడును, పండితమ్మన్యేతర – నేనేపండితుఁడనని పొగడికొననట్టి విద్వాంసులకు, అజేయ – గెలువనశక్యమైనవాఁడును, సకలవిద్వజ్జనవిధేయ – సమస్తమయినపండి తులయొక్క సమూహమునందు,వినయముగలిగినవాఁడును,రుద్రయనామధేయ – రుద్రయ్యయను పేరు గలవాఁడును, అయినకవిచేత. ప్రణీతంబు – రచింపఁబడినది, అయిన నిరంకుశోపాఖ్యానంబు– అయినట్టి నిరంకుశోపాఖ్యానము, అనుమహాప్రబంధంబునందుక్ – అనునట్టి మహాకావ్యమునందు, ప్రథమాశ్వాసము – మొదటిదయినపరిచ్ఛేదము. ఇందు 'పెదలింగనార్యగర్భార్ణవపూర్ణిమాత్రేయ, అనుటకు. ఈకవియేసుగ్రీవవిజయమున 'స్న........కాళికాంబాప్రసాద, సంకలితకవిత్వచాతుర్య

శ్రీ ర స్తు

# నిరంకుశోపాఖ్యానము

## సుధాతరంగిణీవ్యాఖ్యానసమేతము

### ద్వి తీ యా శ్వా స ము

శ్రీపతిసాయక సుమన, శ్శ్రీపద నిర్ధూతశమన • సింధురవరదై
త్యాపహ హిమవద్భూభృ, ద్భూపాల మహేశ కంద • పురసోమేశా. 1.

అ॥ శ్రీపతిసాయక. శ్రీపతి - లక్ష్మీదేవికి నాథుఁడైన విష్ణువే, సాయక - బాణముగాఁగల వాఁడా, సంపదల కధిపతియగువానిని జేపట్టినవాఁడాయని భావము. సుమనశ్శ్రీపద. సుమనః - దేవతలయొక్క, మంచిమనస్సుగలవారియొక్క, శ్రీ - సంపదను, పద - రక్షించుటగలవాఁడా, 'ని. పదంశబ్దేచవాక్యేచవ్యవసాయాపదేశయోః, పాదతచ్చిహ్నయోస్స్థాన త్రాణయో రంకవస్తునోః' విశ్వ. నిర్ధూతశమన. నిర్ధూత - దృఢముగాభయపెట్టఁబడిన, శమన - యముఁడుగలవాఁడా, 'ని. నిర్నిశ్చయనిషేధయోః' అ. 'ధూతంతుకంపితేభర్త్సితేత్రిషు' మే. ఇచట చంపఁబడిన యముఁడుగల వాఁడా అనియుఁజెప్పవచ్చును. సింధురవరదైత్యాపహ. సింధురవరదైత్య - శ్రేష్ఠుఁడయిన గజాసురుని, అపహ - తొలఁగించినవాఁడా, అనఁగా యుద్ధమునసంహరించినవాఁడా, యనుట. హిమవద్భూభృద్భూపాల. హిమవత్ - మంచుతోఁగూడియున్న, భూభృత్ - పర్వతముయొక్క, భూ - ప్రదేశమును, 'ని. భూఃపృథివ్యాంస్థానమాత్రే' విశ్వ. పాల - కాపాడుచున్నవాఁడా, మహేశ - మహాప్రభువైనవాఁడా, ని. ఈశః ప్రభౌశంకరేస్యాత్' విశ్వ. కందపురసోమేశా - కందుకూరిపట్టణమునఁగల యోసోమేశ్వరస్వామి, అని యాశ్వాసారంభమునఁగృతిపతికి సంబోధనము. ఇచట '…మేశా' అనిదీర్ఘమువచ్చుటకు 'సూ. సంబోధనేవాదీర్ఘస్స్యాత్ప్రయోగస్యతథాగతేః, భవే ద్రాదితామేవ దీర్ఘత్వంప్రకృతేశ్చుతేః' అథ. 'శ్రీపతిసాయక' అనుటచేఁ బరికరాలంకారము. 'విశేషణైర్యత్సాకూతై రుక్తిఃపరికరస్తు సః' కా. ప్ర.

తా॥ విష్ణువే బాణముగాఁగలవాఁడవు, మంచిమనస్సుగలవారికి సిరులిచ్చి కాపాడునట్టి వాఁడవు, యముని దండించినవాఁడవు, గజాసురుని రూపుమాపినవాఁడవు, హిమవత్పర్వత ప్రదేశమును పాలించుచున్న ప్రభుఁడవు, నగు కందుకూరి శ్రీ సోమేశ్వరస్వామీ !

గీ॥ అవధరింపుము తత్త్వవి • ద్యావివేక, దళితకామాదిరిపువర్గ • కలహుఁడైన
పులహుఁడిట్లనిపలికెనా • భూవరేణ్యు, శేఖరునితోడవచనమై • చిత్రిమెఱయ. 2.

అ॥ అవధరింపుము - వినుము, తత్త్వ......కలహుఁడు. తత్త్వవిద్యా - వేదాంతశాస్త్రము నందలి, వివేక - జ్ఞానముచేత, దళిత - భేదింపఁబడిన, కామాదిరిపువర్గ - కామక్రోధాదులగు నరిషడ్వర్గముయొక్క, అనఁగాఁ గామము క్రోధము లోభము మోహము మదము మత్సరము అను నీయాఱనుట. కలహుఁడు - పరస్పరవివాదముగలవాఁడు, అనఁగా వీనిని జయించినవాఁడనుట. ఐనపులహుఁడు - అయినట్టిపులహుఁడను నామధేయముగల బ్రహ్మ, అభూవరేణ్యశేఖరునితోడన్ - రాజులలో శ్రేష్ఠుఁడయిన యాధర్మశీలునితో, వచనవైచిత్రి - వాక్యములయొక్క యద్భుతము, మెఱయన్ - ప్రకాశింపఁగా, ఇట్లని - ఈవిధముగానని, పల్కెన్ - చెప్పెను, అనఁగా వక్ష్యమాణ ప్రకారముగా వచించెననుట. ఇట్లుభవిష్యదర్థకముగఁ జెప్పుటనుగూర్చి 'సూ. ఇట్లనియె, అనినననిభావ్యర్థకథన ప్రారంభపరిసమాప్తులు క్రమంబుగనగు' ప్రౌ. వ్యా. ఇందు 'కలహుఁడు, పులహుఁడు' అనుప్రాసాలంకారము.

తా॥ వేదాంతవిద్యయందలి జ్ఞానపరిపూర్ణముచేతఁ గామ క్రోధ లోభ మోహ మద మత్సరము లను జయించిన యాపులహమహర్షి ధర్మశీలప్రభువున కిట్లు చెప్ప నుపక్రమించెను.

—: నిరంకుశుని విద్యావిశేషములు :—

క. వినుభూపాల ధరామర, తనయునిమహిమంబు లెన్నఁ ♦ దరమా విద్యా
వననిధి హరివరలబ్ధుం, డనఘాత్ముఁడు తొల్లిజన్మ ♦ మం దని తెలియున్. 3.

అ॥ భూపాల - ఓరాజా, విను - ఆకర్ణింపుము, ఇచట ముకారములోపించుటకు 'సూ. ప్రార్థనార్థమురేకత్వే కథ్యతేమధ్యమార్థకః విభాషాంత వదంత్యేకే నప్రాణోకుకదాచన' అథ. ధరామరతనయునిమహిమంబులు - ఆబ్రాహ్మణకుమారునియొక్క మాహాత్మ్యములు, ఎన్నన్ - గణించుటకు, తరమా - సాధ్యమా, కాదనుట. విద్యావననిధి - విద్యలయందు సముద్రునివంటివాఁడు, హరివరలబ్ధుండు. హరి - విష్ణుమూర్తియొక్క, వర - ప్రసాదమువలన, లబ్ధుండు - లభింపఁబడినవాఁడు, అనఁగా విష్ణువుయొక్క వరమువలనఁ బుట్టినవాఁడనుట. ఇచట విద్యాసముద్రమును హరివరమువలనఁ బొందినవాఁడనియు నర్థమగుచున్నది. (అతఁడు - అక్కుఱ్ఱవాఁడు,) తొల్లిజన్మమందున్ - పూర్వపుపుట్టుకయందు, అనఘాత్ముఁడు - పాపములేనివాఁడు, పుణ్యపురుషుఁడు. 'ని. అఘంమరితదుఃఖయోః' విశ్వ. అనితెలియున్ - అనివిశదమగును, ఇందు 'ధరామరతనయుని మహిమంబు లెన్నఁ దరమా' అనుటచేత నతిశయోక్త్యలంకారమును, 'విద్యావననిధి' ఉపమాలంకారమును.

తా॥ ఓరాజా వినుము: ఆబ్రాహ్మణకుమారుని గొప్పతనములను వర్ణింప శక్యముగాదు. సమస్తవిద్యలయందు సముద్రునివంటివాఁడు. అతనిఁజూచినచో గతజన్మమున గొప్పపుణ్యాత్ముఁ డగుటవలననే యిట్లు జన్మించియుండె నని తెల్లమగును.

సీ॥ వేదముల్ ద్రుహిణాన ♦ నోదయం బగునాఁటి, కొదువఁ దీర్చుకొనుట ♦ కొఱకువచ్చె
వన శాస్త్రములు వాని ♦ వెనువెంట నంటుచు, సందియంబులు దీర్చు ♦ కొందు మనుచు

వచ్చెనో యనఁగను♦వానివీఁకనె పురా, ణములును సంశయాం♦శములు వీడ
వచ్చెనౌరా యన♦వరగుణప్రౌఢిమ, తావచ్చి ప్రౌఢగాఁ♦దలఁచె ననఁగఁ

తే॥ జదువఁ జూడఁగ విన మది♦కోదువునంత, వేదశాస్త్రపురాణాది♦విద్యలెల్లఁ
దనకెహరిలబ్ధ మగునట్టి♦జననమహిమ, వానికేమిటఁ గొదువెన్న♦వశమెభూప. 4.

అ॥ భూప – ఓ పుడమిఱేఁడా, హరిలబ్ధము – నారాయణునివలనఁ బొందఁబడినది, అగునట్టి జననమహిమన్ – అయినటువంటి పుట్టువుయొక్క గొప్పతనముచేత, ద్రుహిణాననోదయంబు – బ్రహ్మదేవునియొక్క ముఖములవలననుత్పన్నము, అగునాఁటికోదువన్ – అయినట్టి యప్పటిలోతక్కువను, తీర్చుకొనుటకొఱకన్ – చక్కఁబఱచుకొనుటకు, వచ్చెనన్ – వచ్చెనేమోయనునట్లు, వేదముల్ – ఋగ్యజుస్సామాథర్వణములను వేదములున్, ఇచట ‘కొదువలైతీరుటకొఱకువచ్చె’ నని వ్రాఁతప్రతి. వానివెనువెంటన్ – ఆవేదములవుమిక్కిలి వెంబడిగా, అంటుమన్ తాఁకుచు. సందియంబులు – సంశయములను, తీర్చుకొందుము – సరిచేసికొనియెదము, అంచున్ – అనుకొనుచు, వచ్చెనో – వచ్చినవేమో, అనఁగను – అనునట్లుగా, శాస్త్రములును – తర్కవ్యాకరణాది శాస్త్రములును, వానివీఁకనె – ఆశాస్త్రములవలెనే, సంశయాంశములు – సందేహములుగలభాగములు, వీడన్ – విడిపోవుటకు, వచ్చెనౌరా – వచ్చినవిసుమా, అనన్ – అనుకొనునట్లు, పురాణములును, మత్స్యకూర్మవరాహాద్యష్టాదశ పురాణములును, అనఁగాఁ బూర్వపుకథలును, పురాణమున కైదు లక్షణములు. ‘పురాణంపంచలక్షణమ్’ అవియేవియనఁగా ‘సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ, వంశానుచరితం చేతి లక్షణానాం తు పంచకమ్’ అ. వరగుణప్రౌఢిమ. వరగుణ – శ్రేష్ఠమయిన యభ్యాసముతోఁగూడిన, ప్రౌఢిమ – నేర్పు, ఇచట ఇమనిచ్ప్రత్యయము మృగ్యమనునామనోక్తిననుసరించి శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు తమ శృంగారనైషధవ్యాఖ్యానమున దీనిని ప్రయోగాసర్వ్హముగా భావించియుండిరి. ‘ని. ప్రౌఢిమ’ సం. వి న్. నేర్పు. (రూ. ప్రౌఢిమము) శ. ర. మఱియు ‘ని. ప్రౌఢి. సం. వి అ. స్త్రీ’ ప్రౌఢిమ. సం. వి. న్. పుం. ప్రౌఢిమము. సం. వి. అ. పుం. సామర్థ్యము. అం. వాచ. శబ్దార్థచంద్రికయందును శబ్దరత్నాకరమున నున్నట్లేయున్నది. సంస్కృత ప్రయోగములును గలవు. ఉదా. “ఇంధానే భవవీతిహోత్రనివహే కర్మౌఘచండానిల, ప్రౌఢిమ్నా బహుళీకృతే నిపతితం సంతాపచింతాకులం, మాత స్మాం పరిషించ కించి దమలైః పీయూషవర్షై రివ, శ్రీకామాక్షి తవ స్మితద్యుతికణై శ్శైశిర్యలీలాకరైః” మూక. ఇట్లుండుటచేతనే కవిసార్వభౌముఁడు ‘శో. సత్కారంబొప్పఁగ గారవించి పలికెన్ ♦ గంభీరవాక్ప్రౌఢిమన్’ అని శృంగారనైషధమునందును ‘మ. దరహాసంబుల భ్రూలతానటనచే ♦ తన్ విభ్రమప్రౌఢిమన్“ అని హరవిలాసమునను బ్రయోగించియుండెను. రామరాజభూషణుఁడును “శా. నిర్వక్రప్రౌఢిమ విన్నవింతు నని వా♦గ్వైచిత్రితో నిట్లనున్” వసు. పెద్దనామాత్యుఁడును “మ. నాళీకపత్త్రాక్షులు;త్సవతుప్పన్ విహరించుచున్ సరసవా ♦ చాప్రౌఢిమల్ మీఱఁగన్” మను. ప్రయోగించియున్నారు. తత్ప్రబంధవ్యాఖ్యాతలును వానినంగీకరించియేయుఁడిరి. తావచ్చి – తానువచ్చి, ప్రౌఢగాఁదలఁచెన్ – యౌవనముగలదియగుట కాలోచించెనేమో, అనఁగన్ – అనునట్లు, చదువన్ – పఠించుటకును, చూడన్ – చూచుటకును, వినన్ – వినుటకును, మదికోదువునంత – మనస్సునకుసమృద్ధియగునంతటి, వేద శాస్త్ర పురాణాదివిద్యలు, వేద – చతుర్వేదములును, శాస్త్ర – షడ్శాస్త్రములును, పురాణ – అష్టాదశపురాణములును ఆది –

మున్నగాఁగల, విద్యలెల్లన్ - సమస్తమయినవిద్యలును, తనరెన్ - ప్రకాశించెను, వానికిన్ - ఆనిరంకుశునకు, ఏమిటన్ - ఎందునను, ఇదిదేశ్యము. 'సూ. అంద్వాదీనాంశక్తిమన్మాత్రతాఽపి క్వచిదిష్యతే'' అథ. కొదువ - తఱుగు, వెలితి, ఎన్నవశమె - ఎంచుటకుఁదరమగునా, 'వానికేమిటఁగొదు వెన్నవశమె' అనుటకు 'సూ. అప్రష్టార్థోఽపిసాధు స్స్యాద్యద్యచేతస్సుఖావహః' అథ. ఆనిరంకుశునకు విద్యలన్నియు నప్రయత్నముగనే లభించె ననుటకు ''జలే తైలం ఖలే గుహ్యం పాత్రే దానం మనాగపి, ప్రాజ్ఞే శాస్త్రం స్వయం యాతి విస్తారే వస్తుశక్తితః'' చాణ. 'వేదముల్...... వచ్చె' ఇచట నుత్ప్రేక్షాలంకారమును, 'వానికేమిటఁ గొదు వెన్నవశమె' అనుటచే నతిశయోక్త్యలంకారమును.

తా॥ ఓరాజా: అతఁడు విష్ణువరమువలన జన్మించినవాఁ డగుటచేతనే బ్రహ్మదేవునిముఖమునఁ బుట్టినలోకమ్ములను జక్కఁబఱచుకొనుటకు వచ్చినవేమో? యనునట్లు వేదములును, వానిని వెంబడించుచు సంశయములను దీర్చుకొనవచ్చినవేమో? యనునట్లు శాస్త్రములును, వానివలెనే సందేహములను దొలఁగించుకొనఁదలఁచి పురాణములును వచ్చినవి. వానికిఁ దగినట్లు విద్యాభ్యాసము యొక్క నేర్పుకూడ వచ్చి యుక్తవయస్సు కలదయ్యెనేమో? యనునట్లు చదువుటకును, జూచుటకును, వినుటకును, మనస్సున కానందము కలుగునట్లు సమస్తవిద్య లతనియం దుండెను.

క॥ అదిగనుక నన్నివిద్యలు, పదఁపడి చతురత్వ మొందె ♦ బాల్యమునందే
మొదల హరిమహిమ వానికిఁ, బిదపన్ హరిజన్మబలము ♦ పెనఁగొనె నటులన్. 5.

అ॥ అదిగనుకన్ - అటులయియుండుటవలన, బాల్యమునందే - చిన్నతనముననే, అన్ని విద్యలు - సమస్తమయినవిద్యలును, పదఁపడి - తరువాత - చతురత్వము - నిపుణతయును - నేర్పరితనమును, ఒందెన్ - పొందెను, కలిగెను, వానికిన్ - ఆనిరంకుశునకు. అటులన్ - అప్రకారముగా, మొదలన్ - ప్రథమమున, హరిమహిమ - విష్ణుమూర్తియొక్క మాహాత్మ్యమును, పిదపన్ - అటుపిమ్మట, హరిజన్మబలము - గతజన్మఫలమును, వ్యు. హరతీతిహరిః. అనఁగా హరింపబడిన జన్మమనుట. పెనఁగొనెన్ - చుట్టుకొనెను, విద్యలభించుటకు మార్గములు. ''గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా, అథవా విద్యయా విద్యా చతుర్థో నోపలభ్యతే'' అని చెప్పఁబడియుండుటచేత నతనికి గతజన్మసంస్కార మనియేనిశ్చయాభిప్రాయము. ''జన్మజన్మ య దభ్యస్తం'' అని స్మృతికారుని వాక్యము.

తా॥ అతఁడు విష్ణువరమువలనఁ బుట్టుటచేతనే చిన్నతనమునందే సమస్తవిద్యలును. చాతుర్యమును, లభించినవి. వానికి మొదట విష్ణుమహిమయును, వెనుక గతజన్మఫలమును బెనవైచికొనినవి.

చ॥ ఉడుపతిజూట జూట సరి♦దుద్యదభంగతరంగనిస్వనా
జడిమ పరాభవిష్ణుతర♦శబ్దసమగ్రత నాఱుశాస్త్రముల్
తడయ కుపన్యసింప విబు♦ధప్రకరంబులు వచ్చి సందియం
బడుగనివాఁడు ధీకృతికి♦నర్హుఁడె యేరు ధరాతలంబునన్. 6.

అ॥ ఉడుపతి........సమగ్రతన్. ఉడుపతి—నక్షత్రములకు రాజయినచంద్రుఁడు; జూట-జడగలవాఁడయిన శివునియొక్క, జూట-జడముడియందుఁగల, సరిత్-ఆకాశగంగా ప్రవాహము యొక్క, ఉద్వృత్-ఒప్పుచున్న, అభంగ-నాశనములేని ఎడతెగని, తరంగ-అలలయొక్క, నిస్వన-ధ్వనితోఁగూడిన, అజడిమ-వేగమును, ఇచట 'అజడిమ—గట్టితనమును, అనియుఁజెప్ప వచ్చును. 'జడిమ, శబ్దమునుగూర్చి 'సూ॥ వర్ణదృఢాదిభ్యఃష్యఞ్చ, సిద్ధాం, పరాభవిష్ణుకర-తిర స్కారము చేయుచున్నదియైన, శబ్ద= శాస్త్రశిక్షితమైన వాక్కులయొక్క, సమగ్రతన్—సంపూర్ణము చేత, అఖిలశాస్త్రతతుల్—షడ్శాస్త్రములను, తడయక-ఆలస్యముచేయక, ఉపన్యసింపన్ - విస్తరించి చెప్పుచుండఁగా,ఇచటసంధినిగూర్చియుదా "చ.అపరిమితానురాగసుమనోలసయై చిగురాకు చేతులం, దపసిని గౌఁగిలించుటుచితంబెకదాయనవల్వ రంభయున్" స్వా.చ. విబుధప్రకరంబులు-తెలిసినవారి యొక్క-సమూహములు,'ని॥ప్రకరఃకీర్ణపుష్పాదౌసంహతౌ,'హేమ.వచ్చి-ఏతెంచి, సందియంబున్-ఒక సంశయమును, అడుగనలేరు-ప్రశ్నింపఁజాలరు, ధీకృతికిన్—అతనితోఁ దర్కించుటకు, ధరాతలంబు నన్-ఈభూమియందు, ఏరున్-ఎవ్వరైనను, అర్హులె=తగుదురా. అనఁగానెవ్వరును లేరనుట. ఇచట 'అర్హులె, యనుటకు "సూ.ఏవాతౌప్రశ్నలక్షణౌభవతః" నన్న. ఇందుసంశయములనే యడుగువారు లేరుతర్కింప నెవరుసమర్థులనుటచేతఁ గావ్యార్థాపత్త్యలంకారము. "ఏకస్య వస్తునో భావా ద్యత్ర వస్త్వన్య దాపతేత్, కైముత్యన్యాయతః సా స్యా దర్థాపత్తి రలంక్రియా" ప్రతా. 'క॥ వరుస నొకానొకవస్తువు, గిరికొన వస్త్వంతరంబుకిముతన్యాయము, స్ఫురితంబై చనుదేఁగ, ధర నర్థాపత్తి యయ్యె" నరస. 'జూటజూట - అభంగతరంగ, అనుప్రాసాలంకారమును. 'గంగానదీ వేగమును ధ్వనిని బరాభవించునంతటి శీఘ్రముగను శబ్దజాలముతోను, ఉపన్యసించెను, అనుటచేత నుపమా లంకారమును. "స్పర్థతే జయతి ద్వేష్టిద్రుహ్యతి ప్రతిగర్జతి, ఆక్రోశత్యవజానాతి కదర్థయతి నిందతి, తస్య చానుకరోతీతి శబ్దాః సాదృశ్యవాచకాః, ఉపమాయా మిమే ప్రోక్తాః. కవీ నాం బుద్ధిసౌఖ్యదాః" దండి.

తా॥ శివునితలనుండి ప్రవహించుచున్న యాకాశగంగయొక్క యెడనితెగని యలలతోఁ గూడినవేగమువలె షడ్శాస్త్రముల నుపన్యసించుచుండఁగాఁ బెద్దలనేకులు వచ్చి వినుచుందురేకాని యిచ్చట నొకసందియంబు కల దనిప్రశ్నించువా రొక్కరును లేరు. ఇఁక నీభూమియం దతనితోఁ దర్కింపఁ దగినసమర్థులెవరు గలరు.

క॥ ఈరీతి నతఁడు విద్యా, పారీణత సంగ్రహించి ♦ బాల్యమునందున్
చారుతరకీర్తి దిక్కుల, నారూఢిగఁ బర్వఁజేయు ♦ నాసమయమునన్.　　7.

అ॥ అతఁడు-ఆనిరంకుశుఁడు, బాల్యమునందున్-చిన్నతనమునందే, ఈరీతిన్-ఈవిధమున, విద్యాపారీణత-విద్యలయొక్క పారంగతత్వము. ఆవలిదరివఱకు ననుట. సంగ్రహించి-తెలిసికొన్న వాఁడై, చారుతరకీర్తి-ప్రశంసింపఁదగినకీర్తిని, ఇచట కీర్తినిగురించి 'దానాదిప్రభవా కీర్తిః శౌర్యాది ప్రభవం యశః, మాధవి. (రాధాకాంతధృతము) దిక్కులన్-దిశలయందు, ఆరూఢిగన్—నిశ్చయము గాఁగ, పర్వఁజేయన్-వ్యాపించునట్లు చేయఁగా, ఆసమయమునన్- అట్టికాలమున,

తా॥ అనిరంకుశుం డిట్లు చిన్నతనము నందే సంపూర్ణవయిన విద్యను సంపాదించి తనకీర్తి దిశలెల్ల నిండింపఁజేయ నయ్యెను.

ఉ॥ భూవలయంబునం గలుగు ♦ భూసురసంఘము లేగుదెంచి వి
ద్యావిభవంబుఁ జూచి యితఁ ♦ డంబురుహాసనమూర్తి గాక భూ
దేవకుమారుఁడే యని మ ♦ దిం దలపోయఁగ నంతలోఁ బలన్
యౌవన మంకురించె నసు ♦ ధాధిప విప్రకుమారమూర్తికిన్. 8.

అ॥ వసుధాధిప – సింహళనృపాలుఁడా, భూవలయంబునన్ – ఈయవనీచక్రమునందు, కలుగు భూసురసంఘములు – ఉన్నట్టి బ్రాహ్మణులయొక్క – సమూహములు, ఏగుదెంచి – వచ్చి, విద్యావిభవంబున్ – అతనికిఁగల విద్యయొక్క – సమృద్ధిని. చూచి – వీక్షించి, కనుఁగొని, ఇతఁడు – ఈ నిరంకుశుఁడు, అంబురుహాసనమూర్తిగాక – బ్రహ్మదేవుఁడుగాక. భూదేవకుమారుఁడే – బ్రాహ్మణునికొడుకా, అని – ఈప్రకారముగా, మదిందలపోయఁగన్ – వారివారి మనస్సులలో నాలోచించుకొనుచుండఁగా, అంతలోపలన్ – అకాలమునకులోఁగా, విప్రకుమారమూర్తికిన్ – శ్రేష్ఠుఁడయిన యాబ్రాహ్మణసుతునకు. ‘ని॥ చూడాకర్ణటంకి శ్రేష్ఠస్సంయాత మతాళియన్త్రియః’’ అ. ‘సూ. లింగస్థేదోభవేదిష్ట ఉన్నోహేయదివ రుచిః’’ అధ. యౌవనము – పదియాఱేండ్లవయస్సు, మంచిప్రాయము. అంకురించెన్ – పొడచూపెను. ఇందు ‘ఇతఁ డంబురుహాసనమూర్తి గాక భూదేవకుమారుఁడే, ఇట్లుపమేయ మసత్యము చేసి యుపమానము సత్యముగా నిలుపఁబడుటచేత నపహ్నవాలంకారము. “ప్రకృతం య న్నిషిధ్యాన్యత్, సాధ్యతే సా త్వపహ్నుతిః’’ కా. ప్ర. “క. ఉపమేయము గాదని యిది, యుపమానమె యనఁగ నెంతయు నపహ్నవమౌ’’ కా. సం.

తా॥ ఈప్రపంచమున నున్న బ్రాహ్మణు లందఱును వచ్చి యతనివిద్యాసంపత్తినిఁ జూచి కేవలము బ్రహ్మదేవుఁడే ట్లవతరించియుండును గాని యితఁడు బ్రాహ్మణకుమారుఁడు కేవలమాత్రము కాఁ డనుకొనుచుండ నింతలో నావిప్రసుతునకు యౌవన మంకురించెను.

—: నిరంకుశుని యౌవనారంభము :—

సీ॥ బాల్యసంపూర్ణభావంబు ♦ పాయఁబోయఁ, దరుణయౌవనలక్ష్మి ♦ నర్తనముసూపె
నధికతర మైనతెర దీసి ♦ యంతలోనె, చిత్రరముఁ జూపుపాతర ♦ సత్తె వోలె. 9.

అ॥ బాల్యసంపూర్ణభావంబు. బాల్య–చిన్నతనముయొక్క, సంపూర్ణ–నిండారిన, భావంబు–నిజమైనగుణము, ‘‘ని॥ భావస్సత్తాస్వభావాభి ప్రాయచేష్టాత్మజన్మసు’’ అ. పాయన్ పాయన్–తొలఁగుచుఁదొలఁగుచునుండఁగా, అధికతరము–అతిశయము, ఐనతెరన్–అయినట్టి అడ్డముగట్టినపరదాను, తీసినంతలోనె–ఒకప్రక్కకుఁ దొలఁగించుచుండఁగనే, చిత్రరమున్ – శృంగారచేష్టలతోఁ గూడినటనావిశేషమును, చూపుపాతరకత్తెవోలెన్ – కనఁబఱచునట్టి నాట్యస్త్రీయో యనునట్లు, ఇచట ‘పాతరకత్తెవోలె, అనుటకు ‘మా॥ క్వచి త్సాదృశ్యశబ్దస్యతదుత్కర్షే వ్యవస్థితిః, అధ. తరుణయౌవనలక్ష్మి–క్రొత్తదియైనయౌవన మనుసంపద, ‘ని. తరుణ స్స్యాద్యువా పి యూని [illegible]

పుష్పోరుబూకయోః, విశ్వ. నర్తనముసూపెన్ - నాట్యమును గనఁబఱచెను, ఇందు 'బిత్తరము, అను టకుఁదా 'వ॥ వెన్నెలపులుఁగులమొత్తంబు బిత్తరంపుంబనులకు మెత్తవడి' నీలా, ప. ఈపద్యమునఁ బాయఁబాయన్, అనుటకు 'సూ. అద్రుతానామజాదీనాం ద్విరుక్తావంత్యలోపితా, అన్యేషాంచ ద్విరుక్తౌస్యుర్భహులోపాగమాపతా'' అథ. 'తరుణయౌవనలక్ష్మి, రూపకాలంకారము, 'బిత్తరమఁ జూపుపాతరకత్తెవోలె, అను వాక్యమును గూర్పఁగా నర్తనమున కుపమానము సిద్ధించినదికనుక నుప మాలంకారము. వాక్యగతశ్రౌతి. కవి వర్ణించిన యీనాట్యమును వీథినాటకములందుఁ గననగును.

తా॥ బాల్యము యొక్క నైసర్గికస్వభావము తొలఁగుచుఁ దొలఁగుచు నుండఁగాఁ బెరఁదీయఁ గశే నాట్యముచేయు నటియో యనునట్లు యౌవనలక్ష్మియొక్క సంపద పొడసూపెను.

—() నిరంకుశుని సౌందర్యవర్ణనము ()—

సీ॥ తొలుతఁ దుమ్మెదలతోఁ ♦ దులఁదూఁగునెఱికురు, లేరీతి నుండుఁ గౌ ♦ మార వేళ
మునుపు తామరలకు ♦ మొనఁజూపు తెలికన్ను, లేవిధంబున నుండు ♦ యౌవనమున
మొదలఁజందురునందుఁ♦గొదువవెన్నెడునాస్య, పద్మమేగతినుండుఁ♦బ్రాయమునను
మున్ను బంగారుపెం ♦ పుహసించు దేహమే, వైఖరి నుండు మే ♦ ల్వాయసునందు

తే॥ నీవె తలపోసిచూచుకొ ♦ మ్మావివేక, శీలు నే వర్ణనముసేయఁ ♦ జాల వాని
మహితసౌందర్యలీలల ♦ మన్మథుండు, యక్షరాజాత్మజుండుజ ♦ యంతుఁడందు. 10.

॥ తొలుతన్ - మొదట. తుమ్మెదలతోన్ - తేంట్లసమూహముతో, తులఁదూఁగునెఱికురులు - సమానమగుచున్న తలవెండ్రుకలు, కౌమారవేళన్ - వయస్సువచ్చినప్పుడు, ఏరీతినుండున్ - ఏవిధముగా నుండును, ఇది ప్రశ్నార్థకము. నాలుగుపాదములనుఁనిట్లే. మునుపు - పూర్వము, తామరలకున్ - తెల్ల దామరపువ్వులకు, మొనఁజూపుతెలికన్నులు - కొననుగనిపింపఁజేయునట్టి స్వచ్ఛమైననేత్రములు, యౌవనమునన్ - ప్రాయమువచ్చినప్పుడు, ఏవిధంబునన్ + ఉండున్ - ఏతీరుగానుండును, మొదలన్ - ఆదియందు, చందురునందున్ - పూర్ణచంద్రునియందు, కొదువలు - లోపములను, ఎన్నెడు + ఆస్య పద్మము - ఎంచుచున్న కమలమువంటిముఖము, 'సూ॥ తద్ధర్మప్రథమేస్యాత్తాం డుడివర్ణౌచనాంతకౌ దోస్తుతేదకతాపిస్యాదితికేచిదీరితమ్'' అథ. ప్రాయమునను - ఈడువచ్చినసమయమున, ఏగతి నుండున్ - ఏలాగుననుండును. మున్ను - క్రిందటికాలమున, బంగారుపెంపున్ - శ్రేష్ఠమైన సువర్ణము యొక్క గౌరవమును, ఇచట 'బంగారు, శబ్దము నిత్యైకవచనాంతము. 'సూ॥ లోహవాచకశబ్దములును, ప్రౌ. వ్యా. హసించుదేహము - గెలిచేయునట్టియొడలు, మేల్వాయసునందున్ - మంచి తరుణావస్థయందు, ఏవైఖరినుండున్ - ఏక్రమముననుండును, నీవె - ఒకరుచెప్పకుండ నీయంతటనీవే, తలపోసిచూచు కొమ్ము - ఆలోచించి పరిశోధించుకొనుము, అవివేకశీలున్ - తెలివితోఁ గూడినస్వభావముగలవాఁడైన యానిరంకుశుని, ఏన్ - నేను, వర్ణనముచేయఁజాలన్ - గుణలక్షణాదులను విమర్శించిచెప్పుటకు నాకు శక్యముగాదు, మహితసౌందర్యలీలలన్. మహిత - ఎక్కువైన, సౌందర్య - చక్కఁదనముయొక్క, లీలలన్ - రీతులచేత, వానిన్ - అతనిని, మన్మథుండు - విష్ణువుకొడుకగు మన్మథుఁడనియును, యక్ష రాజాత్మజుండు - కుబేరునియొక్క సుతుఁడగు నలకూబరుఁడనియును, జయంతుఁడు - ఇంద్రునికుమాఁ

రుఁడగు జయంతుఁడనియును, అందుఁ జెప్పదును, ఇందు 'అవివేకశీలు సేవర్ణమునముసేయఁజాల, ననుటచేత నతిశయోక్త్యలంకారమును 'మహితసౌందర్యలీలల మన్మథుండు, యక్షరాజాత్మజుండు, జయంతు, 'డందు' అనుటచేత నపహ్నవాలంకారమును. 'క॥ ఉపమేయము గాదనియిది, యుప మానమెయనఁగ నెంత॰యునపహ్నవమా' కా. స౦. ఇచట సౌందర్యమునఁ బ్రసిద్ధినొందినవారలలో శ్రేష్ఠులను విచారించుట ముఖ్యమైయున్నది. "ఉ॥ ఇందునిభాస్య వాఁ డనఁగ॰నింద్రుఁడో, చంద్రుఁడో, యాయుపేంద్రుఁడో, స్వా. మ. ఇందు ఇంద్రుఁడు చంద్రుఁడు విష్ణువు యీమువ్వురు వర్ణింపఁబడినారు. మఱియు 'శ॥ చంద్రుడో యుపేంద్రుఁడో కఁతుఁడో జయంతుఁడో యని సంశయం బందుచు, శృం॥ నై॥ ఇచట నిరంకుశుఁడు తరుణవయస్వి కావున వయోధికులగు నింద్రచంద్రో పేంద్రుల మాని సమానవయస్కులగు మన్మథజయంతనలకూబరాదులను బోల్చుటయుక్తమని కవిభావము.

తా॥ బాల్యముననే తుమ్మెదలతో సమానమైనకురులును, తెల్లతామరపువ్వులకు వన్నెదరే దని చూపించునట్టి స్వచ్ఛమైననేత్రములును. చంద్రునియందుఁ గళంకముగల దని నిందించునట్టి పద్మమువంటిముఖమును, సువర్ణముయొక్క కాంతిని బరిహసించునట్టి దేహమును, గల యానిరంకుశుఁడు యౌవనదశయం దెట్లుండునో వర్ణింప నాతరము గాదు. నీవే యాలోచించుకొనుము. అతనిని జక్కఁ దనమున మన్మథుఁడనియు, నలకూబరుఁడనియు, జయంతుఁడనియుఁ, జెప్పదును.

ఉ॥ ఆతరుణావనీసురుఁ డొ॰ కప్పుడు వీథికిరా విలాసినీ
 వ్రాతకఠోరధైర్యకుధ॰ రంబులు తుత్తుమురై చనం దయా
 ర్ద్రేతరవృత్తి నేయు నతఁ॰ డింటికిఁ బోవ నిరస్తచాపుఁడై
 చేతులు తీయఁగా మరుఁడు॰ సెజ్జపయిం బడు భూవరోత్తమా. 11.

అ॥ భూవరోత్తమా — రాజులలో శ్రేష్ఠుఁడయినవాఁడా, ఆతరుణావనీసురుఁడు — యౌవన వంతుఁడయిన యాబ్రాహ్మణుఁడు, ఒకప్పుడు — ఒక్కసమయమున, వీథికిరాఁ — బజారునకు రాఁగా. మరుఁడు — మన్మథుఁడు, విలాసినీవ్రాతకఠోరధైర్యకుధరంబులు. విలాసినీవ్రాత — శృంగా రచేష్టలుగల స్త్రీలసమూహముయొక్క, కఠినమైన — గట్టియైన, ధైర్యకుధరంబులు — ధీరత్వమనెడి పర్వతములు, 'ని. గోత్రా కుః పృథివీ పృథ్వీ' అ. భూపర్యాయశబ్దములతో 'ధ్రః. భృతోధర' ఈశబ్దములుచేరినపుడు పర్వతమున కర్థమగును, తుత్తుమురై చనఁ — పిండిపిండియైపోవునట్లు, దయా ర్ద్రేతరవృత్తిఁ. దయార్ద్రి — దయారసమునకును, ఇతర — వేఱయిన, వృత్తిఁ —వ్యాపారముతో. అనఁగా నిష్కారుణ్యముతోననుట. 'ని. ఆర్ద్రం సార్ద్రం క్లిన్నం తిమితం స్తిమితం సమున్న ముత్త్రంచ' అ. ఏయుఁ — ప్రయోగించును, అతఁడు — ఆనిరంకుశుఁడు, ఇంటికిఁ — తనగృహమునకు, పోవఁ — పోయినతోడనే, నిరస్తచాపుఁడు — త్రోసివేయఁబడిన ధనువుగలవాఁడు, ఐ — అయి, 'ని. ప్రత్యా దిష్టో నిరస్తః స్యా త్ప్రత్యాఖ్యాతో నిరాకృతః' అ. చేతులుతీయఁగాఁ—చేతులునొప్పిపుట్టఁగా, సెజ్జ పయిఁ పడుఁ — అలసటనొందినవాఁడై తనశయ్యమీఁదఁ బడియుండును, ఈపద్యమున 'ఇంటికిఁ' అనుటకు 'సూ. ఔపవిభక్తికసంజ్ఞా వర్ణా ష్టింట్యాదయో భవన్తీహ రుల్యాదే ర్నామ్నాం స్యు స్తే హి విభక్తౌ సమానే చ' నన్న. 'చనందయార్ద్రేతర' అనుచోట ద్రుతము పూర్ణబిందువగుటకు 'సూ. అలుకిచసంశ్లేషస్స్యాత్ బిందుం ద్రుతవంతి తంత్వచిత్క్వచిత్" శబ్దచిం. "సూ. ఆద్యేత్యృతిరేచక

పాస్తృతీయాస్స్యుః కపేతరే, ఆద్యేతృతీయేతుర్యేచ ప్రాప్నువంతినిమిత్తతామ్'' అథ. ఇందు నాయకునియొక్క లోకోత్తరసౌందర్యాతిశయము వ్యక్తీకరింపఁబడినది. 'నిరంకుశుఁడు వీథికి రాఁగానే మన్మథుఁడు కామినీసమూహమును బుష్పబాణములతోఁ గొట్టును' అనుటచే విభావనాలంకారము. 'క. కారణము లేక కార్యము' ప్రౌఢంబైన నదివిభావన'' కా. సం. ''హేతూనా మసమగ్రత్వే కార్యోత్పత్తి శ్చ సా మతా'' కువ.

తా॥ ఓరాజా! యౌవనవంతుఁడైనయాబ్రాహ్మణుఁ డొకప్పుడు వీథికి రాఁగానే మన్మథుఁడు శృంగారచేష్టలుగలస్త్రీలను నిర్దయుఁడై తనపూవుటలుఁగులతోఁ గొట్టి యతఁడింటికిఁ బోయిన తోడనే తానును వెళ్ళి యంబులను విల్లును నొకచోటఁ బాఱవైచి యలసి శయ్యపైఁ బడియుండును.

ఉ॥ చక్కనివాఁడు నై మిగుల ♦ సన్నుతికెక్కిన యౌవనంబు నై
దిక్కులఁ బిక్కటిల్లుజగ ♦ తీసురతేజము నై తలంప నే
యక్కఱ లేనికాఁపురము ♦ నైనధరామరసూనుఁ డెంచఁగాఁ
జక్కరవింటివాని నెక ♦ సక్కెము లాడఁడె భూవరాగ్రణీ. 12.

అ॥ భూవరాగ్రణీ - రాజులలోశ్రేష్ఠుఁడవైనవాఁడా, చక్కనివాఁడు+ఐ - సౌందర్యముకలవాఁడై, మిగులన్ - అత్యంతముగా-ఎక్కువగా, సన్నుతికిన్ + ఎక్కిన + యౌవనంబున్ + ఐ - పొగడ్తకువచ్చిన యెలజవ్వనముకలవాఁడై, దిక్కులన్ - అన్నిదిశలయందును, పిక్కటిల్లు - నిండునట్టి, జగతీసురతేజమున్ + ఐ - ఆబ్రాహ్మణునియొక్క ప్రకాశముకలిగి, తలంపన్ - కోరుటకు, ఏయక్కఱ - ఏమియవసరమును, లేని కాఁపురమును + లేనట్టి సంసారస్థితికలిగి, అనఁగా సమస్తము కలిగియనుట, ఐనధరామరసూనుఁడు - అయినట్టి బ్రాహ్మణుని కొడుకైన యానిరంకుశుఁడు, 'ఐన విలాసవిభాసమానతన్, అనియొకపాఠము. చక్కరవింటివానిన్ - తియ్యవిల్కాఁడయినయామన్మథుని, ఎకసక్కెములు + ఆడఁడె - అపహాస్యములుపలుకఁడా, అనఁగా సొగసు, లేఁబ్రాయము ప్రఖ్యాతి, సంపద, మున్నగునన్నిటియందు లేశమైనను గొఱఁత లేనియట్టివాఁడు మన్మథునిసైతము వేళాకోళము లాడుఁడాయనుట. ఇచట 'దిక్కులఁ బిక్కటిల్లు జగతీసురతేజము, అని తెలుఁగును సంస్కృతమును కలిపి సమాసముచేయుటకు 'సూ॥ స్వస్వవిభక్తి వికారైశ్చ బహవశ్చ యథా తథమ్ సమస్యన్తే'' శబ్దచిం. 'అమరసూనుఁ, డనుసాధర్మ్యముచేత సమాసగతపూర్ణార్థి. ''శ్రౌత్యార్థీ చ భవే ద్వాక్యే సమాసే తద్ధితే తథా'' కా. ప్ర. 'మఱియు సుందరుఁడును, యౌవనవంతుఁడును, ఇత్యాదులచే సముచ్చయాలంకారము. 'క॥ పాయక ఖలేకపోత, న్యాయమున ననేక కారణము లొకకార్యం, బేయెడ సాధింపఁగ నుత, మై యపరసముచ్చయాఖ్య మగు'' కా. సం. 'తత్సిద్ధిహేతా వేకస్మిన్ యత్రాన్య త్తత్కరం భవేత్, సముచ్చయో౽సౌ'' కా. ప్ర. ''కుల మమలినం భద్రా మూర్తి ర్మతిః శ్రుతిశాలినీ, భుజబల మలం స్ఫీతా లక్ష్మీః ప్రభుత్వ మఖండితం, ప్రకృతిసుభగా హ్యేతే భావా అమీభి రయం జనో, వ్రజతి సుతరాం దర్పం రాజం స్త ఏవ తవాంకుశాః''ర. గం.

తా॥ ఓరాజా! చక్కఁదనమును, ప్రసిద్ధిగల యౌవనమును, ప్రపంచమునం దంతట వ్యాపించిన ప్రభావమును, సంపదయును, గలిగి యెందును నేమాత్రమున కొఱఁతలేని యానిరంకుశుఁడు మన్మథునిఁ దిరస్కరించుటలో నతిశయోక్తి యుండదుగదా.

—♦ నిరంకుశుని విటచర్య ♦—

ఉ॥ ఆరమణీయయౌవన వ♦యఃపరిపాటి నతండు వైదికా
చారముఁ గట్టిపెట్టి బహు♦ శాస్త్రపురాణపరిశ్రమంబు ని
స్సారముగాఁ దలంచి విట♦ చర్యకుఁ జిత్తముఁ జేర్చె దుష్క్రియా
శూరత కిట్టివార లెడ♦ సొచ్చుటఁ గంటిమొ వింటిమో నృపా. 13.

అ॥ నృపా – ఓరాజా, అతండు – అనిరంకుశుఁడు, ఆరమణీయ.................పాటిన్. ఆ–అదియొక్క, రమణీయ – మనోహరమైన, ‘ని॥ వల్గు వామం హారి శాలి రమణీయం మనోరమమ్,’ అ. యౌవనవయః – ప్రాయపువయస్సుయొక్క, పరిపాటిన్ – బుద్ధిపూర్వమున, అనఁగాఁ బదియా రేండ్లు మిగిలినవయస్సుయొక్క చక్కఁదనము వలన ననుట. వైదికాచారమున్ – వేదసమ్మతమైన మంచిప్రవర్తనమును, కట్టిపెట్టి – మూటగట్టి యొకచోటనుంచి, అనఁగా నిశ్శేషముగాఁ ద్రోచివైచి యనుట. ఉదా. “చ. సు, వ్రతములు గట్టిపెట్టి గురు♦వు ప్రశంసలు బిట్టెఁబుచ్చి” విష్ణుపు. బహు శాస్త్రపురాణపరిశ్రమంబున్. బహు – అనేకములయిన, శాస్త్ర – శాస్త్రములయొక్కయు, పురాణ– పురాణములయొక్కయు, పరిశ్రమంబున్ – అభ్యాసమును, అనఁగా ననేకశాస్త్రములను, పురాణములను, బఠించునట్టి యలవాటుననుట. నిస్సారముగాన్ – సారములేనట్లు – నిరుపయోగములుగా, తలంచి – గణించి, విటచర్యకున్ – జారప్రవర్తనమునకు, చిత్తమున్ – తనయొక్క మనస్సును, చేర్చెన్ – పొందించెను, అనఁగా వ్యభిచారమున కలవడెననుట. దుష్క్రియాశూరతన్. దుష్క్రియా – చెడ్డపనులయొక్క – పాపపుకార్యములయొక్క, శూరతన్ – సాహసమునను, ఇట్టివారలు – ఇంతటిగొప్పవారు, ఎడసొచ్చుట – మధ్యప్రదేశమునఁ బ్రవేశించుట, కంటిమొ – ఎన్నఁడైనను జూచితిమా, వింటిమో–ఎప్పుడైనను వినియున్నామా, అనఁగా నెన్నఁడును గని వినియెఱుంగమనుట. ఇందు ‘కంటిమొ వింటిమో’ అనుటను “సూ. వర్గాగమో విశేషః పురుషే ష్వర్థీషు చాపి వచనేషు” నన్న. “సూ. వీరో తొవ్యతిరేకానపిసంప్రాప్తన పన్క్రియాణాం స్తు” అధ. సమస్త శాస్త్రములను జదివినవా రిట్టిదుర్వృత్తికి లోనగుట యెన్నఁడైనను గని విని యుంటిమా! అనుటచేత ససంభవాలంకారము.

తా॥ ఓరాజా ! అనిరంకుశుఁ డట్టియౌవనమున వైదికాచారము నంతయుఁ ద్రోసిపుచ్చినానా శాస్త్రపురాణపఠనము నిరుపయోగముగా నెంచి వ్యభిచారవృత్తికి నవలంబించెను. ఇంతటిప్రాజ్ఞు లిట్టిచెడుపనులకుఁ బాల్పడుట యిదివఱ కెప్పుడైనను మనము కని విని యెఱుఁగుదుమా.

క॥ రాజా! యేమనిచెప్పుదు, నాజగతీసురుని మొదలి ♦ యిల్లాలు సాధ్వీ
శ్రీజనులు రోయునప్పటి, యోజన కాశ్చర్యమయ్యె ♦ నోకపర్వతమై. 14.

అ॥ రాజా–ఓ ఱేఁడా, ఆజగతీసురుని మొదలియిల్లాలును. ఆజగతీసురుని–ప్రాయపువాఁడ యిన యాబ్రాహ్మణునియొక్క, మొదలియిల్లాలును–మునుపటిదయినవినయమునకును, ఇట్లు సమాసముచేయుటకు “సూ. స్వ స్వ విభక్తివి కారైశ్చ బహువశ్చ యథాతథం సమస్యస్తే” నన్నథార్త్రీ

జనులు-పుడమియందుఁ గలమనజులందఱును, రోయు+అప్పటియోజనకున్ -నిందించుచున్నటు వంటియా కాలమునందలి యాసంఘటనమునకు, అప్పుడు తానుండినస్థితికిని, "ని॥ యోజన. సం. వి. అ. స్త్రీ. రూ. యోజనము. కూర్పు. (చూ. సంధానము) అం. వా. ఒకపర్వతమై-ఒకపెద్దకొండవలె మిక్కిలిభారముగలదై, ఆశ్చర్యము+ఆయ్యెన్-చోద్యము కలిగెను, ఇందు 'రోయునప్పటి, అను ప్రయోగమునకు దా "ఉ. క్రూరతకోర్చి యింమకయు•రోయక" భార. అతఁడు పూర్వ మెంతటి యున్నతస్థితియం దుండెనో యిప్పు డంతనీచస్థితుఁ డయినాఁ డనుటచేఁ బర్యాయోక్త్యలంకారము. "ఏకస్మి న్య దనేకం వా పర్యాయ స్సో ఽపి సమ్మతః, అధునా పులినం తత్ర యత్ర స్రోతః పురా ఽజని" చంద్రా. "ఏకం క్రమేణా నేకస్మిన్ పర్యాయః అన్య స్తతో ఽన్యథా" కా॥ ప్ర॥

తా॥ ఓరాజా ! ఆబ్రాహ్మణకుమారుని యొక్క బాల్యదశయందలి వినయమును యుక్తవయస్సున నోవ లసహ్యపడునట్టి దుష్ప్రవర్తనమును జూడఁగా నెంతో యాశ్చర్యముగా నుండెను.

చ॥ ధరణిసురాత్మజుండు గుణ ♦ ధన్యుఁడు వీఁ డని పెద్ద లెన్న నా
దరణముతో నుతింప సము ♦ దంచితకీర్తిసమృద్ధి నంతశే
ఖర మగు నెల్ల నంతఘన ♦ కల్మషవృత్తికిఁ దెచ్చెఁ జూడుమా
పురుషులభాగ్యమున్ జిగురుఁ ♦ బోణులచిత్తము నెట్లు మాఱునో. 15.

అ॥ ధరణిసురాత్మజుండు-బ్రాహ్మణునికొడుకైన యానిరంకుశుఁడు, వీఁడు-ఈచిన్నవాఁడు, గుణధన్యుఁడు-మిక్కిలి బుద్ధిమంతుఁడు, అని పెద్దలు+ఎన్నన్-ఇట్లు తెలిసినవారు సంభాషించుకొను చుండఁగా, ఆదరణముతోన్-గౌరవముతో, నుతింపన్-పొగడఁగా - సముదంచితకీర్తిసమృద్ధిన్, సముదంచిత - మిక్కిలిప్రకాశించుచున్న, కీర్తి - యశస్సుయొక్క, సమృద్ధిన్-పరిపూర్ణత్వముతో, ఖ్యాతియొక్క యతిశయముతో, అంతశేఖరము - శిరోభూషణము:- అంతటిశ్రేష్ఠత్వము, అగుట+ఎల్లన్ - కలిగియుండుటయుఁ తయును, అంతఘనకల్మషవృత్తికిన్. అంత - అంతటి, ఘన - యెక్కువయైన, కల్మషవృత్తికిన్ - పాపపునడవడికకు, అనఁగాఁ బూర్వ మెంత యున్నతస్థితియం దుండెనో యంతనీచమైన యనుట. తెచ్చెన్ - తెచ్చిపెట్టెను-తీసికొనివచ్చెను, పురుషులభాగ్యమున్-మానవులయొక్క యదృష్టమును, అనఁగాఁ బ్రారబ్ధము ననుట. చిగురుఁబోణుల చిత్తమున్-స్త్రీలయొక్క మనస్సును, ఎట్లు మాఱునో-ఏవిధమైన విరుద్ధరూపమును దాల్చునో, చూడుమా-కనుఁగొనుము, ఇచట 'ఆ' వచ్చుటకు 'సూ. ఏదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః' నన్న. అనఁగాఁ బురుషులయొక్క ప్రారబ్ధమును యువతులయొక్క చిత్తమును బరిశీలించుట కసాధ్య మనుట. "అశ్వప్లుతం వాసవగర్జితం చ స్త్రీణాం చ చిత్తం పురుషస్య భాగ్యం, అవర్షణం చా ప్యతివర్షణం చ దేవో నజానాతి కుతో మనుష్యః" నీతి. ఇందు 'చిగురుఁబోణి' అను ప్రయోగము నకుదా. 'ఎ.గీ. మేటిరతులకు సురవాతాణి•మించుఁబోణి, శశాం. 'అగు నెల్లన్' అనుటకుదా 'చ. నా వలు విడియేలకట్టుకొన•వచ్చునె దానవి' భాగ. 'ఇండ్లిల్లను' కళా. 'ధరణిసురాత్మజుఁ' డనుటకు 'సూ. ఈదన్తా ఇద్వదేవకృత హ్రస్వాః, దీర్ఘాణాం హ్రస్వ స్స్యాత్' నన్న. "హ్రస్వో దీర్ఘసమాసేఽపి క్వచి ద్దీపః ప్రయోగతః" అథ॥ ఉదా 'చ. నదిసుతగురుకర్ణశల్య•నాగపురీశుల్, భార. అథర్వణోక్తి

యందలి యపిశబ్దముచేత సజాతములకును బ్రాహ్స్వమే యగును "ఆ. చెలువపేరుగాని • స్త్రీలింగము లను విశేషణములుగా రచించుపదము, లోకరూపయుక్తి • నుభయలింగత నెన్ను, నుష్ణయుక్క యుక్క • యుష్ణ మనఁగ" కవిచిం. ద్వితీయపాదమున నిత్యసమాసయతి చెప్పఁబడినది. 'కులకాంత సుందరియు, సుశీలయు, నైనను నిరంకుశుఁడు వ్యభిచారమునకుఁ గడంగె నను టను "ఆ. అలు రంభ యైన • నతిశీలవతి యైన, జారపురుషుఁ డేల • జాడవిడుచుఁ, బాలు ద్రాగుకుక్క • బడుగుకుఁ బాఱదా" వేమ॥ 'అంతశేఖర మగుటెల్ల నంతఘునకల్మషవృత్తికిఁ దెచ్చె, అనుటచేత. పర్యాయోక్త్యలంకారము. "క. ప్రస్తుతకార్యస్తుతిచేఁ, బ్రస్తుతకారణము దోఁపఁ • బర్యాయోక్తం, బస్తోకసుకవికావ్య, ప్రస్తుత మైచెలఁగుచుండు" నరస.

తా॥ ఆనిరంకుశునిఁ జూచిన పెద్దవా రందఱును వీఁడు చాలగుణవంతుఁ డని చెప్పుకొనునట్టి ప్రసిద్ధి యెంత లోకమున వ్యాపించినదో యంతటి నీచవృత్తికి వచ్చెనుగదా! ప్రపంచమునఁ బురుషుని యదృష్టమును, స్త్రీచిత్తమును, ఎంతవిశుద్ధరూపమును ధరించునో చూచితివా!

సీ॥ వదలునీర్కావిదో • వతులుగట్టుట మాని, వలిపెంపుఁజల్వదో • వతులు మరగె
దళముగా గోపిచం • దనము వెట్టుట మాని, తిరుమణి కొనగోర • దిద్దఁ జొచ్చె
గడితంపుమేలుప • చ్చడముగప్పుట మాని, దుప్పట్లు సోకాలుఁ • గప్పఁ దొడఁగెఁ
బ్రతివారపంచాంగ • పఠనసేయుట మాని, కొక్కోకశాస్త్రంబు • గొణఁగఁదిపె

తే॥ బ్రహ్మకులవర్యసాహచ • ర్యంబు మాని, చేరి కాముకసంసర్గ • సేయఁ బూనె
సమిధలకు నేడకేడ కే • జనుట మాని, పోఁడిగ నెఱ్ఱలంజమం • దులకుఁ దిరుగ. 16.

అ॥ వదలునీర్కావిదోవతులు. వదలు - గట్టిలేనట్టి గట్టికానివి, నీర్కావిదోవతులు - నీళ్ళలో నానబెట్టియుతుకుటచేతఁ గొంచెము మట్టిదాఁపులుగలిగి కట్టుకొనెడి వస్త్రములు, కట్టుటమాని - ధరింపక విడిచి, వలిపెంపుఁజల్వదోవతులు - చలువఁజేసియుడికి మడతలుపెట్టఁబడిన సన్ననివస్త్రములను, మరగెన్ - కట్టుకొనుటకలవాటుపడెను, అసహ్యంపుయ్యవనియుఁ జెప్పవచ్చును. ఉదా. 'క. ఎలమి మెయిన్ మరగి నోక్క • యీడిగదానిన్, భద్ర. ఇచట. 'వలిపెము. వలిపె - వలిపము, అని మూఁడురూపములుగలవు. దళముగాన్ - మందముగా, గోపిచందనము - పసుపు కావిరాయిచాదినగందమును, పెట్టుటమాని - మొగమునఁ బూసికొనక పరిత్యజించి, తిరుమణి - తిరుమణిచూర్ణమును, కొనగోరన్ - గోటియొక్క చివరతో, దిద్దన్ + చొచ్చెన్ - సన్నగా నవరించుటకు మొదలుపెట్టెను, గడితంపు మేలుపచ్చడము - మడుగుగలిగిన చిత్రలేఖనము గలముప్పటి, ఇది పండితులు మున్నగువారు పైనవేసి కొందురు, గడితమునకు ఉదా. "సీ. గడితంపుమెలుఁగుతోల్ • కప్పినవో ప్పారు, బలుతేజ వేయిమా • వులు వహింప" హరివం. పచ్చడము ప్రచ్ఛదశబ్దభవము. కప్పుటమాని - అచ్ఛాదనముచేసికొనక విడిచి, దుప్పట్లు - ఉత్తరీయములును, ఇది ద్విపటీశబ్దభవము. సోకాలు - చిన్నకండువాలను. అనఁగాఁ జదరముగా నుండుతుండుగుడ్డలు. ఇచట 'చోకములు' సోకాలనుటకు "సూ॥ అసంయుక్తాథవేద్వాపుర్వస్త్రీయాం ల్యాదివర్ణకే, ప్రాయశో వైకృతపదేలోపోదీర్ఘశ్చ మోరతః" అథ. కప్పన్ + తొడంగెన్ - ఒడలిపైఁ గప్పికొనసారంభించెను, ప్రతివారపంచాంగపఠన. ప్రతివార - నిత్యమును, పంచాంగపఠన - పంచాంగ

మును జదువుట, చేయుటమాని-ఆచరింపక విడిచి, కొక్కోకశాస్త్రంబుఁ - రతిరహస్యములను దెలియఁజేయునట్టి కామశాస్త్రమును, గొణఁగఁ + దివిరెఁ-శృంగారవికార మగపడునట్లు చదువ నారంభించెను, 'గొణఁగనేర్చె' అనిపాఠాం. బ్రహ్మకులవర్యసాహచర్యంబుఁ. బ్రహ్మకులవర్య-బ్రాహ్మణవంశమున శ్రేష్ఠులైనవారియొక్క, సాహచర్యంబుఁ-కూడి తిరుగెడి మైత్రిని, మాని-వదలి, చేరి-సమీపించి, కాముకసంసర్గ-సంభోగేచ్ఛ గలపురుషులతోడి సంబంధమును. "ని. విలాసీ కాముకః కామీ స్త్రీపరో రతిలంపటః" శబ్దా. చేయఁ + పూనెఁ - చేయనుద్యుక్తుఁడయ్యెను, సమిధలకుఁ - వేలిమికి వలయుపుల్లలకు, "ని. ఇంధనం త్వేధ ఇధ్మ మేధ స్సమిత్ స్త్రియాం" అ. ఏడకేడకేఁ-ఎక్కడికెక్కడికైనను, 'ఏడ' యను శబ్దమునకుదా 'ఉ. ఎక్కడియజ్ఞకర్మ మిఁక నెక్కడియాన్వళి యేడజీవనం, బెక్కడికెక్కడంచు" విష్ణుపు. "ఏనేడ నింద్రాదులేడ" భార, చనుట-పోవుట, మాని-[illegible]డినవాఁడై, ఏప్రొద్దుఁ-ఎల్లప్పుడును, లంజమందులకుఁ- స్త్రీవశీకరణౌషధులకు, అనఁగా మందుచెట్లకనుట తిరుగఁ-సంచరించుటకు, తొడఁగెఁ-ప్రయత్నించెను, 'దోవతులుకట్టుట' ఇట్టివోట్ల ద్వితీయకుఁ బ్రథమ చెప్పఁబడినందున "సూ. ఇతరత్ర చ ద్వితీయా తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్" నన్న. పద్యమంతయు స్వభావోక్త్యలంకారము. "క. సహృదయహృదయంగమ మై, మహి నున్నదియున్నయట్లమాటలచేటల్, బహుళంబులుగాఁ జెప్పిన, మహితోక్తియె జాతి యయ్యె" కా. సం.

తా. అతఁడునీరుకావిదోవతులుఁపములుగాగట్టుటమానిసన్నిచలువదోవతులుగట్టనారంభించెను. మందముగా గోపిచందనము పెట్టుటనిషేధించి సూక్ష్మముగాఁ గోనగోటితోఁ దిరుమణి పెట్ట మొదలిడెను. ముతకపచ్చడమును గప్పుటవిడిచి సన్ననియుత్తరీయములు కండువాలు వేయ నారంభించెను. నిత్యమును బంచాంగమును జదివి యొరులకుఁ జెప్పుట వదలి రతిరహస్యములను దెలియఁజేయు కామశాస్త్రములఁ జదువ నుద్యమించెను. బ్రాహ్మణులలో నుత్తములగువారితో సహవాసముచేయుట వీడి వ్యభిచారులతో సాంగత్యమున కుపక్రమించెను. నిత్యమును వేలిమికి వలయుచిదుగులకుఁ బోవుట పరిత్యజించి స్త్రీవశీకరణౌషధములకుఁ దిరుగుచుండెను.

సీ॥ అటువంటివాఁడు గాఁ ♦ డతఁ డంచుఁబరు లెంచ, నెఱుఁగరాకుండఁగఁ ♦ దిరిగితిరిగి
వినఁగలఁ డీమాట ♦ యనుచు సందేహింపఁ, గడల సంశయముగా ♦ నడచి నడచి
కాఁబోలు ననివిన్న ♦ కన్నవా రెన్న నే, ర్పునఁ గని యానలు ♦ వోయి పోయి
తప్ప దాతఁడు విట ♦ ధర్మంబువాఁ డనఁ, జతురకాముప్రవృత్తి ♦ జరపి జరపి

తే॥ చలి విడిచినాఁడునాఁటికి♦జగమెఱుంగ, నతఁడుమెలఁగంగఁదొడఁగెనొ♦రాయనంగ
శాస్త్రపారీణతాసము♦జ్జ్వలభుజంగ, తత్త్వమితనికి ఘంటాప♦థం బనంగ. 17.

అ॥ అతఁడు - అవిప్రుఁడు, అటువంటివాఁడు — అట్టి తుంటరివాఁడు, కాఁడు — కానేరఁడు, అని - ఈప్రకారముగా, పరులు - ఇతరులు, ఎంచఁ - తలంచునట్లు, ఎఱుఁగరాకుండఁగఁ - ఎవ్వరికిని దెలియనట్లు, తిరిగి తిరిగి - బహుకాలముసంచరించి, ఈమాట - ఈచెప్పికొన్న వాక్యమును, వినఁగలఁడు - వినియేమనుకొనునో, అనుచుఁ-ఇట్లూహించుకొనుచు, సందేహింపఁ- సంశయముకలుగునట్లు, కడలఁ - ప్రక్కప్రక్కలుగా - దూరస్థలయములందు, సంశయ

ముగాన్ - అనుకూలకరముగా, నడచినడచి - పెద్దకాలముప్రవర్తించి, కాన్ + పోలున్ - అయి యుండవచ్చును, అని - ఇట్లుతలంచి, విన్నకన్నవారు - వినినవారును చూచినవారును, ఎన్నన్ - గణింపఁగా, నేర్పునన్ - సమర్థతతో కని - వీక్షించి, అనలు + పోయిపోయి - శపథములఁజే యుచుఁ జాలకాలము గతింపఁజేసి, 'సూ॥ శబ్దపల్లవక్రియలు కొన్ని ద్విరుక్తంబులగుచో నుత్తరపదంబు పూర్వావయవంబునకు లోపంబు విభాషనగు." ప్రౌ. వ్యా. అన యనఁగా నొట్టుపెట్టుకొనుట. 'దేవునితోడు, మొదలగునవి. 'వివాహకాలే రతిసంప్రయోగే, ప్రాణాత్యయే సర్వధనాపహారే, విప్రస్య చార్థే హ్యనృతం వదేత, పంచానృతా న్యాహు రపాతకాని" మ. భార. "ఆ. వారిజాక్షు లందు వైవాహికములందుఁ, బ్రాణవిత్తమాన భంగమందుఁ. జటులగోకులాగ్ర జన్మరక్షణమందు, బొంకవచ్చు నఘము పొంద దధిప" భార, మానభంగము కనుక శపథమును బెట్టికొనినను దోష ములేదని తెలియుచున్నది. అతఁడు - అనిరంకుశుఁడు, విటధర్మంబువాఁడు - జారప్రవర్తముగల వాఁడు, తప్పదు - ఈమాటతొలఁగదు, నిజమేయనుట. అనన్ - అనునట్లు, చతురకాముకవృత్తి - జాణతనముగల వ్యభిచారపునడవడికను, జరపిజరపి - కాలముగతించునట్లుచేసి, అనఁగాఁగాలమును వెళ్లఁబుచ్చియనుట. నాఁటికిన్ - అదినమునకు, జగమెఱుఁగన్ - లోకమంతటికిని దెలియునట్లు, శాస్త్రపారీణతా సముజ్జ్వలభుజంగతత్త్వము. శాస్త్రపారీణతా - శాస్త్రముల నన్నింటిని దుదముట్ట నేర్చిన, సముజ్జ్వల - మిక్కిలి ప్రకాశించుచున్న, భుజంగతత్త్వము - సర్పమువంటిస్వభావము, "దుర్జనః పరిహర్తవ్యో విద్యయాలంకృతోఽపి సః, మణినా భూషితః సర్పః కి మసౌ న భయంకరః" భర్తృ. "గీ॥ విద్యచే భూషితుం డయి వెలయుచున్నఁ, దొడరివర్జింప నగుఁజుమీ దుర్జనుండు, చారుమాణిక్యభూషితశస్తమస్త, కం బయినపన్నగము భయంకరము గాదె" ఇతనికిన్ - ఈ నిరంకుశునకు, ఘంటాపథంబు - పదిబారలువెడల్పుగల రాజమార్గమో, ఘంటాపథము. "దశధన్వాంతరో రాజమార్గో ఘంటాపథః స్మృతః" కాటి. ఉదా "ఎ. సీ॥ తరుణీ నీయాన ఘంటాపథంబు మాకు" శృం. నై. అనన్ + కన్ - అనునట్లు, చలి విడిచినాఁడు-లోకు లేమనియెదరో యనుభయ మును సిగ్గును వదలినాఁడు, 'సూ. శబ్దత్ర్యపరిప్రాప్త సర్వత్రార్థోహిగృహ్యతే" అధ. "అర్థా తురాణాం నగురు ర్నబంధుః, విద్యాతురాణాం న సుఖం న నిద్రా, భోజ్యాతురాణాం నరుచి ర్న పక్వం, కామాతురాణాం న భయం న లజ్జా" నీతి. అతఁడు - అవిప్రసుతుఁడు, ఔరా - మిక్కిలి యాశ్చ ర్యపడుట. అనన్ + కన్-ఈతీరుననను కొనునట్లు, మెలఁగన్ కన్ + ప్రవర్తించుటకు, తొడఁ గెన్ - ఉద్యుక్తుండయ్యెను. ఇందు 'విన్నకన్నవా' రనుటకు 'సూ. ద్వంద్వంబునంబూర్వపదాంత్యా వయవంబునకు లోపంబొండెనగు" ప్రౌ. వ్యా. 'సూ, క్వచిత్సమాసాంతగస్య శబ్దస్యాదావ పిస్థితిః" అధ. ఉదా "విన్నకన్నది" విష్ణుపు. ఇదివిశేషణోభయపద కర్మధారయము. "సూ. ఆయాత్యాదిఘటితంబులు విశేషణోభయపద కర్మధారయంబులు." ప్రౌ. వ్యా. 'తిరిగితిరిగి' ఇత్యాది ద్విరుక్తములనుగూర్చి. 'సూ. క్వచి దర్థవిశేషేఽపున రర్థసమాగతః" అధ. ఉదా 'మ్రానిమ్రానికి నరిగితిరిగి" భార. సంస్కృతమునను "సూ. నిత్యవీప్సయోః, ఇతినిత్యార్థే ద్విర్భావః" సిద్ధాం. ఉదా. "ఖిన్నః ఖిన్నః శిఖరిషు పదం న్యస్యగంతాసి యత్ర, క్షీణః క్షీణః పరి లఘుపయః స్రోతసాం చోప భుజ్య" మేఘ. ఆటువంటివాఁడు గాఁ డతఁ డనుచోటసంధియందుఁ బూర్వస్వరమునకుఁ బరస్వరా దేశ మయినది. 'సూ. అద్యంతవర్ణయో రైక్యంసంధి రి త్యుచ్యతే బుధైః, పూర్వస్య పరరూపత్వ మత్రైవ నియతం భవేత్" అధ. స్వభావోక్త్యలంకారము. "స్వభావోక్తి రసౌ చారు యథావ

ద్వస్తువర్ణనమ్" ప్రతా. 'శాస్త్ర......బనంగ' ఉత్ప్రేక్షాలంకారము. ఇచట నిరంకుశుఁడు సంపూర్ణవిద్యగలవాఁడయ్యుఁ జ్ఞానశూన్యుఁ డయ్యె ననుటకు "పఠంతి చతురో వేదాన్ ధర్మశాస్త్రాణ్యనేకశః, ఆత్మానం నైవ జానంతి దర్వీ పాకరసం యథా" చాణ.

తా॥ లోకు లతనినిఁజూచి యతఁ డటువంటివాఁడు కా దనునట్లు కొన్నినాళ్లును ఇప్పుడు మనము చెప్పికొనుచున్న యతనిసంబంధ మయినమాటలు వినునేమో కదా యని తలంచునట్లు ప్రజలకు సందేహము గలిగించుచుఁ గొంత కాలమును, ఇతనినడత వినినవారును, కనుఁగొనినవారును, అయిన నయియుండవచ్చు నేమో యనుచుండ నే నెఱుఁగ నని యొట్లుపెట్టుకొనుచుఁ గొన్నిదినములను, అతఁడు నిక్కముగా వ్యభిచారవృత్తి కలవాఁడే యనునట్లు కొండెకానిజాణతన మగపఱచుచుఁ గొండొక కాలమును, గడపి తుదకుఁ బ్రపంచమంతటికిని దెలియునట్లు చలి విడిచి తిరుగ నారంభించెను. ఇది చూచినవా రందఱు నితఁడు శాస్త్రముల నన్నియుఁ జదివినగర్వముచేతనే సర్పమువలె మహాభయంకరముగ సంచరించుచుండె ననుచుండిరి.

చ॥ పరువడి మిత్రసంతతికిఁ ♦ బంచశరోపని షద్రహస్యముల్
నిరతముఁ దెల్పుచుండుఁ గమ ♦ నీయతరస్వరమాధురిన్ సవి
స్తరసురతాగమైకపథ ♦ చారి యనన్ విటుఁ డయ్యు మేలుగా
ధరణిసురాత్మజుండు నిజ ♦ ధర్మముఁ దప్పఁ డొకింత యేనియున్. 18.

అ॥ ధరణిసురాత్మజుండు-ఆ బ్రాహ్మణునిపుత్త్రుఁడు, నిరతమున్-ఎల్లప్పుడును, మిత్రసంతతికిన్-స్నేహితులయొక్క-సమూహమునకు, చెలికాండ్రగుంపునకు, పరువడిన్-అత్యంతముగా, క్రమముగా, పరుపు+వడి-పరువడియగును. పంచశరోపనిషద్రహస్యముల్, పంచశరోపనిషత్-శ్రేష్ఠమయిన కామశాస్త్రమునందలి, రహస్యముల్-మర్మములను, సవిస్తరసురతాగమైకపథచారి. సవిస్తర-విస్తారముతో సహితమయిన, సురతాగమ+ఏక+పథ - సంభోగశాస్త్రము నెడి ముఖ్యమైనమార్గమునందు, 'ని॥ ఏకో ముఖ్యాన్యకేవలాః' అ. చారి-సంచారముగలవాఁడు, తిరుగుచున్నవాఁడు, అనన్-అనఁగా, కమనీయతరస్వరమాధురిన్ - కమనీయతర - శ్రవణానందమైన, వీనులకింపుఁగూర్చుచున్న, స్వరమాధురిన్ - కంఠస్వరముయొక్క- మధురస్వభావముతో, తెల్పుచుండున్ - బోధించుచుండును, అతఁడు, విటుఁడయ్యున్-వ్యభిచారవృత్తి కలవాఁడయినను, మేలుగాన్-శ్రేష్ఠముగా, నిజధర్మమున్-తనకులధర్మమును, అనఁగా నితరులకు బోధించునట్టి బ్రాహ్మణధర్మము ననుట. ఒకింత యేనియున్-కొంచెమైనను, తప్పఁడు-వదలినవాఁడు కాఁడుగదా నిజధర్మము దప్పఁడు లేశమేనియున్, పాఠాం. 'ధరణీసుర' శబ్దమునందలి యీకారము హ్రస్వమగుటకు "సూ, హ్రస్వో దీర్ఘ సమాసేషు క్వచిద్దృష్టః ప్రయోగతః" ఆథ. బ్రాహ్మణుఁడు స్వధర్మమును బరిత్యజించి తన చెలికాండ్రకు విటధర్మము నుపదేశించుట విరోధము. ఉపనిషద్రహస్యములను జెప్పవలసినవాఁడు పంచశరోపనిషద్రహస్యములను జెప్పుచున్నాఁ డనుటచే నిందలి యుపనిషచ్ఛబ్దమువలన విరోధ మాభాసమైనది. కావున విరోధాలంకారము. "ఆభాసత్వే విరోధస్య విరోధాలంకృతి ర్మతా" ప్రతా, 'క, అమర విరోధం బాభా, సముగాఁగ విరోధమయ్యె♦జగతి నదియునుం, గ్రమమునజాత్యాదివిభే, దముల బహుత్వంబుఁ జెంది♦తగు నెట్లన్నన్' ఉదా. "సీ. భూరాధరంబయ్యుఁ ♦ దనరునీకాక్షేపు, మనశవాహినికజీ ♦ వనదమయ్యె" కా.సం.

,మమ్మటాచార్యుఁడును విరోధాలంకారమే యనినాఁడు "విరోధఃసోఽవిరోధేఽపి విరుద్ధత్వేనయద్వచః, జాతిశ్చతుర్భి ర్జాత్యాద్యై ర్విరుద్ధాస్యా ద్గుణైస్త్రిభిః, క్రియా ద్వాభ్యామథ ద్రవ్యంద్రవ్యేణైవేతి తేదశ" కా॥ప్ర॥

తా॥ అనిరంకుశుఁడు తనచెలి కాంచనదత్తకిఁ గామశాస్త్రమునందలిమర్మములను విస్తారముగాఁ జెప్పుటలో సంభోగశాస్త్రము నవారిత్రినవాఁడనునట్లు వినువలకింపుగ లిగించునట్టిమధురస్వరముతోఁ జదివి బోధించుచుండెను. వ్యభిచారియైనను దనబ్రాహ్మణధర్మము నించుకయేనినతిక్రమించఁడాయెనుగదా.

ఉ॥ చూపులు వారకామినుల ♦ చొక్కపుగుబ్బలపై దువాళిపుఁ
గోపులు సూప రూపమునఁ ♦ గోయిలమూఁకలఁ బచ్చవిల్తుఁ బూఁ
దూపులు దాఁచి దేహలత ♦ తో విహరించెడుమారుఁడో యనన్
మాపులు గాఁగ భూసురకు ♦ మారుఁడు నిచ్చలు వచ్చు వీథికిన్. 19.

అ॥ భూసురకుమారుఁడు—బ్రాహ్మణునికొడుకైన యానిరంకుశుఁడు,చూపులు—తనయొక్క వీక్షణములు, వారకామినులచొక్కపుగుబ్బలపైన్—కామము గలవేశ్యలయొక్క చక్కనిస్తనములమీఁద, 'ని॥ వారస్త్రీ గణికా వేశ్యా పణ్యస్త్రీ రూపజీవినీ, ఇత్యమ. దువాళిపుంగోపులు—ప్రకాశించుచున్నట్టి యందమును, చూపన్—కనఁబఱచఁగా, కోయిలమూఁకలన్—కోకిలలయొక్క గుంపును, పచ్చవిల్తున్—పచ్చనివిల్లుగలమన్మథుని, పూఁదూపులన్—పుష్పబాణములను, దాఁచి—అదృశ్యము చేసి—అగపడకుండునట్లొనరించి, రూపమునన్—శరీరముతోఁగూడినవాఁడై, అనఁగా మన్మథుఁ డనంగుఁడు కావున నిప్పుడు రూపముధరించి యనుట. దేహలతతోన్—తీఁగెవంటితనువుతో, విహరించెడుమారుఁడో—తిరుగుచున్న మన్మథుఁడేమో, అనన్—అనునట్లు, నిచ్చలున్—ఎల్లప్పుడును, ఇది యవ్యయము. బహువచన సమానముగానుండుటకు "సూ. కొన్నియవ్యయంబులు బహువచనాంతతుల్యంబులు నగు" ప్రౌ.వ్యా. "సూ. బహుత్వేక్వచిదేకత్వం బహుత్వప్రత్యయేక్వచిత్" అప్ప. మాపులుగాఁగన్ — సాయంకాల మగుటతోనే, వీథికిన్—బజారునకు, వచ్చు—ఏతెంచును, 'భూసురకుమారశిఖామణి వచ్చు వీథికిన్', పాఠాం. ఈపద్యమున ద్విప్రాసము చెప్పఁబడినది. 'దేహలతతో విహరించెడిమారుఁడో', అను నప్పుడది కాభేదగుణస్వరూపో త్ప్రేక్షాలంకారము "సంభావన మథోత్ప్రేక్షా ప్రకృతస్య సమేన యత్" కా. ప్ర. 'దేహలత, ఉపమాలంకారము. 'నిచ్చలువచ్చు, అను ప్రాసాలంకారమును.

తా॥ అతఁడు నిత్యమును సాయంసమయమున సందకత్తెలయిన భోగముదాండ్రవంకఁ జూచుచు వీథి కేతెంచుచుండఁగాఁ గోయిలగుంపులను జెఱకువిల్లును దాఁచి యాకారముతో వచ్చిన మన్మథుఁడో యనునట్లుండెను.

సీ॥ చల్లడ మామీఁదఁ ♦ జలువఁ బట్టినదట్టి, దలిమంపుదుప్పటి ♦ దానిమీఁద
మొలజముదాళి చా ♦ యలపిడియంబు చేఁ, బడగసూరియుఁజిల్ల ♦ బటువు చేతఁ
దనువున మంచిగం ♦ ధము దానిపైగంధ, వొడిముందుమీఁదఁ గ ♦ ప్పురపురజము
వలకారి సిగతాయె ♦ తులు వానిపైజాజి, విరు లందుపై నొంటి ♦ పొరదుమాలు

తే॥ మిఱు ఘనసార తాంబూల ♦ సౌరభప్ర, వాహవహగంధవాహప్ర ♦ రోహమోహ
వశవిశాలేక్షణాజన♦స్వాంతుఁడగుచు, రాత్రులఁజరించుచుండు నా♦బ్రాహ్మణుండు 20.

అ॥ అబ్రాహ్మణుండు – ఆనిరంకుశుఁడు, చల్లడము – సగముతొడవఱకుఁదొడిగెడు గుడిగె, అనఁగాఁగుఱుచలాగు ఆమీఁదన్–దానిపైన, ఇచట 'మీఁదు, శబ్దమునకు. 'న' చేరి మీఁదన్, అయినది. "సూ. కేషాంచిదుదంతానాం నే విభక్తావునోలుక్ స్యాత్" నన్న. చలువఁబట్టినదట్టి–చలువఁజేసి యుదికినవడికట్టును. 'దట్టి–దట్టీ, అని రెండురూపములుగలవు. దానిమీఁదన్–ఆపైన, దలిమంపు దుప్పటి–సన్ననివస్త్రమును, ఇదిదడిమముయొక్క–రూపాంతరము. ఉదా. "క. ఎలనాగయోర్తుదలిమపు, వదలిపంబులుగట్టనిచ్చె" యయా, మొలన్–నడుమునందు, జముదాళి–ఆయుధవిశేషము. ఇది జముదాడిరూపాంతరము, ఉదా. "సీ॥ జముదాడి గెల్చునా♦జముదాడి" రామా, చాయలపిడియంబు–కాంతులతోఁగూడినబాఁకును, అనఁగాఖడ్గముననుట. ఉదా. "చ. చ. ల్లడములుపూనిమీఁదఁబది♦లంబుగఁగట్టినమ్టైకాసెలన్, బిడియములంటఁదోఁపి" స్వా. మ. చేన్ – చేతియందు, పడగసూరియున్ – పడగగలిగినచూరకత్తియును, ఇది చురకత్తియొక్క రూపాంతరము. పడగ+సూరి–పగడసూరి అగును. ఇచట 'సూరి–చూరి, ఈరెండురూపములుగలవు. "ని, సూరి త. కత్తి. ఛురిక శ. చం. చేతన్–హస్తమునందు, చిల్లబటువు–చిన్నయుంగరమును, అంగుళీయకమును, తనువునన్–ఒడలియందు, కుంచిగందమున్–చందనపుపంకమును, 'దానిపైన్–అందుమీఁద, గందవొడి = పరిమళముఁగూడినగంధపుబుక్కాయును, ఇచట 'గందవొడి' యనుటకు 'సూ. ఆచ్ఛికసమాసంబులం దటుచుగ వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్యవైకల్పికములుగాఁ బెక్కులు గానంబడియెడి, ప్రౌ.వ్యా. ఉదా. "పుడుకు మల్లనగంద♦వొడికి నీప్రేంకణము" స్వా. మ అందుమీఁదన్–అపొడిపైన, కప్పురపుగజము – కర్పూరపుపిండియును, వలకారిసిగతాయెతులు – మోహమునుగలిగించునట్టి జుట్టుముడియందలితాయెతులును, ఇచట 'వలకారి' యనుటకు దా. 'సీ. పలుమాఱుఁ దనప్రోల♦కలికిసేఁతలకోడి, వలకారితనమున♦ వన్నెఁబెట్టు, పు ష్ప, ఇచట 'తాయెతు' అనుటకు 'సూ. డోలాభూషోత్తరీయాణి విన్యైత్వంనాస్తిమధ్యయోః' అథ. వానిపైన్–ఆతాయెతులమీఁద, జాజివిరులు – జాజిపువ్వులును, అందుపైన్–ఆపుష్పములమీఁద, ఒంటిపేరరుమాలు–ఒక్కపేరతోఁగప్పఁబడిన కేసుగుడ్డయును, మిఱున్–అతిశయించఁగా, ఘనసార.........స్వాంతుఁడు. ఘనసార–కర్పూరముతోఁగూడిన, తాంబూల – తమలముయొక్క, సౌరభ–సువాసనయొక్క. ప్రవాహ–పరంపరను, వహ–వహించుచున్న, గంధవాహ–వాయువుయొక్క, ప్రరోహ – మొలకలచేత–అంకురములచేత. మోహవశ–వలపునకులోఁబడిన, విశాలేక్షణాజన – పెద్దకన్నులుగల కాముకీజనముయొక్క, స్వాంతుఁడు–మనస్సుగలవాఁడు, అగుచున్–అయి, రాత్రులన్–రాత్రులయందు, చరించుచుండున్–తిరుగుచుండును, ఇందు విటునియొక్క స్వాభావిక వేషము వర్ణింపఁబడియుండుటచే స్వభావోక్త్యలంకారము, "స్వభావోక్తి స్తు డింభాదేః స్వక్రియారూపవర్ణనమ్" కా. ప్ర.

ఉదా. "పశ్చాదంఘ్రీప్రసార్య త్రికనతివితతం ద్రాఘయిత్వాఽంగముచ్చైః
ఆసజ్యాభుగ్నకంఠో ముఖమురసిసటాః ధూళిధూమ్రా విధూయ
ఘాసగ్రాసాభిలాషా దనవరతచలత్ప్రోథతుండాతురంగో
మందం శబ్దాయమానో విలిఖతిశయనా దుత్థితః క్ష్మాం ఖురేణ."

మఱియు విటవేషమునకు గంధముక్కటియే చాలు నని యిటీవల కొందఱు వచించియున్నారు. "క. కుందనపుసొమ్ము లేటికి, సెందుకు మఱి వెండిసొమ్ము ♦ లెందుల కవి చేఁడే, యందము మనుజుని మేనికి, గంధమురా కుందవరపు ♦ కవిచౌడప్పా" క. చౌ. ఇచట నాయకుఁడు ధీరలలితుఁడుగా వర్ణింపఁబడినాఁడు. "వీరశృంగారప్రధానో ధీరలలితః" ప్రతా.

తా॥ ఆనిరంకుశుఁడు తలుపులాఁగును, దానిపైఁ జలువచేసిన నడికట్టును, అమీఁద సన్నని దోవతియును, నడుమునఁ గత్తియును, తళతళలాడెడి పెద్దబొఁడును. కొమ్మునఁ జురకత్తియును, వ్రేలికి నుంగరమును, మేన గంధపుఁబూఁతయును, దానిపై సువాసనగలుగు కల్కయును, అపాఁడి మీఁదఁ గర్పూరపు చూర్ణమును, జుట్టుముడియందుఁ జక్కని తాయెతులును, దానిపై జాజిపూవులును, అమీఁద నోఁటిపొరరుమాలును ధరించి కర్పూరపుతాంబూలముయొక్క పరిమళము సన్నగాలి మెలకలతోఁగూడి నోఁటివలనఁ గామినులు మోహపరవశలగుచుండఁగా రాత్రులయందుఁ దిరుగుచుండును.

సీ॥ జాఱినవెంట్రుకల్ ♦ సవరించికట్టిన, పసిఁడివ్రాఁతరుమాలు ♦ దుసికిలంగ
నిదురచాలమి మాంద్య ♦ మొదవజూచెడుకన్ను, లరవిరికెందమ్మి ♦ విరులుదాల్ప
వాడుఁజూపినలేఁత ♦ వాతెఱపలుదాఁకి, జిలుగుటొండెలఁజిమ ♦ చిమయనంగ
వలిపెముప్పటివల్లె ♦ వాటుజాఱియొయారి, చిటులుగంధపుఁబూఁత ♦ చెలువమమర
తే॥ మారశాస్త్రాధికారదు ♦ ర్వారవార, వారిజాస్యాతిసారస్యవచనరచన
కృతపరీరంభసంభోగ ♦ కేళిఁదేలి, వీఁకఁ గేరెంచు నాపటి ♦ వేళనతఁడు. 21.

అ॥ అతఁడు — ఆనిరంకుశుఁడు, జాఱినవెంట్రుకల్ , ముడిపీడిపోయినశిరోజములు, సవరించి— చక్కఁగాఁజేసిముడివేసికొని, కట్టిన — తలకుఁజుట్టుకొనినట్టి, ఉదా. 'సీ. పాగగాదనుచుమం ♦ పాకపాలుఁడుగట్టెఁ, జెంగావిసరిగంచు ♦ జిగిరుమాలు' పాంచా. ప. పసిఁడివ్రాఁతరుమాలు — బంగారపుచిత్తరువు వ్రాయఁబడిన రేసుగుడ్డ, దుసికిలంగన్ — జాఱుచుండఁగా, ఉదా. 'గీ అట్టివేసవిబేసి దంపు ♦ పెట్టుకతన, హస్తము దమర్చిసారస ♦ లస్తకంబు, దుసికిలఁగఁగాఁ సవరింప ♦ వశము గాక, పుష్పబాణుని చెఱువిల్లు ♦ పుడమిఁబడియె" అను. నిదురచాలమిన్ — నిద్రతక్కువయగుటచే, మాంద్య మొదవన్ — అలస్యము కలుగునట్లు, చూచెడుకన్నులు — వీక్షించుచున్న నేత్రములు, 'సూ. ఙ్ఞోస్తు ఖేదకతాపస్యా దితికేపాంచిదీరలమ్' అథ. అరవిరికెందమ్మివిరులు — సగమువికసించిన యెఱ్ఱదామరలయొక్క వికాసమును, దాల్పన్ — ధరించుఁగా, వాడుజూపిన — కములినట్టి, లేఁతవాతెఱ — కోమలమయిన పెదవి, పలుదాఁకి — దంతములుతగిలి, ఇచట 'పల్లు' అనుటకు 'పలు' అనిప్రయోగింపఁబడినది, "సూ. అద్విత్వంచభవేద్ద్విత్వం దీర్ఘో హ్రస్వస్య కేషుచిత్" అథ. జిలుగుటొండెలన్ — దట్టమైనయొండెలవలన, జిలుగు + ఎండె — జిలుగుటొండె, అగును. 'సూ. సామానాధికరణ్యేషూ దన్తానాంటుగాగమోఽచిస్యాత్' సన్న. చిమచిమ + అనంగన్ — చిమచిమయని మంటపుట్టుచుండఁగా, ఉదా. "సీ. మొనపంట మొనసినొ ♦ క్కినఁ నొక్కఁ జేఁగెంపు, టధరంబు చిమచిమ ♦ యనిన యట్లు" అనిరు. వలిపెముప్పటి — సన్నని తెల్లవస్త్రము, ఉదా. 'సీ. వలిపెంపుఁజెంగావి ♦ వలువగప్పు చక్రోరి శృం. నై. వల్లెవాటు — మెడచుట్టును త్రిప్పివేయఁబడిన, జాఱి—దిగఁజాఱి, ఒయారిచిటుల

గందపుఁబూఁత-చక్కఁగాఁజిట్లుచున్న మేనఁబూసినగంధము, శరీరమునకు లేపనముచేసినచందనపు పంకము, చెలువము+అడఁగన్ - అందమతిశయించుచుండఁగా, మార......కేళిన్. మారశాస్త్ర - కామశాస్త్రముయొక్క, అధికార - ప్రభుత్వమునందు, దుర్వార - వారింపనలవిగాని, వారవారిజాస్య - పద్మములవంటి మోములుగలవేశ్యలయొక్క, అతిసారస్య - మిక్కిలి రసయుక్తమయిన, వచనరచన - మాటలయొక్క పొందికచేత, కృత - చేయఁబడిన, పరీరంభ - ఆలింగనమువలన, సంభోగకేళిన్ - రతికేళియందు, తేలి - ఈఁదినవాఁడై, రేపటివేళన్ - ప్రాతఃకాలమున, ప్రొద్దుటిపూఁట, ఇచట 'రేపు-రేపు' అనిరెండురూపములుకలవు. 'రేపుచుక్కలఁజూచుచు♦మాపుతిమిర, వైరిఁజూచుచుసంధ్యవా♦ర్వంగవలయు' విష్ణుపు. వీథికిన్ - బజారునకు, ఏతెంచున్ - వచ్చుచుండును, 'నిదుర... .....కెందమ్మివిరులుదాల్ప' అనుటచే నుత్ప్రేక్షాలంకారమును, కడమపద్యమంతయు స్వభావోక్త్యలంకారమును, 'మారశాస్త్రాధికారదుర్వార వారవారిజాస్యాతిసారస్య' వృత్త్యనుప్రాసాలంకారమును. 'వచనరచన' అనుప్రాసాలంకారమును.

తా॥ అతఁడు కామశాస్త్రమునందు గడితేఱినభోగముకాంక్షయొక్క రసయుక్తమైనపలుకులపొందికచేత సంభోగకేళిఁ దేలి సూర్యోదయకాలమున వీథికి వచ్చుచుండఁగా ముడివీడినవెండ్రుకలు చక్కఁగా ముడిచి తలకుఁ జుట్టినబంగారుజరీరుమాలు జాఱుచున్నది. నిదుర చాలకుండుటచేఁ గన్నులు మూఁతవడుచు సగముముడిచిన యెఱ్ఱదామరపువ్వులవలెఁ బ్రకాశించుచున్నవి. దంతక్షతములవలనఁ గమలినపెదవి జిలుగుకెంపులకుఁ జిమచిమ యనుచున్నది. సన్ననియుత్తరీయపు వల్లెవాటు జాఱి మేనఁ గలగందపుపగుళ్ళు కనుపించుచున్నవి.

ఉ॥ చూపరవుట్టు నప్రమిత ♦ శోభిత మౌక్తిక పద్మరాగముల్
తాపనఁ జేసినట్టిజిగి ♦ దంతపుమిద్దియలందు నక్షువి
ద్యాపటిమంబు సూపు వెల ♦ యాంధ్రుసు దాను వినోదలీల బా
రా పది దచ్చి యిత్తిగ దు ♦ గా యని పన్నిద ముగ్గడించుచున్. 22.

అ॥ చూపర.........రాగముల్. చూపర+పుట్టు - చక్కఁదనముగా నుండునటువంటి, అప్రమిత - మితములేని, శోభిత - ప్రకాశింపఁబడిన, మౌక్తిక - ముత్యములును, పద్మరాగముల్ - సూర్యునికాంతివంటి కాంతిగల కెంపులును, తాపనన్ - స్థాపించుటను, చేసినట్టి జిగిదంతపు మిద్దియలందున్ - ఒనరించినటువంటి యేనుఁగుదంతములతో రచింపఁబడిన చంద్రశాలలయందు, వెలయాండ్రును - వేశ్యాంగనలును, ఇచట. ఆలుశబ్దబహువచనము 'ఆండ్రు' అగుటకు 'సూ. నిత్యందారాదేశ్చస్యాల్లులయోరు రౌచతత్ర స్తః' శబ్దచిం. తానును - అనిరంకుశుఁడును, వినోదలీలన్ - కాలయాపనము కొఱకయిన విలాసముగా - ప్రొద్దుపుచ్చుకొనుటకై వేడుకగా, బారా - పదిరెండు, తది, దచ్చి - ఎనిమిది, దంట+చవుకము - దచ్చి, అగును. ఇత్తిగ - ఆఱు ఇరు+తిగ - ఇత్తిగ ఉదా "మ. దచ్చొకచౌవంచయి, త్తిగబారాదుగయంచు" కళా. దుగా - రెండు, ఇచట 'దుగ' కు దీర్ఘము వచ్చుటకు 'సూ. ఒకచో హ్రస్వంబు దీర్ఘంబగు' ప్రౌ. వ్యా. అధర్వణాచార్యులును. "హ్రస్వః స్యాద్దీర్ఘ సంశ్రుతిః" అనియున్నాఁడు. అని - ఈవిధముగాఁ బలుకుచు, పన్ని

దమున్ - పందెమును, ఉగ్గడించుచున్ - పెద్దగాఁజెప్పుచు, అక్షవిద్యాపటిమఁబున్ - జూదము నందుఁదమకుఁగల గట్టితనమును, చూపన్ - అగపఱచుచుఁడును, ఈపద్యమున నాలుగవపాదము నఁగాకుస్వర యతిద్వికముగాఁ జెప్పఁబడినది. అప్పకవి దీనినిబ్లుతయుగయతియని వర్ణించినాఁడు. ఉదా "ఉ॥ శ్రీగజగామినీమణిని ♦ సీతనుగా నిరపాయిగాఁ ద్రిలో, కీగృహమేధిఁగా గరుడకే తనుఁగా భవరోగవైద్యుఁగా, నాగురువాన నిన్నె మది ♦ నమ్మితి వేఱొకవేల్పుఁ గొల్వనీ, వే గతి కావవే రఘుప ♦ తీ శరణాగత వజ్రపంజర" వ.జ.శ. స్వభావోక్త్యలంకారము. "స్వభావోక్తిరసౌ చారు. యథావద్వస్తు వర్ణనమ్." ప్రతా,

తా॥ ముత్యములు కెంపులు స్థాపించఁబడి ప్రకాశించుచున్న యందమైన దంతపుమేడలయందు వేశ్యలును దానును వినోదముగా జూదమాడుచుందురు.

సీ॥ కొదమచందురువంటి ♦ నుదుటఁ గస్తురినామ, మొఱపుమించఁగ దిద్దు ♦ నొక్కరితకుఁ
జిమ్మచీఁకటిగ్రమ్ము ♦ క్రొమ్ముడి గొజ్జంగ, లొనరఁగాఁదుఱుము వే ♦ ఱొక్కరితకు
జక్కవకవవంటి ♦ చన్నులహారంబు, లొయ్యఁగాఁ దీర్చునొం ♦ డొక్కరితకుఁ
మించుఁదీఁగెకు మించు ♦ మేనఁ గప్పురగంద, మొప్పుగా నలఁదు మ ♦ ఱొక్కరితకు
తే॥ నొకతె చెక్కులపై మక ♦ రికలు వ్రాయు, నొక్కతెకు మెల్ల జడలీలు ♦ చిక్కుఁదీయు
నొక్కపని యెప్పుడునుగల్గి ♦ యుండుఁగార్య, భరము లేదనఁగూడదా ♦ బ్రాహ్మణునకు 23.

అ॥ అబ్రాహ్మణునకున్-అవిప్రునకు, కార్యభరము-పనియొక్క యాధిక్యము, లేదనన్ + కూడదు - లేదని చెప్పుటయొప్పదు, ఒక్కరితకున్ - ఒక కామినికి, ఇచట తకారము వచ్చుటకు 'సూ. తవర్ణకం బుస్త్ర్యర్థకంబగు, 'అయ్యది యేకత్వంబున సమాసగత షష్ఠ్యంతయుక్తవర్ధకా స్త్ర్యేకార్థక శబ్దంబుల పయినగు" ప్రౌ. వ్యా. కొదమచందురువంటి నుదుటన్ - బాలచంద్రునిఁబోలిన నొసటియందు, కస్తురినామమున్ - కస్తూరితిలకమును, ఒఱపుమించఁగన్ - అందమతిశయించునట్లు, దిద్దున్ - సవరించును, వేఱొక్కరితకున్ - మఱియొక కాంతకు, చిమ్మచీఁకటి - వెదఁజల్లునట్టి స్వభావముగల గాఢాంధకారము, ఉదా. "ద్వి. వివరింపుమిదె పొద్దు ♦ వెగుజాము యయ్యెఁ, గవిసినచిమ్మ చీఁ ♦ కటి వెల్లఁ బాసె" ద్వి. హ. క్రమ్ము - వ్యాపించునట్టి, క్రొమ్ముడిన్ - నూతనమయిన కేశబంధమునందు, ధమ్మిల్లమునందు, గొజ్జంగలు - పన్నీరుపూలు, ఒనరన్ గాన్ - ప్రకాశించునట్లు, తుఱుమున్ - గుచ్చును, ఒండొక్కరితకున్ - వేఱొకముదితకు, జక్కవకవవంటి చన్నులన్ - చక్రవాకపక్షుల యొక్క జంటను బోలిన స్తనములయందు, హారంబులు - పేరులు, ఒయ్యఁగాన్ - మెల్లఁగా, తీర్చున్ - చక్కఁబఱచును - సరిచేయును, మఱొక్కరితకున్ - ఇంకొకయువతికి, మించుఁదీఁగెకున్ - విద్యుల్లతకు - మెఱుపుఁదీఁగెకు, మించు - అతిశయించునట్టి, మేనన్ - ఒడలియందు, కప్పురగందము - కర్పూరపుబురదను, ఒప్పుగాన్ - అందముగా, అలఁదున్ - పూయును, ఒకతె చెక్కులపైన్ - ఒకసుందరియొక్క చెక్కిళ్ళమీఁద, ఇచట 'ఒకతె' అనుటకు "సూ. తవర్ణకంబు స్త్రీలింగార్థకంబగు" 'దానియత్వంబున కిత్వైకత్వంబులు పర్యాయఁబువనగు. ఆదేశాత్వంబుమీఁది దాని కత్వంబురాదు." ప్రౌ. వ్యా. మకరికలు - మకరికాపత్త్రములు, వ్రాయున్ - లిఖించును, ఒక్కతెకున్ - ఒకతన్వికి, మెల్లన్ - తిన్నఁగా, జడలీలు - జడయొక్కపాయలు, చిక్కున్ + తీయున్ -

చిక్కుపడినవానిని విడఁదీయును, కతుక. ఎప్పుడును - ఎల్లకాలమును, ఏసమయమునందును, ఒక్కపని - ఏదోయొకపని, కల్గియుండున్ - ఉండనేయుండును, ఇందునిరంకుశుని దక్షిణనాయకునిగా వర్ణించినాఁడు. "చ॥ చెలఁగుబహుప్రియా సదృశ•శీలుఁడు దక్షిణుఁడు" కా. సం. "ఏషుత్వనేకమహిళాసమరాగో దక్షిణఃకథితః" సా. ద. 'కౌదమువందువవఁటినుమట - జక్కవకవకంటిచన్నులమించుఁదీగెకు మించుమేన, ఇత్యాదు లుపమాలంకారము 'ఒక్కపని యెప్పుడును గల్గియుండు' ననుటచే నతిశయోక్త్యలంకారమును. "కార్యభరము లేదనఁగూడదా బ్రాహ్మణునకు" అనుటచే వ్యాజస్తుత్యలంకారమును. ఇచట నిరంకుశుఁడు వేశ్యాలోలతను దృప్తిఁజెందకుండుటను గూర్చి "దినేషు జీవితవ్యేషు, స్త్రీషుచాహారకర్మసు, అతృప్తాఃప్రాణినస్సర్వే, యాతా యాస్యంతి యాంతి చ" చాణ.

తా॥ అనిరంకుశుఁడొక చంద్రముఖికి నొసటఁ గస్తూరితిలకమును బెట్టును. మఱియొక యలివేణికిఁ గొప్పుముడియందు గొజ్జంగపువ్వులు దుఱుమును, ఒకచక్రవాకస్తనికిఁ జన్నులపయినున్న పేరులు చిక్కుఁదీయును. ఒకలతాంగికి మేనఁ గర్పూరపుపంక మలందును. ఒకకామినికిఁ జెక్కిళ్లపై మకరికాపత్త్రములను రచించును. ఒకయువతికిఁ జల్లఁగా జడపాయలు చిక్కుఁదీయును ఇట్లెల్లప్పుడు నేదోయొకపని చేయుచునే యుండునుగాని విసుకుఁ జెందఁడు.

క॥ వారాహము వారణగిరి, వారాన్నిధి వారణాసి ♦ వారణవరదున్
వారాంగనాజనస్మర, ణారూఢిన్మఱవఁ డాతఁ ♦ డనఘుఁడువోలెన్. 24.

అ॥ ఆతఁడు - అనిరంకుశుఁడు, అనఘుఁడువోలెన్ - పుణ్యపురుషుఁడోయనునట్లు, వారాంగనాజనస్మరణారూఢిన్. వారాంగనాజన - అందగత్తెలయిన వేశ్యలగుంపుయొక్క, స్మరణ - తలంపునందలి, ఆరూఢిన్ - నిశ్చయముచేత, వారాహమున్ - వారాహపురాణమును, వారాహమనఁగా నష్టాదశపురాణములలోనొకటి. "మద్వయంభద్వయం చైవ బత్రయంవచతుష్టయం, అనాపలింగకూస్కాని పురాణానిపృథక్పృథక్, అష్టాదశపురాణాని కృత్వాసత్యవతీసుతః, భారతాఖ్యానమతులం చక్రేతదుపబృంహితమ్" (స్కాం. మా. అ.) మద్వయం - మాత్స్యమార్కండేయములు, భద్వయం - భవిష్యభాగవతములు, బత్రయం - బ్రహ్మాండ, బ్రహ్మ బ్రహ్మవైవర్తములు, వచతుష్టయం - వామన, వైవస్వత, వైష్ణవ, వారాహములు, అ. నా. ప. లింగ. కూ. స్క-ములు - 'అగ్ని. నారద. పద్మ. లింగ. గరుడ. కూర్మ. స్కాందములు' అని తెలియవలయును. వైవస్వతపురాణమధర్వణభారతమువలెఁ గనుపడకున్నను "వైవస్వతపురాణే ఉత్తరార్థే షణ్ణవతితమోఽధ్యాయే కృష్ణభీమసంవాదే" అనియొకయధ్యాయము కనఁబడుచున్నది. "ఇతి శ్రీమహాపురాణే వైవస్వతే ఉత్తరార్థే కృష్ణభీమసంవాదే మయకృతసప్తర్షి శాపవిమోక్షకథాయాం శ్రీవిశ్వకర్మస్తోత్రం నామ షణ్ణవతితమోఽధ్యాయః" ఇట్లుకొన్నిగ్రంథములంగఁజూచుచున్నాము. బ్ర. వేదం వేంకటరాయశాస్త్రిగారు వైవస్వతపురాణస్థానమున వాయుపురాణమును జేర్చినారు. 'వాయుపురాణము వారుణపురాణము' ఇవియుపపురాణములలోనివైయున్నవి. వారణగిరిన్ - కరిగిరిని - అనఁగాఁ గాంచీపురమును, దీనినే కంచియందురు. ఇచట వరదరాజస్వామి ప్రతిష్ఠింపఁబడియుండెను, వారాన్నిధిన్ - క్షీరసముద్రమును, వారణాసిన్ - కాశీక్షేత్రమును, 'ని. వారణాసి-స. కాసి' శ. చం, "వారణాసి. సం. వి. ఇ. పుం. కాశి" 'వారణా + అసి' అను రెండుపనదులు కాశికి రెండువైపులఁ బ్రవహించుచు

గంగలోఁగలియును ఆరెండునదులమధ్య నుండుటచే వారణాసి ఆయెనని" అం. వా. ఉదా. "వ. ముక్తిక్షేత్రంబగు వారణాసి" శృం. నై. హేమచంద్రుఁడు 'వరాణసీ వారాణసీ' అని రూపద్వయమునే నిర్ణయించుటకుఁ గారణము తెలియదు ప్రాఁతప్రతియందు 'క. వారాహము వారాన్నిధి, వారాణసి వారణాద్రి' అనియున్నది. వారణవరదుఁడు - కరికివరమొసంగినవిష్ణువు. శ్రీకాళహస్తీశ్వరుననియుఁ జెప్పవచ్చును. మఱవఁడు - మఱపుఁజెందఁడు, వారాంగనాధ్యానమును నిరంతరమును మఱవకుండుటచే వారాహపురాణము మున్నగువాని నెన్నఁడును మఱవఁడు. అనుటచే వేశ్యాలోలునికిఁ బురాణాదులయందు శ్రద్ధయుండుటవిరోధము. 'వార' శబ్దము మఱవకుండుటచే విస్మృతిఁజెందకుండెననునర్థముచే నాభాసము. కావునవిరోధాలంకారము. "ఆభాసత్వే విరోధస్య విరోధాలంకృతిర్మతా" ప్రతా. "విరోధః సోఽవిరోధేఽపి విరుద్ధత్వేన యద్వచః, జాతిశ్చతుర్భిర్జాత్యాద్యైర్విరుద్ధా స్యాద్గుణైస్త్రిభిః, క్రియాద్వాభ్యామథ ద్రవ్యం ద్రవ్యేణైవేతి తే దశ" కా. ప్ర.

తా॥ అతఁడు నిరంతరము వారాంగనాధ్యానచిత్తుండగుటచే వారాహపురాణమును తిరుమలక్షేత్రమును, క్షీరసముద్రమును, కాశీక్షేత్రమును, భగవంతుని మఱచెను. ఆలోచింప నతఁడొక పుణ్యపురుషునివలె నగపడుచున్నాఁడు.

—: నిరంకుశున కాచారాదులయందసూయ :—

సీ॥ నిగమశాస్త్రంబులు ♦ నేర్పినగురువుఁ గ, న్గొన నెన్నఁడును లేని ♦ కోప మెత్తుఁ
దీర్థయాత్రాపరా ♦ ధీనులఁ గనుఁగొన్న, మది నెన్నఁడును లేని ♦ మంట వుట్టు
వైదికాచారప్ర ♦ వర్తిష్ణు నీక్షింప, నిల నెన్నఁడును లేని ♦ యేవ గలుగు
శమదమాధికుఁడైన ♦ సన్న్యాసిఁ గనుఁగొన్న, మును పెన్నఁడును లేని ♦ రసగు దోఁచు
తే॥ సంధ్య యన్న శిరోవ్యథ ♦ సంభవించు, భస్మధారణ మన్నఁ దీ ♦ వరము వొడము
దేవపూజావిధానంబుఁ ♦ దీర్పుమన్న, నిద్ర ముదయించు నాబ్రహ్మ ♦ ణబ్రువునకు. 25.

అ॥ అబ్రాహ్మణబ్రువునకున్ - జాతిమాత్రబ్రాహ్మణుఁడై ద్యూతవ్యభిచారాది నింద్యప్రవర్తనుఁడైన యానిరంకుశునకు, నిగమశాస్త్రంబులు - వేదములును శాస్త్రములును, నేర్పిన గురువున్ - అభ్యసింపఁజేసినగురువును, కన్గొనన్ - చూచినట్లయిన, ఎన్నఁడును లేనికోపము - ఇదివఱకెన్నఁడును లేనట్టిక్రోధము, ఎత్తున్ - అధికమగును, తీర్థయాత్రాపరాధీనులన్ - పుణ్యక్షేత్రములను జూచుటకై బయలుదేఱుటయందాసక్తులైనవారిని, కనుఁగొన్నన్ - వీక్షించినంతనే, మదిన్ మనస్సునందు, ఎన్నఁడును - ఇంతకుముందెప్పుడును, లేనిమంటపుట్టున్ - ఎఱుఁగనిశరీరమునందలి యొకరీతిబాధకలుగును, అనఁగాఁ గోపమధికమగుననుట. ఇది దేశ్యము. ఉదా. "తే. పావకుఁడును గపటంపుభూవరుండుఁ, దమ్ముఁగడుఁజేరిమందెమేలమ్ముతోడ, నున్నవారికిఁ గీడుచేయుదురు వారి, కంచితస్నేహమున మంట లధికమగును" విష్ణుపు. వైదికాచారప్రవర్తిష్ణున్ - వేదవిహితమైనసత్ప్రవర్తనమునందు మెలఁగుచున్నవానిని, ఈక్షింపన్ - కాంచినతోడనే, ఇలన్ - పుడమియందు, ఎన్నఁడును - అంతకుఁబూర్వమెప్పుడును, లేనియేవగలుగున్ - ఎఱుఁగనియసహ్యమేర్పడును, శమదమాధికుఁడు - అంతరింద్రియబాహ్యేంద్రి

యనిగ్రహమునందుగొప్పవాఁడు. ఐనసన్యాసికిన్ - అయినట్టియతీశ్వరుని, కనుఁగొన్నన్ - చూచినప్పుడే, మునుపు - గతించిన కాలమున, ఎన్నఁడును - ఏ కాలమునందయినను, లేనికనరుతోఁచున్ - లేనటువంటి యహితముకలఁగును, సంధ్య - ప్రాతః కాలమునను మధ్యాహ్న కాలమునను సాయంకాలమునను జేసెడి గాయత్రీయుపాసన, అన్నన్ - ఆ ప్రస్తావనవచ్చిన వెంటనే, శిరోవ్యథసంభవించున్ - తలనొప్పి పుట్టును, భస్మధారణము + అన్నన్ - విభూతినిబూసికొనుటయనఁగానే, తీవరము + పొడమున్ - తొందరకలుఁగును, దేవపూజావిధానంబున్ - దేవతలనుబూజించునట్టి క్రమమును, తీర్చుమన్నన్ - చక్కఁజేయుమనఁగా, ఏబ్రము + ఉదయించున్ - రోఁతపుట్టును, ఇటదేవపూజనుగూర్చి "స్వయంయజతిచేద్దేవముత్తమాసోదరాత్మజైః, మధ్యమాయాజయేద్భృత్యైరధమాయజనక్రియా" శంభు. ఇందు 'కన్గొనన్' అనుచోటనుకారములోపించుటనుగూర్చి "గీ. కాంతచన్గవచనుగవ♦ కార్మెఱుపులు, కారుమెఱుపులు" అప్ప. 'మంటవుట్టున్' అనుటలోఁబ్రథమమీఁదిపరుషమునకు సరళాదేశమునుగూర్చి "గీ. సంధి గూర్పఁగఁ బ్రథమాంత♦శబ్దవితతి, పైఁగచటతపలకు వికల్పంబుసెల్లుఁ, గాకుసంబోధనావ్యయ♦కర్మధార, యంబుల నచేతనంబుల♦నబ్జనాభ" అని లక్షణము. "సూ. పరుషాణాంస్వరూపేణ ప్రథమాంతోపరిస్థితాః, కాకాసంబోధనేచాపి హ్యవ్యయేకర్మధారయే, అచేతనార్థకేశబ్దఇతిశృంగారభూషణః" అథ. ఎత్తుగీతియందు ద్వితీయపాదమున నభేదయతి సెప్పఁబడినది. "క. వబయోరభేదమనియెడి, సెపమున పఫబభలు వాక♦నేర్పనవడిగా, నుపక్రమింపవచ్చుఁగృతులందుపనిషదుచితార్థసూక్తు♦లొనసిన చోటన్" సుల. ఉదా. 'చ. నుతజలపూరితంబులగు♦నూతులు నూటికంటెసూనృత, వ్రతయొకబావి మేలుమఱి♦బావులునూటికంటెనొక్క♦సత్క్రతువదిమేలు" భార. స్వభావోక్త్యలంకారము. "స్వభావోక్తిరసౌచారుయథావద్వస్తువర్ణనమ్" ప్రతా.

తా॥ నామమాత్రబ్రాహ్మణుఁడుగా నుండి వ్యసనాసక్తుఁడయినయానిరంకుశునకు వేదశాస్త్రాదులు బోధించినగురువును జూచినతోడనే కోపమువచ్చును. తీర్థయాత్ర లాచరించువారిం గనినంతనే మితిలేనికొఱకొఱలు పుట్టును. వైదికాచారనిమగ్నులను జూచినంతలోనే రోఁతకలుగును. జితేంద్రియుఁడగుసన్యాసి పొడకట్టినవెంటనే వెగటుకలుగును. సంధ్యవార్చుటయనినఁ దలనొప్పిగా నుండును. భస్మము ధరించుట యనిన వేగముగలుఁగును. దేవునిఁ బూజించుట యనఁగానే రోఁతగానుండును,

## ——♦ నిరంకుశుని గృహచౌర్యారంభము ♦——

సీ॥ తలిదండ్రులకు సమ్మ♦తంబుగా నతిథిస, త్క్రియ యటంచు నొకింత♦గిలుబుఁజేయుఁ
బొరుగూళ్లఁ గలమాన్య♦భూముల ధాన్యంబుఁ, గ్రయవెట్టి విడుచుఁబ♦రశ్వతంబుఁ
దనపైఁ బరామర్శ ♦ దప్పియుండు టెఱింగి, దొడ్డసొమ్మైన ♦ దొంగిలించు
నప్పచెల్లెండ్రపై ♦ నాదరంబులు సూపి, యరణముల్ గొనిపోయి ♦ యపహరించు
తే॥ బలపమును గత్తియును బూని♦ప్రజలయిండ్లఁ, గన్నవెట్టని దొక్కఁడే♦కానికొదవ
కడమదుర్వృత్తు లన్నియుఁ♦గఱచె నతఁడు, లంజతల్లులచేతి మ♦ల్లటకుఁ గాఁగ 26.

అ॥ అతఁడు - ఆబ్రాహ్మణుఁడు, లంజతల్లులచేతి మల్లటకున్ + కాన్ కన్ - శృంగారనాయికలయొక్క తల్లులవలనిబాధలకుఁగాను - వేశ్యమాతలయొక్క పోరునుబడలేకయనుట. ఇచట

'లంజతల్లులచేతి మల్లట' అనుటకు 'సూ. సమాసయుగ్భవేరాద్య ఆత్వాదిగవిభక్తిగః'' అధ. 'మల్లట. మల్లాట, అని రెండురూపములుకలవు. తలిదండ్రులకున్ - జననీజనకులకు, ఇదిద్వంద్వసమాసము. కనుకదకారాదేశమయినది. 'సూ. పరుషాణాంగసడదవాస్స్యుః పదాద్ద్వంద్వే'' శబ్దచిం. 'తల్లి' అనుశబ్దమునలకారద్విత్వములేమికి 'సూ. ప్రథమలుగపి ద్వినుల్వోః'' నన్న. సమ్మతంబుగాన్ - అనుకూలముతోనే, అతిథిసత్క్రియ - ధర్మార్థమింటికి వచ్చిన యాచకులకు మర్యాదలనిమిత్తము, అటంచున్ - అనిపల్కుచు. ఒకింత - కొంచెము, గిలుబున్ + చేయున్ - అపహరించును, పొరుగూళ్లన్ - సమీపగ్రామములయందు, కలమాన్యభూములధాన్యంబున్ - ఉండినదానభూములలోని వడ్లు మున్నగుధాన్యములను, క్రయపెట్టి - అమ్మి, పరశ్శతంబున్ - నూటికంటెనధిక సంఖ్యగల ధనమును, విడుచున్ - పోఁగొట్టును, తనపైన్-దనమీఁద, పరామర్శ - పరామరిక, తప్పియుండుట- లేకుండుట, ఎఱింగి - తెలిసికొని, అనఁగాఁ దననుగనిపెట్టియుండని యదనులోననుట. చొప్పడినసొమ్మైనన్ - ఏదైననొక పెద్దయాభరణమును, దొంగిలించున్ - చౌర్యముఁజేయును, అప్పచెల్లెండ్రపైన్ - తనతోఁబుట్టువులయందు, ఇది ద్వంద్వసమాసమయినను దకారాదేశము కాలేదు 'సూ. కొన్నియెడలద్వంద్వంబునం బదంబుమీఁది చశపలకుసదవలుగానంబడవు.'' ప్రౌ. వ్యా. ఆదరంబులు + చూపి - గౌరవములు కనఁబఱచి, అరణముల్ - తనకుమర్యాదగా నిచ్చినధనమును వస్తువులను, కొనిపోయి - తీసికొనివెళ్ళి, అపహరించున్ - మోసపుచ్చి తీసికొనిపోవును, బలపమును - ఖటికశిలను - బలపమను పేరుగలయొక చోరసాధనమును, ఉదా ' క. బలపముఁగన్నపుఁగత్తియుఁ, దలముళ్ళను జొక్కనీలి • పట్టియిసుముజీ, మలక్రోలుగడ్డగోయను, ములుబంతియుఁగత్తెరయును• మొదలగువానిన్'' పర. వి. కత్తియును - కన్నము వేయునట్టి కత్తియును, పూని-వహించి, ప్రజలయిండ్లన్ - లోకులయిండ్లను, కన్నపెట్టనిది - గోడలకుఁ దూట్లువేయకుండుట, కన్నము + పెట్టు - కన్నపెట్టు. అగును. 'సూ. ఆచ్ఛికసమాసంబులందచ్చుగ వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్యవైకల్పికములుగాఁ జెక్కులుగానంబడియెడి'' ప్రౌ. వ్యా. 'కన్నపెట్టు' అనియును రూపముకలదు. ఉదా. ''ఉ. నా,నాధనసంపదాఢ్యసదనంబులు నిత్యముఁగన్న పెట్టఁగన్'' పర.వి.'సూ. ప్రతిషేధవాచినాంనిః' నన్న. ఒక్కటే - ఒక్కటిమాత్రమే, కొదవ - తక్కువ, కాని - అయినప్పటికిని, అభ్యనుజ్ఞానార్థకము. కడనుదుర్వృత్తులు - మిగిలినచెడ్డపనులు - శేషించినదురభ్యాసములు, అన్నియున్ - సమస్తమును, కఱచెన్-అభ్యసించెను, 'ప్రజలయిండ్లఁ గన్నపెట్టనిదొక్కటే కానికొదవ' అనుటచే న్యూనాభేదరూపకాలంకారము, ''తద్రూపకమభేదోయ ఉపమానోపమేయయోః, అతిసామ్యాదభేదః'' కా. ప్ర.

తా॥ ఆనిరంకుశుఁడు వేశ్యమాతలపోరుఁ బడలేక తలిదండ్రులకు సమ్మతముగానే యతిథులకు సత్కారమునిమిత్తమని కొంతధన మపహరించును. ఇతరగ్రామములయందలి మాన్యపుభూములలోని ధాన్యము నమ్మి కర్చుపెట్టుకొనును. ఇంటిలోనివారు తననుగనిపెట్టక పరాకుగా నుండెడివేళ నేదైన నొకవస్తువును దొంగిలించును. తోఁబుట్టువులను మర్యాదగాఁజూచి వారొసంగినధనమును వస్తువులను దీసికొనిపెళ్లి వేశ్యల కిచ్చును. ఇన్నిరేయిల పొరుగిండ్లగోడలు త్రవ్వుట యొక్కటితప్పఁ గడమచెడుపనులన్నియు నొక్కటికలుఁగులేకుండ నభ్యసించెను.

వ॥ మఱియు నొక్కనిశేషంబుగల దాకర్ణింపుము. 27.

అ॥ మఱియున్-ఇంకను, ఒక్క-విశేషంబు-ఒక్క-యతిశయము, 'ని. విశేషోఽతిశయస్సోద్రష్టవ్యోత్తమవస్తుని, శబ్దా. కలదు-ఉన్నది, అకర్ణింపుము-వినుము,

—: నిరంకుశునకుఁ జంపకగంధియందనురాగము :—

గీ॥ అఖిలవారాంగనామనో ♦ హరవిహార, నిరతుఁడౌ నైన నందులో ♦ నిరుపమాన
గానపరిణత చంపక ♦ గంధి యనెడి, వాలుఁగంటికి మిక్కిలి ♦ మేలువాఁడు. 28.

అ॥ అతఁడు. ఇదియధ్యాహారము. అఖిల.........నిరతుఁడు, అఖిల-సమస్తమైన, 'ని. విశ్వమశేషంకృత్స్నంసమస్త నిఖిలాఖిలానినిశ్శేషమ్' అ. వారాంగనా-అందకత్తెలైన వెలయాండ్రకు 'ని. విశేషాః కామినీ కాంతాభీరుర్బింబాధరాంగనా, శబ్దా. మనోహర-మనస్సునకింపుగలుగునట్లు, విహార-సంచరించుటయందు, నిరతుఁడు-ఎడతెగని కాలముగలవాఁడు, ఔను-అగును, ఐనన్-అయినప్పటికిని, అనఁగాముందుచెప్పినదానికి వేఱొకయభిప్రాయమును దెలియఁజేయుట, ఉదా. 'గీ. నీవుచతురమతివి♦ నీకునిక్కన్నియ, నప్పగింపనేల♦యైననాదు, హృదయమలరుదీని♦యెడఁగడునార్ద్రమై, యుండుఁగానఁ జెప్ప♦కుండరాదు' భార. అందులోన్-ఆవేశ్యలయందు, ఇది దేశ్యము. 'సూ. వ్యతిరిక్తా స్సంప్రదాయతో వేద్యాః' నన్న. సాశ్రయానాశ్రయాపిస్యాత్తత్రార్థగతసప్తమీ' అథ. సాశ్రయ సప్తమియగును. నిరుపమానగానపరిణతచంపకగంధి, నిరుపమాన-సమానరహితమయిన, గాన - సంగీతముయొక్క, పరిణత + చంపకగంధి - పరిపాకముగల సంపెంగపువ్వులవంటిపరిమళముగలది, అనెడివాలున్ + కంటికిన్ - అనునట్టిసార్థకనామముగల నిడుదలైనకన్నులుఁగలదానికి, మిక్కిలిమేలువాఁడు-అత్యంతమగు వలపుగలవాఁడు, చంపకగంధిశబ్దమునుగూర్చి. 'సూ. గంధస్యేదుత్పూతిసురభిభ్యః' సిద్ధాం. ఉదా. "ప్రియాసుపాదగ్ర్యదదీసురూపా, సుగంధి నీలోత్పలగంధివక్త్రా" రావ. ఇందునాయకుని వేశ్యాలోలతకంటె విద్యావైశద్యముద్యోతముచేయఁబడినది. సంగీతఫలితార్థమిట్లుచెప్పఁబడియున్నది. "త్రివర్గఫలదా స్సర్వేదానయజ్ఞజపాదయః, ఏకంసంగీతవిజ్ఞానం చతుర్వర్గఫలప్రదమ్"హరీశాదిస్తుతో ధర్మార్థనకామా నృపాదితః, నిష్కామ స్తదనుష్ఠానా న్మోక్షు మాప్నో త్యసంశయః." సం. వి. ర.

తా॥ ఆనిరంకుశుఁడు వేశ్యలందఱియందు నిష్టముగనే తిరుగుచుండును గాని యందులో సంగీతమును బాగుగాఁ బాడనేర్చిన చంపకగంధి యనెడివేశ్యయందే మిక్కిలి మరులుగలిగియుండును.

—() చంపకగంధివర్ణనము ()—

క॥ మరుఁడేల చంద్రుఁడేటికి, మరుదంకుర మేమిపనికి ♦ మనుజేశ్వర యా
తరుణికడగంటఁ గాదే, పురుషులధైర్యంబు లేదు ♦ పొమ్మనిపింపన్. 29.

అ॥ మనుజేశ్వర - ఓరాజా, పురుషులన్ - మగవారిని, ధైర్యమ్ములేదుపొమ్ము - మీకుధీరత్వములేదుగదా, అనిపింపన్-అనునట్లుచేయుటకు, మరుఁడేల-మన్మథుఁడెందులకు, చంద్రుఁడు + ఏటికిన్ - పార్వణచంద్రుఁడేమిచేయుటకు, మరుత్ + అంకురము - మందపవనము, సన్ననిగాలి, ఏమిపనికిన్ - ఏమిచేయుటకు, ఈమూఁడు నవసరములేదనుట. ఆతరుణికడగంటన్ + కాదే -

ఆచంపకగంధియొక్క క్రేగంటిచూపుతోఁ గాదాయేమి, 'కాదే' అనుటకు 'సూ. ఏదాతౌ ప్రశ్నలక్ష ణౌ భవతః' నన్న. ఇచట నావేశ్యయొక్క దృష్టి తగులుటతోడనే పురుషులు కామోద్రేకు లగుదు రనుటకు "తావదేవకృతినా మపిస్ఫుర త్యేషనిర్మలవివేకదీపకం, యావదేవ న కురంగచక్షుషాం, తాడ్యతే చటులలోచనాంచలైః" భర్తృ. 'క. నీలోత్పలనయనాతర, ళాలోకనహతులుసోఁకు ♦ నంతకు వెలుఁగుఁ, ధీలలితసుజనవిమలో, ద్వేలాతిస్ఫుటవివేక ♦ దీపము నెమ్మిన్' బుద్ధిశాలురైనవా రికిఁగూడ నిర్మలమయినజ్ఞానదీపము సుందరాంగుల ప్రణయంపుచూపులు తగులకుండునంతవఱకే ప్రకాశించును. కాని యవితగిలెనా ప్రకాశించనేరవు. కామినీనేత్రముల కిట్టిశక్తియుండు ననిపూర్వ కవులుగూడ వర్ణించిరి. "దృశాదగ్ధం మనసిజం జీవయంతి దృశైవ యాః, విరూపాక్షస్యజయినీ స్తా స్తుమో వామలోచనాః" విద్ధ. శివునిచూపువలన నశించినమన్మథుఁడు చంచలనేత్రలచూపువలన నవతరించుచున్నాఁడు. కనుక నట్టిస్త్రీలను స్తుతించుచున్నా ననిభావము. కామినీవీక్షణమువలనఁ జలించినమనస్సును స్థిరపఱుప నేయౌషధమునకునుశక్తి చాలదనియువచించిరి. "వ్యాదీర్ఘేణ చలేనవక్ర గతినా తేజస్వినా భోగినా, నీలాబ్జద్యుతినాఽహినా వర మహం దష్టో న తచ్చక్షుషా, దష్టే సంతి చికిత్సకా దిశిదిశి ప్రాయేణ ధర్మార్థినో, ముగ్ధాక్షీక్షణవీక్షితస్య నహి మే వైద్యో న వా ప్యౌష ధమ్" భర్తృ. ఇచటఁ గార్యసాధనమున నుపమానములయిన మన్మథాదులకు వృథాత్వముఁ జెప్పుట చేతఁ బ్రతీపాలంకారము. "ఆక్షేప ఉపమానస్య ప్రతీపముపమేయతా, తస్యైవ యదివాకల్ప్య తిరస్కారనిబంధనమ్" కా. ప్ర. ఉదా. "లావణ్యౌకసి సప్రతాపగరిమ ణ్యగ్రేసరే త్యాగినాం, దేవ త్వయ్యవనీభరక్షమభుజే నిష్పాదితే వేధసా, ఇందుః కిం ఘటితః కిమేషవిహితః పూషా కి ముత్పా దితం, చింతారత్న మహో ముధైవ కిమమీ సృష్టాః కులక్ష్మాభృతః" ఖండ. "క. ఉపమేయము మె చ్చాలుఁ గాధర, నుపమానం బేల యనఁగ ♦ నొనరుఁ బ్రతీపంబు" కా. సం. "ఆక్షేప ఉపమానస్య కైమర్థ్యేన కథ్యతే, యద్యోపమేయభావస్స్యా త్తత్ప్రతీపముదాహృతమ్" ప్రతా. ఇందుఁ బురుషుల ధైర్యమును బోఁగొట్టఁదగినసాధనములు లేకుండనే కార్యముసఫలమగుననునర్థముచే విభావనాలంకార మును. "ఆధారరహితాధేయ మేకంచానేకగోచరం, అశక్యవస్తుకరణం విశేషాలంకృతిస్త్రిధా" ప్రతా. మమ్మటాచార్యుఁడును "క్రియాయాః ప్రతిషేధేఽపి ఫలవ్యక్తిర్విభావనా" అనినాఁడు. "క, కారణములేకకార్యము ప్రారూఢంబైనదివి ♦ భావన" కా. సం. కొందఱుకవు లీకడగంటి చూపుతోఁ గూడ నవసరములేదు ముఖావలోకన మాత్రముననే పురుషులు కామోద్రేకు లగుదురని వర్ణించిరి. "గీ. ఉత్పలాక్షులవదనచం ♦ ద్రోదయమున, నహహా పురుషావతంసులి ♦ యంతరంగ, చంద్రమః కాంతపాషాణ ♦ సమితి గరుగు, దివిజగజయానలార సం ♦ దియములేదు" విష్ణుమి.

తా॥ ఓరాజా పురుషులకు ధీరత్వము లే దనిపించుటకు మన్మథుఁడును, చంద్రుఁడును, మందా నిలమును, అవసరము లేదు. ఆచంపకగంధియొక్క క్రేగంటిచూపు మాత్రమే చాలును.

చ॥ అమృతసరంబు లుట్టిపడ ♦ నాలతిఁ జేసిన వీణలోపలన్
దుమదుమగా వచోమహిమ ♦ దోఁపఁగ గీతముఁ బాడుచున్న న
క్కమలదళాయతేక్షణన ♦ ఖంబులఁ గిన్నర మ్రోయఁ జేసినన్
దమకము పుట్టకుండ జన ♦ తాహృదయంబులు తాఁతఁ జేసినే. 30.

అ॥ అక్కమలదళాయతేక్షణ - తమ్మిరేకులవంటి విశాలమయినకన్నులుగలయావారకాంత, అమృతరసఁబులు - మధురరసంబులు, ‘ని. శృంగారాదౌ జలే వీర్యే సువర్ణే విషశుక్రయోః తిక్తాదావమృతే చైవ నిర్యాసే పారదే ధ్వనౌ, ఆస్వాదే చ రసం ప్రాహుః’ శబ్దా. ఉట్టిపడన్ - అకస్మాత్తుగా లభించునట్లు, ఆలతిన్ + చేసినన్ - రాగము నాలాపమొనర్చినను, వీణలోపలన్ - వల్లకియందు, ‘ని. వీణా తు వల్లకీ విపంచీ సా తు తంత్రీభిః సప్తభిః పరివాదినీ’’ అ. ఇచట ‘లోపలన్’ అనుటకు ‘సూ. లోపలనిర్గారణోద్భవా షష్ఠీ,’ శబ్దచిం. దుమదుమగాన్ - జనులహృదయము ద్రవించునట్లు, వచోమహిమ - పలుకులయొక్కయధికము, తోఁపఁగన్ - స్ఫురించఁగా, గీతమున్ + పాడుచున్నన్ - పాటనుపాడుచుండినను, నఖంబులన్ - గోళ్ళతో, కిన్నరన్ - తంత్రీవాద్యమును, ప్రోయన్ + చేసిన్ - ప్రోగించునప్పుడును, తమకము + పుట్టకుండన్ - వలపుజనించకుండునట్లు, జనతాహృదయంబులు - జనసమూహముయొక్క మనస్సులు, ‘ని. హృదయం వక్షసి స్వాంతే’ అ. జాతన్ + చేసెనే - జాతితో సృష్టించినాఁడాయేమి, అనఁగా మానవహృదయములు కరఁగియుండవనుట. కనుకనే “వీణా వేణు మృదంగ తాళ సహితం కిం తేన కంఠం వినా’’ అని చెప్పినారు. కంఠస్వరము మధురముగా నుండనిచో నితరవాద్యము లన్నియు వ్యర్థములుగదా; ఆస్త్రీ కంఠస్వర మత్యంతమధురముగా నుండె నని భావము. ఈపద్యమున ‘అక్కమలదళాయతేక్షణ’ అను చోట ద్విత్వము వచ్చినందుకు ‘సూ. ఊష్మరేఫా న్వినా ద్విత్వ మయుక్తస్య హలోమతః, ఋకారం చా విముచ్య స్యాత్ప్రాణానాం ద్విత్వసంగతిః’’ అథ. ‘దుమదుమగాన్’ అనుప్రయోగము నకుదా “క. తమపాటచినుకుచినుకుల, దుమదుమగాఁదడిసినట్టి ♦ దువ్వలువలతో’’ కళా. ‘గీతముఁ బాడుచున్నఁదమకము పుట్టకుండ జనతాహృదయంబులు జాతఁజేసెనే’ అనునప్పుడు “శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ’’ అను శాస్త్రవచనము ననుసరించి శృంగారరసముచే జనులహృదయమును గరఁగించిన దనిభావము. “రౌద్రేఽద్భుతే తథా వీరే పుంరాగేణ ప్రగీయతే, శృంగారహాస్యకరుణాః స్త్రీరాగేణ ప్రకీర్తితాః, భయానకే చ భీభత్సే శాంతే గేయో నపుంసకః’’ కోహళుఁడు. అతిశయోక్త్యలంకారము. “నిగీర్యాధ్యవసానంతుప్రకృతస్య సమేన యత్’ ప్రస్తుతస్య యదన్యత్వం యద్యర్థోక్తౌ చ కల్పనమ్, కార్యకారణయో ర్యశ్చ పౌర్వాపర్యవిపర్యయః. విజ్ఞేయాతిశయోక్తిః సా’’ శా. ప్ర. కవిసామర్థ్యము ననుసరించి యతిశయోక్తు లనేకవిధములుగా నుండును. “హృదయ మధిష్ఠిత మాదౌ మాలత్యాఃకుసుమచాపబాణేన, చరమం రమణీవల్లభలోచనవిషయం త్వయాభజతా’’ కట్టి.

తా॥ ఆచంపకగంధి మధురముగా రాగాలాపమొనర్చుచుండినను, జనులహృదయములు కరఁగునట్లు వీణయందుఁ బలికించుచుఁ బాడుచున్నప్పుడును, తనగోళ్ళతోఁ గిన్నరమీటుచున్న సమయమునను మనుష్యులకుఁ వలపుజనించకుండుటకు బ్రహ్మదేవుఁడు వారిహృదయమును గఠినమయిన జాతితోఁ జేయలేదుగదా.

చ॥ పలుకక యుండె నేని సిత ♦ పంకజలోచన యాదరంబు పైఁ
జిలుకక యుండె నేని విట ♦ శేఖరులన్ గరుణావిదూరు డై
యలుగులపాలు సేయు విష ♦ మాస్త్రుఁడు తత్తరుణీలలామ లో
నలుగుట కాదు ప్రాణముల ♦ కల్గుట దేహవిసర్జనార్థమై. 31.

అ॥ సితపంకజలోచన – తెలిదమ్మిపువ్వులవంటి కన్నులుగల యావేశ్య, విటశేఖరుల్ – ముఖ్యులైన వ్యభిచారపురుషులను గూర్చి, ఇచట 'శేఖర' శబ్దము నగూర్చి. సూ. లింగభేదోభివేదిష్ట అరోపేయదివారుచిః" అధ. పలుకకయుండెనేని – సంభాషించని సమయమునను, ఆదరంబు – మర్యాద, పైన్ + చిలుకకయుండెనేని – తనమీఁదవ్యాపింపఁజేయకుండినప్పుడును, విషమాస్త్రుఁడు – బేసిసంఖ్యగలపంచబాణములను ధరించినమన్మథుఁడు, కరుణావిదూరుఁడై – దయను బొత్తిగాఁబరిత్యజించినవాఁడై – కేవలము దయలేనివాఁడై, అలుగులపాలు + చేయున్ – తనయొక్క శరములకు లోఁబడఁజేయును. అత్తరుణీలలామ – యౌవనపువేశ్యలలో శ్రేష్ఠురాలైన యాచంపకగంధి, ఇచట 'లలామ' శబ్దమునుగూర్చి "సూ. త్రిషులింగేషు చవ్యాప్త్యా శ్రేష్ఠ్యప్యాఖ్యాసావర్ణ్య లక్ష్మసు" అమ. లోన్ – తనమనస్సులో, అలుగుటకాదు – కోపమువహించుటయేగాదు, దేహవిసర్జనార్థమై – విటచంద్రులయొక్క శరీరమును విడచిపెట్టుటకొఱకును ప్రాణములకున్ – వారియొక్క యసువులకొఱకును, అల్గుట – అలుగఁబూనుట, అనఁగా వేశ్య యలుకఁబూనఁ దనప్రాణములు పోక విటుల ప్రాణములు పోవు ననిచెప్పుటచేత, అసంగత్యలంకారము. "భిన్నదేశతయాఽత్యంతం కార్యకారణభూతయోః, యుగపద్ధర్మయోర్యత్ర ఖ్యాతిః సా స్యాదసంగతిః." కా. ప్ర. "క॥ నేరుపుతోఁ గార్యంబును, గారణమును భిన్నదేశగతములుగాని, ధారుణిలోన నసంగతి, యై రంజిలుచుండు సుకవు లది యెట్లన్నన్" ఉదా. "క॥ అనిలోన నీభుజాగ్రం, బనుపమ తరవారిధారనందిన నేలా, యనయంబుఁ దాము వడఁకుదు, రనతారులు శ్రీనృసింహ యతిబలసింహా" కా. సం. మఱియు నాయికాసామాన్యతయు వర్ణింపఁబడినది.

తా॥ ఆవేశ్య తనవిటులతో నొకానొకప్పుడు పలుకకుండినను, గౌరవముఁ జూపకుండినను, మన్మథతాప మధికమగును. అది యలిగెనేని విటులప్రాణము లపహరించుటకే కాని వేఱుకాదు.

క॥ అది గనుక దివిజవేశ్యల, సదనంబుల నున్న మౌని ♦ సంతతితలపుల్
గుదిగుంపులు చేసి మథం, పదె యవకాశంబు గలుగ ♦ స్వర్గమునందున్. 32.

అ॥ కనుకన్ – కాఁబట్టి, అవకాశంబుకలుగన్ – స్థానము దొరకినట్లయిన – వీలుగలిగినట్లయిన, అది – ఆచంపకగంధి, స్వర్గమునందున్ – దేవలోకమున, దివిజవేశ్యలసదనంబులన్ – దేవలోకమునఁబుట్టిన రంభాద్యప్సరసలయొక్క యిండ్లయందు, ఉన్నన్ – ఉండెనేని, మౌనిసంతతితలఁపుల్ – ఋషిమూఁకలయొక్క కోరికలు, గుదిగుంపులు – గుదిగా గ్రుచ్చినగుంపులుగా, దట్టమైన వరుసలుగా, 'ని. గుదిగుంపులు, గుదిగాగ్రుచ్చినగుంపులు, గుదిగుంపులుచేయు, గ్రుదిగుచ్చు, సూ. ఆం. ని. చేసి – కూర్చి, మథింపదె – అల్లకల్లోల మగునట్లుత్రచ్చదా, 'రంభాద్యప్సరోంగన లింకటివిలాసినులు కాకుండుటచే స్వర్గమున మహర్షు లుండఁగలిగిరి, గాని చంపకగంధికే స్వర్గమున స్థానము లభించునట్లలయిన వారి హృదయముల నెప్పుడో మథించియుండెడిది సుమా! అనుభావముచేఁ గార్యకారణరూపాతిశయోక్త్యలంకారము "క. ఉపమేయ మింత దడవక, యుపమానమె నుడువ నతిశయోక్తి కవిమహా, నిపుణోక్తిమూలమై తగు, నపరిమితప్రౌఢి నదియు నైదువిధములై" కా. సం.

తా॥ ఆవేశ్యకు దేవలోకమున వసతి లభించినట్లయిన నచటిమునిమూఁకలకోరికల నెల్లఁ ద్రోపుచేసి త్రచ్చునుసుమా!

సీ॥ వాలుఁగన్నులచేత ♦ వలలఁబెట్టుటె కాక, యభ్యసించిన దొక్క ♦ యదలుచూపు
ముఖచంద్రరుచులచే ♦ ముళ్ళుపెట్టుటె కాక, సంతరించిన దొక్క ♦ వింతనవ్వు
బటువుగుబ్బలచేత ♦ బ్రమలఁబెట్టుటె కాక, సంఘటించిన దొక్క ♦ జాఱుపైఁట
వెలిద్రొక్కుసిగ్గుచే ♦ వెతలఁబెట్టుటె కాక, యలవరించిన దొక్క ♦ కులుకుపలుకు

ఆ॥ గాఢయౌవనమున ♦ గాసిపెట్టుటె కాక, నేర్చుకొన్న దొక్క ♦ నెరతనంబు
తరుణివిభ్రమంబుఁ ♦ దలపోయ శక్యమే, ధాతకైన వాని ♦ తాతకైన. 33.

అ॥ అచంపకగంధిఅధ్యాహారము. వాలుఁగన్నులచేతన్ - విశాలమయిననేత్రములతో. వల లన్ + పెట్టుటె కాక-తనమాయలోఁ బడవేసికొనుటయే కాకుండ, ఒక్క-యదలుచూపున్ - ఒక బెదరుచూపును, అభ్యసించినది-అలవఱచుకొనినది, ముఖచంద్రరుచులచేన్ - చంద్రునివంటిముఖము యొక్క కాంతిచేత, ముళ్ళుపెట్టుటె కాక - బాధించుచుండుటయే కాకుండ, ఒక్క-వింతనవ్వు-ఒక యాశ్చర్యకరమైన పరిహాసమును, సంతరించినది-ధరించినది, ఉదా, 'సీ. లీలదుద్రాక్షమా ♦ లిక దక్షిణశ్రవ - శ్శష్కులీశిఖయందు, సంతరించి, కాశీ. బటువుగుబ్బలచేతన్ - బలిసినస్తనములతో, బ్రమలన్ + పెట్టుటె కాక-భ్రాంతులుగలిగించుటయే కాకుండ, ఒక్క-జాఱుపైఁటన్-కొంచెముక్రిందికి జాఱుచున్నపైఁటను, సంఘటించినది-సమకూర్చినది, వెలిద్రొక్కుసిగ్గుచేన్ - వెలుపలకనటించుచున్న లజ్జతో, వెతలన్ + పెట్టుటె కాక -మనోవ్యథలు కల్పించుటయే కాకుండ, ఒక్క-కులుకుపలుకున్- కొంచెముశృంగారవికార మగపఱచునట్టిమాటలను. అలవరించినది - అలవాటుచేసికొనినది, గాఢ యౌవనమునన్-దృఢమైనవయస్సుచేత, గాసి పెట్టుటె కాక - బాధించుటయే కాకుండ, ఒక్క-నెర తనంబున్-ఒకచక్కదనమును, నేర్చుకొన్నది - అభ్యాసముచేసినది, తరుణివిభ్రమంబున్ - యౌవన వంతురాలైనయావేశ్యయొక్క విలాసమును, ఇచట విభ్రమమును, గూర్చి "స్త్రీణా మాద్యం ప్రణయ వచనం విభ్రమో హి ప్రియేషు" మేఘ. 'విభ్రమః. విలాసఏవ......స్త్రీణా మేషస్వభావో య ద్విలాసైరేవ రాగప్రకాశనం నతు కంఠతః, మల్లి. వ్యా. "అత్రాంతరే కిమపి వాగ్విభవాతివృత్త, వైచిత్ర్య ముల్లసితవిభ్రమము త్పలాక్ష్యాః, తద్భూరిసాత్త్వికవికార మపాస్త ధైర్య, మాచార్యకం విజయి మాన్మథమావిరాసీత్" మాల. మా. పీనింబట్టిచూడ ననురాగముతోఁ గూడినచూడ్కి యని విశద మగుచున్నది. తలపోయన్-వర్ణించుటకు, ధాతకైనన్-మనలసృజించిన బ్రహ్మదేవునకయినను వానితాతకైనన్-అతనినిబుట్టించిన నారాయణునికైనను, శక్యమే-తరమా, కాదనుట. ఇచట వేశ్య యొక్క బెదరుచూపు, వింతనవ్వు, జాఱుపైఁట, కులుకుపలుకు, వర్ణింపఁబడుటచేతఁ గామినీలక్షణములు గోచరమగుచున్నవి.

"ఓష్ఠఃప్రస్ఫురతీక్షణే విచలతః కూపోదకే మత్స్యవ, ద్ధమ్మిల్లః కుసుమాంచితో విగళిత ప్రాప్తోఽపి బంధం పునః, ప్రచ్ఛన్నా వ్రజితస్తనా ప్రకటతాం శ్రోణీతటం దృశ్యతే, నీవీ చ స్ఖలతి స్థితాపి సుదృఢం కామేంగితం యోషితామ్" ఇతి.

"చ॥ పెదవిగదల్చుఁ గన్నుఁగవ♦పెంపెసలారఁ బిఱుందుఁజూచుఁ బ, య్యదవిదిలించుఁజన్నులబ♦
యల్పడఁ గొప్పునసున్నక్రొవ్విరుల్, చెదరినబల్మరుందుఱుముఁ ♦ జెక్కునఁజెమ్మటజీరనించుఁగ,

ట్టదరినఁజక్కఁగట్టఁ జపలాక్షి మనోహరమూర్తిఁ జూచినన్" కావు. 'ముఖచంద్రరుచులు, ఉపమాలంకారము. ద్వితీయసముచ్చయాలంకారము. 'క. మిగుల గుణక్రియ లెయ్యెడ, యుగపత్ప్రాప్తంబులుగ సముచ్చయము కృతిం, బొగడఁ దగున్ ద్వివిధంబై, యగణితకవివినుత మగుచు నది యెట్లన్నన్" "క॥ పాయక ఖలేకపోత, న్యాయమున ననేక కారణము లొక కార్యం, బేయెడ సాధింపఁగ నుత, మై యపరసముచ్చయాఖ్య మగు" కా. సం 'తరుణివిభ్రమంబుఁ దలపోయశక్యమే, అతిశయోక్తియును 'ధాతకైన–తాతకైన, అనుప్రాసాలంకారమును.

తా॥ ఆవేశ్య విటులఁ దనమాయలోఁ బడవేసికొనుటకుఁ దనవిశాలమయినకన్నులు చాలక బెదరుచూపులు గూడ నేర్చినది. జారులనాకర్షించుటకుఁ దనచంద్రునివంటిముఖము చాలక చోద్యమగుచిఱునవ్వును గూడ నభ్యసించినది. కాముకులకు భ్రాంతిగలిగించుటకుఁ దనబలిసిన స్తనములు చాలక జాఱుపయ్యెదను గూడ నలవఱచుకొన్నది. కోడెగాండ్రకు మనోవ్యథగల్పింప సిగ్గునుజూపుట చాలక ఛలోక్తులనుగూడ నేర్చుకొన్నది. జారులను వయస్సుచే గాసిఁజెందించుట చాలక యొకచక్కఁదనమును గూడఁ దెచ్చుకొన్నది, దానివిలాసమును వర్ణింప నెవ్వరికిని దరముగాదు.

## —: చంపకగంధియొక్క విద్యాచాతుర్యము :—

సీ॥ సాహిత్యమార్గంబు ♦ చొకచేసిననాఁడు, సంగీతమునఁ బ్రీతి ♦ సల్ప నేర్చు
సంగీతవైఖరి ♦ సమ్మతింపనివేళ, నింపుగా వీణవా ♦ యింప నేర్చు
వీణావిరావంబు ♦ వెగటుదోఁచినయప్డు, సొగటాలవేడుక ♦ చూప నేర్చు
సొగటాలపైఁగోర్కి ♦ సుదకువచ్చినయంత, వింతమాటల గార ♦ వింప నేర్చుఁ

తే॥ జదువఁ బాడంగ నింతంత ♦ చతుర గాదు, వీణవాయింప నింతంత ♦ జాణ గాదు
జూదమాడఁగనింతంత ♦ జూట గాదు, ప్రతిభపల్కంగ నింతంత ♦ ప్రౌఢగాదు. 34.

అ॥ ఆభోగమిది. అధ్యాహారము చదువన్ – చదువుటయందును, పాడంగన్ – పాడుటయందును, ఇంతంతచతురగాదు – ఇంత, అంత. యనిపరిమితి చెప్పఁదగిన చాతుర్యముగలది కాదు, వీణవాయింపన్ – వీణను ప్రయోగించుటయందును, ఇంతంతజాణగాదు – ఇంతయంతయని నిర్ణయించుటకుఁదగిన నేర్పుగలది కాదు, ఇచట 'జాణ' శబ్దము. మహతీవాచకమగుటకు 'సూ. కొన్నిమహత్ మహతీవాచకముల కేకరూపముల గానఁబడుచున్నది" ప్రౌ. వ్యా. జూదమాడంగన్ – పాచికలాడుటయందు, ఇంతంతజూటగాదు – ఇంత యంత యనుప్రమాణము నెన్నఁదగినమోసకత్తె గాదు, ప్రతిభపల్కంగన్ – నవనవోన్మేషశాలి ప్రజ్ఞతో సంభాషించుటయందు – అప్పటికప్పుడు వికసించెడు బుద్ధివిశేషముతో మాటాడుటయందు, 'ని॥ ప్రత్యుత్పన్నమతిత్వం ప్రతిభా, తదుక్తం, "స్మృతిర్వ్యతీతవిషయా మతి రాగామిగోచరా, బుద్ధి స్తాత్కాలికీ జ్ఞేయా ప్రజ్ఞా త్రైకాల్యగోచరా, ప్రజ్ఞాం నవనవోన్మేష శాలినీం ప్రతిభాం విదుః" ఇంతంతప్రౌఢగాదు – ఇంత యంత యని యెన్నఁదగిననిపుణతగలది గాదు, అనఁగా సమస్తవిద్యలయందు సంపూర్ణమయినసామర్థ్యము గలది యనుట. విటుఁడు. అధ్యాహారము. సాహిత్యమార్గంబు – పాండిత్యముయొక్కపద్ధతిని, చొకచేసిననాఁడు –

పిలువచేయునిదినమున, సంగీతమునన్ — పాటచేత, ప్రీతిసల్పనేర్చున్ - ప్రేమను బుట్టింపఁగలుగును, 'ని॥ గీతం గాన మిమే సమే' అ. 'సమ్యగ్గీతం తు సంగీతం. న్యాయారంభే ప్రసిద్ధకే, తౌర్యత్రికాం త్రితయే చాపి, శబ్దా. సంగీతపై ఖరిన్ - గానముయొక్క క్రమమును, సమ్మతింపనివేళన్ - ఇష్ట పడనిసమయమున, ఇంపుగాన్ - ఆనందమగునట్లు, వీణవాయింపనేర్చున్ - వల్లకినిప్రయోగింపఁగలు గును, ఇచట వాద్యభేదములు నాలుగువిధములు. 'ని॥ తతం వీణాదికం వాద్య మానద్ధం మురజాది కం, వంశాదికం తు సుషిరం, కాంస్యతాలాదికం ఘనమ్, చతుర్విధ మిదం వాద్యం, వాదిత్రం తోద్యమానకమ్, అ, వీణావిరావంబు - వల్లకీనాదము, వెగటు+తోఁచినయప్డు - వెక్కసమయిన సమయమున, సొగటాలవేడుక - జూదమునందలివినోదమును, చూపనేర్చున్ - కనఁబఱచఁగల్గును, సొగటాలపైన్ - జూదపుఁగాయలమీఁద, కోర్కి - అభిలాష, సుదకువచ్చినయంతన్ - తీఱిన తోడనే, వింతమాటలన్ - చోద్యమును గలిగించునట్టి పలుకులచేత, గారవింపనేర్చున్ - ప్రేమను జూపుచుండును, ఇందు నాలుగుసీసపాదములకుఁ గ్రమముగా నాలుగుగీతపాదములయొక్క భావ ములు చెప్పఁబడినందున యథాసంఖ్యాలంకారము. "క॥ సమముగ నేవరుసఁ బదా, ర్థము లుద్దిష్టంబు లయ్యెఁ దగ నాపర్యా, యమున ననూద్దిష్టములై, యమర యథాసంఖ్య మయ్యె" సరస.

తా॥ ఆవెలయాలు పాండిత్యమునందును, సంగీతమునందును, మితిమించిన చాతుర్యముగలది, వీణావాదనమునం దపరిమిత మగునేర్పుగలది. జూదమునం దసమానమయినజాణతనము గలది. సమ యానుకూల సంభాషణములయందు మిగులనిపుణత గలది. ఒకటి యననేల యన్నిటియందును మెచ్చు కొనఁదగిన జాణతయే. కాముకుఁడు సాహిత్యమును జులకఁగాఁజూచెనేని సంగీతమునం దిష్టమును బుట్టించును. గాన మింపుగలుగనియపుడు చక్కఁగా వీణవాయించును. వీణపాటయందు రుచి తగ్గినసమయమున జూదమాడి వినోదమును జూపును. పాచికలాటయం దిచ్చదీఱెనేని చోద్యప్రసంగ ములతోఁ బ్రియమును గలిగించును.

చ॥ తగవరి మాటకారి నయ ♦ ధన్య పదార్థముపట్ల మిక్కిలిం
దెగువరి కంతుకేళి గడి ♦ దేఱినజాణ రసజ్ఞకోటిచేఁ
బొగడతఁగాంచినట్టిగుణ ♦ భూషణ ముద్దులగుమ్మ దానికిం
దగనిది చేసె నానలువ ♦ దారుణనిస్స్వనఝిల్లిఁ దల్లిగన్. 35.

అ॥ తగవరి - తీర్పరియును - అనఁగా వ్యవహారములను బరిష్కరించునది యనుట. తగవు+ అరి - తగవరి. మాటకారి - పదుగురిలో నిర్భయముగాఁ బ్రసంగమును జేయునటువంటిదియును, నయధన్య - నీతియొక్క సమృద్ధికలదియును, పదార్థముపట్లన్ - వస్తువులయెడల, మిక్కిలిన్ - ఎంత యును, ఎక్కువగాననుట. తెగువరి - ఉదారబుద్ధికలదియును, కంతుకేళిన్ - సంభోగమునందు, గడిదేఱినజాణ - ఆరితీరిననేర్పరియును, రసజ్ఞకోటిచేన్ - శృంగారరసానుభవముగలవారియొక్క సమూహముచేత, పొగడతన్ - స్తుతిని, కాంచినట్టిగుణభూషణ - పొందినదియైన సద్గుణములనియెడి సొమ్ములుగలదియును, ముద్దులగుమ్మ - ముద్దులుమూటగట్టుకట్టి యందగత్తెయును, ఇచట 'ముద్దుల గుమ్మ, అనునది లుక్సమాసము. 'సూ. ద్రుతస్య సర్వత్ర లుక్సమాసే ఘ' - శబ్దచిం. అయిన. దాని

కిన్ – ఆచంపకగంధికి. నలువ – నాలుగుమోములుగలవాఁడయిన బ్రహ్మదేవుఁడు, ఇచట నలువ యనుటకు "సూ. క్వచి దంతిమవర్ణస్య సమాసాంతత్వమిష్యతే" అథ. తగనిది – కూడనిదానిని, దారుణనిస్వనఝిల్లిన్. దారుణ – భయంకరమైన, వ్యు. దారయతి చిత్తమితిదారుణం, నిస్వన – ధ్వనియందు, ఝిల్లిన్ – ఈలపురుగయినదానిని. తల్లిగన్ జననియగునట్లు, చేసెన్ – పుట్టించెను, ఇందు 'మిక్కిలిన్' అనుటకు "సూ. నామ సర్వనామంబులకును గళలగు నవ్యయంబులకును గడపల సముచ్చయార్థ విశేషపాదపూరణంబులయందు ను శబ్దంబు తఱచుగ నగు. క ళలగు ననుదంతశబ్దంబుల మీఁద నయ్యది యువర్ణపూర్వకంబుగ విభాషనగు మఱియు నది శేషషష్ఠియందు యొక్క లోపించి నపుడు లాగమాంత బహువచనంబు మీఁదను సముచ్చయమునం జూపట్టెడు. ప్రౌ. వ్యా. ఉదా. "చ॥ భాసిలుఁదత్పురికోట మిక్కిలిన్, మహిమను" కళా. "క॥ ఎనొకటి విన్నవించెద, దానవకుల మథన పెద్దకొడవున నుండిం, బూని వినిపింపఁగలపని" ఉ. హవం. "మ........లాతిరాజులకు మెచ్చే యివ్విధం బిట్టిదిం, గలదే" భార. ఇచట నింత గాథ యనవసరము. "సూ. ద్రుతోపరి స్థితిన శ్శబ్దావః. కేచిత్సుకవిసమ్మతః" అథ. ఉదా ఏర్పాటున్–క్రమ్మఱన్–గ్రక్కునన్–అంతన్–మిక్కిలిన్–మిగులన్–చెచ్చెరన్–తద్దయున్–ఇంకన్–ఇత్యాదులు. ఇందు. ఆవేశ్యయొక్క సౌందర్యము నే కాక యనేకసుగుణములను వర్ణించియుండుటచే సముచ్చయాలంకారము "తత్సిద్ధిహేతావేకస్మిన్ యత్రాన్య త్తత్కరం భవేత్, సముచ్చయోఽసౌ" కా. ప్ర. "క॥ పాయక ఖలే కపోత, న్యాయమున ననేక కారణము లొక కార్యం, చేయెడ సాధింపఁగ నుత, మై యపరసముచ్చయాఖ్య మగు నెట్లన్నన్" నరస. ఆబిడను సమస్తసుగుణసంపన్నురాలినిగ వర్ణింపఁబడియుండుటచేత నాయికాలక్షణములతో నొప్పుచున్నదని భావము. "రూప యౌవనలావణ్య లజ్జా మాధుర్యశాలినీ, సౌభాగ్యౌదార్యసంపన్నా నాయికా సా పునస్త్రిధా" సాహి. చిం. "విత్తమాత్రోపాధే స్సకలపురుషాభిలాషిణీ సామాన్యవనితా" ప్రతా.

తా॥ వ్యవహారములయందుఁ దీర్పుకత్తెయును, పదుగురులో జంకులేకమాటలాడునదియును, ప్రశంసింపఁదగిననీతి గలదియును, ఈవియందు మిగులఁ జెంపుగలదియును, రతులయం దారితేరినదియును, రసికులచే మెప్పువడసినసుగుణసంపత్తి కలదియును, మిక్కిలిచక్కనిదియును, అయినయాచంపకగంధికి బ్రహ్మదేవుఁ డొకపనికిమాలిదానిని దల్లిగాఁ బుట్టించెను.

## —◆◆◆ వేశ్యామాతవర్ణనము ◆◆◆—

గీ॥ ఆవధూమణి కాశించి ◆ యరుగుదెంచు, విటులమర్దించుకాంక్షను ◆ వ్వేఁదిమాత
వరనిధానగ్రహార్థులై ◆ నచ్చువారి, దుస్సహాటోపమున మొత్తు ◆ దుర్గహోలె. ౫౬.

అ॥ ఆవ్వేలఁదిమాత–ఆచంపకగంధియొక్కతల్లి, ఆవధూమణికిన్–ఆయువిజవ్వనికిన్, ఆశించి, అపేక్షపడి, అరుగుదెంచువిటులన్–చేరినజారులను, మర్దించుకాంక్షన్–నలిపివేయుకోరికయందు వరనిధానగ్రహార్థులు, వరనిధాన–శ్రేష్ఠమైనధనమతఱుఁగకుండనుండెడి పాతఱను, వరనిధానమనియుఁ జెప్పవచ్చును. నిధులలో వరనిధిగొప్పది. "మహాపద్మశ్చ పద్మశ్చ శంఖో మకరకచ్ఛపౌ, ముకుంద, కుందనీలాశ్చ వరశ్చ నిధయో నవ" గ్రహార్థులు–పట్టుకొనఁ బ్రయత్నించినవారై వచ్చువారిన్–

వచ్చినట్టివారలను, దుస్సహాటోపమునన్-దుస్సహ-ఓర్వరాని, ఆటోపమునన్-గర్వముతో, దుర్గ వోలె-కాళికాశక్తివలె, మొత్తున్-హింసించును, ఇచటఁ గాళికాశక్తి మణిభద్ర యనురూపముతో నిధులను గాపాడునని శాస్త్రము. 'మొత్తున్', అనుట కుదా. "ఉ. దేవకిన్, ముందఱపట్టి వంచి తెగ♦మొత్తఁగడంగినఁగంసు" భాగ. 'ఆవేశ్యకో-అ కరుడెంచినవిటులను దానితల్లి నిధిసమీపమున నున్న కాళికాశక్తివలె బాధించును, అనుటచే గుణస్వరూపోత్ప్రేక్ష, "యత్రాన్యధర్మసంబంధా దన్యత్వే నోపతర్కితమ్, ప్రకృతం హి భవేత్ప్రాజ్ఞా స్తాముత్ప్రేక్షాం ప్రచక్షతే" ప్రతా. "మన్యేశంకే ధ్రువంప్రాయోనూన మిత్యేవమాదిభిః, ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైరివశబ్దోఽపి తాదృశః" కావ్యా.ద.

తా॥ ఆవేశ్యతల్లి తనకూఁతు రగుచంపకగంధిపైఁ గోరికతో నేతెంచుజారులను నిధిరక్షకురా లగుకాళికాశక్తి ధనముదొంగిలింపవచ్చినవారిని హింసించునట్లు బాధించును.

క॥ తుదినుండి మొదటిదనుకం, గొదవలె పచరించు సాధు ♦ గుణ మింతయు లే
దది చెఱిచినకాఁపురములు, పదిలక్షలు గలవు సొమ్ము ♦ పైఁ గోరికచేన్. 37.

అ॥ అవృద్ధవేశ్య. తుదినుండి-చివరనుండి, మొదటిదనుకన్-మూలమువఱకును, కొదవలెపచ రించున్-లోతక్కువలె ప్రకటించును, 'పచరించు, ననుటకుదా. "ద్వి. హరివద్దనడచిన♦యవ్వార్త లెల్లఁ, బచరించి" విష్ణుపు. సాధుగుణము-మంచిబుద్ధి, ఇంతయులేదు-కొంచెమయినను లేదు, అది-అముదుసలిది, సొమ్ముపైన్ + కోరిక చేన్-ధనముమీఁదియాశచేత, చెఱచిన కాఁపురములు - చెడఁగొట్టినసంసారములు, పదిలక్షలఁగలవు-వేలకువేలున్నవి, అతిశయోక్త్యలంకారము.

తా॥ ఆముదుసలిది యెల్లప్పుడును విటకాండ్రయందు నేరములారోపించుచుండునే కాని మంచి గుణము దానికి లేనేలేదు. అది ధన కాంక్షచే వేలకుటుంబములను బాడుచేసినది.

క॥ లక్షయొసంగిన నది నిర, పేక్షతవిహరింప దర్థ ♦ మిమ్మనక దయా
దాక్షిణ్యంబులు పూజ్యము, రాక్షసిపుట్టినది విటుల ♦ ప్రాణములు గొనన్. 38.

అ॥ అది-అవృద్ధవేశ్య, లక్షయొసంగినన్-లక్షరూపాయలనొసంగినను, అర్థమున్ + ఇమ్ము + అనక-ధనమును దెచ్చియిమ్మనియడుగక, నిరపేక్షతన్-ఆశపడకుండునట్టి యుద్దేశముతో, విహరింపదు-ప్రవర్తించదు, దయాదాక్షిణ్యంబులు-కనికరమును మోమోటమియును, పూజ్యము-సున్న - లేవనుట, విటులప్రాణములు-మిండగాండ్రయొక్క యసువులు, కొనన్-అపహరించుటకు, రాక్షసిపుట్టినది-రక్కసియే మనుష్యజన్మమెత్తినది, లక్షయునిచ్చిన నది నిరపేక్షతవిహరింపదు, అనుటచే స్వభావోక్తి యును. అతిశయోక్తియును. 'రాక్షసి పుట్టినది విటులప్రాణములు గొనన్', అనుటచే నపహ్నవా లంకారము, "ప్రకృతం య న్నిషిధ్యాన్యత్ సాధ్యతే సాత్వపహ్నుతిః" కా. ప్ర.

తా॥ దానికిఁ గోడెగాండ్రెంతధరమొసంగినను మరల డబ్బుతెమ్మనక మానదు. కనికరమును మొగమోటమును దానియొద్ద లేవు. అది కేవలము జారులప్రాణములు నపహరింపభూమిపైఁ బుట్టిన ప్రత్యక్షరాక్షసి యనఁదగు.

త్యంతమభీష్టమవ్యయము ♦ స్వాంతము నీతము నంచితంబు ప
ర్యంత మనంగ సంధులఁ ది ♦ రంబగు రెంటను బ్రాదు లచ్యుతా''

కోడెకాండ్రు, అనుటను 'సూ. స్త్రియా మాడి బహుత్వే స్యా త్పుంసి దీర్ఘా న్నిరుచ్యతే, ఉతో లోపశ్చ లలయోః స్తయోః పుంసి రుతా మతా'' అని. అసంబంధసంబంధాతిశయోక్త్యలంకారము. "సంబంధాతిశయోక్తి స్స్యా దయోగే యోగకల్పనమ్, యోగే ప్యయోగోఽసంబంధాతిశయోక్తిరితీష్యతే'' చంద్రా.

తా॥ అజఅభికి దేవలోకమునుండి నలకూబరుఁడు వచ్చి బంగారునగలును జలతారుచీరలును నిత్యము నొసంగినను మెప్పులేదు. జయంతుఁడయినను నాయొద్దపైకము లేదు తీసుకు తెచ్చియిచ్చెద ననినఁబోనీయదు. అట్టిదానిని బడుగువాండ్రెట్లుజయింపఁగలుగుదురు.

సీ॥ నిర్ణిద్రదారిద్ర్య ♦ నిరుపాధియుతషిద్గ, సంజాతహృద్భల్లి ♦ లంజతల్లి
కామితార్థవితీర్ణి ♦ కర్ణాయమానప, ల్లవలోకవటుఝల్లి ♦ లంజతల్లి
నిజశాసనోల్లంఘ ♦ నజిఘృక్షుకామిలో, లకురంగచయభిల్లి లంజతల్లి
శాంబరీచంగ భు ♦ జంగ కృత్యవివేక, పింజభూరుహవల్లి ♦ లంజతల్లి

తే॥ బహువిధోపాయచణపంచ ♦ భద్రభద్ర, కుంజరమృగాధిపమతల్లి ♦ లంజతల్లి
నిఖిలవిటజనారంభముల్ ♦ నేలఁ గలప, నంజ కరుదెంచుపెనువెల్లి ♦ లంజతల్లి. 41.

అ॥ నిర్ణిద్ర......ద్భల్లి. నిర్ణిద్ర - జాగరూకమయిన, దారిద్ర్య - బీదతనముచేత, నిరుపాధి-కుటుంబపోషణరహితములో, యుత-కూడిన, షిద్గసంజాత - జారపురుషుల సముదాయముయొక్క, హృత్-మనస్సులకు. భల్లి-బాణమైనది, "ని. భల్లా భల్లీ చ సాయకే, నానా. ఉదా "తే. గీ. విపుల భుజగర్వదర్పితవిమతరాజ, రాజహృద్భల్లి'' శృం. శా. లంజతల్లి-కామితా......ఝల్లి కామిత + అర్థ-కోరఁబడినధనమును, వితీర్ణి-ఇచ్చుటయందు, కర్ణాయమాన - కర్ణుఁడుగానగుచున్న, పల్లవలోక వట-విటసమూహమనెడు మఱ్ఱిచెట్టునకు, ఝల్లి-కూఁకటివేళ్ళనుపైకము నిర్మూలనముచేయునట్టి యీల పురుగయినట్టిది' "ని. భృంగారీచీరుకాచీరిఝల్లికాచసమాఇమాః'' అ. లంజతల్లి. నిజశా......భిల్లి. నిజశాసన-తనయొక్క యాజ్ఞను, ఉల్లంఘన-తిరస్కరించుటయందు, జిఘృక్షు - అపేక్షగల, కామిలోలకురంగచయ-విటులనెడి కదలుచున్న లేళ్ళగుంపునకు, భిల్లి-బోయదియైనట్టిది, లంజతల్లి. శాంబ... వల్లి, శాంబరీచంగ-మాయయందలినేర్పుచేత, భుజంగకృత్య-విటులయొక్క చేష్టలను, వివేక-తెలిసికొనునట్టి, పింజభూరుహవల్లి-బలమయిన యోషధీలతయైనట్టిది, లంజతల్లి, 'ని. పింజంతుబలే క్లీబం వధేపుమాన్, హరిద్రాతూలయోః స్త్రీ స్యాదాకులే త్వభిధేయవత్'' నానా. ఇచట భుజంగశబ్దము నకు సర్పమనియు విటుఁడనియు రెండర్థము లుండుటచే గారడివాండ్రు సర్పవశీకరణమునకుఁ దెల్లయీసర నెట్లుపయోగింతురో యట్లే తనమాయ వారలపై నుపయోగించుచుండు నని భావము. 'ని. భుజంగః షిద్గసర్పయోః, విశ్వ. బహు.........తల్లి, బహువిధ-అనేకవిధములయిన, ఉపాయ-యుక్తులయందు, చణ-నేర్పుగల, పంచ-అయిదిఁటిచేత, అనఁగా మిత్రభేదము, సుహృల్లాభము, సంధివిగ్రహము, లబ్ధప్రణాశా, సంప్రేక్ష్యకారిత్వముఅనునైదుతంత్రములచేత ననుట. భద్ర-సుఖమును

బొందునట్టివారైన, భద్రకుంజర-షట్పుడేనుఁగులకు, మృగాధిపమతల్లి-శ్రేష్ఠమగుసింహమైనట్టిది, బహు
విధోపాయచణు లనెడిపంచవర్గాశ్వభద్రకుంజరములకు సింహమైనట్టిది యనియుఁ జెప్పవచ్చును. లంజ
తల్లి. నిఖిలవిటజనారంభముల్-జారులందఱియొక్క ప్రయత్నము లను, నేలన్+కలపన్-భూమిపాలు
చేయుటకు, రూపుమాపుటకు, నఁజనున్ - నాటువేసినమాగానిమీఁదను, అరుదెంచుపెనువెల్లి-వచ్చు
చున్న ప్రళయకాలమందలి యేకార్ణవమయినట్టిది. పెనుపు+వెల్లి. ఉదా "వ. అప్పెనువెల్లియల్ల
నడంగిపోవఁదొడంగు నెడ" భార. లంజతల్లి, కూచిమంచితిమ్మకవియునిట్లె వర్ణించినాఁడు.

సీ॥ పల్లవవ్రాతంబు ♦ పాలిఁబల్ రాకాసి, ప్రకటితోద్యన్మద్య ♦ పాననిరత
గురుతరానేకదు ♦ ర్గుణగణాలంకార, సకలమాయావాద ♦ జననసీమ
భూరికోపవికార ♦ పూరితనిజచిత్త, కఠినవాక్యక్రియా ♦ గ్రథితరసన
ధరనీతులకెల్ల ♦ గొఱుతమీఱినతావు, దానధర్మదయావి ♦ ధానహీన
తే॥ శాకినీభూతభేతాళ ♦ సమదదైత్య, భీకరాకారనిలయగం ♦ భీరనినద
సువశరారావమార్గభా ♦ సురసమగ్ర, లగ్నకంటకయుతవల్లి ♦ లంజతల్లి. రాజ.

ఈపద్య మనుప్రాసాంత్యప్రాసములతోఁ జెప్పఁబడినది. మాలారూపాలంకారము.

"మ॥ అలసందేహము మాడ్కిఁ గాక నుపమే ♦ యంబెన్న నచ్ఛన్నమై
యలఘూత్ప్రేక్షయు నా నభిన్నమతిజం ♦ బైయుండ కారోప విం
పలరంగాఁ బ్రకృతోపయోగి పరిణా ♦ మారోపతుల్యంబుగా
కలయారోపిత మిందు రంజనము సే ♦ యన్ రూపకంబై తగున్. నరస.

"ఆరోపవిషయస్య స్యాదతిరోహితరూపిణి, ఉపరంజక మారోప్యమాణం తద్రూపకం మతమ్" ప్రతా. "మాలా తు పూర్వవత్" కా. ప్ర.

తా॥ ఆముసలివేశ్య యొడతెగని దరిద్రముతో జీవయాత్రఁ గడపఁజాలని వ్యభిచారులమనస్సులను బాణమువలెఁ గలఁచును. అది కోరినవస్తువులన్నియుఁ గర్ణునివలె నొసఁగుమండువిటులను మహావృక్షమునకు వేళ్ళనుగొట్టివైచునట్టియీలపురుగువలె దురాలోచన చేసి నాశము చేయును. తనయాన దాఁటినడువఁబూనుమిండగాండ్రను తేళ్ళనుబోయదానివలెఁ బట్టును. కాముకులమాయలన్నియు నిమిషములోఁ గనిపెట్టి వారి నసియాడనీయకుండును. ఎన్నియుక్తులుగలవారినైన మిగులనేర్పుతోఁ బట్టును. వా రెన్నిప్రయత్నములుచేసినను అవియన్నియు ఱెప్పపాటులో విఘ్నము చేయును.

సీ॥ పిడుగుచండమ్మునఁ, బడిమోదు తెరువాటు, కానికైన నొకింత ♦ కరుణ పుట్టు
బహుధనాపేక్షచే ♦ బాధించునృపతికై, నను జనించు నొకింత ♦ కనికరంబు
చేరికన్నడభూమిఁ ♦ జెఱవట్టుపాశ్చాత్య, నృపతికైన నొకింత ♦ కృప దలిర్చు
నతిపాతకులనొంచు ♦ యమకింకరులకైనఁ, గందళించు నొకింత ♦ కారుణికత
తే॥ యసమసాయకసమరక ♦ ర్మాంతరాయు, కఠినపాకీనవాక్క్రియా ♦ గౌరవమున
నఖిలవిటకోటిధనమెల్ల ♦ నపహరించు, లంజతల్లికి దయలేదు ♦ లక్షువైన. 42.

అ॥ పిడుగుచండమ్మునన్ - ఇంద్రునిచేతనుండెడి వజ్రాయుధమువలె, పడి - పైనఁబడి, మోదు తెరువాటువానికైనన్ - కొట్టుచున్నదారులుగట్టి కొట్టెడు దొంగవానికైనను, ఒకింత కరుణ

పుట్టఁగ - కొంచెమయినను దయగలుగును, బహుధనాపేక్షచేఁగ - ధనమునందలి యధికమయిన యాశచేత, బాధించునృపతికైనను - కష్టపెట్టుచున్న రాజునకయినను, ఒకింతకనికరంబు - ఇంచుకయైననుకృప, జనించుఁగ - పుట్టును. కన్నడభూమిఁగ - కర్ణాటరాజ్యమునందు, చేరి - ప్రవేశించి, చెఱవట్టు పాశ్చాత్యనృపతికైనఁగ - యుద్ధములోబలాత్కారముగాఁబట్టికొనివచ్చి 'నిర్బంధించునట్టి పడమటిదేశమువాఁడయిన తురుష్కప్రభువునకయినప్పటికిని, ఒకింతకృప - కొలఁదియక్కటికము, తలిర్పఁగ - కలుగును. ఇతఁడు గర్భిణీస్త్రీలను బిడ్డతల్లులను సైతము పాపమనియెంచక ఘోరదర్శనముగా నఱకించినట్లు చరిత్రములు చెప్పుచున్నవి. కృష్ణరాయలకుఁ బూర్వము తురుష్కప్రభువులాంధ్రదేశముపైకి దండెత్తివచ్చినప్పుడు జరిగినదుర్ణయ మిందు జ్ఞప్తిచేయఁబడినది. చాటుపద్యమణిమంజరిలో నీవాక్యమునకు సమన్వయముచేయఁబడక యీకవి కృష్ణరాయల యనంతరమువాఁ డయియుండనోపు నని వ్రాయఁబడియున్నది. "ఆనెగొందిపై తురుష్కులదండయాత్ర క్రీ. శ. 1334 సం॥ తుంగభద్రానదికి నుత్తరపుటొడ్డున గలయానెగొంది దుర్గమునందున్న జంబుకేశ్వరునిపైనిఁ దురుష్కచక్రవర్తి ఢిల్లీనుండి యసంఖ్యాకములైన సైన్యముతో దండెత్తి వచ్చుచుండ గవికోటసమీపమున జంబుకేశ్వరుఁ డెదురించుటయు మఱియొకమాఱు ఢిల్లీతురుష్కులకును, ఆంధ్రకర్ణాటులకును. ఘోరయుద్ధముజరిగెను. ఈయుద్ధము తనకుఁ బ్రతికూలముగాఁ బర్యవసితమగు ననియూహించి తురుష్కులవలన స్వకుటుంబమునకు మానభంగ మగునేమో యనుభయముతోఁ దనస్త్రీలనెల్లర నగ్నిప్రవేశమగునట్లు చేసి రాజు శత్రువును మార్కొని పౌరుషముతోఁ బ్రాణములున్నంతవఱకుఁ బెనఁగి తుదకు వీరస్వర్గమునే చూడఁగలిగెను. ఆనెగొందిదుర్గము తురుష్కులవశ మయ్యెను" ఆం. చరి. 3. భా 9. పు. "విజయనగరవైభవమును బలువురు పలువిధములఁ గొనియాడుచుండ మహమ్మదుషా చెవులకా పలుకులు ములుకులై నాటుచుండెను. క్రీ. శ. 1366 సం॥ సైన్యముల సమకూర్చుకొని వీరబుక్కభూపాలునిపై దండయాత్ర వెడలివచ్చెను" ఆం. చరి. 3. భా. 358 పు. ఇతఁడు 1358 మొదలు, 1375 వఱకు రాజ్యపరిపాలన మొనర్చెను. మహమ్మదీయచరిత్రకారులలో ముఖ్యుఁ డగుఫెరిస్తా తనగ్రంథమున "తురుష్కులు చెలరేగి తారసించినయెల్లరను నఱికివైచుచుండిరి. గర్భిణీస్త్రీలను సైతము వదలిపెట్టక హతము చేయుచుండిరి. బిడ్డల ఱొమ్ములమీఁదనుంచుకొని పెనఁగులాడుచున్న తల్లులనుండి బిడ్డలను లాగి బిడ్డలను తల్లులను గూడ నఱకుచుండిరి." అనియున్నది. కావున క్రీ. శ. 1478 లో అగ్రహారాదిసత్కారము లందినకవి క్రీ. శ. 1334, 1336 సం॥ నాఁటిచరిత్రమును వర్ణించుట సమంజసమే కదా. శ్రీనాథుఁడును "శా. కుళ్ళాయుంచితిఁ గోకజుట్టితిని నేఁగూర్పాసముం దొడ్గితిన్, జల్లాయుంబలిద్రావితిన్ రుచులు దోసంబంచుఁ బోనాడితిన్, వెల్లుల్లిం దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపఁగాఁ దల్లీ కన్నడరాజ్యలక్ష్మి దయలేదా నేను శ్రీనాథుఁడన్" అనియానాఁటికే తురుష్కవేషమును వర్ణించియున్నాఁడు. రామరాజభూషణుఁడును "సీ॥ జీర్ణకర్ణాటలక్ష్మీపునస్సృష్టిః సైన్యానిలోకేశ్వరత్వము పొసంగు" నని వర్ణించియున్నాఁడు. కనుక రాయలకుఁబూర్వమే కన్నడరాజ్యము తురకలవశమై మరలజయింపఁబడినట్లు విశదమగుచున్నది. అతిపాతకులన్ - అధికమైనపాపాత్ములను, నొంచుయమకింకరులకైనన్ - నొవ్వఁజేయుచుండిన యమునియొక్కదూతలకయినను; ఒకింతకారుణికత - కించిన్మాత్రముకనికరము, ఇసుమంతదయ, కందళించున్ - అంకురించును- "ని. కందళం తు నవాంకూరే కలధ్వనౌ" హేమః. "కందళం త్రిషు కపాలే వ్యుపరాగే

నవాంకురే”షు. “కఁడళిఁచు-అఁకరిఁచు-మొఁటచు” ప్రాణ్య. సూ. ౫౦. ని. ఉదా“వ.కందళించుం గావుత” శృం. నై. ఇచట యమదూతలను గురించి పురాణములయందు యమలోక మిట్లు వర్ణింపఁ బడినది. “చిత్రగుప్తాలయా దగ్రే యోజనానాం చ వింశతిః, పురమధ్యేమహాదివ్యం, ధర్మరాజస్య మందిరమ్ అస్తి రత్నమయం దివ్యం విద్యుజ్జ్వాలార్క వర్చసం, ద్విశతం యోజనానాం చ, విస్తారాయామతః స్ఫుటమ్” పంచాశ చ్చ ప్రమాణేన యోజనానాం సముచ్ఛ్రితం, ధృతం స్తంభసహస్రై శ్చ, వైడూర్యమణిమండితం” కాంచనాలంకృతం నానాహర్మ్యప్రాసాదసంకులం, శారదాభ్ర నిభం రుక్మ కలశైస్సుమనోహరం” చిత్రస్ఫటికసోపానం వజ్రకుట్టిమశోభితం, ముక్తాజాలగవాక్షంచ పతాకాధ్వజభూషితం” ఘంటానేకనినాదాఢ్యం హేమతోరణమండితం, నానాశ్చర్యమయం స్వర్ణ కవాటశతసంకులం” నానాద్రుమలతాగుల్మై ర్నిష్కంపై స్సువిరాజితం, ఏవమాదిభి రన్యై శ్చ భూషణై ర్భూషితం సదా, ఆత్మయోగప్రభావై శ్చ నిర్మితం విశ్వకర్మణా”......“తస్మి న్నస్తి సభా దివ్యా శతయోజన మాయతా, పుణ్యా శ్శబ్దాదయ స్తస్యాం.నిత్య కామఫలద్రుమాః, అసంబాధాచసాతాస్యు రమ్యా కామగమాసభా, దీర్ఘ కాలం తప స్తప్త్వానిర్మితా విశ్వకర్మణా” సం. గరు. నరకము యొక్క భేదములు- “చతురశీతిలక్షాణి నరకా స్సంతి ఖేచర, తేషాం మధ్యే ఘోర తమా, ధౌరేయా స్త్వేకవింశతిః” తామిస్రో లోహకుండశ్చ, మహారౌరవ శాల్మలీ, రౌరవం కుడ్మలః కాలసూత్రకంపూతివృత్తికా” సంఘాతో లోహితోదశ్చ సవిష స్సంప్రతాపనః, మహానిరయ కాకోలౌ, సంజీవనమహాపథౌ” అవీచి రంధతామిస్రః, కుంభీపాక స్తథైవచ సంప్రతాపననామైక, స్తపన స్త్వేకవింశతిః” గరు. యమదూతలు పాపులను శిక్షించుట. “క్షమాపరాధం కురుతే భగ వాన్ హరి రీశ్వరః, వయం తు సాపరాధానాం, దండదా ఽపి తదాజ్ఞయా” ఏవ ముక్త్వా చ తే దూతానిర్దయా తాడయంతి తాన్, జ్వలదంగారసదృశాః పతితా స్తాడనా దథః” పతనా త్తస్య పత్రై శ్చ గాత్రచ్ఛేదో భవే త్తతః, తా నథఃపతితాన్ శ్వానో భక్షయంతి రుదంతి తే” రుదంత స్తే తతో దూతై ర్ముఖ మాపూర్య రేణుభిః, నిబధ్య వివిధైః పాశై ర్హన్యంతే కేఽపి ముద్గరైః” పాపినః కేఽపి ఛిద్యంతే, క్రకచైః కాష్ఠవ ద్ద్విధా। క్షిప్త్వా చా న్యేఽథవా పృథ్వ్యాం కుఠారైః ఖండశః కృతాః” అర్ధం ఖాత్వా వటే కేచిత్, భిద్యంతే మూర్ధ్ని సాయకైః అపరే యంత్రమధ్య స్థాః పీడ్యంతే చేక్షుదండవత్” కేచి త్ప్రజ్వలమానైస్తు సాంగారైః పరితో భృశమ్ ఉల్ముకై ర్వేష్టయిత్వా చ, ధ్మాయంతే లోహపిండవత్” కేచి ద్ఘృతమయే పాకే, తైలపాకే తథాఽపరే, కటాహక్షిప్తపటవత్, ప్రక్షిప్యంతే యత స్తతః” కేచి న్మత్తగజేంద్రాణాం క్షిప్యంతే పురతః పథి, బధ్వా హస్తౌ చ పాదౌ చ క్రియంతే కేఽప్యధోముఖాః” క్షిప్యంతే కేఽపి కూపేషు పాత్యంతే కేఽపి పర్వతాత్, నిమగ్నాః కేఽపి కుండేషు, తుద్యంతే క్రిమిభిః పరే” వజ్రతుండై ర్మహాకాకై ర్గృధ్రై రామిషగృధ్నుభిః, నిష్కృత్యంతే శిరోదేశే నేత్రే చాన్యే చ చుంచుభిః”.............
పాపినాం నరకాలయే, ఛిత్వా సందంశకై ర్దూతా మాంసఖండాన్ దదంతి చ.” సం।గరు, మీ తప్పిదములను ఈశ్వరుఁడుమాత్రమే క్షమింపఁగలఁడు. అతనియానతిచొప్పున మేము పాపులదండిం తుము. యమదూత లిట్లుపలుకుచు మఱలమఱలఁ గొట్టుచుండఁగా నాపాపులు చెట్టునుండి క్రిందఁబడు చుందురు. అపడునపుడు దానియాకులచే శరీరము తెగి పోవుచుండును. అక్రిందఁబడిన పాపులను కుక్కలు కఱచుచుండును. ఆబాధ కోర్వలేక వారేడ్చుచుందురు. ఇట్లేడ్చెడి యాపాపులనోళ్ళలో

దుమ్ముగొట్టి త్రాళ్లతోఁగట్టి యమకింకరులు ముద్గరములతోఁ గొట్టుచుందురు. ఆబాధలకుఁగూడ నోర్వజాలక వారేడ్చుచుందురు. యమభటులు కొందఱు పాపులను అంపములతోఁ గజ్జలుగోయు నట్లుగోయుచుందురు. కొందఱిని భూమిమీఁదఁబరుండఁజేసి గొడ్డళ్లతో ముక్కలుచేయుచుందురు. కొందఱిని మొలవఱకుభూమిలోఁ బాతిపెట్టి బాణములతో శిరములు ఛేదించుచుందురు. కొందఱిని చెఱకుగడవలె గానుగలోఁబెట్టి త్రిప్పుచుందురు. కొందఱిని నిప్పులలోనుంచి యినుముకాల్చికొట్టి నట్లు సమ్మెటలతో సాగఁగొట్టెదరు. సలసల కాగునేతిలోఁ గొందఱిని నూనెలోఁగొందఱిని బడవైచి వేఁపుచుందురు. కొందఱిని గాళ్లుచేతులుగట్టి బోరగిలఁబరుండఁబెట్టి యేనుఁగులచేఁ ద్రొక్కించుదురు. కొందఱిని నూతులలోఁ బడద్రోయుదురు. మఱికొందఱిని పర్వతాగ్రములనుండి క్రిందికిగెంటివేయుదురు. కొందఱిని బురుగులగుంటలోఁ బడఁగెంటుదురు. ఆపురుషులు పాపాత్ముల ననేకవిధములగా హింసించుచుందురు. వజ్రపుముక్కుగలబొంతకాకులు శిరస్సులమీఁదను కండ్లలోను నోళ్లయందును పొడిచి మాంసమును పీకుకొనితినుచుండును. యమభటులు పాపులశరీరములను ముక్కలుముక్కలుగా ఖండించివేయుదురు.” అసమ............వమునన్. అసమసాయక – సమానములేని సంఖ్యయగు బాణములుగలవాఁడయిన మన్మథునియొక్క, సమరకర్మ – యుద్ధకార్యమునకు – సంభోగమునకు, అంతరాయ – విఘ్నమును చెఱుపును, కరణ – చేయుటయందు, పారీణ – అవలిదరిపఱకుఁగల– కడపటివఱకుఁగల, వాక్ + క్రియా + గౌరవమునన్ – మాటలయొక్కయు, చేష్టలయొక్కయు, అధికముచేత, అఖిల........నమున్. అఖిల – సమస్తమైన, విటకోటి – జారులసమూహము యొక్క, ధనమున్ – ద్రవ్యమును, ఎల్లన్ – అంతయును, అపహరించు అంజకల్లికిన్ – అక్రమముగా స్వాధీనముచేసికొనునట్టి ఆవేశ్యయొక్కమాతకు, లక్షయైనన్ – ఒకనూఱువేలరూపాలనిచ్చి నప్పటికిని, దయలేదు – కనికరముండదు. “వేశ్యాయాశ్చ కుతః స్నేహః” నీతి. ఇందు ‘బాధించుట’ సాధర్మ్యము. బహూపమానములతో నతిశయోక్తి చెప్పఁబడినది. ఏకానేకగోచరాలంకారమునకు సమముగానున్నది. ఎన్నిబాధలయినఁ బడఁగలముగాని వృద్ధవేశ్యబాధ పడలే మనినచో నీయలంకారము సిద్ధించెడిదే.

“సీ॥ దారుణాఖండమా ♦ ర్తాండమండలము ను, ప్పొంగిగుటుక్కున ♦ మ్రింగవచ్చు
గంభీరఘుమఘుమా ♦ రంభసంరంభ దు, గ్ధపయోధి చంగున దాఁటవచ్చు
జండికాజానేయ ♦ గండప్రకాండము, లీవ్రకజరాలున ♦ వ్రేయవచ్చుఁ
గుటిలోగ్రశతకోటి ♦ కోటిసంఘాటము, ల్కినిసి ఘణిల్లునఁ ♦ దునుమవచ్చుఁ
తే॥ గానిపక్ష్యదళీకభీ ♦ కరదృగగ్ర, జాగ్రదనలోజ్జ్వలజ్వాల ♦ జాలజటిల
గురుభుజాశౌర్యునిఁజెనక్కఁ ♦ దరమెయుసల, కాబలేంద్రున నారసిం ♦ హక్షితీంద్ర. కా. సం

‘పిడుగుచందమ్మున’ ఉపమాలంకారము.

తా॥ పిడుగువలెఁ బైఁబడికొట్టు దారిదొంగకయినను కొంచెము దయయుండును, మితిమించినధనాపేక్షచేఁ గష్టపెట్టురాజునకైనను కొంచెము కృపయుండును, కర్ణాటకరాజ్యమునఁ జొచ్చి ప్రజలనిర్బంధించునట్టి పడమటిదేశపురాజునకైన నుంత కరుణయుండును, మహాపాపులను వేధించు యమదూతలకయిన నించుక కనికరముండును, కాని విటగాండ్రసొమ్మెల్ల నపహరించు వృద్ధవేశ్యకు మాత్రము వేలకువేలిచ్చినను దయయుండదు.

సీ॥ కాలకూటమునందుఁ ♦ గలమేలువిసమెల్ల, రాలలోఁ గల్గుకా ♦ ర్కశ్య మెల్లఁ
బైశాచసమితిలో ♦ పలివికారం బెల్లఁ, గపికోటిలో నుండు ♦ కాంక్ష లెల్ల
సెలయేళ్లలోన వ ♦ ర్తిలెడువక్రత లెల్ల, మయశంబరులలోని ♦ మాయ లెల్ల
ధార్తరాష్ట్రులలోనఁ ♦ దనరుమచ్చర మెల్లఁ, బంచపాతకులలోఁ ♦ బాప మెల్లఁ

తే॥ దీసి విటదోషరాశిచే ♦ ద్విగుణిఁ జేసి, యనృతపంకంబులోఁ గల్పి ♦ యశుచిభావ
రసముఁ జిల్కించినిర్మించె ♦ బ్రహ్మకృపణతరుణహృద్భల్లియగులంజ ♦ తల్లిగాఁగ43.

అ॥ బ్రహ్మ-సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడు, కాలకూటమునందుఁ-కాలకూటమను పేరుగల మహావిషమునందు, ఇచట విషములు తొమ్మిదివిధములు 'ని. కాకోల-కాలకూట హాలాహలాః, సౌరాష్ట్రిక శ్శౌక్లికేయో♦బ్రహ్మపుత్త్రి ప్రదీపనః, దారదో వత్సనాభశ్చ♦విషభేదా అమీనవ, రామాశ్ర♦ కలమేలువిసమెల్లఁ - ఉండిన శ్రేష్ఠమయిన విషమునంతయును. నికరమైన గరళమునంతయును, రాలలోఁ-రాళ్ళయందు, కల్గుకార్కశ్యము+ఎల్లఁ-పుట్టిన గట్టితనమంతయును. ఏర్పడిన కఠిన స్వభావమంతయును, పైశాచసమితిలోపలివికారంబు+ఎల్లఁ-పిశాచములగుంపుయొక్క మనస్సులో నుండెడు నసహ్యపుఁజేష్టలన్నియును, కపికోటిలోఁ - కోతులగుంపునందు, ఉండు కాంక్షలెల్లఁ-ఉన్నట్టియాశలన్నియును, సెలయేళ్ళలోనఁ-పర్వతములవలనఁబుట్టిన ప్రవాహములయందు, వర్తిలెడువక్రతలెల్లఁ - ఉండునట్టి కుటిలప్రవర్తనములన్నియును, మయశంబరులలోని మాయలెల్లఁ-మాయను సృష్టించినవారైన మయునియందును శంబరునియందును గల యింద్రజాలవిద్య అన్నియును. "యత్కించి దింద్రజాలాది ♦ మూఢదృష్ట్యైవ వర్తతే, తత్వతః సర్వథా నాస్తి♦సా మాయా మయనిర్మితా, న సత్యత్వం మానవవన్మృషా మయశిల్పవత్, క్షణే క్షణేచ యచ్చిత్రం♦నానా రూపాకృతిక్రియం" సం. పద్మ. ధార్తరాష్ట్రులలోనఁ - ధృతరాష్ట్రునియొక్క సంతతియందు, తనరుమచ్చరము+ఎల్లన్-ఒప్పుచున్న మాత్సర్యమంతయును, పరులమేలునోర్వలేక పోవుట యంతయును, పంచపాతకులలోఁ-మహాపాపులయందుఁగల, పాపమెల్లఁ-కలుషమునంతయును, తీసి-చేకొని, విటదోషరాశిచేఁ- వ్యభిచారదోషమనెడిప్రోగుచేత, ద్విగుణిన్+చేసి - రెట్టింపుగాసమకూర్చి, అనృత పంకంబులోఁ-అబద్ధమనెడిబురదలో, కల్పి-పాకముచేసి, అశుచిభావసరముఁ-మలినస్వభావమనెడి ద్రవమును, చిల్కించి-ప్రోక్షించి-చిలుకరించి, కృపణతరుణహృద్భల్లి, కృపణ - కుత్సితబుద్ధిచేత, తరుణ-యౌవన పురుషులయొక్క, హృత్-మనస్సులకు, భల్లి-బాణమైనట్టిది, అగులంజతల్లి-అయినట్టి వేశ్యామాతయగునట్లు, నిర్మించెఁ-పుట్టించెను, ఈపద్యమున 'రాలలోన్' అని ప్రయోగించుటకు "సూ. కేషాంచి ద్వ్యంతశ♦బ్దానాం లుతా స్స్యాతాం యథోచితం, క్వచి త్త్వాదేశ ఏవ స్యా త్క్వచి న్నైవ ప్రయోగతః" వర్ణ స్యాంత్యస్య లోప స్స్యా ల్లులయోః ప్రాయశః క్వచిత్" అథ. బ్రహ్మదేవుఁడు ప్రపంచమునఁ గలదుష్పదార్థముల నన్నింటిని గలిపి యీవృద్ధవేస్యగా నిర్మించె ననుటచే సందేహాలంకారము "స సందేహ స్తు భేదోక్తౌ తదనుక్తౌ చ సంశయః" కా. ప్ర. భేదానుక్తి. ఉదా. "అస్యాః సర్గవిధౌ ప్రజాపతి రభూ చ్చంద్రో ను కాంతిప్రదః, శృంగారైకరసః స్వయం ను మదనో మాసో ను పుష్పాకరః, వేదాభ్యాసజడః కథం ను విషయవ్యావృత్తకౌతూహలో, నిర్మాతుం ప్రభవే న్మనోహర మిదం రూపం పురాణో మునిః" సం. విక్రమో. దండ్యాచార్యుని

మతమున నిది యుత్ప్రేక్షాలంకారము. "మన్యే శంకే ధ్రువం ప్రాయో నూనమి త్యేవమాదిభిః, ఉత్ప్రేక్షావ్యజ్యతే శబ్దై రివశబ్దోఽపి తాదృశః" కావ్యాద. వృద్ధవేశ్యకు మాయాశౌచనిర్దయాదు లను వర్ణించుటనుగూర్చి "అనృతం సాహసం మాయా మూర్ఖత్వ మతిలోభతా, అశౌచం నిర్ద యాత్వం చ స్త్రీణాం దోషాః స్వభావజాః" చాణ.

తా॥ పరమేష్ఠి యాబోగముదానిని సృజింపఁదలఁచి కాలకూటములోని సత్త్వమను, తాల యందలి కఠినమును, పిశాచములలోని రోఁతచేష్టలను, కోతులలోని కోరికలను, సెలయేళ్ళయందలి కుటిలతను, మయశంబరులయందలి గారడివిద్యను, ధృతరాష్ట్రసంతతియందలి యోర్వలేనితనమును, పంచమహాపాపాత్ములయందలి పాపమును, తీసికొని వ్యభిచారదోషమనురాశితో సమానముగాఁ గలిపి యబద్ధమనెడిబురదలోఁగలిపి మలినస్వభావ మనురసమును జిలుకరించి నీచబుద్ధిచేఁ గాముకుల మనస్సును వేధించుబాణముగా దానిని బుట్టించెను.

ఆ॥ వేము పండకున్న ♦ విషసమావిష్టంబు, పండె నేని మధుర ♦ ఫలయుతంబు
పండ్లు రాలునపుడు ♦ పణ్యవృద్ధ విషంబు, వేశ్యమాతవిషము ♦ వేమువిషము. 44.

అ॥ వేము–వేఁపచెట్టు, పండకున్నఁ–కాయలుపరిపక్వమునకురానియెడల, విషసమావిష్టంబు–చేఁదుతోఁ గూడియుండును, అనఁగాఁ గేవలవిషమైయుండును. "శర్కరామధుమధ్యే చ నింబ బీజం ప్రతిష్ఠితం, క్షీరై ర్వర్ష సహస్రాణాం, నిఁబః కిం మధురాయతే" నీతి. పండెనేని–పరిపక్వమైన ట్లయిన, మధురఫలయుతంబు–తీయనిపండ్లతోఁగూడియుండును, అనఁగా వేఁపచెట్టు పండ్లురాలునపుడు తీపిగలది యగుననుట. పణ్యవృద్ధ–ముదుసలిలంజ, పండ్లురాలునపుడు–దంతములూడిపోవునట్టి కాలమున, విషంబు–విషస్వభావముగలది, వేశ్యమాతవిషము–లంజతల్లియైనదానియొక్క విషస్వభావము, వేము విషము–వేఁపచెట్టువంటివిషము, 'వేము.వేశ్య, ఈశబ్దములయందలి ప్రథమాక్షరములను జట్టి యొకటే జాతిగవర్ణించుచు నుభయత్ర పండ్లురాలుకాలము సమానధర్మముగ నుపమించుచున్నాఁడు. వేఁపచెట్టు తీపిగలది యగుచుండఁగా వృద్ధవేశ్య మహావిషముగలది యగుచున్నది. కనుక వేఁపచెట్టుకంటె నధిక ముగావిషముగలదని భావము. వ్యతిరేకాలంకారము. "క. ధర నుపమానముకన్నను, అరుదగునుప మేయ మధికతా నన సాధ్యం, బుతుభేద కారణంబై, యిరవుగ వ్యతిరేకమయ్యె" కా. సం. "భేద ప్రధానసాధర్మ్య ముపమానోపమేయయోః, అధిక్యాల్పత్వకథనాత్ వ్యతిరేక స్స ఉచ్యతే" ప్రతా.

తా॥ వేఁపచెట్టు మిక్కిలిచేఁదుగలదియయ్యు ఫలప్రాయమునకు వచ్చినప్పుడైనఁ దీపికలది యగును, పండ్లూడిపోవునపుడు వేశ్యమాత మహావిషప్రాయముగా నుండును.

తే॥ లంజతల్లులరీతి యీ ♦ లాగు వింటె, తలప నది లంజతల్లిమా ♦ త్రంబ కాదు
కపటతరవృత్తిఁ బ్రత్యక్ష ♦ కాలకూట, మాజఁ అభికూఁతుఁ దగిలినాఁ ♦ డాఘనుండు. 45.

అ॥ ఓరాజా. అధ్యాహారము. వింటె–ఆలకించుచున్నావా, లంజతల్లులరీతి–వేశ్యమాతలయొక్క విధము, ఈలాగు–ఇట్లుండును, తలఁపఁగ–విచారించఁగా, అది–ఆముసలిది, లంజతల్లిమాత్రంబకాదు–

వేశ్యమాతమాత్రమే కాదుసుమా, కపటతరవృత్తిన్ - మోసముచేయునట్టి వ్యాపారమునందు, ప్రత్యక్ష కాలకూటము-ఎదుటఁబడియున్న కాలకూటమనుమహావిషభేదము. ఆజలధికూఁతున్ - ఆముసలిబోగము దానియొక్క కొమరితను, జలధిశబ్దమునకుదా. "ఉ॥ ఒఱపుగఁ దత్కళేబరము♦ నొందిన యుగ్రపు భూత మప్పుడా, జలధికి శిక్ష సేయుగతిఁ♦జయ్యన ముక్కునసాము మోదుగాఁ, గలచిన" పాం. కు. చ. అఘనుండు - దుర్వృత్తియందు నిపుణుఁడైన యానిరంకుశుఁడు, ఇది నీచార్థమును స్ఫురింపఁ జేయుఘనవాక్యము, ఇంతకును నీ తనిప్రవర్తన యంతయుఁ జెప్పఁబడియుండుటచే నిదిగ్రాహ్యము. తగిలినాఁడు - పొందియున్నాఁడు, ఈపద్యమున 'కూఁతు, అనుప్రయోగమునకు "సూ. ఏకత్వే చ భవే ద్వారు స్తథా తా చ భవేత్ క్వచిత్" అథ. ఆది అంజతల్లిమాత్రము కాదు కపటవృత్తియందుఁ బ్రత్యక్షకాలకూట మనుటచేత నపహ్నవాలంకారము. క. ఉపమేయము గాదని యిది, యుపమానమె యనఁగ నెంతయు నపహ్నవమా, నపుడది ప్రాకారోపము, నపహ్నవారోపమును ఛలాదియు నయ్యెన్" కా. సం, "ప్రకృతం య న్నిషిద్ధాన్యత్ సాధ్యతే సాత్వపహ్నుతిః" కా. ప్ర. ఉదా. "అవాప్తః ప్రాగల్భ్యం పరిణతరుచః శైలతనయే, కలంకో నైవాయం విలసతి శశాంకస్య వపుషి, అముష్యేయం మన్యే విగల దమృతస్యందశిశిరే, రతిశ్రాంతా శేతే రజనిరమణీ గాఢమురసి" కా. ప్ర.

తా॥ ధర్మపాలుఁడా! వేశ్యమాతలనడవడికల నెల్లను విశదీకరించితిని గదా. అదిమాత్రము సామాన్యవృద్ధవేశ్యలవంటిది గాదు. పుడమిపై స్త్రీరూపముతో జన్మించి మనకుఁగనుపడుచున్న కాలకూట మనుమహావిషము. అలాటిదానికూఁతును మనఘనుఁడు చేపట్టినాఁడు.

## —♦ నిరంకుశుఁడు ధనవ్యయమొనర్చుట ♦—

సీ॥ ఒఱపారెఁ జలువస♦న్నరుమాలు సొబగంచు,వివరింప నిదెపట్టు♦ అవికకనును
జెలువారెఁ గ్రొత్తసం♦దులవస్త్రమనియెంచి, కొననిదే పయ్యంట♦ కోసమనును
సొగసారె నునుఁజెంప♦ సిగపట్టుబొం దంచుఁ, దలపింప నిదె జడ♦ త్రాటి కనును
బాగారెఁగుసుమంపుఁ♦బసిమిదుప్పటియంచుఁ, గనుఁగొన్న నిదెకొమ్ము♦ కాసెకనును
తే॥ వజ్రవైడూర్యవరనీల♦వనజరాగ, వార మది వానికెంతొ త♦త్సార మంతె
ప్రాణమైన నొసంగు నే♦ పాటిదైన, నడుగనిదె పాప మాధవ♦ళాయతాక్షి.46.

అ॥ ఆధవళాయతాక్షి-విశాలమయిన తెలికన్నులు గలయావేశ్య, చలువసన్నరుమాలుసొబగు-ఉదికినసన్ననిరేనుగుడ్డయొక్క చక్కఁదనము, చలువఁజేసియుదుకుట యనఁగా వస్త్రమును శుభ్రపఱచుటలో గలభేదము. ఒఱపారెన్-మనోహరముగానుండెను, అంచువివరింపన్ - అనివిమర్శించి తెలియఁజేసినంతనే, ఇదె-ఇదిగో, పట్టుఅవికకు + అనును-పట్టుఅవికకుపయోగించుకొనుటకుఁదీసికొను మని చెప్పును. క్రొత్తసందులవస్త్రము - జాలెలుగలనూతనమైనయుత్తరీయము, చెలువారెన్-సొబగుగానుండెను, అనియెంచికొనన్-ఇట్లుదలంపగానే, ఇదె-ఇదిగో, పయ్యంటకోసము - నీయొక్క పైఁటనిమిత్తము, అనును-ఈప్రకారముగాఁబలుకును, 'కోసము' అనుటకుఁదా "ఉ. భూసుతకోసమేఁగనుక♦బొంకితి నేనియు" ఉ. రా. నునుఁజెంపసిగపట్టుబొందు - నున్ననైచెంపసిగకుఁగట్టినపట్టు

దారములయొక్క-మొత్తము, ఇందునునుపుశబ్దము మీఁదివర్ణములోపించినది. నునుపు+చెంప-నునుఁజెంప, అగును. సొగసాయెన్-సొంపుగానుండెను, అంచున్+తలపింపన్ - అనిజ్ఞప్తికిఁదేఁగానే, ఇదె జడత్రాటికి+అనును-ఇదియేనీజడయందు వేసికొనునట్టి బొందుగానుపయోగించుకొనుమనును, కుసుమంపుఁబసిమిదుప్పటి - పువ్వులువేసి కుట్టఁబడిన యెఱుపుగల పసుపువన్నె యుత్తరీయము, బాగాయెన్-చక్కఁగానుండెను,అంచున్+కనుఁగొన్నన్-అనిపలుకుచుఁజూచినంతనే,ఇదె-ఇదియే, కానుకన్-కానుకఁదోఁపుకొనుము కోకచెఱఁగునకు, కొమ్ము - వేసికొనుము, అనును-ఇట్లు చెప్పును, వజ్ర......వారము. వజ్ర-రవలును, వైడూర్య-వైడూర్యములును, వరనీల - శ్రేష్ఠమయిననీలములును, వనజరాగ - పద్మరాగములును, అనువానియొక్క, వనజమనునది పద్మమునకుఁ బర్యాయనామము. వారము-సమూహము, అదివానికేఁ తో-అతనికేపాటిగానుండునో, తత్సారము+అంతె-అతఁడనుభవించుఫలితమును అతీరునసేయుండును. అతఁడుయీవియందెంతతెంపుగానుండునో సౌఖ్యముగూడ దానిననుసరించియే యుండుననిభావము. ఇచట 'విటకానియీవి మెంతోలంజవలపుగూడనంతే' అను లోకోక్తి యనుసరణీయము. ఏపాటి+ఐనన్-ఎంతమాత్రమయినను - కొంచెమైనను, అడుగనిదె పాపము - ఇమ్మనియడుగకుండుటయేలోపము, అనఁగా నది కోరినవస్తువు నిరభ్యంతరముగాఁ దత్క్షణమే యిచ్చుననుట. ప్రాణము+ఐనన్-తనయసువును సైతము, ఒసంగున్-ఇచ్చివేయును, 'ఇందుఁగుసుమంపుఁబసిమిదుప్పటి, అనుటకు 'సూ. సామానాధికరణ్యే తు బహుత్వార్థే పరేఽపి చ, ముబ్వోర్భవేతాం పుంప్వాఖ్యా వాదేశౌ వ్రత సర్వదా' అథ. స్వభావోక్త్యలంకారమును "స్వభావోక్తి రసౌ చారు యథావ ద్వస్తువర్ణనమ్" ప్రతా. అంత్యానుప్రాసాలంకారమును.

తా॥ ఆవెలయాలు నిరంకుశుఁడుధరించిన వానినిజూచి యీచలువఁజేసినరేసుకఁడువా చాలా బాగుగానున్నది. అనిమెచ్చరించినంతనే యిది నీఅవికకొఱకే తెచ్చితిని తీసికొనుమనును. జాలెలుగల క్రొత్తయుత్తరీయమును గాంచి యిది సొగసుగానున్నదనినతోడనే యిది నీపైఁటనిమిత్తమే తెచ్చితి నని యిచ్చును. చెంపసిగకుఁగట్టిన పట్టుదారపుగుత్తినిఁజూచి యిది చాలా సింగారముగానున్నదనినవెంటనే యిది నీజడబొందునకే సంపాదించితి ననియొసంగును. పూలువేసికుట్టిన యెఱుపుపసుపురంగుగల యుత్తరీయమును బరిశీలించి యిది మురువుగా నున్నదను చుండఁగనే యిదినీపరికిణీపై వేసికొను కానెగుడ్డకుఁ గొనుమనును. మఱియు వజ్రవైడూర్యాది నవరత్నములతో రచింపఁబడిన సువర్ణాభరణాదుల నెంతతెగువగా నిచ్చుచుండునో యంతసౌఖ్య మనుభవించుచుండును. అబిడ యేమాత్రమయిన నడిగినఁజాలును దనప్రాణమును సైతము నొసంగుననుటలో సందియములేదు.

—: నిరంకుశునిభార్య యత్నంతోఁజెప్పి విలపించుట :—

క॥ ఈరీతి నతఁడు దుర్వ్యాపారంబున సంచరింప ♦ బహువత్సరముల్
ధీరమతిఁ జూచిచూచి య, వారితదుఃఖాప్రసన్న ♦ వదనాంబుజయై. 47.

అ॥ అతఁడు-ఆనిరంకుశుఁడు, ఈరీతిన్-ఈప్రకారముగా, దుర్వ్యాపారంబునన్-దుష్ప్రవర్తనమునందు-చెడ్డనడతయందు, బహువత్సరముల్-అనేకసంవత్సరములు, సంచరింపన్ - తిరుగుచుండఁగా, పైవచనమందలి యతనిభార్య యనువాక్యముతో నన్వయము. ధీరమతిన్-ధైర్యముతోఁ

గూడినచిత్తముతో, చూచిచూచి-చాలకాలము నిరీక్షించి విసువుఁజెంది, అవారితదుఃఖాప్రసన్న వదనాంబుజయై. అవారిత-అడ్డగిఁపశక్యముగాని, అటంకపఱుపఁబడనిగాని. దుఃఖ-శోకముచేత, అప్రసన్న-సంతుష్టముగాని-వికసింపఁబడని, వదనాంబుజయై - ముఖపద్మము గలదియై, తనపతి వేశ్యాలోలుఁడై చరించుచుండ బహుకాలము చూచిచూచి దుఃఖించినదనుటచే నిందు విరహావస్థ వర్ణింపఁబడియున్నది. "కాలక్షేపే తు సంప్రాప్తే కార్యా ద్వ్యాపారతంత్రతః, ఏకగ్రామ స్థయోర్యూనోర్వి రహః సోఽభిధీయతే" సాహి.చిం. నాయికప్రోషితభర్తృక, "తే. అనుశయముఁ జెందుసతి కలహాంతరితని, జేశుఁడు విదేశగతుండైనఁ గృశతఁదాల్చు, నతివ ప్రోషితపతిక కాంతాభిసరణ, శీల యభిసారికాఖ్యయై చెలువు మెఱయు" కా. సం.

తా॥ ఆనిరంకుశుఁడీవిధముగాఁ జెడునడతయందుఁ జిరకాలము మెలంగుచుండుటచే నాతని కులసతి కొంతకాలమునకైన నావగని కీదుర భ్యాసము పోవుం డునా యనుధైర్యముతోఁ జూచి చూచి యూటంకపఱుపరాని దుఃఖముతోఁ గూడిన ముఖారవిందము గలదియై.

వ॥ ఒక్కనాఁడు త్రిభువనాశ్చర్యకరసౌందర్యయగు నతనిభార్య కరుణాయత్తచిత్తయగుచు నత్తముందఱనిలిచి వాసరారంభసముజ్జృంభమాణ శతపత్త్రపత్త్రజైత్రంబులగు నేత్రంబుల నశ్రువులుగ్రమ్మఁ గరుణంబుగా నిట్లనియె. 48.

అ॥ ఒక్కనాఁడు-ఒకదినమున, త్రిభువనాశ్చర్యకరసౌందర్య-త్రిభువన-స్వర్గమర్త్యపాతాళములనెడిమూఁడులోకములయందుఁగలవారలకు, ఆశ్చర్యకర-చోద్యమునుగలిగించునట్టి, సౌందర్య-చక్కఁదనముతోఁగూడినది, అగు + అతనిభార్య-అయినట్టియా నిరంకుశునియిల్లాలు, కరుణాయత్తచిత్త-కరుణా-దయకు, ఆయత్త స్వాధీనమయిన, చిత్త-హృదయముగలది, అగు + అత్తముందఱన్ - అయినట్టి తన యత్తగారియెదుట, నిలిచి-నిలువఁబడి, వాసరా.....త్రంబులు. వాసర + ఆరంభ-ప్రాతఃకాలమున, సముజ్జృంభమాణ-సమధికముగా వికసించుచున్న, శతపత్త్ర-తామరపూవులయొక్క, పత్త్ర - ఱేకు అను, జైత్రంబులు-జయించినట్టివి, అగునేత్రంబులన్-అయిన తనకన్నులయందు, అశ్రువులు-కన్నీరు, క్రమ్మన్-వ్యాపింపఁగా, కరుణంబుగాన్-దయకలుగునట్లు, ఇట్లు + అనియెన్ - ఈప్రకారముగాఁ బలికెను. ఇందు 'అనియెన్' అనుప్రయోగమునకు "సూ. ఇత ఏవపరస్య స్యా దిద్భవేన్నాంతకాత్పరే" అథ. "సూ. అద్యఃక్రియానుభూతార్థద్యోతినమాద్యగంవినాసర్వః" నన్న. ఇందు ఆశ్చర్య దర్య-భార్య-ఆయత్తచిత్త అత్త-పత్త్రపత్త్రజైత్రనేత్ర, వృత్త్యనుప్రాసాలంకారము. 'ఆరంభ సముజ్జృంభ' అను ప్రాసాలంకారము. 'శతపత్త్రపత్త్రజైత్రంబులు, ఉపమాలంకారము. 'తమన్వేత్యనుబధ్నాతితచ్ఛీలంతన్నిషేధతి, తస్యైవానుకరోతీతి శబ్దాఃసాదృశ్యవాచకాః, ఉపమాయా మిమీ ప్రోక్తాః, కవీనాంబుద్ధిసౌఖ్యదాః" కావ్యాద. ఇందు శోకమనుస్థాయిభావముకలదు. "క. హితజన విరహవ్యథచే, నతిశయమైజనులమానసాంభోజమునన్, బ్రబలినమువొడముదుఃఖం, బతిభూమివహింపశోకమగు" నరస.

ఉ॥ అత్తవు సత్త్వలక్షణన ♦ మగ్రగుణాఢ్యవు నన్నుఁ దిట్టనున్
మొత్తనె కాని నీకొడుకు ♦ మూఢత మానుపవేల పాడుగో

తోత్తేమారి వైవె గృహముఁ ♦ ద్రొక్కకయొక్కకదానిఁ బూనికన్
గుత్తకు నంచు నంచుకొని ♦ కోఁకలరూకలు జోక నీయఁగన్. 49.

అ॥ అత్తవు - నాభర్తకుఁ దల్లివైనదానవు, సత్త్వలక్షణసమగ్రగుణాఢ్యవు, సత్త్వలక్షణ - సాత్త్వికస్వభావముతోఁ గూడిన, సమగ్రగుణ - నిండారినసుగుణములయందు, ఆఢ్యవు - సంపన్నురాలవు, నన్నున్ - నన్నుమాత్రము, తిట్టినన్ - శపించుటకును, మొత్తనె కాని - కొట్టుటకే కాని, నీకొడుకు - నీకుమారుఁడు, మూఢతన్ - అవివేకము చేత - తెలివిలేమిచేత, గృహము త్రొక్కక - ఇంటిలోనడుగుపెట్టక, పాడు + తోత్తేమారి + ఐ - చెడబుద్ధిగల పడుపుఁగత్తెయందుఁ దగ్గిలిపోవు స్వభావముగలవాఁడై, పూనికన్ - పట్టుదలతో, ఒక్కకదానిన్ - ఒక్కొక్కభోగముదానిని, గుత్తకన్ - మొత్తముగా, గుత్తయనఁగా నొకసొత్తునందలి ఫలమనుభవించుటకు నాసొత్తుగలవారికిఁ దత్ఫలార్థముగ నొసఁగినధనమిచ్చి తనయనుభవము ననుచుకొనుట, అంచున్ - అనిచెప్పుచు, ఉంచుకొని - తానుంచుకొని, జోకన్ - బాగుగా, కోకలన్ + రూకలన్ - చీరెలను రొక్కమును, ఈయఁగన్ - ఇచ్చుచుండఁగా, మానవు + ఏల - ఎందుకుఁబోఁగొట్టవు, నీచేతఁగాదాయనుట. ఇందు 'గృహము ద్రొక్కక' యనచోట ద్వితీయకుఁ బ్రథమ చెప్పఁబడినది "సూ. ఇతరత్ర చ ద్వితీయా తస్యాః ప్రథమా చ బహుళం స్యాత్" శబ్దచిం. 'పాడుతోత్తు, అనుటకుదా "గీ॥ పతులు వోలియుట విన్నవై ♦ పాడువతి, యున్నదాన" హరివం. "వ. పాడుగాపునాగతి" కళా. అత్తగారూ: నీవుసమస్తమునెఱిగినదానవు. లోపముండిన లేకున్న నన్నుదిట్టుచుండువు కాని యింతటి దుష్ప్రవర్తనముగల నీకొడుకను మందలించుట నీకుచేఁగానికార్యమా? వ్యాజస్తుత్యలంకారము.

తా॥ అత్తగారూ! నీవు సమస్తమును తెలిసినదానవు, ఓర్పుగలదానవు. ఇంటిలో నన్ను దిట్టుట కొట్టుటయే కానినీసుతుఁ డవివేకియై ఇంటికిఁగూడ నడుగుపెట్టక పనికిమాలిన భోగముదాండ్రను మొత్తముగా బేరముచేసికొని యుంచుకొనుచు నింటఁగలడబ్బునంతయుఁ గర్చుపెట్టుచుండినను మానుపలేకుంటివి. ఇది నీకు చేతఁగాని కార్యమా ?

ఉ॥ చిత్తములోనఁ బ్రేమవిల ♦ సిల్లఁ దనూభవులన్ సమస్తలో
కోత్తర రత్నభూషణస ♦ ముజ్జ్వలితాంగులఁ జేసి వారియ
త్యుత్తమధర్మవృత్తిఁ బరి ♦ తోషముఁ గాంతురుగాక యిట్టి దు
ర్వృత్తిఁ జరింపఁగాఁ బరిభ ♦ వింపక చూతురె యీవిధంబునన్. 50.

అ॥ ఈప్రపంచమున నెవ్వరైనను, చిత్తములోనన్ - తమమనస్సునందు, ప్రేమవిలసిల్లన్ - అధికమైనయిష్టముతో, తనూభవులన్ - కొడుకులను, సమస్త............తాంగులన్ - సమస్తలోక - జనులందఱిలో, ఉత్తర - శ్రేష్ఠమయిన, రత్నభూషణ - మణిమయములగు సొమ్ములతో, సముజ్జ్వలిత - ప్రకాశింపఁబడిన, అంగున్ - శరీరముగలవారినిగా, చేసి - ఒనరించి, వారియత్యుత్తమధర్మవృత్తిన్. వారి - వారియొక్క, అత్యుత్తమ - మిక్కిలిశ్రేష్ఠమయిన - అత్యంతయోగ్యమయిన, ధర్మవృత్తిన్ - న్యాయప్రవర్తనముచేత - వేదవిహితమయిన వ్యాపారముచేత, పరితో

షముఁ - సంతోషమును, కాంతురుగాక - పొందెదరుగాని, ఇట్టిదుర్వృత్తిఁ - ఈలాటి చెడ్డ నడతయందు, చరింపఁగాఁ - తిరుగుచుండఁగా - ప్రవర్తించుచుండఁగా, పరిభవింపక - దూషించక-చీకొట్టక, మీవిధంబునఁ - మీవలెనే, చూతురె - చూచియూరకుందురా, ఇందు మూఁడవ పాదమున 'అ, త్యుత్తమధర్మవృత్తిఁబరితోషము, అనుచోట సంయుక్తయతి సెప్పఁబడినది. "ఆ. ఒకటి రెండు జడ్డలుండెడువర్ణంబు, విశ్రమస్థలమున వెలసె నేని, యవల దాని కెద్దియైన సంయుక్త విశ్రామసంజ్ఞచేఁ బొసంగుచుండు" అప్ప. లోకమునఁ దలిదండ్రులు తమపుత్త్రుని సత్ప్రవర్తనమునకు ముదమందుదురు గాని యిట్టిదుష్ప్రవర్తనముగలవానిని నిందింపక మీవలెనే యూరకుందురా, అనుటచే. అర్థాంతరన్యాసాలంకారము. "తే॥ మహి విశేషంబుచేత సామాన్యమును బ్ర, సక్తసామాన్యమునవిశేషము సమర్థి, తముగ నర్థాంతరన్యాస మమరుచుండు నెలమి రెండువిధంబులై" నరస.

తా॥ లోకమునఁ దలిదండ్రులు తమసుతులను విలువలేనిరతనాలు దాపినబంగారునగలతో నలంకరించి వారియొక్క సత్ప్రవర్తనమును జూచి సంతసించుచుందురు గాని యీలాటి చెడునడత గలకొడుకుం గని మందలింపక మీవలెనే యూరకుందురా.

ఉ॥ కోరికి దీరఁగాఁ గుడిచి ♦ కుంకుమసంకుమదాంకగంధ మొ
య్యారముగా నలందుకొని ♦ యాకులుఁ బోకలుఁ జాలునట్లు దు
ర్వారతరేచ్ఛఁ బుచ్చుకొని ♦ వారలతాంగులయిండ్ల కేగఁగా
నూరక చూచుచుండెదర ♦ యో యదలింపక మీరు మామయున్. 51.

అ॥ కోరికి+తీరఁగాఁ — ఇష్టమువచ్చినట్లు, కుడిచి - భోజనముచేసి, కుంకుమసంకుమదాంకగంధముఁ. కుంకుమ - కుంకుమపువ్వుయొక్కయు, సంకుమద - జవ్వాజియొక్కయు, అంక - చిహ్నములుగల - అనఁగా గుఱుతులను దెలియఁజేయునట్టియనుట గంధముఁ - పరిమళద్రవ్యమును, ఒయ్యారముగాఁ - అందముగా, ఉదా 'గీ॥ రతివిధంబునఁ గడునొయారమునఁ బొదలి" చంద్రభా. అలందుకొని - పూసికొని, ఆకులుఁ - తమలపాకులును, పోకలుఁ - వక్కలును, చాలునట్లు - సమృద్ధిగా, దుర్వారతరేచ్ఛఁ. దుర్వారతర - వారింపనలవిగాని, ఇచ్ఛఁ - కోరికతో, పుచ్చుకొని - తీసికొని, వారలతాంగులయిండ్లకున్ - వెలయాలండ్రయొక్క గృహములకు, ఏగఁగన్ - పోవుచుండఁగా, మీరున్ — మీరయినను, మామయున్-మామామగారయినను. అదలింపక - మందలించక, ఊరకచూచుచుండెదరు - వృథాగాఁజూచి యేమియు ననకుండెదరు, అయో - అయ్యయో - ఇది సంతాపమును దెలియజేయును. ఉదా "ఉ॥ నానొల్లకవీడనాడెద వాయోతగవా మగవారిచిత్తముల్" విష్ణుపు. ఇందు 'కోరికి' అనుప్రయోగమునకు "సూ. అజన్యజన్యభేదేన శబ్దాస్స్యుర్ద్వికృతా మతాః, జన్యాంతగతవర్ణానాం భూయసీ స్యాద్విచిత్రతా" అథ. ఉదా "క॥ నీకోరికి యప్రతిహత, మేకార్యముఁ గోరి వచ్చి తెఱిఁగింపుము" భార. 'చ॥ ఇత్తెఱంగు కోర్కికిఁగతమేమి పాండవులఁగెల్చి ధరఁ సగమీఁదలంచితే" భార. మఱియు నత్తగారిని మీరు అని బహువచనముతోఁ జెప్పుటకు "సూ. స్యాత్పూజ్యత్వవివక్షాయాం మహతాం బహుతా మతా" అథ. "మాసాన్ దశోదరస్థం యాధృత్వా శూలైస్సమాకులా, వేదనా వివిధై ర్దుఃఖైః ప్రసూతా చ విమూర్ఛితా, ప్రాణైరపి ప్రియాన్ పుత్త్రాన్ మన్యతే సుతవత్సలా, క స్తస్యా

నిష్కృతిం కర్తుంశక్యో వర్షశతై రపి" వ్యాస. "గర్భధారణపోషాభ్యాం పితు ర్మాతా గరీయసీ" మఱియు "ఉపాధ్యాయాన్ దశాచార్యః. ఆచార్యాణాం శతంపితా, సహస్రం తు పితౄన్ మాతా గౌరవేణాతిరిచ్యతే" మను. ఇత్యాదిస్మృతులవలనఁ దెలియఁబడుచుండుటచే నత్తగారనుట యుక్తము. కవిసార్వభౌముఁడును "ఉ॥ ఎట్టివిపాద మాత్మజని♦యించెనో మామకు నత్తగారికిన్" అనిశృంగారనైషధమున నుడివినాఁడు; 'కుంకుమసంకుమదాంక' వృత్త్యను ప్రాసాలంకారము. 'అకలున్ - పోకలున్, అనుప్రాసాలంకారమును.

తా॥ ఇంట సంతృప్తిగాభుజించి మేనఁబరిమళద్రవ్యముల సింగారముగాఁబూసికొని గుప్పెడు వక్కలాకులు బట్టికొని గడనకత్తెలచెంత కేగుచుండుటఁ జూచియును మీరును మామగారును నించుకయైన దండించియెఱుఁగరు గదా! అయ్యో: ఇట్టివింత యెచ్చటనైనను గలదా?

సీ॥ మామగారైనను ♦ గామాంధవర్తనం, బోజగా దనిపల్క ♦ నుడుగ కున్నె
వదినెయైనను వార ♦ వనితాప్రసంగంబు, లర్హమా యనిపల్క ♦ నడఁగ కున్నె
బంధువులైనను ♦ బథముదప్పిచరించు, టేనీతి యనిపల్క ♦ మానకున్నె
మీరైన నీదురా ♦ చారపారీణత, వలదురా యనిపల్క ♦ వదలకున్నె

తే॥ కటకటా చూఁడవిడిచి యీ ♦ కరణిధరణి,సురకులాచారధర్మంబుఁ ♦ జూఁడపుచ్చ్చి
సుతునిదుశ్చేష్టలూరక♦చూచుచున్న,బరువునకులోటుతోనగుఁ♦బాటురాదొ. 52.

అ॥ మామగారైనను - మాయొక్కమామగారయినప్పటికిని, కామాంధవర్తనంబు - సురతేచ్ఛచేతఁ గన్నుఁగాననినడత, ఓజ+కాదు+అనిపల్కన్ - క్రమముగాదనిచెప్పినట్లయిన. ఉడుగకున్నె - చాలించకుండునా, ఇచట 'ఉన్నె' అనుటకు 'సూ. ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబు లగు నుండు చను చేయు కొనులుప్రశ్నార్థకైకారపరంబులగునపుడు వానికడ యచ్చులకు లోపంబు విభాషనగు. అగుచోనుండుడకారంబునకు నకారంబగు." ప్రౌ. వ్యా. వదినెయైనను - మావదినెగారయినను, ఇదివధూనీశబ్దభవము. వారవనితాప్రసంగంబులు - భోగముదాండ్రతో సంభాషించుటలు - వెలయాండ్రతో మాట్లాడుటలు, అర్హమా+ అనిపల్కన్ యోగ్యమగునా యనినట్లయిన, అడఁగకున్నె - ఈప్రవర్తనము తగ్గిపోకుండునా, బంధువులైనను - చుట్టములయినను, పథమున్+తప్పిచరించుట-తప్పుదారినినడచుట. పద్ధతినిదప్పి వర్తించుట ఇచట పథమునుగూర్చి 'ని. అయనంవర్త్మ మార్గాధ్వపంథానః పదవీసృతిః, సరణిః పద్ధతిః పద్యావర్తన్యేకపదీతిచ' అ. 'వర్త్మాధ్వాసరణిః పంథామార్గప్రసరసంచరాః" మే. 'సూ. అన్యేషాం చ వాలుగన్తస్య" శబ్దచిం. అను సూత్రముచేతఁ బథము అయినది.ఈపంథాశబ్దమునుండి పథశబ్దముకలినది. "ఇంద్రస్త్రీ భువనైశ్వర్య మదోల్లంఘితసత్పథః" సం. భాగ. 'తారాపథః, ఇత్యాదులు. ఏనీతి - ఎక్కడిన్యాయము. అని పల్కన్ - ఇట్లుసంభాషించినయెడల, మానకున్నె - ఈయుద్యోగమును విడువకుండునా, మీరైనన్ - మీరయినను, ఈదురాచారపారీణత. ఈదురాచార - ఈచెడ్డనడతయొక్క, పారీణత - అవలిదరివఱకుఁజూచుట - అంతమునుదెలిసికొనుట, వలదురా+అనిపల్కన్ - వద్దురాయనిదండించినట్లయిన, వదలకున్నె - విడిచిపెట్టకుండునా, కటకటా - అయ్యయ్యో, ఇదిసంతాపమునుదెలియఁ

జేయును. ఈకరణిన్ - ఈవిధముగా, చూఱవిడిచి, బొత్తిగాఁబోఁగొట్టి, చెడఁగొట్టి, ఉదా. "గీ॥ చోరబాధాదికములచేఁ జూఱవోవు, ధనము ధనమూని యెన్నిచందములఁ దలఁప" కాశీ, "ఉ. నాదగునట్టిధైర్యము మఱనంబును మిక్కిలిచూఱపుచ్చినన్" పద్మపు. ధరణిసురకులాచారధర్మంబున్ - ధరణిసుర - బ్రాహ్మణులయొక్క, కులాచార - వంశమునందుఁగల సదాచారముయొక్క, ధర్మంబున్ - వేదోక్తవిధిని, చూఱపుచ్చుసుతుని దుశ్చేష్టలు - కొల్లపెట్టునటువంటి కొడుకుయొక్క చెడుపనులు, ఊరకచూచుచున్నన్ - కనిపెట్టి వ్యర్థముగానుండినట్లయిన, పరువునకులోటుతోన్ - గౌరవముతక్కువయగుటయేకాకుండ దానితోఁగూడ, నగుబాటురాదొ - లోకులపహసింప నటువంటిస్థితిరాకుండునా, ఉదా "వ. నీవులోకంబుచేత నగుఁబాటుపొందంగలవాఁడవనికర్ణుంగు సెప్పిన" భార. ఇందు నగుఁబాటువచ్చుననుటనుగూర్చి "దురాచారస్య విప్రస్య నిషిద్ధాచరణస్య చ, అన్నం భుక్త్వా ద్విజః కుర్యా ద్దినమేక మభోజనమ్" పరా. 'మామగారు' అనుపూజ్యత్వ శబ్దప్రయోగమును గూర్చి "సూ. పూజ్యత్వేన ప్రముఖః కారః. భేదకం తూభయాత్మకం, తచ్ఛబ్దస్యా ద్బహుత్వే స్యా త్తథా తత్ర ప్రతిష్ఠితిః" అధ. 'కటకటాచూరవిడిచి' అనుచోట. 'కటకటా' దేశ్యము. కళ."సూ. తిర్యగ్ధ్యశేషషష్ఠీ సుస్కర్మ ప్రవచనీయజవిభక్తీః, కించిత్ప్రశంసనాద్భుత సన్తాపదాతదాకి మేవాంశ్చ. క్వాకిలమాక్షీమూద్యానభిదధతి కలాద్రుతోవయేషాంస్యాత్" నన్న. ఇందు బ్రహాత్వాదములు నాలుగు నంత్యానుప్రాసముతోఁ జెప్పఁబడినవి. మామకుని దుష్ప్రవర్తనములను జూచి యూరకున్నచో మీకును నగుఁబాటుకలుగు ననుటకు "ఏకేన శుష్కవృక్షేణ దహ్యమానేన వహ్నినా, దహ్యతే తద్వనం సర్వం కుపుత్త్రేణ కులం యథా" చాణ. "క॥ కొఱగానికొడుకు పుట్టినఁ, గొఱగామియె కాదు తండ్రి గుణముల జెఱుమన్, జెఱకుతుద వెన్ను పుట్టినఁ, జెఱకునఁదీపెల్లఁ జెఱుచు సిద్ధము" సు. "జాతమాత్రేణ పుత్త్రేణ కఃప్రమోదో మనీషిణాం. యదినాయ నవిద్యాది గుణైః సార్థం సవర్తతే" హరి. సు.

తా॥ ఇట్టిదురాచారమునఁ బ్రవర్తించుచున్నసుతునిఁ జూచి మామగారైన నీ కీవేశ్యాలోలత తగదనిన వినకుండునా ? మాయాడుబిడ్డయైనను నీ కిట్లు తెలియఁజెప్పుటతోఁ జెలిమికూడునా ? అన విత కుండునా ? చుట్టములైనను నీ కీదుర్వృత్తి వలదనినఁ జాలింపకుండునా ? మీరయినను భోగము కొంపలచుట్టు దిరుగుట చెల్లదనిన మానకుండునా ? అయ్యో! ఇట్లు విచ్చలవిడిగావదలిపెట్టి బ్రాహ్మణాచారవిధుల నన్నింటిని నేలపాలుచేసి నరకముగూడుకు గని యూరకుండినట్లయిన మనపరువు పోవుటయే కాక లోకులచే నవ్వించుకొనవలసి వచ్చునుగదా !

క॥ మీకతనఁ గాదె యీమువి, వేకం బాయనకు నుద్భవిల్లుట మీయా
త్మీకరణ మింత యుడిగినఁ, జేకొనునే యూతఁ డింతశిష్టేతరతన్. 53.

అ॥ మీకతనన్ + కాదె - మీవలననేకదా, ఆయనకున్ - నీసుకునకు, ఈ + అవివేకంబు - ఇట్టితెలివితేమితనము, ఉద్భవిల్లుట - ఏర్పడుట, మీయాత్మీకరణము - మీరాపక్షమువహించుటను, అనఁగా నీయుద్యమమునకు మీరే సహాయులుగానుండుట. ఇంత + ఉడిగినన్ - కొంచెముతగ్గినేని, అతఁడు - ఆమానవుఁడు, ఇంతశిష్టేతరతన్ - ఇంతటిదురాచారమునందుఁ బ్రవర్తించుటను, చేకొనునే - అభ్యసించునా-అలవాటుపడునా,

తా॥ మీ రిట్లూరకుండినందుననే నీకొడుకున కిట్టి తెలివిమాలినపని యలవడినది. మీరే సహాయులుగా నుండనిపక్షమున నతఁ డింతటిదుష్కార్యములకు సాహసించఁడు.

క॥ మీ కెఱుఁగరాదె తనయుని, పైకరుణఁ దలంపరో య ♦ పారశ్రీచేఁ
గైకొనరో కాక దినమున్, గోకలు మొదలైన వెన్ని ♦ కొంపోఁ డింటన్. 54.

అ॥ మీ కెఱుఁగరాదె - మీకుఁ దెలియుటలేదా, తనయునిపైకరుణన్ - కొడుకుమీఁదిదయ చేత, తలంపరో - యోచించరేమో, అపారశ్రీచేన్ - అంతములేని సంపదచేత, కైకొనరో - లక్ష్యపెట్ట రేమో, కాక - అటులఁగానిపక్షమున, దినమున్ - నిత్యమును, ఇంటన్ - మనగృహమునందు ఇచట 'ఇంటన్' అనుటకు "సూ. ఔపవిభక్తికనామ్నా మత్వం స్యాత్సప్తమీ తృతీయార్థే" శబ్దచిం. కోకలు మొదలైనవి - చీరలుమున్నగాఁగలవి, ఎన్నికొంపోఁడు - ఎన్నింటినిదీసికొని పోవుచుండుట లేదు, అనేకము సంగ్రహించుకొనిపోవుచున్నాఁడుగదా యనుట. 'కొంపోఁడు' అనుటకుదా. "క. చంపినఁ జంపుమునన్నటు, కొంపోకుండినను జాలు" ప్రభా. ప్ర. ఇచట 'తద్ధర్మార్థకము త్రికాలవాచి యగుటకు "సూ. తద్ధర్మార్థకవిశేషణం బసహాయుతం త్రికాలవాచి యగు, ప్రౌ. వ్యా. ఉదా. "అ. ద్రుపదుపీటిలోన ♦ దొమ్మికయ్యము రేఁచెఁ, బసులఁబట్టె విరటు ♦ పట్టణమున, మఱియు నెన్ని తేవు ♦ మార్తాండతనయుండు, తొడరి మనకుఁ జేయుఁ ♦ దుండగములు, జై. భా.

తా॥ ఇదియంతయు మీకుఁ దెలిసినదే కదా! అయినను గొడుకుమీఁది ప్రేమచేతనో, దరిలేని కలిమిచేతనో, మీకనుల కెంతమాత్రము గోచరింపదయ్యె. అటులఁగానిచో; మనయింటఁగల వస్త్రాభరణాదుల నెన్నిటిని సంగ్రహించుటలేదు ?

తే॥ అన్నియును జూచుచుండెద ♦ నంతొ యింతొ, యంతచనుమానమునకు రా ♦ నింతె కాని
నేనె పట్టెదనన్నచో ♦ నౌనె ధనము, డులిచినప్పుడు తెలియు నా ♦ సులువులెల్ల. 55.

అ॥ అన్నియును సమస్తమును. అంతొయింతొ - గొప్పగనో కొద్దిగనో, చూచుచుండెదన్ - కని పెట్టుచునేయున్నాను, అంతచనుమానమునకున్ - అంతగారాబమునకు, రాన్ - వచ్చినట్లయిన, ఇంతె కాని - ఈవిధముగా జరుగుటయే తప్ప, నేనెపట్టెదనన్నచోన్ - నేనొక్కదాననే పోకుండఁబట్టుకొనెద మని తలంచినపక్షమున, ఔనె - నావల్లనేయగునా, ధనము దులిచినప్పుడు - ద్రవ్యమును బొత్తిగాఁ బోఁగొట్టినపుడు, ఆసులువులెల్లన్ - అటువంటిసులభములన్నియును, ఆచులకనలన్నియును, తెలియున్ - ఎఱుకపడును, ఇందు 'అంతొయింతొ' అని ప్రయోగించుటకు "సూ. లోకోక్తీనాం భవే ద్యోగో యది స్యా చ్ఛ్రుతిరంజనమ్" అథ.

తా॥ ఈజరుగుచున్నపనులన్నియు గొప్పగనో కొలఁదిగనో చూచుచునేయున్నాను. అంత గారాబముగాఁ బెంచుచుండుటవలననే యీలాటి దురాచారము అలవడుచున్నవి. ఇంటిలో నెవ్వరికిఁ బట్టనిది నేనొక్కదాననే డబ్బుపోకుండ బట్టుకొనయత్నించినను నావలన నగునా ? రొక్కమంతయు దులిపినప్పుడు గాని బాగుగాఁ దెలియును.

క॥ నా కేమి దేహసుఖము పు ♦ రాకృతమే కాక నేఁడు ♦ రాఁబోనే యీ
  లోకమున నేనె యరుదా ♦ మాకోడలుగాదొ ♦ పొరుగుమంచముగాదో. 56.

అ॥ నాకేమి-నాకెందులకు, దేహసుఖము - శరీరసౌఖ్యము, 'ని. సుఖే హేఁతౌ సుఖే సుఖమ్'' శబ్దా. నాకేమిదేహసుఖము-నాకెక్కడిదేహసౌఖ్యము - అనియుఁ జెప్పవచ్చును. పురాకృతమే కాక- పూర్వజన్మమునఁజేసికొనిన పాపఫలమేతప్ప, నేఁడు రాఁబోనే-ఈదినమునవేఱొకటి రాఁగలుగునా. అనఁగా ఆగామి సంచితప్రారబ్ధములు అను మూఁడింటిలోఁ బ్రారబ్ధముననుభవించితీఱవలయునుకనుక నిప్పుడుతొలగించుకొనవీలులేదు గదాయనుట. ఈలోకమునన్ - ఈప్రపంచమున, నేనె-నేనొక్కడానే యిట్లున్నానా, అరుదె-ఇదియొక యాశ్చర్యమా, ప్రపంచమున నావంటివారెందఱో కలరు గనుక యిదియొక వింతకాదనుట. మాకోడలు గాదొ పొరుగుమంచము గాదో - మాకోడలు నావలెనే కోటతికమునకువచ్చినదిగాదు, యెదుటివారిమంచము నామంచమువంటిది కాదు, అంతటియశ్రద్ధగా జూచుచుంటివనునిష్ఠురోక్తి, ఇందు మాకోడలుగాదొ, అనుప్రయోగమునకు "సూ. అన్యేష్వర్థవిశేషేష్వ రంతే శ్రుతిమనోహరాః'' అధ. ఉదా "మ. తొలి దేవేంద్రుఁడు మాకులంబుఁజొరలే ♦ దో మేము నార్మోమురా, యలయంకస్థితిఁ గాంచలేదొ స్వరవి♦ద్యల్ మున్ను మావారికి, త్కులచేఁ బాణిని నేర్వఁడో యనికుల♦స్థానప్రతిష్ఠల్ త్రిభం, గులఘోషించెదు నాఁగఁ గోళ్ళు గలయం♦గూసెన్ ధరామండలిన్'' తా. శ. 'సూ. సంబంధంబున యుష్మదస్మచ్ఛబ్దములకుం గొన్ని యెడల బహుత్వంబగు.'' ప్రౌ. వ్యా. లోకోక్త్యలంకారము. 'దేహసుఖము పురాకృతమే కాక నేఁడు రాఁబోనే, అనుటనుగూర్చి "పాత్రం నైవ యదా కరీరవిటపే దోషావసంతస్యకిం, నోలూకోఽప్యవలోకతే యది దివా సూర్యస్యకిందూషణం, వర్షానైవపతంతి చాతకముఖే మేఘస్యకిందూషణం, యత్పూర్వం విధినా లలాటలిఖితం తన్మార్జితుం కః క్షమః'' చాణ. అర్థాంతరన్యాసాలంకారము. సామాన్యం వా విశేషో వాతదన్యేన సమర్థ్యతే యత్ర సోఽర్థాంతరన్యాసః సాధర్మ్యేణేతరేణ వా'' కా. ప్ర.

తా॥ నాకు శరీరసౌఖ్యమిపుడెక్కడనుండివచ్చును. పురాతనజన్మమునఁ జేసికొనినపాపఫలమనుభవించి తీఱవలయును. గదా! కానిమ్ము ఈలోకమున నావంటివా రెందఱులేరు. మాకోడలు నావలె సౌఖ్యమనుభవింపఁ గోటతికమునకు వచ్చినది కాదు. పొరుగుమంచము నామంచమువంటిదిగాదు.

క॥ ఆలోఁగని చేతోధృతి, చేలింపక మిమ్ముఁ గూడి ♦ చెప్పితినదియున్
  జాలింపక కైశికజిత, రోలంబకదంబ యే న ♦ రుంధతిఁ గానన్. 57.

అ॥ కైశిక......దంబ కైశికజిత-తలవెంద్రుకలసమూహముచేత జయించఁబడిన, రోలంబకదంబ-తుమ్మెదలయొక్క సమూహముగలదానా, ఏన్-నేను, అరుంధతిన్ + కానన్ - అరుంధతీనక్షత్రము నాకుఁగనఁబడుటలేదు, అనఁగా నాఱుమాసములకు మరణము రానున్నవారికరుంధతీనక్షత్రము కనుపించదుకనుక నేను కొలఁదిదినములలోనే చనిపోవుదునని సూచింపఁజేయుట. ఆలోన్-అమరణించుకాలమునకులోగడనే, కని-చూచి, చేతోధృతి-నామనస్సునఁగలధైర్యమును, 'ని. ధృతిర్ధారణ ధైర్యయోః' అ. చేలింపకన్-తగ్గించుకొనక, అదియున్-అమాత్రపుమాటయును, చాలింపక-నిలుపుకొనక, మిమ్మున్ కూడి-మీతోఁగలిసి, చెప్పితిన్-అంటిని, నేను భర్తృవియోగదుఃఖమునఁ గృశించు

చుంటి నిఁక నాలుమాసములలో మరణమాసన్నమైయున్న దని తెలియఁజేయుటచే నిది మృతి యను సంచారిభావము. ఉ. "క. వలపెత్తిఁగి రాఁడు కౌఁగిఁట, నలమఁడు నరసావనీంద్రుఁ♦డనివగఁ వఱుమీ, చెలులును జిలుకయు నెవ్వత, వలనగునో యనుచుఁ గొంత♦వగచెద నాత్మన్" నరస. నాయిక ప్రోషితభర్తృక. "ప్రోషితే మలినా కృశా" ప్రతా. నేనరుంధతిఁగాన ననుటచే మరణహేత్వర్థకము గాన గావ్యలింగము "క. హేతువు వాక్యార్థంబై, యాతతటిస్ఫూర్తితోఁ బ♦దార్థంబును నై, ఖ్యాతిఁగనఁగావ్యలింగం, బైతగుసత్కృతులయందు♦నదియొట్లన్నన్" నరస. "కావ్యలింగం హేతో ర్వాక్యపదార్థతా" కా. ప్ర.

తా॥ అత్తగారూ నా కరుంధతీనక్షత్ర మగపడుటలేదు. నేను మృతినొందనున్న యీయల్ప కాలములోనే నాకుఁగలప్రేమను విడువఁజాలక మీతోఁ జెప్పుచున్నాను.

తే॥ ఇంతనాఁడు కరగ్రహా ♦ వంతురాలి, జేసి తోడ్కొనివచ్చితి ♦ చెప్పినట్ల
చేయుచుంటిని గోట్రంబు♦మీయనుజ్ఞ, నలుపునాకేయెడలనైనఁ♦దెలుపఁగలరె. 58.

అ॥ ఇంతనాఁడు-బాల్యమునందే, హస్తసంజ్ఞాపూర్వకముగాఁ దనవయస్సును దెలుపుట. కరగ్రహవంతురాలిన్-పాణిగ్రహణమయినదానినిగా, చేసి-చేసికొని, తోడ్కొనివచ్చితి - వెంటఁబెట్టుకొనివచ్చియుంటివి. మీయనుజ్ఞన్-మీయొక్క సెలవుచొప్పున, కోట్రంబున్-కోటతికమును, ఉదా. "సీ॥ వైవాహికక్రియా♦వ్యసనంబుకొన్నేండ్లుఁ, గొన్నేండ్లుకోడంబ్ర♦కోట్రములును" విష్ణుపు. చెప్పినట్లు-చెప్పినప్రకారముననే, చేయుచుంటిన్-ఆచరించుచున్నానుగదా, నాకున్+నాకు, ఏయెడలనైనన్-ఎందుననయినప్పటికిని, ఏవిధముగానైనను, నలుపు-మలినమును, అనఁగాఁగళంకముననుట, తెలుపఁగలరె-కనఁబఱచఁగలుగుదురా, ఇదిలోకోక్త్యలంకారము. ఇందు 'తోడ్కొనివచ్చితి' అను ప్రయోగమునకు "సూ. క్వచి ద్వ్యవర్ణకే చాపికేచి త్తస్య స్థితిం జగుః" అథ. ఉదా. "ఉ. చేసితి జన్నముల్ తపము" స్వా మ.

తా॥ చిన్నతనముననే పెండ్లిచేసి కోటతికమునకుఁ దీసికొనివచ్చితివి. నాఁటనుండి మీయానతి చొప్పున జవదాఁటక ప్రవర్తించుచుంటిని. నాయం దేమయిన నలుపుజూపఁగలరా !

క॥ ఒకతెవలె నాడియాడిం, చుకొనుట నేయిరుగుపొరుగు ♦ చూచెనొకో యు
ప్పుకుఁ జప్పుకుఁ గా ననుఁజూ, చుక నుడువఁగవలెఁ గులీన ♦ శుకసల్లాపల్. 59.

అ॥ ఒకతెవలెన్-ఒకదానిమాదిరిగా, ఇచట 'ఒకతె' అనుటకు. 'సూ. ఎవ్వరితాదులయందలి రివర్ణంబునకు లోపంబు విభాషనగు. ప్రౌ. వ్యా. ఉదా. 'క. నీ. వలెనాకిఁక నాప్తులైనవారుంగలరే, రుక్మి. ఆడి-ఒకరినొకమాటయని, ఆడించుకొనుటన్-మరలననిపించుకొనుటచేత, ఉప్పుకున్ చప్పుకున్ కాన్-ఉప్పచప్పనగా-అనఁగా నిష్టములేనిస్వభావముతో ననుట, ఏయిరుగు-ఏయొక్కమనయింటి ప్రక్కనున్నవారుగాని, ఉదా. "క. ఇరుచెవియొఱుఁగకయుండన్" ఉ. హరివం. పొరుగు-ఏయొక్క ఎదుటింటివారుగాని, ఉ. "గీ. కరుణనింపొరనిమ్ము నీ♦పొరుగునందు" కాశీ. చూచెనొకో - ఎవరైననుజూచియున్నారా, కులీనశుకసల్లాపల్. కులీన-మంచివంశమునందుఁబుట్టిన, 'ని. అభిజాతః కులీన

స్యాత్, ఆ. శుకసల్లాపల్-చిలుకపలుకులవంటి యవ్యక్తమధురస్వరముతో సహితముగా సంభాషించుకొను స్త్రీలందఱును, ననున్ చూచుక-నాప్రవర్తనమునే మార్గముగా లక్ష్యముంచి, ఉదా. "క. ఆలోకింపక నీప్రత్తురిడు" "ఉ. దేశికిన్, ఒట్టుకవచ్చి యీడ్చి సిగఁబట్టివధిఁ పంగఁబూను కొందు" భాగ. "సీ. కొంగవాల్చరకునంగగళ్ళలఁబట్టుక జబ్బ, లంటఁగుట్టిన వెజ్జునరయువారు" అము. నడువఁగన్ + వలెన్-సంచరించవలయును. అనఁగా నాకలెనే నడచుకొనవలెననుట.

తా. ఒకదానివలె నొకటొకమాటయని యనిపించకొనటఁ జూచి యిరుగుపొరుగువారెవ్వరైన నన్ను వెక్కసముగాఁ జూచియున్నారా ? సత్కులప్రసూతలగుయువతులు నాయడుగుజాడల ననుసరించి నడువవలయును సుమా.

క॥ నను నేనె పొగడికొనఁగాఁ, జన దింతియకాని మగఁడు ♦ సంసారనివ
ర్తనఁ జేసి యిట్లు తిరిగిన, మనమునఁ గోపింప కెట్టి ♦ మగనా లుండున్. 60.

అ॥ నను నేనె-నాయంతట నేనే నన్ను. పొగడికొనఁగాన్ - స్తుతించుకొనుట, చనదు-చెల్లదు, ఇంతియకాని-ఇంతమాత్రమేకాని, అనఁగా నిజమునుజెప్పుకొనుట తప్పుగాదనుట. మగఁడు-భర్త, సంసారనివర్తనన్ + చేసి-కాఁపురమును విడిచిపెట్టి, ఇచట 'నివర్తన' అనుటకు "సూ. చరిత్రాదులకు ముపవర్ణలోపము విభాషనగు. బా. వ్యా. ఇట్లు-ఈవిధముగా, తిరిగినన్-సంచరించుచున్నట్లయిన, ఎట్టి మగనాలు-ఏలాటియిల్లాలయినను, మనమునన్-తనమనస్సులో, కోపింపక, ఉండున్ - ఉండఁగలుగును, లోకములో మగఁడు సంసారమును వదలి యిట్లు తిరుగుచున్నఁగని యేయిల్లాలయినను గోపపడక యూరకుండఁగలదా ? అనుటచే నర్థాంతరన్యాసాలంకారము. "తే. వహి విశేషంబుచేత సామాన్యమును బ్రసక్తసామాన్యమున విశేషము సమర్థ, తము నర్థాంతరన్యాసమవధరించఁడు, నెలమి రెండువిధంబులైయొప్పుటన్న" కా. సం. ఉదా. "గుణానామేవ దౌరాత్మ్యాత్, ధురి ధుర్యో నియుజ్యతే, అసంజాతకిణస్కంధః, సుఖంస్వపితి గౌర్గలిః" కా. ప్ర.

తా॥ నన్ను నేనేస్తుతించుకొనుట యొప్పదనుకొందము. ఇంతేకాని లోకములో భర్త సంసారమును విడిచి యీతీరునసంచరించుచున్నపుఁ డెటువంటిగృహస్థురాలయినఁ గోపపడకుండునా ?

వ॥ అని యనేకప్రకారంబుల విలపించి. 61.

అ॥ అని-ఇట్లని, అనేకప్రకారంబులన్-పలువిధములుగా, విలపించి - తలఁచుకొనివిచారపడి,

క॥ కలకంఠకంఠి మదిలోఁ,బలిదుఃఖం బాఁపలేక ♦ బాష్పజలంబుల్
జలజల జలప్రవహింపఁగ, వలవల నత్త్వెస నమ్ర ♦ వక్త్రాంబుజ యై. 62.

అ॥ కలకంఠకంఠి-కోకిలవంటికంఠస్వరముగలదయిన యాకోడలు, ఉదా. "వ. ఒక్క కల కంఠకంఠి" శృం. నై. మదిలోపలిదుఃఖంబున్ - తనహృదయమునందుఁగలశోకమును, 'ని. దుఃఖే నోవ్యసనేష్వఘమ్' యా. ఆఁపలేక-ఆటకాయించనేరక, బాష్పజలంబుల్-కన్నీరు, జలజల-జలజల మని, జల-అశ్రువులయొక్క ధార, ప్రవహింపన్ కన్-పాఱుచుండఁగా, ఉనా, ద్వి. కన్నుల జలజల

కా యేడుసీరు" హరి. అత్తదెసన్ – తనయత్తగారివైపునకు, నమ్రవక్త్రాంబుజయై. నమ్ర–వంచినట్టి వక్త్ర+అంబుజయై–ముఖకమలముగలదియై, అనఁగాఁబద్మమువంటి ముఖముగలదియైయనుట. వల వలన్–మిక్కిలిధ్వనియగునట్లుగా, ఇది దుఃఖమునకు విశేషణము. ఉదా. "సీ. తళుకునిద్దంపు టద్దపు మోము కళదప్పె, వలవల కన్నీరు వడువకమ్మ" అనిరు. పైవచనమునందలి 'యేడ్చుచున్న' నను క్రియతోనన్వయము. ఇందు జలజల–వలవల, అనుప్రయోగములకు 'సూ. కాంతిశబ్దాదిశబ్దా స్తుద్వి రుక్తా స్సంతి నైక శః, సాధారణా స్తదన్యే చ వైచిత్ర్యం భూరి వర్తతే" అథ. ఆకోడలు తన మనస్సులోనిదుఃఖము నాఁపఁజాలక యత్తగారిముందు మొగమువంచి వలవలయేడ్చెను. అనుటచే నిందుఁ గరుణాత్మకవియోగశృంగారము చెప్పఁబడినది. "క. వనిత పరోక్షంబునఁబతి, యును బ్రియునిపరోక్షమునఁబయోజాక్షియు రో, దన మొనరించుట వర్ణిం, చినఁ గరుణాత్మకవియోగ శృంగార మగున్" నరస. "నాధిగచ్ఛతి చాభీష్టం విప్రలంభ స్తథోచ్యతే" అను శాస్త్రవచనమునను సరించి విప్రలబ్ధయని తెలియవలెను. శోకమనుసంచారిభావముకూడఁ గన్పట్టుచున్నది. "క. హితజన విరహవ్యథచే, నతిశయమై జనుఁ డమానసాంభోజమునన్, బ్రతిదిన మోడమదుఃఖం, బతిభూమి వహింప శోకమగు నెట్లన్నన్" కా. సం.

తా॥ కోయిలవంటికంఠస్వరముగల దయినయాకోడలు తనమనోదుఃఖమును వారింపఁజాలక తనయత్తగారిమ్రోలఁ దలవంచి కన్నీటిధార వెల్లువయగునట్లు వలవల యేడ్వసాగెను.

### —♦ అత్తకోడలిదుఃఖోపశమనమునకుఁ బ్రయత్నించుట ♦—

వ. జనమనోరంజన ఖంజన వరాంజనమిళద్బాష్పధారాప్రకల్పితానల్పసారంగ మదపత్త్రి భంగహృదయంగమ కపోలంబుగా నేడ్చుచున్న నవ్వధూరత్నంబుం గాంచి సముచిత చేలాంచలంబునఁ గన్నీరుదుడిచి సముదాత్త కృపాయత్తచిత్తయైన యత్త యిట్లనియె. 63

అ॥ జనమ.........లంబుగాన్. జనమనోరంజన – ప్రజలమనస్సునకనురాగమునుగలిగించు నట్టి, ఖంజన – కాటుకపిట్టవలె, వరాంజన – శ్రేష్ఠమయినకాటుకతో, మిళత్ – కూడుచున్న, బాష్పధారా – కన్నీటివఱదలచేత, ప్రకల్పిత – కల్పించఁబడిన. అనల్ప – అధికమయిన, సారంగ మద – కస్తూరియొక్క, పత్త్రి – మకరికాపత్త్రిములు, 'ని. పత్త్రం పలాశంఛదనందళంపర్ణంచదః పుమాన్" అ. భంగ – చెడునట్లు, హృదయంగమ – మదికింపును గలిగించునట్టి, కపోలంబుగాన్– చెక్కిళ్లు కాఁగా, ఏడ్చుచున్నన్ – దుఃఖించుచుండఁగా, అవ్వధూరత్నంబున్ – అశ్రేష్ఠురాలయిన కోడలిని, కాంచి – చూచి, సముచితచేలాంచలంబునన్. సముచిత – ఒప్పుచున్న, చేలాంచలంబు నన్ – కోకయొక్కపైఁటకొంగున – పైజాఱున, కన్నీరుదుడిచి – అశ్రువులనుదొలఁగించి, సము దాత్తకృపాయత్తచిత్త. సముదాత్త–ధారాళమయిన, కృపాయత్త–దయకుస్వాధీనమైయున్న, చిత్త– మనస్సుగలది, ఐనయత్త – ఆయినట్టి యామెయొక్కయత్త, ఇట్లు+అనియెన్ – ఈవిధముగాఁ బలికెను – వక్ష్యమాణప్రకారముగా వచించెను, ఇచట 'అత్తయిట్లనియెన్' అనుటకు సూ

ఒక్కచో విశేషణంబులును విశేష్యంబులగు.'' ప్రౌ. వ్యా. ఇందు 'అనియెన్' అనుటకు ''సూ. ఇతఏవ పరస్పస్యాఽ దిద్భవే స్యాంత కా త్పరే'' అథ. ''రంజన-ఖంజన. అంజన—కల్పితానల్ప-సారంగమదపత్త్రి భృంగహృదయంగమ - కాంచిసమంచితచేలాంచల - ఉదాత్తకృపాయత్తచిత్త యైనయత్త'' ఇవియనుప్రాసాలంకారము. 'ఖంజనవరాంజనము' ఉపమాలంకారము.

తా॥ కాటుకపిట్టవలె నల్లనివర్ణముగల కాటుకకంటినీరు ప్రవహించుటచేఁ జెక్కులయందలి కస్తూరిమకరికాపత్త్రములు మాయుచుండ లోకులమనంబులకు జాలికలుగునట్లు దుఃఖించుకోమలిం జూచి యత్త మిగులదయగలది యై తనపైఁటచెఱంగుతో నశ్రువులఁదుడిచి యిట్లు చెప్పఁబూనెను.

క॥ ఓయమ్మ యేల యేడ్చెద, వో యుజ్జ్వలబాష్పధార ♦ లుట్టిపడన్ శో
కాయత్తచిత్తనీరజ, వై యెఱుఁగుదు నీమనోవ్య ♦ థాగతి తల్లీ. 64.

అ॥ ఓయమ్మ - ఓయమ్మాయీ, ఇచట యడాగమంబగుటకు 'సూ. సంధిలేనిచోట స్వరంబు కంటెఁ బరంబైన స్వరంబునకు యడాగమంబగు'' బా. వ్యా. ఉజ్జ్వలబాష్పధారలు - ప్రకాశించుచున్న కన్నీటివెల్లువలు, ఉట్టిపడన్ - అకస్మాత్తుగా సంభవించునట్లు, శోకాయత్తచిత్తనీరజవు. శోకాయత్త - దుఃఖమునకధీనమయిన, చిత్తనీరజవు - పద్మమువంటిమనస్సుగలదానవు, ఐ - అయి, ఏలయేడ్చెదవో - ఎందుకువిలపించుచున్నావు, నీమనోవ్యథా+ఆగతి - నీకువిచారముసంభవించిన తెఱఁగునంతయును, 'ని. పీడా బాధా వ్యథా దుఃఖం'' అ. ఎఱుఁగుదున్ - తెలిసికొనియే యున్నాను, తల్లీ - ఇదిప్రేమనుదెలియఁజేయు సంబోధనము, 'ఆయత్తచిత్త, అనుప్రాసాలంకారము 'చిత్తనీరజ' ఉపమాలంకారము.

తా॥ అమ్మాయీ ! ఇట్లు మనోవ్యాకులముచేతఁ గన్నీరువెల్లువయగున ట్లేలయేడ్చెదవు: నీవిచారము నంతయు నేనెఱుఁగుదును.

తే॥ ఏమిసేయుదు మదిలోన ♦ నెన్నఁడైన, మఱచియుండెడిదాననా ♦ మగువ వాని
కర్మకౌశలమెట్లుకాఁ ♦ గలదొ కాని, యాణిముత్యముమసిబొగ్గ ♦ యయ్యె నేఁడు 65.

అ॥ మగువ - ఓచిన్నదానా, మదిలోనన్ - నామనస్సునందు, ఎన్నఁడైనన్ - ఎప్పుడైనను, మఱచియుండెడిదానవా - వానినివిడిచి పరాకుతోనుండియెఱుఁగుదునా, ఏమిచేయుదున్ - ఇప్పుడు నేనేమిచేయఁగలదానను, వానికర్మకౌశలము - అతనిపూర్వజన్మముయొక్కఫలపరిపాకము, అనఁగాఁ బ్రారబ్ధమును నిప్పుడనుభవించుచున్నాఁడు. ఆగామి సంచితము లెట్లున్నవో యనుట. ఆగామి యనఁగా రానున్నకర్మఫలపరిపాకము. సంచితమనఁగాఁ గూడఁబెట్టఁబడిన కర్మఫలరాశి. ఎట్లు కాఁగలదో - ఏవిధముగాఁ బరిణమించుటకు సిద్ధమైయుండెనో. కాని - నాకుఁదెలియఁబడుటలేదుగాని, ఆణిముత్యము - స్వచ్ఛమైన గుండ్రనిముత్యము, నేఁడు - ఈదినమున, మసిబొగ్గ - కాలి నల్లఁబడిన బొగ్గుగానే, అయ్యెన్ - అయెను, ఉదా ''సీ॥మసిబొగ్గు బోనాన•నసలు గొల్పినకన్ను, కొడుపుచేఁ దాటించు•నెపపదపు'' క్రీడా. 'కర్మకౌశలమెట్లు కాఁగలదో, అనుటకు శాస్త్రవిహితకర్మముల నాచరింపనివానికి మోక్షములేదని తెలియుచున్నది. ''య శ్శాస్త్రవిధి ముత్సృజ్యవర్తతే కామ

కారతః' న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాంగతిమ్" భగ. శాస్త్రవిధి నతిక్రమించి యిష్ట ప్రకారము వర్తించెడిపురుషుఁడు పరలోకహేతు వైనసిద్ధిని గాని, సుఖమును గాని, ఉత్తమగతిని గాని, పొందఁడు, ఉదా "ఉ॥ ఎవ్వఁడు మీఁదెఱుంగక యథేచ్ఛసుఖైకరతింజరింపఁగా, నవ్వలవంశ హాని వ్రత • హానియశోధనహానిపుట్టుఁదా, నవ్వెడగమ్మనుష్యపశు • వయ్యవివేకిచెడున్ జగంబునన్, నవ్వఁగఁబాలు గౌరవము • నంబడఁజాలును నిందపాలునై" స్వా. మ, "త. అకుమీఁదిరాఁత • యుం దటికెఱుకరయే, చేతిలోనిరాఁతఁ • జెప్పవచ్చుఁ, దోలుక్రిందిరాఁత • దొడ్డవాఁడెఱుఁగును, విశ్వ" వే.

"నేతా యస్య బృహస్పతిః ప్రహరణం వజ్రం సురా స్సైనికాః
స్వర్గో దుర్గ మనుగ్రహః ఖలు హరే రైరావణో వారణః
ఇత్యాశ్చర్యబలాన్వితోఽపి బలభి ద్భగ్నః పరై స్సంగరే
తద్వ్యక్తం నను దైవమేవ శరణం ధిక్ ధిక్ వృథా పౌరుషమ్" భర్తృ.

"చ॥ గురుఁడుగురుండు వాలుశత • కోటి సుపర్వులు వాహినీపతుల్
సురభవనంబుగోట మధు • సూదనుఁడున్ సయిదోడు దంతిది
క్కరిపతి గాఁగ నొప్పుబల • ఘాతియరాతులకోడె నాజిలో
శరణముదైవమే పురుష • శక్తినిరర్థక మెన్నిభంగులన్."

ఇందుఅణిముత్యము మనిబొగ్గ యయ్యెననుటచేఁ బర్యాయోక్త్యలంకారము. "ఏకం క్రమేణానేకస్మిన్ పర్యాయః" కా. ప్ర, ఉదా "బింబోష్ఠి తవ రాగస్తే తన్వి పూర్వమదృశ్యత, అధునాహృదయేఽ ప్యేష మృగశాబాక్షిలక్ష్యతే" నవ సా. చ.

తా॥ అమ్మాయీ! వాని నెన్నఁడునువిడిచియుండి యెఱుఁగను. వాని! పురాకృతకర్మఫలపరి పాక మెటులఁబరిణమింపనున్నదో కాని యిదివఱకు సమస్తవిధముల నెన్నఁదగిన సుగుణసంపత్తి కలవాఁడే. నేఁటికిట్టిదుష్ప్రవర్తనమునకుఁ దలయొగ్గి మంచిముత్యము మసిబొగ్గయిన ట్లయినాఁడు నేనేమిసేయఁగలను.

క॥ ఓనాతి వారకాంతా, ధీనగుణాతురుని మగుడఁ • ద్రిప్ప నవశ్యం
బైనం గానిమ్ము సమ, స్తానునయాలాపసరణి • నాతనిఁ దేర్తున్. 66.

అ॥ ఓనాతి–ఓపొలఁతీ, వారకాంతాధీనగుణాతురునిన్. వారకాంతా–భోగముదానికి, అధీన– లోఁబడిన, "ని॥ అధీనోనిఘ్నఆయత్తోఽస్వచ్ఛందోగృహ్యకోఽప్యసౌ" అ. గుణ–అభ్యాసముచేత, 'గుణఅభ్యాసే' ధాత్వర్థము. ఆతురున్–ఆశగలవానిని, మగుడన్–మరల, త్రిప్పన్–వెనుకకుమరల్చుటను, అవశ్యంబు తప్పకచేయవలసినపని, ఐనన్ – అయినప్పటికిని, కానిమ్ము – అటులనేయుండనిమ్ము, అతనిన్–నీయొక్క–భర్తను, సమస్తానునయాలాపసరణిన్, సమస్త–అన్నివిధములయిన, అనునయ–మంచి మాటలయొక్క–, ఆలాప–సమృద్ధియగు సంభాషణములతోఁగూడిన, సరణిన్–పద్ధతిచేత, తేర్తున్– స్వస్థతనొందించెదను–గృహమున నెమ్మదిగా నుండునట్లొనర్చెదను, వేశ్యాలోలుఁడుమున్నగు దుష్ప్ర వర్తనముగలవారితోను, రాజు మొదలగు గొప్పవారితోను, సంభాషించుట చాల యుక్తియుక్తము గను, జాగరూకతగను, ఉండవలయును. "అ. హీనజనులతోడ • నింతులతోడను, బడుచువాండ్ర

తోడఁ(ప్రభువుతోడఁ, బ్రాహ్మజనులతోడ(బ్రహ్మజ్ఞులతోడను, వైపుదెలిసిపలుక(వలయు వేమ" వే.
ఈపద్యమున 'ఐనంగానిమ్ము', అనుప్రయోగమునుగూర్చి "సూ. పునర్ని ర్ధారణాద్యర్థాత్క్వాచి దిష్టో
నవర్ణ కాత్" అథ. ఇచట నీతులుబోధించియు విఫలమేయగు ననుసంశయమునకు "యావన్నయౌవన
ప్రాప్తః శిక్ష్యతేతావదాత్మజః, వ్యతీత కాలేక్షేదారే కర్షణైః కింకరిష్యతే" హరిసు.

తా॥ ఓయతివా! వెలవెలందులకు లోఁబడినచిత్తముగలవానిని మరల్చుట ముఖ్యకర్తవ్యము.
అయిన నటుండనిమ్ము. తగినన్ని మంచిమాటలతో నాతనికి మదినిలుకడయగునట్లొనర్చెదను.

వ॥ అనియూరడించి పలుకుచున్నంత. 67.

అ॥ అని-ఇట్లువచించి, ఊఱడించి-శాంతిపఱచి, ఓదార్చి, పలుకుచున్నంతన్-మాటాడుచున్న సమయమున,

## —: సూర్యాస్తమయవర్ణనము :—

ఉ॥ సంగతి నిష్ఠ నేతము ♦ సల్పఁగ నెన్నఁటికబ్బెనో నుతిం
చంగల దేవతాపదవి ♦ సాధునమస్కరణీయభావమున్
భంగుర మైనయాతపము ♦ వాయఁ ద్రయీమయుఁ డయ్యెయో దివా
సంగమజాతపాతకము ♦ చాలక వారుణికేగె భూవరా. 68.

అ॥ భూవరా - ఓరాజా, త్రయీమయుఁడు - మంచిబుద్ధిగల స్త్రీతోఁగూడినవాఁడు, 'ని. త్రయీత్రివేద్యాంత్రితయే, పురంధ్ర్యాంసుమతావపి, విశ్వ. మూడుస్వరూపములతోఁగూడిన సూర్యుఁడనిభావము, అనఁగా నుదయమున బ్రహ్మస్వరూపము, మధ్యాహ్నమున మహేశ్వరస్వరూపము, సాయంకాలమునవిష్ణుస్వరూపము,కలవాఁడు. సంగతిన్-జ్ఞానముచేత, బాల్యాద్యవస్థాత్రయముయొక్కయనిభావము. "ని.గతిస్తుగమనే మార్గే దశాయాం బుద్ధ్యపాయయోః" నానా. సం+గతిః"సంగతి యగును. "ని.ఉపస్థానంతుసంగతిః"యా. నిష్ఠన్-నిశ్చలత్వముతో, ఏతపముసల్పఁగన్-ఎటువంటియుత్కృష్టమైనతపస్సునుజేయఁగా, తపోలోకమునుసృష్టించఁగానని భావము. అనఁగా,నీలోకములన్నియు సూర్యునివలననే పుట్టుచుండు ననుశాస్త్రవచన మిచ్చటఁగాహ్యము. 'ని తపశ్చాంద్రాయణాదౌ స్యాద్ధర్మేలోకాంతరేఽపి:చ'విశ్వ. ప్రపంచమునఁ గలజీవకోటికిఁ దాపముగలిగించఁగా ననియుఁ జెప్పవచ్చును. ఎన్నఁటికిన్-ఎంతకాలమునకు, నుతించంగలదేవతాపదవి - స్తోత్రముచేయఁదగినదేవత్వమనియెడి యున్నతస్థితియును, దేవతలలో నైశ్వర్యమనిభావము. ఇచట 'నుతించంగల, అనుప్రయోగమునకు "సూ. భవతి క్రియపదానాం త్రివిధానా మించుగాగమః" అనుబంధప్రార్థనయో ర్ణావ్యతిరేకాదికేచ చోఽప స్స్యాత్, శబ్దచిం. అని సూత్రీకరించియు నిచటఁ గొందఱు వర్ణవ్యవధానముచేత నున్నానుబంధకము పరమగునపు డించుగాగమ సంధియగు చువర్ణంబునకుఁ బాదేశంబులేదని వక్కాణింతురు. ఉదా. 'పోషించుచున్నాఁడు-నుతించుచున్నాఁడు- జయించుచున్నాఁడు' ఇత్యాదులు. "సూ. యథా ప్రసిద్ధి ధాతూనాం ప్రయోగ స్సమ్మతో భవేత్, ఏవోపపదభాజ స్స్య, స్సాధవో శ్యాదయః క్రియాః" అథ. ప్రౌఢవ్యాకరణమునను "సూ. కవిత్రయేతరప్రయోగంబులం గొన్ని

యెడల నన్ప్రిత్యయాదులు పరంబులగునపుడు పకారంబించుక్చకారంబునకేనిఁ గానఁబడదు” ఉదా. “క. ఎవ్వారిని బో, రించనిక్షణ మెుక్కటియుఁ దరింపఁగవశమే, కళా. ‘క. ఉః, హించనొకనాల్గు గడియల, సంచారమువలయు, కళా. సాధునమస్కరణీయభావమున్ – సజ్జనులచేత నమస్కరింపఁదగినస్వభావమును, యోగ్యమయిన నమస్కారములను బొందుచుండువాఁడనిభావము. ‘సాధుః సమర్థో నిపుణో వా, కాశికా. ఆప్తనో–లభించియుండెనో, భంగురము–నశించునట్టిస్వభావముగలది, ఐనయాతపము–అయినట్టి యాయెుక్క తపస్సు, ఆతపమనఁగా నెండ అది నిత్యమును నశించునట్టి స్వభావముగలది. కావున సాయంసమయమున నెండయేమియు లేకుండు. పోయన్ – వదలిపోవునట్లు, అయ్యయో–ఇదిసంతాపమును దెలియఁజేయును, దివాసంగమజాతపాతకము దివాసంగమ–పగటియందు వ్యభిచరించినందువలన, ‘దివాయాం సంగమం దివాసంగమం, పగటితోఁగూడియుండినందున నని భావము. జాత–సంభవించిన, పాతకము–పాపము, అధఃపతనమని భావము. చాలక–సరిపోయెనని తృప్తిపడక, ఇంకను బాపమును సంపాదించుకొనవలయునని యనుట. అపరయామద్వయముపూర్తికాక యనిభావము. వారుణికిన్–కల్లుత్రాగుటకు–మద్యపానమునకు, పడమటిదిక్కున కనిభావము. ‘ని. వారుణీగండదూర్వాయాం ప్రతీచి సురయోరపి” విశ్వ. ఇచట సురతాసక్తులు మద్యపానముచేయుచుండు రనుటకు “తాలక్షీగసితామృతామలగుడోన్మత్తాస్తికాలాహ్వయా, దార్విం ద్రద్రుమమోరశేక్షుకదళీగుగ్గు ప్రసూనైర్యుతం, ఇత్థంచేన్మధుపుష్పభఙ్గ్యుపచితం పుష్పద్రుమాలావృతం, క్వాథేన స్మ దీపనం రతిఫలాఖ్యం స్యామశీతంమధుః” మ.౨. మద్యమువలనఁబతితుఁడగుననుటకు “వేదత్రయమయోయఃస్యాత్ సోఽపిహీనఃక్షణాద్భవేత్ స్వస్యైవరుచ్యా పీతాయాం వారుణ్యాంసత్పథాచ్చ్యుతః, దేవాశ్చభూమిదేవాశ్చ నిత్యమప్యమృతాశనాః హీయంతేస్వాధికారాత్తే యేసేవంతేనవాసవం” సూ. సం. ఇందు ‘వారుణికేగెన్’ అనుప్రయోగమున ద్వితీయకు షష్ఠిచెప్పఁబడినది. “సూ. షష్ఠీస్థానికంబగు కువర్ణకం బొక్కొక్కచో ద్వితీయాదివిభక్త్యులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడిని” ప్రౌ. వ్యా. ‘త్రయీమయుఁడు’ అను శబ్దముచేశ్లేషాలంకారమును, “శ్లేషః స వాక్యే ఏకస్మిన్ యత్రానేకార్థతా భవేత్” కా, ప్ర. మఱియుఁబ్రస్తుతార్థప్రతిపాదకవాక్యమున శ్లేషసామర్థ్యముచేత నప్రస్తుతమయిన కావ్యకథ నిందుసూచింపఁజేయుటచేత సమాసోక్త్యలంకారము. “పరోక్తి ర్భేదకైః శ్లిష్టైః సమాసోక్తిః” కా. ప్ర. ముక్కుతిమ్మనార్యుఁడు నిట్లే వర్ణించినాఁడు “చ. ఇనుదెసఁజూడ నోడి తల • లెత్తక నీటఁదదీయబింబముం, గని వగ జక్కవల్ మొగమె • గంబులుసూచుచునుండి మూర్ఛఁజెం, దినదెసఁ జూడలేక జల • దేవత పోయనికన్నుమోడ్చె నా, వనరుహముల్ ముడింగె సహ • వాసులదుఃఖము సెయ్యురోర్తురే” పారి. ఇచట నిరంకుశునియెుక్క వేశ్యాలంపటత్వమును బోలఁగింపనున్న తల్లిప్రయత్నము సైతము నిష్ఫలమై మరలనుదయమునసనేగిణికాంగనయింటికిఁ జనఁగుతూహలుఁడగుట యిందుధ్వనించుచున్నది. ఇంకను మంచిబుద్ధిగలస్త్రీతోఁగూడినవాఁడయినయతఁడు జ్ఞానముచే దృఢబుద్ధితో నేలాటిశ్రేష్ఠమగు తపస్సుచేయఁగా గణింపఁదగినభూదేవత్వ మనునున్నతస్థితియు, సజ్జననమస్కారప్రాప్తార్హతయు, లభించియుండెనో యట్టిశాశ్వతమయిన తపస్సంతయు నశించునట్లుకటా పగటివ్యభిచారమున సంపాదించికొనినపాపము చాలక మద్యపానమున కరిగెనుగదా! అనునర్థముచేత శబ్దశక్తిమూలాలంకారధ్వనియును.

తా॥ ఓరాజా! త్రిమూర్త్యాత్మకుఁడగు సూర్యుఁడు బాల్యాద్యవస్థాత్రయము యొక్క నిశ్చయత్వముతోఁ బ్రపంచమునఁ గల జీవకోటిని దపింపఁజేయుచు స్తోత్రార్హతగల దేవతాప్రభుత్వమును యోగ్యమయిన నమస్కారములను స్వీకరింపఁదగిన స్వభావమును గలిగియుండెనో యట్టి క్షణభంగురమగు నెండయంతయుఁ బోవునట్లు పగటితోఁ గూడుటవలని యథాగమనము పూర్తిగాక పశ్చిమదిక్కున కరిగెను.

—: సంధ్యాకాలవర్ణనము :—

మ॥ అపు డంభోజహితుండు కృష్ణుఁ డనఁగా ♦ నాకాశపుంజేఁకుబం
డపయిన్ వేడుక నెక్కి జాఱుకొనుచుం ♦ డన్ సాంధ్యరాగంపుహే
మపుఁజేలల్ దిగజాఱ వక్త్రములకుం ♦ బైఁ జాటుగా నంధకా
రపునీలాంబరముల్ ధరించిరి సమ ♦ గ్రవ్రీడ దిగ్గోపికల్. 69.

అ॥ అపుడు - ఆసమయమున, అంభోజహితుండు - కమలములకు మిత్రుఁడయిన సూర్యుఁడు, కృష్ణుఁడు + అనఁగాన్ - కృష్ణుఁడనునట్లుగా, ఆకాశపుంజేఁకుబండపయిన్ - ఆకసమనెడి చివికినరాతిమీఁద, అనఁగా నానిజాఱుమన్నఱాతిమీఁద ననుట. వేడుకన్ - అభిలాషతో, ఎక్కి - ఆరోహించి, జాఱుకొనుచుండన్ - క్రిందికిదిగుచుండఁగా, సాంధ్యరాగంపుహేమపుఁజేలల్ - సంధ్యాకాలపుటరుణచ్ఛాయయనుతమ బంగారపుఁజీరలు, దిగన్ + జాఱన్ - ఊడిక్రిందఁబడుచుండఁగా ఇచట 'చేల, చేలము' అను రెండురూపములు కలవు. "ని. చేలం వస్త్రే బహుచ్ఛేదే త్రిషుత్వేక్షుమనిందయోః" అ, విశ్వకోశము, నానార్థరత్నమాల, మేదినీకోశము, ధనంజయనిఘంటువుకూడ నిట్లే చెప్పుచున్నవి. కాని 'ని. చేలా. ఆ. సీ. చేలం. అ. న. వస్త్రము. శ. రూ. ర. 'చేలము - చేల. వస్త్రము' శ. చం. 'చేల-ఆ. స్త్రీ. చేలము' సూ. ఆం. ని. దిగ్గోపికల్ - దిక్కులనెడి గొల్లజవరాండ్రు. సమగ్రవ్రీడన్ - నిండారినసిగ్గుతో, వక్త్రములకున్ - తమమొగములకు, పైన్ - మీఁద, చాటుగాన్ - మఱుగుపడునట్లు, అగోచరమగునట్లు, అంధకారపునీలాంబరముల్ - చీఁకటియనెడి నల్లనికోకలు, 'సి. అంబరం వ్యోమ్ని వాసః' అ. ధరించిరి - కట్టుకొనిరి, సూర్యుడు సాయంకాలము విష్ణుస్వరూపుఁడని ప్రసిద్ధికనుక నతనిని కృష్ణునిగను దిశలను గోపికలనుగా వర్ణించెను. పద్యమంతయు సావయవరూపకాలంకారము, "మ. అల సందేహము మాడ్కిఁ గాక యుపమేయం బెన్న నచ్ఛిన్నమై, యలఘూత్ప్రేక్షయునా నభిన్నమతిజం ♦ బైయుండ కారోప మిం, పలరంగాఁ బ్రకృతోపయోగి పరిణా ♦ మారోప్యతుల్యంబుఁగా, కలయారోపిత మింపు రంజనము సేయన్ రూపకంబై తగున్" కా. సం. 'అంభోజహితుండు కృష్ణుఁడనఁగా' ఉత్ప్రేక్షాలంకారము. 'సంభావనమథోత్ప్రేక్షా ప్రకృతస్య సమేతనయత్' కా. ప్ర. "మన్యే శంకే ధ్రువం ప్రాయో నూన మిత్యేవమాదిభిః, ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దై రివశబ్దోఽపి తాదృశః" కావ్యాద.

తా॥ ఆసమయమున సూర్యుఁడనెడి కృష్ణుఁ డాకసమనెడి జారుబండమీఁద వినోదముగా నెక్కి క్రిందికి జారుచుండఁగా సంజకాలపుకెంజాయ యనెడి తమపసిఁడికోక లూడిపడఁగనె పైఁ బడుచుం

పంగా దిక్కులనెడి గోపికాంగనలు నిండారినసిగ్గుతోఁ దమమోము లగపడకుండునట్లు చీఁకటి యనెడి నల్లచీరలను గట్టుకొనిరి.

—: చంద్రోదయవర్ణనము :—

చ॥ భిదురిదిశాయశోద దివి ♦ పేరిటికృష్ణున కుగ్గువెట్టుచో
నుదరములో జగంబుల స ♦ మున్నతిఁ గాంచి పరిభ్రమించి చే
వదలిన జాఱిబోరగిల ♦ వ్రాలిన మేలిమిగిన్నెవోలె సా
ముదయముఁ జెంది యున్నశశి ♦ యొల్కినపాలును బోలె వెన్నెలల్. 70.

అ॥ భిదురిదిశాయశోద - ఇంద్రునిదిశయనెడియశోదాదేవి, దివిపేరిటికృష్ణునకున్ - ఆకాశమనెడి కృష్ణునకు, ఉగ్గు + పెట్టుచోన్ - ఉగ్గుఁబాలు త్రాగించెడిసమయమున, ఉదరములో జగంబులసమున్నతిన్. ఉదరములోన్ - తనగర్భమునందుఁగల, జగంబులసమున్నతిన్ - లోకముల యొక్క యతిశయమును, కాంచి - వీక్షించి, పరిభ్రమించి - మిక్కిలిభ్రాంతినొందినదై, చేవదలినన్ - తనచేతినుండిజాఱిపడఁగా, జాఱి - క్రిందఁబడి, బోరగిలన్ - బోర్లపడునట్లు, వ్రాలిన మేలిమిగిన్నెవోలెన్ - క్రిందికిఁగిన శ్రేష్ఠమయిన గిన్నెయో యనునట్లు, సాముదయమున్ + చెంది - సగము వెలువడి, సాము + ఉదయము - సాముదయము, చక్కనియుదయమనియుఁ జెప్పవచ్చును గాని యర్థోదయమునకే వెన్నెలవెల్లివిరియునుగనుక సగము వెలువడియనుటయే యొప్పు. ఉన్నశశి - ఉండినట్టి చంద్రుఁడు, ఒల్కినపాలునుబోలెన్ - చిందునట్లుచేసినక్షీరము వలె, వెన్నెలల్ - చంద్రికలు, ఒప్పుచుండెను. అధ్యాహారము, 'భిదురిదిశాయశోదదివిపేరిటికృష్ణున కుగ్గువెట్టుచో' రూపకాలంకారము. "తద్రూపకమభేదోయ ఉపమానోపమేయయోః, అతిసామ్యాదభేదః, సమస్తవస్తువిషయం శ్రౌతా ఆరోపితా యదా" ఉదా "జ్యోత్స్నాభస్మచ్ఛురణధవలా బిభ్రతీ తారకాస్థీ, న్యంతర్ధానవ్యసనరసికా రాత్రికాపాలికీయం, ద్వీపాద్ద్వీపం భ్రమతి దధతీ చంద్రముద్రాకపాలే, న్యస్తం సిద్ధాంజనపరిమళం లాంఛనస్య ఛలేన" కా. ప్ర. శ్రీకృష్ణుఁడు తాను మన్నుతినలేదని నోరుతెఱచి తల్లికి విశ్వముంజూపినకథ "యద్యేవం తర్హి వ్యాదేహీ త్యుక్తస్స భగవాన్ హరిః, వ్యాదత్తావ్యాహతైశ్వర్యః క్రీడామనుజబాలకః, సా తత్ర దదృశే విశ్వం జగత్ స్థాస్నుచ ఖం దిశః. సాద్రిద్వీపాబ్ధిభూగోళం సవాయ్వగ్నీందుతారకమ్" జ్యోతిశ్చక్రం జ్వలత్తేజో వివరాణి రసాతలం, వైకారికాణీంద్రియాణి మనోమాత్రా గుణాస్త్రయః" ఏతద్విచిత్రం సహజీవకాల, స్వభావకర్మాశయలింగభేదం, సూనోస్తనౌ వీక్ష్య విదారితాస్యే, వ్రజం సహాత్మాన మవాప శంకామ్" సం. భా. గ. 'బోరగిలవ్రాలిన మేలిమిగిన్నెవోలె సాముదయముఁజెంది యున్నశశియొల్కినపాలునుబోలె' గుణస్వరూపోత్ప్రేక్షాలంకారము. "క. ఉపమేయమునకుఁ గలిగిన, యుపమానగుణక్రియాది ♦ యోగముచే నా, యుపమానమె' యనితలంచిన, నపు డది యుత్ప్రేక్ష యయ్యెనదియును ధరణిన్" నరస. "సంభావన మథోత్ప్రేక్షా ప్రకృతస్య సమేన యత్" కా. ప్ర.

తా॥ తూర్పుదిశయనెడియశోద యాకసమనెడి బాలకృష్ణున కుగ్గుఁబాలు త్రాగించునప్పు డతనికుక్షియందుఁ గలలోకములనెల్లను జూచి మిగులభ్రాంతిఁజెంది తనహస్తమునందుండిన యుగ్గు గిన్నెను జాఱవిడిచెనో యనునట్లు సగముదయించిన చంద్రుఁడును, ఆగిన్నె బోరగిలుటవలన నందుఁ గలపాలు భూమిపై విస్తరించెనో యనునట్లు వెన్నెలలును, ప్రకాశించుచుండెను.

తే॥ జారచోరప్రవర్తన ♦ జరగదయ్యె, మండలస్ఫూర్తిదిశలెల్ల ♦ నిండుకొనియెఁ
గానరాదయ్యెఁబ్రతిపక్ష ♦ గౌరవంబు, రాజధర్మంబుతత్ప్రకా ♦ రంబకాదె. 71.

అ॥ జారచోరప్రవర్తన. జార – వ్యభిచారులయొక్కయు, చోర – దొంగలయొక్కయు. ప్రవర్తన – సంచారము, ఇచట 'ప్రవర్తన' అనుటకు 'సూ. చంద్రాదులకు ము వర్ణలోపము విభాష నగు" బా. వ్యా. జరగదయ్యెన్ – సాగకుండెను, మండలస్ఫూర్తి – దేశముయొక్కసమృద్ధి, బింబము యొక్కప్రకాశమని భావము. "ని. స్యాన్మండలం ద్వాదశరాజకేచ, దేశేచబింబేచకదంబకేచ" విశ్వ. దిశలెల్లన్ – దిక్కులన్నియును, నిండుకొనియెన్ – పూర్ణీభవించెను, ప్రతిపక్షగౌరవంబు – శత్రువులయొక్క ఘనత, కృష్ణపక్షముయొక్క గొప్పతనమనిభావము. "ని. ప్రతిప్రతినిధావీప్సా లక్షణాదా ప్రయోగతః" విశ్వ. కానరాదయ్యెన్ – అగుపడకుండెను, అనఁగాఁ జంద్రుఁడొక పక్షమునమాత్రమే ఘనబింబముగా గనఁబడుననుట. రాజధర్మంబు – రాజులయొక్క న్యాయము, చంద్రునియొక్క స్వభావమనిభావము. 'ని. రాజానృపేలతాభేదే పతౌక్షత్రియచంద్రయోః" "ధర్మోస్త్రీపుణ్యఆచారే స్వభావోపమయోఃక్రతౌ" నానా. తత్ప్రకారంబకాదె – అదియేవిధము గదా, ఇచట, జారచోరప్రవర్తనములు చీఁకటియందు జరుగుననుటకు "వాణిజ్యేనగతః సమేగృహపతిర్వార్తాపినశ్రూయతే, ప్రాతస్తజ్జననీప్రసూనతనయా జామాతృగేహంగతా, బాలాహంనవయౌవనా నిశికథం స్థాతవ్యమేకాకినీ, సాయంసంప్రతి వర్తతేపథికహేస్థానాంతరం గమ్యతామ్" శృం. తి. నాపెనిమిటి వ్యాపారమునకై వెళ్ళినాఁడు. ఎప్పుడువచ్చునో వార్తయైన దెలియలేదు. ఈవేళయుదయమున నే మాయత్త తనకూతురుప్రసవించినదని యల్లునియింటికిబోయినది. నేనుచిన్నదాన నీయింటిలో నొంటరిగానుండలేను. ఇప్పుడేసూర్యాస్తమయమయినదికనుక నోబాటసారీ యీరాత్రి యిక్కడ శయనించుము. 'యామిన్యేషా బహులజలదైర్గాఢబద్ధభీమాంధకారా, నిద్రాంయాతో మమపతిరసౌక్లేశితః కర్మదుఃఖైః, బాలాచాహంఖలు ఖలభయాత్ప్రాప్తగాఢప్రకమ్పా, గ్రామశ్చైరైరయముపహతః పాంథనిద్రాంజహీతి" శృం. తి. ఈరాత్రి బాగుగామబ్బుపట్టి గాఢాంధకారమైయున్నది. ఈయనే నామగఁడు, కర్మవశమునవ్యాధిగ్రస్తుడై పడియుండినిద్రించుచున్నాఁడు, నేనుచిన్నదానను. ఈగ్రామమున దొంగలభయముకద్దు, నాకుఁజాల భయముగానున్నది. కనుక నీరేయి యిక్కడపండుకొనుము. 'వ్యభిచారులకును, దొంగలకును అడుగుసాగకుండెను. మండలసమృద్ధి యెల్లెడలనిండెను. విరోధులగౌరవ మగుపడుటలేదు. రాజధర్మమన నిదియేకదా' ఇందుఁచంద్రునకు రాజధర్మంబు నారోపించుటచే శ్లేషాలంకారము. "క. ప్రకృతము లప్రకృతంబులు, ప్రకృతా ప్రకృతములు శబ్దపాటవమాత్ర, ప్రకటితసామ్యముఁ జెందిన, సకలంకత శ్లేషమయ్యె" నరస. "శ్లేషః స వాక్యే ఏకస్మిన్ యత్రానేకార్థతా భవేత్" కా. ప్ర. ఉదా "ఉదయమయతే దిఙ్మాలిన్యం నిరాకురుతే

తరాం, నయతి నిధనం నిద్రాముద్రాం ప్రవర్తయతి క్రియాః, రచయతితరాం స్వైరాచారప్రవర్తనకర్తనం, బతబత లసత్తేజఃపుంజో విభాతి విభాకరః” శిశు.

తా॥ వెన్నెలలు సమృద్ధిగానుండుటచే దొంగతనములు, జారతనములు సాగకుండెను. చంద్రబింబము సంపూర్ణముగాఁ బ్రకాశించుచుండెను. చీఁకటియగుపడుటలేదు.

—: చంద్రికావర్ణనము :—

సీ॥ గగనసిద్ధుఁడు భస్మ ♦ కక్షపాలికఁ గ్రుమ్మ, రింప వెల్వడుభస్మ ♦ రేణు వనఁగ
రాజు విభావరీ ♦ రమణిపైఁ గరనాడి, కలఁ జిమ్మినతుషార ♦ జల మనంగ
యామినీగణికాంబు ♦ జాస్య దిగ్భిత్తులఁ, జల్లిననవచూర్ణ ♦ సలిల మనఁగఁ
గమనీయసితపక్ష ♦ ఘనసారతరునిశా, త్వగ్జాతకర్పూర ♦ వార మనఁగఁ

తే॥ గాసె నమృతాశనాశన ♦ కాశకేశ, కాశలోకేశ వేల్లిత ♦ కేశపాశ
కాశదేశబిలేశయా ♦ ధీశసుప్ర, కాశసంకాశకౌముది ♦ యాశలందు. 72.

అ॥ గగనసిద్ధుఁడు - ఆకాశమనెడియోగీశ్వరుఁడు, ‘ని. నభోంతరిక్షంగగనం’ అ. భస్మకక్షపాలికన్ - విభూతితోఁగూడినకకపాలను, సన్న్యాసులు చంకనుంచుకొనునట్టియొకవిధమయినసంచిని, గ్రుమ్మరింపన్ - బోరగిలునట్లువంచఁగా, వెల్వడుభస్మరేణువు - బయటఁబడిన బూడిదయొక్కసూక్ష్మరూపమో, అనఁగన్ - అనునట్లుగాను, రాజు - చంద్రుఁడు, విభావరీరమణిపైన్ - రాత్రియనెడి సుందరియైనస్త్రీమీఁద, ‘ని. విభావరీతమస్విన్యౌ’ అ. కరనాడికలన్ - కిరణములనెడి గొట్టములతో, చిమ్మినతుషారజలము - చిందునట్లుచేసినమంచునీరో,’ ని. అవశ్యాయస్తునీహారస్తుషారస్తుహినం హిమం’ అ. అనఁగన్-అనునట్లుగాను, యామినీగణికాంబుజాస్య-రాత్రియనెడివేశ్యాయువతి, ‘ని. రజనీయామినీతమీ’ అ. దిగ్భిత్తులన్ - దిశలనెడిగోడలయందు, చల్లిననవచూర్ణసలిలము - ప్రోక్షించిన నూతనమయినసున్నముతోఁగూడినజలమో, అనఁగన్ - అనునట్లుగాను, కమనీయ......,వారము. కమనీయ - ఇంపైన, సితపక్ష - శుక్లపక్షమనెడి, ఘనసార - కర్పూరముయొక్క, తరు - వృక్షమున, “ని. వృక్షోమహీరుహఃశాఖీ విటపీపాదపస్తరుః” అ. నిశా - రాత్రియనెడి, త్వక్ - పట్టవలన, “ని. త్వక్ స్త్రీ వల్కంవల్కలమస్త్రియాం” అ. జాత - పుట్టఁబడిన. కర్పూర - కప్పురముయొక్క, వార - సముదాయమో, అనఁగన్ - అనుకొనునట్లుగాను, చెట్టుబంకయని యూహించునట్లును, అమృతా.........కౌముది. అమృతాశన - దేవతలకు, అశన - భోజనమయినటువంటి, కల్పవృక్షమునకుఁగల - కాశ - శోభయొక్కయును, ప్రకాశముయొక్కయును, కాశ్ - ధాతువు నుండి యుత్పన్నమయినది, కః - సముద్రముయొక్కయును, అనఁగాఁ బాలకడలియొక్కయును. ‘ని. కోబ్రహ్మాత్మానిలార్కాగ్ని చిత్తధీయమకేకిషు, విష్ణావహేశబ్దేఽబ్దే సితవర్ణేవసౌద్యుతౌ” నానా. ఈశ - శివునిదైన, కం - శిరస్సునఁగల, ‘ని. కంవారిణిచమూర్ధని’ అ. అశ - స్వర్గమునకును, “ని. అథశంక్లీబే శాస్త్రేశ్రేయసిమంగళే, కీర్త్యాశ్రాయుధేస్వర్గే పరోక్షేచత్రిలింగకః శమవ్యయంచ సౌఖ్యార్థే” నానా. ‘ని. ఆఙ్సీమాయామభివ్యాప్తౌ క్రియాయోగేషదర్థయోః’ విశ్వ. ఇచట నీశ్వ

రుఁడన్నిలోకములయందుఁ దనశరీరమునుగనఁబఱచుచున్నాఁడను పురాణకథనూహింపవలెను. లోకేశ- దిక్పాలురచేత, వేల్లిత - చుట్టుకొనఁబడిన, కేశపాశ - తలవెండ్రుకలకొప్పుయొక్కయు, "ని. పాశః కచాంతే సంఘార్థః కర్ణాంతే శోభనార్థకః" విశ్వ. శివుఁడు వ్యోమకేశుఁ డనిపురాణ ప్రసిద్ధియే 'ని. వ్యోమకేశో భవో భీమః' అ. "శా. ఆకాశోజ్జ్వల కేశపాశుఁడు త్రిశూలాంకుండు" చం. వి. కాశదేశ - పూచిన రెల్లుదీఁగెయొక్కయు, కుశద్వీపముయొక్కయు, బిలేశయ - సర్పము లకు, "సూ. తత్పురుషేకృతిబహులమ్, ఇతిబహుళగ్రహణాత్ అలుక్ భవతి బిలేశయః బిలశయః" సిద్ధాం. అధీశ - ప్రభువయిన, శేషునియొక్కయు, సుప్రకాశ - లెస్సైనతేజమునకు, సంకాశ - సమానమయిన, ఇదివిశేష్యలింగము. ఇదియొకపదమున కుత్తరపదమయినపుడే సదృశార్థమునిచ్చును. గాని ప్రత్యేకముగా సమానార్థమీయదు. "ని. స్యు రుత్తరపదే త్వమీ నిభసంకాశ నీకాశ ప్రతీకాశోపమాదయః" అ. ఉదా "చంద్రనిభః-లక్ష్మీసంకాశా-పద్మనీకాశం-సూర్యప్రతీకాశం-సూర్య ప్రతీకాశః-విష్ణూపమః" ఇత్యాదులు. కౌముది - వెన్నెల, 'కుముదానామియంకౌముదీ తద్వికాస హేతుత్వాత్' వ్యు. కలువలు వికసించుటకు హేతువైనది. "కౌమోదంతే జనాయస్మాత్ తేనాసా కౌముదీ మతా" భవి. అశలందు - అన్నిదిక్కులయందు, కాసెన్ - ప్రకాశించెను, ఈపద్యము యొక్క పెద్దపాదములనాలుగు నంత్యానుప్రాసమును, ఎత్తుగీతియందు వృత్త్యనుప్రాసమును చెప్పఁ బడినవి. "తే. ఒక్కవర్ణంబు కడదాఁక నుద్ధరింపఁ, బరగుజ్యాంభణ వృత్త్యను ప్రాస మయ్యె" నరస. ఇందు రూపకాలంకారమునకు నుత్ప్రేక్షాలంకారమునకు నంగాంగీభావసంకరము. "క, అసిజిహ్వా భయదంబై, యసవవహాబఱవిశేషహారియునై యి, వ్వసుధ భవద్భుజదండము, పొసఁగున్ ఫణి మాడ్కి నోబుధూవరసరసా" కా. సం. "అవిశ్రాంతిజుషా మాత్మన్యంగాంగిత్వంతుసంకరః" కా. ప్ర.

తా॥ ఆకాశమనెడిసన్యాసి తనచంకనున్నబూడిదసంచిని గుమ్మరింపఁగాఁ గ్రిందఁబడిన తెల్లని బూడిదయోయనునట్లును, చంద్రుఁడు రాత్రియనెడియందకత్తెమీఁదఁ గిరణములనెడి కరము లతోఁ జిమ్మినమంచునీరో యనునట్లును, రాత్రియనెడిశవ్యే దిశలనెడిగోడలయందుఁ గొత్తసున్నము తోఁగలిపి చల్లినతెల్లనిజలమో యనునట్లును, శుక్లపక్షమనెడి కర్పూరవృక్షమునందు రాత్రియనెడి పట్టవలనఁ బుట్టినకప్పురపురాసులో యనునట్లును, కల్పవృక్షము యొక్కయు, క్షీరసముద్రము యొక్కయు, దిక్పాలురనుసైతము మట్టడించియున్న శివునిజటాజూటముయొక్కయుఁ, గుశద్వీపము యొక్కయు, సర్పరాజగు శేషునియొక్కయుఁ, బ్రకాశముతో సమానమయినవెన్నెల సమస్త దిక్కులయందుఁ బ్రకాశించినది.

వ॥ ఆసమయంబున. 73.

అ॥ ఆసమయంబునన్ - అట్టికాలమున.

## —: నిరంకుశుని వేశ్యావాటికాసంచారము :—

సీ॥ తుదిగోళ్ళ నున్నఁగా ♦ దువ్వికీలించిన, సిగజాజివిరులు వా♦ సిగధరించి
కమనీయనాసపైఁ ♦ గస్తూరినామంబుఁ, దీరుగాఁ గొనగోర ♦ గీటి దిద్ది

చలువ దీర్చినసన్న ♦ వలిపెదోవతిమీఁద, నపరంజిమొలత్రాడు ♦ హావణుపఱచి
జంగాళముగ మేన ♦ జాళువాబంగారు, వ్రాఁతచందురకావి ♦ వలువ గప్పి

తే॥ కలితకర్పూరకాశ్మీర ♦ గంధసార, ఘుమఘుమామోదవిభవంబు ♦ గుబ్బతిలఁగ
గొడుగుపావాలుదొడిగిమ♦క్కువఁజరించు, విప్రతనయుండువెలయాండ్ర♦వీథులందు.

అ॥ విప్రతనయుండు – ఆబ్రాహ్మణకుమారుఁడు, తుదిగోళ్ళఁ – నఖాగ్రములతో, గోళ్ళయొక్క–చివరలతో. నున్నఁగాదువ్వి – నునుపుపుననట్లుగాఁ దనతలనుదువ్వుకొని, కీలించినసిగఁ – తగిలించినకేశబంధమునందు,– అమర్చినజుట్టుముడియందు, జాజివిరులు – జాజిపువ్వులు, వాసిగఁ – అధికముగా, ధరించి–తాల్చి, కమనీయనాసపైఁ – సుందరమయినముక్కుమీఁద, అనఁగా భ్రూమధ్యమున ననుట. కస్తూరినామంబుఁ – కస్తూరితిలకమును, తీరుగాఁ – చక్కఁగా, కొనగోరఁ– గోటియొక్క–చివరతో, గీఱిదిద్ది – గోఁకిసవరించి, చలువదీర్చిన+సన్న వలిపెదోవతిమీఁదఁ – పరిశుభ్రముగానుదికి మడతగాఁబెట్టిన నాణెమయినవస్త్రముపైన, అపరంజిమొలత్రాడు – చొక్కపుబంగారుతోఁజేయఁబడిన కటిసూత్రము, హావణుపఱచి – ప్రకాశముగానలంకరించి, ఉదా "సీ. ధవళంబువినిచొక్క ♦ హావణుదెల్పెడులీల" విజ. జంగాళముగఁ – నిడువాటుగా, ఉదా "వ. పాలసినపచ్చిరామనికతోలుపచ్చడఁబు జంగాళంబుగాపైచుకొని" భీమే. మేనఁ – ఒడలియందు, జాళువాబంగారువ్రాఁతచందుర కావివలువ. జాళువాబంగారు – అపరంజియొక్క, వ్రాఁత – లేఖనముగల,– చిత్తరువువ్రాయఁబడిన, చందురకావి – సిందూరవర్ణముగల, చందురము+కావి–చందురకావి, వలువగప్పి – ఉత్తరీయమును వేసికొని, కలిత......వంబు. కలిత – పొందఁబడిన, కర్పూర– కప్పురముయొక్కయు, కాశ్మీర – కుంకుమపువ్వుయొక్కయు, గంధసార – చందనముయొక్కయు మంచిగందముయొక్కయు, 'ని. గంధసారోమలయజోభద్రశ్రీచందనోఽస్త్రియాం" అ. ఘుమఘుమ – ఘుమఘుమయనెడి సువాసనతోఁగూడిన, ఆమోద – పరిమళముయొక్క, 'ని. విమర్దోత్థేపరిమళోగంధేజనమనోహారే, ఆమోదస్సోతినిర్హారీ' అ. విభవంబు – సంపద, గుబ్బతిలఁగఁ – అధికముకాఁగా, గొడుగు–ఛత్రమును, పావాలు – పాదుకలను, తొడిగి – తొడుగుకొని, మక్కువఁ– ప్రేమతో, వెలయాండ్రవీథులందుఁ – వేశ్యలయొక్క–బజాఱులయందు, చరించుఁ–తిరుగుచుండును, పద్యమంతయుస్వభావోక్త్యలంకారము. "స్వభావోక్తి రసౌ చారు యథావ ద్వస్తువర్ణనమ్" ప్రతా. ఇందు నాయకునియొక్క శృంగారప్రాధాన్యత యుగ్గడించఁబడినది.

తా॥ ఆనిరంకుశుఁడు దనశిరోజములను మునిగోళ్ళతో నున్నగాదువ్వి కీలుముడివేసి దానిపై జాజిపువ్వులుధరించి కనుబొమలసందునఁ జక్కఁగామృగమదపంకముతోఁ దిలకమును గొనగోటితోఁదీర్చిపెట్టి చలువచేసిన సన్నదోవతిమీఁద పసిఁడికటిసూత్రమును జక్కపఱచి, బంగారుజలతారుతోఁ జిత్తరువువ్రాయఁబడిన చందురకావిదుప్పటి బుజమున నొల్లెవాటుగాపైచికొని మంచిగందమును గర్పూరమును గుంకుమపువ్వును గలిపి మేననెల్ల నలఁదికొని ఘుమఘుమయను పరిమళము వ్యాపించఁగా గొడుగుపట్టి పాదుకలుఁదొడిగి పడుపుఁజేడియల బజాఱులయం దనురాగముతోఁ దిరుగుచుండును.

మ॥ ఒకలీలావతిఁ గౌఁగిలించి యవురా ♦ యోరీ యటన్నన్ గికా
కికగా నవ్వును హారమేడదిలతాం ♦ గీ యటంచు వక్షోజపా
ళికపై వ్రాయు నఖాంక మొక్కతెకుఁ గే ♦ ళిం జూళికం బుష్పమా
లికఁ జుట్టం జనుఁ గానకుండ నొకప్రా ♦ లేయాంశు బింబాస్యకున్. 75.

ఆ॥ ఒకలీలావతిన్ - శృంగారచేష్టలుగల యొకకాముకురాలిని, కౌఁగిలించి - ఆలింగనము చేసి, ఇదికి వుఁగిలించునకురూపాంతరము. ఆయువతి. ఇదియర్థ్యాహారము. అవురాయోరీ - తగుదువురా, మిక్కిలియాశ్చర్యపడుట, అటన్నన్ - ఇట్లుపలుకఁగా, కికాకికగానవ్వును - కిలకిలనవ్వును, ఇదికికకికయొక్కరూపాంతరము ఉదా॥వ. మిగులమోదగాఁ గికాకిక నగుచు॥ కళా. ఒక్కతెకున్ - ఇంకొకదానికి, లతాంగీ - ఓపువ్వుబోఁడీ, హారమేడది. ఈపుష్పమాల యెక్కడిది, అంచున్ - అనిపల్కుచు, వక్షోజపాళికపైన్ - స్తనములమీఁద, నఖాంకమున్ - గోటియొక్కగుఱుతును, వ్రాయున్ - లిఖించును, ఇచటనఖాంకమునుగూర్చి "స్తనే నఖక్షతం ప్రోక్తం జఘనేఽపి క్వచి ద్భవేత్" కామ. నఖక్షతార్హప్రదేశము లేవియనఁగా. "నఖాఘాతః ప్రదాతవ్యో. యథాస్థానానికర్మసు, పార్శ్వయోః స్తనయో శ్చైవ ఊరా చైవ నితంబకే" కక్షస్థలే చ కర్ణాంతే కపోలే బాహుమూలకే" కామ. ఒకప్రాలేయాంశుబింబాస్యకున్ - చంద్రబింబమువంటి మొగముగలయొకవిలాసినికి, కేళిన్ - విలాసముతో, కానకుండన్ - తానుండి చేసినట్లాజవ్వనికిఁ దెలియకుండ, చూళికన్ - కొప్పున, పుష్పమాలికన్ - పూలసరమును, చుట్టన్ చనున్ - చుట్టఁబోవును, ఇందు నిరంకుశుని దక్షిణనాయకునిగ వర్ణింపఁబడియున్నది. "తుల్యోఽనేకత్ర దక్షిణః" ప్రతా. పలువురు స్త్రీలయందు సమానముగానుండువాఁడు. "చ. చెలఁగు బహుప్రియాసదృశశీలుఁడు దక్షిణుఁడు" నరస. ఇందు హసిత మనుశృంగారచేష్ట చెప్పఁబడినది. "అకస్మికం తు హసితం యౌవనాదివికారజమ్" ప్రతా, ఇందు'ఒకలీలావతిఁగౌఁగిలించి, అని చెప్పఁబడియున్నందున నాలింగనమునుగూర్చి పరిశీలింపనది నాలుగువిధములనితెలియుచున్నది. ఒకరి కెదురుగాఁబోయి యన్యాపదేశముతో మేనుకుమేను దాకించుట స్పృష్టకము. ఒకరు ప్రత్యేకముగాఁబోయి యొకరి నాలింగనమొనర్చుట విద్ధకము. ఉత్సవాదులయందును అంధకారమునందును ఒకరినొకరు తాకుట స్పృష్టకము. గోడ మొదలైనవానిని రాచుకొనుట పీడనము.

"యదన్యోషిదసమ్ముఖ మాగతాయా, అన్యాపదేశా ద్వ్రజతోనరస్య
గాత్రేణ గాత్రం ఘటతే రతజ్ఞా, ఆలింగనం స్పృష్టక మేత దాహుః"
"యద్గృహ్ణతీ కించన వంచితాంగం, స్థితోపవిష్టం పురుషం స్తనాభ్యాం
నితంబినీ విధ్యతి తాం చ గాఢం, గృహ్ణాత్యసౌ విద్ధక ముచ్యతే తత్"
"యత్రోత్సవాదౌ తిమిరే ఘనే వా, యదిచ్ఛయో స్యాచ్చిర మంగసంగం
తత్ స్పృష్టకం తత్పునరేవ కుడ్యే, నిపీడనా త్పీడనసంజ్ఞికా స్యాత్"
"భావప్రబోధార్థ మజాతరత్యో, శ్చతుర్విధో క్తా పరిరంభలీలా"

మఱియు విటునియొక్కయుపాయములలో మొదటిదియగుసామ మనుపేరుగల మానాపనయనోపాయము వివరింపఁబడినది. "సామ్నా భేదేన దానేన నత్యుపేక్షా రసాంతరైః, మానాపనయనం

తాసా ముపాయై షడ్భి రాచరేత్" సాహి. చిం. పెద్దనార్యుఁడును "ఉ. పక్కన వేసరంజన దుఃపాయములం దగునిచ్చకంబులం, జిక్కఁగఁజేసి డాసి సకౌచిత్తముఁబట్టి సుఖింపఁగాఁ దగున్" అనినాఁడు. 'కేళింజాళికన్' అనుప్రాసాలంకారము.

తా॥ ఒకశృంగారనాయిక నాలింగన మొనర్ప నది యౌరా యనినంతనే పకపకనవ్వెను. మఱియొక యొజ్జవ్వని కెమరేగి నీకీపూలదండయెక్కడి దని స్తనగ్రహణ మొనర్చెను. వేఱొకయంద గత్తెను జేరి యాబిడకుఁ దెలియరాకుండఁ గొప్పున విరిసరముఁ జుట్టనుంకించెను.

మ॥ శుకవాణీ యొకయేకతం బనుచుఁ ద ♦ చ్ఛోత్రంబులోఁ బంచసా
యకమంత్రంబు సముచ్చరింప నిటుతా ♦ ల్మించుచున్ సముద్దీపిత
భ్రుకుటీకంబుగ బొమ్మవట్టి తొలఁగం ♦ ద్రోయంగ నాయంగనల్
సకులున్ నవ్విరి మోసపోయి తని హా ♦ సవ్యాస మేపారఁగన్. 76.

అ॥ శుకవాణీ—ఓచిలుకపలుకులవంటిపలుకులుగలదానా, ఒకయేకతంబు—ఒక్కరహస్యముగలదు, అనుచున్—ఇట్లుచెప్పుచు, తత్ + శ్రోత్రంబులోన్—ఆబిడయొక్కచెవిలో, పంచసాయకమంత్రంబున్—సంభోగరహస్యమును, సముచ్చరింపన్—ప్రసంగింపఁగా, ఇచట రతిలక్షణము వర్ణింపఁబడినది. "విభావైరనుభావైశ్చ, సాత్త్వికైర్వ్యభిచారిభిః, నీతాసదస్యరస్యత్వం, రతిఃశృంగారఉచ్యతే" రతియనఁగా నిచ్ఛావిశేషము. "యూనో రన్యోన్యవిషయ, స్థాయినీచ్ఛా రతిస్స్మృతాః, భావం మనోగతం సాక్షాత్, స్వహేతుం వ్యంజ్యయంతి యే, తేఽనుభావా ఇతి ఖ్యాతాః, భ్రూవిక్షేపస్మితాదయః, తే చతుర్ధాచిత్తగాత్ర, వాగ్బుద్ధ్యారంభసంభవాః" రసా. సు. ఇటు తాల్మించుచున్ – ఇంతటనిదానించుమనుచు, సముద్దీపితభ్రుకుటీకఁబుగన్, సముద్దీపిత – మిక్కిలిప్రకాశించఁబడిన, భ్రుకుటీకంబుగన్—కనుబొమలుముడిచినదికాఁగా, 'ని. భ్రుకుటిర్భ్రుకుటిస్త్రియాం' అ. బొమ్మపట్టి – పాలిండ్లనుబట్టికొని, తొలఁగన్ + త్రోయంగన్—ఒకప్రక్కకుఁ దొలఁగునట్లునెట్టివేయఁగా, ఆయంగనల్—అందగత్తెలయిన యావేశ్యలును, సఖులున్—వారియొక్కస్నేహితురాండ్రును, మోసపోయితి—మోసపోయితివిగదా, ఇచట 'మోసపోతి' అనుటకు "సూ. క్వచి ద్వ్యవర్ణకే చాపి, కేచి త్తస్య స్థితిం జగుః" అధ. ఉదా. "క. ఏమిటికే కృష్ణుఁ జూడ నేగితి రాధా" భాగ. "ఉ. చేసితి జన్నముల్ తపము" స్వా. మ, అని – ఈప్రకారముగా, హాసవ్యాసము—నవ్వుయొక్కవిస్తారము, ఏపారఁగన్—అతిశయించఁగా, నవ్విరి—పరిహాసముచేసిరి, అనురాగయుక్తముగానవ్విరనుట. స్వభావోక్త్యలంకారమును. హసితమనుశృంగారచేష్టయును. ఉదా. "చ. కెరలి ప్రియుండు మోవిపయిఁగెంపులు నింపుట పారవశ్యత, త్వరత నెఱుంగలేక పిదప న్నిలువద్దముచూచి సిగ్గునం, దరుణి చెలుల్గనుంగొనినఁదారికనేమనియాడుకొందురో, యని నటంచుఁ జిల్కకు నవారణముద్దులు వెట్టు సారెకున్" కా. సం. "గీ॥ ఒకరహస్యము చెలిపెదవిను విదయనుచు, చేల నను దరిఁజేరిచి వీనులకడ, మోము గదియించి నామోముమూర్కొనిపెసఁ, గొప్పువట్టి పెదవితేనెఁగ్రోలినాఁడు" అం. అను. 'త్రోయంగనాయంగనల్' ఇత్యాదు లనుప్రాసాలంకారము.

తా॥ మంజువాణీ: ఒకరహస్యాలోచనకల దనుచు వావిటకత్తెచెవిలో రతివాంఛాప్రసంగ ముఁజేయు నది యుఁకఁబోలుతెమ్మని మొగమును జిట్లించఁగాఁ బాలిండ్లనంటి యొకదెసకునెట్టివైవ నాతలియుఁబోఁడులును వారిహితురాండ్రును వంచింపఁబడితివిగదా యని పక్కునవ్విరి.

క॥ ఈరీతి దుర్నివారవి, హారంబున నర్ధరాత్ర ♦ మగుదాఁకఁ బ్రమో
దారూఢిఁ దిరిగి నిజవే, శ్యారత్నముకడకు నిదుర ♦ కరిగెడు బుద్ధిన్. 77.

అ॥ ఈరీతిన్-ఈతీరుగా, దుర్నివారవిహారంబునన్, దుర్నివార-అడ్డుపఱుపనలవిగాని, విహారంబునన్-సంచారముతో, అర్ధరాత్రము+అగుదాఁకన్-నడురేయియగువఱకు, 'అర్ధంరాత్రేరర్ధరాత్రః, అర్ధంనపుంసకమ్, ఇత్యేకదేశసమాసః, సర్వైకదేశసంఖ్యాత పుణ్యాచ్చరాత్రేః ఇతిసమాసాంతో౽చ్ప్రత్యయః, రాత్రాహ్నాహాఃపుంసిఇతినియమాత్పుంస్త్వమ్ ప్రమోద+ఆరూఢి-సంతోషముతోఁగూడిన నిశ్చయముతో, తిరిగి-సంచరించి, నిజవేశ్యారత్నముకడకున్-శ్రేష్ఠురాలయిన తన సంబంధమయిన భోగముదాని దగ్గఱకు, రత్నశబ్దమునకు 'ని. జాతౌజాతౌయదుత్కృష్టం, తద్రత్నమితి కథ్యతే' యా.నిదురకున్-నిద్రించుటకు, అరిగెడుబుద్ధిన్-పోఁదలంపుతో, 'ఈరీతి దుర్నివారవిహారము' అనుప్రాసాలంకారము.

తా॥ అతఁడీతీరున యథేచ్ఛగా నిశీథముగువఱకు ద్రిమ్మరి తనయుంపుడుకత్తె యగు చంపకగంధియింట శయనింపఁదలఁచినవాఁడై.

—: నిరంకుశుఁడు భోజనార్థమింటికివచ్చుట :—

ఉ॥ రాజముఖీపయోధర వి ♦ రాజితకుంకుమగంధలేప వి
భ్రాజితమైనదేహముఁ బ్ర ♦ భాసురకాంచన చిత్రితాంచల
భ్రాజితశాటిఁ గప్పుకొని ♦ పాదము లల్లన నేల మోపుచున్
భోజన మాచరించుటకు ♦ భూసురసూనుఁడు వచ్చె నింటికిన్. 78.

అ॥ భూసురసూనుఁడు-బ్రాహ్మణునికొడుకయిన యానిరంకుశుఁడు, రాజము......జితము. రాజముఖీ-చంద్రునివంటి ముఖముగలదయిన యావేశ్యయొక్క, ఇచట రాజముఖీ శబ్దమునకు. "సూ. స్వాంగాచ్చోపసర్జనాదసంయోగోపధాత్ ఇతిజీప్" ఉపసర్జనాత్మకంశిఖాస్వాంగంత్రిధా. ఉదా. చంద్రముఖీ-చంద్రముఖా, ఇత్యాదులు సిద్ధాం. "అద్రేఃశృంగంహరతిపవనః కింస్విదిత్యున్ముఖీభిః" మేఘ. పయోధర-స్తనములయందు, విరాజిత-ప్రకాశించఁబడిన, కుంకుమగంధ-కుంకుమపువ్వుయొక్క పరిమళముతో. లేప-పూయఁబడి, విభ్రాజితము-ఒప్పుచున్నది, ఐనదేహమున్-అయినట్టి తనయొక్క శరీరమును, ఇచట 'సూ. విశేష్యమాత్రే స్త్రీతా స్యాద్ద్రుమ్మ స్యాతాం తు భేదకే' అథ. ప్రభా.........శాటిన్, ప్రభాసుర-మిక్కిలిప్రకాశమయిన, కాంచన-బంగారముతో, చిత్రిత-చిత్తరువు వ్రాయఁబడిన, చిత్రలేఖనము రచింపఁబడిన, అంచల — కొంగులతో, భ్రాజిత - ప్రకాశింపఁబడిన, శాటిన్-ఉత్తరీయముతో, కప్పుకొని-ఒడలేమియునగపడకుండునట్లాచ్ఛాదనము చేసికొని, పాదములు-అడుగులు, అల్లననేలమోపుచున్ - మెల్లఁగా భూమియందానునట్లు నడచుచు, భోజనము+ఆచరించుటకున్-అన్నముదినుటకు, ఇంటికిన్-తనగృహమునకు, వచ్చెన్-చేరెను, స్వభావోక్త్యలంకారము. "క. సహృదయహృదయంగమమై, మహినున్నది యున్నయట్ల ♦ మాటలతేటల్, బహుళంబులుగాఁ జెప్పిన, మహితోక్తియె జాతియయ్యె" నరసు.

తా॥ అనిరంకుశుఁడు వెలయాలియొక్క స్తనములయందలి కుంకుమపూఁతావియంటిన తనమేనొరులకగపడకుండునట్లు బంగారుజలతారుతోఁ జిత్తరువుల్వ్రాయఁబడిన దుప్పటిఁ గప్పుకొని యడుగులుచప్పుడు కాకుండ మెల్లఁగానడచుచు నోగిరమారగింపనింటికేతెంచెను.

వ॥ అప్పుడు. 79.

అ॥ అప్పుడు-ఆసమయంబున,

క॥ తడవాయె నేమిసేయుదు, నెడవాయనిసఖులతోడ ♦ నెం దున్నాఁడో
కొడుకు కాకలిఁ గొనె నంచున్, మిడుకుదయోపేత మాత ♦ మృదువాగ్జాతన్. 80.

అ॥ తడవాయెన్-ఆలస్యమయ్యెను, ఏమిచేయుదున్-నేనేమిచేయఁగలదానను, ఎడ+పాయని సఖులతోడన్-ఎప్పుడును దనతోడువదలని స్నేహితులతోఁగూడి, ఎందున్నాడో-ఎక్కడనుండెనో కదా, కొడుకు - నాబిడ్డఁడు, ఆఁకలిఁగొనెన్ - ఆఁకొనియుండెను, తృప్పిడితుఁడైయుండెను, అంచున్-ఇట్లుపలుకుచు, మిడుకుదయోపేతన్ - పరితపించుచున్నటువంటి దయతోఁగూడినదానిని, ఇచట 'మిడుకు' అనుటకు ఉదా॥ క. నడుకుచు నపశబ్దంబులు, దొడుకుచుఁ బురుడునకుఁగవితతుబ్టైలు గట్టన్, వడుకుచుముందఱతోఁచక. మిడుకుచుగర్వించుకుకవి ♦ మెత్తురెసుకవుల్" కవిస. మృదు వాగ్జాతన్ - మెత్తనివయిన వాక్కులయొక్క సముదాయముగలదానిని, మాతన్ - తనయొక్క తల్లిని, 'చేరఁజనుదెంచి, యనుపైపద్యమునందలి వాక్యముతోనన్వయము 'తడవాయె-నెడవాయని-కొడుకు మిడుకు-దయోపేతన్-మాతన్-మృదువాగ్జాతన్, అనుప్రాసాలంకారము.

తా॥ నాబిడ్డఁడు చెలికాండ్రతోఁ గలిసి యెచ్చోటనుండెనో యింతదనుక రాఁడయ్యె నేనేమిసేతును. ఆఁకలిచే నెంతసొలియుండెనోకదా! అని వ్యాకులపడుచున్న తల్లి చెంతకు.

తే॥ చేరఁజనుదెంచిపరమల ♦ జ్జితుఁడు వోలె,నమ్రవదనాబ్జుఁడై యున్న ♦ నందనునకు
నన్నపానాదు లొసఁగినె♦య్యమునఁనొక్క, యున్నమితపీఠమందుఁగూ♦ర్చుండఁజేసి 81

అ॥ చేరన్-సమీపించునట్లు, చనుదెంచి-వచ్చి, పరమలజ్జితుఁడువోలెన్-అధికమయిన సిగ్గు గలవానివలె,నమ్ర+వదన+అబ్జుఁడు-వంచినముఖపద్మము గలవాఁడు,ఐ+ఉన్ననందనునకున్-అయి యుండిన తనకుమారునకు, అన్న+పాన+ఆదులు-భుజించునవియును త్రాగునవియును మున్నగునవి, ఒసఁగి-ఇడి, నెయ్యమునన్-ప్రేమతో, ఒక్క+ఉన్న మితపీఠమందున్ - ఒకయెత్తయిన పీటమీఁద కూర్చుండన్+చేసి-ఆసీనుడగునట్లొర్చి, మీఁదిపద్యముతోనన్వయము. 'నమ్రవదనాబ్జుఁడు, ఉపమా, లంకారము. 'పరమలజ్జితుఁడువోలెన్, ఉత్ప్రేక్షాలంకారము.

తా॥ వచ్చి మిగులసిగ్గుగలవానివలెఁ దలవంచికొని యున్న పుత్త్రునకు భోజనమిడి ప్రేమితో నొకయెత్తయినపీటమీఁదఁ గూర్చుండఁబెట్టి,

క॥ సుతు వైదికధర్మసమ, న్వితుఁ జేయం గోరి చేరి ♦ నిపుణతఁ బలికెన్
శతధృతి సతిగతినతియుత, మతి యైనతదీయజనని ♦ మనుజాధీశా. 82.

అ॥ మనుజాధీశా-ఓరాజా, శతధృతిసతిగతిన్ - బ్రహ్మయొక్క భార్యయగు సరస్వతివలె, అతియుతమతి-మిక్కిలికూడిన బుద్ధిగలది, ఐనతీయజనని - అయినట్టి యానిరంకుశునియొక్క తల్లి, సుతున్-తనకొడుకును, వైదికధర్మసమన్వితున్-వేదవిహితాచారముతోఁగూడినవానినిగా, చేయన్ కోరి-చేయుటకపేక్షించినదై, చేరి-అతనిని సమీపించి, నిపుణతన్-నేర్పుతో, పలికెన్-ఇట్లుచెప్పెను, ఇందు 'సుతున్-వైదికధర్మసమన్వితున్' అనుప్రాసాలంకారము. 'శతధృతిసతిగతినతియుతమతి' వృత్త్యనుప్రాసాలంకారము.

తా॥ ఓరాజా! బ్రహ్మదేవునిభార్యయగు సరస్వతితో సమానమయిన బుద్ధిగల యతనితల్లి సుతుని వైదికాచారసంపన్నునిగాఁ జేయఁదలఁచి యతనిని సమీపించి నేర్పుగలమాటలతో నిట్లనియెను.

—: తల్లి కుమారునకు నీతులుబోధించుట :—

సీ॥ వృద్ధానసారంబు ♦ విడిచి కొంచెపుఁగాని, నీతులు నేర్కొంటి ♦ వే తనూజ
గ్రామణ్యవిభవంబుఁ ♦ గాదంచుఁ జూదంపుఁ, గాసుల నాశించి ♦ తే సుతుండ
విప్రధర్మంబెల్ల ♦ వీటిఁబుచ్చి విరాళి, పోకలఁ బోనేర్చి ♦ తే కుమార
కులముఁగోదావరిఁ ♦ గలిపి వేశ్యాసంగ, మానసచేఁ గావించి ♦ తే సుపుత్త్రి

తే॥ వేదశాస్త్రప్రసంగంబు ♦ వీడుకొల్పి, పడుచుఁగూఁతల కూయఁ బా ♦ ల్పడితె తనయ
యింట నెన్నఁడులేనియీ ♦ హీనవిద్య, యెన్నఁడభ్యాసమాయెరా ♦ కన్నతండ్రి. 83.

అ॥ తనూజ-ఓకొడుకా, వృద్ధానుసారంబున్-పెద్దవారననుసరించినడచుటను, విడిచి-వదలిపెట్టి, కొంచెపుఁగానినీతులు-అల్పులయొక్క నడవడికలు, నేర్కొంటివే-అభ్యసించితివా, సుతుండ-పుత్త్రా, గ్రామణ్యవిభవంబున్-గ్రామాధిపత్యముయొక్క సంపదను, కాదంచున్ - కూడదనుకొని, జూదంపుఁగాసులకున్-జూదమాడఁగావచ్చిన రాగిడబ్బులకు, ఆశించితే-కోరికపడితివా, కుమార-తనయుఁడా, విప్రధర్మంబెల్లన్-బ్రాహ్మణాచారమంతయును, వీటిఁబుచ్చి - వీటిఁబోవఁజేసి-అనఁగా బొత్తిగాఁబోఁగొట్టియనుట, విరాళిపోకలన్-వలపుతోఁగూడిన నడవడికతో, ఉదా "చ. మెలఁతు కరంగవల్లభుని ♦ మీఁదివిరాళిఁబ్రియంబుతోడనె, చ్చెలులకువచించుపల్కు చెవిఁ ♦ జేర్పదు" పర. వి. పోనేర్చితే-తిరుగుటనేర్చుకొంటివా, సుపుత్త్రి-కుమారా, కులమున్-మనవంశమును, గోదావరిఁ గలిపి-గోదావరిలోఁగలియునట్లుగాఁ జేసి, అనఁగా నిర్మూలముగాఁజేసియనుట. గృహముపై నాశమొనర్చుకొనియనియును జెప్పవచ్చును. "ని కులంకుల్యాగతోదేహే, గేహేజనపదేఽన్వయే" హేమ. ఉదా. "వసన్ఋషికులేషు సః" రఘు, వేశ్యాసంగము - బోగముదాండ్రపొందు, ఆసచేన్-కోరికతో, కావించితే-చేసితివా, తనయ-కొమరుఁడా, వేదశాస్త్రప్రసంగంబున్-వేదములనుగూర్చియు శాస్త్రములనుగూర్చియు మాట్లాడుటను, వీడుకొల్పి-పోఁగొట్టి పడుచుఁగూఁతలు-జారత్వపుఁబెద్ద మాటలు, ఉదా. "ద్వి. పడుచుఁజేతలుమాని పార్వతీశ్వరుఁడు" రాజశే. కూయన్ - కూయుటకు, అక్కఱలేనిమాటలు మాటాడుటకు, పాల్పడితె - ఆలాయపడితివా, కన్నతండ్రి-నాయనా, ఇది ప్రేమనుదెలియఁజేయు సంబుద్ధి. ఇంటన్-మనకుటుంబమున, అనఁగాఁబూర్వమునుండి మనవంశమున

ననుట. ఇచట 'ఇంటన్' అనుటకు 'సూ. ఔపవిభక్తికనామ్నా, మత్వంస్యాత్సప్తమీతృతీయార్థే' యన్న. ఎన్నఁడున్-ఇదివఱకెప్పుడును, లేనియీహీనవిద్య - లేనట్టియీనీచమయిన తెలివి, ఎన్నఁడు + అభ్యాసము + అయెరా - ఎప్పుడుపట్టుపడెనురా, ఇచట సుతునివృత్తినీచముగా భావించుటనుగూర్చి "ఏకాహారేణసంతుష్టః, షట్కర్మనిరత స్సదా, ఋతుకాలే ఽభిగామీచ, సవిప్రో ద్విజ ఉచ్యతే" చాణ. కనుక బ్రాహ్మణధర్మ వ్యతిరేకమని తెలియవలయును.

తా॥ అబ్బాయీ! పెద్దలననుసరించి ప్రవర్తించుట మాని నీచధర్మముల గ్రహించితివి. గ్రామాధిపత్యమున లభించుసంపదనువదలి జూదపుఁగాసుల కిచ్చగించితివి. బ్రాహ్మణధర్మంబుల నన్నింటినిరూపుమాపి వ్యభిచారపునడత కలవడితివి. మనవంశమును నేలఁగలిపి పదుపుఁగ తైలపాం దాళించితివి. వేదశాస్త్రపురాణాది ప్రసంగమును వదలి పలువకూఁతలుగూయ నేర్చుకొంటివి. మన యింట నేనాఁడు లేని యీనీచవృత్తి యెప్పుడుపట్టుఁవడినదిరా.

శా॥ లేరా భోగపరాయణుల్ జగతిలో ♦ లీలావినోదంబుగాఁ
బోరా వేశ్యలయిండ్లకున్ వివిధసం ♦ భోగార్థులై గుట్టుతో
రారా వైదికధర్మమార్గపథిక ♦ ప్రావీణ్యముం జూపరా
యేరా తండ్రి పరిత్యజింతురఁటరా ♦ యీరీతి సత్కర్మముల్. 84.

అ॥ ఏరాతండ్రి - ఏమిరానాయనా, ఇదిప్రియముతోఁబిలుచుటను దెలియఁజేయును, జగతిలోన్ - ఈప్రపంచమునందు, భోగపరాయణుల్ - సంభోగమునం దాసక్తిగలవారు, లేరా - లేకపోలేదుగదా, ఉన్నారుగదాయనుట. వివిధసంభోగార్థులు. వివిధ - నానావిధములయిన, సంభోగ - సంయోగములను. అర్థులు - కోరినవారు, అపేక్షించినవారు. ఐ - అయి, అనఁగాఁ జౌశీతిబంధములయం దపేక్షగలవారై యనుట. వేశ్యలయిండ్లకున్ - వెలయాండ్రనివాసములకు, లీలావినోదంబుగాన్ - శృంగారచేష్టలతోఁ గాలయాపనము సేయుటకు - స్త్రీపురుష పరిహాసములతోఁ బ్రొద్దుపుచ్చుకొనుటకు, పోరా - వెళ్ళుచుండుటలేదా, పోవుచున్నారుకదాయనుట. గుట్టుతోన్ - ఇతరులకుఁదెలియనీయకుండునట్టి స్వభావముతో, రారా - వచ్చుచుండుటలేదా-వచ్చుచుందురుగదా, వైదికధర్మమార్గపథికప్రావీణ్యమున్. వైదికధర్మ - వేదసమ్మతమయినయాచారముయొక్క, మార్గ - పద్ధతియందు, పథిక - నడచుచున్నటువంటి, ప్రావీణ్యమున్ - నేర్పును, చూపరా - కనఁబఱచుటలేదా, ఈరీతిన్ - ఈతీరుగా. సత్కర్మముల్ - విధివిహితకార్యములను-మంచిపనులను, పరిత్యజింతురఁటరా - పూర్తిగావిడిచిపెట్టువారుందురా, అర్థాంతరన్యాసాలంకారము. "సామాన్యం వా విశేషో వా తదన్యేన సమర్థ్యతే, యత్ర సోఽర్థాంతరన్యాసః సాధర్మ్యేణేతరేణ వా" కా. ప్ర.

తా॥ బాబూ! ఈలోకమున వేశ్యలయందు వాంఛగలపురుషు లనేకులున్నారుగదా! వారందఱును గణికాఁగనంతో నర్మసంభాషణలు మున్నగువానితోఁ బ్రొద్దుపుచ్చుకొని రహస్యముగాఁ దమయిండ్లకు వచ్చి తాము వేదసమ్మతమయిన యాచారమును దప్పకప్రవర్తించుచున్నట్లగపడుట లేదా? నీవలె వైదికధర్మముల నన్నిటి వర్జించి ఎల్లప్పుడు భోగమ బజారులలోనే తిరుగుచున్నారా?

క॥ కొదలం బొందనిబహుసం, పదలన్ నీకొడివారు ♦ బ్రతుకఁగ నయ్యో
మదనాతురుండ వైతివి, చదివినదోషంబొ కాక ♦ జన్మఫలంబో. 85.

అ॥ నీతోడివారు - నీతోహితముగానుండువారు, కొదలక - లోతక్కువలను, పొందని బహుసంపదలక - చెందనిమిక్కిలియైశ్వర్యములతో, బ్రతుకఁగ - జీవించుచుండఁగా, మదనాతురుండవు - కామాతురుఁడవు-వ్యభిచారివి, ఐతివి - అయియుంటివి, అయ్యో - మిక్కిలి కనికరముతోఁబలుకుట, ఇది చదివినదోషంబో - సమస్తశాస్త్రముల నామూలాగ్రము గాఁజదివిన నేరమయి యుండునా, కాక - అటులఁగానిపక్షమున, జన్మఫలంబో - నీవుపుట్టిననాఁటి కాలదోషవిశేషమై యుండునా, ఇందు నీతోడివారు నీవలెఁజదువకుండియుఁ దఱుఁగనిసంపదలతోనుండ నీవు సంపూర్ణ పాండిత్యముఁగలవాఁడవయ్యు వేశ్యాలోలుఁడవగుట నీచదివినదోషమా? అనునప్పుడు లేశాలంకారము. "లేశ స్స్యాద్దోషగుణయో గ్గుణదోషత్వకల్పనమ్, అఖిలేషు విహంగేషు హన్త స్వచ్ఛందచారిషు, శుకపంజరబంధ స్తే మధురాణాం గిరాం ఫలమ్" కువ. 'మదనాతురుండవైతివి' అనుటచే నీచవృత్తిగలవాఁడవయితివని భావము. "ద్విపేంద్రోఽపికులాఢ్యోఽపి కామచారీభవేత్సదా, నిత్యం నిమజ్జన్న ప్యబ్ధౌ నాన్తశ్శుద్ధోభవత్యలం" సూ. సం.

తా॥ ఓరీ! నీచెలికాండ్రందఱు నధికైశ్వర్యములతోనుండి బ్రాహ్మణధర్మంబుల నిర్వర్తించుచుండ నీవిట్లు గణికాంగనాధీనుఁడవగుట నీయొక్క పాండిత్యాతిశయమువలని దోషమా? లేక జన్మకాలదోషమా?

క॥ నందను నిన్నుఁ గనుంగొను, నందనుకను నెదురుచూచు ♦ నకట సముద్రుం
డిందునకుఁ బోలె జనకుం, డిందునకా నీమహత్త్వ ♦ మేమననేర్తున్. 86.

అ॥ జనకుండు-నీతండ్రి, నందనుక-సుతుఁడవైనవానిని, "ని. ఉద్వహస్తనయః పోతో దారకో నందనోఽర్భకః" ధనం. నిన్ను-నిన్ను, కనుంగొనునందనుక-చూచునంతపర్యంతము, సముద్రుండు - సాగరుఁడు, ఇందునకుకపోలెక-చంద్రునకువలె, ఎదురు+చూచుక-నిరీక్షించుచుండును-నీరాక కెదురుచూచుచుండును. ఇందునకా-ఇట్లుప్రవర్తించుటకేనా, నీమహత్త్వముక-నీయొక్క ప్రభావమును, ఏమి+అననేర్తుక - ఏలాటిదని పొగడఁగలుగుదును, ఇంచుకసముద్రమును సముద్రుఁడనుటకు "సూ. భవేదమహతోఽర్థ విశేష్యమహదాకృతిః" ఆధ. ఉదా. 'సీ. ఘుమఘుమఁగొండలపాలు గాఁజేసిన గొలంత, విషముగోత్రులనంటువృజినమెల్ల" వసు. ఈపద్యమున ద్విప్రాసమును, 'నందను నిన్ను... నందనుక — ఇందునకు.........డిందునకా' ఇవియమకాలంకారమును, సముద్రుఁడు చంద్రునిరాక కెదురుచూచినట్లు నీరాక కెదురుచూచుచుండు ననుటచే నుపమాలంకారము వాక్యగతశ్రౌతి. ఉదా "స్వప్నేఽపి సమరేషు త్వాం విజయశ్రీ ర్నముంచతి, ప్రభావప్రభవం కాంతం స్వాధీన పతికాయథా" కా. ప్ర.

తా॥ మీతండ్రి నీవింటికివచ్చునంతవఱకుఁ జంద్రోదయమున కెదురుచూచు సముద్రునివలె నీకై వేచియుండుట నీవిట్లుప్రవర్తించుటకేనా! నిన్నేమనవచ్చును.

చ॥ కొడుకులు సర్వవిద్యల న ♦ కుంఠితులై సభలందు శాస్త్రముల్
దడయ కుపన్యసించి వసు ♦ ధాతలనాథులచేత గుఱ్ఱముల్
గొడుగులు గాంచి సర్వగుణ ♦ కోవిదులై విహరింప సంపదన్
బొడ వగునట్టిగేహినులె ♦ పుణ్యశరీరలు గా కుమారకా. 87.

అ॥ కుమారకా - ఓరిపుత్త్రికా, ప్రపంచమున-కొడుకులు - సుతులు, సర్వవిద్యలన్-సమస్తమయినవిద్యలయందు, అఱఁతితులై - మొక్కవోవనివారై, సభలందున్ - వేదశాస్త్రపురాణాదులు దెలిసినవారి సన్నిధానమున,- బహుసంఖ్యగలిగి ధర్మవిచక్షణతోఁగూడిన జనసమూహములో, 'ని. సమజ్యాపరిషద్గోష్ఠీ సభాసమితిసంసదః, ఆస్థానక్లీబమాస్థానం స్త్రీనపుంసకయోస్సదః"అ. ఇచట 'సభలందు' అనుటకు "సూ. వినాలువర్ణంబుసంధిర్మిశ్రతత్సమయోస్సకి" అధ. సభనుగూర్చి "సభాకల్పతరుం వందే వేదశాఖోపదీపితం శాస్త్రపుష్పసమాయుక్తం విద్వద్భ్రమరశోభితమ్" అనిచెప్పఁబడియున్నది. శాస్త్రముల్ - సమస్తశాస్త్రములను, తడయక - ఆలస్యముచేయక, ఉపన్యసించి - విస్తరించిచెప్పి, వసుధాతలనాథులచేతన్ - బుడమికిఁబతులైన రాజులచేత, గుఱ్ఱముల్ - ఆశ్వములను, గొడుగులు - ఛత్రములను, గాంచి - పొంది, సర్వగుణకోవిదులై - సమస్తసుగుణములయందు నగ్రగణ్యులై, విహరింపన్ సంచరించుఁగా, సంపదన్ - ఐశ్వర్యముచేత, పొడవు - అతిశయము, అగునట్టిగేహినులె-అయినట్టువంటి గృహస్థురాండ్రె, పుణ్యశరీరలుగా-పుణ్యాంగనలుగదా, ఈపద్యమున 'వసుధాతలనాథులచేత గుఱ్ఱముల్ గొడుగులుగాంచి' యనుచోట ద్వితీయకుఁ బ్రథమసెప్పఁబడుటకు "సూ. కొన్నియెడల నజడంబు ద్వితీయకును బ్రథమ కానంబడియెడి" ప్రౌ.వ్యా. ఉదా, "చ. అనిలజవంబునం బఱచు నమ్మదసాగమెచ్చిరి" భార. లోకమునందుఁ దమసుతులు విద్యాపరిపూర్ణులై రాజసభలలో సన్మానములంది సంపద్యుక్తులై యుండఁగాఁ జూచి సంతోషించుచున్నట్టి తల్లులే పుణ్యస్త్రీలుగదా, అనుటచే నప్రస్తుతప్రశంసాలంకారము. "అప్రస్తుతప్రశంసా స్యాత్సా యత్ర ప్రస్తుతాశ్రయా" కువ. "అప్రస్తుతప్రశంసాయా సా సైవ ప్రస్తుతాశ్రయా, కార్యే నిమిత్తే సామాన్యే విశేషే ప్రస్తుతే సతి, తదన్యస్య వచ స్తుల్యే తుల్యస్యైవేతి పంచధా" కా.ప్ర. ఉదా "సుహృద్వధూ బాష్పజలప్రమార్జనం, కరోతి వైరప్రతియాతనేన యః, స ఏవ పూజ్యః సపుమాన్ సనీతిమాన్, సుజీవితం తస్య సభాజనం శియః" గాథా "వరం వంధ్యాస్త్వవాదోఽసి యోషిత్పురుషయో స్తయోః, యాభ్యాం లాలనలుబ్ధాభ్యాం నవినీతః స్వయం సుతః" హరి. సు.

తా॥ తండ్రీ! ప్రపంచమునఁ గుమారులు విద్యాపరిపూర్ణులై రాజసభలలో విద్యాగోష్ఠినొనరించి వారలచే వస్తువాహనాది పారితోషికముల నంది బుద్ధివిశేషముతో నైశ్వర్యయుక్తులైయుండుటంజూచి మోదమందునట్టివారె పుణ్యస్త్రీలుగదా.

క॥ ధారుణి నేమియు నెఱుఁగని, వారల కొకరీతిగా "నవశ్యంపితురా
చార" మని నీవె చదివి కు, మారా జనకానుచరణ ♦ మఱవం దగునే. 88.

అ॥ కుమారా - ఓరిబిడ్డా, ధారుణిన్ - ఈపుడమియందు, ఏమియున్ - కొంచెమైనను ఎఱుఁగనివారలకున్ - తెలియనివారికి, ఒకరీతిగాన్ - ఒకవిధముగా, నీవెచదివి - నీవుకొన్నిధర్మశాస్త్రములు మొదలయినవానినిజదివి, అవశ్యంపితురాచారం - తండ్రియొక్క యాచారము తప్పక యాచరించఁదగినది, అని - చెప్పి, అట్టినీవేమఱల ఇది యధ్యాహారము. జనకానుచరణ - తండ్రియొక్క నడతననుసరించినడచుట, 'జనకానుసరణ' పాఠాం. మఱవందగునే - మఱపుఁజెందుట యోగ్యమా, 'అవశ్యంపితురాచార' మనునది పద్యమధ్యమునఁబ్రయోగింపఁబడుటచే లోకోక్త్యలంకారము. ఏమియు నెఱుఁగనివారలకునైతము నీవు శాస్త్రములనుజదివి చెప్పుచున్నావుకదా. నీకే యీదుష్ప్రవర్తనముతగునా అనుటకు ధర్మము.

"పశ్యన్నపి ప్రస్ఖలతి శృణ్వన్నపినబుధ్యతి, పఠన్నపి న జానాతి దేవమాయావిమోహితః"
"తస్మిన్మహజ్జగదిదం గంభీరే కాలసాగరే, మృత్యురోగజరాగ్రాహై ర్నకశ్చిదపిబుధ్యతే"
"ప్రతిక్షణమయం కాలః క్షీయమాణోనలక్ష్యతే, ఆమకుంభ ఇవాంభస్థోవిశీర్ణోనవిభావ్యతే" సం.గరు.
అట్టినీవే ధర్మవిరుద్ధముగఁ బ్రవర్తించితివేని ప్రజలందఱు నిన్నుఁజూచి దుష్ప్రవర్తనులగుదురనుటకు
"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదే వేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే" భగ.
ఉత్తమపురుషుఁ డేకర్మ నాచరించునో యాకర్మమునే జ్ఞానహీనుఁ డాచరించును. అజ్ఞానవంతుఁ
డేసని ప్రమాణముగానొప్పుకొనునో దానినే పామరులు ననుసరింతురు, ఇచట 'ఆచార్యంపిమరా
చార' మని యెల్లరకుఁజెప్పుచు నీవేయటులాచరింపలేకు టివి, అనుటచే విశేషోక్త్యలంకారము
"క. ఫెక్కల్, కారణములయ్యుఁ గార్యము, చీరకయుండుట మహిన్వి ♦ శేషోక్తియగున్"నరస.
"విశేషోక్తి రఖండేషు కారణేషు ఫలావచః" ఉదా "నిద్రా నివృత్తా వుదితే ద్యురత్నే సఖీ
జనే ద్వారపదం పరాప్తే, శ్లథీకృతాశ్లేషరసే భుజంగే, చచాల నాలింగనతోఽంగనా సా" కా.ప్ర.
తా॥ లోకమున విద్యాగంధమెఱుఁగని మూఢులుసయితము తప్పడినడవడిక చొప్పున నడువ
వలయును నెడినీతిని నీవు చదివిబోధించుచు విద్యాధికుఁడ వయినని విట్లుప్రవర్తించుట యుక్తమా.

క॥ చక్కనిది కాదొ మది పెం, పెక్కినయదికాదొ కులస ♦ మిహిత కాదో
యక్కట యిన్నిగుణంబులఁ, జొక్కట మగుసతిని విడువఁ ♦ జూతురె తంత్రీ. 89.

ఆ॥ తంత్రీ-నాయనా, చక్కనిదికాదొ-అందముగలదికాదా, మదిపెంపెక్కినయదికాదొ-
బుద్ధివిశేషముగలదికాదా, కులసమిహితకాదో - వంశముచేతఁగోరఁబడునది కాదా - మంచివంశమునఁ
బుట్టియుండలేదా, అక్కట-అయ్యో, ఇదిసంతాపమును తెలియఁజేయును ఇన్నిగుణంబులన్-ఇన్ని
సద్గుణములచేత, చొక్కటము-పరిశుద్ధతగలది, ఉదా. "ఏ. గీ, పలుకుఁజెలిచొక్కటపుఁబాటఁ పట్టి"
చంద్రా. అగుసతిని-అయినటువంటిభార్యను, ఇచట 'చొక్కటమగుసతిని' అనుటను 'సూ. క్వచిదే
కత్వమిష్టం స్యాదప్రాణి స్త్రీవిశేషణే, సిద్ధమ్యంత స్త్రీపుంసయోస్తద్విశేష్యకయోస్తథా' అథ. విడువన్
చూతురె-వదలిపెట్టుటకుఁబ్రయత్నింతురా, ఈపద్యమున' చక్కనిది కాదొ' అనుప్రయోగమునుగూర్చి
"సూ. ఏదోతౌ వ్యతిరేకాదపి సంప్రార్థనప్రరోక్రియాణాంస్తః" నన్న. ఇందుఁగల యపిశబ్దమువలన
సందేహప్రశ్నార్థకములయందు వర్తించును. ఇందు నాయికయొక్కకులసౌందర్యగుణశీలాద్యుత్కర్ష
వర్ణింపఁబడినది. అకటా! ఇన్నిగుణములయందుఁ బరిశుద్ధమైన సతినివిడువయత్నింతురే, అనుటచేత
నర్థాంతరన్యాసాలంకారమును, భార్యనువిడచుటనుగూర్చి ధర్మశాస్త్రములం దిట్లు చెప్పఁబడియున్నది
"పతివ్రతాంసాధుశీలాం,కులీనాంవినయాన్వితాం, స్త్రియంత్యజంతియేద్వేషా, ద్వైతరణ్యాంపతంతితే"
సం.గరు.మంచికులమునఁబుట్టినదియు, వినయముతోఁగూడినదియు, సత్ప్రవర్తన గలదియు, నగుపతివ్ర
తను ద్వేషించి యెవ్వరువిడిచిపెట్టుదురో వారువైతరణియను నరకమునందుండెడు యేటిలోఁబడుదురు,
మఱియు"ఋతుస్నాతాంతుయోభార్యాం. స్వస్థపన్నాభిగచ్ఛతి, బాలగోఘ్నాపరాధేన, యుజ్యతేనా
త్రసంశయః" పరా. "సత్కులం భూషణం పుంసః, సద్భార్యాకులభూషణం, సత్పుత్రోభూషణా
భార్యా.పుత్రోసన్మతిభూషణః" హరి.సు.

తా॥ అబ్బాయీ! నీభార్య సౌందర్యవతి కాదా! ప్రజ్ఞా విశేషముకలది కాదా? సత్కుల
ప్రసూత కాదా! అయ్యో! ఇట్టి భార్యను విడువనుద్యోగింతురా?

వ్రాతప్రతియందొకపద్యము కనపించుచున్నది.

క॥ పులకండమచవిగాదని, తెలిమిడిభుజియించునట్టి ♦ పీఠేడికరణిన్
కులకాంతాసుఖమొల్లక, వెలజవ్వని నెవ్వఁడనుభ ♦ వించుఁగుమారా.

క॥ రతి గద యాకృతి మతి భా, రతిగద హైమవతి గద ని ♦ రంతరసమసం
భృతిఁ బతియందు రతి నరుం, ధతి గద యిన్నియును గలవు ♦ తావకసతికిన్. 90.

అ॥ ఆకృతిన్—రూపమునందు, రతిగద—రతీదేవివంటిదిగదా, మతిన్—బుద్ధియందు, భారతిగద—సరస్వతీదేవితో సమానమయినదిగదా, నిరంతరసమసంభృతిన్. నిరంతర—ఎల్లప్పుడును, సమసంభృతిన్—ఓర్పునందు, హైమవతిగద—పార్వతీదేవికిసాటియైనదిగదా, పతియందున్—పెనిమిటియందు, రతిన్—అనురాగమున, అరుంధతిగద—అరుంధతివలెనుండునదిగదా, తావకసతికిన్—నీయొక్క—కులాంగనకు, ఇన్నియును—ఈచెప్పినలక్షణములన్నియును, కలవు—ఉన్నవి, ఇందు. రతి, కృతి, ఇట్లు తకారము పలుమారుచ్చరింపఁబడుటచే వృత్త్యనుప్రాసాలంకారము. రతిగదయాకృతిన్, ఇత్యాదు లుపమాలంకారము. ఇచట నాయికయొక్క— సర్వోత్కృష్టవర్ణింపఁబడినది. పణీము నత్తరయే తనకోడలిని తనకంటె నధికురాలినిగ వర్ణించినది.

తా॥ నీభార్య చక్కఁదనమున రతీదేవివలెను, బుద్ధియందు సరస్వతివలెను, ఓర్పునందుఁ బార్వతివలెను, అనురాగమున నరుంధతివలెను బ్రకాశించుచున్నది.

—: అతనిని వధూగృహంబున కనుపుట :—

వ॥ అనిపలికి నిజవచన రచనాంగీకారహృదయుండునుం బోలె నవ్వారాంగనాధ్యానపరాధీనమానసుం డై ప్రత్యుత్తరం బీకయున్నకుమారు నున్నతాకారు వేమాఱు గారవించుచు సమంచితకాంచనచిత్రితాంచలంబు లగుచేలంబులు గట్టుకొన నిచ్చి యమంధరగంధబంధురసౌగంధిక ధురంధరచికురబంధురుం జేసి గంధంబుపూసి వధూగృహంబునకుం దోడ్కొనిపోయి యిట్లనియె. 91.

అ॥ అనిపలికి—ఇట్లుచెప్పి, నిజ.........బోలెన్—నిజ—తనయొక్క, వచనరచన—మాటలయొక్క—కూర్పును, అంగీకారహృదయుండునున్ + పోలెన్—సమ్మతించినమనస్సుగలవానివలె, ఇచట 'హృదయుండునుంబోలెన్' అనుటకు 'సూ. ప్రథమాంతములమీఁదపోలెబలెపోనిశబ్దంబులు ద్రుతపూర్వకంబులు విభాషనగు' ప్రౌ. వ్యా. ఉదా. సమిద్ధవ్యవహారుఁడుంబోలెన్ హరివం. అవ్వారాం....సుండు. అవ్వారాంగనా—అందగత్తెలయినయావేశ్యలయొక్క, ధ్యాన—స్మరణమునందు, అనఁగా మనస్సునిల్పియాలోచించుటయందనుట, పరాధీన—పరతంత్రమయిన, 'ని. పరతంత్రః పరాధీనః పరవాన్నాథవానపి' అ. మానసుండు—మనస్సుగలవాఁడు ఐ—అయి, ప్రత్యుత్తరంబు—ప్రతివాక్యము, సమాధానము, ఈక—చెప్పక, ఉన్నకుమారున్—ఉండినట్టితనయొక్క—సుతుని—ఉన్నతాకారున్ — అతిశయించిన చక్కఁదనముగలవానిని, వేమాఱు—పలుమాఱు—మాటిమాటికిని, గారవించుచున్—ప్రేమనుజూపుచు, సమం.........బులు, సమంచిత—ఒప్పుచున్న, కాంచన—సువర్ణముచేత, చిత్రిత—చిత్తరువువ్రాయఁబడిన, అంచలంబులు—అంచులుగలవి, 'ని. చిత్రం లిఖితరూపం స్యాద్, దాలేఖ్యం తు ప్రయత్నః, నిర్మితోత్తమచిత్రం' శబ్దా. అగుచేలంబులు—అయినట్టిదోవతులు, కట్టుకొనన్—ధరించుటకు, ఇచ్చి—ఒసంగినవాఁడై, అమం.........ధురున్, అమం

ధర-శీఘ్రముగా వ్యాపించునటువంటి, గంధ-వాసనతో, బంధుర-గమ్యమైన, సౌగంధిక-కొంచె మెఱుపుగలిగి వాసనగల కలువపూవుయొక్క-, ధురంధర-భారమునువహించిన, బరువునుమోయుచున్న, చికురబంధురుౝ-తలవెండ్రుకలయొక్క- మనోహరమైనవానిని, 'ని. చికురం కుంతలో వాలః., కచః కేశ శ్శిరోరుహః, అ. చేసి-ఒనరించి, గంధంబుపూసి - చందనమునులేపనముచేసి, వధూగృహంబునకుౝ - తనకోడలియొక్క- శయనగృహములోనికి, 'ని. వధూ స్నుషా నవోఢా స్త్రీ, విశ్వ. తోడ్కొ-నిపోయి-వెంటఁబెట్టుకొనివెళ్ళి, ఇట్లనియెౝ, ఈప్రకారముగాఁబలికెను, 'వచనరచన-అంచిత కాంచన, అనుప్రాసాలంకారము. 'అంగనాధ్యానపరాధీనమానస - కుమారునున్నతాకారువేమాఱు- అమంధరగంధబంధురసౌగంధికధురంధరచికురబంధురుంజేసి, వృత్త్యనుప్రాసాలంకారము.

తా॥ ఈగతి బోధించుచున్నతల్లినీతులను సమ్మతించినవానివలె నుంపుడుకత్తెయగు చంపక గంధిపైఁ గల యాసక్తితో మాఱుపల్కక యున్నకుమారుని మిక్కిలిగారవించి పసిఁడిసరిగంచువలువ ధరింపఁజేసి తావికొలుపుచున్నచెంగలువపువ్వుల నతనితలయందు ముడిచి తనకోడలి యొక్క శయన గృహమునకు వెంటనిడుకొనిపోయి యిట్లు వచింపనుద్యమించె.

క॥ ఇదిమొదలు వారకాంతా, సదనవ్యాపారచింతఁ ♦ జాలించి సస
మ్మదగతి సంసారస్థితి, వదలక చరియింపవయ్య ♦ వైదికమణి వై. 92.

అ॥ ఇదిమొదలు - ఈదినముమొదలుకొని, వార.........చింతౝ, వారకాంతా - వేశ్యల యొక్క-, సదన-ఇండ్లయందు, వ్యాపారచింతౝ-ప్రవర్తించుటయను విచారమును, చాలించి-నిలుపు దలచేసి, ససమ్మదగతిౝ-సంతోషముతోఁగూడిన పద్ధతితో, సంసారస్థితి-కుటుంబముయొక్క- నిల కడను, ఆలుబిడ్డలతోఁగూడియుండుటను, వదలక - విడిచిపెట్టక, వైదికమణివై - వేదసమ్మతమైన ధర్మములనాచరించువారలలో శ్రేష్ఠుఁడవై, చరియింపవయ్య-మెలఁగుము, ఇది ప్రార్థనార్థకము. "సూ. ఆర్యాదిశబ్దయుక్తస్స్వార్థ, దసంబంధార్థబోధనే" అధ.

తా॥ నేఁటినుండి రోవెలఁదులయిండ్లకేగుట మాని వైదికాచారముతోఁ బ్రవర్తించుచుఁ గాఁపురముసేయుచుండుము.

తే॥ అనుచు జనయిత్రి నీతివా ♦ క్యప్రసన్న, హృదయుఁ జేసితిసుతునంచు ♦ నేగెనతఁడు
ప్రొద్దుపోయినదనితలా♦రులకువెఱచి,యొకవిధంబున నారాత్రి♦యుండఁదలఁచె. 93.

అ॥ జనయిత్రి-తనయొక్క-తల్లి,అనుచుౝ-ఇట్లువచించుచు, సుతుౝ-కొడుకయిననిరంకుశుని, నీతివాక్యప్రసన్నహృదయుౝ-నీతివాక్య-ధర్మవచనములచేత, ప్రసన్నహృదయుౝ - సంతుష్టమైన మనస్సుగలవానినిగా, చేసితిౝ-ఒనరించితిని, అంచుౝ-ఈప్రకారముగాననుకొనుచు, ఏగెౝ-ఆవ లికిఁబోయెను,అతఁడు-ఆనిరంకుశుఁడు,ప్రొద్దు+పోయినది-కాలముగడచినది, అని-ఇట్లుదలంచి, తలా రులకుౝ-రాత్రి కావలికాచుదొరతనపు బంటులకు, వెఱచి-భయపడి, ఒకవిధంబునౝ - ఏదోయొక రీతిగా-ఇష్టములేకయనుట, ఆరాత్రి-ఆరేయి, ఉండౝ+తలఁచెౝ - ఆయింటిలోనేయుండుటకు నిశ్చయించెను. ఈపద్యమున 'అంచుౝ' అనుటకు "సూ. శత్రర్థేతూతశ్చోనోః" శబ్దచిం. 'జనయిత్రి, అనుశబ్దమునుగూర్చి "సూ. స్త్రీలింగంబులెల్లస్వస్వనియతంబులగు స్త్రీప్రత్యయంబులం గూడి యుంపఁబ్రవర్తిల్లు" బా. వ్యా.

తా॥ ఈవిధముగాఁ జెప్పి కోడకను సంసారమునం దిచ్చగలవానినిగాఁ జేసితినిగదా యని సంతసించుచుఁ దనమందిరమున కరిగెను. నిరంకుశుఁడును దనమదిలో నిప్పటికర్ధరాత్రమయినది. వీధి కేగినచోఁ దలారివాండ్రు పట్టుకొందురేమో యనుభయముచే నారాత్రి యెట్లో కాలముగడుప నిశ్చయించుకొనెను.

వ॥ అంత. 94.

అ॥ అంతఁ-అంతట.

—♦ నిరంకుశునిభార్య శయ్యాదాపునకు వచ్చుట ♦—

మ॥ జలకం బాడి మణుంగు గట్టి వరభూ ♦ షాసంఘముల్ దాల్చి చెం
గలువల్ కొప్పునఁగీలుకొల్పి రతికాం ♦ క్షం జేర నేతెంచెఁ ద
త్కులకాంతామణి వారసారసముఖి ♦ దుర్వార మారావహో
త్కలికాఘూర్ణిత మానసుం డయిక డుం ♦ దాపించుప్రాణేశ్వరున్. 95.

అ॥ తత్కులకాంతావణి-శ్రేష్ఠురాలయిన యానిరంకుశునియొక్క-భార్య, జలకంబు+ఆడి-స్నానముచేసి, మణుంగుగట్టి-పరిశుభ్రముగానుదికి మడతపెట్టిన చీరధరించి, వరభూషాసంఘముల్-శ్రేష్ఠమైనయాభరణములయొక్క- సముదాయమును, తాల్చి-ధరించినదై, చెంగలువల్ - ఎఱ్ఱకలువ పూలను, కొప్పునఁ-కేశబంధమున, కీలుకొల్పి-తగిలించి-గుచ్చి, రతికాంక్షఁ-సంభోగమునందలి వాంఛతో, వార.........సుండు, వారసారసముఖీ-పద్మమువంటి ముఖముగల యావేశ్యకొఱకు, దుర్వార-వారింపనలవిగాని, మారావహ-మన్మథుఁడుప్రవేశించుటచేత, ఉత్కలికా-గొప్పతరంగములవలె, 'ని. తరంగే భంగ వీచ్యూర్మ్య త్కలికా మహతిత్వివహ, అహ ర్యుల్లోల కల్లోలాః' హేమ. ఘూర్ణిత-తిరుగుడుపడిన, మానసుఁడు-మనస్సుగలవాఁడు, ఉత్కలిక యనఁగా గోరినవస్తువును బొందుటకుఁ గాలవిలంబనము నోర్వఁజాలక తహతహపడుట 'ని. ఉత్కంఠోత్కలికే సమే, అ. "ని. కథితోత్కలికోత్కంఠాహేలాసలిలవీచిషు, మే. అయి-అగుచు, కడుఁ - లెస్సగా, తాపించుప్రాణేశ్వరుఁ -వ్యాకులపడుచున్న తనయొక్కభర్తను, చేరఁ+ఏతెంచెను-సమీపమునకు వచ్చెను, ఇచట స్త్రీలకలంకారము నాలుగువిధము లనిచెప్పఁబడుచున్నది. "కచధార్యం దేహధార్యం, పరిధేయం విలేపనమ్, చతుర్ధా భూషణం ప్రాహుః, స్త్రీణా మన్య చ్చ దైశికమ్" రసాక, కచ ధార్యము కురులయందు ధరించుకొనునది, దేహధార్యము దేహమునందు ధరించుకొనునది. పరిధేయము అచ్ఛాదించుకొనునది వస్త్రము. విలేపనము పూసికొనునది. పతిరాకడకు సంతోషించి వస్త్రభూషణాద్యలంకృతయై సంభోగ కాంక్షతో నేతెంచినదని చెప్పుటచే నిందు వాసకసజ్జికా లక్షణ మగుపడుచున్నది. "ప్రియాగమన వేళాయాం. మండయంతీ ముహుర్ముహుః, కేళీగృహం తదాత్మానం, సా స్యాద్వాసకసజ్జికా" ప్రతా. ఇచట "జలకంబాడి మణుంగుగట్టి వరభూషాసంఘముల్ దాల్చి చెంగలువల్ కొప్పునఁగీలుకొల్పి రతికాంక్షంజేర నేతెంచె" నని బహుక్రియలతోఁ దత్కులకాంతామణి యనునొక కర్త్రుకారమునకు నన్వయంబగుటచేత కారకదీపకాలంకారము. "క. కారకదీపక మగునొక,కారకముం జెందు పెక్కు క్రమికంబులచేఁ" అలం. సా. సం. శృంగారచేష్టలు నాలుగు అవియేవియనభావ,హావని,విలాసవి,భ్రమములు అందు విలాసమనుశృంగారచేష్టయిందుఁగన్పట్టుచున్నది.

"క. చిట్టునిజప్రియు నంగన, కట్టెదురం జూచియంగ ♦ కంబులమీఁదన్, బుట్టించినరోమోద్భేదము ♦ చిట్టాడుట యని విలాస ♦ చిహ్నంబరయన్" కావ్యా. చూ. 'రతికాంతుఁజేరనేతెంచె, ననుటచేత నభిలాషయనుమన్మథావస్థయు వర్ణింపఁబడినది. "క. కలయుటకు ముందు గోరిక, యిలనభిలాషంబు" కా. సం. మమ్మటాచార్యుఁడును విప్రలంభగా వివరించి అభిలాషవిరహము, ఈర్ష్య, ప్రవాసము, శాపము, అనునైదువిధములు విశదీకరించియుండెను. అభిలాషకీయుదాహరణముఁ జూపించియుండెను, "ప్రేమార్ద్రాః ప్రణయస్పృశః పరిచయాదుద్గాఢరాగోదయా, స్తాతాముగ్ధదృశోనిసర్గమధురాశ్చేష్టా భవేయుర్మయి, యాస్వంతఃకరణస్య బాహ్యకరణవ్యాపారరోధీ క్షణా, దాశంసాపరికల్పితా స్వపి భవత్యానందసాంద్రోలయః" మాల. మా. వటియ 'వారసారసముఖీ........ప్రాణేశ్వరున్' అనుటచే నాయకునకుఁ జింతయనునవస్థ చెప్పఁబడినది. 'ఇష్టానధిగమాద్ధ్యానం చింతాశూన్యత్వతాపకృత్' ప్రతా. ఇందు నిరంకుశునిపత్ని పతియందుఁ గోరికతో సమీపించిన దనుటనుగూర్చి 'నిమంత్రణోత్సవా విప్రా గావో నవతృణోత్సవాః. పత్యుత్సాహయుతా భార్యా, అహం కృష్ణ రణోత్సవః' చాణ. 'ఉత్కలికాఘూర్ణితమానసుండు, అనఁగా నుత్కలికకు సంచారిభావమని యన్వయము "శంకాసూయాభయంగ్లాని, ర్వ్యాధిశ్చింతాస్మృతిర్ధృతిః, ఔత్సుక్యవిస్మయావేగా, వ్రీడోన్మాదోన్మదా స్తథా, విషాదోజడతానిద్రావహిత్థాచాపలంమృతిః' ఇతిభావాః ప్రయోక్తవ్యా, శృంగారేవ్యభిచారిణః, ఈశంకాసూయాది సంచారిభావములును దగంగసదృశములై మనస్సును జలింపఁజేయుచుండును. 'మజ్జంతశ్చనిమజ్జంతః కల్లోలాస్తేయథార్ణవే, తస్యోత్కర్షం వితన్వంతి, యాంతిత ద్రూపతామపి' తథాస్థాయినినిర్మగ్నా, ఉన్మగ్నావ్యభిచారిణః, పుష్యంతిస్థాయినంస్వాంశ్చ తత్రయాంతిరసాత్మతామ్'

తా॥ అనిరంకుశునిభార్య స్నానమాచరించి శుభ్రమై నవవస్త్రములనుధరించి నవరత్నకలిత సువర్ణాభరణములఁ దాల్చి చెంగలువలతోఁ గేశబంధమును బ్రకాశింపఁజేయుచు సంభోగాభిలాషతో ధనాంగనాస్వాధీనమానసుం డైకలగుండువడియున్న మగనిచెంతకుఁ జేరెను.

—: నిరంకుశుఁడనాదరముతోనుండుట :—

క॥ చనుదెంచి యతనిమోమునఁ, గనికర మొకకొంత యయినఁ ♦ గానక యపుడ
వ్వనజాతనయన సాధ్వస, మును సిగ్గును మానుషంబు ♦ ముప్పిరి గొనఁగన్. 96.

అ॥ అవ్వనజాతనయన - పద్మములవంటి కన్నులుగలదయిన యానిరంకుశునిభార్య, చనుదెంచి — వచ్చి, అతనిమోమునన్ - తననాథునియొక్క ముఖమునందు, కనికరము - దయ, ఒకకొంతయయినన్ - ఇంచుకయైనను, కానక - కనఁబడకుండుటచే, అపుడు - ఆసమయమున, సాధ్వసమును-భయమును, సిగ్గును-లజ్జయును, మానుషంబున్ - మర్యాదయును,-తనకవమానమునుగల్గుటను గూర్చిన యాలోచనయును, ముప్పిరిగొనఁగన్ - మూఁడుపురులుగాఁజుట్టుకొనఁగా, అనఁగా నివి యన్నియు నేకీభావముఁజెందఁగాననుట, ఇందుముప్పిరియనుటకు "సూ. ద్విగోరమిశ్రితాయాంతు ప్రాయ ఏకత్వమిష్యతే, మిశ్రితాయాంబహుత్వంస్యా తన్యత్రాపిక్వచిద్భవేత్" అథ. సంభోగాభిలాషతోవచ్చి యతనిమోమునఁ గనికరమును గానకవిచారగ్రస్తురాలయినదనుటచే విషాదాలంకారము. "ఇష్యమాణవిరుద్ధార్థ సంప్రాప్తిషువిషాదనమ్ దీపముద్యోతయద్వాభన్ని ర్వాణస్తావదేవసః" చంద్రా.

తా॥ అతనిసమీపించి కనికరము లేనివానినిగాఁ దెలిసికొని భయలజ్జావమానంబు లంతరంగంబున నిండఁగా.

—: భార్యతాంబూలమీయఁబోఁగా విముఖుఁడగుట :—

మ॥ అలివేణీమణి సిగ్గుచేత నతవ ♦ క్త్రాంభోజ యై రెండుచే
తుల బాగా లొసఁగంగఁ బోయినఁ గృపా ♦ దూరీకృతుం డై ఘన
జ్వలనజ్వాలకరాళ మైనయొకని ♦ శ్వాసంబుఁ గావించి య
వ్వలిమో మయ్యె రుచింతురే కులసతుల్ ♦ వారాంగనాభోక్తకున్. 97,

టీ॥ అలివేణీమణి - తుమ్మెదలవలె నల్లనిజడగలిగిశ్రేష్ఠురాలయిన యతనిగృహిణి, సిగ్గుచేతన్ - లజ్జతో, నతవక్త్రాంభోజయై. నత - వంచుకొనఁబడిన, వక్త్ర - ముఖమనెడి, అంభోజయై - కమలముగలదియై, రెండుచేతులన్ - తనయొక్క రెండుహస్తములతో, బాగాలు - వక్కపొడిని. ఒసఁగంగన్ + పోయినన్ - ఇయ్యఁబోఁగా, కృపాదూరీకృతుండై, కృపా - దయను, దూరీకృతుండు + ఐ - దూరముగాఁజేయఁబడినవాఁడై, ఘన.........సంబున్. ఘన - గొప్పదియగు, జ్వలన - అగ్నిహోత్రముయొక్క; జ్వాల - మంటవలె, ఈజ్వాలశబ్దము పుం స్త్రీ లింగములయందుఁగలదు. 'ని. వహ్నిర్ద్వయోర్జ్వాలకీలా' అ. కరాళ - భయంకరమయిన, ఒకనిశ్వాసంబున్ - ఒకనిట్టూర్పును, ఇదిమిక్కిలి విసుగుజెందినప్పుడు కనఁబడుచునది. కావించి - కలిగించి, అనఁగా నొకనిట్టూర్పును విడిచియనుట. అవ్వలిమోము + అయ్యెన్ - పెడమొగమునుబెట్టెను, వారాంగనాభోక్తకున్ - వెలయాండ్రతోఁగూడి సుఖించువానికి, కులసతుల్ - సంసారస్త్రీలు, కులస్త్రీలు, రుచింతురే - హితవుగానుందురా, ఇష్టము కారనుట. ఇందు 'బాగములు' అనుపదమును 'బాగాలు' అని ప్రయోగించుటకు "సూ. అసంబుద్ధౌభవేద్వావు రస్త్రియాంల్వాదివర్ణకే, ప్రాయశో వైకృతపదే లోపోదీర్ఘశ్చమోరతః' అధ. ఉదా. 'క. కర్పూరంబులతోడిబాగా, లీరాదోయాకుమడిచి యీరాదో చెలీ' కళా. ఇందు 'రుచింతురే కులసతుల్ వారాంగనాభోక్తకున్, అనుటచే అర్థాంతరన్యాసాలంకారము. 'క. భాషింపఁగసామాన్యవి, శేషములర్థాంతరాఖ్య ♦ చెన్నువహించున్, ఓషధిపతినహి మింగున్, భాషాపతిగ్రావాలుదాఁట ♦ వశమెవ్వరికిన్' అలం. సా. సం. 'సామాన్యంవావిశేషోవా, తదన్యేన సమర్థ్యతే, యత్రసోఽర్థాంతరన్యాసః, సాధర్మ్యేణేతరేణవా' కా. ప్ర. 'అలివేణీమణిసిగ్గుచేత నతవక్త్రాంభోజయై, అనుటచేత 'చకిత' మనుశృంగారచేష్టవర్ణింపఁబడినది. 'క. అలుకుటచకితమనవ్వుచు, నలరుటహాసితంబురతుల ♦ నతిసమ్మర్దో, జ్జ్వలసౌఖ్యము కుట్టమితము, లలనకుఁ జపలతకుతూహ ♦ లఁబెట్లన్నన్' కా. సం. మఱియు 'కృపాదూరీకృతుండై........యవ్వలిమోమయ్యె, ననుటచేత, బతికిగర్వాతిశయముచేత నిష్టవస్తువందయినను గలిగెడు ననాదరభావమును నాయకునియొక్క బిబ్బోకచేష్టగాఁ దెలియఁదగినది. 'మనాక్ప్రియకథాలాపే, బిబ్బోకోఽనాదరక్రియా' ప్రతా. ఇందు నాయకునియొక్క ఘనజ్వలనజ్వాలకరాళమైన నిశ్వాసము తనహృద్గత పరితాపమును దెలి ప్రొక్కుచున్నదికనుక నిచట శంకయనుసంచారిభావము 'అనిష్టాభ్యాగమోత్ప్రేక్షా, శంకాఽరోపాది కారణమ్' "హర్షస్త్విష్టావాప్తేర్మనః ప్రసాదోఽశ్రుగద్గదాదికరః, ఉపాయాభావజన్మాతు విషాదః సత్త్వసంక్షయః, నిశ్వాసోచ్ఛ్వాసహృత్తాప, సహాయాన్వేషణాదికృత్' సా. ద. నిరంకుశు

నకుఁ దల్లి యెన్నియో నీతులు బోధించినను దనదుర్గుణమును విడువఁజాలకుండుటనుగూర్చి "నదుర్జనః సాధుదశాముపైతి, బహుప్రకారైరపి శిక్ష్యమాణః, అమూలసిక్తః పయసాఘృతేన, ననింబవృక్షో మధురత్వమేతి" చాణ.

తా॥ అతనిభార్య సిగ్గుతోఁ దలవంచికొని దోయిటఁ దాంబూలమందీయఁబూనిన నతఁడు దయమాని యొకపెద్దనిట్టూర్పువిడిచి పెడమొగము పెట్టెనుగదా! వెలయాండ్ర పొందుగోరువారి కిల్లాండ్రిష్టమగుదురా ?

సీ॥ లేదువో గృహిణిపై ♦ మోదంబు లోకాప, వాదంబునకు నైన ♦ వణఁకవలదె
కాదువో సంసార ♦ కాంక్ష మేనికి దాని, వినయసంభృతి కైన ♦ వెఱవవలదె
యీదువో దయ్య మా ♦ యిభకుంభకుచపొందు, జననియానతి కైన ♦ జడియవలదె
రాదువో మనసు వా ♦ రవధూవిలగ్నమై, కులకాంత యని యైన ♦ గొంకవలదె

తే॥ కారుణికభావమాత్రవి ♦ దూరదుర్ని, వారహృదయాబ్జుఁ డైయాప ♦ యోరుహాక్షి
వీడెమీయంగఁ బోయిన ♦ విరసముద్ర, నవలిమోమయ్యె నతనినే ♦ మనఁగవచ్చు. 98.

అ॥ గృహిణిపైన్-గృహస్థురాలయిన భార్యమీఁద, మోదంబు-సంతోషము, లేదుపో-లేదుగదా, లోకాపవాదంబునకున్-జనులయొక్క యపనిందకు, ఐనన్ - అయినను, వణఁకవలదె-కంపము నొందవలదా, సంసారకాంక్ష-కాఁపురముమీఁదికోరిక, మేనికిన్-తనకు, కాదుపో-కూడదుగదా. దానివినయసంభృతికిన్-ఆబిడయొక్క నమ్రతతోఁగూడిన కలయికకు, ఐనన్-అయినను, వెఱవవలదె-భయపడవలదా, దయ్యము-దైవము, ఆయిభకుంభకుచపొందు - ఏనుఁగుకుంభస్థలమువంటి స్తనములుగలదయిన యాయిల్లాలియొక్క కూడికను, "ఉదా. చ. మదగజరాజకుంభముల ♦ మచ్చరికించుచురోజకుంభముల్" శృం. నై. ఈదుపో-ఇయ్యలేదుగదా, జననియానతికిన్ - తనతల్లియొక్క యాజ్ఞకయినను, జడియవలదె-జంకవద్దా, మనస్సు-హృదయము, వారవధూవిలగ్నమై - వేశ్యాస్త్రీయందు మిక్కిలి తగుల్కొనినదై, 'ని. భుజిష్యా లంజికా రూపాజీవా వారవధూః పునః' హేమ. రాదుపో-రాదుగదా, కులకాంత-పాణిగ్రహణమొనర్చుకొనఁబడినది, అనియైనన్-అనునట్టికనికరముతోనయినను, కొంకవలదె-భీతిఁజెందవలదా, కారుణిక........బ్జుఁడు, కారుణిక - దయతోఁగూడిన, భావమాత్ర-స్వభావమయినను, "ని. భావో లీలా క్రియాచేష్టా, భూత్యభిప్రాయజంతుషు" యా. "భావ స్సత్తా స్వభావాభిప్రాయచేష్టాత్మజన్మసు" అ. విదూర-మిక్కిలిదూరముగాఁ జేయఁబడి, దుర్నివార-అడ్డగింపనలవిగాని, హృదయాబ్జుఁడు-పద్మమువంటి మనస్సుగలవాఁడు, ఐ-ఆయి, అపయోరుహాక్షి-కమలములవంటి నేత్రములుగలదయిన యతనిభార్య, వీడెము - తాంబూలమును, ఈయంగన్ + పోయినన్ - ఇచ్చుటకు దగ్గఱకుఁబోఁగా, విరసముద్రన్ - వైషమ్యమనెడి మానముద్రతో, అనఁగా విరుద్ధస్వభావముతోననుట. అవలిమోమయ్యెన్ - పరాఙ్ముఖుఁడయ్యెను-పెడమోముపెట్టెను, అతనిన్ - ఆయొక్క నిరంకుశుని, ఏమనఁగవచ్చున్ - ఇట్లు ప్రవర్తించుటనుగూర్చి యేమనిచెప్పవచ్చును, ఈపద్యమున 'లేదువో' ఇట్లు నాలుగుపాదములయందుఁ జెప్పఁబడుటనుగూర్చి "సూ. అన్యైప్యర్థవిశేషేస్య, రంతే శ్రుతిమనోహరాః, అథ. ఉదా. "ఉ. యీయుక్కుమసెందు నంగళకు ♦ యొప్పరువోధృతరాష్ట్రనందనుల్" భార. ఇచట. ప కారమునకు వకారాదేశమయినందు

లకు 'సూ. పరుషాణాంగసడదవాస్స్యుః, పదాద్యంద్వే' నన్న. వీడెము. ఇది వీడియముయొక్క-రూపాంతరము. ఈ ప్రయోగమునుగూర్చి "సూ. ఇయాంత్వే కుత్రచిత్ స్యా దత్వం యశ్చాపి తచ్ఛవే, లఘు స్సోఽపి చ సంయుక్త ఇతి కేషాంచి దీరణా" అధ. ఈ సీసపాదములు నాలుగును బాదాదియందుద్విప్రాసముగను, అంత్యానుప్రాసముగను జెప్పఁబడినవి. ప్రథమపాదమున నను ప్రాసముకలదు. ఇందుఁగారణములెన్నియోయుండియును గార్యము భావముగుటచే విశేషోక్త్యలంకారము. "విశేషోక్తి రఖండేషు, కారణేషు ఫలావచః" కా. ప్ర. ఉదా. "నిద్రానివృత్తా వుదితేద్యురత్నే, సఖీజనే ద్వారపదం పరాప్తే, శ్లథీకృతాశ్లేషరసే భుజంగే, చచాల నాలింగనతోఽంగనా సా"

తా॥ ఇల్లాలిపైఁ బ్రేమలేకున్నను లోకులు నిందింతురనియైన భయపడవలయునుగదా! కాఁపురమునం దిచ్ఛలేకున్నను భార్యయొక్క-నమ్రతకయినను జంకవలయునుగదా? పరమేష్ఠి యాసతి పొందుఁ గూర్చకున్నను దనతల్లియొక్క-యాజ్ఞ ననుసరించియైన మెలఁగవలయునుగదా! వెలయాలిపై నున్నచిత్తముమరలకున్నను అగ్నిసాక్షిగా వివాహమైనపత్ని యనియైనను వెలపుఁజూపవలయును గదా! తనకులాంగన తాంబూలమీయఁబోఁగా నించుకయైన జాలిలేక మొగముత్రిప్పెను. అట్టి దుష్పథచారి నేమనవలయును.

క॥ తమకంబు లేక కారు, ణ్యముఁ జూప కతఁడు కులాంగ ♦ నాపరవీక్షా
విముఖత్వ మిట్లు చూపిన, గుమగుమమని శోకవహ్ని ♦ గుబ్బతిలంగన్. 99.

అ॥ అతఁడు-అనిరంకుశుఁడు, తమకంబులేక-తగులములేక, కారుణ్యముఁ+చూపక-దయను గనఁబఱచక, కులాంగనాపరవీక్షావిముఖత్వము, కులాంగనా-కులస్త్రీయయిన తనభార్యకు, అపర-వ్యతిరేకమయిన, వేఱయిన, వీక్షా,-దృష్టిచేత, విముఖత్వము-పరాఙ్ముఖము - పెడమోము, ఇట్లు-ఈ ప్రకారముగా, చూపినన్-అగపఱచఁగా, గుమగుమమని-గుమగుమ మనెడిధ్వనితో, అనఁగా నగ్ని మండునప్పుడు గుమగుమనిధ్వనికలిగినట్లనుట. 'ని, గుమగుమ, అగ్నిమండుటయందనుకరణము, సూ. అం. ని. శోకవహ్ని-అగ్నివంటిదుఃఖము, గుబ్బతిలంగన్-అతిశయించఁగా, ఇందు గుమగుమమనుశబ్దమున ముగాగమంబగుటకు 'సూ. ధ్వన్యనుకరణశబ్దముల కనుధాతువుపరంబగుచోఁ గొన్నియెడల ముగాగమంబగు' ప్రౌ. వ్యా. ఉదా. "కనకనమను" రామా. ఇందు 'శోకవహ్ని' ఉపమాలంకారము. ఇచట నాయికయొక్క- శోకమను సంచారిభావము చెప్పఁబడినది. "ఇష్టజనవియోగాదినాఽఽత్మని దుఃఖాతిభూమిఃశోకః" ప్రతా.

తా॥ అనిరంకుశుఁడు భార్యయందలి వ్యతిరేకచిత్తముతోఁ బ్రేమను గనఁబఱచక పెడమొగము పెట్టియుండుటఁజూచి యాయిల్లాలు దనమనంబున దుఃఖానలమతిశయించఁగా.

—: భార్య విచారపడి వ్యాకులముతో నిద్రించుట :—

మ॥ అకటా! యింతకుఁదెచ్చెనే యనుచు న ♦ త్యాపన్నయై జాలవ
ల్లికలో వీడియ ముంచి పంచశరకే ♦ ళీవాంఛ చాలించి చం
పకగంధిన్ దనలోన మెచ్చుకొనుచుం ♦ బద్మాసనుం దిట్టుచు
న్వికలం బైనమనంబుతో నిదురఁజెం ♦ దెం దత్సమీపస్థలిన్. 100.

ఆ॥ అకటా-అయ్యో, ఇంతకున్-ఇట్టిస్థితికి, తెచ్చెనే-తెచ్చిపెట్టెనుగదా, అనుచున్-ఇట్లు తలంచుచు, ఆర్త్యాపన్నయై - మిక్కిలికష్టమునొందినదై, జాలవల్లికలోన్ - చిత్రపుపనిచేసిన తమలపాకులపళ్లెములోపలనే, తాంబూలపాత్రములోనే, ఇచట, జాల+పల్లిక-జాలవల్లిక అగును. 'సూ. ఆచ్ఛికసమాసంబులందు బమగవర్ణలోపాగమాదేశవికారంబులు నిత్యవైకల్పికములుగాఁ బెక్కులు గానంబడియెడి' ప్రౌ. వ్యా. ఉదా. "సీ. జాలవల్లికలముత్యాలజాలీలు పెన్ వింజామరలువట్టి వేశ్యసురటి" రసిక. వీడియముంచి-తాంబూలమునుబడవైచి, పంచశరకేళీవాంఛ-సంభోగమునందలి కోరిక, "ని. ద్రవకేళిపరీహాసాః. క్రీడాఖేలాచనర్మచ" అ. చాలించి-మానుకొని, చంపకగంధిన్-చంపకగంధియనుపేరుగల భోగముదానిని, తనలోనన్-తనయొక్క-మనస్సులో, మెచ్చుకొనుచున్-శ్లాఘించుచు, పద్మాసనున్-తామరపువ్వు పీటగాఁగల బ్రహ్మదేవుని, తిట్టుచున్-తూలనాడుచు, వికలంబు-విచ్ఛేదమునొందినది-కలఁతఁజెందినది, ఐనమనంబుతోన్-అయినట్టిహృదయముతో, తత్సమీపస్థలిన్-అతనియొక్క-సమీపమున-అతనికిదగ్గఱగా, నిదురన్+చెందెన్-నిద్రించెను, ఈపద్యమున 'వీడియము' అని ప్రయోగించుటకు "సూ. ఏదన్తాచసామ్నా మన్యతరస్యామియన్తానాం" శబ్దచి. ఉదా. "క. వీడియముగ్రొత్తలైతగ" కవిక. ఇచట 'చంపకగంధిందనలోన మెచ్చుకొనుచున్' అనుటచే వ్యాజస్తుత్యలంకారము. "వ్యాజస్తుతిర్ముఖేనిందా, స్తుతిర్వారూఢిరన్యథా" కా. ప్ర.; 'పద్మాసనుం దిట్టుచున్', అనుటచేత బ్రహ్మనునిందించుటకు హేతువు కనఁబడుచున్నందునఁ గావ్యలింగము. "కావ్యలింగం. హేతోర్వాక్యపదార్థతా" కా. ప్ర. ఇందునాయిక యధీరగావర్ణింపఁబడినది. వ్యంగ్యముగాఁ గోపప్రకాశముచేయు నాయికయే యధీర. అమర్షమను సంచారిభావమును జెప్పఁబడినది. "అమర్షః సాపరాధేషు చేతః ప్రజ్వలనం మతమ్" ప్రతా.

తా॥ అయ్యో! ఎంతటికష్టముసంభవించె ననిదుఃఖించుచుఁ బళ్ళెరమునఁ దాంబూలమునుంచి సంభోగాభిలాష మాని తనపతి నిట్లుసంసారవ్యతిరేకునిగాఁ జేసి తనకులోఁబఱచుకొనిన చంపకగంధి యొక్క చాతుర్యమును శ్లాఘించుచు సతిపతుల కిట్లువియోగమును గూర్చిన బ్రహ్మదేవుని దూషించుచుఁ గలఁతనొందుమనంబుతో నతనిదాపున నిదురించెను.

—:♦ నిరంకుశుఁడు పరితపించుట ♦:—

మ॥ తలఁకుం దల్లడమందుఁ దాల్మివదలుం ♦ దాపించుఁ గోపించు నీ
తులువల్లించినతల్లిమీఁద విధికిన్ ♦ దుర్వారు లెవ్వా రనున్
దలయూఁచుం దనబుద్ధిహీనతకు నా ♦ ధాత్రీసురుం డప్పు డా
వెలయాలిన్ వలయాలిమత్కరయుగన్ ♦ వీక్షింపఁగా లేమికిన్. 101.

ఆ॥ ఆధాత్రీసురుండు-ఆబ్రాహ్మణుఁడు, అప్పుడు-ఆకాలమున, వలయాలిమత్కరయుగన్, వలయ చుట్టుకొనుచున్న, అలిమత్-తుమ్మెదలుగల, కరయుగన్-హస్తములయొక్క జంటగల దానిని, ఆవెలయాలిన్-ఆభోగముదానిని, వీక్షింపన్+కాన్+లేమికిన్ - చూచుటలేనందుకు, చూడవీలుగాకున్నందుకు, తలఁకున్-చలించును, ఉదా "క. అప్పరుసునబాణాసురుఁ, డప్పటికప్పటికిఁ దలఁకె, నధికభయమునన్" ఉ. హరివం. తల్లడము+అందున్-వ్యాకులపడును, ఉదా. "ఉ. తామరపాకునీరువలెఁదల్లడమందిరి పౌరులందఱున్" ఉ. హరివం. తాల్మివదలున్-తొందరపడును,

తాపించుఁ౯-జ్వరముచేఁ గాఁగును, నీతులు-మంచిమాటలు, వల్లించినతల్లిమీఁదన్ - చెప్పినమాటలనే మరలమరలఁజెప్పిన తనయొక్కజననిపై, ఉదా "మ వల్లించు శ్రీరామనా, మసుధామాధురిసాధురీతి" పాం. మా. కోపించున్-క్రోధమువహించును, విధికిన్-బ్రహ్మవ్రాఁతకు, దుర్వారలు-అలవిగాని వారలు, ఎవ్వారు + అనుచు౯-ఎవ్వరుకలరనుకొనును, తనబుద్ధిహీనతకున్ - తనయొక్క మతిభ్రష్టత్వమునకు, తలయూఁచున్-శిరఃకంపమొనరించును, కారకదీపకాలంకారము. "క్రమికైకగతానాం తు. గుమ్ఫః కారకదీపకమ్, గచ్ఛత్యాగచ్ఛతి పునః పాన్థః పశ్యతి పృచ్ఛతి" కువ. "సకృద్వృత్తిస్తు ధర్మస్య ప్రకృతాప్రకృతాత్మనాం, సైవ క్రియాసు బహ్వీషు కారకస్యేతి దీపకమ్" కా. ప్ర. ఉదా. "ఖిద్యతి కూణతి వేల్లతి, విచలతి నిమిషతి విలోకయతి తిర్యక్, అంతర్నందతి చుంబితుమిచ్ఛతి నవపరిణయావధూః శయనే" ధ్వన్యా. ఇందు నాయకునికిఁ జింతయనుచేష్ట చెప్పఁబడినది. "ఇష్టానభిగమాత్ ధ్యానం, చింతాశూన్యత్వతాపకృత్" ప్రతా. ఈకవి సీతకనుపించనిసమయమున రామునిచేతఁగూడఁ గుడియెడమగా నిట్టిపనులే చేయించినాఁడు "కన్నులనశ్రులు క్రమ్మఁగ వగచున్, ఔరా విధివశ మని తలయూఁచున్, ఏటికిఁ బ్రాణము లింకననితలఁచున్, క్రమ్మరసొమ్మలు రొమ్మననొత్తున్, ఏగతినో రుతు నిఁకనని పలుకున్, బాపురె విధియని ఫాలముముట్టున్" సుగ్రీ. వసుచరిత్రమునను, చ. ఉసురనుఁ గన్నుమోడ్చుఁ దలయూఁచుఁ దలంచు నగుం జెమర్చు నిట్టూర్పులు గనుంగొను౦ బోరలు లేచు వడంకుఁ జలింప కుండుఁ హా, ప్రసవసుగంధియంచుఁ బువుఁ బాన్పున వ్రాలు నృపాలపుంగవుం, డసమశరప్రవీరనిశితాశుగదుర్దినధూయమానుఁడై" అనియున్నాఁడు. ఇచట నిరంకుశుఁడు నీతులుబోధించినతల్లిపైఁ గోపించు నటనుగూర్చి "లుబ్ధానాం యాచకః శత్రు ర్మూర్ఖాణాం బోధకో రిపుః, జారస్త్రీణాం పతిశ్శత్రుః చోరాణాం చంద్రమా రిపుః" చాణ. 'తాపించున్ - కోపించున్-వెలయాలిన్ వలయాలి, అనుప్రాసాలంకారము.

తా॥ అనిరంకుశుఁడు నిజవేశ్యను జూడవలయునని పోవుటచేఁ దాపమునుజెందును, బుద్ధినిలుకడ లేకుండును, చిక్కులివ్యాకులపడును, హితవాక్యములుబోధించినతల్లిపై నాగ్రహముఁజూపును, బ్రహ్మవ్రాఁత కెదురులేదనుకొనును, పెండలకడనే యోగిరమారగించి పోఁజాలనయితిని గదా యనితనబుద్ధిలోపమునకు శిరఃకంప మొనరించును.

క॥ వాఁడానాలుగుగడియలు, నేఁడాదిగఁ గడపిసూర్యుఁ డింకఁ దూర్పునకున్
రాఁడో యనితలఁపోయఁగ, మూఁడవజామయ్యె నంత మోదమెలర్పన్. 102.

అ॥ వాఁడు-అనిరంకుశుఁడు, ఇది తచ్ఛబ్దముకనుక 'తదిదమోర్వట్', అనువైకృతచంద్రికాసూత్రముచే వకారాగమమును 'సూ. "భవేత్తదాదిశబ్దేభ్యో డుజ్ఞిరస్తు భవేన్న చేత్, జనస్థానే రుతత్ర స్యాత్, క్వచిదత్వం భవేల్లులే" అధ, ఆనాలుగుగడియలు - అకాలదికాలమును, ఏఁడాదిగన్-ఒకసంవత్సరమైనట్లుగా, ఉదా. "క. ఏఁడాదిచటన్, నిలువుము" ఉ. రా. కడపి-కాలమును వెళ్ళఁబుచ్చి, సూర్యుఁడు-భాస్కరుఁడు, ఇఁకన్-ఇఁకమీఁదట, తూర్పునకున్-తూర్పుదిక్కునకు, రాఁడో-రాఁడుకాఁబోలును, అని-ఇట్లని, తలఁపోయఁగన్-ఆలోచించుకొనుచుండఁగా, మూఁడవజాము-తృతీయయామము, ఇచట మూఁడుశబ్దము చేర్చిందుకమని శ్రీ. బ. సీతారామాచార్యులుగారు తమశబ్దరత్నాకరమునవచించియుండిరి. కాని "క మూఁడవజామంబు లెమ్మియు" అను భారతప్రయోగమును. "ఉ. ము, మూఁడుజాములు లేదు" అను జైమినిభారతప్రయోగమును, జూచియుండరని తలంపవలె

యును. శ్రీ సూర్యారాయాంధ్రనిఘంటువునందుఁగూడ నీనిరంకుశోపాఖ్యాన పద్యమును భారత జైమినీ భారతపద్యములను జూపియున్నారు. అయ్యెన్-అయిపోయెను, కడచిపోయెను, అనఁగా వేకువజామయ్యెననుట. 'ని. నిశానిశీథినీరాత్రి స్త్రియామా క్షణదా క్షపా' అ. రాత్రియందలి ప్రథమ యామము చేష్టాకాలమును, అంత్యయామము విబోధకాలమును, అగుటచే నీరెండుయామములందు సగము దివససమానము, కావున రాత్రికిఁ ద్రియామ. అను పేరువచ్చినది. ఇచట నిరంకుశుఁ డిఁక సూర్యుఁ డుదయింపఁడని విలపించుచుండఁగ నింతలో వేకువజామయ్యెననుటచే సమాధ్యలంకారము 'సమాధిః కార్యసౌకర్యం కారణాంతరసన్నిధేః, ఉత్కంఠితా చ కులటా. జగామాస్తం చ భానుమాన్'' చంద్రా. "సమాధిః సుకరం కార్యం, కారణాంతరయోగతః'' కా.ప్ర.ఉదా. మాన మస్యా నిరాకర్తుం పాదయోః శ్మే పతిష్యతః, ఉపకారాయ దిష్ట్యేద, ముదీర్ణం ఘనగర్జితం'' కావ్యాద. మఱియు వ్రాఁతప్రతియందు. ''మూఁడో జామయ్యె, ననియేయున్నది. దానిఁ జూచియే శ్రీ. అ. ఆదిభట్టనారాయణదాసుగారు తమ గేయకవిత్వమున "తేజవ్వనంపుసందు- నా ల్గోజాము క్రొంప్రొద్దు వేగినసందు'' అని ప్రయోగించిరి.

తా॥ అతఁ డా కొలఁది కాలము నొక సంవత్సరముగాఁ దలఁచి యిఁక సూర్యోదయము కాదు సుమా! అని విచారపడుచుండఁగా వేకువజామయ్యెను.

శా॥ పాయంజొచ్చె విలాసినీసురతసౌ ♦ భాగ్యంబుచేఁ దారకల్
మేయంజొచ్చెఁ జకోరపంక్తులు గడుం ♦ బ్రేమన్ శరచ్చంద్రికల్
దూయంజొచ్చె మరుండు లేఁజిగురుగు ♦ త్తుల్ జంక నుంకింపుచున్
గూయంజొచ్చెఁ దృతీయయామకృకవా ♦ కుల్ కొక్కొరోకోధ్వనిన్. 103.

అ॥ విలాసినీసురతసౌభాగ్యంబుచేన్, విలాసినీ - కామముగల స్త్రీలయొక్క, సురత-సంభోగమువలని, సౌభాగ్యంబుచేన్-సమృద్ధిచేత, తారకల్-చుక్కలు, నక్షత్రములు, పాయన్ చొచ్చెన్-తొలఁగ నారంభించెను; చకోరపంక్తులు-వెన్నెలపులుఁగులయొక్క వరుసలు, కడున్ - లెస్సయిన, ప్రేమన్-పేరిమితో. శరత్+చంద్రికల్-ప్రకాశించుచున్న వెన్నెలలను, మేయన్+చొచ్చెన్-భుజించుటకు నారంభించెను, మరుండు-మన్మథుఁడు, లేఁజిగురుగుత్తుల్ - లేఁతచిగురుటాకులయొక్క గుచ్ఛములను, చంకన్-తనయొక్క బాహుమూలమున, ఉంకింపుచున్-లెస్సగాఁ బూనుచు - అధికముగా వహించుచు. తూయన్+చొచ్చెన్ తూపులుగాఁ జేయఁబూనెను, బాణములుగా నొనర్చ నారంభించెను, తృతీయయామకృకవాకుల్ - మూఁడవజామునఁ గూయు కోళ్ళు, "ని. కృకవాకుస్తామ్రచూడః, కుక్కుటశ్చరణాయుధః'' అ. కొక్కొరోకోధ్వనిన్ - కొక్కొరోకోయనెడు శబ్దములతో, కూయన్+చొచ్చెన్-కూయ నారంభించెను, ఉదా. "ఉ. కొక్కొరొకో, కోయని కూయఁ డేయతఁడు'' శృం. నై. "ఉ. మ్రోసెఁ గొక్కొరోకో, కోయని కుక్కుటస్ఫురదకుంఠితకంఠకఠోరనాదముల్'' విక్ర. ఈ పద్యమునఁ ద్రిప్రాయము చెప్పఁబడినది. స్వభావోక్త్యలంకారము. "స్వభావోక్తిరసౌ చారు యథావద్వస్తువర్ణనమ్'' ప్రతా.

తా॥ కామినీసమూహముయొక్క సంభోగాతిశయములచేత నక్షత్రము లడఁబాయుచుండెను. చాతకములు చంద్రికవలన సంతృప్తినొందుచున్నవి. మన్మథుఁడు లేఁజిగురాకుటమ్ములను బాహు

మూలమున వహించి సంధించుచున్నాఁడు. తెల్లవారుజామునఁ గూయుకోళ్ళు కొక్కొరోకోయని ధ్వనిచేయుచున్నవి,

చ॥ వనరుహబాంధవుండు పగవాఁ ♦ డరుదేఁగలఁ డింకఁ బోద మా
వనమున కన్నసాధుజన ♦ వాక్యము లొక్కచకోర మార్తితో
విని తమిదీఱ వెక్కసము ♦ వెన్నెలముద్ద భుజింపఁబోయి గొం
తునఁ బడవేసికొన్న హిమ ♦ తోయ మొసంగిరి నెయ్యు లయ్యెడన్. 104.

అ॥ వనరుహబాంధవుండు-కమలములఁబుట్టువయిన సూర్యుఁడు, పగవాఁడు-మనకువిరోధి, అరుదేఁగలడు-అరుదెంచఁగలఁడు - రాఁబోవుచున్నాఁడు, ఇంకన్-ఇంతటితో, అవనమునకున్-అజలమునకు, అయారణ్యమునకనిభావము. 'ని. వనం కానన నీరయోః. నానా. పోదము-పోవుదము, "సూ. భాషేయమితాత్ర దేశ్యాచిత్రస్వభావయుక్, తచ్చిత్రతాతుద్రష్టవ్యా పూజ్యపాదసుభాషితైః" అని యథర్వణాచార్యులు. అన్నసాధుజనవాక్యములు-అనినట్టిసజ్జనులయొక్క పలుకులు-అనినట్టిమంచివారియొక్క మాటలు, 'ని. జనస్సమూహేలోకేఽపి. నానా. ఒకచకోరము - ఒకచక్రవాకపక్షి, విని-అకర్ణించినదై- అలకించినదై, ఆర్తితోన్-దుఃఖముతో, తమిదీఱన్-కోరికదీరునట్లుగా, వెక్కసము-మిక్కుటమయిన, వెన్నెలముద్దన్-చంద్రికయను కబళమును, భుజింపఁబోయి-తినుటకుఁబోని, గొంతునన్ - గొంతులో, పడవేసికొన్నన్ - పడునట్లువైచుకొనఁగా అయ్యెడన్ - ఆసమయమున, నెయ్యులు-స్నేహితులు, హిమతోయము-మంచుబిందువులనెడినీళ్ళను, ఒసంగిరి-ఇచ్చిరి. ఈపద్యమున 'నెయ్యుఁడు' అనుప్రయోగమునుగూర్చి "సూ. కేచిత్తువైకృతాఃశబ్దాః, పుంసిచాన్యత్రసంగతాః" అథ. పద్యమంతయును రూపకాలంకారము. 'తద్రూపకమభేదో య ఉపమానోపమేయయోః అతిసామ్యాదభేదః, శ్రౌతాఽరోపతాయదా" కా. ప్ర. ఇచట చకోరములు వెన్నెలముద్దను దినుటకవిసమయసిద్ధము. 'జ్యోత్స్నాపేయాచకోరైర్జలధరసమయే మానసంయాతిహంసాః, ఇత్యుద్యన్నేయమన్యత్ కవిసమయగతం సత్కవీనాం ప్రబంధే" సా. ద. 'వనరుహబాంధవుండు పగవాఁడరుదేఁగలఁ డింకఁబోదమా, వనమునకు. ఇది శ్లేషాలంకారము. 'నెయ్యులయ్యెడన్' అనుప్రాసాలంకారము.

తా॥ మనకు శత్రువగు కమలబాంధవుఁడు రానున్నాఁడు మనమిఁక వనమునకేగవలయునునుమా! అను సద్వాక్యమును వేరొకచాతకము విని దుఃఖముతో నీవెన్నెలను గోరికదీఱఁ దినిపోవుదమని ప్రమింగ నది కుత్తుకజాఱకుండిన యపాయస్థితిలోఁ దనహితులు మంచనెడిజలమును దెచ్చియిచ్చిరి.

ఉ॥ అప్పుడు విప్రసూనుఁడు ర ♦ యంబునఁ బానుపు డిగ్గి వేడ్కతోఁ
జెప్పకు మింక నొక్కదరిఁ ♦ జేరెద నంచుఁ దలంచువేళ లా
గొప్పఁగ ధౌతచేలము స ♦ మున్నతలీల ముసుఁగువెట్టి నీ
ర్గప్పిననిప్పుచందమున ♦ రాజనిభానన నిద్రవోవఁగన్. 105.

అ॥ అప్పుడు-ఆయవసున, విప్రసూనుఁడు, అబ్రాహ్మణునికుమారుఁడు, రయంబునన్-శీఘ్రముగా, పానుపుడిగ్గి-శయ్యనుండిదిగి, వేడ్కతో-కుతూహలముతో, ఇంకన్ + చెప్పకుము - ఇఁకఁజెప్పఁబోకుము-ఇఁకవీలుచిక్కినదిలెమ్మనుట, ఒక్కదరిన్-ఏదోయొకవైపునకు, చేరెదన్-పోఁగలను, అంచున్-ఇట్లనుకొనుచు, ఇచట 'అనుచు' అనుటకుబదులు 'అఁచు' అని ప్రయోగించుటకు "సూ.

శత్రర్థేత్రూతిశ్చానోః'' 'తస్యస్యాచ్ఛపూర్ణబింబరశి'' నన్న. తలంచువేళన్ - ఆలోచించునట్టి సమయమున, రాజనిభానన - చంద్రునితో సమానమయిన ముఖముగల యాగృహిణి, ఇచట నిశబ్దమునకు 'నిభో వ్యాజసదృక్షతోః' విశ్వ. 'ని. స్యురుత్తరపదేత్వమీ. నిభసంకాశనీకాశ, ప్రతీకాశోపమాదయః. అ. ఉదా. 'చంద్రనిభః,లక్ష్మీసంకాశా, పద్మినీకాశం, సూర్యప్రతీకాశః, పిష్ణూపమః, ఇత్యాదులు. ధౌతచేలమున్ - ఉదికినవస్త్రమును, లాగొప్పఁగన్ - ఇచ్చవచ్చినట్లు - ఇష్టానుసారముగా, ముసుంగువెట్టి - నిండారఁగప్పుకొని, నీర్గప్పిననిప్పుచందమునన్ - బూడిదగప్పిన యగ్నిహోత్రమువలె, నీఱు + కప్పిన - నీర్గప్పిన - అగును. ఇది నిఱుయొక్క రూపాంతరము. ఉదా. "అ మ ఱుకొన్నవారి నీఱుచేయము, భార. ఇచట సంధినిగూర్చి "సూ. నలడాదేరంతరుతశ్చ'' నన్న. నిద్రవోవఁగన్ - నిదురించుచుండఁగా, ఇచట 'నీర్గప్పిననిప్పుచందమున రాజనిభాననిద్రవోవఁగన్, అనుటచేత నుపమాలంకారము. 'సాధర్మ్యముపమా' కా. ప్ర. 'అంచుఁదలంచు - కప్పిననిప్పు, అనుప్రాసాలంకారము.

తా॥ అయ్యెడ నిరంకుశుఁడు వేషవజూవయ్యె నిఁకనెచ్చటికైనఁబోవచ్చు నని యూహించి తన శయ్యనుండి దిగి చంద్రబింబమువంటి మోముగలకాంతి నసిగప్పిననిప్పువలె నిద్రించుచుండఁగా.

—: నిరంకుశుఁడు సతియాభరణముల హరించి వేశ్యయింటికేగుట :—

శా॥ ఔరా దైవము దెచ్చిపెట్టె ననుచున్ ♦ సామోదచిత్తాబ్జుఁడై
చేరంబోయి ముసుంగుఁదీసి కడువై ♦ చిత్ర్యంబు మీఱన్ దురా
చారాగ్రేసరుఁ డాధరాసురుఁడు కాం ♦ తన్ నల్లపూసాదిగా
నారామామణిసొమ్ము నాఁచుకొని వే ♦ శ్యావాటి కేగె న్నృపా. 106

అ॥ నృపా - ఓరాజా, దురాచార + అగ్రేసరుఁడు - చెడ్డనడతయందు వర్తించువారిలో మొదటివాఁడు, "ని. పురోగాగ్రేసర ప్రష్ఠాగ్రతః సరపురస్సరాః'' అ. అయిన. ఆధరాసురుఁడు - ఆబ్రాహ్మణుఁడు, ఆభూమియందుండెడి రాక్షసుఁడని భావము, ఔరా - ప్రశంసార్థకము, ఉదా "శా.... ఔరాయెంతసౌఖ్యప్రదం, బైకన్పట్టిన దీక్షలంబు'' ఉదా. దైవము - దేవుఁడు, తెచ్చిపెట్టెన్ - నాకుసంప్రాప్తింపునట్లుచేసెను, అ చున్ - ఇట్లుతలంచుచు, సామోదచిత్తాబ్జుఁడై - సామోద - సంతోషముతోఁగూడిన, చిత్త + అబ్జుఁడు - పద్మమువంటి మనస్సుగలవాఁడు, ఐ - అయి, చేరన్ పోయి - తనయొక్క భార్యను సమీపించి. ముసుంగున్ + తీసి - ఆమెకప్పుకొనిన ముసుఁగును తొలఁగించి, కడువైచిత్ర్యంబు - తెస్సైన విచిత్రస్వభావము, మీఱన్ - అతిశయించఁగా, కాంతన్ - ఆశతో, ఆరామామణిసొమ్మున్ - ఆభార్యయొక్క నగలను, నల్లపూస + ఆదిగా - నల్లపూసలుమొదలుగా - నల్లపూసలతో సహితముగాననుట, ఇచట 'నల్లపూసాదిగా' ననుటకుదా "వ. నిజపురోహితుండయిన ధౌమ్యుండాదిగా ననేకవిద్వన్మహీసుర నివహంబుతో'' భార. నాఁచుకొని - అపహరించి, ఉదా. "శా. ఫల్గునుఁడేఁదఱుమీఱితి సైంధవ, ప్రాణమునాఁచికోలు నర ♦ పాల తలంపఁగ మర్త్యకృత్యమే'' భార. వేశ్యావాటికిన్ - బోగమురాండ్రుండెడి యిండ్లవరుసకు, ఏగెన్ - పోయెను, ఈపద్యమునఁ బ్రథమపాదమున స్వరప్రధానయతి చెప్పఁబడినది. 'దురాచారాగ్రేసరుఁడాధరాసురుఁడు' అనుశబ్దమునందలి భూనిశాచరార్థమున శ్లేషాలంకా

రమును, 'చిత్తాబ్జుఁడు' ఉపమాలంకారమును, 'మీఱఁగ దురాచార - అగ్రేసరుఁడాధరాసురుఁడు' అనుప్రాసాలంకారమును.

తా॥ ఓరాజా! దుష్పథచారి యగు నా నిరంకుశుఁడు తనలో నా హా భగవానుఁ డీదినమున నాకు ధనసహాయ మొనర్చె ననిసంతసించుచుఁ దనభార్యచెంతకేగి యాయిందుముఖి కట్టుకొని యున్న వస్త్రమును తొలఁగించి మెడలో నున్న సొమ్ములను నల్లపూసలతోఁగూడ నపహరించి వెలయాండ్రయింట్లవరుస కరిగెను.

## —: ప్రాతస్సంధ్యాకాలవర్ణనము :—

శా॥ నీడాంతంబులనుండి పక్షులు మెడల్ ♦ నిక్కించి నల్దిక్కులన్
జూడన్ దుమ్మెదగాణ పాడఁ దెలిమిం ♦ చుం గూడ నబ్జేక్షణల్
మేడన్ నిద్దురమంపు వీడఁ గమనుల్ ♦ మీనాంకుతోఁ గూడఁ గ్రీ
డాలంబమ్ములు వీడనాడఁ దమితో ♦ డం దెల్లవారెన్ నృపా. 107.

అ॥ నృపా - ఓరాజా, పక్షులు - పిట్టలు. నీడ + అంతంబులన్ - గూండ్లయొక్క చివరలను, "ని. కులాయోనీడమస్త్రియాం" అ.వృ్య. : నీయతేత్తృణాదికమత్రేతినీడం. తృణాదులు దీని యందుంచఁబడును. ఉండి మెడల్ నిక్కించి - అట్టులనుజాచి, నల్దిక్కులన్ - నాలుగుదిశలను, చూడన్ - చూచుచుండఁగా. తుమ్మెదగాణ - తుమ్మెదయనుగానముచేసెడి స్త్రీ-తుమ్మెదయను పాటకత్తె, పాడన్ - సంగీతమునుబాడఁగా, తెలిమించున్ - తెలుపుయొక్క యధికమును, కూడన్ - కలియఁగా, అబ్జేక్షణల్ - కమలములవంటి కన్నులుంగల స్త్రీలు, మేడన్ - హర్మ్యము నందు, ఇచట 'మేడ' దేశ్యము "నూ వ్యతిరిక్తాస్సంప్రదాయతో వేద్యాః" నన్న. నిద్దురమంపు వీడన్ - నిద్రయొక్క మత్తు వదలిపోఁగానే, కమనుల్ - ఇచ్ఛగలవాండ్రు-అనఁగాఁ గాముకులనాట. "ని. కమనః కాముకే కామే" విశ్వ. మీనాంకుతోన్ - మన్మథునితో, కూడన్ - కలియఁగా, అనఁగా వలపు కాండ్రు కనిపింపకపోఁగాననుట, క్రీడాలంబమ్ములు - రతికేళియొక్క పట్లు, వీడనాడన్ - విడిపోఁగొట్టఁగా, తమితోడన్ - మోహముతో, తెల్లవారెన్ - ప్రభాతకాల మయ్యెను, అనఁగా నుదయమయ్యెననుట. ఈపద్యముయొక్క నాలుగవపాదమున నభేదప్రాసము చెప్పఁబడినందులకు "గీ. పెద్దలాకును దనకు న ♦ భేద మగుట, ళళలకు నభేదమట్లను ♦ గలుగు కతన, క్షితిని మూఁడవసరళంబు ♦ యతులఁ బ్రాస, ములను లఘ్వలఘుల కార ♦ ములకునిలుచు" అప్ప. "డలయో ర్లడయో స్తద్వ ల్లళయోశ్శసయోరపి, వబయో ర్నణయో శ్చాంతే సవిసర్గా విసర్గయోః సబిందుకాబిందుకయోః స్యాదభేదేనకల్పనమ్" భోజ. ఉదా. "తోటకము. తాలిమిఁదూలిన • తాపస పత్నుల్, క్రీడవనంబున • కీడ్కొగిజాలన్" కూర్మపు. "చ. చిలుకలుఁగూయునో చెవులు • సిల్లులుఁవోవఁగ నంచు నెన్నఁడు, న్వెడలఁడు నందనోపవన • వీథులకై" శృం. నై. 'చూడన్-పాడన్-వీడన్-కూడన్-ఆడన్-తోడన్' ఇట్లు చెప్పుటచేత నంత్యానుప్రాసాలంకారమును, స్వభావోక్త్యలంకారమును. 'తుమ్మెదగాణపాడ' ఇచటరూపకాలంకారమును, 'కమనుల్ మీనాంకుతోఁగూడ' ఉపమాలంకారము. "తమన్యే వ్యనుబధ్నాతి తచ్ఛీలం తన్నిషేధతి, తస్యైవానుకరో తీతి శబ్దాః సాదృశ్య వాచకాః, ఉపమాయా మిమే ప్రోక్తాః కవీనాం బుద్ధిసౌఖ్యదాః" కావ్యాద. బిల్హణకవియు నిట్లె వర్ణించియున్నాఁడు. ఇది శైలికిమాత్రమే యుదహరింపఁబడుచున్నది.

"స్వైరం కైరవకోరకాన్ విదళయన్ యూనాం మనః ఖేలయన్,
అంభోజాని నిమీలయన్ మృగదృశాం మానం సమున్మూలయన్
జ్యోత్స్నాం కందళయన్ దిశో ధవళయ న్నంభోధి ముద్వేలయన్,
కోకా నాకులయన్ తమఃకబళయ న్నిందు స్సముజ్జృంభతే" సం. బిల్హ.

తా॥ ఓ రాజా! పక్షులు గూండ్లనుండి మెడలనుజాచి నాలుగువైపులఁ జూచుచున్నవి. తుమ్మెదలు గానముచేయుచున్నవి. దిశలెల్లను దెల్లవడినవి. మేడలయందు శయనించిన కామినులకు నిద్రమత్తువీడుచున్నది. ప్రియురాండ్రయొక్కయుఁ బ్రియులయొక్కయుఁ గలయికపట్లు విడిపోయినవి. కాముకులప్పుడే స్వస్థానములకుఁ జేరిరి. కాంతలకు మోహముండియు నింతలోనే తెల్లవారినదిగదా!

క. తమి తీఱె రమణరమణుల, తమతీఱెన్ సాంధ్యరాగ ♦ ధారాళరుచుల్
గమికూడె రథాంగవిహం, గమి గూడెం బ్రాణనాథు ♦ గాఢప్రేమన్. 109.

అ॥ తమితీఱెన్ చీఁకటి పోయెను, వ్యు. "తామ్యంతి విరహిణః అత్రేతి తమీ" రమణరమణులతమితీఱెన్ – కాముకులయొక్కయు కామినులయొక్కయు మోహము పూర్తియయ్యెను, సాంధ్యరాగధారాళరుచుల్ – సంధ్యాకాలపు టెఱ్ఱని కాంతియొక్క యడ్డపాటులేని కాంతులు, గమిగూడెన్ – గుంపుగాఁ గలిసెను, ప్రాణనాథుగాఢప్రేమన్ – పతియొక్క యధికమయిన స్నేహముచేత, రథాంగవిహంగమి – ఆఁడుచక్రవాకపక్షి, కూడెన్ – పతితోఁ గలిసెను, "తెల్లవారగనే రాత్రియొక్కయు జారిణీజారులయొక్కయుఁ దమి నశించెను; చక్రవాకపక్షులును సంధ్యాకాలపు టరుణకాంతులునుగూడెను" యిది తుల్యయోగితాలంకారము. "వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా, సంకుచన్తి సరోజాని స్వైరిణీవదనాని చ" కువ. "నియతానాం సకృద్ధర్మః సా పునస్తుల్యయోగితా" కా, ప్ర. 'తమితీఱె రమణరమణుల తమితీఱె – గమిగూడె రథాంగవిహంగమి గూడె' పదయమకాలంకారమును.

తా॥ చీఁకటియంతయు నశించెను. సతిపతుల మోహమడంగెను. అరుణోదయపు కాంతి యెల్లెడనిండెను. జక్కవలు జతగూడెను.

— సూర్యోదయవర్ణనము —

సీ॥ బటువుగా నాకాశ ♦ బౌద్ధచూడామణి, పెట్టినకుంకుమ ♦ బొట్టనంగ
సమయవర్తకసురే ♦ శ్వరదిశావిపణిలం, బిత మైనలత్తుక ♦ బిళ్ళ యనఁగ
నఖిలజగత్ప్రాణి ♦ హారణకాంక్షఁ బురారి, కెంగేలఁ బట్టిన ♦ కేడె మనఁగ
బహువిహంగమకులా ♦ స్పదవిష్ణుపదవట, ప్రథమదిక్శాఖాగ్ర ♦ ఫల మనంగ
తే॥ వాసవాశాధరాధర ♦ వ్యాసమహాని, వల్లభుఁడు 'నదైవం కేశ ♦ వాత్పరం, బ
టంచునెత్తినహస్తారు ♦ ణాబ్జమనఁగ, భానుఁ డుదయించె దేదీప్య ♦ మానుఁడగుచు 109

అ॥ ఆకాశబౌద్ధచూడామణి. ఆకాశ – అంతరిక్షమనెడి, బౌద్ధచూడామణి – బుద్ధునిచేఁ గల్పింపఁబడిన మతస్థులలో శ్రేష్ఠుఁడయినవాఁడు, బటువుగాన్ – గుండ్రముగాను పెద్దదిగాను, పెట్టినకుంకుమబొట్టు – మొగమునందుఁ బెట్టుకొనిన యెఱ్ఱనికుంకుమబొట్టు, అనంగన్ – అనునట్లుగాను, సమయ......బితము, సమయ – కాలమనెడి. వర్తక – వర్తకము చేయువానియొక్క,

బేరముచేసెడివానియొక్క, సురేశ్వరదిశావిపణి - తూర్పుదిక్కనెడిఅంగళ్ళవీధియందు, లంబితము - వ్రేలాడఁగట్టినది. నవలత్తుకబిళ్ళ - అయినట్టి లక్కతోఁ గుండ్రముగాఁ జేయఁబడిన యొకవస్తువు, అనఁగ౯ - అనుకొనునట్లుగాను, పురారి - దానవులయొక్కమూఁడుపట్టణములను నాశనముచేసిన శివుడు. అఖిల......కాంక్ష౯. అఖిల - సమస్తమయిన, జగత్ - లోకములయొక్క; ప్రాణ హరణ - ప్రాణములను నాశమొనర్చుటయందు, కాంక్ష౯ - కోరికతో, కెంగేల౯ - ఎఱ్ఱనికాంతి గల తనయొక్కచేతితో, పట్టినకేడెము - ధరించినడాలువాలు, అనఁగ౯ - అనితలంచునట్లును, బహు......ఫలము. బహు - అనేకమయిన. విహంగమ - పక్షులయొక్క, అనేకములయిన ఖేచ రులయొక్కయని భావము. కుల - సముదాయమునకు, ఆస్పద - స్థానమయిన, విష్ణుపద - ఆకాశ మనెడి, వట - మఱ్ఱిచెట్టుయొక్క, 'ని. వియద్విష్ణుపదం వాతు పుంస్యాకాశవిహాయసీ' అ. ప్రథమ దిక్ - తూర్పుదిశయందుండెడి, శాఖ - కొమ్మయొక్క, అగ్ర - చివరనున్న, ఫలము - పండు అనంగ౯ - అనియూహించునట్లును, వాస......భుఁడు. వాసవాశా - తూర్పుదిశయందలి, ధరా ధర - పర్వతమనెడి, వ్యాస - వ్యాసుఁడనుపేరుగల, మౌనివల్లభుఁడు - మహర్షులలో శ్రేష్ఠుఁడైన వాఁడు, 'నదైవంకేశవాత్పరం' విష్ణువుకంటె నితరమయినదేవుఁడులేఁడు, అటంచు౯ - అనిచెప్పుచు, ఎత్తినహస్తారుణాబ్జము - మీఁదికెత్తిన యెఱ్ఱదామరవంటి చేయియో, అనఁగ౯ - అనునట్లును, ఇచట వ్యాసమహర్షి కాశీక్షేత్రముననిలిచి విష్ణువుకంటె భగవంతుఁడింకొకఁడులేఁడని తనకుడిచేతిని పైకెత్తఁగా భృంగీశ్వరుఁ డాహస్తమును స్తంభింపఁజేసినందున నాచేయిక్రిందికిరాక యట్లేయుండఁగా శివస్తుతియొనర్చినంత నాహస్త మెప్పటివలెవచ్చెనని కొన్నిపురాణములయందుఁ జెప్పఁబడియున్నది. "శా. కాశి౯ వ్యాసుఁడు చంద్రశేఖరుని ధి ♦ క్కారించి విష్ణుండ లో, కేశుండంచు వచింపఁగా నతని యాక్షేపంబువారించియు౯, గ్లేశంబొప్ప భుజద్వయిన్నిలిపి శి ♦ క్షింప౯ మదింబూనునం, దీశుం డిచ్చు సమస్తకామ్యములు" చిరి. వ్యాసునిహస్తముతోఁ బోల్చుటకుఁదా "వహ్నిస్ఫులింగ ఇవ భాసుర యంచకాస్తి" వా,సూ. చెన్నపురప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున వ్యాసభుజస్తంభము అని యొకగ్రంథమేకలదు. తత్కర్త రొబ్బి వీరభద్రకవి. భానుఁడు - సూర్యుడు। దేదీప్యమానుఁడు- మిక్కిలిప్రకాశించుచున్నవాఁడు, అగుచు౯ - అయి, ఉదయించె౯ - పుట్టెను, అనఁగాఁ బొద్దు పొడిచెననుట, ఇచట వ్యాసునిహస్తము స్తంభింపఁబడినట్లె సూర్యుఁడాకాశమునను౦డెనని యుప మానము గ్రహింపవలయును. ఈపద్య మంత్యానుప్రాసముతోఁ జెప్పఁబడినది. ఆకాశబౌద్ధ చూడామణి, ఇత్యాదులు రూపకాలంకారమును, 'కుంకుమబొట్టనంగ' ఇత్యాదు లుత్ప్రేక్షాలంకా రమును అగుటచే అంగాంగిభావసంకరము. "క. అసిజిహ్వోభయదంబై, యసమమహాబల విశేష♦ హారియునై యి, వ్వసుధభవమ్భుజదండము, పొసఁగున్ ఫణిమాడ్కి నోబ♦భూవరునరసా" కా. సం. "అవిశ్రాంతిజుషామాత్మ న్యంగాంగిత్వంతుసంకరః" కా. ప్ర.

తా॥ ఆకాశమనెడి బౌద్ధసన్యాసి తనముఖమునందు గొప్పగాఁబెట్టుకొనిన కుంకుమబొట్టును నట్లును, కాలమనెడివర్తకుడు తూర్పుదిక్కనెడి దుకాణమునందు వ్రేలఁగట్టిన లక్కబిళ్ళయో యనునట్లును, ఈశ్వరుఁడు చతుర్దశభువనములను నాశమొనర్పఁబూని తనచేతఁబట్టుకొనిన డాలు వలెను, ఆకసమనెడిమఱ్ఱిచెట్టుయొక్క తూర్పుకొమ్మచివర నున్నఫలమోయనఁగను, ఉదయపర్వత మనెడి వ్యాసమహర్షి 'నదైవంకేశవాత్పర' మని యెత్తినకుడిహస్తమో యనఁగను, సూర్యుఁడు మిక్కిలి ప్రకాశముతో నుదయించెను.

వ॥ ఇట్లు సూర్యోదయం బయ్యె నంతకు మున్న యన్నామమాత్రబ్రాహ్మణ కలాప కోకిలాలాప దురాపస్వాపసమాప సమయసమాలోకితాశేషభూషా విశేష వర్జితప్రతీకుఁడై సొమ్ముపోవుటకు నొకింత చింతలేక యతనివివేకహీనతకు దుఃఖింపుచుండె నిట నతండును బ్రకటితవిటఘూటహాటకసంఘాట సముచ్చాటన నిరాఘాటంబైన వేశవాటంబు చేరి యందుఁ బ్రకల్పితమోహం బగుచంపకగంధి గేహంబు చొరంబడిపోవు సమయంబున. 110.

అ॥ ఇట్లు - ఈవిధముగా, సూర్యోదయంబు + అయ్యెన్ - ప్రొద్దువొడిచెను, అంతకుమున్న - ఆవేళకుముందుగానే, అన్నామ. . . . . . . . ప్రతీకుఁడై. అన్నామమాత్ర - ఆయొక్క పేరునకు మాత్రము, బ్రాహ్మణ - విప్రుఁడుగా, కలాప - భూషణమయిన, కోకిల + ఆలాప - కోయిలవంటి నిండుగాఁగలమాటలచేత, దురాప + స్వాప - పొందఁగూడనినిద్రయొక్క, సమాపసమయ - కడపటికాలమున, సమాలోకిత - చూడఁబడిన, అశేష - సమస్తమయిన, భూషావిశేష - ఆభరణములయొక్క భేదములను, అనఁగా ననేకవిధములగు సొమ్ములననుట, వర్జిత + ప్రతీకుఁడై - విడువఁబడిన యవయవములుగలవాఁడై, సొమ్ము + పోవుటకును - తనమేనఁగల నగలన్నియుఁ బోయినందులకు, ఒకింత - కొంచెమయినను, చింతలేక - విచారపడక, అతనివివేకహీనతకున్ - ఆపెనిమిటిదయిన తెలివితక్కువకుగూర్చి, దుఃఖింపుచుండెన్ - ఏడ్చుచుండెను. ఇటన్ - ఇక్కడ, అతండును - ఆనిరంకుశుఁడును, ప్రకటిత . . . . . ఘాటంబు; ప్రకటిత - ప్రసిద్ధికెక్కిన, విటఘూట - వలపుకాండ్రసముదాయముయొక్క, 'ని. ఘూటము-సమూహము' శ. చం. హాటక - బంగారమనెడి, సంఘాట - అరణ్యమును, 'ని. ఘాటోనికుంజే కాంతారే' విశ్వ. సముచ్చాటన - వేళ్ళతోఁ బెఱుకుటయందు, నిరాఘాటంబు - అడ్డులేనిది, ఐనవేశవాటంబు - అయినట్టివేశ్యావాటిక, 'ని. వేశో వేశ్యాజనసమాశ్రయః' అ. చేరి - పొంది, అందున్ - ఆయిండ్లవరుసలో, ప్రకల్పితమోహంబు - కల్పింపఁబడినమరులుగలది, అగుచంపకగంధిగేహంబు - అయినట్టిచంపకగంధియొక్క యిల్లు, చొరఁబడి - ప్రవేశించి, పోవుసమయంబునన్ - పోవుచున్నకాలమున, ; ఇందు 'కలాప కోకిలాలాప దురాప స్వాప సమాప-ప్రకటిత విట ఘూట హాటక సంఘాట సముచ్చాటన నిరాఘాటంబు' ఇవి వృత్త్యనుప్రాసాలంకారము. 'అశేషభూషావిశేష-నిరాఘాటంబైన వేశవాటంబు-మోహం బగు చంపకగంధిగేహంబు' ఇత్యాదు లనుప్రాసాలంకారము. 'హాటక సంఘాట సముచ్చాటన' మనుటచేత నిరవయవరూపకాలంకారము. 'నిరంగం కేవలం శుద్ధం' కా. ప్ర. 'క. అవయవమాత్రంబుననే, కవినుతి విశ్రాంతమైనఁ గననిరవయవం, బవనినిది కేవలంబును, ద్వివిధత మాలికయు నయ్యె' సరస.

తా॥ ఈవిధముగా ప్రొద్దువొడిచెను. అంతకుఁబూర్వముననే బ్రాహ్మణుఁడను పేరుతో మాత్రము సంచరించుచున్న యానిరంకుశుని వ్యతిరేకప్రసంగములచేతఁ గష్టముగ నిద్రించి మేలుకాంచినవెంటనే తనమేనఁగల నగలన్నియు సంగ్రహించినట్లు గ్రహించి యాయందుల కించుకయైనను విచారపడక యాతని వివేకశూన్యతకు మిగుల విలపించుచుండెను. ఇచట నిరంకుశుఁడు మిండలధనమునంతయు వెుదలంటఁ గొల్లగించుటయందు ముందంజగల అంజలవీధి కేతెంచి యం దుంపుడుకత్తె యగు చంపకగంధి యింటం జొచ్చెన.

—: నిరంకుశుఁడు వేశ్యను జేరఁబోవుట :—

ఉ॥ నిద్దుర మేలుకాంచి రమణీయతఁ ♦ బూర్ణసుధామరీచికిం
బెద్దతికంబు దెచ్చు తన ♦ మెచ్చులమోము నిషేచనక్రియం
దద్దయు గారవించి ప్రమ ♦ దంబున నద్దముఁ జూచి నామముం
దిద్దుచు నున్నయున్నమిత ♦ దీప్రకుచం గని చేరఁబోవఁగన్. **111.**

అ॥ నిద్దురన్-నిద్రనుండి, మేలుకాంచి-మేలుకొనినదై, రమణీయతన్-ఒప్పిదముచేత, పూర్ణసుధామరీచికిన్ - అమృతకిరణములుగలవాఁడయిన నిండుచందురునకు, పెద్దతికంబున్ - వృద్ధత్వమును, ముసలితనమును, తెచ్చు తన మెచ్చులమోము - తేఁగలిగినటువంటి తనయొక్క మనోహరమయిన ముఖమును, నిషేచనక్రియన్-నీళ్ళతోఁగడుగుటచేత, తద్దయున్-అత్యంతముగా, గారవించి-గొప్పతనముగలుగునట్లుచేసి, ప్రమదంబునన్-సంతోషముతో, 'ని. ముత్ప్రీతిః ప్రమదో హర్షః ప్రమోదామోదసమ్మదాః' అ. అద్దమున్-దర్పణమును, చూచి-వీక్షించి, నామమున్-బొట్టును, దిద్దుచున్-చక్కఁగా సవరించుకొనుచు, ఉన్న + ఉన్నమితదీప్రకుచన్ - ఉండినటువంటి ఉన్నతస్తనములతో నొప్పుచున్నదానిని, కని-చూచి, చేరన్ + పోవఁగన్-సమీపించఁబోగా, ఈపద్యమున 'నిద్దుర' అను ప్రయోగమునకు 'సూ. తద్భవేసంస్కృతీయేస్య, రాదేశాద్యాస్తదన్యతః, స్యాద్వర్ణస్యవ్యత్యయశ్చ. క్వచిత్ కవిసమ్మతః'' అధ. ఉదా. ''ఉ. నిద్దురమేలుకొమ్మురజనీకరవంశవతంస'' శృం. నై. 'చ. ఏమి చెప్పనిద్దురవ నమున్నగాఁ దెలిసి' రా. పాం. 'పెద్దతికము' అనుటకు 'సూ. అన్యేచ బహవోదేశ్య, వర్ణకా అర్థభేదకాః, క్వచిదంత్యస్యలోపస్స్యాత్. క్వచిద్వర్ణాగమోమతః'' అధ. 'పూర్ణసుధామరీచికిం బెద్దతికంబుఁదెచ్చు తనమెచ్చులమోము' అనుటచే నుపమాలంకారమని దండిమతము. ''స్పర్ధతేజయతిద్వేష్టి. ద్రుహ్యతిప్రతిగర్జతి, అక్రోశత్యవజానాతి. కదర్థయతినిందతి, తస్యచానుకరోతీతి శబ్దాఃసాదృశ్యవాచకాః, ఉపమాయామిమేప్రోక్తాః. కవీనాంబుద్ధిసౌఖ్యదాః'' కావ్యాద. ఇచట నుపమాలంకారమయిన చంద్రునికంటె ముఖము నతిశయకాంతిగలదానినిగా వర్ణించుటచే అసంబంధసంబంధాతిశయోక్త్యలంకారము. ''నిగీర్యాధ్యవసానంతు ప్రకృతస్యపరేణయత్, ప్రస్తుతస్యయదన్యత్వం, యద్యర్థోక్తౌచకల్పనమ్, కార్యకారణయోర్యశ్చ పౌర్వాపర్యవిపర్యయః, విజ్ఞేయాతిశయోక్తిఃసా'' కా. ప్ర. ఉదా. ''రాకాయామకలంకంచేద్, అమృతాంశోర్భవేద్వపుః, తస్యాముఖంతదాసామ్యపరాభవమవాప్నుయాత్'' రుద్ర. కొందరు దీనినే విరోధాలంకారముగ నిర్ణయించిరి. ''ఉపమానాద్యదన్యస్య. వ్యతిరేకస్సఏవసః, హేత్వోరుక్తావనుక్తీనాం. త్రయేసామ్యేనివేదితే, శబ్దార్థాభ్యామథాక్షిప్తే, శ్లిష్టేతద్వత్త్రిరష్టసః'' కా. ప్ర. ఉదా. 'ఇయం సునయనా దాసీకృతతామరసాశ్రియా, ఆననేనాకలంకేన. నిందతీందుం కలంకినమ్'' ఉద్భ. అభరణాదుల నేమియుఁ జెప్పక ప్రత్యేకముఖవర్ణనమే చెప్పఁబడుటచేత నిందు మాధుర్యచేష్ట వర్ణింపఁబడియున్నది, ''అభూషణేఽపి రమ్యత్వం. మాధుర్యమితి కథ్యతే'' ప్రతా,

తా॥ నిద్రలేచి పున్నమనాఁటిచంద్రునిఁ దిరస్కరించునట్టి తనముఖమును గడిగికొని యద్దముఁ జూచుచుఁ దిలకమును దిద్దుకొనుచున్న యాగబ్బిగుబ్బలాడిని గాంచి డాయంబోఁగా.

—: వేశ్యప్రశ్నించుట :—

మత్త॥ మత్తకోకిలనాద విప్రకు ♦ మారమన్మథుతోడ వే
షోత్తరంబుగ నిట్లు పల్కె స ♦ ముజ్జ్వలస్థితి నోరి నన్
జిత్తజాశుగపాళిపాలుగఁ ♦ జేసి యన్యవిలాసినిన్
దత్తరంబుగఁ బోయికూడితి ♦ దాని కేమని పల్కెదన్. 112.

అ॥ మత్తకోకిలనాద-మదించినకోయిలవంటి కంఠధ్వనిగలదయిన యావేశ్య. ఇచట. కోయిల ధ్వనినిగూర్చి 'మయూరచాతకచ్ఛాగ, క్రౌంచకోకిలదర్దురాః, గజశ్చసప్తషడ్జాదీన్. క్రమాదుచ్చారయంత్యమీ'' ''పికఃకూజతిపంచమమ్'' సం. ర ''పంచమలయాగీతిః'' సం. బిల్హ. విప్రకుమారమన్మథుతోడన్-మన్మథునివంటిచక్కనివాఁడయిన యాబ్రాహ్మణసుతునితో, వేషోత్తరఁబుగన్-వస్త్రభూషణాద్యలంకారములయొక్క యతిశయముతో, సముజ్జ్వలస్థితిన్-మిక్కిలిప్రకాశించుచున్నట్టి యునికిచేత, ఇట్లు-ఈవిధముగా, చెప్పఁబోవువిధముగా, పల్కెన్-వచించెను, ఓరి శృంగారావేశమువనుండి స్నేహముతోఁబిలుచుట. 'సూ. ఓరియోసిమైత్రియందుఁగలవు' బా. వ్యా. అథర్వణాచార్యులును 'సూ, నీచతాయాంరిసీస్యాతాం క్వచిన్మైత్ర్యాంచ తచ్ఛ్రితిః' అని వచించియుండెను. నన్-నన్ను, చిత్తజాశుగపాళిపాలుగన్. చిత్తజ-మన్మథునిదైన, ఆశుగ-బాణములయొక్క, పాళి-వరుసలకు, పాలుగన్-వశమగునట్లుగా, లోఁబడునట్లుగా, చేసి-కలిగించి, అన్యవిలాసినిన్-మఱియొక శృంగారనాయికను, తత్తరంబుగన్-త్వరితముగా, ఇది తద్రాశబ్దభవమని కొందఱందురుగాని తరశ్శబ్దభవము ఇచటఁ గొందఱు శకటరేఫమగునందురు కాని, తత్తఱము తత్తరము ఈ రెండురూపములునుగలవు. 'సూ. యథాశాస్త్రం యథాశక్తి, యథాశ్రోత్రానురంజనం. యథాప్రసిద్ధిసర్వత్ర శబ్దానాంకల్పనామతా'' అథ. పోయి-వెళ్ళి, కూడితి-సంగమముచేసితిని, దానికిన్ - ఆనేరమునకు ఏమని-ఏమిసమాధానముచెప్పెదనో, ఇచట 'ఏమని' అని సంధిచేయుటకు 'సూ. ప్రాయస్తుస్యాత్క్వామాదికస్యేతః' నన్న. పల్కెఁకన్-ఇఁకఁజెప్పుము. ఈపద్యమున 'పల్కెఁకన్, అను ప్రయోగమునకు 'సూ. ప్రార్థనార్థేమురేకత్వే, కథ్యతేమధ్యమార్థకః, విభాషాంతంవనంత్యేకేవప్రాణేతుకదాచన' అని యథర్వణాచార్యులు వచించియుండినను 'సూ. మధ్యమపురుషమువర్ణంబున కచ్చుపరంబగునపుడును గొన్నియెడల లోపంబు చూపట్టెడి' ప్రౌ. వ్యా. ఉదా. ''అడిదెనీదుపంచెము'' కళా. 'భవచ్ఛిత్తేప్సితంబెద్దిచెప్పనినన్' మార్కం. కవిమత్తకోకిలయను శబ్దమును సార్థకముచేయుచు మత్తకోకిలా వృత్తమును జెప్పినాఁడు. ఇందు వేశ్యప్రౌఢగావుననే నిర్భయముగా సంభాషింపఁగలిగినది. ''ఉదయద్యౌవనాముగ్ధా,లజ్జావిజితమన్మథా,లజ్జామన్మథమధ్యస్థా.మధ్యమోదితయౌవనా,స్మరమందీకృతవ్రీడా. ప్రౌఢాసంపూర్ణయౌవనా'' మఱియు ఖండితనాయికగా వర్ణింపఁబడినది. ''నీత్వాన్యత్రనిశాం ప్రాత రాగతేప్రాణవల్లభే, అన్యాసంభోగచిహ్నైస్తు కుపితాఖండితామతా'' ప్రతా. మఱియు ''జ్ఞాతేఽన్యాసంగవికృతే. ఖండితేర్ష్యాకషాయితా'' దశ. ''సీ. విభుఁడన్యసతిఁజెంది ♦ వేకువ రాఁగుంద, నబలఖండిత''మధ్యధీర గావర్ణింపఁబడినది. ''తే. తప్పుగలభర్తమోలసో♦త్ప్రాసఫణితిఁ, గేరడములాడు సతిమధ్య♦ధీర'' ఉదా. ''మోమునఘర్మశీకరస ♦ మూహముగానఁగనయ్యెనిప్పుడా, కామవిహారకేళిని భ♦రంపడిసాఁడవొనన్నుఁబాసియా, రేమదనాస్త్రఘాతముల ♦ వేఁగితొనీయురమెల్లఁదద్వ్రణ, స్తోమము సోఁకియున్నయది♦నొప్పడఁగాంత యొఱుంగఁజెప్పుమా'' కా. స.

తా॥ కోయిలవంటికంఠస్వరముతో వినసొంపయినపలుకులుగల యాచంపకగంధి యందగాఁడగునిరంకుశునితో నోయీ! ఈరేయి నన్ను మరులుకొలిపి యింకొకవిటకత్తెదాపుచేరి దానిం గలసి వచ్చితివి. అందుల కిపు డేమిసమాధాన మిచ్చెదవు?

—: నిరంకుశుఁ డాపెతో నారాత్రికథ చెప్పుట :—

క॥ ఆమాట వివిధమాయా, స్తోమపుఁబలుమాట గాఁగఁ ♦ జూడక వాఁ డా
యామద్వయపరివర్తన, కోమలి కెఱిఁగించెఁ బూస ♦ గుచ్చినరీతిన్. 113.

అ॥ వాఁడు-ఆనిరంకుశుఁడనెడి బ్రాహ్మణుఁడు, ఆమాట - ఆచంపకగంధియొక్క పలుకు, వివిధ-మాట, వివిధ-నానావిధములయిన, మాయ-కపటముయొక్క, స్తోమపుఁబలుమాట - సమూహముతోఁగూడిన యధికమయినబరువు, కాఁగన్ - అయియుండఁగా, చూడక - అందలియర్థమును దెలిసికొనక, కోమలికిన్-ఆభోగముదానికి, ఆయామద్వయప్రవర్తన - గతించినరాత్రియందలి రెండుజాములలో జరిగిన యావృత్తాంతమంతయును, పూసగ్రుచ్చినరీతిన్-దారమున వరుసగాఁబూసలుగ్రుచ్చినట్లెగుడుదిగుడులేకుండ, సక్రమముగాననుట. ఎఱిఁగించెన్ తెలియఁజేసెను, చెప్పెను, 'ఆవేశ్యయొక్క కపటవాక్యములను దెలిసికొనలేకపోయెననుటకు 'భోగదూర్వాంకురాకాంక్షీ శ్వభ్రపాతమచింతయన్, మనోహారిణకోబ్రహ్మన్, దూరఁవిపరిధావతి' యో. వా. ఇచట నిరంకుశుఁడు తనకుఁదనభార్యకు జరిగినకథయంతయుఁ జెప్పెననుటనుగూర్చి 'అర్థనాశంమనస్తాపం · గృహిణీచరితానిచ, నీచవాక్యంచాపమానం. మతిమాన్నప్రకాశయేత్' చాణ ఇట్లు వచింపఁబడియుండుటచే దుష్ప్రవర్తనులకిట్టి గుణములుండునని దెలియఁదగినది. ఇచటఁబూసగ్రుచ్చినట్లనుటలో నర్థరమణీయముగలదు. ఇట్టి ప్రయోగములను జూచియే కాఁబోలు నాధునికులును బ్రయోగించుచుండిరి. "చ. అని తనకన్న స్వప్నమిసుమంతయుపీడక పూసగ్రుచ్చిన, ట్లనఘుఁడు భార్యకున్ వినిచె' రాజ సం. ఆవేశ్య మాయవలోఁబడినందున రానున్న గతిగానలేకపోయెను. "మాంసలుబ్ధోయథామత్స్య, లోహశంకుంనపశ్యతి, సుఖలుబ్ధస్తథా దేహీయమబాధాంనపశ్యతి" గరు. "అజానంమాహాత్మ్యంపతతు శలభాదీపదహనే. సమీనోఽప్యజ్ఞానాద్బడిశయుతమశ్నాతుపిశితం, విజానంతోప్యేతేవయమిహవిపజ్జాలకుటిలా, న్నముంచామః కామానహహగహనోమోహమహిమా" భర్తృ. మిడుతయజ్ఞానమున నగ్నిలోఁబడి నశించుచున్నది. చేఁపమోసపోయి యెరకైనోరుచాపి చచ్చుచున్నది. అందుకొంత సబబున్నదికాని మానవులు తెలిసియుఁదెలియనివారై దుఃఖభూయిష్టమయిన స్త్రీ సంపర్కమును విడువలేక చిక్కులఁబడుచున్నారు. 'ఆమాట వివిధమాయాస్తోమపుఁబలుమాట, అనుప్రాసాలంకారము. 'కోమలికెఱిఁగించెఁ బూసగ్రుచ్చినరీతిన్, ఉపమాలంకారము.

తా॥ ఆనిరంకుశుఁ డావెలయాలిపలుకులయందలి కపటమును దెలిసికొనలేక గతించిన రాత్రియందు జరిగిన వృత్తాంతమంతయు నామెతో వరుసగాఁ జెప్పెను.

వ॥ అదియు విశ్వసించినదియుం బోలెఁ దదీయవచనంబుల నాకర్ణించి నిరంతరసౌఖ్యాంబుధి నతనిం దేల్చుచుఁ జిత్తంబుఁ దుల్చుచుఁ గొన్నిదినంబులు గడపినంతట 114.

అ॥ అదియున్-ఆవేశ్యయు, తదీయవచనంబులన్-ఆనిరంకుశునియొక్క వాక్యములను, విశ్వసించినదియుంబోలెన్-నమ్మినదానివలె, అతనిన్-ఆవిప్రుని, నిరంతరసౌఖ్యాంబుధిన్ - ఎడతెగని

సుఖమనెడి సముద్రమునందు, తేల్చుచున్-తెప్పవలెఁదేలింపుచు-ఓలలాడించుచు, చిత్తంబున్-మనస్సును, తుల్చుచున్-వేగిరపెట్టుచు, కొన్నిదినంబులు-కొంతకాలము, కడపిన+అంతటన్ - దాఁటిపోవునట్లు చేసినపిమ్మట, ఇచట నిరంతరసౌఖ్యంబునిరతనిందేల్చుచు, నవుటచేత నిరవయవరూపరూపకాలంకారము. "తద్రూపకమభేదోయ ఉపమానోపమేయయోః, అతిసామ్యాదభేదః, 'నిరంగంతుశుద్ధమ్' కా. ప్ర.

తా॥ ఆవెలయాలును వానిమాటలునమ్మినదానివలెనటించి పూర్వమునకన్న మిగులసౌఖ్యము నొడఁగూర్చుచుఁ గొన్నిదినంబులు గతించినతరువాత,

—:o: వేశ్యయొక్క ధనాకర్షణచతురిమ :o:—

సీ॥ దేవాదులకు మ్రొక్కు ♦ తీఱ దాయె నటంచుఁ, జెల్లింపుచును దాని ♦ తల్లికొంత
యేరి కెద్దులుదూఁగ ♦ మేమింక నిడుమంచుఁ, దమకించి దానిసో ♦ దరుఁడు కొంత
యంగడి నేమేమొ ♦ యమ్ముచున్నా రంచుఁ, గంద్రలై దానిచె ♦ ల్లెండ్రు కొంత
యన్న రాదాయెఁగా ♦ వన్నెచీర యటంచు, వావిఁదెల్పుచు దాని ♦ వదినెకొంత
తే॥ యక్కతోడు సుమీ నాకు ♦ ముక్కుకైనఁ, జేసి తెప్పించుమని దాని ♦ దాసికొంత
మెల్లమెల్లనఁ జేతిసొ ♦ మ్మెల్ల నిట్లు, గుల్లగుట్టగఁ దిని తల్ల ♦ డిల్లఁజేయు. 115.

అ॥ దానితల్లి - అభోగముదానియొక్కతల్లి, దేవాదులకున్ - వేల్పులుమొదలయినవారికి, మ్రొక్కు-అపత్కాలమునఁబెట్టినదండము, తీఱదాయెన్-ఇప్పటికిని దీర్చుకొనలేకపోతిమి, అటంచున్-అనిచెప్పుచు, చెల్లింపుచును-ఆమ్రొక్కుబడితీర్చుపనిని జరిగించుచు, కొంత-కొంతధనమును, దానిసోదరుఁడు-ఆవేశ్యకుఁదోడఁబుట్టినవాఁడు, ఏము-మేము, ఇచట 'ఏము' అనుటకు 'సూ. నీమీనేమేహల్లులకులోపంబు విభాషనగు' ప్రౌ. వ్యా. ఇఁకన్-ఇఁకమీఁదట, ఏరికిన్-సర్వావయవములుఁగలవాగలికి అనఁగానన్నిటితోఁగూడినదనుట. ఎద్దులు-ఎడ్లనుగొనుటకు, తూఁగము-తూఁగలేము, ఒకవస్తువును దులయందుఁజ దానితోనింకొకవస్తువును సరిచూచుటకై రెండవవైపున నుంతురు. అదియే తూఁచుట. అధనమును భరించలేమనుటయే తూఁగలేమనుట "సూ. లోకోక్తీనాంభవేద్యోగోయదిస్యాచ్ఛ్రుతిరంజనమ్" అధ. ఉదా. "సీ. అండజాధీశనీయాకారరేఖతోఁ, దులఁదూఁగలేవువస్తువులు జగతి" శృం. నై. ఇడుమంచున్-ఇమ్మనియడుగుచు, తమకించి, త్వరపడి, కొంత - మఱికొంతద్రవ్యమును, దానిచెల్లెండ్రు - అభోగముదానికిఁదరువాతఁబుట్టిన యాఁడువాండ్రు, అంగడిన్ - సరకులమ్మెడు కొట్టులో, ఏమేమొ-ఏవేవోవస్తువులను, అమ్ముచున్నారు-విక్రయించుచున్నారు, అంచున్ - అనిపలుకుచు, గంద్రలై-గడుసుతనముగలవారై, కొంత-ఒకకొంతసొమ్మును, దానివదినె - అయింపుడుకత్తెయొక్కయన్నపెండ్లాము, అన్న-ఓయన్నయ్యా, వన్నెచీర-రంగులకోక, రాదాయెఁగా - రాకపోయెనుగదా, అటంచున్ - ఇట్లుచెప్పుచు, వావిన్ - బంధుత్వపువరుసను, తెల్పుచున్ - తెలియఁజేయుచు, కొంత-కొంతరొక్కమును, దానిదాసి-ఆబిడయొద్ద నూడిగముచేయునది, నాకున్-నాకు, ముక్కుకైనన్-నాసాభరణమయినను, చేసితెప్పించుము - చేయించితెప్పించుము, అక్కతోడుసుమీ-మా అక్కయ్యతోడుసుమా, శపథపూర్వకముగాఁబలుకుట, అని-ఇట్లని, కొంత - కొన్నిరూకలను, మెల్లమెల్లనన్-చల్లచల్లఁగా, చేతిసొమ్మెల్లన్-అతనిచేతఁగలరొక్కమంతయును, ఇట్లు-ఈప్రకారముగా,

గుల్లగుట్టఁగన్ - క్షుద్రశంఖములగుట్టఁగా, అనఁగా ధనమునుగవ్వలగుట్టవలెఁ జులకనగాఁజూచియనుట. గుల్లయనుటకు "ని. క్షుద్రశంఖమునరారు, గుల్లయనఁగ" అం. భా. తిని-మ్రింగివేసి-కర్చుపెట్టి, ధనమునుదృణీకారభావముతో వెచ్చించియనుట, తల్లడిల్లఁజేయన్ - అతని వ్యాకులపడునట్లుచేయఁగా, ఈపద్యమున 'గండ్రలై' అనుటకు "శా. తండ్రీ నాకునను గ్రహింపఁగదె వైదగ్ధ్యంబుచుఁ బ్రార్థించినన్, గండ్రల్గానటులాడి" స్వా. మ. 'చెల్లెండ్రు' అనుటకు 'సూ. నిత్యందారాదేశ్చస్వార్ణలయోరులౌతత్రస్తః' శబ్దచిం. 'తల్లడిల్లఁజేయన్' అనుప్రయోగమునకు సూ, యథాశాస్త్రంయథాశక్తి, యథా శ్రోత్రానురంజనం, యథాప్రసిద్ధిసర్వత్ర, శబ్దానాంకల్పనామతా' అధ. ఇందు సీసపాదములు నాలుగు నంత్యానుప్రాసములుగను, గీతపద్యతృతీయచతుర్థపాదములయందనుప్రాసముగను, జెప్పినాఁడు. ఇచట వేశ్యాకుటుంబములోనివారెల్ల నిరంకుశునిద్రవ్యమంతయుహరించి బాధించిరనుటను గూర్చి "అగ్నిరాపః స్త్రీయోమూర్ఖః, సర్పోరాజకులానిచ, నిత్యంయత్నేనసేవ్యాని, సద్యఃప్రాణహరానిషట్"చాణ. అగ్నియును, జలమును, స్త్రీలును, మూర్ఖుఁడును, సర్పమును, క్షత్రియులును వీరిని బహుజాగ్రతగా సేవించిననేతప్ప శీఘ్రముగా మరణమునుగలిగింతురు. "అత్యాసన్నావినాశాయ, దూరస్థానఫలప్రదాః, సేవ్యంత మధ్యభాగేన, రాజవహ్నిగురుస్త్రియః" చాణ. రాజు, అగ్ని, గురువు, స్త్రీ, యీనలుగురు మిక్కిలి సమీపముననున్నవారిని జంపుదురు. సేవించువారిని బ్రతుకనీయకుండఁ జావనీయకుండ మధ్యస్థితిలోనుంతురు. దూరముగానున్నవారికిఁ బ్రయోజనము గలిగింతురు. 'దాసీమానధనంహంతి, హంతివేశ్యాధనాధికమ్" ఇచట వేశ్యధనమును హరించునదియేకనుక నాబిడసేయు ధనాకర్షణసంబంధమైన వివిధమార్గములను వర్ణించియుండుటచేత స్వభావోక్త్యలంకారము. "స్వభావోక్తిస్తు డింభాదేః స్వక్రియారూపవర్ణనమ్" కా. ప్ర. దీనినిజూచియేకాఁబోలు నొకకవి యిట్లు వ్రాసియున్నాఁడు. "క. పండుగలని గుడిలోపలి, దండుగలని కొండలయ్యదాసుళ్ళంచున్, మిండల మిత్తిమిటారులు, తెండోయని దోచకున్న దినములుగలవే" బహు. చ.

తా॥ దానితల్లియగు వృద్ధవేశ్య దేవుళ్ళమ్రొక్కులుతీర్చుచున్నాననికొంతసబ్బును, బావా! ఎడ్లనుగొనుటకీయఁడుతూఁగలేను పైకమేమియినన్నచో సర్దుమని దానియన్నయును, అంగడిలో నీప్రొద్దు వింతగలవస్తువులఁ జూచితిని వానిఁదేవలయును రొక్కమిమ్మనిదానిచెల్లెండ్రును, అన్నగారూ! రంగుచీరకొనుటకు రూకలనొసఁగుమనిదానివదినెయును, బావగారూ! నాకు ముక్కుబులాకీ చేయించిపెట్టెదవా లేదా! అని యూడిగముచేయునదియును, మెల్లమెల్లఁగా నతనిద్రవ్యమంతయు గవ్వలరాసినివాడినట్లు కొలఁదిదినములలోనే కర్చుపెట్టి యతనిని గలఁతనొందఁజేసిరి.

సీ॥ అత్తవారిచ్చిన ♦ యపరంజిగంటీలు, సంశయింపక వేగఁ ♦ జదువఁబెట్టెఁ
దండ్రి చేయించిన ♦ దర్భాంగుళీయకం, బావృత్తి గాఁగఁ దా ♦ నమ్ముకొనియె
మేనమామ ప్రియంబు ♦ తోనొసంగినపైఁడి, మొలత్రాడుఁ బ్రాతయ ♦ ప్పులకుఁగట్టె
జనని చేయించిన ♦ జాళువాతాయెతుల్, వడ్డిలెక్కకుఁ జిందు ♦ వందుఁజేసెఁ

తే॥ దులసిపోఁగులు మొదలుగాఁ ♦ గలుఁగువెట్టె, చిక్కుబాకీలు పిదపని ♦ శ్శేషపఱచెఁ
బ్రతిదినము దానిసంసార ♦ బాధలెల్ల, నెత్తుకెత్తుగఁగడపె ♦ దుర్వృత్తి నతఁడు.

అ॥ అతఁడు - అనిరంకుశుఁడు, దుర్వృత్తిన్ - చెడునడతచేత, అత్తవారు - తనయత్తమామలు, ఇచ్చిన + అపరంజిగంటీలు - ఒసంగిన శ్రేష్ఠమయినసువర్ణ హస్తాభరణములు, ఇదివేశ్య

శబ్దము. ఈశబ్దమునకుఁ జాలనిఘంటువులు పోఁగులని యర్థముచెప్పుచున్నవి. కాని కవిమురుగులనియే చెప్పినాఁడు. ఈపదము పోఁగులకేయర్థమైయుండినచో నెత్తుగీతియందు "మురుగులపోఁగులుమొదలుగాఁ గలుఁగుపెట్టి" యనఁడు. ఆంధ్రవాచస్పత్యమనునొకము గంటీలు—దే.వి కర్ణవేష్టనము చూ. భూషణము. అనియేయున్నది. ఇందను శబ్దమే ధ్వనించడినఁగాని తదర్థము ధ్వనింపడలేదు. పశ్చిమదేశమున నీ శబ్దముచ్చటచ్చట వినియున్నాను. సంశయింపక — సందేహపడక, వేగన్ — శీఘ్రముగా, చదువఁ బెట్టెన్ — ఇచ్చివేసెను, చదువఁబెట్టుటయనఁగా శుభకార్యములయందు బంధువులులోనగువారు బహుమానముగానొసంగెడు వస్త్రాదులను దమపేరును బుచ్చుకొనువారి కగుమట్టరికమును తెలియునట్లు పురోహితునివలన మంత్రపూర్వకముగాఁ జెప్పించియిచ్చుట. ఇదికొన్నిచోట్ల నాచారమైయున్నది కనుక నావిధముగా నిచ్చెనని పరిహాసపూర్వకముగాఁ బలుకుట. తండ్రి — తనయొక్క జనకుఁడు, చేయించినదర్భాంగుళీయకంబు — చేయించిపెట్టిన దర్భముడిగల బంగారపుటుంగరమును, తాను — తనంతటతానే, అవృత్తి + కాఁగన్ — ఒకతడవయయిపోయి, రెండవతడవ రాఁగానే — అనఁగాదాని వెంటనే యనుట, అమ్మకొనియెన్ — విక్రయించుకొనెను, మేనమామ — తనతల్లియొక్క తోఁబుట్టువు, ప్రియంబుతోన్ — ప్రేమతో, ఒసంగినపైఁడిమొలత్రాడున్ — ఇచ్చినసువర్ణకటిసూత్రమును, ప్రాఁతయప్పులకున్ — పూర్వపుబాకీలకు, కట్టెన్ — చెల్లఁగట్టెను, జనని — తనతల్లి, చేయించిన జాళువాతాయెతుల్ — చేయించికట్టిన బంగారుతాయెతులను, వడ్డికెక్కుకున్ — వడ్డీతాలూకుబాకీకి, చిందువందుఁజేసెన్ — చెదరఁగొట్టెను, చిందువందనుటకుదా "వ. అందంపముందటంగ్రందుకొను మణిమయస్యందనంబులం జిందువందుజేసి కు" జై. భా. పిదపన్ — తరువాత, తులసిపోఁగులు— తనయొక్క కర్ణాభరణములు, అనఁగా తులసికాయలవలెఁ జేయఁబడినబంగారపుచెవి పోఁగులు, మొదలుగాన్ — మొదలయినవన్నియును, కలుఁగుపెట్టి — బొక్కపెట్టి, చిక్కుబాకీలు— సంకటముగలయప్పులు, నిశ్శేషపఱచెన్ — మిగులులేకుండఁజేసెను, అనఁగాఁబూర్తిగాఁదీర్చివేసెను. ప్రతిదినమున్ — నిత్యమును, దానిసంసారబాధలెల్లన్ — ఆవేశ్యయొక్కకుటుంబసంబంధమైన కష్టముల నన్నింటిని, ఎత్తుకెత్తుగన్ — దానియారంభమునకంటె యధికముగా, కడపెన్ — జరుగునట్లుచేసెను. ఇందు 'ఎత్తుకెత్తుగన్' అనుప్రయోగమునకు "సూ. సంధిస్తుద్రుతపూర్వస్య ప్రాయశోనభవేదితః" అధ. స్వభావోక్త్యలంకారము. "స్వభావోక్తిరసౌచారు యథావద్వస్తువర్ణనమ్" ప్రతా.

తా॥ అనిరంకుశుఁడు తనమామగారు తనవివాహకాలమునఁజదివించిన బంగారుమురుగుల నాబిడకేచదివించెను. రెండవతూరి తండ్రిచేయించిన దర్భముడియుంగరము నమ్మకొనెను. మేనమామచేయించిపెట్టిన సువర్ణకటిసూత్రమును బురాతనబుణములకుఁగట్టెను. తనతల్లి చేయించికట్టిన కనకపుఁదాయెతులు వడ్డీలక్రిందజమకట్టెను. తుదకు జెవినున్న తులసిపోఁగులుసయితము కర్చుపెట్టి చిక్కుబాకీలు పూర్తిపరిష్కారము చేసెను. ఇట్లు దినదినము మిత్రిమించిన కర్చుతో దాని కుటుంబమును బోషించుచువచ్చెను.

—: వేశ్యకుగర్భమగుట :—

క॥ ఈతీరున వారపరయో, జాతముఖిన్ దుర్నివార ♦ సంభోగకళా
చాతురి రాత్రిందివములుఁ, బాతరలాడించి గర్భ ♦ వతి నొనర్చెన్. 117.

అ॥ ఈతీరునన్ - ఈప్రకారముగా, వారపయోజాతముఖిన్ - పద్మమువంటిముఖముగలయా వేశ్యను, దుర్ణి . . . . తురిన్. దుర్ణివార - నివారింపనలవిగాని, సంభోగ - సంపర్కమునందలి, కళా - విద్యయొక్క, చాతురిన్ - నేర్పుచేత, రాత్రిందివములు - రేయింబగళ్లు, అహోరాత్రములు, పాతరలాడించి - నటింపఁజేసి, ఇచట 'పాతరలాడించి' యనుటకు "సూ. కేచిత్తుణిచమిచ్ఛంతి ధాతోరేవాశ్నుతాగమాత్" అధ. ఉదా "క. ప్రీతిన్ గోపసులందఱు, గీతంబులువాడ దరుల ♦ కిందనునగుమన్, జేతులఁద్రిప్పుచుపెడపెడ, పాతరలాడెను యశోద ♦ పాపండవనిన్" భాగ. గర్భవతిన్ - కడుపులోఁబిండముకలదానినిగా, "ని గర్భఃకుక్షిస్థజంతుః" "గర్భోభ్రూణే పవరక్తే గర్భే సుతేపవనసంకటే, కుక్షౌకుక్షిస్థజంతౌచ" యా. ఒనరించెన్ - చేసెను, ఇందు 'రాత్రిందివములు' అనుచోట బిందువ్యాగమమునకుడా "శా. తల్లిందండ్రులునన్నుఁగాననిమన ♦ స్తాపఁబునంబొక్కఁగా" ఇచట నిరంకుశుఁడు సామాన్యవిటులవలెఁగాక 'దుర్ణివారసంభోగకళాచాతురి రాత్రిందివములుఁ, బాతరలాడించి" అనుటచేత నతిశయోక్త్యలంకారము. "నిగీర్యాధ్యవసానంతుప్రకృతస్యపరేణయత్, ప్రస్తుతస్యయదన్యత్వం యదర్థోక్తౌచకల్పనమ్, కార్యకారణయోర్యశ్చ పౌర్వాపర్యవిపర్యయః, విజ్ఞేయాతిశయోక్తిఃసా" కా. ప్ర. ఉదా 'అస్యత్ సౌకుమార్యం అన్యైవచకాంపివర్ణచ్ఛాయా. శ్యామాసామాన్య ప్రజాపతేఃరేఖైవచనభవతి' ఇటవేశ్య యౌవనమధ్యస్థకనుక శ్యామాశబ్దమున కర్థమిట్లుచెప్పఁబడినది. 'శ్యామా-శీతోష్ణకాలే ఉష్ణశీతాషోడశవార్షికీయం కాంతా' సంభోగకాలమునుగూర్చి యిట్లుచెప్పఁబడియున్నది. "మూపోదకఁవటచ్ఛాయా తాంబూలంతరుణీకుచా. శీతకాలేభవేదుష్ణ ముష్ణకాలేచశీతలమ్" చాణ.

లూ॥ అనిరంకుశుఁడు తానభ్యసించిన కొక్కోకాదిశాస్త్రములయొక్క నేర్పుతో నాచంపకగంధిని రేయింబవళ్ళు గలయికచే గర్భవతినిగాఁజేసెను.

—: వేశ్యమాతకు నిరంకుశుఁడు భయపడుట :—

మ॥ ఒకనాఁ డాధరణీసుపర్వుఁడు తదీ ♦ యోదగ్రగేహాగ్రవే
దికపై నొక్కఁడు పట్టితెచ్చినగతిన్ ♦ దీనత్వ మేపార స
వ్యకపోలంబున హస్తపద్మమిడి న ♦ మ్రాస్యాంబుజుం డై కకా
పిక లైనట్టిమనంబుతోఁ గృపణతా ♦ భీతిన్ విచారింపఁగన్. 118.

అ॥ అధరణీసుపర్వుఁడు - అపుడమివేలుపు, ఒకనాఁడు - ఒకదినమున, తదీ . . . కపైన్. తదీయ - అబోగముదానిదైన, ఉదగ్ర - ఉన్నతమైన, ఎత్తయిన, "ని. ఉచ్చప్రాంశూన్నతోదగ్రోచ్ఛ్రితాస్తుంగేఽథ" అ. గేహాగ్ర - ఇంటిముందున్న, వేదికపైన్ - అరుఁగుమీఁద, ఒక్కఁడు పట్టితెచ్చినగతిన్ - ఒకఁడుపట్టుకొనివచ్చి కూర్చుండఁబెట్టిననేరస్థునివలె, దీనత్వము - బీదతనము, ఏపారన్ - అతిశయించఁగా, సవ్యకపోలంబునన్ - ఎడమచెక్కిలియందు, 'ని. వామఁశరీరేసవ్యం స్యాత్' అ. 'సవ్యంవామప్రతీపయోః' విశ్వ. 'ని. గండౌ కపోలౌ తత్పరా' అ. హస్తపద్మమున్ - కమలమువంటిచేతిని, ఇడి - ఉంచినవాఁడై, కకాపికలు - చెల్లాచెదరు, యథాయథలు, ఐనట్టి మనంబుతోన్ - అయియున్నమనస్సుతోఁగూడినవాఁడై, ఉదా "చ. పొలుపుగరంగధాముననుఁ ♦ బువ్వులతోఁటయొనర్చి తొంటినా, కలిగినపాతకంబులుక ♦ కాపికగావిడనాడి" విప్ర. కృపణతా

భీతిన్ - బీదతనమువలనిభయముచేత, విచారింపఁగన్-ఆలోచించుచుండఁగా. ఇందు 'హస్తపద్మము-ఆస్యాంబుజము' ఉపమాలంకారము. పద్యమంతయు స్వభావోక్తియే, 'ఉదగ్రగేహాగ్ర' అనుప్రాసాలంకారము.

తా॥ ఒకదినమున నానిరంకుశుఁడా వేశ్యవాకిటనున్న యెత్తయినయరుఁగుమీఁదఁ దనయెడమ చేయి చెక్కిటఁజేర్చి తప్పుచేసిన నేరస్థుని బట్టుకవచ్చి కూర్చుండఁబెట్టినప్పుడు తలవంచికొనినట్లు కూర్చొని విచారించుచుండఁగా.

సీ॥ కీలుగుఱ్ఱపుఁగాళ్ళ ♦ పోలికి హతశేష, దంతద్వయంబు న ♦ ర్తనము సలుపఁ
గల్లబాసలచేతఁ ♦ దెల్లవాఱినచేతు, లతివిపాకసితాబ్జ ♦ మనుకరింపఁ
గుసుమాస్త్రుతమటంపు ♦ గొడుపులోయన వ్రేలుఁ,జన్నులునాభిపా ♦ర్శ్వములఁదనర
గుమిడికంబులరీతిఁ ♦ గొనలువంగినబొమల్, పగఁజాటు కన్నుల ♦ పై నటింప

తే॥ రుబ్బువిడియంపుఁబలుతుంపు ♦ రులు చలింప, నింటిబిడ్డలపైఁ బెట్టి ♦ కంటసంబు
లాడుచును వచ్చె విటసమూ ♦ హావిలంఘ్య, మాననానావచోఝిల్లి ♦ దానితల్లి.

ఆ॥ విట . . . . .ఝిల్లి. విటసమూహ - జారపురుషులసముదాయమునకు, అవిలంఘ్యమాన-దాఁటనలవిగానివగుచున్న, నానావచః - పలువిధములయినమాటలయందు, ఝిల్లి - కీచురాయి, అయినదానితల్లి - ఆవేశ్యమాత, హతశేషదంతద్వయంబు - ఊడిపోగామిగిలిన ముందలిరెండుపండ్లు, 'ని. రదనా దశనా దంతరదాః' అ. కీలుగుఱ్ఱపుఁగాళ్ళపోలికిన్ — కీలుగుఱ్ఱపుఁగాళ్ళవలె, కీలుగుఱ్ఱమనఁగా పగటివేషములవాండ్రును మతికొందఱును కఱ్ఱతోగుఱ్ఱమునుచేయించి దానిముందు కాళ్ళాడునట్లు కీళ్ళుపెట్టింతురు. అదియేకీలుగుఱ్ఱము. నర్తనము - నాట్యము, చలుపన్ - చేయఁగా, కల్లబాసలచేతన్ - బూటకపుఁబ్రమాణములచేత, తెల్లవాఱినచేతులు - తెల్లగానయినహస్తములు. అతివిపాకసితాబ్జమున్. అతివిపాక - మిక్కిలిపండి రాలిపోవుటకుసిద్ధమయిన, సితాబ్జమున్ - తెల్లతామరపువ్వును. అనుకరింపన్ - పోలియుండఁగా, కుసుమాస్త్రుతమటంపుఁగొడుపులో - మన్మథుని తప్పెటయొక్క వాయించెడిసన్నకొయ్యలేమో, 'ని. సీ. తమ్మటంబనఁగను దమటంబనంగను, దమటాభిధానింబు ♦ దనరుచుండు" ఆం. భా. 'కొడుపు' అనుటకు వా 'సీ. మనిబొట్టుకొనాని ♦ నసలుకొల్పినకన్ను,కొడుపుచేఁదాటించు♦నెడపదడప" క్రీడా. అనన్ - అనునట్లుగా, వ్రేలుఁజన్నులు-వ్రేలాడునట్టిస్తనములు, నాభిపార్శ్వములన్ - బొడ్డుయొక్కప్రక్కలను, తనరన్ - ఒప్పఁగా, గుమిడికంబులరీతిన్ - గుమ్మటమూతవలె, ఈపదముదేశ్యము. మననిఘంటువులయందులేదు. కొనలువంగినబొమల్ - చివరలువంగినకనుబొమలు, పగఁజాటుకన్నులపైన్ - కోపమునువెలిఁబుచ్చునట్టినేత్రములమీఁద, నటింపన్ - వర్తించఁగా. రుబ్బువిడియంపుఁబలుతుంపురులు. రుబ్బు - ఱోటిలోవేసి పొత్రముతోరుబ్బుచున్నట్లుగా, బోసినోటిలోనుంచి యటునిటు మెదుపుచున్నయనుట. విడియంపుఁబలుతుంపురులు - తాంబూలముయొక్క యధికమయినతుంపరలు- అనగాశీకరములు, తుంపురులనుటకు "సీ. కళుకులైతమ్మిపైఁ ♦ గ్రమ్మమంచునుబోలె, 'తొంగమునఁజెమట తుం ♦ పురులలర్ప" యయా. చలింపన్ - చిందుచుండఁగా, ఇంటిబిడ్డలపైఁబెట్టి - తనగృహమునఁగల పిల్లలమీఁదఁ బెట్టి, అనఁగాఁదనపిల్లలనుకొన్నట్లుగాననుట. కంటసంబులు - కోపోద్రేకములగుమాటలను, ఆడు

చును - మాట్లాడుచు, వచ్చెన్ - అచ్చటికిఁజేరెను, ఇందు 'రబ్బువిడియంపుఁబలుతుంపురులు' అనుచోటఁబువర్ణము వచ్చినందులకు 'సమానాధికరణ్యేతు బహుత్వార్థపరేఽపిచ, ముబోర్వా భవేత్తాం పుంప్వాఖ్యా వాదేశావత్ర సర్వదా' అధ. 'సూ. మోస్తువిభక్త్యేకవచనేపుంపూ' శబ్ద. కంటసమ్మ అనుటకు 'ని. గీ. కంటసమ్మనాగనువిప్రలా ♦ పమ్మచెలఁగు' అం. భా. ఉదా 'ద్వి. కంటకం బులనొచ్చి ♦ కన్నీరుదెచ్చి, కంట 'ంబులఁజిక్కి ♦ కఱకులఁజొక్కి' ద్వి హ. 'కీలుగుజ్జుపుగాళ్ళ పోలికి హత్తశేషదంతద్వయంబు నర్తనము సలుప' ఇత్యాదులఁ[ఉ]త్ప్రేక్షాలంకారము. "సంభావనమథో త్ప్రేక్షా ప్రకృతస్యసమేనయత్" కా. ప్ర. ఉదా "లింపతీవతమోఽంగాని వర్షతీవాంజనంనభ, అస త్పురుషసేవేవ దృష్టిర్విఫలతాంగతా" 'నానావచోఝిల్లి' ఉపమాలంకారము. 'ఝిల్లిదానితల్లి' అనుప్రాసాలంకారము.

తా॥ కోడెకాండ్రకుఁ దిరస్కరింపఁబడవిగాని వివిధకార్యములయందుఁ గీచురాయివంటిది యైనయాజరభి తనయూడిపోయినదంతములలో శేషించినముందటిరెండుపండ్లును గీలుగుజ్జుప్రఁగాళ్ళ వలెఁ గదలుచుండఁగను, అసత్యప్రమాణములచేత నిండినవేమో యనునట్లు పరువుదప్పినతెలిదమ్మి వలె నున్నకరములును. మన్మథుఁడు వచ్చినప్పుడు ముందుగా వాయించు తప్పెటలనుమోగించెడు కట్టెలవలె నాభికిరువైపులఁ వ్రేలాడుస్తనములును; గుమ్మెటమూతలవలె వంగినకనుబొమలు కోపమును దెలియఁజేయుచున్నకన్నులపైఁ బడుచు డగను. నోటిలోనున్నతాంబూలము బోటిలోవేసిరుబ్బినట్లు త్రిప్పుచుండఁగాఁ దుప్పరలు వెలికివచ్చుచుండఁగను, తనయింటిపిల్లలను దిట్టుచున్నదానివలెఁ గోప పూరితమగు ప్రసంగములతో నటకువచ్చెను.

వ॥ అయ్యవసరంబున. 120.

అ॥ అయ్యవసరంబున్-ఆసమయమున,

తే॥ అధికతరరోషభీషణ ♦ వ్యాఘ్రిఁజూచి, బెగడినలుదిక్కులకుఁబోవు♦మృగమువోలె
సందడింపుచు వచ్చునా ♦ జరఠిఁ జూచి, ధారుణీదేవతనయుండు ♦ తల్లడిల్లి. 121.

అ॥ సందడింపుచున్-ఎడములేక నిందుగాధ్వనిచేయుచు, ఉదా. "ఎ. గీ. సందడించుచుఁ బుప్పాప♦చయముసలిపి" కళా. వచ్చునాజరఠిన్ - తనసమీపమునకుఁజేరుచున్న యాముసలిబోగము దానిని, ధారుణిదేవతనయుండు-బ్రాహ్మణసుతుఁడయిన యానిరంకుశుఁడు, చూచి-వీక్షించి. అధిక తరరోషభీషణవ్యాఘ్రిన్. అధికతర - ఎక్కువయైన, రోష-కోపముతో, భీషణ - భయంకరమయిన, వ్యాఘ్రిన్-ఆఁడుపెద్దపులిని, చూచి-కనుఁగొని, బెగడి-భయపడి, నలుదిక్కులకున్-నాలుగువైపులకు, పోవుమృగమువోలెన్-పాఱిపోవుచున్నటువంటి లేడియోయనునట్లు, తల్లడిల్లి-మిక్కిలి కలఁతపడిన మనస్సుగలవాఁడై, ఇచట 'తల్లడిల్లి' యనుపదమునకుదా. "ఎ. గీ. వచ్చెనకులంఁడమిత♦వాహినీపద హతిఁ, దల్లడిల్లుమండఁధరణీతలము" భార. 'అధికతర......మృగమువోలె, అనుటచేను త్ప్రేక్షా లంకారము. "మన్యేశంకేధ్రువంప్రాయో, నూనమిత్యేవమాదిభిః, ఉత్ప్రేక్షావ్యజ్యతేశబ్దై, రివ శబ్దోఽపితాదృశః" కావ్యాద. కవిసార్వభౌముఁడు నిట్లువర్ణించినాఁడు "చ. మదనకిరాతతీవ్రతర♦ మార్గణపంక్తులకాత్మ నెంతయున్, గదిసినభీతిఁబల్లవమృ♦గంబులువారవధూప్రదేశముల్, కదురుగఁజేరి గుబ్బచను♦గొండలచాటునదాఁగరాఁగఁద, త్సదనమునందు బెబ్బులుల♦చాడ్పున వేశ్యలతల్లులుం

ద్రోగిన్'' రాజశే. ఇందు భయమనుభావముసూచితము. "రౌద్రసందర్శనాదిభి రనర్థాశంకనం భయమ్'' ప్ర. తా.

తా॥ మిగులఁగోపముతో నల్లరిచేయుచువచ్చుచున్నముసలిని జూచి యానిరంకుశుఁడు భయంకరమైన యాఁడుపెద్దపులిని జూచి బెదరి పర్విడనున్న లేడివలెఁ దల్లడిల్లెను.

క॥ వచ్చెఁ గద విటులపాలటి, చిచ్చుఱపిడు గింకనేమి ♦ సేయుదు ననుచున్
జిచ్చవడి యంతలో ధృతి, దెచ్చుక రక్షకుఁడు నాకు ♦ దేవుఁడె యనుచున్. 122.

అ॥ విటులపాలిటిచిచ్చుఱపిడుగు – వ్యభిచారులపాలఁబడియున్న యగ్నిమయమైన పిడుగు, ఉదా. 'వె. చిచ్చుఱపిడుగుల్ వడిఁదొరఁగుచాడ్పుననంబరవీధినుగ్రమై'' భార, వచ్చెఁగద–వచ్చెను గదా, ఇఁకన్–ఇఁకమీఁద, ఏమిచేయుదున్ – నేనేమిసేయఁగలవాఁడను, అనుచున్–ఇట్లుతలంచుచు, జిచ్చవడి–నిశ్చేష్టితుఁడై–చేష్టలుదక్కినవాఁడై, జిచ్చ+పడు–జిచ్చవడు ఉదా. "క. జిచ్చవడియు భయబలములు, నచ్చెరువుగఁజిత్రరూపులట్లుండ.'' భార. అంతలోన్ – ఆకాలములోపల, ధృతి దెచ్చుక–ధైర్యమునవలబించి, నాకున్–నాకు, రక్షకుఁడు–కాపాడునట్టివాఁడు, దేవుఁడె–భగవంతుఁడె, భగవంతుఁడుదప్ప నితరులెవ్వరులేరనుట, అనుచున్–ఈవిధముగాఁదలంచుచు, ఈపద్యమున 'ధృతి దెచ్చుక, అనుప్రయోగమునకుదా. "క. ఔలెక్కకనీపుత్త్రుఁడు'' భాగ. 'విటులపాలిటిచిచ్చుఱపిడుగు' ఉపమాలంకారము.

తా॥ మిండగీండ్రపాలిటి యగ్నిమయమగు పిడుగువంటి యావృద్ధవేశ్య సమీపించినదిగదా! ఇప్పుడేమిసేయుదును. దీనిపాలిటినుండి నన్నురక్షించువారెవరు? అని నిశ్చేష్టితుఁడై పిదప ధైర్యమునవలంబించి,

సీ॥ అల్లంతటనె రాఁగ ♦ నావలికంతలో, దాఁటలేనైతి నె ♦ చ్చోటికైన
మునుమున్న తెలిసి యీ ♦ ముదివరాకమునకై, కొంచురా లేనైతిఁ ♦ గోకవాక
మోసపోయితి దీని ♦ ముంతపాటునకైనఁ, జేకూర్ప లేనైతి ♦ యాకరుద్ర
దాసీజనులకైనఁ ♦ దగఁజెప్పి యూరలేఁ, డనిపించలేనైతి ♦ హావుణుదప్పి

తే॥ తొలుతనేబొంకినట్టిబొం ♦ కులు సహస్ర,సంఖ్యలవియెల్లఁదలఁచిరో ♦ సమునసేఁడు
వచ్చుచున్నది మాటల♦ వశముగాదు,ధూళిదర్శన మేమైన ♦ దొరకదయ్యో. 123.

అ॥ అల్లంతటనె–అకనుపడునంతదూరమునకు, అల్ల+అంతటనె–అల్లంతటనె, అగును. 'అల్ల' యనునది తచ్ఛబ్దార్థకమును, ప్రసిద్ధార్థకమును, అగును. రాఁగన్–వచ్చినప్పుడే, ఆవలికంతలోన్–అవతలిసందులోనుండి, ఏచోటికైనన్–ఏప్రదేశమునకైనను, దాఁటలేనైతిన్–కడచిపోఁజాలనయితిని గదా, ఇచట 'ఐతిన్' అనుటకు "సూ. భూగమిక్రియయోరంతే ఘటకాఖ్యానముచ్యతే' అథ. మునుమున్న–మొట్టమొదటనే, తెలిసి–ఎఱిఁగియుండి, ఈముదివరాకమునకై – అనామకురాలయిన యీ ముదుసలిదానికి, కోకవాక–కోకయైననుము ఉదయినను, కొంచురాలేనైతిన్ – కొనియిచ్చుచువచ్చిన వాఁడనుగాకపోతినిగదా, మోసపోయితిన్–వంచింపఁబడితిని, దీనిముంతపాటునకైనన్–ఈబిడయొక్క

కల్లుముంతకొఱకుఁ జేయుప్రయత్నము నకయినను, ముంత + పాటు–ముంతపాటు అగును. ముంతయునఁ గాఁదోఁడైపెలవఁటిమఁటిపాత్రము, రూకరు(ట–డబ్బుగాని యింకనేదయిననుగాని, చేకూర్పలేనైతిన్–చేతిలోఁబడవేసినవాఁడను గాకపోతినిసుమా, దాసీజనులకైనన్–ఊడిగపుఁబొలఁతులకయినను, తగఁ జెప్ప–యుక్తమగునట్లుగాఁజెప్ప, హావుణుదప్పి–ఈవేషముతో లేకుండ, ఇచట 'హావుణు–హావణు' అని రెండురూపములుకలవు ఊరు లేఁడనిపించలేనైతిన్–గ్రామమునందు లేఁడని చెప్పించకపోతినిగదా, నేన్–నేను, తొలుతన్–మొదట, బొంకినట్టిబొంకులు–ఆడినట్టియబద్ధములు, సహస్రసంఖ్యలు – వేలకు వేలు, మితిలేవనుట, నేఁడు–ఈదినమున, అవియెల్లన్–వానినన్నింటిని, ఇచట సంధినిగూర్చి 'సూ. అచోఽ–చిపుత్రచిల్లోపో, బహుళంస్యాత్ప్రయోగతః' అధ. 'సూ. తద్వత్తదాదిజస్య' శబ్దచిం. తలఁచి–జ్ఞాపకమునకుఁదెచ్చుకొని,రోసమునన్–కోపముతో, వచ్చుచున్నది–సమీపమునకుఁజేరుచున్నది, మాటలవశముగాదు – నాపలుకులకెంతమాత్రములోఁబడదు, ధూళిదర్శనము – దుమ్మునుజూచుట, ఏమైనన్ + దొరకయ్యె–ఏమాత్రమయినను లభించకుండెనుగదా. అనఁగాదానికన్నులలో దుమ్ముకొట్టియైననుబోవుటకు వీలులేకుండెనుగదాయనుట. ఈపద్యమున 'మోసపోయితిన్' అనుటకుదా. 'ఉ. మాయపుం,జొక్కులునీవునిక్కముగఁజూచివనంబున మోసపోయితిన్' భార. అలం. స్వభావోక్తి.

తా॥ అది యంతదూరముననున్నప్పుడే యవతలిసందులోనుంచి యెచటికైనఁ బోకుంటిని. ఈ సంగతి ముందుగానే తెలిసికొని యీయనానుకురాలి కొకకోకయైనఁ గొనకపోతిని. ఈయవమానము రాకుండుటకు దానికల్లుముంతకర్చుకయిన డబ్బీయనైతిని. ఇచ్చటిదాసీలకైనఁ జెప్పి మాఱువేషముతో నుండి గ్రామమునలేఁ డనిపించకపోతిని. మొదట నేనాడినయబద్ధములు వేనవేలుగలవు. అవియన్నియు జ్ఞప్తికిఁదెచ్చుకొని కోపముతో నిటకువచ్చుచున్నది. గుప్పెడుదుమ్మయినను గనపడలేనుగదా !

వ॥ అని యనేకప్రకారంబుల వితర్కించి, 124.

అ॥ అని–ఇట్లని, అనేకప్రకారంబులన్–బహువిధములుగా. వితర్కించి–ఊహించినవాఁడై.

——౦: ఆపె నిరంకుశుని దరిద్రతనుగనిపెట్టుట :౦——

మ॥ ధరణీనాథ దరిద్రతాపిశునవ ♦ స్త్రస్ఫూర్తి నాభారతీ
వరవంశోత్తమసూతి చింతిలఁగ న ♦ వ్వారాంగనామాత దు
ర్భరపాండిత్యముఁ జూపి దీనదశకున్ ♦ రాఁబోలు నీయయ్య "జే
పరమేశా" యనిపింపఁగా వలదె వి ♦ ప్రస్వామి నంచున్ మదిన్. 125.

అ॥ ధరణీనాథ–ఓరాజా, ఆభారతీవరవంశోత్తమసూతి, ఆ – అయొక్క, భారతీవర–బ్రహ్మదేవునియొక్క, వంశ–కులమునందు, ఉత్తమసూతి–శ్రేష్ఠుఁడుగాజన్మించిన యానిరంకుశుఁడు. దరిద్రతాపిశునవస్త్రస్ఫూర్తిన్, దరిద్రతా–లేమిచేత, పిశున–నీచమైన, వస్త్రస్ఫూర్తిన్–వస్త్రములయొక్క పరిపూర్ణతచేత, చింతిలఁగన్–విచారపడఁగా, అవ్వారాంగనామాత–అబోగముదానియొక్క–తల్లి, దుర్భరపాండిత్యమున్–భరింపనలవిగాని విద్యాచాతుర్యమును, చూపి – కనఁబఱచి, మదిన్ – దానియొక్క మనస్సునందు, ఈయయ్య–ఈతఁడు, దీనదశకున్–దరిద్రావస్థకు, రాఁబోలున్ – రాఁదగియుండును,

విప్రస్వామిన్ - బ్రాహ్మణులలో నధికుఁడయినవానిని, జేపఁ మేశా - ఓదేవుఁడా నీకునమస్కారము, సమస్తమునుగోలుపోయి యింకొకదారిఁబట్టఁబూనునప్పుడనునది. ఉదా. "క. క్షితిదేవమౌళియతివి, స్మితుఁడై చేదోయిమోడ్చి జేయనుచునమ, స్కృతులఁ జేసి శిష్యన. హితుఁడై తనయాశ్రమమున కేతెంచెనృపా" శేష. అనిపింపఁగావలదె - అనునట్లుగాఁ జేయవద్దా, అంచున్ - ఈప్రకారముగానను కొనుచు, ఈపద్యమున 'ఈయయ్య' అనుప్రయోగమునకుఁదా. "క. ఈయయ్యఁ బట్టితెచ్చుట" కళా. ఇచట నిరంకుశుఁడు చింతించినాఁడనుటకు "ఈర్ష్యీ ఘృణీ న్వసంతుష్టః క్రోధనో నిత్యశంకితః, పరభాగ్యోపజీవీచ, షడైతే నిత్యదుఃఖితాః" అను శాస్త్రీన సామగ్రి నసంతుష్టమనస్కుఁడు చింతించును. వేశ్యమాత నిరంకుశుని వెడలఁగొట్టఁదలంచుటను గూర్చి "యత్రోదకం తత్ర వసంతి హంసా, స్తథైవ శుష్కం పరివర్జయంతి, నహంసతుల్యేన నరేణ భావ్యం. పునస్త్యజంతః పునరాశ్రయంతః" చాణ. లోకోక్త్యలంకారము. ఇచట వేశ్య నిరంకుశుని 'జేపరమేశా'. అనిపింపవలెననుట పుష్పభ్రమరన్యాయమని తెలియవలయును.

తా॥ ఓధర్మపాలనృపతీ! కడు బీదతనముతోఁ జినిగినగుడ్డలను ధరించియున్న యాబ్రాహ్మణకుమారుఁడు విచారపడుచుండఁగా నావృద్ధవేశ్య తనయాయావిద్యలయొక్క నేర్పుతోఁ గనిపెట్టి యీతఁడు దరిద్రావస్థనొందియుండెనో పు నిఁక నింటినుండి జేపమేశా! అనిపింపవలయును గదా యని తలంచెను.

వ॥ చిరంతనస్నేహ మొక్కింత తలంచి యాజగజంత యిట్లనియె. 125.

అ॥ ఆజగజంత - ప్రపంచమునకెల్ల ధూర్తురాలయిన యావృద్ధవేశ్య, జగము + జంత, గయ్యాళి. "ని. సీ. గట్టివాజంతజాణగయ్యాళియనఁగను, ధూర్తమౌ పాభిధ దోఁచుచుండు" ఆం. భా. సాంబనిఘంటువునఁగూడ నిట్లేయున్నది. చిరంతనస్నేహమున్ - పురాతనపుమైత్రిని, 'ని. పురాణ ప్రతన ప్రత్న పురాతనచిరంతనాః' అ. ఒక్కింతతలఁచి - కొంచెము జ్ఞాపకమునకుఁ దెచ్చుకొని, ఇట్లనియెన్ - ఈవిధముగాఁబలికెను. చెప్పఁబోవురీతిగాఁబలికెననుట

—: వేశ్యమాత నిరంకుశునకు నీతులుబోధించుట :—

క॥ ఒకపండువ పబ్బంబున, నొకయూరట మైనవేళ ♦ నొక్కొకతఱి వే
డుకతనము గాక యిటువలె, సకలము వర్జించినడువఁ ♦ జనునా యోయీ. 127.

అ॥ ఓయీ - ఓపడుచువాఁడా, ఇదనీచసఁబుద్ధి ఒకపండువపబ్బంబునన్ - ఒకానొక సంతోషముతోఁగూడిన యుత్సవదినమునను, అతిథిగావచ్చినప్పుడును, ఒకయూరటమైనవేళన్ - ఒకనిశ్చితముగానున్న సమయమునను - ఏదో ఒకానొకసమయమునననుట. వేడుకతనముగాక - కోరిక కలిగినప్పుడు రాఁదగునుగాని, ఇటువలెన్ - ఈవిధముగా, సకలమున్ - అన్నిటిని, వర్జించి - విడిచిపెట్టి, నడువఁజనునా - సంచరించుట చెల్లునా - లోకులు మెత్తురా యనుట.

తా॥ ఓయీ! ఒకసంక్రాంతివంటి పర్వదినముననో, ఒకవిందుగానో, ఒకనెమ్మదిగానున్న సమయముననో వేడుకగా మాయిండ్లకువచ్చుటపాడిగాని యిట్లన్నిటినివిడిచి సంచరింపఁదగునా?

సీ॥ కడుఁబిన్నప్రాయమ ♦ ప్పుడ తాళిఁగట్టిన, కులమునిల్లా లెంత ♦ కుందవలయుఁ
పుట్టిని ల్లనిపెట్టు ♦ పోఁత లాశించిన, యక్కసెల్లెండ్రెంత ♦ యడలవలయుఁ
దనయుండు మాకు ము♦ప్పున కందుననియున్న, తలిదండ్రులెంత చిం♦తిలఁగవలయు
నందఱిండ్లకు నాస ♦ యైయుండునితఁడని, నిక్కబందుగులెంత ♦ పొక్కవలయుఁ

తే॥ జల్లఁగాఁ జేతికాసెల్ల ♦ దుల్లి లొల్లె, గాఁడ వై యికనైన నీ ♦ కాఁపురంబు
బ్రతుకుపని విచారింపకీ ♦ పనికిఁజొరఁగఁ, బడినవానికినెక్కడి ♦ భారబుద్ధి. 128.

అ॥ కడున్ బిన్నప్రాయముప్పుడ - మిక్కిలిచిన్నతనమునందే, తాళిన్ - తాళిబొట్టును, కట్టిన కులమునిల్లాలు - మెడలోఁగట్టిన నీజాతియందుద్భవించిన గేస్తురాలు, ఎంతకుందవలయున్ - ఎంత దుఃఖపడవలెను, పుట్టినిల్లు - మేముజన్మించినగృహము, అని - అనుకొని, పెట్టుపోఁతలు - భుజించుపదార్థములను బెట్టుట, పానముచేయుపదార్థములను పోయుటమొదలగునవి ఆశించినయక్క సెల్లెండ్రు - ఆశపడియున్న నీయప్పలును చెల్లెండ్రును, ఎంతయడలవలయున్ - ఎంతగావిలపించవలెను. తనయుండు - కొడుకు, మాకున్ - మాకు, ముప్పునకున్ - ముసలితనమున-కష్టకాలమున, అండున్ - అక్కఱకురాఁగలఁడు, అని - ఇట్లుతలంచి, ఉన్నతలిదండ్రులు - ఉన్నతల్లియును, తండ్రియును, ఎంతచింతిలగవలయున్ - ఎంతగాశోకించపలయును, ఇతఁడు - ఈచిన్నవాఁడు, అందఱిండ్లకున్ - మాయందఱిగృహములకు, ఆసయై - ఆశగానున్నవాఁడై, మేముందరమాశించి యున్నామనుట, ఉండున్ - ఉండఁగలఁడు, అని - ఇట్లూహించి, నిక్కుబాదుగులు - గర్వించు నట్టిచుట్టములు ఎంతపొక్కవలయున్ - మనస్సులో నెంతదుఃఖపడవలెను, చల్లఁగాన్ - మెల్లఁగా చేతికాసెల్లన్ - చేతనున్నరొక్కమంతయును, దుల్లి - చేజారి, అంతయును బోయియనుట. 'ని. కాసు.త.ధనము.శచం' 'కాసు.త.దుగ్గానిలో 10వ పాలు. సూ, అం. ని. ఉదా 'ద్వి. మరగి చొచ్చియిట్లు♦మత్తపోఁవనము, సురుఁగకచొచ్చి కా♦సుగనన్నుఁగొనక' ద్వి. హ. ఇచట ధనమనియే కవిభావము. 'దుల్లి' అనుటకుదా "గీ, 'తుప్పుతుల్లిననొప్పారు♦తోయజాస్త్రి, చికిలనిద్దంపుకైదువు♦ చెలువుదోఁప" హంస. లొల్లెగాఁడవై - మిగులబీదవాఁడవై, 'లొల్లెగాఁడు. వా. విణ చూ. బీదవాఁడు, ముష్టింపడుచు' ఆం. వా. ఇఁకనైనన్ ఇఁకమీఁదటనైనను, నీకాఁపురంబు - నీయొక్క సంసారము, బ్రతుకుపని - జీవించునట్టికార్యమును, విచారింపక - ఆలోచించుకొనక, ఈపనికిన్ - ఈవ్యభిచారకార్యమునకు, చొరఁగఁబడినవానికిన్ - చొచ్చినట్టివాఁడవైననీకు, ఎక్కడిభారబుద్ధి - ఘనమయినబుద్ధియెక్కడగలదు-అనఁగా నల్పబుద్ధిగలవాఁడవనుట, ఇచట నిరంకుశునకు వేశ్యనీతులు బోధించుటనుగూర్చి 'వేశలమపిఖలవచనం దహతినితరాం మానసం, సుతత్త్వవిదాం, పరుషమపి సుజన వాక్యం మలయజరసవత్ప్రమోదయతి' చాణ.

తా॥ బాల్యముననే వివాహముచేసికొనిన నీభార్యయును, పుట్టినిల్లని వస్త్రాభరణాదుల కపే క్షించుతోఁబుట్టువులును, వృద్ధాప్యమున మమ్ముఁబోషింపఁగలఁ డనుకొనిన జననీజనకులును, మా కుటుంబములకన్నిఁటికి నితఁడొక్కఁడేయాధారమని కాంక్షించిన బంధువులును, దుఃఖించునట్లు మెల్లమెల్లఁగాఁ జేఁగఁ రొక్కమంతయుఁ బరాధీనమై దరిద్రుఁడవైతివిగదా! ఇంతటితోనైనఁ

దెలివిదెచ్చుకొని కుటుంబమును బోషించుకొనక యిట్లు వ్యభిచారిగా సంచరించువానికి మంచిబుద్ధి యెట్లువచ్చును.

సీ॥ గుటి తప్పిపోవు ముం ♦ దటివిచారము లేదు, సాపడికుడుగు మ ♦ చ్చరము పుట్టు
నగరివారు హసింతు ♦ రగడౌను బిన్నపె ♦ ద్దలకుఁజుల్కన తలి ♦ దండ్రు లోర్వ
రింటికి నేగియు ♦ నెవరుమెచ్చరు లేని, గర్వంబుదొట్టుఁ జే ♦ కాసు డుల్లు
నొడలోడుగాఁజొచ్చు ♦ నోడువులపాలగు, సందులుదూఱు వి ♦ శ్వాసమెడలుఁ

తే॥ జిన్నపనిగాదు లంజరిక ♦ మన్న వినుము, ప్రజలు మీరొకటైన మా ♦ పయికివచ్చుఁ
బడుచఁడవు నీవు మాబిడ్డ ♦ పసరుమొగ్గ, మ్రొక్కెదము రాకు నీ విది ♦ మొదలుచేసి.

ఆ॥ లంజరికమన్నః – వ్యభిచారమనఁగా, చిన్నపనిగాదు – కొలఁది కార్యముగాదు, వినుము – నేఁజెప్పుచున్నదాని నాకర్ణింపుము. గుటితప్పిపోవుః – దైవభక్తిమొదలగువానియందు అత్యయము తొలఁగిపోవును, ముందటివిచారములేదు – రాఁగలకష్టసుఖముల నాలోచించుటయుండదు, సాపడికుడుగుః – భుజించుటకన్నముసైతము దొరకకుండును, ఇచట 'కుడుగు' అనుపదప్రయోగమున కుదా "ఉ. ఉత్పలగంధినన్నుడిగి యొష్టముబంపుము" భార. మచ్చరముపుట్టుః – పరులమేలుఁజూచి యోర్వలేనితనము కలుగును, నగరివారుహసింతురు – పురజను లెల్లనవ్వుదురు, అగడౌను – నిందలు పుట్టును, పిన్నపెద్దలకున్ – బాలురకు వృద్ధులకును, చుల్కన – మిక్కిలి తేలికయగును, తలిదండ్రు లోర్వరు – తల్లియును తండ్రియును సహింపరు. ఇంటికి నేగియుః – ఇంటికిఁబోయినప్పుడును, ఎవరు మెచ్చరు – ఎవరును లెక్కచేయరు, లేనిగర్వంబు దొట్టుః – ఏన్నఁడును లేని యహంకారముకూడును, చేకాసుడుల్లుః – తనిచేతఁగలసొమ్మంతయును కర్చు అగును, – హస్తగతధనమంతయు వ్యయమగును, ఒడలు – మేను, ఓడుగాఁజొచ్చుః – పటుత్వముతొలఁగనారంభించును, నోడువులపాలగుః – పరులయొక్క మాటలకు లోఁబడవలసివచ్చును, సందులుదూఱుః – గొందులలోఁ జొరఁబడుట యగును, విశ్వాసమెడలుః – నమ్మకమంతయును బోవును, ప్రజలుః – లోకులును, మీరుః – మీకుటుంబమును, ఒకటైనః – ఏకమయినయెడల, మాపయికివచ్చుః – ఈనేరము మామీఁదఁ బడును, పడుచఁడవునీవు – నిన్నుఁజూడఁగాఁబ్రాయపువాఁడవు, ఇచట 'పడుచఁడవు' అనుటకు 'సూ. కేచిత్తు వైకృతాశబ్దా డాదిత్వేనైవసాధవః" అధ. మాబిడ్డ – మాపిల్ల, పసరుమొగ్గ – లేఁత మొగ్గ, – లేఁబ్రాయముగలది. కనుక ఇదిమొదలుచేసి – ఈదినము మొదలుకొని, నీవు – నీవుమాత్రము, రాకు – రాకుము, మ్రొక్కెదము – నీకునమస్కరించుచున్నాము, అనఁగా నీకు నమస్కారము చేయుదును మాయింటికి రావలదనుట. ఈపద్యమున 'మాపిల్లపసరుమొగ్గ' ఇచట "సూ. లోకోక్తీనాం భవేద్యోగో యదిస్యాచ్ఛ్రుతిరంజనమ్" అధ. 'ఇందుమ్రొక్కెదము రాకు' అను ప్రార్థనార్థకము నేకవచనమున. ము కారము లోపించుటను గూర్చి 'సూ. ప్రార్థనార్థము రేకత్వే కథ్యతే మధ్యమార్థకః, విభాషాంతం పదంత్యేకే న ప్రాణేతుకదాచన" అధ. ఉదా "ఉ. తోయజేక్షణ ననుఁగృప జూడఁడు" "ననుంగృపఁజూడు భారతి" 'మాబిడ్డపసరుమొగ్గ' ఉపమాలంకారము. 'మ్రొక్క–

దమురాను నీవిది మొదలుచేసి' అనుటచే వ్యాజస్తుత్యలంకారము. "వ్యాజస్తుతిర్ముఖే నిందాస్తుతిర్వారూఢిరన్యథా" కా. ప్ర.

తా॥ ఓయీ! వ్యభిచారము సులభమనియెంచితివేమో చెప్పుచున్నాను వినుము. సత్కర్మములయందు లక్ష్యముండదు. రానున్న కష్టసుఖములను దెలిసికొనలేఁడు. అన్నమునకుఁ గఱవగును, పరులమేలుఁ జూచి యోర్వలేకుండును. పౌరులందఱు నవ్వుచుందురు. నిందలువచ్చును. పిన్నపెద్దలు చులకనగాఁ జూతురు. తలిదండ్రులు కోపింతురు. ఇంటనెవ్వరును మర్యాదగాఁ జూడరు. అజ్ఞానము వృద్ధియగును. చేతఁగలవిత్తమూడును. శరీరపాటవము దప్పును. మాటలుపడవలసివచ్చును. సందులయందు దిరుగవలసివచ్చును. నమ్మకముపోవును. మాయింటఁగలవారును గ్రామములోనివారును గలసిరేని యీనేరము మాపయిఁబడును. కనుక నీవుపదుచువాఁడవు, మాపిల్లలేఁతది. నీకొకదండము గాని యిడిసుత మాయింటికిరాకుము.

—: వేశ్యమాత నిరంకుశుని నిందించుట :—

క॥ అనరాదుగాక నీవొక, మనుజుఁడవా దుర్విదగ్ధ ♦ మార్గమె మార్గం
బని విప్రమార్గ ముద్యా, పనసేతురె నిన్నువంటి ♦ బ్రాహ్మణకులజుల్. 130

అ॥ అనరాదుగాక - మేమనఁగూడదుగాని, నీవు + ఒకమనుజుఁడవా - నీవొక మనుష్యుండవేనా, నిన్నువంటి బ్రాహ్మణకులజుల్ - బ్రాహ్మణజాతియందుబుట్టిన నీవంటివారు, దుర్విదగ్ధమార్గమె - చెడ్డతనమునందు నేర్పరితనముగలపద్ధతియే, మార్గంబని - దారియనుకొని, విప్రమార్గముఁ - బ్రాహ్మణపద్ధతిని, ఉద్యాపన - అంతమును,- అనఁగా నుపవాసాదివ్రతనియమములయొక్క కడపటఁ జేయుపనివలెననుట. చేతురె - ఇట్లుచేయుదురా, ఇట్లుచేయఁగూడదనుటకు "ఆ. సంధ్యవార్చనేమి ♦ జపముసేయఁగనేమి, వేదశాస్త్రమెఱిఁగి ♦ వెలయనేమి, పడఁతిఁగవయువాఁడు ♦ బాపండుగాఁడయా" విశ్వ. వేమ. ఇచట వేశ్యమాతనీతులుబోధించుచున్నట్లే యెగపడుచు నిందించుచున్నది. "స్పే శలమపిఖలవచనం దహతినితరాం మానసం, సుతత్త్వవిదాం పరుషమపిసుజనవాక్యం మలయజరసవత్ప్రమోదయతి" 'నీవంటిబ్రాహ్మణులిట్లు కులధర్మములవదలి ప్రవర్తించుదురా' అనుటచేత నర్థాంతరన్యాసాలంకారము. "సామాన్యంవావిశేషోవా తదన్యేనసమర్థ్యతే, యత్రసోఽర్థాంతరన్యాసః సాధర్మ్యేణేతరేణవా"

తా॥ వ్యభిచారవృత్తివలన సొమ్ముగడించెడి మేమెట్టిధర్మంబులను జెప్పఁగూడదుకాని నీవొక మనుష్యుఁడవేనా? దుర్వృత్తియందుఁ జరించుటయే మంచిమార్గముగానెంచినీవంటివారు బ్రాహ్మణధర్మములనన్నిటిని బోఁగొట్టుకొందురా!

సీ॥ జపతపంబులుగావు శా♦స్త్రములుగావు, వేదములుగావు సత్క్రియా♦విధులుగావు
వైదికపుబాఁప లేడ భూ♦వరకుమార, యోగ్యసౌభాగ్య లగువార♦యువతు లేడ.

అ॥ జపతపంబులుగావు - భక్తితో మంత్రముల ననేకపర్యాయములు చదువుటయును, కష్టమైన తపస్సులుచేయుటయునుగావు. శాస్త్రములుగావు - అఖిలశాస్త్రములను చదువుట చెప్పుట కాదు,

వేదములు గావు - వేదముయొక్క సంహితపదక్రమాదులను తెలిసికొనుటకాదు, సత్క్రియావిధులు గావు - యజ్ఞాదిసత్కర్మములయొక్క నియమములుగావు, వైదికపుబాఁపతేఁడ - పురోహితవృత్తిచే జీవించు బాఁపనవాండ్రెక్కడ, భూవ........గ్యలు. భూవరకుమార - రాజపుత్త్రులకు, యోగ్య- తగిన, సౌభాగ్యలు - అధికభోగాంశగలవారు- స్వభావముచే సుందరమయినవారు, 'సుహృద్భగ సింధ్వంతే' సిద్ధాం. పూర్వపదస్యచేత్యుభయపదవృద్ధిః సౌభాగ్యం సుభగత్వం. 'ని. సుందరేఽధి కభోగాంశే దుర్దినేతరవాసరే, తురీయాంశేశ్రీమతిచ సుభగః' శబ్దా. ఇచట రాజకుమారులు స్త్రీ సు+ భగ+ఆసక్తులని' భావము. కామశాస్త్రమునందును, "అశ్వత్థదళసంకాశం గుహ్యంగూఢమణిప్రభం, యస్యాఃసాసుభగానారీ" అనిచెప్పఁబడియున్నది. అగువారయువతులేఁ - అయినట్టి యౌవనపు వేశ్యలెక్కడ, మీరల్పులు మేముత్తములము. కనుక మీకును మాకు నెంతోవ్యత్యాసముకలదనుట. ఇందు వైదికపు బాఁపతేఁడ భూవరకుమారయోగ్యసౌభాగ్యలగు వారయువతులేడ" అనుటచేవిరూప ఘటనాలంకారము. ఉదా "హాయగజారూఢులై•యలరు రాజన్యపుంగవులేడకవులేడ•కంబుకంఠి" నరస. దీనినే విషమాలంకారమని కొందఱు "విషమంవర్ణ్యతేయత్ర ఘటనాఽననురూపయోః, క్వేయంశిరీషమృద్వంగీ క్వతాదృఙ్మదనజ్వరః" కువ. శ్రీహర్షపండితుని కావ్యమునందిదియేశ్లోకము కించిద్భేదముగఁగనవచ్చుచున్నది. "శిరీషాదపిమృద్వంగీ క్వేయమాయతలోచనా అయంక్వచకుకూలాగ్ని కర్కశోమదనానలః" మఱియు 'వైదికపుబాఁపతేఁడ' అనుటకు నపరాధస్తవమునసిట్లు చెప్పఁబడి యున్నది. "పౌరోహిత్యం రజనిచరితం గ్రామణిత్వం నియోగం, మాఠాపత్యంహ్యనృతవచనంసాక్షి వాదః పరాన్నం, బ్రహ్మద్వేషం ఖలజనరతిః ప్రాణినాం నిర్దయత్వం, మాభూద్దేవో మమపశుపతే జన్మజన్మాంతరేషు" ఈనిరంకుశోపాఖ్యానమును జూచియే కాఁబోలు నొకానొకకవిఇట్లువర్ణించినాడు.

ఉ॥ ఎక్కడదెచ్చితక్కడగ • నింటికడన్ బెరకమ్మఁజూమటో,
చక్కఁదనాన నమ్మబుధ • వారపుసంతకు జట్టిగట్టుటో,
లెక్కలసంపుటంబుఁ బ్రబ • లించుటో, కోమటివారిపిన్న వా
రెక్కడ ? లంజబేరమది • యెక్కడ ? నెక్కడికెక్కడక్కటా !" బహు. చ,

ఈపద్యమునందలి సుభగశబ్దమునకనుకూలమయిన యొకవైచిత్ర్యముగలదు. శ్రీకృష్ణదేవరాయల సభలోఁగర్ణహీనయగు నొకవేశ్యనాట్యముచేయుచుండ రామలింగకవి యామెనుజూచియిట్లుపలికెను, "దుర్యోధనసభామధ్యే కర్ణహీనంనశోభతే" అనునంతలో నావేశ్య "భగదత్తప్రయోగేన కర్ణేన కిం ప్రయోజనమ్" అనెనట. ఈప్రశ్నోత్తరములయందు రెండర్థములుకలవు. దుర్యోధనసభయందుఁ గర్ణుఁడులేకున్నఁ బ్రకాశములేదు. కర్ణశబ్దమువాడుటకన్న భగదత్తుఁడనుటశ్రేష్ఠముగదా' అనిసమాధానము. మహావీరులున్న యీసభలోఁజెవులేనిదానవు నాట్యముసేయుటభాగుగలేదనిప్రశ్నము. వేశ్య భగమునొసంగిసుఖింపఁజేయునుగాని చెవివల్లనేమిప్రయోజనమని సమాధానము.

తా॥ ఓబ్రాహ్మణకుమారుడా ! జారత్వమనఁగా జపము, తపము, వేదశాస్త్రపఠనము, కర్మ ములనాచరించుట, పురోహితము మున్నగువానివంటిది కాదు. శ్రాద్ధాదులనుజేయించి యాతండుల ములతో జీవించెడిబాఁపలెక్కడ ? రాజకుమారులకుఁదగినలేఁబ్రాయపుఁజక్కని భోగమువారెక్కడ?

క॥ పావ మని నిన్ను నీతి క, ళావండితవాక్యసరణి • లాలించితిఁ గా
కోపిన్నవాఁడ విట దు, ర్వ్యాపార మడంప లంజ • వాకిటఁ బనియే. 132.

అ॥ ఓపిన్నవాఁడ - ఓపడుచువాఁడా, పాపము + అని - నీయందు జాలికలిగి, అయ్యో పాపము చెడిపోవుచున్నాఁడేయని, నిన్నున్ - నిన్ను, నీతికళాపండితవాక్యసరణిన్. నీతికళా - నీతియనువిద్యయందు, పండితవాక్యసరణిన్ - పక్వములైనమాటలయొక్క వరుసలచేత, మృదువయిన వాక్యములతో, లాలించితిన్ - మిక్కిలియనురాగయుక్తముగాఁజెప్పితిని, కాక - అటుఁగాని యెడల, విటదుర్వ్యాపారమున్ - వ్యభిచారులయొక్క చెడ్డనడతను, అడంపన్ - తగ్గించుటకు, లంజవారికిన్ - భోగమువారికి, పనియే - అవసరమా, ఇందు 'పిన్నవాఁడా' అనుటకు "సూ. కేచిత్తువైకృతాశ్శబ్దా ఃడాదిత్వేనైవసాధవః" అధ. అర్థాంతరన్యాసాలంకారము.

తా॥ ఓప్రాయపువాఁడా ! ఏదో నీపైదయదలఁచి శ్రేష్ఠములగు నీతులనుబోధించితిని. కాని వ్యభిచారమును మాన్పుట భోగమువారి కేమియవసరము.

సే॥ అనుచు నయభాషణము లాడి ♦ యాపలిక్కి, మంచిమాటల నరుగఁడీ ♦ మాల్గుఁబోతు
కఠినతరవాక్యములచేతఁ ♦ గాని చక్క, గాదు "లొటిపిటశూల రో ♦ కండ్లఁగాని".

అ॥ ఆపలిక్కి - ముసలిది, "ని. వృద్ధాపలిక్నీ" అ. అనుచున్ - ఇట్లుపలుకుచు, నయభాషణములు - నీతితోఁగూడినపలుకులు, ఆడి - చెప్పి, ఈమాల్గుఁబోతు - సోమరియైన యీనిరంకుశుఁడు, మాలుగు + పోతు - మాలుగుఁబోతు. ఉదా "ఉ. కూలికివచ్చియీాడవరి ♦ గోయుచుఁ గూరుకుఁజెందఁజొచ్చెనే, మాలుగుఁబోతు" చెన్న. పు మంచిమాటలన్ - ఇష్టమయినవాక్యముల చేత, అరుగఁడు - పోఁడు, కఠినవాక్యములచేతన్ - గట్టివియైనమాటలతో, కాని - తప్ప, "సూ. క్వచిదర్థవిశేషేచరూఢా విశ్రాంతిరుచ్యతే" అధ. లొటిపిటశూల - ఒంటెయొక్క శూలనొప్పి, ఇచట 'లొటిపిట-లొటిపిట్ట-లొట్టిపిట-లొట్టిపిట్ట' అనునాలుగు రూపములుకలవు, రోకండ్లన్ - రోకఁడ్లపోట్లతోఁగాని, చక్కగాదు - చక్కఁబడనేరదు: ఇచట "చక్క-చక్కన" అనిరెండు రూపములుకలవు. ఈపద్యమున 'కఠినతరవాక్యములతోఁగానిచక్కగాదు' అనుచోట విశేషణము లక్షకమగుటకు "సూ. విశేషణంబులు కొన్నియెడల విశేష్యలక్షకంబులగు" ప్రౌ. వ్యా. ఉదా 'వ బెట్టిదంబులంగాని చక్కంబడఁడు' భార. 'రోకండ్లన్' అనిప్రయోగించుటకు "సూ, ఔప విభక్తికలీనామిల్లుగ్బహుళంత్వైవదుశ్చస్యాత్" నన్న. ఇందు వేశ్యయొక్క కఠినవాక్యములనుగూర్చి "రాజావేశ్యాయమశ్చాగ్ని శ్చోరోబాలకయాచకాః, పరదుఃఖంనజానంతి అష్టమోగ్రామకంటకః" చాణ. 'కాదులొటిపిటశూలరో ♦ కండ్లఁగాని' అనునది లోకోక్త్యలంకారము. 'లొట్టిపిట్టశూల రోకలిపోటుతోఁగానిపోదు. పరుషవాక్కులతోఁగాని యితఁడుపోఁడు' అనుటచేఁబ్రతివస్తూపమాలంకారము. "క. వేర్వేఱవాక్యయుగమునఁ, బర్వినసాధర్మ్యమమరఁ బ్రఖ్యాతంబై, యుర్విం బ్రతివస్తూపమ" కా.సం. "ప్రతివస్తూపమాతుసా. సామాన్యస్యద్విరేకస్య యత్రవాక్యద్వయేస్థితిః" కా.ప్ర,

తా॥ ఇట్లు నీతులుఁగఱపి యావృద్ధవేశ్య యీసోమరి కఠినభాషణములచేఁదప్ప మంచిమాటల చేతఁబోఁడు. లొట్టిపిట్టకువచ్చినశూల రోకలిపోట్లచేతనే కాని పోదు.

వ॥ అని విచారించి యిట్లనియె. 134

అ॥ అని - ఈప్రకారముగా, విచారించి-ఆలోచించి, ఇట్లనియెన్-ఈవిధముగాఁజెప్పెను.

క॥ మా కేమి నీవుపోయిన, పోకలఁ బోకుండఁజేయఁ ♦ బొందువలసెనా
తేకచనుదేకు రూకలు, కోకలు నిష్ఫలములైన ♦ గొడవలుతగునే. 135.

అ॥ నీవుపోయినపోకలన్ - నీవునడచెడునడతలను, పోకుండఁజేయన్ - నడువనీయకుండ నడ్డగించుటకు, మాకేమి - మాకెందులకు,- మాకవసరములేదనుట. ఇచటబహువచనప్రయోగమును గూర్చి "సూ. సంబంధంబున యుష్మదస్మచ్ఛబ్దములకుం గొన్నియెడల బహుత్వంబగు" ప్రౌ. వ్యా. నిష్ఫలములు - ప్రయోజనములేనివి, ఐనగొడవలు - అయినట్టి యొకరిప్రమేయముతోఁగూడినప్రసంగములు, 'ని. గొడవ-కులకలహము' ఆం, దీ. ఉదా "వ. ఇట్లు తమకువలయుసెడఁ బడఁతులగొడవ తడవని తమయొడయఁడు తమ్ముమిగులఁగూడి మాడియుండమికి" హంస. [illegible] తగునే, యోగ్యమా, ఒకరి సంగతి మాకెందులకనుట పొందువలసెనా - నీకుమాతో స్నేహము కావలసియుండినట్లయిన, రూకలు కోకలు - రూపాయలను చీరలను, తేక - తెచ్చియీయక. చనుదేకు - రాకుము, ఇందు 'పొందు వలసెనా-గొడవలుతగునే' అనుటకు "సూ. అచ్ఛతుష్కంభవేత్త్వాణి స్థితంప్రశ్నాదివాచకం. తత్రాదిచ్ఛభవేద్దీర్ఘ ఏదోతావుభయాత్మకౌ" అధ. ఇచట వేశ్యపొందు వలసినచోఁ గోకలురూకలు తేక చనుదేకు, అనుటకు "క. కొక్కోకమెల్లఁజదివినఁ, జక్కనివాఁడైన రాజచంద్రుండైనన్, మిక్కిలిరొక్కముతీయక, చిక్కదు రావార కాంత" సుమ. ఈపద్యమున 'తేకచనుదేకు రూకలు కోకలు' అనుటచే వృత్త్యనుప్రాసాలంకారము.

తా॥ నీవుప్రవర్తించు ప్రవర్తనములను వలదనిమే మెందులకు నిరోధించెదము? వ్యర్థప్రసంగములతోఁ బనిలేదుగాని మాపొందుఁగోరితివేని కోకలురూకలుమున్నగునవి తీసికొనిరమ్ము. అటులఁ గాదేని నీవిచ్చటికిరాకుము.

తే॥ చదువుకొన్నాఁడ వటుమీఁద ♦ సరసముద్ర, కొంత యామీఁద భూసుర ♦ కులవరుండ
వయ్యయో నీవెఱుంగవే ♦ యర్థమీక, యూరకేపిల్చునే లంజ ♦ వారిపడుచు. 136.

అ॥ చదువుకొన్నాఁడవు - వేదశాస్త్రపురాణాదుల నభ్యసించినవాఁడవు, అటుమీఁదన్ - ఆపైన, సరసముద్ర - రసయుక్తమయినచిహ్నము,- రసికుఁడవుగానగపడుచుండుట, కొంత-కొంత గలదు, ఆమీఁద - దానిమీఁద, భూసురకులవరుఁడవు - బ్రాహ్మణజాతియందు శ్రేష్ఠుఁడవు, అయ్యయో - ఇదిమిక్కిలికనికరముతోఁ బలుకుటను దెలియఁజేయును, నీవెఱుఁగవే - నీకుఁదెలియదా, లంజవారిపడుచు - సానివారినాయకురాలు, అర్థమీక - ధనమొసంగనిదే, ఊరకేపిల్చునే- వృథాగారమ్మనిపిలుచునా, ఇందు 'ఊరకే పిల్చునేలంజవారిపడుచు' అర్థాంతరన్యాసాలంకారము. 'చదువుకొన్నాఁడవు. అటుమీఁదసరసముద్ర' ఇట్లుచెప్పుటచే సముచ్చయాలంకారము. "తత్సిద్ధిహేతావేకస్మిన్ యత్రాన్యత్తత్కరంభవేత్, సముచ్చయోఽసౌ" కా. ప్ర. ఉదా "కులమమలినం భద్రామూర్తిః శ్రుతిశాలినీ, భుజబలమలంస్ఫీతాలక్ష్మీః, ప్రభుత్వమఖండితమ్, ప్రకృతిసుభగాహ్యేతే భావాఅమీభిరయంజనో, వ్రజతిసుతరాం దర్పంరాజంస్త ఏవతవాంకుశాః" ర. గం. ఇంతగొప్పవాఁడవు నీకీ మాత్రముతెలియదాయనుటచే వ్యాజస్తుత్యలంకారమును. "వ్యాజస్తుతిర్ముఖేనిందా స్తుతిర్వారూఢిరన్యథా" కా. ప్ర. ఈపద్యమునుజూచి యొకకవియిట్లువ్రాసినాఁడు, 'తే, శోకపదియైదు

లేకున్నఁ ♦ గోఁకయొకటి, కాకయుండిన నొక మేక ♦ లేకపోయె, రూకయుచ్చినవి వెలఁ ♦ గాకవట్టి, రాకలఁ బిల్చినా గణి ♦ కాకులంబు" బహు. చ.

తా॥ చదువుకొనినవాఁడవు, రసికుఁడవు, బ్రాహ్మణులలో శ్రేష్ఠుఁడవు అయియుండిన నీ కింత మాత్రము తెలియదా? భోగమువారినాయకురాలు డబ్బునొసంగనిదే రమ్మనిపిలుచునా?

క॥ ఇచ్చకపుమాట లాడుచు, వచ్చెదు మూన్నాళ్ళనుండి ♦ వదలవు నేఁడున్
"బచ్చపయికంబు గుఱ్ఱము, చచ్చినదాఁకనె"యటన్న ♦ సామెత వినవే? 137.

అ॥ మూన్నాళ్ళనుండి - ఇప్పటికిమూఁడుదినములనుండి. ఇచట 'మూన్నాళ్ళ'నుటకు 'సూ. కొన్ని యెడలనవర్ణంబుపరంబగునపుడు పూర్వపదాంత్యడకారంబున కారంబగు" ప్రౌ. వ్యా. ఇచ్చకపు మాటలు - ప్రియవచనములు, ఆడుచున్ - చెప్పుచు, వచ్చెదు - వచ్చుచున్నావు, నేఁడున్ - ఈదినమునఁగూడ, వదలవు - విడిచిపోయినవాఁడవుకావు. పచ్చపయికంబుగుఱ్ఱముచచ్చినదాఁకనె- పచ్చనితురాయికరీదుగుఱ్ఱముచచ్చిపోవువఱకే, అనఁగాఁబూర్వమొకఁడు గుఱ్ఱమునకుఁదలమీఁద బెట్టికొనుపచ్చతురాయి నమ్మియుండెను. అదికొనినవాఁడావెల యెన్నాళ్ళకునిచ్చియుండలేదు. ఇట్లు బహుకాలముగడచినతుద కాగుఱ్ఱమేచచ్చెను. అప్పుడతఁడు నాపచ్చకరీదిమ్మనియడుగఁగా నీపచ్చతురాయిగుఱ్ఱముతోనేపోయినది పొమ్మనినాఁడట. అటన్నసామెతవినవే - ఇట్లుచెప్పఁగానెడు లోకోక్తినివినియుండలేదా, అనఁగా నీవిచ్చినసొమ్మంతయు మాపిల్లనీదగ్గఱయున్నప్పుడే చెల్లుపోయినదనుట. వేశ్యయిట్లనుటకు "ఆ. కలిమిగలిగినేని ♦ కాముని గాఁజూచు, లేమిచేతఁజిక్కి ♦ లేవలేని, మదనంతవాని ♦ మాలగాఁజూతురు" వేమ. ఇందు 'ఇచ్చకము' అనుటకుదా "ఈ ఎట్లిచ్చకమయ్యెనీకునివి" కళా. "వ. అప్పుడిచ్చకులగుచు బ్రాహ్మణులుకొందఱు" అను 'వచ్చెదు' అనుటకు "సూ. క్వచిద్వర్ణకేచాపి కేఽత్ర స్యస్థితిఁజగుః" అథ. 'పయికము' ఇదిపైకమునకు రెండవరూపము. ఉదా "సీ. పరవర్తకుల కల్ల ♦ సరకులిచ్చెదనని, తివిరిపైకముఁగొని ♦ త్రిప్పుచుండు" భళ్ళ్వ. 'ని. పైకము-పయికము' శ. చం. 'పచ్చపయికంబుగుఱ్ఱముచచ్చినదాఁకనె' అనుటచే లోకోక్త్యలంకారము.

తా॥ ఇప్పటికి మూఁడుదినములనుండి తీయనిమాటలుచెప్పుచు వచ్చుచుంటివి. కాని డబ్బుమాత్రము తెచ్చుటలేదు. ఈవేళను గదలకుంటివి. 'పచ్చపయికముగుఱ్ఱము చచ్చినదాఁకనె' అను లోకోక్తిని నీవువినియుంటివిగదా!

దే॥ మాట లిఁక వేయు నేటికి ♦ నేఁటిరాత్రి, చీరప్పుత్తెంచె నుడిగాల ♦ వారిచేత
నూరియేలికరాజుకు ♦ మారుఁ డల్ల, పెద్ద చౌకట్లపోవుల ♦ పిల్లఁవాడు. 138.

అ॥ ఇఁకన్ - ఇఁకమీఁదట, మాటలు - నీతోడిప్రసంగములు, వేయున్ - అనేకములు, ఏటికిన్ - ఎందులకు, ఇచట 'మాటలిఁకవేయునేటికి' అనుటను 'సూ. లోకోక్తి స్సాంభవేద్యోగో యదిస్యాచ్ఛ్రుతిరంజనమ్' అథ. నేఁటిరాత్రి - ఈరేయిపడకకు, ఊరియేలికరాజుకుమారుఁడు - ఈపట్టణమునుపాలించెడి రాజునకుఁగొడుకు, అల్ల - ఆయొక్క, : ప్రసిద్ధినితెలియఁజేయుట, ఉదా అల్లనాఁడు. పెద్దచౌకట్లపోవులపిల్లవాఁడు - నాలుగుముత్యములు చదరముగాఁగట్టి జేయఁబడినచెవి

పోఁగులుగలకట్టఁడు. ఇచట 'చవుకట్టులకు- చౌకట్టులు, చౌకట్లు' అని రూపములుకలవు. ఊడిగాల వారిచేతన్ - సేవకురాండ్రచేత,- దాసీలచేత, చీరెపుత్తెంచెన్ - కోకనుబంపించినాఁడు. ఇచట ద్వితీయకుఁ బ్రథమచెప్పఁబడినది. "సూ. ఇతరత్రచద్వితీయాతస్యాః ప్రథమాచజడపదానాంస్యాత్" నన్న. 'పెద్దచౌకట్లపోవులపిల్లవాఁడు' అనుప్రయోగమునకు "సూ. స్యాదాభాగబహువ్రీహిః ప్రథమాంతప్రయోగతః" అధ. ఉదా 'ముత్యాలకమ్మలమద్దులాడి' ఇత్యాదులు. "నేటికినేటిరాత్రి" అనుప్రాసాలంకారము.

తా|| పెక్కుమాటలతోఁ బనిలేదుగాని యీపట్టణమునేలుచున్న రాజుకొడుకు నీపెద్దముత్యాలపోగులబ్బాయి యిప్పుడేదాసీలచేతఁ జీరనుబంపినాఁడు. ఈతఁడీరాత్రిపడకకువచ్చును. కావున నీవు వచ్చినను వ్యర్థముగాఁబోవలసినవాఁడవే.

—: వేశ్యమాత కూఁతురిఁ గొట్టఁబోవుట :—

వ|| అని యిత్తెఱంగునఁ గసరెత్తి విటులపాలిటిమిత్తి మర్మంబులెత్తి పలుకుచు నత్తఱిం దత్తరంబున గృపాయత్తచిత్తయై తత్తరిల్లుబిత్తరిసూతుం గని బత్తి వడక యోసీ మొగమోటకత్తెవై వట్టిజిత్తులుసేయుదిత్తముడికాండ్ర హుజిత్తని పించక విత్తహాని చేసితి వనిబెత్తంబుతీసికొని మొత్తఁ బోయిన. 139.

అ|| అని - ఇట్లని. ఇత్తెఱంగునన్ - ఈవిధముగా, కసరెత్తి - ఇష్టములేనితనము నారంభించి, విటులపాలిటిమిత్తి - వ్యభిచారపురుషులకు లభించినమృత్యుదేవత, అయిన యావృద్ధవేశ్య. మర్మంబులెత్తి-రహస్యములనుబయటఁబెట్టి- నెపములవెతకి, పలుకుచున్-మాట్లాడుచు, అత్తఱిన్- ఆసమయమున, తత్తరంబుగన్ - శీఘ్రముగా, కృపాయత్తచిత్త - దయకుస్వాధీనమయిన- మనస్సు గలదై, తత్తరిల్లుబిత్తరిసూఁతున్ - చలించుచున్నటువంటి ప్రౌఢయగుకుమార్తెను, 'తత్తరిల్లు' అనుటకు 'సూ. యథాశాస్త్రం యథాశక్తి యథాశ్రోత్రానురంజనం యథాప్రసిద్ధి సర్వత్ర శబ్దానాంకల్పనామతా' అధ. కని - చూచి, బత్తివడక - ప్రేమయుంచక, ఓసీ - ఇదీసంబుద్ధి, మొగమోటకత్తెవై - ముఖప్రీతిగలదానవై - దాక్షిణ్యముగలదానవై, వట్టిజిత్తులు - బొత్తిగామాయలు, చేయుదిత్తముడికాండ్రన్ - లొంగునడబ్బులేనివారలను, ఇచట జిత్తులనుటకుదా "ఉ. అత్తలమామలన్మగల, నన్నలఁ దమ్ములఁ దల్లిదండ్రులన్, జిత్తులమద్దుపెట్టుదను ♦ జీటికిమాటికి నన్నెఁజేరఁగా వత్తురు" దశా. చ. హుజిత్తనిపించక - మోసముచేసినదనుకొనునట్లుచేయక, ఏదోవిధముగా వెడలఁ గొట్టకయనుట, హుజిత్తుశబ్దము హిందూస్థానీపదమునుండి రాఁబడినదగును. హిందీలోమాత్రము 'హుజ్జత్' అనికలదు. కాని యీ 'హుజ్జత్'కు కలహమని చెప్పఁబడియున్నవి. 'హుజ్జాత్-హుజ్జత్' ఇవి మోసమునకును మాయకును అర్థమునిచ్చుచున్నవి. 'జిత్తు' పదము కూడ మోసమునకును మాయకును అర్థముకలదియైయున్నది. ఈపదప్రయోగమునుగూర్చి 'సూ. అపేయమన్యదేశీయం యత్ర దేవప్రయుజ్యతే' అధ, విత్తహాని - ధననష్టమును, చేసితివి - కలిగించితివి, అని - ఇట్లుపలికి, ఇచట 'చేసితివని' సంధికూర్చుటకు 'నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః' నన్న. బెత్తంబుతీసికొని - ఒక

సన్ననికఱ్ఱను దీసికొని, మొత్తఁబోయినన్ - కొట్టఁబూనఁగా. ఇచటద్వితీయకుఁ బ్రథమచెప్పఁబడినది. "సూ. ఇతరత్రచద్వితీయా తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్" శబ్దచిం. ఇందు 'కూతున్' అనుచోట రువర్ణకము రామింగూర్చి "సూ. ఏకత్వే చ భవేద్వారు స్తథా తా చ భవేత్క్వచిత్" అథ. ఈవచనమంతయు వృత్త్యనుప్రాసాలంకారము. తే "ఒకటిరెండును మూఁడు నైనొకటియు ద్రావాలు, పద్యమున నచ్చటచ్చటఁ బరఁగునేని, వృత్త్యనుప్రాసవననిది ♦ విస్తరిల్లు, లలితరీతుల కెల్ల వి ♦ లాసమగుచు" కావ్యా. చూ. 'విటులపాలిటిమిత్తి' ఉపమాలంకారము. ఇచటఁ జంపకగంధియొక్క యుదారగుణమును సూచింపఁజేసినాఁడు.

తా॥ కోడెకాండ్రకు మిత్తియగు నాజలభి యట్లు జిగట మాటలతోను, మర్మములతోను వదరుచుండనయ్యేడఁ గనికరముతోఁ గదలుచున్న జవరాలగుకూఁతుంగని దయమాని యోసీ మొగమోటము చే మోసగాండ్రగువిటుల మాయచేసి వెళ్ళఁగొట్టక డబ్బునష్టపెట్టుచుంటి వని యొకసన్నని కఱ్ఱతోఁ గొట్టఁబోఁగా.

—: వేశ్యమాతకు భయపడి నిరంకుశుఁడు పారిపోవుట: —

క॥ ఈపాటు కదలకున్నన్, గోపంబున నన్నుఁ గూడఁ ♦ గొట్టును దీనిన్
దూపాడువంగలనే "యా,శాపరమందుఃఖ" మనుచుఁ ♦ జయ్యన నరిగెన్. 140.

అ॥ అనిరంకుశుఁడు-అధ్యాహారము-ఈపాటు, కదలకున్న - ఇదేవిధముగాఁగదలకుండినట్లయిన, కోపంబునన్ - క్రోధముతో, నన్నుఁగూడన్ - నన్నుసైతము, కొట్టును - కొట్టఁగలదు, దీనిన్ - ఈముసలిదానిని, తూపాడువంగలనే - తూతూయనియుమియఁగలుగుదునా, అనఁగా దీనియొక్క కోపమునకుఁ దగినంతటిపరాభవమును జేయఁగలనాయనుట. ఉదా "వ, తూపాడిచిరి" హరివం. 'ఆశాపరమందుఃఖం' ఆశయధికదుఃఖమును గలిగించును. అనుచున్ - ఇట్లుతలంచుచు, చయ్యనన్ - శీఘ్రముగా, అరిగెన్ - పోయెను, ఇచట మకారమునకుద్విత్వము వికల్పముగాని నిత్యము కాదు. "అహమాదీనాం ద్విత్వమ్" నన్న. ఉదా 'దాసోహమనియె' "సూ. అంతగస్య హలో ద్విత్వం భవేదనుకృతేపరే తత్రోతో వ్యభవే న్నిత్యంముస్యతత్క్వచిత్ష్యతే" అథ. లోకోక్త్యలంకారము.

తా॥ అనిరంకుశుఁడు నేనిఁకఁ గదలకుండినట్లయిన నన్నుఁగూడఁ గొట్టుటనిక్కము. దీని కోపమును తగ్గింప నాతరముగాదు. ఆశచేతనే మిక్కిలిదుఃఖముసంభవించును గదా! యని తలంచుచు శీఘ్రముగాఁ బోయెను.

—: రాజుప్రశ్నించుట :—

క॥ అనినవిని వదనకమలం, బున లేనగవంకురింప ♦ భూనాయకుఁ డో
మునినాథ విప్రుఁ డెచటికిఁ, జనియెం దుద నేమిచేసె ♦ సకలముఁ జెప్పుమా. 141.

అ॥ అనినన్ - ఆమునీంద్రుఁడిట్లుచెప్పఁగా, భూనాయకుఁడు-ఆధర్మశీలుఁడగు రాజు, విని-ఆకర్ణించి, వదనకమలంబునన్ - తామరపువ్వువంటిమొగమునందు, లేఁగవు - లేఁతనవ్వు, చిఱునవ్వు, అంకురింపన్ - పొడమఁగా, ఓమునినాథ - ఋషులకుఁబ్రభుఁడవైన యోపులహుఁడా, విప్రుఁడు - ఆబ్రాహ్మణుఁడు, ఎచటికిన్ - ఎక్కడికి, చనియెన్ - పోయెను, తుదన్ - కడపట, ఏమిచేసెన్ - ఏమిచేసినాఁడు, సకలమున్ - ఈవృత్తాంతమంతయును, చెపుమా - ఆనతిమ్ము, ఈపద్యమున 'చనియెందుద' అనుటకు "సూ. పరసాద్రుతప్రకృతికాత్సరళాస్య స్త్రస్థ్విరితం చబిందుస్స్యాత్" నన్న. ఇచటరాజునకు హాసముచెప్పఁబడినది. "వికృతిదర్శనాదిజన్యో మనోవికారోహాసః" ప్రతా. లేనగవునుగూర్చి 'శ్రేష్ఠానాంస్మితహసితే' అనిశాస్త్రము. 'వదనకమలంబు' ఉపమాలంకారము.

తా॥ పులహుఁ డిట్లుచెప్పఁగా ధర్మశీలనృపాలుఁడు విని చిఱునవ్వుతో నోమహర్షిశ్రేష్ఠుఁడా! ఆబ్రాహ్మణసుతుఁ డెచ్చటికేగెనో, తమపరియతఁడేమిచేసెనో యావృత్తాంతమంతయు నానతిమ్మనెను.

—: ఆశ్వాసాంతము :—

మ॥ బహుళాపుత్త్రి నిశాకళత్ర మునిశం ♦ పావిగ్రహాభోగసం
గ్రహవాంఛా గురుకామినీరతికళా ♦ ప్రారభ్యమాణాఘ దు
ర్వహతా నిర్మథనార్థ దుస్సహతపః ♦ ప్రాబల్యసాఫల్య కృ
న్మహనీయైందవ సత్కళాభరణర ♦ మ్యస్కంధసోమేశ్వరా. 142.

అ॥ బహుళా............సోమేశ్వరా. బహుళ - విస్తారముగా, "ని బహుళస్స్యాద్విపులే త్యాది సంఖ్యాయాం చత్రిలింగకః" నానా. లః - ఖండింపఁబడిన, "ని. లఃఖండితేత్రిష్వాదానే" నానా. అపుత్త్రి - వంధ్యాత్వముగల, నిశా - రాత్రియును, కళత్ర - భార్యగలిగినట్టియు, ముని - అత్రిమునియొక్క, శంపా - తేజస్సుతోఁగూడిన, విగ్రహ - శరీరముగలిగి, ఆభోగ - చిత్తపరిపూర్ణత్వముతో - నిండారినమనస్సుతో, సంగ్రహవాంఛా - స్వీకరించుటయందలికోరికచేత, గురుకామినీ - విద్యనుపదేశించిన గురువగు బృహస్పతిభార్యయైన తారయొక్క, రతికళా - సంభోగవిద్యవలన, ప్రారభ్యమాణ - ఆరంభించుచున్న, అఘ - పాపముయొక్క, దుర్వహతా - అలవిగానిభారము, నిర్మథనార్థ - విశేషముగాఁద్రచ్చుటకొఱకు, దుస్సహతపః - ఓర్వరానితపస్సుచేత, ప్రాబల్యసాఫల్య - మిక్కిలిఫలసహితముయినదిగా, కృత్ - చేయుచున్న, మహనీయ - గొప్పదియైన, ఐందవసత్కళా - చంద్రునియొక్క ప్రకాశించుచున్న యంశమే,- ఒప్పుచున్నచంద్రకళయే, ఆభరణ - శిరోభూషణముగాఁగలిగి, రమ్య - మనోహరముగానున్న, స్కంధసోమేశ్వరా - కందుకూరియందుఁగల సోమేశ్వరస్వామీ, ఇదియాశ్వాసాంతమునఁగృతిపతికిసంబోధనము. ఇచటఁ జంద్రుఁడు శాపమననుభవించుటయు నదిపరిహారమగుటయునుగూర్చి శివరాత్రిమహాత్మ్యమున "క,శశియా, మాననిఁగలయ బృహస్పతి, పూనికళపియించె క్షయముఁబొందుదువనుచున్" తే॥ శాపమణఁపఁగోరి ♦ చంద్రుండు కావేరి, తీరమునకునరిగి ♦ దేవదేవు, శివునిఁగూర్చి తపము♦సేయ

నావేల్పుఁ బ్ర ♦ త్యక్షమగుచుఁ బల్కెఁ ♦ నాదరమున" క. శివరాత్రివ్రతమునడుపుచు, శివునింబూజింపు కోర్కి ♦ చేకూరుపదా, శివుఁడను నేనేనిక్కము, శివలీలఁ జూళిఁదాల్తు సిద్ధముచంద్రా" శేష. గురు పత్నీసంగమ దోషముగూర్చి యిట్లుచెప్పఁబడియున్నది; "బ్రహ్మహత్యాసురాపానం స్తేయం గుర్వంగనాగమః, మహాన్తిపాతకాన్యాహు స్తత్సంయోగశ్చపంచమమ్" మను. సంతానవతియగు రాత్రియే భార్యగాఁగలవాఁడును, బ్రహ్మతేజస్సుతోఁగూడిన యాకారముగలవాఁడును, ఎడతెగని కామినీసంభోగమువలన లభించిన పాపభారము నిశ్శేషముగాభిన్నపరచుటకై దుస్తరమగుతపస్సు చేసి సఫలీకృతమనోరథుఁడైనబాలంచంద్రుని శిరసావహించినవాఁడా! అనుటలోఁ గథానాయకుని కింకఁగలుషరహితమగుననియు, సంతానప్రాప్తుండగుననియుఁ, పరమేశ్వరానుగ్రహమువలన మోక్ష ప్రాప్తుఁడు కాఁగలఁడనియు ధ్వనించుచున్నది. 'బహుళాపుత్రి' అనుటలో నిరంతరసంభోగలాలస యగు రంభకుఁగల వంధ్యాత్వమును, అట్టిరంభాసంభోగము కథానాయకునకును సూచించుచున్నది. ఇంచుఁబ్రకృతార్థప్రతిపాదకవాక్యమున శ్లేషసామర్థ్యముచేత నప్రకృతమయిన కావ్యార్థమును స్ఫురింపఁజేయుటచే సమాసోక్త్యలంకారము. "పరోక్తిర్భేదకైఃశ్లిష్టైః సమాసోక్తిః" కా. ప్ర.

తా॥ నిస్సంతానదోషమును బోఁగొట్టఁబడిన రాత్రియనుకళత్రముగలవాఁడును, అత్రిమహర్షి యొక్క తేజస్సుతోఁగూడిన మనోహరమయినవాఁడును, విద్యనుపదేశించిన గురువగు బృహస్పతి భార్యయైనతారనుగూడినందున సంప్రాప్తమయిన పాపభారము నామూలముగాఁబోఁగొట్టుకొనుటకై సహింపరానితపస్సుచేసి సఫలతనొందియున్న లేఁజందురునిఁదలయందుఁదాల్చిన యోశంభుకూరి సోమేశ్వరస్వామీ !

చ॥ హతసుమబాణ బాణదను ♦ జావసథాంగణవాస వాసవా
ర్చితపదపద్మ పద్మభవ ♦ శీర్షవిఘాతనిదాన దానవ
క్షతి కృతిదక్ష దక్షమఖ ♦ సంహృతికర్మధురీణ రీణ దు
ష్కృత పరితాప తాపస స ♦ మృద్ధికళాలసమానమానసా. 143.

అ॥ హతసుమబాణ – చంపఁబడినమన్మథుఁడుగలవాఁడా, బాణ.....వాస. బాణదనుజ– బాణాసురునిదయిన, అవసథ – ఇంటియొక్క, అంగణ – ముంగిలియందు, వాస – నివాసముగల వాఁడా, వాసవార్చితపదపద్మ – ఇంద్రునిచేతఁబూజింపఁబడిన కమలములవంటి పాదములుగల వాఁడా. పద్మ.....నిదాన. పద్మభవ – బ్రహ్మయొక్క, శీర్ష – శిరస్సును, విఘాత – కొట్టుటకు, నిదాన – కారణమయినవాఁడా, దానవక్షతికృతిదక్ష. దానవ – రాక్షసులయొక్క, క్షతికృతి – నాశనముచేయుటయందు, దక్ష – సమర్థుడవైనవాఁడా, దక్షమఖసంహృతికర్మధురీణ. దక్షమఖ – దక్షునియజ్ఞముయొక్క, సంహృతికర్మ – సంహారకార్యమునందు, చంపునట్టిపనియందు, ధురీణ – భారమునువహించినవాఁడా, రీణదుష్కృతపరితాప. రీణ – జాఱిన, "ని. స్యన్నంరీణంస్నుతం ప్రసుతమ్" అ. దుష్కృత – పాపములయొక్క, పరితాప – కాల్చుటగలవాఁడా, తాపస... ...మానసా. తాపస – ఋషులయొక్క, సమృద్ధి – అభివృద్ధికొఱకయిన, కళా – విద్యచేత, లసమాన – ప్రకాశించుచున్న, మానసా – మనస్సుగలిగినయోసోమేశ్వరస్వామీ, ఇందునాలవపా దమున ఋత్వసంబంధయతి చెప్పఁబడినది. "తే. సారిదిఁగాదుల నుడివఁట్రు ♦ సుడులకెల్ల, ఋత్వ

మిత్రంబులగు నచ్చు ♦ లెనయనైరుఁ, జెల్లుహాయలంను స్వగమైత్రిఁ♦జెందునపుడు, జెలయునవిబుత్వ సంబంధ ♦ కళులనంగ" అప్ప. ఉదా "ఆ. ఇనతనూభవుండు ♦ పృషదశ్వసుతు నేసె, ఋభునదీసుతుండు ♦ కృష్ణు నేసె, నేమిచెప్పనపుడు ♦ దృఢశక్తిశల్యుఁడు, హీనబలునిఁజేసె ♦ వృష్ణికులుని" ముక్తపదగ్రస్తాలంకారము.

ఉత్సాహవృత్తము: దందశూకభూష మోహ ♦ దాహకాజగత్త్రియీ
కందసంశ్రితాచలేంద్ర ♦ కందరాపరాక్రమా
స్పందితారి సంస్తువత్సు ♦ పర్వపర్వతాగ్నిది
క్కందుకూరిపట్టణ ప్ర ♦ కాండమండనోదయా. 144.

అ॥ దందశూకభూష – సర్పములే యాభరణములుగాఁగలవాఁడా, మోహదాహకా – కామమునుదహించునట్టివాఁడా, అనఁగా మన్మథునిఁజంపినవాఁడాయని భావము. జగత్త్రియీకంద– ఈమూఁడులోకములకు మూలమయినవాఁడా, సంశ్రితాచలేంద్రకందరా. సంశ్రిత – ఆశ్రయింపఁబడిన, అచలేంద్ర – పర్వతరాజమయిన హిమవంతముయొక్క, కందరా – గుహఁగలవాఁడా, పరా.........దయా. పరాక్రమ – శౌర్యమునను, ఆస్పందిత – స్థానముగాఁజేయఁబడిన, అరి–శత్రువులచేత, సంస్తువత్ – స్తోత్రముచేయఁబడుచున్న, సుపర్వపర్వత – దేవతలకునివాసమయినమహామేరువునకు, 'ని. రత్నసానుస్సురాలయః' అ. అగ్నిదిక్ – ఆగ్నేయదిశయందుఁగల, కందుకూరిపట్టణ – కందుకూరిపట్టణమును, ప్రకాండ–శ్రేష్ఠమయినపురమునకు, "ని. ప్రకాండముద్ఘతల్లజౌ" అ. మండన – భూషణముగా, ఉదయా – అవతారముగలిగినట్టి సోమేశ్వరస్వామీ, కందుకూరు శ్రీశైలమున కాగ్నేయముననున్నది. అచటివారు శ్రీశైలస్యఆగ్నేయప్రదేశే. అనిసంకల్పమునఁ జెప్పికొనుచుందురు. కవివర్ణించినది మహామేరువుకనుక 'మేరోర్దక్షిణదిగ్భాగే' అనియెల్లరము చెప్పుకొనుచున్నాము. కాని మహామేరువు భూమికిమధ్యనున్నదని శాస్త్రప్రసిద్ధికనుక నాగ్నేయమనినను సమంజసమేయగును. 'ఇందుఁమోహదాహకా – సుపర్వపర్వత – ప్రకాండమండన' యివి యనుప్రాసాలంకారము.

గద్యము. ఇది శ్రీమత్కాళీవరప్రసాదలబ్ధ లబ్ధవర్ణవర్ణనీయ కవితత్త్వధౌరేయ, పెదలింగనార్యగర్భార్ణవపూర్ణిమాత్రేయ, గురువరాచార్యపదారవింద మిళిందాయమానమానసాశ్రేయ, పండితమ్మన్యతరాజేయ, సకలవిద్వజ్జనవిధేయ, రుద్రయనామధేయ ప్రణీతంబయిన నిరంకుశోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

అ॥ ప్రథమాశ్వాసమునఁబోలె నెఱుంగునది.

ఇది శ్రీమద్గాయత్రీ విరాడ్విశ్వకర్మ వరప్రసాదజనిత కవితామృత రసపాత్ర, అహభూనస గోత్ర పవిత్ర, అచ్చమాంబా వెంకటశివార్యపౌత్ర, లక్ష్మాంబా కోటీశ్వర సుధీమణిపుత్ర, శిల్ప వాస్తు జ్యోతిశ్శాస్త్రాదివివిధవిద్యాప్రవీణ, పదవాక్యప్రమాణ నిధాన, విమర్శకాచార్యశిల్పకళాకోవిదేత్యాది బిరుద నిరుపమాన, బుధారాధన విరాజమాన, సుబ్రహ్మణ్యాభిధాన; విరచితంబైననిరంకుశోపాఖ్యాన సుధాతరంగిణీవ్యాఖ్యానమున ద్వితీయాశ్వాసము.

శ్రీ ర స్తు

# నిరంకుశోపాఖ్యానము



## సుధాతరంగిణీ వ్యాఖ్యానసమేతము



### తృతీయాశ్వాసము

క౦॥ శ్రీతన్వీధవసాయక, వీతనయాపేక్షదక్ష ♦ వినిహతిపునరు
ద్భూతివిధాయక కటకీ, భూతభుజంగేశ కంద ♦ పురసోమేశా. 1.

అ॥ శ్రీతన్వీధవసాయక. శ్రీతన్వీ - లక్ష్మీదేవియనెడి సౌందర్యవతికి, ధవ - నాథుఁడైనవిష్ణువే, సాయక-బాణముగాఁగలవాఁడా, వీత.....యక, వీత-పోయిన, నయ-నీతియందు, అపేక్ష-కోరికగల, దక్ష-దక్షుఁడనెడిబ్రహ్మయొక్క, వినిహతి-చావునకును, పునః-మరల, 'ని. పునరప్రథమే భేదే' అ. ఉద్భూతి-పుట్టుటకును, విధాయక-విధించినట్టివాఁడా, ఆజ్ఞాపించినట్టివాఁడా, కటకీభూతభుజంగేశ, కటకీభూత-కంకణముగానయిన, భుజంగేశ-సర్పములకురాజయిన శేషుఁడుగలిగినవాఁడా, కందపురసోమేశా-ఓకందుకూరిసోమేశ్వరస్వామీ, అని యాశ్వాసారంభమునందుఁ గృతిపతికి సంబోధనము. ఇందుసోమేశ్వరస్వామియొక్క హస్తగతుఁడు విష్ణువనియు, నతనియధీనమున లక్ష్మి కలదనియుఁ, జెప్పుటచేత నుదాత్తాలంకారము 'ఉదాత్తం వస్తుతః సంపత్ మహతాం చోపలక్షణమ్' కా. ప్ర. ఇష్టదేవతాసంబోధనమగుటచేఁ బరికరాలంకారమును 'విశేషణైర్యత్సాకూతై రుక్తిః పరికరస్తు సః' కా. ప్ర.

తా॥ లక్ష్మీపతియే ప్రాణముగాఁ గలవాఁడవును, న్యాయమును దప్పిన దక్షునిఁ జంపియును మరల బ్రతికించినవాఁడవును, పాములరాజగు శేషుఁడే కంకణముగాఁ గలవాఁడవును, అగు కందుకూరి సోమేశ్వరస్వామీ,

గీ॥ అవధరింపుము తత్త్వవి ♦ ద్యావివేక, దళితకామాదిరిపువర్గ ♦ కలహుఁడైన
పులహుఁడిట్లు పలికెనా ♦ భూవరేణ్య, శేఖరునితోడ వాక్యవై ♦ చిత్రిమెఱయ. 2

అ॥ అవధరింపుము- వినుము, తత్త్వ........కలహుఁడు, తత్త్వవిద్యా - వేదాంతశాస్త్రమునందలి, వివేక-జ్ఞానముచేత, దళిత-ఛేదించబడిన, కామాదిరిపువర్గ-కామము మొదలగు నరిషడ్వర్గముయొక్క అనఁగాఁగామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యములయొక్కయనుట, కలహుఁడు - పరస్పరవివాదము గలవాఁడు, ఐన-అయినట్టి, పులహుఁడు - పులహుఁడను పేరుగల బ్రహ్మ, ఆ భూవరేణ్య శేఖరునితోడన్-రాజులలోశ్రేష్ఠుఁడగు నాధర్మశీలునకు, వాక్యవైచిత్రి మెఱయన్, వాక్య - మాటలయొక్క, వైచిత్రి-చోద్యము, మెఱయన్-ఒప్పఁగా, ఇట్లని-ఈ చెప్పబోవురీతిగా, పలికెన్ - చెప్పెను.

తా॥ వేదాంతవిజ్ఞానసంపన్నతవలనఁ గామ క్రోధ లోభ మోహ మదమత్సరము లను నరిషడ్వర్గమును గెలిచినవాఁ డగు పులమహర్షి శ్రేష్ఠుఁ డగు ధర్మశీలనృపాలున కిట్లు చెప్ప మొదలిడెను.

—; నిరంకుశుఁ డరణ్యమున కేఁగుట ;—

ఉ॥ వింటివె ధారుణీరమణ ♦ విప్రకుమారకుఁ డప్రబుద్ధినా
కంటకురాలు పల్కిన వి ♦ కారపుమాటల దుఃఖితాత్ముఁడై
యింటికిసైతమును జనక ♦ యీశ్వరసంఘటనంబె తోడుగా
వెంటసహాయసంపదలు ♦ వేఁడక పోయె నరణ్యభూమికిన్. ౬.

అ॥ ధారుణీరమణ-ఓరాజా, వింటివె-ఆకర్ణించితివా, విప్రకుమారకుఁడు - బ్రాహ్మణునికొడుకైన యానిరంకుశుఁడు, ఆకంటకురాలు - ఆకఁతెకురాలు, అనఁగా ముల్లువలెబాధించునది, ఇచట 'కంటకురాలు' అనుటకు 'సూ. దారార్థేతఙదసిగః' నన్న. సూ. అఙ్గ్లలోగాలుశఙ్గేన, సమానార్థకతా యది, సమానస్త్రతచోద్ర స్యాద్యదేస ఏవక్వ చిద్భవేత్' అన. అప్రబుద్ధిన్-అవివేకముతో, పల్కిన-అనిన, వికారపుమాటలన్-అసహ్యమైన వాక్యములచేత, ఇచట 'కంటకురాలుపల్కిన' అనుటకు 'సూ. పరుషావాస్వరూపేణ ప్రథమాంతోపరస్థితాః కాకుసంబోధనేనాపి హ్యాస్యయేకస్మధారయే, అచేతనార్థకే శబ్దః ఇతి శృంగారభూషణః, అన. దుఃఖితాత్ముఁడు; దుఃఖిత-కష్టమునొందిన, ఆత్ముఁడు-మనస్సుగలవాఁడు, 'ని. ఆత్మాజీవే ధృతౌదేహే స్వభావే సగమాత్మని' వై. ఐ - అగుచు, ఇంటికిసైతమున్ - తన గృహమునకుఁగూడ, ఊబా. 'ఉ. మేముసైతమున్ వాచినవారియట్ల గరు ♦ వంబునఁ గన్గొనుచుంటిమప్విభుక్' వి. పు. చనక - పోకుండి, ఈశ్వరసంఘటనంబె-భగవంతునివలనఁ గూర్పఁబడినదియే, పురాకృతకర్మఫలప్రారబ్ధమే "కర్మాయత్తం ఫలం పుంసాం, బుద్ధిః కర్మానుసారిణీ, తథాపి సుధియాచార్యాః, సువిచార్యైవ కుర్వతే, అనువచనము ననుసరించి యాతఁ డరణ్యమునకుఁ బోయి యచటఁ గల పాడుగుడియం దీశ్వరునితో బూదమాడి భగవద్దర్శనము నందవలసినట్లదృష్టముండుటచేతనే నిరంకుశుఁడే కాకిట్లు యుడవిఁ జేగెనని భావము. తోడుగాన్ -తనకు సహాయముకాఁగా "శ్లో, సుకృతం దుష్కృతం చైన, గచ్ఛంత మనుగచ్ఛతి." అని శాస్త్రప్రసిద్ధి కనుక తనపాపపుణ్య ఫలములే తనకుతోడగును, వెంటన్-తనవెంబడి, సహాయసంపదలు-రక్షణకుపయుక్తమగు మనుష్యసాధనాదిసమృద్ధులు, వేఁడక-ఎవ్వరినిఁ బ్రార్థించక, ఇది ప్రమత్రసకృతికముకాదు 'సూ. అక్రప్రత్యయాం తావ్యయంబుకళయ' ప్రౌ. వ్యా. అరణ్యభూమికిన్-అడవిప్రదేశమునకు, పోయెన్-వెళ్ళెను. ఇచట వేఁడకపోయెన్, అనుటకు 'సూ. భూగమిక్రియయోగంతే ఘటకాఖ్యానముచ్యతే, అథ. 'జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ. తస్మాదపరిహార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి' అని భాగ. ఉత్పత్తియగుపదార్థమునకు నాశము సిద్ధము. అట్లే నాశము బొందిన వస్తువునకు ఉత్పత్తియు సిద్ధము. కాబట్టి బరిహరింప శక్యము గాకుండెడి జనన మరణముల విషయమై శోకింపఁ దగదు. దేహాంతరార్జితకర్మమే దైవము. 'త్వమేవ కర్మ దైవాఖ్యం, విద్ధి దేహాంతరార్జితమ్' మత్స్య.పు. దాని బలమెట్టిదన "దైవాధీనం జగత్సర్వం. జన్మకర్మ శుభాశుభం. సంయోగాశ్చ వియోగాశ్చ నచదైవాత్పరం బలమ్ బ్ర. వై. పు. ఇందు 'కంటకురాలు' అనుటకు 'సూ. దారార్థేత

ఉదపి గః, అనినన్న 'మః ఖితాత్మ్యఁడు, ఇఁ నాత్మన్ శబ్దమునకు డుప్రత్యయము కల్పించుటకు 'సూ. ఆత్మన ఇమనన్తాం డా వా, అనినన్న.

తా॥ ఓపుడమిఱేఁడా! తనుపర యేమైనదో తెలిసినదా! ఆబ్రాహ్మణయువకుఁడు మసలి బోగముదాని యసహ్యమైనమాటలకుఁ జాలవిచారపడి తనయింటికైనఁబోక ప్రారబ్ధము దప్ప మఱి యేసహాయమును లేక యొంటరిగా నడవికిఁ బోయెను.

క॥ పోవుచు నెదుట ధరిత్రీ, దేవతనూజుండు గాంచె ♦ దిగ్దంతి జిగీ
షావిశ్రుతమత్తేభ ఘ, టావార్య విహారగహన ♦ మగు గహనంబున్. 4.

అ॥ ధరిత్రీదేవతనూజుండు - పుడమివేలుపుఁబట్టియగు నావిదంఘునుఁడు, పోవుచున్ - అట్లరణ్యమున కేగుచుండఁగా, ఎదుటన్ - తనయుందఱ, దిగ్దంతి... .....నము. దిగ్దంతి-దిగ్గజములను, జిగీషా-జయింపనిచ్ఛచేత, విశ్రుత - ప్రసిద్ధికెక్కిన, మత్తేభఘట-మదపుటేనుఁగులగుంపులయొక్క 'నిఘటాతు గజసంహతౌ, అని నానా. అవార్య-నివారింపనలవికాని. విహార-సంచారమువలన తిరుగుటచేత, గహనము-ప్రవేశించుటకు కష్టమైనదానిని, ని. 'గహనంగహ్వరేదుఃఖే, విపినేకలిలేఽపిచ, విశ్వ. ని. "గహనంవనదుఃఖయోఃగహ్వరేకలిలేచాపి" హేమ. అగు-అయినట్టి. గహనంబున్-ఒకయడవిని, ని 'అటవ్యరణ్యంగహనం' అమ. గాంచెన్ - కనుగొనెను, ఈపద్యమున 'గహన' శబ్దము రెండుసారు లుచ్చరింపఁబడుటవలన యమకాలంకారము. మఱియు 'దిగ్దంతిజగీషా విశ్రుతమత్తేభఘట లనుటచే నుపమాలంకారము 'మదపుటేనుగులసంచారముచేతఁ జొరరానియడవి, యనుటచేత నతిశయోక్త్యలంకారమును,

తా॥ అతఁడాతీరునఁ బోవుచుఁ దనప్రోల దిగ్గజములను సైతము జయింపఁగలిగినమదపుటేనుగులగుంపులయొక్క సంచారమువలనఁ జొరరానియొకగొప్ప యడవినిఁ జూచెను.

సీ॥ కఠినకాకోలూకి ♦ కాకవిలోకనసాధ్వ, సాకీర్ణకోకిలా ♦ కోకిలంబు
కాద్రవేయ మయూరి ♦ కాసముత్కటకేఁత, ఘోరమార్తసమూషికా ♦ మూషకంబు
కరటికంఠీరవి ♦ కాకర్కశస్వన, వ్యాకులసూకరీ ♦ సూకరంబు
కరివైరిభేరుండి ♦ కాకఠోరాక్రంద, కాసరకాసరీ ♦ కాసరంబు

గీ॥ కురువకాశోకవకుళత ♦ క్కోలకేత, కీకుటంట కుటజం ♦ కేళికతికి
కాకతిందుక కింశుక ♦ క్రముకతిలక, కాంచనకదంబకలితము ♦ కాననంబు. 5.

అ॥ కఠిన.........లంబు, కఠిన- నిర్దయతోఁగూడిన వి. 'కర్కశం కఠినంక్రూరం, కఠోరం నిష్ఠురం ధృఢమ్' అ. కాక - కాకులయొక్కయు, 'ని. కాకేశుకరటారిష్టబలిపుష్ట సకృత్ప్రిజాః' ఉలూకికా - గుడ్లగూబలయొక్కయు, 'ని. ఉలూకస్తువాయసారాతిపేచకౌ' అ. విలోకన-చూచుచుండుటవలన, సాధ్వస- భయముతో, ఆకీర్ణ - సందులేకనిండియున్న, 'ని. సంకీర్ణేసంకులాకీర్ణే' అ. కోకిలా

కోకిలంబు - పెంటికోయిలలును పోతుకోయిలలును గలదియును, కాద్రవ........కంబు. కాద్రవేయ-నాగుఁబాములయొక్కయు, 'ని. నాగాః కాద్రవేయాః, అ. మయూరికా-నెమిళ్ళయొక్కయు, 'ని. మయూరో బర్హిణో బర్హీ, శుక్లాపాంగః శిఖావలః, యా. సముత్కట-అధికమైన, కంఠస్వరోష-కంఠధ్వనిచేత, ఆర్త-దుఃఖముఁజెందిన, మూషికామూషకంబు - పెంటిపోతు యెలుకలుకలదియును కరటి........రంబు, కరటి-ఏనుగులయొక్కయు, కంఠీరవికా-సింహములయొక్కయు, 'ని. సింహో మృగేంద్రః పంచాస్యః హర్యక్షః కేసరీహరిః, కంఠీరవో గజరిపుః' అ. కర్కశ-కఠినమైన, స్వర-కంఠధ్వనిచేత, వ్యాకుల - మిక్కిలి కలఁతనొందఁబడిన, 'ని. విహ్వలస్తవ్యాకులౌ సమే' అ. సూకరీసూకరంబు - ఆఁడుపందులును మగపందులును గలదియును 'ని వరాహః సూకరో ఘృష్టిః కోలః పోత్రీ కిరిః కిటిః' అ. కరి.........సరంబు, కరివైరి సింహములయొక్కయు, భేరుండికా - గండభేరుండముల యొక్కయు, గండభేరుండమనఁగా మూఁడుకన్నులుగల్గి, యేనుఁగును, సింహమును శరభమృగమును సైతము ముక్కునబట్టికొనిపోవునంతటి గొప్పపక్షి, కనుకనే గండభేరుండబిరుద, ఇత్యాదులు ప్రయోగింపఁబడియున్నవి. కొన్ని నిఘంటువులయం దేనుఁగును దినెడిపక్షియనియే యున్నది. 'ని. గండభేరుండము రెండుతలలు, మూఁడుకన్నులుగలపక్షి విశేషము. సంస్కృతనిఘంటువులందు భేరుండ శబ్దమే కాని యీశబ్దము కనఁబడదు.' సూ. ఆం. ని. ఉదా. వజ్రతుండం, వజ్రనఖం వజ్రపక్షం మహాబలం, గండభేరుండ వదనం ద్విశీర్షం భీమవిక్రమం, జ్వాలాకరాళవదనం, త్రినేత్రం శత్రునాశనం, అనేక కోటిశరభాన్, భక్షయంతం ముహుర్ముహుః, ఏవం ధ్యాయేన్మహావిష్ణుం, గండభేరుండరూపిణం' మం. శా కొందరు కవులు మృగముగానే వర్ణించినారు. ఉదా. 'వ మరియు సింహ ఋక్ష శార్దూల గండభేరుండ భల్లూక వరాహాది మృగంబుల నఖండ పరాక్రమంబున ఖండించి' ఉక్తాం, భయంకర జంతువులలో నిది గొప్పది యగుటచే నీకవి మృగమేయని తలంచెనేమో? అభినయదర్పణమునందును 'అథ. పక్షి భేదహస్తా నిరూప్యంతే. అని చెప్పుచు 'అంసు గండభేరుండహస్తలక్షణమును 'గండభేరుండకాఖ్యస్య వినియోగః ప్రకీర్తితః. ఇది గండభేరుండపక్షియందు వినియోగింపబడును. ఆంధ్రవాచస్పత్యమున గండభేరుండము. సం. వి. అ. పుం. రూ. భేరుండము. ఒకానొకపక్షి 'పక్షివిశేషమని చెప్పుచున్నారు గాని ప్రయోగములయందు మృగపర్యాయములతో జేర్చి చెప్పఁబడియున్నది.' కఠోర -కఠినమైన, ఆక్రంద - బొబ్బలుపెట్టుటవలన, 'ని. ఆరావే రుదితే త్రాతర్యాక్రందో దారుణే రణే' అ. కాతర-వ్యసనముచేత వ్యాకులపడిన, 'ని. అధీరే కాతరః' అని అ. కాసరీకాసరంబు-ఎనుములు ఎనుబోతులును గలదియును, 'ని. లులాయో మహిషో వాహ, ద్విషత్కాసరసైరిభాః' అ కుసు.........కలితము, కురువక-ఎఱ్ఱగోరంట చెట్లతోడను, అశోక - అశోకవృక్షములతోడను, పనస - పొగడచెట్లతోడను, తక్కోల - తక్కోల వృక్షములతోడను, కేతకీ - మొగలిచెట్లతోడను, కురంటక - పచ్చములు పెద్దగోరంటచెట్లతోను, కుటజ - కొడిసెమ్రాకులతోను, కంకేళి — నల్లయశోక వృక్షములతోను, కతక — చిల్లచెట్లతోను, క్రముక—ఎఱ్ఱపోఁకగ చెట్లతోను — పోఁక చెట్లతోను, తిలక—తిలకపుమ్రాకులతోను, కాంచన—నాగకేసరపుచెట్లతోను, కదంబ-కడపచెట్లతోను, కలితము—కూడుకొనినదైన, అనఁగా దట్టమైనదనుట. అకాననంబు - అయుపణ్యాము ను. ఇచట ద్వితీయకుఁ బథమ చెప్పఁబడినది. 'మూ. ఇతరత్ర చ ద్వితీయా తిస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్; అనినన్న. ఈపద్యమునఁ గవికానన మనఁగాఁ గకారముఖముగలదియను నర్థమును బ్రతిపాదించి పద్యము

గకారంభూయిష్ఠముగ జెప్పినాఁడు. ఇది వంత్యానుప్రాసాలంకారమును, మఱియు ప్రపంచమునఁ దన
వైరికివైరి హితుఁడనుట న్యాయము. ఇదియుఁ గోకిలాదుల కష్టముగాక తనవిరోధికి విరోధిసైతము
శత్రువయ్యెను. మఱియు 'కోకిలాకోకిలంబు, ఇట్లు పోయి పెంటి జంటలుగాఁ జెప్పుటలో రతివాంఛా
పరులగు తత్సంభావనంతులయొక్క ప్రియసంభాషణసమయమున నారదుని చూపుచేతను, వాక్కుల
చేతను నిపురికిఁ గష్టములు సంభవించనున్నట్లింపుసూచితము. విరోధికంటె బలమైనవానిని జూపు
టచే స్వర్గాధిపతి యగునింద్రుఁడు నాపై ద్వేషమూనుననియు ధ్వనించుచున్నది.

తా|| అందుఁ గాకులును గుడ్లగూఁబలును జూచుచుండుటవలన భయపడి నిండియున్న కోయి
లలగుంపులును, నాగుఁబాములయొక్క బుసలును, నెమిళ్ళకూఁతలు నతిశయించుటవలన దుఃఖపడు
చున్న యెలుకలమొత్తములును, నేనుఁగుల ఘీంకారములును, సింహములగర్జనములును వినఁబడినందునఁ
గల్లోలపడుచున్న యడవిపందుల మూఁకలును, సింహములగర్జనములును గండభేరుండ పక్షులబొబ్బ
లును నిండుటవలన భయపడియున్న నెనుములు నెనుబోతులదండును, ఎఱ్ఱగోరంటలును, అశోక
వృక్షములును, పొగడలును, తక్కోలములును, మొగలిచెట్లును, పచ్చపెద్దగోరంటలును, కొండిసెలును,
ఎఱ్ఱనియశోకవృక్షములును, చిల్లచెట్లును, నాగకేసరములు, ఎఱ్ఱలొద్దుగులును, తిలకపుచెట్లును,
మున్నగువానితో దట్టమైయున్న యాయడవిని.

—♦ అచట శిథిలదేవాలయమును గాంచుట ♦—

వ|| నిరంకుశతరంబుగాఁ జొరంబడి పోవునెడ దురాలోకనిరాలోక శౌకపైక
కాకాతిరేక రేఖాకీర్ణ్యాగతాకార ప్రాకారంబును, నిజభుజాదండ కోదండపాండిత్య
సపత్నీకృతనిష్ప్రత్యూహప్రత్యర్థిపటలపచనపటీయస్స్ఫులింగదసందోహదందహ్యమాన
నానామహిమపుంజకరీ భోజ్యసితధవళితాగ్నిగృహాకుట్టిమంబును, ప్రకటపటువిటపిఝాట
పటలవేల్లితఝిల్లికాఝుంకార ప్రతిధ్వానసంధాన చంగరంగమంటపంబును, విశీర్ణ
ద్వారదారుతురంగ కళేబర చరద్గృహగోధికాగృహమేధి కల్పితానల్ప సౌభాగ్య
సూచక శకునాతిస్థ నిరంతరాశంబును, సముందాసదచల దుందుభి చుచుందరీబృంద
సందీపితాస్ఫోట నిర్భరగర్భగృహంబును, నగునొక్క దేవగృహంబుఁ గాంచి, సముంచితయానం
బునఁ గొబ్బునఁ జేరంబోయి గుబ్బలీలఁ గబ్బిలపుఁ బెంట్టుగబ్బునకుబ్బనీక తదంతరంబునం
గూర్చుండి బడుశ్రమ నపనోదనంబున, 6.

అ|| నిరంకుశతరంబుగాన్ - ఇచ్చవచ్చినట్లుగా, యథేచ్ఛముగా, చొరంబడి - ప్రవేశించి, పోవునెడన్ -
వెళ్లుచున్నసమయంబున, దురా.....ప్రాకారంబును. దురాలోక - చూడశక్యముగాక - అనఁగాఁ
గ్రిక్కిఱిసి యున్నతమైయున్న ప్రాకారము వలనఁ జూచుటకు వలనుపడక యనుట, కష్టతరమైన ధ్వనుల
చేతను అనియుఁ జెప్పవచ్చును. 'ని. దుఃశోకభవ దుఃఖగోహ్య' నానా 'ని. ఆలోకో జయ శబ్దఃస్యాత్,
హలా. ఉచ్చారితజయశబ్దము. నిరాలోక - చూచుటలేని, శౌక - చిలుకలసమూహముయొక్కయు, పైక -
కోయిలలగుంపుయొక్కయు, కాక - కాకులయొక్కయు, అతిరేక - మిక్కిలిహెచ్చైన. 'ని. అతిరి

స్సమధికః, అని అ. రేఖాపంక్తులుగల, కిమ్మీరిత - చిత్రవర్ణములు గలదిగాఁజేయఁబడిన, ఆకార-
స్వరూపముగల, ప్రాకారంబును - చుట్టుగోడకలదియును, ప్రహరీకలదియును. నిజ.........
మంబును, నిజ-తమదైన, భుజాచండ-దండమువంటిబాహువులయొక్క, కోదండపాండిత్య-విలువిద్యా
నిపుణతచేత, సపత్త్రాకృత-ఆకులతోసహితముగా, హింసింపబడినట్టియు-అనఁగా జీల్పఁబడినట్టియు,
ని. 'కృతం యుగేఽపి పర్యాప్తే విహితే హింసితే పతే, అనివిశ్వ' నిష్పత్త్రాకృత- ఆకులులేకుండఁ
హింసింపఁబడినట్టియు, అనఁగా బాణముశరీరమునఁజొచ్చినపుడు సపత్త్రమనియు, బయటవెడలినప్పుడు
నిష్పత్త్రమనియు భావము. ఇచట సపత్త్రనిష్పత్త్రశబ్దములనుగూర్చి సూ. సపత్త్ర నిష్పత్త్రాదతివ్యథనే
సిద్ధాం, సపత్త్రాత్కరోతిమృగమ్. సపుంఖశరప్రవేశే సత్పత్త్రం కరోతీత్యర్థః నిష్పత్త్రాకరోతి సపుం
ఖస్యశరస్యాపరపార్శ్వనిర్గమనా న్నిష్పత్త్రంకరోతీత్యర్థః అతివ్యథనే కిం. సపత్త్రం నిష్పత్త్రం
వా కరోతిభూతలమ్. వ్యా. స. పత్త్రఇతి సపత్త్రశబ్దాత్ నిష్పత్త్రశబ్దాచ్చ అతివ్యథనే డాజిత్యర్థః.
వ్యథతాడనే చతుర్థ్యాంతః అతిక్రమ్యవేధః అతివ్యధనమ్ లక్ష్యేశరాః పతంత్యనేనేతిపత్త్రం శరాణాం
పుంఖగతో బర్హః భూతలమితి పుంఖపర్యంతం పుంఖపర్జంవాశర ప్రవేశనేన సపత్త్రం నిష్పత్త్రం వా
భూతలమ్ కరోతీత్యర్థః. మఱియు 'సూ. సహాస్య పః సంజ్ఞాయాం' 'గిథం సపత్త్రం సధుగం నిరస్తం
దృష్ట్వాసకోపేన దశాననేన' రావ. పోత్రిపలల-అడవిపందులయొక్క మాంసమును, 'ని. పిశితంతర
సం మాంసం పలలంక్రవ్యమామిషం' అ. పచన-పాకముచేయుటయందు, అనఁగా వండుటయందు,
పర్యుత్సుక-మిక్కిలియిష్టముగాఁ ప్రవేశించుటగల, పుళింద-చెంచులయొక్క, సందోహ-సమూహ
ముచేత, 'ని. భేదాఃకిరాత శబర పుళిందామ్లేచ్ఛజాతయః' అ. దందహ్యమాన-దహనమగుచున్న, మండు
చున్న ఇచట 'దందహ్యమాన' శబ్దమునుగూర్చి సూ. జపజభదహదశభఞ్జపశాం చ. సిద్ధాం. ఉదా.
'రంరమ్యతేస్మప్రమదాసమేతోదందహ్యమానప్రతిపక్షచేతాః' రావ. నానామహిషపురీష-అనేకమయిన
ఎనుబోతులయొక్క పేడవలని, 'ని. పురీషంగూథవర్చస్కం' అ. 'ని. నానానేకోభయార్థయోః'
అని అ. కరీషః ఏనుపిడకలయొక్క, 'ని. తత్తు శుష్కం కరీషోఽస్త్రీ' అ. ఉల్లసిత-ప్రకాశింపఁబడిన,
భసిత-బూడిదెయొక్క, స్తోమ-సమూహముగల, గృహాపట్టిమంబును-ఆలయమునకుముందుగల ఱాతికట్ట
డపు నేలయును, ప్రకట.........పంబును. ప్రకట-ప్రసిద్ధమైన, పటువిటపి - పెనుగటచెట్లయొక్క
ఝాట-సమూహమునకు, పటల-ఆకులచేగప్పబడిన పైభాగమున, వేష్టిత- చుట్టుకొనఁబడిన, ఝిల్లికా -
కీచురాయిపిట్టలయొక్క, ఝంకార-ఝుమ్మనెడిరొదవలని, ప్రతిధ్వాన-మాఱుమ్రోఁతతో, సంధాన-
కూడుచున్న, చంగ-చక్కనిదైన, రంగమంటపంబును-నాట్యమండపమును, విశీర్ణ.........శంబును-
విశీర్ణ-శిథిలమైన-ప్రాంతసిరియైన, ద్వారదామ-ద్వారబంధపుకొయ్యయొకవలి, తుంగకాశీబర-గుద్రముల
యొడలిమీఁద, చరత్-తిరుగుచున్న, ప్రాఁకుచున్నయనుట, గృహగోధికా-బల్లియనెడి, 'ని. సరటః
కృకలాసఃస్యాన్ముసలీగృహగోధికా' అ, గృహమేధి-గృహస్థునివలన, ఉదా. 'సీ. కెలకులనున్నతం
గేటిజున్నగృహమేధి' స్వా.మ. కల్పిత-చేయఁబడిన, అనల్ప-అధికమైన, సౌభాగ్యసూచక-ధనధాన్యాది
సమృద్ధిని గనఁబఱచుచున్న, అదృష్టమును తెలియఁజేయుచున్న, శకున-శుభశకునముయొక్క, ఆతిథ్య-
అతిథిభక్తితోఁగూడిన. 'ని. క్రమాదాతిథ్యాతిథేయేఅతిథ్యర్థేఽత్రసాధుని' అ. నిరంతరాశంబును-నలు
ప్రక్కలుగలదియును, అమందా.........హంబును, అమంద-వడియైన, ఆనంద-సంతోషముతో,
చలత్-కదలుచున్న, ఉందురు-ఎలుకలయొక్కయు, 'ని. ఉందురు ర్మూషికోఽప్యాఖుః' అని అ.
వ్యు. ఉందయంతిముఖస్పృష్టః వస్త్వాత్యుందురుః, తనముఖముచేతముట్టబడినవస్తువులను ద్రవింపఁజేయు,

నది, 'ని చుచుందరీ గంధమూషీ అని. ఆ బృంద-సమూహమువలన. సందీపిత - ప్రకాశించఁబడిన ఆర్భటీ-కోలాహల-ధ్వనియొక్క, నిర్భర - అతిశయముగల, గర్భగృహంబును - దేవునిగర్భాలయమును, అగు-అయినట్టి, ఒక్క- పాడుగుడిన్ -ఒకశూన్యదేవాలయమును,- ఒకపాడుబడినగుడిని, కాంచి-చూచి, సమంచితయానంబునన్. సమంచిత-ఒప్పుచున్న, యానంబునన్-నడకతో, గొబ్బునన్-శీఘ్రముగా, చేరన్ బోయి-సమీపించి, దగ్గరకుబోయి, గుబ్బతిలుగబ్బిలపురెట్టగబ్బు, గుబ్బతిలు-అతిశయించుచున్న, గబ్బిలపురెట్టగబ్బు - గబ్బిలపుమలముయొక్క చెడువాసనవలన, తనున్-శరీరమును, ఉబ్బనీక - సంతోషముతో నతిశయింపనీయక, అనఁగా నిష్టమేమియు లేక యనుట, తదంతరంబునన్. తత్-ఆదేవాలయము యొక్క, అంతరంబునన్-లోపల 'ని. స్థానాత్మీయాప్యతాదర్థ్య రంధ్రాంతర్యేషుచాంతరం' శాశ్వ. కూర్చుండి-ఆసీనుడై, పథశ్రమసమాపనావసరంబునన్. పథశ్రమ-మార్గాయాశము-దారినడచినబడలిక, సమాపన-తీఱిన-సమాప్తిఁజెందిన, అవసరంబునన్-అట్టికాలమున, అనఁగా మార్గాయాసముతీరినతోడనే యనుట, 'నిరంకుశ తరంబుగా జొరంబడి-దురాలోకనిరాలోక శౌకపైక కాకాతిరేక - పుళింద సందోహదందహ్యమాననానా మహిషపురీషకరీష-ప్రకటపట విటపిఘ్నాటపటల-అమందానంద చల దుందుభ చుచుందరీబృందసందీపిత-ఆర్భటీనిర్భరగర్భ, వృత్త్యనుప్రాసాలంకారము. ''ఏకద్విప్రభృతీనాంతు. వ్యంజనానాంయథాభవేత్, పునరుక్తిరసౌనామ వృత్త్యనుప్రాసఇష్యతే' ప్ర. తా. 'ఆకార ప్రాకారంబును-భుజాదండకోదండ-సపత్త్రీకృత- నిష్పత్త్రీకృత – ఉల్లసితభసిత – వేల్లితఝిల్లికా, ధ్యానసంధాన-చంగరంగ–గృహగోధికాగృహమేధి-కల్పితానల్ప-అను ప్రాసాలంకారము, 'వర్ణసామ్యమనుప్రాసః' కా ప్ర. 'రంబును–మంబును, పంబును–శంబును–హంబును' అంత్యానుప్రాసాలంకారము.

తా॥ స్వేచ్ఛగాఁ బ్రవేశించి పోవుచున్న సమయమునఁ బ్రాకారముననున్న చిలుకలగుంపులును గోయిలలబారులును గాకులమూఁకలును గిక్కిరిసిపాడువైయున్న మ్రాకులవలనఁ గనుపించక ధ్వనులు మాత్రము వినబడుచున్నవి. చెంచువాండ్రు పొదలమాటున నున్నయడవిపందులను గుర్తించి నేర్పుతో బాణములను వేయఁగా వానిశరీరములు చీల్చఁబడి మాంసశకలములు కొన్ని చెట్ల యాకులతోను గొన్ని యథాస్థితిగాను వెలుపలకు వచ్చి కుప్పలై పడఁగా దానిని మిద్దెలోనికిఁ దెచ్చి యెనుబోతుల పేడ యెండిన యేరుపిడకలతో వండికొనిన బూడిదగుట్టలే విభూతిపండ్లుగానున్నవి, నాట్యమంటపము యొక్క పైభాగమున గొప్ప మొరటచెట్లయాకులు క్రమ్ముకొనియుండఁగా నందు నిండియున్న కీచురాయిపిట్టలయొక్క ఝుమ్మనెడిరొదవలన మాఱుమ్రోఁత మ్రోయుచుఁజక్కఁగానున్నది. శిథిలమైన ద్వారబంధపుకొయ్యలపైఁ జిత్రింపఁబడియున్న గురరిసులమీఁద ప్రాఁకుచున్నబల్లులే గహస్థులుగా నలుదిశలనుండి యదృష్టమునుఁ దెలియఁజేయునట్టి శుభసూచకముల నాతిథ్యముగా నొసంగుచున్నవి. గర్భాలయమునందు లెక్కకుమించిన యెలుకలును చుంచెలుకలును మిక్కిలి యుల్లాసముతోఁ గిచకిచ యనుధ్వనులఁ జేయుచుఁ దిరుగుచున్నవి. అట్టి పాడువడిన గుడిం గని తొందరగానందుఁ జేరఁబోయి మితిమించిన గబ్బిలపురెట్టగబ్బువలన నిష్టముగాక కొంతసేపు గుడివెలుపలనే కూర్చుండి మార్గాయాసముఁ దీర్చుకొనిన తరువాత:

—; నిరంకుశుఁడు శివలింగమును జూడమాడఁగోరుట ;—

క॥ జననాథ ధరణీసుర, తనయుఁడు తనయెదుట విమల ♦ తరకాంతులకున్
గని యగు లింగముఁగని యిట్లనిపలికెన్ దైవఘటన ♦ కనుకూలముగన్. 7.

‘త్రోఁడుతెన్’ అని ప్రయోగించుటకు సూ. ఒకానొకచోఁ దోడకుఁ దోడుతెనని రూపాంతరంబును గలదు. అయినను దానికి వలెఁ దీనికి తరికార్యంబు గలుగదు’ ప్రౌ. వ్యా. ఉదా. ‘చ. పగతురచేతిలోఁ బడక ప్రాణముత్రోఁడుతెనున్నవాఁడవే’ భాగ. సొగటాలాడెదవే-ఈజూదపు పాచికలతో నాఁడగలుగుదువా, ఈపద్యమున ‘సొగటాలు’ అనుటకు (సొగపు + ఆటలు - సొగటాలు) అను ఉదా. ‘క. తగవంద అక్కొమగమై, సొగటాలాడు నపుటంచుఁ బొనతులు పల్కఁగ’ అని చ. పుం. ఇందు ద్వితీయపాదమున బిందుయతి చెప్పఁబడినది. ‘ఏమఁగు........లోనఁబ్రోకైబయల్ సొగసైయుండెడివో, అనుట చేతనుపమాలంకారము ‘ని. సాధర్మ్యముపమా భేదే’ కా. ప్ర. ‘నవేందు సుమనస్స్రితస్వినీజూటకా, గంగను శిరమునఁ ధరించితివి గుహపత్ని సంగము గోష్ఠియను చంద్రుని ధరించితివి, అనియర్థము. కానినీవు గూడ జూదమును కన్నెడెనవాఁడ వని సారస్యము.

తా॥ జటాజూటమున బాలచంద్రుని, దేవనదిని ధరించిన యోశంకరుఁడా! ఈమూఁడు లోకములయందు నచ్చునపు గలిగించునటువంటి నీగొప్పతన మేనుఁగు మ్రింగిన వెలఁగపండువలె లోపల నేమియు లేక వెలుపలఁ మాత్రమే డాంబికముగా నొప్పుచున్నదో, లేక స్వచ్ఛమైన సామర్థ్యము గలదో, చూడవలసి యున్నది కాన నాతో జూదమాడుము.

సీ॥ గిరిసార్వభౌముకూఁ ♦ తురుసన్నిధానంబు,నందు మేలము లాడు ♦ నట్లు గాదు
కైలాసశృంగశృం ♦ గారచందనవాటి,నల్లన నడయాడు ♦ నట్లు గాదు
వెలిగిబ్బ నాకాశ ♦ వీథిఁ బోడెంబుగా,నవలీల నెక్కెడు ♦ నట్లు గాదు
తొలివేలుపులమూఁక ♦ దురములోఁ గోరింపు,లాడి తాండవమాడు ♦ నట్లుగాదు

గీ॥ మానితద్యూతవిద్యోత ♦ మానకీర్తి,మన్నరాగ్రణి నైనట్టి ♦ నన్నుఁ గూడి
జూదమాడుట సింధురా ♦ సురవిజేత,యారవెక్కసితన మన్న ♦ నంటిఁ గాని. 9

అ॥ సింధురాసురవిజేత - గజాసురుని సంహరించిన యోయీశ్వరుఁడా, గిరిసార్వభౌముకూఁతురు సన్నిధానంబునందున్, గిరిసార్వభౌముకూఁతురు-పర్వతములకుఁ బ్రభువగు హిమవంతునికుమార్తె యగు పార్వతీదేవియొక్క, సన్నిధానంబునందున్-సమీపమున, మేలములాడునట్లుగాదు-పరిహాసములాడుటవలెఁగాదు, ఇందు మేలములనుటకుదా ‘ఉ. ఉల్లమునందు నక్కటికమూనుట మాకులమందుఁ గంటిమం, చల్లన మేలమాడు నచలాత్మజ, అని స్వా. మ. కైలాస శృంగశృంగార చందనవాటిన్, కైలాసశృంగ-వెండికొండ శిఖరముయొక్క, శృంగార-అలంకారమయిన, చందనవాటిన్-గంధపు మ్రాకులతోఁగూడిన తోటయందు, అల్లనన్-మెల్లఁగా, నడయాడునట్లుగాదు - తిరుగుటవలెఁగాదు, ఇందు ‘నడయాడు’ ప్రయోగమునకుదా. ‘క. గడకట్టిన యోషపగిది, నడయాడుఁ గ్రియాభియుక్తుఁ డట నిష్క్రియుఁడై, అని శివ. సా. వెలిగిబ్బన్ - తెల్లనియెద్దును, ఆకాశవీథిన్ - గగనమార్గమున, పోడెంబుగాన్ - ఒప్పిదముగా, ఇది పోడిమియొక్క రూపాంతరము. అవలీలన్-సులభముగా, ఎక్కెడునట్లుగాదు-ఆరోహించుకతిగాఁగాదు - ఎక్కుటవలెఁగాదు, తొలివేలుపులమూఁకన్-దానవులసమూహమును, దురములోన్-యుద్ధమునందు, గోరింపులాడి-విజృంభింపఁజేసికొని-పైకెదయునట్లు చేసి [illegible] (గోరింపులనఁగా బుట్టచెండ్లనెడి బాలక్రీడావిశేషము) తాండవమాడునట్లుగాదు-ఏమియుఁ

దోఁచక చిందులుద్రొక్కుటవలెఁగాదు - నాట్యముచేయుచుండెడువిధమునఁగాదు, మాని........ గ్రణీః-మానిత — గౌరవింపఁదగిన, ద్యూత-జూదమునందు, 'ని. ద్యూతోఽస్త్రియామక్షవతీ, కైతవం పణఇత్యపి' అ. విద్యోతమాన-ప్రకాశించుచున్న, కీర్తిమత్ - కీర్తిమంతుఁడవైన-అనఁగా జూదమునందుఁ బ్రఖ్యాతిగలవాఁడవైనయనుట. నరాగ్రణీః — మనుష్యులలో ముఖ్యుఁడను, ఐనట్టి-అయినట్టి, నన్నుః—నన్ను, కూడి-కలిసి- నాతోజతయై, జూదమాడుట - పాచికలపందెములాడుట. ఇదియసాధ్యముసుమాయనుట, ఔర-నాతోనే పందెమాడఁగలవాయనుట - ఇదియాశ్చర్యార్థకము, వెక్కసితనము-అతిశయముచేత, అన్నన్-అనినప్పటికిని, అంటిఁగాని—అనియున్నాననుకొనుము, 'నీవాడు నాటలన్నియు గొప్పవిగావు నాతో జూదమాడుటయే గొప్ప' అనుటచే ప్రతిషేధాలంకారము. 'ప్రతిషేధః ప్రసిద్ధస్య, నిషేధస్యానువర్ణనమ్, నద్యూతమేతత్కితవ, క్రీడనంనిశితైశ్శరైః' అని చంద్రా.

తా|| గజాసురుని జంపిన యోశివుఁడా మంచుకొండకూఁతురగుపార్వతీదేవి సమీపమునఁబరిహాసము లాడుటవలెననియు, వెండికొండయొక్క శిఖరమున నలంకారమయిన గంధపుమాకులతో నిండిన తోటయందు మెల్లగాఁ దిరుగుటవంటిదే యనియుఁ మింటఁబరుగెత్తు తెల్లనియాఁబోతుమీఁద సులభముగా నెక్కుటవంటిదే కదా యనియుఁ, బోరున రాకాసిమూకల రెచ్చఁగొట్టుకొని దరదోఁచక చిందులు ద్రొక్కుటవలెనే యనియుఁ, దలంచుచుంటి వేమో జూదమునందు గొప్పపేరు పొందిన పందెగాఁడ నయిన నాతో జతగాఁ బందెము నొడ్డుట సుమా! బడాయి గొట్టుచుంటి వనిన నను కొనుము. ఇది సులభముకాదు! అసాధ్యకార్యము.

లయగ్రాహి

ఓచరమభాగ్యభృత ♦ ఖేచరదురోదరక ♦ ళాచతురశేఖరుఁడ ♦ నైచిరతరేచ్ఛః
బ్రాచిఁగలప్రోడలన ♦ వాచిఁగలజాలఁబ ♦ తీచిఁగలతజ్జ్ఞులను ♦ దీచిఁగలప్రజ్ఞా
సూచకులనన్వహముఁ♦జూచితిఁగరాజ్యమునఁ♦బాచికలునుట్టిచనఁ♦జూచిసమహాత్మన్
నీచరణమూనవల♦యాచలపరీతనిశ♦లాచలమెఱుంగమిముఁ♦జూచుకొను టింకన్. 10.

అ|| ఓచరమభాగ్యభృతఖేచర. చరమ-కడపటిదియైన-చివరదియైన, భాగ్య - శుభరూపమగు నదృష్టమును, 'ని. భాగ్యంశుభాత్మకవిధౌస్యాచ్ఛుభాశుభకర్మణి' అని వి. భృత-భరింపఁబడిన-అనఁగా దేవతలందఱు నంత్యదశయందుఁగాలమృత్యువును జయింపఁజాలకుండఁగా నదృష్టవంతుఁడవగుటచేత నే కాలమృత్యువును జయింపఁగలిగితివని భావము. ఖేచర - ఆకాశమునఁదిరుగునట్టియోపరమేశ్వరుఁడా, ఇచట సంబోధ్యవాచకంబునకుముందు క్రియాంత్యవిశేషణముండుటనుగూర్చి 'సూ. ఓశబ్దం. బొక్క-చో సంబోధ్యవాచకంబునకు ముందికతశబ్దవ్యవహితం బయికానంబడియెడి' ప్రౌ. వ్యా ఉదా. ఓవినువీధినున్న ఖచరోత్తములార' వీర. దురోదరకళాచతురశేఖరుఁడః-దురోదర - జూదమనెడి, 'ని. దురోదరోద్యూతకారే, పణేద్యూతేదురోదరం' అ. కళా-విద్యయందు, 'ని. కలాస్యాన్మూలవివృద్ధౌ శిల్పాదావంశమాత్రకే, షోడశాంశేచచంద్రస్య, కలనాకాలమానయోః' అని మే. శేఖరుఁడః-శ్రేష్ఠుఁడను, ఐ-అయియుండి, చిరతరేచ్ఛః - బహుకాలముగ అకోరికతో, ప్రాచిః-పూర్వదిశయందు, 'ప్రాక్ప్రథమం అంచత్యస్యాంతవిరితిప్రాచీ' అని వ్యు. ప్రథమమున సూర్యుఁడా

దిక్కునసుదయించును' అంచుగతిపూజనయోః' అని ధాత్వ. కల-ఉండిన- ప్రోడలన్-వివేకముగల వారిని, అవాచిన్-దక్షిణదేశమున, 'అవాగంచతి దక్షిణాయనేనాస్యాంరవిరిత్యవాచీ' అని వ్యు. కల-ఉన్నటువంటి, జాణలన్-నేర్పుగలపురుషులను, ప్రతీచిన్-పడమటిదిశయందు, 'ప్రతిపశ్చాద్దివసావసానే అస్యామంచతి సూర్యాస్తమేతీతిప్రతీచీ' అని వ్యు. కల-కలిగిన, తజ్జ్ఞలన్-ఆపందెము నెఱింగిన వారలను, ఉదీచిన్-ఉత్తరదిక్కునందు, 'ఉత్ ఊర్ధ్వమంచత్యస్యాముత్తరాయణేన రవిరిత్యుదీచీ' అని వ్యు. కల-జతపడిన, ప్రజ్ఞాసూచకులన్-బుద్ధియొక్క సూక్ష్మముగలవారిని - అనఁగా నొకరికి నేర్పునటువంటి తెలివిగలవారిననుట, ని. 'సూచకస్స్వినద్రవ్యే, బోధకేపిశునేశుని, అని మే. అన్వహమున్-అనుదినమును-యెల్లప్పుడును, చూచితిన్-పరీక్షించుచునేయుంటిని, నీచరణమాన-నీపాదముల యొక్కయాజ్ఞ-అనఁగా నీపాదములేసాక్షియని శపథపూర్వకముగాఁబలుకుట, కరాబ్జమునన్-పద్మము వంటి హస్తమున, పాచికలుముట్టి-పాచికలనుబట్టుకొని, చనన్-మరలిపోవుటను, చూచిన-ఆలోచించిన-ప్రయత్నపడిన, మహాత్మున్-గొప్పవానిని, వలయాచలపరీత నిఖిలాచలము. వలయాచల - చక్రవాళపర్వమువలన, పరీత-చుట్టుకొనఁబడిన, నిఖిల-సమస్తమయిన, అచలము-భూప్రదేశము - అనఁగా నంతటనుగలవారిననుట, ఎఱుఁగన్-చూచియుండలేదు, ఇంకన్-ఇఁకను, మిమ్మున్-తమరినిమాత్రము చూచుకొనుట-కనుఁగొనుట-అనఁగాఁదమరినొక్కరిఁ జూచివెళ్ళుటయే యనుట, ఈ వృత్తమునకు లక్షణము. 'ఇంబలరగా భజస♦నంబులతుదన్ భజసనంబులు భకారమునొ ♦ డంబడలయగ్రాహింబరఁగఁజెప్పఁగల♦శంబడినయట్లు యగ♦ణంబు కృతిమీఁదసమ♦రుంబరహితార్థి' అనినుల. ఇందు మిమ్మున్ అనుటకు సూ. 'పూజ్యతయందొక్కచో నామతదేతద్యుష్మదస్మచ్ఛబ్దంబుల యేకవచనంబునకు బహువచనంబగు' అని ప్రౌ. వ్యా. ఉదా. 'ఆ. మహితాత్మమీరలిమ్మహినుఁడ' అని కళా.

తా॥ కాలమృత్యువును గెలిచిన యదృష్టము గలయోశివుఁడా నేను జూదమనెడి విద్యయందు నేర్పుగలవాఁడనై నిరంతరమును నాలుగుదిక్కులయందు గలజూదగాండ్రతో నాడుచుంటిని గాని నీపాదసాక్షిగాఁ జెప్పుచున్నాను. చక్రవాళపర్వతమునకు లోపలయమునఁ గలభూమియం దింతవఱకు నాతోఁ బందెమునకు వచ్చి పాచికలు చేతఁబట్టుకొని యోడక తిరిగిపోయినబంటును మాత్రముచూచి యెఱుఁగను. ఇఁకఁ దమరినొక్కరిని జూచుకొనుటయే కొదువ.

గీ॥ వట్టిమాటలు గా వే నెంత ♦ వారి నైన గెలుచు శక్తి నాపాలఁ ♦ గల దటంచు
అవనిసురతనూభవుఁడు చే♦లాంచలమున, ముడియగట్టిన సొగటాలు♦విడిచిపలికె. 11.

ఆ॥ వట్టిమాటలుగావు-ఇవివ్యర్థపువాక్యములుగావు. అబద్ధములుగావు, ఎంతవారిన్-ఎటువంటి గొప్పవారిని,ఐనన్-అయినప్పటికిని, గెలుచునట్టి శక్తి-జయించునట్టి, నటనముసేయుశక్తి, 'ని. నర్తకీలాసికేసమే' అ. నాపాలన్-నాపక్షమున, కలదు-ఉన్నది, అటంచున్ - అనిపలుకుచు, అవనిసురతనూభవుండు-బ్రాహ్మణసుతుఁడగు నానిగుంటశర్ముఁడు, చేలాంచలమునన్ - తనయుత్తరీయపుకొంగున ముడియగట్టినసొగటాలు - ముడివేసినపాచికలు. విడిచి-విప్పి, పలికెన్ - ఈచెప్పఁబోవు రీతిగావచించెను, 'నేనెంతవారినైన జూదమునగెలుతును' అతిశయోక్త్యలంకారము,

తా॥ ఇవి పట్టిమాట లనుకొనుచున్నావేమో యెంత యుక్తిగా నాడఁగలవారి నైనను జయించుశక్తి నాయందుఁ గలదు. అనిపల్కుచుఁ దనయుత్తరీయపు కొంగున నున్న పాచికలమూట విప్పి యిట్లుపలికెను.

సీ॥ వేళంబుగా నభో • వీథి దువాళించు, గిబ్బ తేజీకినా • కృత్తివాస
రింగులువారఁ దీ • ర్చినవేఁజుచుంగుల, తలపాగకా దేవ • తావరేణ్య
బిరుదురాకాసులఁ • బరిమార్చుమువ్వంక, పట్టిసకా మనో • భవవిరామ
వలకారిచిన్ని వె • న్నెలగాయుపసిపూప, జాబిల్లికా శైల • జామనోజ్ఞ
గీ॥ పసిమిపసిడిండి వలువకా • ఫాలనేత్ర, వెండినిండారుకొండకా • విశ్వభర్త,
లోకసామ్రాజ్యమహిమకా • లోకవంద్య, యొప్పుపన్నిదమిందులో • నొకటికైన 12.

అ॥ కృత్తివాస - పులితోలు వస్త్రముగాఁ గలవాఁడా, వేళంబుగాన్ - శీఘ్రముగా, నభోవీథిన్-ఆకాశమార్గమున, దువాళించు - వేగమునసంతవేరయు సమముగాఁ బాఱుచున్నటువంటి, గిబ్బతేజీకినా-నీయొక్క వృషభవాహనమునకా, ఇచట 'తేజీకి' అనుటకు సూ. 'నైకవర్ణేఽదేశ్యేఽపి, ప్రాస్వోదేశ్యేతువాక్వచిత్, తద్భవస్యాపిశబ్దస్యనీఘ్రాంతత్వంక్వచిద్భవేత్' అని. శబ్దచింతామణియందును 'దీర్ఘాణాంప్రాస్వస్స్యాత్, సచదేశ్యపదే నతైకపదేఽపి' అనియున్నది. దేవతావరేణ్య-దేవతలలో శ్రేష్ఠుఁడైనవాఁడా, రింగులువారన్-వస్త్రపుఁగుచ్చెళ్ళవలెఁ గనుపడుచుండఁగా, ఉదా. "ఉ. రింగులవల్లెవాటు సవరించి' అని సాం. తీర్చినవేఁజుచుంగుల తలపాగకా - చక్కఁగాఁజుట్టబడిన సహస్రశీర్షములుగల నీయొక్క శిరోవేష్టనమునకా - పదినూఱుముచ్చెలుగలిగి నీతలయందుఁ జుట్టుకొనఁబడియుండెడి పాగాకా, ఉదా. 'సీ. చుక్కలనొగయొకింతుక నిక్కశిరసునఁ,బదినూఱుచుంగుల• పాగఁజుట్టి' వాల్మీ. చ. మనోభవవిరామ మన్మథునిశ్రమఁజెందించినఁడా, బిరుదురాకాసులన్-శూరులయినదానవులను - దిట్టలైనరక్కసులను, పరిమార్చుమువ్వంకపట్టిసకా చంపునట్టి మూఁడువంకలు గలదియైన నీశూలమునకా, ఇది పట్టసశబ్దభవము. అని ఆం. ప. సా. 'పట్టిసముఅని. శ. చం. 'పట్టిసము'. అని ఆం. దీ. సంస్కృతమున పట్టిస, పట్టసముఅను రెండురూపములునుకలవు. శైలజామనోజ్ఞ-పార్వతీదేవికి మనోహరమైనవాఁడా, వలకారిచిన్నివెన్నెల - వలపించునటువంటి, ముచ్చటయిన లేఁతవెన్నెలను, కాయుపసిపూప జాబిల్లికా - వ్యాపింపఁజేయునట్టి, లేఁతపూఁబిందెవంటి చందమామకా, ఇచట 'పసి. పూప-జాబిల్లి' ఈ మూఁడుపదములు దేశ్యములు. ఫాలనేత్ర - నొసటఁ గన్నుగలవాఁడా, పసిమిపసిడిండివలువకా - పసుపుపచ్చరంగుగల పెద్దపులిచర్మముయొక్క వస్త్రమునకా, విశ్వభర్త-సమస్తమును భరించునట్టివాఁడా, వెండినిండారుకొండకా-నీవు కాఁపురముండెడు రజతముయొక్క సమృద్ధి గలకైలాసపర్వతమునకా, లోకవంద్య - మూఁడులోకములయందుఁ గల వారివలన స్తుతింపఁదగినవాఁడా, లోకసామ్రాజ్యమహిమకా-ఈలోకములను పాలించునట్టి నీయొక్క మాహాత్మ్యమునకా, ఇందులోన్-ఈచెప్పఁబడిన వానిలో ఒకటైనన్ - ఏదోయొక దానికైనను-పన్నిదము - పందెమును, ఒప్పు-అంగీకరించుము, ఇష్టపడుము. ఇచట 'ఒప్పు' అనుటకు 'సూ. ప్రార్థనార్థేమురేకత్వేకథ్యతే మధ్యమార్థకః, విభాషాంతం వదంత్యేకే, నప్రాణేతుకదాచన' అథ. అలం. స్వభావోక్తి. ఈ పద్యాంతమున ద్రుతములోపించుటకు సూ. 'వాక్యావసానగస్యాపి ల్లోపోన్న ప్రాయశోద్రుతః' అథ.

తా|| ఓ శంకరుఁడా! పందెమునొడ్డుచున్నాను. ఆకాశమునఁ బరుగెత్తునీవారువ మగుబసవనికాఁ జేయిచెఱఁగులతో మడతలుగాఁ జుట్టిన నీతలపాగా యగుపాములకేనికా; పోరాటమున గడుసరులైన రక్కసులఁ దునుమాడు నీముమ్మొనవాలునకా; మనస్సునకింపైన వెన్నెలగాయుచు నీతలయందున్న లేఁజందమామకా; పసుపువన్నెతో నొప్పుచున్న నీగోవతియగు పులితోలునకా; నీవు కాఁపురమున్న వెండికొండకా; ఈమూఁడులోకముల నేలుచున్న నీయొక్క దొరతనమునకా; ఇందులో నేదిద్దైనను సరే పందెము నొప్పుకొనుము.

—: నిరఁకుశులి పన్నిదపువస్తునిర్ణయము :—

క. ఏలా వలవనినడి నీ, చేలాయుధవాహనములు ♦ చేకొన మాకున్
వాలాయముగావించెద, ఫాలాంబక లంజలంజ ♦ పన్నిదమునకున్. 13

అ|| ఫాలాంబకా – నుదుటకన్నుగలయోయీశ్వరుఁడా, నీ-నీయొక్క, చేలాయుధవాహనములు-చేల-వస్త్రములును, ఆయుధ-కత్తియును, వాహనములు-గుఱ్ఱముమొదలగునవి, చేకొనన్-తీసికొనుటకు, మాకున్-మముబోంటివాండ్రకు, ఏలా-ఎందుకు,-అక్కఱలేదనుట, ఉదా. "ఏలా యీమాటలఁబని, పౌలోమీవరుఁడనీ ప్రభావముకంటె కాలుని ప్రభావమును నీ, త్రైలోక్యం బెఱుఁగుఁగలదు ♦ తగువరిపలుకుల్ కాకీ" వలవనినడి – కోరికలేని, యీ వ్యర్థమైనమాటల సందడి, ( నీయాయుధములవలనను వస్త్రములవలనను వాహనములవలనను మాకేమి యుపయోగములేదు కావున నిన్నుగెలిచినను నిష్ప్రయోజనమేయగును ) అంతకంటె లంజలంజ పన్నిదములకున్-నీవైనను నేనయినను భోగముదానినొసంగునట్టి పందెమునకు, వాలాయము-మిక్కిలి, కావించెదన్-కలుఁగఁజేయుచున్నాను-ఉద్యమించుచున్నాను, ఈపద్యమున 'నీచేలాయుధవాహనములు, అని తెలుఁగునఁగల యుష్మచ్ఛబ్దమును సంస్కృతశబ్దసమాసమునఁగూర్చుటకు. 'మూ. సమాస యుగ్ఘవేరాద్య ఆత్మాదిగవిభక్తిగః, అనిఅథ. మఱియు అస్మచ్ఛబ్దమునకు 'మాకున్' అను బహువచన ప్రయోగమునుగూర్చి సూ. 'సంబంధంబున యుష్మదస్మచ్ఛబ్దములకు గొన్నియెడల బహుత్వంబగు, అని ప్రౌ. వ్యా. ఉదా. మాయత్తపృథ్వీ సమానపృథాదేవి. అనిభాగ.

తా|| నొసటనేత్రముగల యోశివుఁడా! నీపులితోలు వేసుకట్టుకొనునదిగాదు. నీయాయుధమును దీసికొనుటకు నేనెచ్చటను యుద్ధము చేయువాఁడను గాను. నీతలపాగాను జుట్టుకొనుటకు మాకేగాఁడిమంత్రములు రావు. నీయెద్దునెక్కుటకు నే నాకాశసంచారిని గాను. నీవెండికొండ యిచ్చినను నేను మోసి తెచ్చుకొనలేను. నీజాబిల్లి చల్లదనమును భరింప నా కగ్ని నేత్రము లేదు. కనుకఁ గోరికలేని యీవస్తువులను విడిచి గెలిచినవారికి నోడినవా రొకవేశ్య నిచ్చునట్లుపన్నిదములనొడ్డుదము.

వ. అని పలికి యమ్మహాదేవునివలనఁ బ్రతివచనంబు గానక యిట్లనియె 14.

అ|| అని-ఈప్రకారముగా, పలికి-సంభాషించి, అమ్మహాదేవునివలనన్-ఆపరమేశ్వరునివలన, ప్రతివచనంబు-ప్రత్యుత్తరము-బదులుమాట, కానక-వినినవాఁడుగాక-(ఇది వ్యతిరేకక్త్వార్థకము), ఇట్లు-ఈచెప్పఁబోవుపద్ధతిగా, అనియెన్-పలికెను,

క. పూనిన నోటమి తప్పదు, దీనికి మాటాడక యున్న ♦ దియె నయమనుచుఁ
మౌనము దాల్చిన గట్టుఁ,బోనీఁడు నిరంకుశుఁడు ♦ భుజగవిభూషా. 15

అ॥ భుజగవిభూషా-పాములేసొమ్ములుగాఁగల యోశివుడా, పూనినన్-ప్రయత్నించినట్లయిన, ఓటమి-ఓడిపోవుట, తప్పదు-తొలఁగదు-నిశ్చయమనుట, కనుక, దీనికిన్-ఈవాక్యమునకు, మాటాడక-సమాధానమీయక, ఉన్నదియే-ఉండుటయే, నయమనుచున్-మంచిదనుకొని, మౌనము-మాట్లాడకుండుట, తాల్చినన్-వహించినప్పటికిని-అనఁగా నీవు పలుకకుండినప్పటికిననుట, నిరంకుశుండు-నిరంకుశుఁడను పేరుగలయీజూదరి, గుట్టునన్-ఈరహస్యమును బయలుగానీయకుండ, పోనీఁడు-పోనీయఁడు-అనఁగా నీనినివిడుచుట యసాధ్యమనుట,

తా॥ ఓశంకరుఁడా! నీవీజూదమున కారంభించితివేని తప్పక యోడుదు ననుసందియముతో పలుకకయుండినను-నేనుమాత్రము నిన్ను విడువను.

క. తగ దింతటి సర్వజ్ఞత,దిగనాడుము లేక నన్ను ♦ దీకొను దీనన్
“జగబిరుదు ముండమొయ్యయుఁ”, దగవే నీ వెఱుఁగవే సు ♦ ధాకిరణధరా. 16

అ॥ సుధాకిరణధరా - అమృతకిరణములుగల చంద్రుని ధరించినవాఁడా, ఇంతటి సర్వజ్ఞత-సమస్తమును దెలిసినవాఁడ ననెడి యింతగొప్పకీర్తిని, దిగనాడుము - విడువుము, లేక - అట్లుగాని పక్షమున, దీనన్ - ఈజూదమునందు, నన్నున్ - నన్ను, దీకొనుము - ఎదుర్కొనుము, ఇచట నన్ను దీకొనుమనఁగా నాతో నెదురించుమనునర్థమునఁ దృతీయకు ద్వితీయ చెప్పఁబడినది. ఇది ఢీకొనుటకు రూపాంతరము. ఉదా. చ. ధృతిఁ దను దేవదానవులు ♦ దీకొనలేరనియున్న, అనిరావహా ‘జగ బిరుదు ముండమొయ్యయున్, ఈలోకమున కంతటికిని నేనే మొనగాఁడ ననుసూరలాంఛనమును, జెనిఖిట్టిలేనియాఁడుదానియొక్క దుఃఖారావమును, తగవె - చెల్లునా, అనఁగా నీరెంటినిగూర్చి విచారించువారెవరుందురు. అనఁగా గర్తయొకఁడైనచో నప్పుడే విమర్శించును. కాని మితిలేని యీ ప్రపంచముయొక్క మొత్తముమీఁదిపని యగుటచే నెవ్వరును విచారింపఁ బూనరనుట, ఉదా “కట్టా ద్యాయల్ల పంచనుండఁదగవే, కౌరవ్యవంశాగ్రణీ, భార. నీవెఱుఁగవే - ఇది నీకుఁ దెలిసినదియే కదా, (కనుక లేనిపోని బిరుదులు పెట్టికొని యూరకుండుటకంటెఁ బందెమునకు నిలుపఁబడిన నాయెదుట నీసర్వజ్ఞత్వమును జూపి నీప్రఖ్యాతిని నిలుపుకొనుము.) ఇందు జగబిరుదు ముండమొయ్యయు, అనుటచే లోకోక్త్యలంకారము.

తా॥ ఓసాంబమూర్తీ! నేను సమస్తమును దెలిసినవాఁడ ననెడి యింత గొప్పపేర్మిను వదలివేయుము. అటులఁగానిచో నీపందెమున నాతో నెదిరించుము. ఇంతవఱకు ముండమొఱ నాలకించువారెవ్వరు లేనట్లు నీబిరుదునుగూర్చి పరిశీలించినవారెవరును లేరు. ఇప్పుడు నాప్రోల నీ సామర్థ్యమునుఁ గనఁబఱచి నీప్రతిష్ఠను నిలిపికొనుము.

గీ॥ ఎన్నివిధముల నా టాడ ♦ కున్న యట్టి, గట్టిపూనికి నీయందుఁ ♦ గలిగె నేని, దాని
కొకయుక్తి మునుమున్నె ♦ తలఁచినాఁడ, మిన్నుకపచ్చు నెపటశిఖా ♦ కుసుమకుదుట 17

అ॥ ఎన్నివిధములన్ = ఎన్నిరీతులచేతను, ఇచట 'ఎన్ని' అనుటకు 'సూ. అమహదర్థంబున భిన్న వస్తుసముదాయం బర్థమగుచో నేకవచనంబుననంతాదుల తకారంబునకు ద్విరుక్తనివర్ణంబగు' ప్రౌ: వ్యా: మాటాడకున్నన్ — పలుకకుండినప్పటికిని, అట్టి - అటువంటి, గట్టిపూనికి - దృఢమైన ప్రయత్నము, ఇచట పూనిక, అనుటకు 'సూ. అజన్యజన్యభేదేన శబ్దాస్స్యుర్ద్వివిధా మతాః. జన్యాంతగతవర్ణానాం. భూయసీ స్యాద్విచిత్రతా' అధ. శ్రవణాదులకునికి పర్ణకంబగు. వినికి - కోరిక- పూనికి- ఇత్యాదులు. నీయందున్ - నీమనస్సులో, కలిగనేని - ఏర్పడినట్లయినను, దానికిన్ - ఆకార్యమునకు, ఒకయుక్తిన్ - ఒక్కసదుపాయమును, మునుమున్నె — మొట్టమొదటనే, తలంచినాడన్ - ఆలోచించియున్నాను, విటశిఖా కుసుమ మెమటన్ - వ్యభిచారపురుషులలో శ్రేష్ఠుఁడనగు నాముందర, మిఘుకవచ్చునె - తప్పిపోవీలుండునా - అనఁగాఁదప్పించుకొనలేవనుట, 'ని. మిసుకు-కదలు'- శ. ర.

తా॥ ఎన్నివిధములచేతను నీవు పలుకుటలేదు. అయినను గట్టిగా నీ వాడఁదలఁచితివేని దాని కొకసదుపాయమును మొట్టమొదటనే యాలోచించితిని. జారులలో నధికుఁడ నగు నాయెదుట నా తప్పించుకొను ప్రయత్నము.

—: నిరంకుశుఁ డుభయపక్షము లాడఁబూనుట :—

క॥ నీయెత్తు నేనె యాడెద, నీయెడలన్ బొంకులేక ♦ నీవిద్యకుఁ బ్రా
లేయాద్రి సుతాజీవిత, నాయక నెత్తంబు కార ♦ ణం బెఱుఁగుదువా. 18

అ॥ ప్రాలేయాద్రిసుతా జీవితనాయక - ప్రాలేయాద్రి - మంచుకొండయొక్క, సుతా — కూఁతురయిన పార్వతీదేవియొక్క, జీవిత నాయక — పతియైనవాఁడా, నీయెడలన్ - నీయందు, బొంకులేక - అసత్యమాడక, నీయెత్తున్ - నీవాడవలసిన పాచికలయెత్తునుగూడ, ఉదా "ఉ. తమ్ముఁ లయెత్తు చిత్రచరితమ్ము" అని వసు; నేనె ♦ యాడెదన్ - నీకుఁగష్టములేకుండ నేనే యాడగలను, నీవిద్యకున్ - నీకుఁగల విద్యయొక్క యతిశయమునకు, నెత్తంబు - ఈపందెమే, కారణము — హేతువు - అనఁగా నన్ను జయించితివేని సర్వజ్ఞుఁడవేయనుట, ఎఱుఁగుదువా - తెలిసికొనుచున్నావా.

తా॥ ఓ యుమాపతీ! అబద్ధము లేకుండ నీయెత్తుగూడ నేనే యాడుదును. నీవు సర్వజ్ఞుఁడవైనదికానిది యీపందెమే చెప్పును. సర్వజ్ఞుఁడవైనచో గెలుతువు. లేకున్న నోడుదువు.

క॥ అని పాళి శైలకన్యా, స్తనపాళీనామకేలి ♦ తామరసరసా
యనలోలుపాళియెదుటం, బొనరించె విరించివంశ ♦ భూషణ మధిపా. 19

అ॥ అధిపా - ఓరాజా, విరించివంశభూషణము — బ్రాహ్మణకులమునఁ బ్రకాశించుచున్నవాఁడగు నా నిరంకుశుఁడు, అని — ఇట్లని, పాళిన్ — అచ్చోటు, ని 'పాళిః కర్ణలతాగ్రేఽశ్రిః పంక్త్యావంకప్రదేశయోః, అనివి. పాళిః కర్ణలతాయాంస్యాత్ప్రదేశే పంక్తిచిహ్నయోః; అజ. శైలకన్యాస్తనపాళీ నామకేలితామరసాయనలోలు పాళియెదుటన్. శైలకన్యా - పార్వతీదేవివైన, స్తనపాళీ — కుచప్రదేశములయందు, నామ - ప్రసిద్ధిగల, కేలి - విహారము నెడు, తామరసరసాయన -

పద్మములతోఁ చేయఁబడిన శ్రేష్ఠమైన యౌషధమునందు, లోలుప - ఆసక్తిగల, అళి - తుమ్మెద యైన యాశివునియొక్క, ఎదుటన్ - సమక్షమునను, పొసఁగించెన్ - చక్కఁబఱచెను. అనఁగా జూదమాడుటకు కనుకూలమగున ట్లాప్రదేశమును సరిచేసెననుట, ఇచట 'అనిపాళి - స్తనపాళి - కేళి - పాళి,' ఇవి యనుప్రాసాలంకారము. తామరస రసాయనలోలుపాళి; ఉపమాలంకారము.

మ॥ ధృతి పెంపొందఁగ సారెసారె పయిసా ♦ రెం జూచుచు న్సారెపో
వుతఱిం బోవుచు జోడుగట్టుతఱి ఱి ♦ వ్వల్మిఱి జోడించుచున్
జతె బారా పది దచ్చి యిత్తిగ తిగా ♦ చౌవంచ తీవంచ బొం
కితినా సత్తకె యంచు నాడె నుభయ ♦ స్వీకార మేపారఁగన్. 20

అ॥ ధృతి పెంపొందఁగన్ - ధైర్యమతిశయించఁగా, సారె - పాచికను - పాచికను, పయిసారెన్ - మీఁదిసోగటాలకాయను. చూచుచున్ - కనిపెట్టుచు - పరిశీలించుచు, సారెపోవుతఱిన్ - పాచికపోవుసమయమున, పోవుచున్ - వెంటఁబోవుచు .. అనఁగా నొకపాచికముందుకుఁ బోవుచుండ రెండవదాని ననుసరించుచుననుట, జోడుకట్టుతఱిన్ .. జతకాయలు గూడెనప్పుడు, ఱివ్వల్మిఱిన్ - పాచికలు పైకెగ వేయునప్పుడు ధ్వని యధికమగునట్లుగా, ఉదా 'సీ. బడి వాయకిల నెగ ♦ ప్రతతితో ఱివ్వన, నెగసినట్లయితోఁచు ♦ మగువలాఁ, అనిపసు. జోడించుచున్ ..జతసేయుచును, జతె .. రెండు, బారా - పదిరెండు, పది. దచ్చి - ఎనిమిది, దంటి + చవుకము - దచ్చియగును. ఇత్తిగ - ఆఱు, ఇరు + తిగ - ఇత్తిగ యగును. తిగా - మూడు, చౌవంచ .. అయిదు, ఉదా. "సీ. కంకణంబులు మ్రోయఁ♦గాదుగ చౌత్రి చౌ. వంచంచుఁబంధముల్ ♦వైచువాఁడు" చమం. "క. అత్తీవంచతిగ యుమగ, సత్తాదచ్చౌక పంచ♦చౌవంచీరై, దిత్తిగయుద్దగ బ్రద్దలు, చిత్తంబునఁదల్చఁచి నట్లు చేతికిఁదెచ్చున్" హరివం. తీవంచ - నాలుగు, బొంకితినా సత్తకె - ఓ పాచికల్లాటయందుఁ గలశక్తీ అబద్ధమేమైననాడుచుంటినా, అంచున్ - ఇట్లు పలుకుచు, ఉభయాంగీకారము .. ఇరువురి యాటలయందలి సమ్మతిని, ఏపారఁగన్ - అధికముకాఁగా, ఆడెన్ - ఆడెను, ఈపద్యమునఁ బ్రథమ చరణమున బువ్వాడిసెప్పఁబడినది. 'క. ఇత్వైత్వంబులఁ దొలఁగక, బుత్వంబును బువళి యనఁగ ♦ రేఫముతో మి, త్రత్వంబు నెఱపు నెట్టిమ, హత్త్వమొ యట్లనగుఁ గాదు♦లందున్నపుడున్', అనిఅప్ప. స్వభావోక్త్యలంకారము. 'స్వభావోక్తిరసౌచాయ, యథావద్వస్తువర్ణనం' ప్రతా.

తా॥ ధైర్యముతో మాటిమాటికిఁ బైకాయలఁ జూచుచు నొకటితో మతియొకటి వెంటాడు నట్లు పాచికల నడుపుచు నొక్కొక్కప్పుడు జంట యగుచుండ ఱివ్వమను ధ్వనులతో నాడుచు నిట్లుభయులయాట నొక్కఁడే యాడుచుండెను.

క॥ ఈరీతి నక్షవిద్యా, పారీణత మెఱయ నుభయ ♦ పక్షజయాపే |
క్షారూఢచిత్తుఁ డై ధీ, గౌరవ మెసగంగ నాడఁ ♦ గా దైవగతిన్. 21.

అ॥ ఈరీతిన్ - ఈప్రకారముగా. అక్షవిద్యాపారీణత - జూదమనువిద్యయందు మిక్కుటమైన నేర్పు, మెఱయన్ ప్రకాశించఁగా. ఉభయపక్ష జయాపేక్షారూఢచిత్తుఁడై, ఉభయపక్ష - ఇరువైపులవారియొక్క - ఇద్దరిపందెములయొక్క, జయాపేక్ష - గెలువనిచ్చగించుటయందు, ఆరూఢ - స్థిర

పడిన, చిత్తుఁడు — మనస్సుగలవాఁడు, ఐ అగుచు, ధీగౌరవము — బుద్ధియొక్క యధికము, ఎసఁగంగన్ — ఒప్పునట్లు, ఆడఁగాన్ — జూదమాడుచుండఁగా, దైవగతిన్ — అదృష్టవశమున — దైవయోగము వలన, 'ని. దైవం దిష్టంభాగధేయం, భాగ్యం స్త్రీనియతిర్విధిః' అ. అలం. సమాధి.

తా॥ అతఁ డిట్లు జూదమునుఁదన సామర్థ్యముకొలఁది యిరువైపుల గెలువవలయు ననుకాంక్షతో నాడుచుండఁగాఁ దన యదృష్టవశమున.

—: నిరంకుశునియాట గెలుచుట :—

క॥ తనయాట గెలువ లక్ష్మీ, తనయాటవిదహను జూచి ♦ ధరణీసురుఁ డి
ట్లను మానవతీరత్నము, ననుమానములేక యొసఁగు ♦ మా నిపుణతమా. 22.

అ॥ తనయాట గెలువన్ — తనయొక్క పందెము గెలువఁగా, ధరణీసురుఁడు — బ్రాహ్మణుఁడు, లక్ష్మితనయాటవిదహనున్, లక్ష్మితనయ — లక్ష్మీదేవికిఁ గొడుకగు మన్మథుఁడే నెడి, అటవి — అరణ్యమును, దహనున్ — దగ్ధమొనర్చినవాఁడయిన యాశంకరుని, చూచి — వీక్షించి, ఇట్లనున్ — ఈవిధముగాఁ బలికెను, నిపుణతమా — సామర్థ్యముగలవారిలో శ్రేష్ఠుఁడయినవాఁడా, అనుమానములేక — సందేహ పడక, మానవతీరత్నమున్ — అభిమానముగల స్త్రీలలో శ్రేష్ఠమయినదానిని, ఒసఁగుమా — ఇమ్ము, ఈపద్యమున నాలుగవపాదమునఁ బ్లుతయతి చెప్పఁబడినది. ఉదా. క. రఘుపతి, యనుజన్మునిఁజూచి సేమ ♦ మా జనపతికిన్. అని రామా. 'తనయాట గెలువలక్ష్మి తనయాటవి — ట్లనుమానవతీరత్నమునను మానము' యమకాలంకారమును 'లక్ష్మితనయాటవిదహనుఁడు' రూపకాలంకారమును 'ఒసఁగుమా నిపుణతమా' అంత్యానుప్రాసాలంకారమును, ఇచట నిరంకుశుఁడు శివునితో జూదమాడి యొకకాంత నిమ్మనుట 'గుడోపలన్యాయము' అనఁగా బెల్లమునుగొట్టినరాతికి నదియంటుకొనినట్లు వేశ్యాసంగమ దోషమతనిని వీడలేదనిభావము.

తా॥ తనయాట గెలుపొందఁగానే శివునిఁ జూచి యానిరంకుశుఁ డిట్లు పలికె. ఇఁక సంశయింపక యొకయువతి నిమ్ము.

—:నిరంకుశుఁ డా లింగముతో నాకు వేశ్యనిమ్మని కలహించుట:—

క॥ మును లంజలంజ పన్నిద, మని యాడితిఁ గాని యిట్టి ♦ దట్టిది యని యా
డినవాఁడఁ గాను గద నా, మనసుసుమీ వారయువతి ♦ మన్మథమథనా. 23

అ॥ మన్మథమథనా — మన్మథునిఁ జంపిన యో యీశ్వరుఁడా, మును — మొదటనే, లంజ లంజ పన్నిదము — మన యిరువురిలో నెవరు గెలిచినను గెలిచినవారికి వేశ్యనిచ్చునట్టి పందెమే, అని, చెప్పి, ఆడితిన్ — జూదము నాడియుంటిని, కాని — అంతేకాని, సూ. 'కొన్ని యెడలం గాని క్రియాపూర్వకంబు పూర్వ విరుద్ధోత్తరార్థకం బగు' అని ప్రౌ. వ్యా. ఇట్టిదట్టిది యని — ఇటువంటిది యటువంటిది యని నిశ్చయించి, ఆడినవాఁడన్ — ఆడినవాఁడను, కానుగద — ఇది నీవుఁ దెలిసియును

గదా యనుట, వారయువతి – యౌవనపు బోగముది, నా మనసునుమీ – నాకు నిష్టముగలదానిని జెప్పుచున్నాను సుమా, ఇచ్చట మనస్సుశబ్దము, 'సూ. సాన్తావపయః ప్రభృతేస్స్నోపః' నన్న. అను సూత్రముచేమననుఅయినది. సూ. 'మనః ప్రభృతుల సహకారమునకు లోపద్విత్వములునై కల్పికముగనగు' బా. వ్యా. ఉదా "చ...బొందుచో, నిరవయియుండకుండఁగాఁ జాఁకుమీ యతివర్గము లాశ్రయించు" శృం. నై. "ఉ. నీయాన సుమీ సనుం జెనకె నోర్చెట్టిన సత్యు వారలన్" పారి.

తా॥ ఓ మదనాంతకుఁడా! నేను వెందట బోగముది బోగముది, యని చెప్పె వంచెను నాడితిని గాని యిటువంటి రూపముగలది, యిాలాటి గుణముగలది, యింత వయస్సుగలది, యని నిర్ణయించు కొనలేదుగదా. ఆవేశ్యను గోరుట నాయిష్ట మైయున్నది. కనుక నిప్పుడు చెప్పుచున్నాను.

సీ॥ అలకాధిపతి సూనుఁ ♦ డమర వేశ్యలలోన, మే లెంచి పొందు నే ♦ లోలనయనఁ
బ్రధనగరంబులోనఁ ♦ బ్రాణంబు లుంకువ, గా నిచ్చి పోదు రే ♦ కలికితోడఁ
గ్రతుతంత్రముల దేవ ♦ గణముల సంతోష, పఱచి కాంక్షింతు రే ♦ పద్మనయనఁ
గఠినంపు తపములు ♦ గట్టిపెట్టి మునీంద్ర, కోటి యాశింతు రే ♦ కువలయాక్షిఁ

గీ॥ త్రిభువనాశ్చర్య సౌందర్య ♦ రేఖచంచ, లాలతాంగుల కే యింతి ♦ మేలుబంతి
యా దురాప పరీరంభ ♦ నంకయుగ్మ, రామణీయక జితరంభ ♦ రంభఁ దెమ్ము. 24

అ॥ అలకాధిపతి సూనుఁడు – కుబేరుని కుమారుఁడగు నలకూబరుఁడు, అమర వేశ్యలలోనన్ – దేవతా వేశ్యలలో, మేలెంచి – యోగ్యమైనదని తలంచి, ఏలోలనయనన్ – చంచలమైన చూపులు గల యేస్త్రీని, పొందున్ – సంభోగించునో, ప్రధనగరంబులోనన్ – యుద్ధభూమియందు, ప్రాణంబులు – తమ యసువులను, ఉంకువగాన్ – కన్యాశుల్కముగా – ఓలిసొమ్ముగా, ఇచ్చి – ఒసంగి, ఏకలికితోడన్ – మనోజ్ఞురాలైన యేస్త్రీతోగూడ, పోదురు – కలియుదురో, ఉదా "పరాఙ్ముఖః సహస్రాణిశూరమాయోధనేహతం, త్వరితాస్యభిధానంతిసమభర్తాభవేతిచ" అగ్నిపు. క్రతుతంత్రములన్ యజ్ఞకార్య ప్రకార విచారములయందు, దేవగణములన్ దేవతలయొక్క సమూహమును, సంతోషపఱచి – ఆనందము గలవారినిగాఁజేసి, ఏపద్మనయనన్ – కమలములవంటి కన్నులు గలదయిన యేస్త్రీని, కాంక్షింతురు – ఆశపడుదురో, మునీంద్రకోటి – యతీశ్వరులయొక్క సమూహము, కఠినంపు తపములు – కష్టతరమైన తపస్సులు, కట్టిపెట్టి – మూటగట్టి యొకమూలనైచి – అనఁగా బొత్తుగా విడిచి యనుట, ఏకువలయాక్షిన్ – కలువపువ్వులవంటి కన్నులు గలిగిన యేచక్కనిదానిని, ఆశింతురు – ఇచ్ఛగింతురో, త్రిభువ.....గులకున్ – త్రిభువన – మూఁడులోకములకు, ఆశ్చర్య – అద్భుతమును గలిగించునట్టి, సౌందర్యరేఖ – చక్కఁదనమునఁ దీరిన, చంచలాలతా – మెఱుపుతీఁగె వంటి, అంగులకున్ – శరీరముగలవారిలో, ఏయింతి – ఏయాఁడుది, మేలుబంతి – శ్రేష్ఠురాలో, ఆ – ఆయొక్క, దురాపపరీరంభన్. దురాప – పొందనలవిగాని, పరీరంభన్ – ఆలింగనము గలిగినట్టిదానిని, అంకయుగ్మరామణీయకజితరంభన్. అంకయుగ్మ – తొడల ముందటిభాగముయొక్క, రామణీయక – మనోహరమువలన, జిత – జయించఁబడిన, రంభన్ – అరఁటిచెట్టు గలదానిని. ఇట రామణీయకశబ్దమునకు 'సూ. గోపధానాద్గురూపోత్తమాద్వ్యుఞ్, ద్వంద్వ మనోజ్ఞాది

భ్యశ్చ' సిద్ధాం. "భటస్య దృష్ట్వావపుషః సురాంగనా, స్థితాచిరం వ్యోమని రామణీయకమ్" రావ. సులక్షణమైన యూరువులను వర్ణించుటలో మహాకవి కాళిదాసు "నాగేంద్ర హస్తాస్త్వచికర్కశత్వా, దేకాంతశైత్యా త్కదళీవిశేషాః, లబ్ధ్వాఽపిలోకే పరిణాహిరూపం. జాతాస్తదూర్వోరుపమానబాహ్యాః" కుమా. రంభకా — రంభయను పేరుగల వేశ్యను, తెమ్ము — తెచ్చియిమ్ము, ఇందు కర్మసంపుటపములు, అను ప్రయోగమునకు "సూ. సామానాధి కరణ్యేతు, బహుత్వాశ్రేపరేఽపిచ, ముఖ్యోర్హ్యవేతాం పుంప్యాఖ్యా వాదేశావత్ర సర్వదా" అధ. 'ఇచట నిరంకుశుఁడు రంభనేకోరుటకు 'నారీషు రంభా పురుషేషువిష్ణుః' అని యీ యిరువురియొక్క లోకోత్తర సౌందర్యము సిద్ధాంతీకరించబడి యున్నది. ఇచట నాథునికుబుకొందఱు కవులు భిన్నభావమును జూపుచుండిరి.

సీ. ఊర్వశి రంభ తి ♦ లోత్తమ శశిరేఖ, హరిణి చంద్రకళయ ♦ నంగలతిక
మదనమోహినివపు ♦ ష్మతి కాంతిమతి శుభా, ననకళానిధి వరూ ♦ థినిఘృతాచి
మేనక పంచాశ్వ ♦ మేధిని రాజసూ, యార్థినిక్రతుశుల్క ♦ తీర్థ శుల్క
జలపద కర్పూర ♦ తిలక లీలావతి, చారు సంజీవని ♦ దానశుల్క.

గీ. ముని మనోహర ధాన్య మా ♦ లిని సమీచి, భుంజికస్థలప్రమ్లోచ ♦ మంజుఘోష.
చారునాను చకోరాక్షి ♦ సౌరభేయి, హేమ మొదలైన యచ్చర ♦ లేమలధిప. కళా. వి.

అయినను రంభకే జగదేక సౌందర్యము నిర్ణయింపఁబడినది.

"క. అంభోజాక్షులలోపల, రంభయె కడుచక్కనిదిర, రాగంబులలో
గాంభీర్యమైనరాగము, కాంభోజియె కందపద్యపు కవిచాడప్పా" క. చా.

తా॥ దేవలోకమున ధనసంపన్నుఁడును; సౌందర్యవంతుఁడునగు నలకూబరుఁడు శ్రేష్ఠురాలని పొందునదియు, యుద్ధమునఁ బ్రాణముల నర్పించిన వీరులఁ గూడునదియు, దేవతలకు సంతుష్టికరమగు యజ్ఞము లాచరించినవారలఁ గలియునదియు, మునులందఱు గష్టతరమగు తపస్సులు చాలించి యాశించునదియు, మూఁడులోకముల కచ్చెరువు గలిగించునట్టి చక్కదనముతో నందఱికంటె మిన్నయైనదియు, సామాన్యులకు లభింపనిదియు, నగఁటిబోదెలవంటి తొడలు గలదియు, నగు రంభనిమ్ము.

క॥ విన్నావో వినవో నీతి న, మున్నతు లడిగించుకొనఁగ ♦ నొప్పనివి ధరకా
బన్నిదమును మఱియేదో, యన్నారుచుమీ మదావ ♦ ళాసురభేదీ. 25

అ॥ మదావళాసురభేదీ — గజాసురుని సంహరించిన యోహరుఁడా, విన్నావో, వినవో — ఈ సామెతను నీవు వినియున్నావో వినియుండలేదో, ఇచట విన్నావో వినవో, అనుటకు 'సూ. ఏదో తొవ్యతిరేకాదపి సంప్రార్థన పరా క్రియాణాం స్తః" శబ్దచిం. ధరకా — భూమియందు, నీతిసమున్నతులు — న్యాయమునం దధికులైనవారు, అడిగించుకొనఁగకా — నాకీయవలసిన దిమ్మని యడిగించుకొనుటకు, ఒప్పనివి — కూడనివి, పన్నిదము — పందెపుసొమ్మును, మఱియేదో — ఇది పెద్దవారి యెదుటఁ జెప్పఁగూడనిది కాని యెల్లరకుఁ దెలిసినదియేయనుట, అనఁగాఁ బందెపుకాసును బదుపు కాసును నడిగించుకొనినచో చెప్పరైరి వినినఁ బరువుపోవును. కనుక నీ రెండును ఒకులకుఁ దెలియుకుండ గుట్టుగానే యీయవలయు నను లోకోక్తి, అన్నారుచుమీ— ఇట్లు పెద్దలు చెప్పుచుందురుసుమా

తా॥ ఓ గజాసురవైరీ! ప్రపంచమున ధర్మముల నెఱింగినపెద్దలు 'పందెపు కాసులును బదులు కాసులును నిత్యులు వినునట్లడిగించుకొనక గుట్టుగా నీయవలె, ననిన సామెత నీవు విన్నావో వినలేదో.

ధృవకోకిల. తగునె పన్నిద మీక యీగతిఁ ♦ దప్పుమానము దాల్పఁగాఁ
తగవు నీకును నాకుఁ బెద్దల ♦ దండఁ బెట్టెదఁ జండి నై
గగనకేశ యటంచుఁ జందుర ♦ కావిసేలు గళంబునన్
బొగడదండ యొనర్చె నావిట ♦ భూసురాగ్రణి దిట్టయై. 26

అ॥ గగనకేశ — ఆకాశమేజడగాఁగల యో శంకరుఁడా, పన్నిదమీక-నీవొప్పుకొనిన పందెమును జెల్లించక, ఈగతి — ఈవిధముగా, తప్పు — తప్పించుకొనునట్టి, మానమున్ — మాటాడకుండు నటువంటి స్వభావమును, దాల్పఁగన్ — వహించుట, తగునె — నీకుఁజెల్లునా, నీకును నాకున్ — మన యిద్దరికినిగల, తగవున్ — వివాదమును, చండిన్ — మూర్ఖపుఁబట్టుగలవాఁడను, ని. "సీ. చండి పోతు గరాసు మొండికట్టె" ఆం. సం. ఉదా. "చ. వెండియును♦ జండితనంబున వచ్చివచ్చి, పోరెదు మొనలు" భార. "చండిపోతు — మూర్ఖపుఁబట్టుదల గలవాఁడు" శ. ర. ఐ — అగుచు, పెద్దల దండన్ — తెలిసినవారి సమీపమున, పెట్టెదన్ — ఉంచఁబోవుచున్నాను. అటంచున్ — ఇట్లుపలుకుచు, ఆ — ఆయొక్క, విటభూసురాగ్రణి — జారుఁడైన యాబ్రాహ్మణోత్తముఁడు, దిట్టయై — ధైర్యముగలవాఁడై, చందుర కావిసేలుగళంబునన్ — చంద్రకావి వలువదాల్చిన యాశివునియొక్క కంఠమునందు, పొగడదండ — పొగడపువ్వులయొక్క సరమును, ఒనర్చెన్ — కల్పించెను (గుచ్చి వైచెను, ఈధృవకోకిల వృత్తమునకు లక్షణము. "శుభవిలాస ముకుంద కేశవ ♦ సూలిధన్య విరామ ముల్, నభరసంబులు జాగముల్ దగు ♦ నవ్యమై ధృవకోకిలన్" అనిసుల. దీనినే తరళవృత్త మందురు. "జలజలోచనుఁ గైటభాంతకు ♦ శంఖచక్రగదాధరున్, గలశజాది మునీంద్ర సేవితుఁ ♦ గాళియాంతకు నచ్యుతున్, బలుకుచోఁ దరళంబు లందుల ♦ భాను విశ్రమపద్ధతిన్, గలియ నభస జాగముల్ సమ ♦ కట్టి చెప్పదు రుత్తముల్" అని అప్ప.

తా. ఓ యీశ్వరుఁడా! నీవు మొదట సమ్మతించి యిప్పుడు పందెమును జెల్లించక తప్పించు కొనఁబూని మాటాడకుండుట తగునా. మన యిరువురికిఁగల జగడమును బెద్దలయెదుటఁ బెట్టెదను. ఇట్లనుచు నాబ్రాహ్మణుఁడు శివుని మెడలో నొక పొగడపువ్వులదండను వేసెను.

గీ॥ తాము గనిపించ కుండి గం ♦ ధర్వయక్ష, భుజగకిన్నర ముఖ్యులు ♦ పొగడ దండఁ
బొగడదండయుఁ బోలె న ♦ ప్పగడదండ, కాలకంధరుమెడ కలఁ ♦ కారమయ్యె. 27

అ॥ గంధర్వ యక్షభుజగ కిన్నరముఖ్యులు. గంధర్వ — గంధర్వులును, యక్ష — యక్షులును, భుజగ — పన్నగులును, కిన్నర — కిన్నరులును, మొదలగు, ముఖ్యులు — ప్రధానమయినవారు, తాము — వారందఱును, దండన్ — సమీపమున, కనిపించకుండి — అదృశ్యముగనుండి — చాటుననుండి, పొగడన్ — స్తుతించఁగా, పొగడదండయున్ — వకుళపుష్పంబులయొక్క హారమును, అప్పగడ — ఋణము యొక్క యధికమునకు, దండ — సమీపమును, పోలెన్ — పోలికగా — అనఁగా ఋణాధికముయొక్క

చేరువవలెననుట, కాలకంధరు మెడకున్ — నల్లని కంఠముగలవాఁడయిన యా హరుని కంఠమునకు, అలంకారమయ్యెన్ — ఆభరణముగానుండెను. అనఁగా నల్లని మెడయందుఁ దెల్లనిపువ్వులదండ వేయఁగానే శృంగారముగా నుండెననుట, పొఁగడదండయుఁబోలె నప్పొగడదండ, అనుటచే ననుప్రాసాలంకారమును, ఉత్ప్రేక్షయును.

తా|| అట్టిమెడ గంధర్వులు యక్షులు పన్నగులు కిన్నరులు మొదలగువారందఱునదృశ్యముగా నుండి స్తుతించఁగా నల్లని మెడయం దాపూలదండ తెల్లగాఁ బ్రకాశించుచుండెను. అది యాశివుఁ డప్పునకు చేరువ నుండిన ట్లగపడెను.

వ|| ఇవ్విధంబున నవ్విప్రకుమారుండు పుష్పకోదండ జయవిరాజితుం బరాజితుం జేసి యిట్లనియె. 28

అ|| అవ్విప్రకుమారుండు — బ్రాహ్మణుని కొడుకైన యా నిరంకుశుఁడు, ఇవ్విధంబునన్ — ఈరీతిగా, పుష్పకోదండ జయవిరాజితున్ — పుష్పకోదండ — పువ్వులే బాణములుగాఁగల మన్మథుని, జయ — గెలిచినవాఁడై, విరాజితున్ — ప్రకాశించుచున్నవాఁడైన యా శివుని, పరాజితున్ — ఓడి పోఁగొట్టఁబడిన వానినిగా, చేసి — ఒనరించి — అనఁగా జూదమున నోడించియనుట, ఇట్లనియెన్, ఈరీతిగాఁబలికెను — అనఁగాఁ జెప్పఁబోవువిధముగా వచించెననుట, ఇచట 'విరాజితుం బరాజితుం జేసి' యనుచోట ననుప్రాసాలంకారము.

—: నిరంకుశుఁడు శివునిదూషించుట :—

సీ. తగ వంటిమా నీకుఁ ♦ దగ వెక్కడిది భక్తి, పాకీణునిల్లాలిఁ ♦ బట్టినావు
తెగు వంటిమా నీకుఁ ♦ దెగువెక్కడిది వెండి, కొండ యుండఁగ భిక్షు ♦ గోరినావు
గుఱు తంటిమా నీకు ♦ గుఱుతెక్కడిది భక్తి, నంబికిఁ గుంటెన ♦ నడచినావు
బిరు దంటిమా నీకు ♦ బిరుదెక్కడిది పాండు, నృపకుమారునకుఁ గ్రిం♦దుపడినావు

గీ. దొరతనం బంటిమా నీకు ♦ దొరతనంబు, గలదె బాణునివాకిలిఁ ♦ గాచినావు
నిన్ను సర్వజ్ఞుఁ డని కొల్చు ♦ నిర్జరాళి, నెన్ను టంతియ కాక నీ ♦ వేమిసేతు. 29

అ|| తగవు + అంటిమా — న్యాయముగలదనుకొందుమా, భక్తిపాకీణునిల్లాలిన్ — భక్తియందు సంపూర్ణుఁడయిన భక్తాణరాజుయొక్క భార్యను, పట్టినావు — గ్రహించినావు, నీకున్ — నీకు, తగవు + ఎక్కడిది — న్యాయ మెక్కడగలదు — అనఁగా నీయొద్ద న్యాయమే లేదనుట, తెగువ + అంటిమా — ఔదార్యము కలదనుకొందుమా, వెండికొండ — ఘనఘుకొండ — రజతాచలము, ఉండఁగన్ — కలిగినప్పటికిని, భిక్ష — తిరిపెమును, కోరినావు — ఆసించినావు, నీకున్ — తెగువ + ఎక్కడిది — నీయొద్ద నౌదార్యమెక్కడగలదు — దాతృత్వమే లేదనుట, గుఱుతు + అంటిమా — ఒకనిర్ణయము కలదనుకొందుమా, భక్తినంబికిన్ — భక్తుఁడైనయొడయనంబికి, కుంటెనన్ — లంజను విటునికిఁ దార్చునట్టి కార్యమున, నడచినావు — ప్రవర్తించియున్నావు, అనఁగా నొడయనంబియనునాతఁడు మిటుమిండఁడైనారు

వలన వెలివెట్టఁబడి సాకారుఁడైన వాల్మీకేశ్వరుని గోఁచి వెనుక చెంగునుబట్టికొని దొంగతనముగా లంజయింటికి బోయినట్లు బసవపురాణమునందు గలదు. నీకున్ + గుణుతు + ఎక్కడిది — నీకు నియమ మెక్కడ గలదు, నీయొద్ద నియమములేదనుట, బిరుదు + అంటివా — పౌరుషము కలదనుకొందువా, పాండునృపకుమారునకున్ — పాండురాజుకొడుకైన యర్జునునకు, -- క్రిందుపడినావు అపజితుఁడవై యున్నావు, నీకున్ + బిరుదు + ఎక్కడిది — నీకుఁ బౌరుష మొకటికలదా, నీయందుఁ బౌరుషచిహ్నమే లేదనుట, దొరతనంబు + అంటివా — ప్రభుత్వము కలదనుకొందువా, బాణునివాకిలిన్ — బాణాసురుని యింటిముంగిట, కాచినావు — కావలియుంటివి, అనఁగా ద్వారపాలకుఁడవైతివనుట, నీకున్ + దొరతనంబు + కలదె — నీకు నధికారత్వ మొకటియున్నదా, నీకు రాచఱికమే లేదనుట, నిన్నున్ — ఇట్టివాఁడవైననిన్ను, సర్వజ్ఞుఁడు — సమస్తమును దెలిసినవాఁడు - అన్నియు నెఱిఁగినవాఁడు, అని — ఇట్లుతలంచి, కొల్చు — సేవించుచున్నట్టి, నిర్జరాళిన్ — దేవతలయొక్క సమూహమును, ఎన్నుట -- గణించుట, అంతియకాక — అంతమాత్రమే కాని, నీవేమి సేతు — నీవేమి సేయుదువు, ఈపద్యమున ‘నీవేమి సేతు’ అని ప్రయోగించుటను ‘సూ. క్వచిన్మధ్యమస్యాపి కేచిదుత్తమత్వమిచ్ఛన్తి’ అని యథర్వణాచార్యులు.

మఱియు ‘నీకుఁదగనెక్కడిది’ ఇత్యాదులు. సప్తమికి షష్ఠి చెప్పఁబడినది. సూ. షష్ఠీస్థానికం బగు కువర్ణకంబొక్కొక్కచో ద్వితీయాది విభక్తులకు మాఱుగాఁ దదర్థంబులం జూపట్టెడిని, అని ప్రౌ. వ్యా. ఉదా “కోమలినీకనురక్త” అనిభార. పద్యమంతయును వ్యాజస్తుత్యలంకారము. ‘నిందయావాచ్యయాయత్ర స్తుతిరేవావగమ్యతే, స్తుత్యావాగమ్యతేనిందా, వ్యాజస్తుతిరసౌమతా’ అని. ప్రతా

తా॥ ఓ శంకరుఁడా! నీవు న్యాయము కలవాఁడ వనుకొందునా భక్తియం దధికుఁడైన భల్లాణ రాజు భార్యనే గ్రహించినావు. కనుక నీకు న్యాయములేదు గదా! వితరణము కలదనుకొందునా ధన పర్వతము దాపుననుండియుఁ జాలక బిచ్చమెత్తుచున్నావు. కావున నీయందు దాతృత్వము లేదు గదా! నియమము కలదని యూహింతునా భక్తుఁడయిన నెయిదురునంబికిఁ గుంటెనవృత్తిలోఁ దిరిగినావు. కాఁబట్టి యెంతటి నీచకార్యము నైనఁ జేయువాఁడవగుటచే నీకు నియమములేదు గదా! పౌరుషమున్న దని తలంతునా యర్జునునితోనే పోరాడలేక క్రిందఁబడినావు. కాన నీయందుఁ బౌరుషము లేదుగదా! అధికారము కలదనుకొందునా నీవే బాణాసురుని వాకిటఁ గావలియున్నావు. కనుక నీకు దొరతనము లేదుగదా! ఇంతటి యల్పుఁడవైన నిన్ను సమస్తమును దెలిసినవాఁడని సేవించుచున్న దేవతలనుమాత్ర మాదరమునఁ జూచుచుందువు. ఇంతకంటె నీవేమి చేయఁగలవు.

గీ. నీమహాదైన్యవృత్తికి ♦ నీకు నార్య, భాగ్యసంపన్న గుణధుర్య ♦ భార్య యొక్క-
చట్టుకూఁతురు గలుగ ♦ నీజాము వేగెఁ, గాని లేకున్న మఱి చెప్పఁ ♦ గలదె నిన్ను. 30

అ॥ నీ. నీయొక్క, మహా + దైన్యవృత్తికిన్ — దరిద్రపు నడతకు, నీకున్ — నీకు, ఆర్య — పూజ్యురాలును, భాగ్యసంపన్న — అదృష్టముయొక్క సమృద్ధిగలదియును. గుణధుర్య — మంచిబుద్ధి యొక్క భారమును వహించుచున్నదియును, అయిన భార్య - ఇల్లాలు, ఒక్కచట్టుకూఁతురు — హిమవంతుని కూఁతురగు నొకపార్వతీదేవి, కలుగన్ — ఉండుటచేత, ఈజాము వేగెన్ — ఇంతవఱకుఁ

దెల్లవాఱినది. ఎలాగో శుభోదయమయినది. కాని — అంతమాత్రమే కాని, మఱి — ఇంకను, లేకున్నన్ — అటులఁగాకున్న, ఆమెయే లేకుండినట్లయిన, నిన్నుఁ — ఇట్టివాఁడవగు నిన్ను, చెప్పన్ — చెప్పుకొనుటకు, కలదె — వీలుగలదా — నీస్థితియేమయ్యెడిదో యనుట. ఇందు "నీమహాదైన్య...జాము వేగెన్" అనుటచే నిందారూపమయినస్తుతి. కనుక వ్యాజస్తుత్యలంకారము.

తా॥ నీ దరిద్రప్రవర్తనమునకు సంపూర్ణమగు సదృష్టవంతురాలయిన పార్వతీదేవి యుండుట వలన నింతవఱకేలాగో కాలము గడచినది. లేకుండిన నీయునికిఁ జెప్పనగునా.

క. నీ గూబజంకెలకు ను, ద్వేగపడం గుసుమశరుఁడె ♦ విటసింహుఁడు వే
వేగఁ గమలాక్షిఁ దెచ్చెద, వో గరువతనంబు వాసి ♦ పో నెంచెదవో. 31

అ॥ నీ గూబజంకెలకున్ — నీయొక్క గుడ్లగూబవంటి బెదరింపులకు, ఇది జంకెనయొక్క రూపాంతరము. ఉదా 'క. హుంకారములునదల్పులు, జంకెలు' అనిభార. ఉద్వేగపడన్ — భయపడుటకు, ని 'ఉద్వేగస్థిమితే క్లేశే భయే మందరగామిని' అనివి. విటసింహుడు — కాముకులలో నధికుఁడైన యీ నిరంకుశుఁడు, కుసుమశరుఁడె — మన్మథుఁడాయేమి, నీ చూపులకు భయపడి దుఃఖించుటకు మన్మథుఁడనుగాననుట, వేవేగన్ — అతి శీఘ్రముగా, కమలాక్షిన్ - వేశ్యను, తెచ్చెదవో — తెప్పించి యిత్తువో, గరువతనంబు — నీయొక్క గౌరవప్రవర్తనమును, వాసి — తొలగించుకొని, పోన్ — పోవుటకు, ఎంచెదవో - తలంచుచున్నావో, ఇచట 'తెచ్చెదవో — ఎంచెదవో' అనుటకు సూ. "అచ్చతుష్కం భావేత్త్వాణి స్థితం ప్రశ్నాదివాచకం. దత్రాదిచ్ఛభవేద్దీర్ఘ ఏదోతావుభయాత్మకా" అథ. నిన్నుజూచి భయపడుటకు నేను మన్మథుఁడను కాను, అనుటచే నిందచేతస్తుతి యగుపడుచున్నందున వ్యాజస్తుత్యలంకారము.

తా॥ గుడ్లగూబవంటి నీబెదరింపులకు భయపడుటకు మన్మథుఁ డనుకొనుచున్నావేమో నేను జారపురుషులలో శ్రేష్ఠుఁడ నగు నిరంకుశుఁడను సుమా! శీఘ్రముగా వెలయాలినిత్తువో లేక నీ గొప్పతనమును బోఁగొట్టుకొనియెదవో చూచెదను.

క. బరిదప్పి తప్పుచేఁతలఁ, బొరలక యిపుడోడినట్టి ♦ పొలఁతుకఁ దే నీ
యఱచేతఁ బండ్లు వచ్చినఁ, గఱతువుగా కిక్షుకార్ముక ♦ ప్రతిపక్షా. 32

అ॥ ఇక్షుకార్ముకప్రతిపక్షా — ఇక్షుకార్ముక — చెఱకువిల్లుగలవాఁడగు మన్మథునకు, ప్రతిపక్షా — శత్రువైన యోశంకరుఁడా, బరితప్పి — హద్దుమీఱి, బరియనఁగా బాలురాడుకొనునప్పుడు గీయు వలయాకారపు రేఖ. తప్పుచేఁతలన్ — తొలఁగించుకొనునట్టి పనులతో, పొరలక — అటునిటు కదలక, ఇపుడు — ఈసమయమున, ఓడినట్టి — పన్నిదమున నోడినటువంటి, పొలఁతుకన్ — స్త్రీని, ఇచట 'పొలఁతి' శబ్దమును 'పొలఁతుక' అని ప్రయోగించుటకు 'సూ నామ్నః కవర్ణకస్స్యాత్. స్వార్థేస్యాదుత్వమపి పరేతస్మిన్' నన్న. తే — తెచ్చియిమ్ము, నీయఱచేతన్ — కరతలమున, పండ్లు వచ్చినన్ — దంతములు పుట్టినప్పుడు, కఱతువుగాక — కొఱకుదువుగాని—నీశౌర్యాతిశయములను

దరువాతఁ జూచెదరుగాని నాకీయవలసిన దానినిట్లిమ్మనుట. ఈపద్యమున దేసన్వయ మైత్రితోఁ బ్రాసము చెప్పఁబడినది. ప్రథమా. 79 వ పద్యమునఁ జూడనగును.

తా॥ ఓ మదనాంతకా! నీవు న్యాయమునతిక్రమించి పోఁజాలక యీ పందెపు వస్తువునిమ్ము. నీ పరాక్రమమున్నఁ దరువాతఁ జూచెదను.

చ. అని యని మేషభూరుహసు ♦ మాసమదామలలామ వాసనా
ఖని యగుపార్వతీధవుని ♦ కంఠమునం దగిలించినట్టి కాం
చనమణి రుచ్యమాన నిజ ♦ శాటి చెఱంగులు గూడఁ బట్టి నీ
పనియన నెంత వేగిరమ ♦ పన్నిద మిమ్మని తీయ నయ్యెడన్. 33

అ॥ అని — ఇట్లుపలికి, అని మే...............ఖని. అని మేషభూరుహ — దేవతా వృక్షమగు పారిజాతముయొక్క, సుమ — పువ్వులవలన, అసమ — సమానములేని — అధికమైనయనుట, దామ లలామ - శ్రేష్ఠమైన మాలికయొక్క, వాసనా — పరిమళమునకు, ఖని - పుట్టుకతావఁ గావలయుగు గనియైన ఇది శివుని కంఠమునకు విశేషణము. అగు — అయినట్టి, పార్వతీధవుని కంఠమునకు - పార్వతీ నాథుఁడగు శివునియొక్క మెడయందు, తగిలించినట్టి - పొందించియున్న, కాంచనమణి చ్యమాన నిజశాటి చెఱంగులు. కాంచన - బంగారమువలెను, మణి .. రత్నములవలెను, రుచ్యమాన — మనోహరమగుచున్న, నిజశాటి — తన యుత్తరీయముయొక్క, చెఱంగులు - కొంగులు, కూడన్ .. కలియునట్లు, పట్టి -పట్టికొని, నీపనియన నెంత — నాకుఁగోపమువచ్చెనేని నీపనియనఁగా నేపాటి, వేగిరమ - దబ్బున. పన్నిదము — పందెపువస్తువును, ఇమ్మని — ఈయవలసినదని, తీయన్ — మరల నాయుత్తరీయమును దీసికొనఁగా, అయ్యెడన్ — ఆసమయమున, ఇందు 'కాంచనమణి రుచ్యమాననిజ శాటిచెఱంగులు, అనువిశేషణముతోఁ గూడిన సమాసమునుగూర్చి, 'ము. విశేషణసమాసోఽపి. క్వచి దిష్టోభవేన్మమ' అనియును మూ. 'అనిందితానాంభాషాణాం శ్లేషో యోగశ్చ సమ్మతః' అనియును నథర్వణవాక్యములు, మూ. 'సంస్కృతవైకృతశబ్దైర్మిశ్ర సమాసఏవవిజ్ఞేయః' అనినన్న 'అని యని మేష' యమకాలంకారము. 'సుమాసమదామలలామ, అనుప్రాసాలంకారము.

తా॥ ఇట్లు వచించుచుఁ బారిజాతపుష్పములయొక్క వాసనలతో నొప్పుచున్న యాశివుని కంఠమునఁ దగిలించిన తన యుత్తరీయపు కొంగులు కలియఁ బట్టుకొని నీపనియనఁగా నెంత వడిగా నా పందెపు వస్తువు నిమ్మని మరల నాయుత్తరీయమును దీసికొనఁగా.

ఉ. సత్యవచోవిశేషపరి ♦ షక్తుఁడు గావున నోడియుండియో
యత్యధికుండు దేవుఁడను ♦ నంజలి దార్ష్ట్యముఁ జూచి మెచ్చియో
భృత్యుఁడు వీఁడు మాద్యమునఁ ♦ బేళముఁ డంచు ననుగ్రహించియో
మృత్యుమదాపహంత యుర ♦ రీకృతభూసుర ధూర్తమార్గుఁ డై. 34

అ॥ మృత్యుమదాపహంత - మృత్యువును జయించిన యాయీశ్వరుఁడు, ఇచట 'హంత' అను టకు 'సూ. ఋకారాంతములు అకారాంతములై స్త్రీసమములుగానగు' బాలవ్యా. సత్యవచోవిశేష

పరిషక్తుఁడు. సత్యవచః - నిజమైన మాటలయొక్క, విశేష — అతిశయమునందు, పరిషక్తుడు — ఆసక్తికలవాఁడు, కావునన్ - కాఁబట్టి, ఓడియుండెనో- తాను గెలువక పోవుటచేతనో, దేవుఁడు- ఈశ్వరుఁడు, అత్యధికుండు - మిక్కిలి గొప్పవాఁడు, అను - ఇట్లుతలంచునట్టి, అంజలి దోష్ప్రయమున్ - దోసిలొగ్గిన దౌర్జన్యమును, చూచి — వీక్షించి, మెచ్చియో — అనుగ్రహించియో, వీఁడు - ఈనిరంకుశుఁడు, భృత్యుఁడు — నాయొక్కబంటు, మౌగ్ధ్యమునన్ - అవివేకమునందు, పేశలుఁడు — నేర్పరి, అనఁగా మిక్కిలి యవివేకియనుట, అంచున్ - అనుకొనుచు, అనుగ్రహించియో - దయగలిగియో, ఉరరీకృత భూసురధూర్తమార్గుఁడు. ఉరరీకృత — అంగీకరింపఁబడిన 'ని. ఊరీకృతమురరీకృత మంగీకృత మాశ్రుతం ప్రతిజ్ఞాతం' అని అ. భూసుర - బ్రాహ్మణునియొక్క, ధూర్తమార్గుఁడు - జూదమాడెడు పద్ధతిగలవాఁడు. 'ని. ధూర్తోక్షదేవీకితవో౽క్ష ధూర్తోద్యూతకృత్సమాః' అని అ. వ్యభిచారపథము గలవాఁడనియుఁ జెప్పవచ్చును. 'ని. ధూర్తంతుఖణ్డలవణే ధుత్తూరే నా విటేత్రిషు' అని మే. ఐ — అగుచు, ఈపద్యమున నాలుగవపాదమున ఋవళి సెప్పఁబడినది. 'క. ఇత్త్వైత్త్వంబులఁ దొలఁగక, ఋత్వంబును ఋవళియనఁగ ♦ రేఫముతోమి, త్రత్వంబు నెఱుపునెట్టిమ, హత్త్వము యట్ల నగుఁగాదు ♦ లందున్నపుడున్, అని అప్ప.

తా॥ ఆ మృత్యుంజయుఁడు సత్యవచనాభిలాషుఁ డగుటచేత నోడినందుననో, పరమేశ్వరుఁడు గొప్పవాఁడని యూహించి గౌర్జన్యమును జూపుచు దోసిలొగ్గుటను గాంచి మెచ్చియో, నా దాసుఁ డగువీఁడు మిక్కిలి యవివేకి యని దయగలిగియో, యతని ధూర్తమార్గమును సమ్మతించి.

—: ఈశ్వరుఁడు దేవగణముతోఁ బ్రత్యక్షమగుట :—

సీ. నిబ్బరంబునవచ్చి ♦ నిలిచినయూఁపున, వెలిగిబ్బ యిరుగెలం ♦ కులకు దాఁట
గమనవేగంబున ♦ బ్రమసి కేయూరంపు, దందశూకములు వ ♦ క్త్రములు తెఱువ
నెగసి చివ్వునఁ గ్రుంకు ♦ గగనవాహిని ప్రేంక, మున జటాజూటంబు ♦ వెనుక కొరగ
జాతి హస్తసరోజ ♦ సన్నిగుద్ధాంతమై, బెళబెళఁ బసిదిండి ♦ వలువ మెఱయఁ

గీ. బతనభయసమాలింగక ♦ పర్వతేంద్ర, కన్యకా బాహువల్లరీ ♦ గాఢవేష్ట
నప్రదీపితాశ్రితకల్ప ♦ నగమనంగ, సంభ్రమతవచ్చి హరుఁడుసా ♦ క్షాత్కరించె. ౮౫

అ॥ నిబ్బరంబునన్ — అతిశీఘ్రముగా, నిబ్బరమనఁగా వేగముననంతమేరయు సమముగాఁ బోయెడు నశ్వధారావిశేషము. దీనినే ప్లుతమందురు. ని "నిబ్బరము — అశ్వగతి విశేషము" శ. చం. వచ్చి — అరుదెంచి, నిలిచిన యూఁపునన్ — నిలఁబడిన యూపువలన, వెలిగిబ్బ — తెల్లనియాఁబోతు, ఇరుకెలంకులకున్ — ఉభయపార్శ్వములకు, దాఁటన్ — లంఘించఁగా, గమనవేగంబునన్ — నడచుచున్నవడివలన, బ్రమసి — గిరగిరఁదిరిగి, కేయూరంపు దందశూకములు — బాహుపురులైన పాములు— భుజకీర్తులుగానున్న సర్పములు, వక్త్రములు తెఱువన్ — పడగలువిప్పఁగా, ఎగసి — పైకిలేచి, చివ్వునన్ — శీఘ్రముగా. క్రుంకు — దిగఁబడునటువంటి, గగనవాహిని — ఆకాశగంగయొక్క, ప్రేకమునన్ — భారమువలన, జటాజూటంబు — జడలయొక్కముడి, వెనుకకున్ — పశ్చాద్భాగమునకు,

సీ. ఎంతదూరము వోవు • నీశ్వరుం డని శౌరి, విహగేంద్రుఁ బోఁడెంబు • వెడల విడువ
నచ్యుతుం డెచటికో • యరుగుచున్నాఁ డని, బ్రహ్మ యెక్కుల తేజిఁ • బరువువోల
నజుఁ డంత వెడలిపో • యెఁ జుమీ యంచు సురేంద్రుఁ, డైరావతంబుఁ గాఁ • లాడిపఱప
నింద్రుఁ డూరకపోవు • నెచటికో యని వహ్ని, పొట్టేటి వాహనం • బును గదల్ప

గీ. వాఁడె శుచి యంచు యమదైత్య • వరుణు లాత్మ, వాహనంబులు జోడింప • వారిఁ గూడఁ
బవనపౌలస్త్య దిక్పతుల్ • జవనమూర్తిఁ, బరఁగుతమ సాహిణముల ని • బ్బరము చూప 36

అ॥ శౌరి — విష్ణువు, ఈశ్వరుఁడు — శివుఁడు, ఎంతదూరము పోవున్ — ఎంతటిదవ్వున కేగునో, అని — ఇట్లు తలంచి, విహగేంద్రున్ — పక్షిరాజగు గరుత్మంతుని, పోఁడెంబు — వేగిరముగా, వెడలన్ — బయలుదేఱఁగా, విడువన్ — విడిచిపెట్టఁగా, బ్రహ్మ — బ్రహ్మ, అచ్యుతుండు — విష్ణువు, ఎక్కడికో — ఎచ్చోటికో, అరుగుచున్నాఁడు — పోవుచున్నాఁడు, అని — ఇట్లని, ఎక్కుల తేజిన్ — తనహంసవాహనమును, పరువువోలన్ — శీఘ్రముగా నడిపించఁగా, సురేంద్రుఁడు — ఇంద్రుఁడు, అజుఁడు — బ్రహ్మదేవుఁడు, అంత వెడలిపోయెన్ — అంతదూరము వెళ్లెను, జుమీ — సుమా, అంచున్ — అనిపలుకుచు, ఐరావతంబున్ — తన యేనుఁగును, అని. 'ఐరావతోఽభ్రమాతంగైరావణాభ్రమువల్లభాః' అ. కాలాడిపఱపన్ — కాలుగిలుపునట్లు నడిగా నడిపించఁగా — పఱుగెత్తించఁగా, ఇచట 'కాలాడిపఱప' అనుటకు సూ. 'లోకోక్తౌ క్త్వాంత భవేద్యోగే యదిస్యాచ్చ్యుతిరంజనమ్' అన. వహ్ని — అగ్నిహోత్రుఁడు, ఇంద్రుఁడు — సురపతి, ఊరకపోవున్ — ఎవ్వరితో నేమియుఁ జెప్పకయే యరుగుచున్నాఁడు, ఎచటికో — ఎక్కడికై యుండునో, అని — ఇట్లూహించి, పొట్టేటి వాహనంబును — తనతగరుతేజీని, కదల్పన్ — చలింపఁజేయఁగా, యమదైత్యవరుణులు — యముఁడును నిరృతియును వరుణదేవుఁడును, వాఁడె — ఆపోవుచున్నయతఁడే, శుచి యంచున్ — అగ్నిహోత్రుఁడనుచు, ఆత్మవాహనంబులు — తమతమ యశ్వములను, జోడింపన్ — జతచేయఁగా, వారిన్ — ఆముందుపోవువారందఱిని, కూడన్ — కలియునట్లుగా, పవనపౌలస్త్య దిక్పతుల్ — వాయుదేవుఁడును, కుబేరుఁడును, మొదలగు దిక్పాలకులు, జవనమూర్తిన్ — వేగమునందలి సంపూర్ణమయిన ప్రజ్ఞచేత, ని. 'జవనో దేశభేదే స్యాద్వేగే వేగాన్వితాశ్వయోః, జవన్యౌషధిభేదే స్యాద్వ్యాచ్యవద్వేగినిస్మృతః' అని విశ్వ. పరఁగు — వర్తించుచున్నటువంటి, తమ సాహిణముల నిబ్బరము — వారివారి గుఱ్ఱముల యొక్క యతిశయవేగమును, చూపన్ — కనఁబఱచఁగా, ఇందు 'ఐరావతంబు గాలాడిపఱపన్' అనుటకు 'సూ. లోకోక్తౌ క్త్వాంత భవేద్యోగే యదిస్యాచ్చ్యుతిరంజనమ్' అని అన.

తా॥ ఈశ్వరుని ప్రయాణమునుఁ జూచి విష్ణువును, విష్ణువునుఁ జూచి బ్రహ్మయును, బ్రహ్మను జూచి యింద్రుఁడును ఇట్లు వరుసగా దిక్పాలకులందఱును నిట్లు దేవతాగణమంతయును గలిసి తమతమ వాహనములతో నడిగా.

వ. చేరవచ్చిరప్పుడు. 37

అ॥ చేరన్ — సమీపించునట్లు, వచ్చిరి — అందఱు నేతెంచిరి, అప్పుడు — ఆట్టికాలమున.

—: నిరంకుశుఁడు శివునిజూచి భయపడుట :—

క. గజగజ వడఁకుచు భూసురుఁ, డజగవధరుఁ జూచి సాధ్వ ♦ సావేశమునన్
భజనంబు మఱచి యుండిన, రజనీకరచూళి సాద ♦ రముగాఁ బలికెన్. 38

అ॥ భూసురుఁడు — ఆ బ్రాహ్మణుఁడు, అజగవధరున్ — పినాకమనుపేరుగల ధనుస్సును ధరించినట్టి యాశంకరుని, చూచి — వీక్షించి, సాధ్వసావేశమునన్ — భయమువలన నొడలెఱుంగక పోవుటచేత. గజగజవడఁకుచు, గజగజయనునది వడఁకుటయందనుకరణము. ఉదా. "సీ. కడుభయం బునవాఁడు♦ గజగజమేను. వడఁకదైన్యంబున♦వాసవు కెరఁగి" నవ. "గీ. వానఁదడియుచు గజగజ♦వడఁకుచున్న, సుతసతీమాని పుత్త్రిలఁ ♦ జూచివగచి" ద్వి. హరి. అనుకరణాచార్యులును "సూ. కాంతి శబ్దాది శబ్దాస్తు, ద్విరుక్తాస్సంతినైకశః, సాధారణాస్త్వపన్యేచ, వైచిత్ర్యంభువి విస్తృతే" అని యున్నారు. భజనంబున్ — సేవించుటను, మఱచి — విస్మృతిఁజెంది, ఉండినన్ — ఉండఁగా, రజనీకరచూళి — చంద్రునిశిరస్సున ధరించిన యాశంకరుఁడు, సాదరముగాన్ — ఆదరముతోఁగూడినవాఁడై, పలికెన్ — ఇట్లువచించెను — చెప్పఁబోవుకీతిగా నుడివెననుట.

తా॥ ఇట్లు సాక్షాత్కరించిన యీశ్వరునిఁ జూచి యాబ్రాహ్మణుఁడు భయపడి వణకుచు సేవింపకుండుటఁ గని యాతనియం దాదరముతో నిట్లు పలికెను.

—: శివుఁడు నిరంకుశుని భయముఁదీర్చుట :—

ఉ. ఓడకు మోయి భూసురకు ♦ లోత్తమ నెత్తమునందు నీకు నే
నోడితి నీవు గెల్చితి స ♦ ముస్నతి న న్నతిరోషవృత్తి నీ
వాడిన యంతవట్టు సహ ♦ జార్థము యర్థమహాభిలాషి వై
యోడిన పన్నిదం బిడక ♦ యుండిన షండునిగాఁ దలంపరే. 39

అ॥ ఓయిభూసురకులోత్తమ — బ్రాహ్మణవంశమున శ్రేష్ఠుఁడవగు నోనిరంకుశుఁడా, ఓడకుము — భయపడకుము, నెత్తమునందున్ — జూదమున, నీకున్ — నీచేత, నేను, ఓడితిన్ — పందెమునందు గెలువలేకపోతిని, నీవుగెల్చితివి — నీవేజయించితివి, నీవు, సమున్నతిన్ — అధికముగా, అతిరోషవృత్తిన్ — మిక్కిలి కోపముతోఁగూడిన నడవడికచేత, అర్థమహాభిలాషివి — నీవు రావలసినవస్తువు నందెక్కువ కాంక్షగలవాఁడవు, ఐ — అగుచు, నన్ను, ఆడినయంతవట్టు — అనినంతవఱకు, సహజార్థము — స్వభావసిద్ధమయినన్యాయమే, ఓడినపన్నిదంబు — ఓడినపందెమును, ఇడక యుండినన్ — నేనీయకుండినట్లయిన, షండునిగాన్ — నపుంసకునితో సమానముగా — అనఁగాఁ బౌరుషహీనునిగా ననుట, పందెపుసొమ్ము నీయలేనివాఁడాఁడుదానితో సమానముగదా. తలంపరే — లోకులెంచరా — కావున నీపందెమునిచ్చెదననుట, ఇందు 'నెత్తము' అను ప్రయోగమునకుదా "శా. సోళాదొప్పయు నెత్తమున్ మొదలుగా ♦ జూదంబునీవాడున, వ్వేళన్" అని జై. భా. ఓయి అనునది సంబోధనము. "సూ. ఓయిూత్యా మంత్రణంచ వికృతౌస్యాత్" అనినన్న. మఱియు 'నీకు నేనోడితిన్' అనుటలో

ద్వితీయకు షష్ఠి చెప్పఁబడినది. "సూ. షష్ఠీస్థానికంబగు కువర్ణకం బొక్కొకచో ద్వితీయాది విభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి" అని ప్రౌ. వ్యా. ఈపద్యమున నాలుగు పాదములందును "కులోత్తమనెత్తము — మున్నతినన్నతి — జార్థమయర్థము — యుండినపందుని" ఇవి యనుప్రాసాలంకారము. 'ఓడిన పన్నిదంబిడకయుండిన పందునిగాఁదలంపరే' అర్థాంతరన్యాసాలంకారము. 'ఓడకుమోయి భూసురకులోత్తమ నెత్తమునందునీకు నేనోడితి' వ్యాజస్తుత్యలంకారము.

తా॥ ఓబ్రాహ్మణుఁడా! భయపడకుము. జూదమున నీవే నన్ను గెలిచితివిగదా! నీకు రావలసిన పందెపుసొమ్మును గుఱించి కోపముతో నన్నాడినమాట లన్నియు సహజమే. న్యాయసమ్మతము కూడను. కనుక నోడినపందెము నీయలేకుంటినేని నన్ను నపుంసకునిగా భావింతురుగాని పురుషునిగా నెంచరుగదా.

క. అరిపురము లభ్రచరములు, గిరికార్ముకకలనఁ గలన ♦ గెలిచిననన్నున్
ధర నాటపాట గెలిచిన, నిరుపమసాహసికమణికి ♦ నీకుం జడుపే. 40

అ॥ అభ్రచరములు — ఆకాశమున విహరించుచున్నట్టివైన, అరిపురములు — శత్రువులగు దానవులయొక్క మూఁడుపట్టణములు, దానవులు సురలవలననోడిమయుని ప్రార్థింపనతండుగగనపథమున విహరించునట్లు మూఁడుపట్టణములను సువర్ణరజతలోహములతో నిర్మించి యవి యొరులకుఁ గనఁబడకుండునట్లు చేసెను. అప్పుడు దానవులు దేవతులకలవిగాకపోఁగా నీశ్వరుడు పట్టణముల ధ్వంసమొనర్చెను. గిరికార్ముకకలనన్ — మహామేరువును విల్లుగా గ్రహించుటవలన, కలనన్ — యుద్ధమున, గెలిచిననన్నున్ — జయించినట్టి, — నాయంతవానిని — ఇంతటివాఁడనైననన్ను, ధరన్ — ఈపుడమియందు, ఆటపాటన్ — సులభముగా, గెలిచిన — జయించినట్టి, నిరుపమసాహసికమణికిన్. నిరుపమ— అసమానమైన, సాహసికమణికిన్ — సాహసముగలవారిలో శ్రేష్ఠునకు, నీకున్ — (అంతటివాఁడవైన) నీకుఁగూడ, ఇచట నీకున్, అనుటకు 'సూ. మధ్యమపురుష సర్వనామములగు నీమీలకుఁదక్క ఇ ఈ ఐ కారాంతములషష్ఠీఏకవచనములందుకి వర్ణకము వచ్చును. నీమీలకు కువర్ణకము వచ్చును. ప్రౌ. వ్యా.' 'నీకుంజడుపే' అనుచోట బిందువు వచ్చుటకు 'సూ, బిందుం ప్రపదంతితంక్వచిత్క్వచిత్' నన్న. జడుపే— భయము కలదా, 'నేను త్రిపురములను గెలిచితిని నీవు నన్ను గెలిచితివి' అనుఉత్తరోత్తరోత్కర్ష చేసారాలంకారమును "ఉత్తరోత్తరముత్కర్షోభవేత్సారః పరావధిః" కా. ప్ర. 'యుద్ధముచేసి దానవులనుగెల్చిన నన్ను సులభముగా గెల్చిన సమర్థుఁడవు నీకేమిభయము' ఇందు వ్యాజస్తుత్యలంకారమును. 'కలన గలన— ఆటపాట, అనుప్రాసాలంకారమును.

తా॥ అసురులపట్టణముల మూఁడింటిని గెలుచుటకు నేను మహాయుద్ధముజేసితిని. అట్టి నన్ను నీవనాయాసముగ జయించితివిగదా నీకేమిభయము.

—: నిరంకుశుఁడు శివునకు దండప్రణామములొనర్చుట :—

క. అని భయముఁ దీర్పఁ దీర్ప మ, దనహంతకు నంతకుం బ ♦ దంబునఁ బ్రహరిం
చిన యధ్వరావరాంతకు, మునుకొని దండప్రణామ ♦ ములు చేసి తగన్. 41

అ॥ అని - ఇట్లు సంభాషించుచు, భయమునన్ - భీతిని, తీర్పన్ తీర్పన్ - తొలఁగించఁగా తొలఁగించఁగా, మదనహంతకున్ - మన్మథుని సంహరించినవానిని, అంతకున్ - యముని, పదంబునన్ - కాలిచేత, ప్రహరించిన + అన్ధకాసురాంతకున్ - తన్నివధియించుటకు వచ్చిన యసురుఁడయిన వానిని, అనఁగా దక్షాధ్వరధ్వంసియగు శంకరుని రూపుల ఇతరు లెవ్వరు యమునివధించినట్లు పురాణ ప్రసిద్ధి. మునుకొని - ముందుగానిడికొని, దండప్రణామములు - కట్టెవలెసాగిలఁబడి చేయునమస్కారములు. 'ని. దండో౽స్త్రీదమహింసా సేనా లసు దేషు శాసనేరాజ్ఞాం. దండే మానవిశేషే వ్యూహే రవిపార్శ్వగే పుంసి' నానా. ఇదియే సాష్టాంగనమస్కారము. "క. కరయుగమును జరణంబులు, యురము లలాటస్థలంబు ♦ నున్నతభుజముల్, సరిధరణి మోపిమ్రొక్కిన. బరువడి సాష్టాంగ మండ్రు ♦ పరమమునీంద్రుల్" తగన్ - ఒప్పునట్లుగా, చేసి - ఆచరించినవాఁడై. ఇచట 'హంతకు - అంతకు - రాంతకు' -- అనుప్రాసాలంకారము.

తా॥ ఇట్లీశ్వరుఁడు చనువుగా మాటలాడుచు భయమును దొలగించఁగా సాష్టాంగనమస్కారము లాచరించి,

గీ. పూలనేసినవాని ని ♦ ర్మూలపఱచి, ఱాలనేసినవాని హే ♦ రాళమైన
లీలఁ గరుణించితివి దయా ♦ శీల నీకు, జాలనపరాధి నంచు నా ♦ కేల వెఱవ. 42

అ॥ దయాశీల - కృపతోఁగూడిన స్వభావముగల యోయీశ్వరుఁడా, పూలనేసినవానిన్ -- మృదువైన పుష్పబాణములు ప్రయోగించిన మన్మథుని, నిర్మూలపఱచి .. నాశముచేసి, ఱాలనేసిన వానిన్ - కఠినమైనరాళ్ళతోఁ బూజించినవానిని - అనఁగా సాంఖ్యతొండఁడను భక్తుఁడు నిత్యమును ముప్పొద్దు మూఁడురాలను శివలింగముపై వేయుటయే పూజయని యొకవ్రతమును నిర్ణయించుకొనెను. అటులఁ గొన్నినాళ్లు వైచి విసుగుఁజెంది చిన్నచిన్నవి పెక్కురాళ్ళు వేయుటకంటెఁ బెద్దఱాయి యొక్కటియే వేయుట శ్రేష్ఠమని కొండఱాయి వైచెనఁగా నా శివలింగమునుండి యీశ్వరుఁడు ప్రత్యక్షమైనట్లు బసవపురాణమునఁ గథగలదు. ఇచట 'పూలు-ఱాలు' అనుచప్పుడంత్యాక్షరములోపించుటకు 'సూ. వర్ణస్యాంత్యస్యలోపస్స్యాత్, లులయోః ప్రాయశః క్వచిత్' అను. హేరాళమైన - అధికమైన, లీలన్-క్రీడతో, కరుణించితివి, దయతోఁ గాపాడితివి. నీకున్ - అట్టిదయాస్వభావముగలనిన్నుఁ జూచి, చాలనపరాధినంచున్ - ఎక్కువగా నేరముచేసితినని తలఁచుచు, వెఱవన్ - భయపడుట, నాకేల - నాకెందులకు, దయామయుఁడవగు నీయెదుట నాకేమిభయముగలదనుట. ఈపద్యమున నాలుగు చరణములకును ప్రాసయతియె చెప్పఁబడినది. వృత్త్యనుప్రాసాలంకారము. అలం. విరోధాభాసము. 'క. అమరవిరోధంబాభా, సముగాఁగవిరోధమయ్యె' అని సరస. "ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఉచ్యతే" అని చంద్రా. దీనినే విరోధాలంకారమందురు. 'ఆభాసత్వే విరోధస్య. విరోధాలంకృతిర్మతా' అని ప్రతా. ఉదా "ఆనందమమందమిమంకువలయదలలోచనే దదాసిత్వం, విరహస్త్వయైవ జనితస్తాపయతితరాం శరీరంమే" రుద్ర.

తా॥ స్వామీ! నీకుఁ గోపమువచ్చెనేని పూలనేసినవానినైన బూడిదచేతువు. దయగలిగెనేని రాళ్లనేసినవానినైన మిక్కిలి దయతోఁ గాపాడుదువు. అట్టి నీయెదుట నాకేమిభయము,

—: నిరంకుశుఁడు మోక్షమిమ్మనుట :—

ఉ. ఓపరమాత్మ సన్నుతగు ♦ ణోన్నత యున్నతలంపుతేల ల
క్ష్మీపతిసేవ్యమానమగు ♦ మీజగదద్భుతమూర్తిఁ గంటి నా
పాపము లోపమయ్యెఁ గడుఁ ♦ బాత్రచరిత్రుఁడ నైతి నింక నీ
శ్రీపదపంకజాతములఁ ♦ జేయపవే కృప వేగ నావుడున్, 43

అ॥ ఓపరమాత్మ — పరబ్రహ్మస్వరూపుఁడైన యోశంకరుఁడా, సన్నుతగుణోన్నత- సన్నుత — పొగడఁదగిన, గుణ — సత్వాదిగుణములచేత, కొందఱీశ్వరుఁడు తమోగుణ ప్రధానుఁడందురు కాని 'అంతస్సత్వంబహిస్తమః, అని శాస్త్రప్రసిద్ధము. ఉన్నత — అతిశయమైనవాఁడా, లక్ష్మీపతిసేవ్యమానము — శ్రీమన్నారాయణునిచేఁ గొలువఁబడుచున్నది, అగు — అయినట్టి, మీ — మీయొక్క, జగదద్భుతమూర్తిన్ — జగత్ — ఈమూఁడులోకములకు, అద్భుత — ఆశ్చర్యకరమైన, మూర్తిన్ — స్వరూపమును, కంటిన్ — చూచితిని, నాపాపము - నేజేసినదుష్కృతమంతయు. లోపమయ్యెన్ — అదృశ్యమయ్యెన్ — కనఁబడకుండఁబోయెను, కడున్ — మిక్కిలి, పాత్రచరిత్రుఁడన్ — యోగ్యమయిన ప్రవర్తనముగలవాఁడను, ఐతిన్ — అయియుంటిని, ఉన్నతలంపుతేల — ఇదివఱకు నాకుఁ గలకోరిక లెంపునకు — అక్కఱలేదనుట, ఇంకన్ ఇఁక మీఁదట, కృపన్ — కనికరముతో, వేగన్— శీఘ్రముగా, నీ — నీయొక్క, శ్రీ — సంపత్కరమైన, పదపంకజాతములన్ — తామరపువ్వులవంటి పాదముల సన్నిధియందు, చేయపవే — చేరనిమ్ము, నావుడున్—ఆనిరంకుశుఁడిట్లనఁగా, పైపద్యముతో నన్వయము. ఇందు 'శ్రీ పదపంకజాతములు' ఉపమాలంకారమును. 'సన్నుతగుణోన్నత యున్నత — పాపములోపము — పాత్రచరిత్రు - చేయపవేకృపవే' అనుప్రాసాలంకారమును.

తా॥ ఓపరమేశ్వరుఁడా! ఈమూఁడులోకముల కచ్చెరువుగలిగించుచు శ్రీమన్నారాయణుచేఁ బూజింపఁబడుచున్న మీస్వరూపమును గాంచితిని. నాపాపమంతయు నశించెను. మిక్కిలి యోగ్యుఁడ నయితిని. ఇఁక నన్ను నీపాదసన్నిధికిం జేర్చుకొనుము. అని నిరంకుశుఁడు పలుకఁగా.

—: శివుఁడు నీవు కోఁనవేశ్యనే యిచ్చెదననుట :—

శా. ఓహో నిల్వు పయోరుహాసనకులీ ♦ నోత్తంస సత్యాహిత
వ్యాహారంబులు పల్కసాగితివి బా ♦ గాయెం జుమీ నీవరా
రోహారత్నము నీవు గైకొనక కో ♦ ర్కుల్మీఱఁగా ముక్తికాం
తాహేరాళసుఖంబు గోరెదవు జూ ♦ దం బాడిశే దీనికిన్. 44

అ॥ ఓహో - ఇది యాశ్చర్యార్థకము ఉదా "ఓహో విస్మయమంచునే మనసులో♦నూహింప నమ్మానిభూ, యోహుంకారముచేసినన్" వరా. పు. పయోరుహాసనకులీనోత్తంస. పయోరుహాసన — బ్రహ్మదేవునిదైన, కులీన - శ్రేష్ఠమయినజాతియందు, 'ని. అభిజాతః కులీనఃస్యాత్' అ. ఉత్తంస — శిరోభూషణమైనవాఁడా, "ని. పుం స్యుత్తంసావతం సౌద్వౌకర్ణపూరేచ శేఖరే' అ. నిల్వు—అంతట

నాఁగుము, సత్యాహతవ్యాహారంబులు. సత్య — నిజమును, ఆహత - కొట్టివేయఁబడిన, వ్యాహారంబులు — వాక్కులు, 'ని. వ్యాహార ఉక్తిర్లపితం భాషితం వచనం వచః' అని అ. పల్కసాగితివి — వచించనారంభించితివి, బాగాయెంజుమీ — చక్కఁగానున్నదిసుమా, నీ — నీయొక్క, వరారోహరత్నముక్, వరారోహ — ఉపరిసురితమును జేసెడి యుత్తమస్త్రీలలో, రత్నముక్ — శ్రేష్ఠమైనదానిని, 'ని. వరారోహామత్తకాశిన్యుత్తమావరవర్ణినీ' అని అ. వరః శ్రేష్ఠః ఆరోహో నితంబోఽస్యాః- మంచినితంబములుకలది అనివ్యు. 'రత్నం శ్రేష్ఠేమణావపి' అని నిఘంటువాక్యము. నీవు కైకొనక- తీసికొనక, కోర్కుల్ — కోరికలు, మీఱఁగాక్ — అతిశయించఁగా, ముక్తికాంతా హేరాళసుఖంబు. ముక్తికాంతా — మోక్షమనెడుమనోహరమైన స్త్రీయొక్క, హేరాళ — అధికమైన సుఖంబు — ఆనందమును, కోరెదవు — అభిలాషపడుచున్నావు, ఇచట తద్ధర్మార్థకప్రయోగమును గూర్చి 'సూ. తద్ధర్మార్థకవిశేషణం బసహాయతం త్రికాలవాచియగు' ప్రౌవ్యా. దీనికిక్ — నీవిప్పుడు కోరినముక్తికాంతకొఱకు, జూదంబాడితే — సొగటాలపంచము నాడియుండలేదుగదా, ఈపద్యమున 'నిల్వు' అనుచోట ముకారములోపించుటనుగూర్చి 'సూ. ప్రార్థనార్థమురేకత్వేకథ్యతేమధ్యమార్థకః విభాషాంతం పదంత్వేకే నప్రాణేతుకదాచన' అథ.

తా॥ ఔరా బ్రాహ్మణుఁడా! ఇఁక నిలువుము. అబద్ధము లాడెదవేమి! నీవు కోరినది వేశ్యను గాని ముక్తికాంతను గాదు. అట్టి మోక్షాపేక్ష గలవాఁడవు జూదమేల యాడితివి.

ఉ. ఆడితి మున్ను బొంక నని ♦ యక్షవిచక్షణవృత్తి నేల బొం
కాడెద వాడకాడకు న ♦ లాసనవంశపయోధిచంద్ర నే
నోడినయంతె కాక మఱి ♦ యున్నపదార్థము లీయ నేర్తునో
పాడియె నీకు వేఁడ సరి ♦ పన్నిదగాండ్రు హసింప నియ్యెడన్. 45

అ॥ నలాసనవంశపయోధిచంద్ర. నలాసన — కమలమే పీఠముగాఁగల బ్రహ్మయొక్క, ని. 'నలః పోటగళే రాజ్ఞి పితృదేవే కపీశ్వరే, నళీ మనన్శిలాయాంతు కమలే తు నళం మతం' అని వి. తృణేం బుజేనలంనాతు రాజ్ఞినావేతునస్త్రీయాం, శబ్దా. వంశ — కులమనెడు, పయోధి — సముద్రమునకు, చంద్ర — చంద్రుఁడవైన యోనిరంకుశుఁడా, మున్ను—తొలుతనే, బొంకనని — అసత్యమాడనని, అక్షవిచక్షణవృత్తిన్. అక్ష — జూదమునాడుటయందు, విచక్షణ — నేర్పరితనముగల, వృత్తిన్ — వ్యాపారముచేత, ఆడితి — ఆడియుంటివి, ఆడకాడకున్ - క్రమక్రమముగా, ఏలబొంకాడెదవు - అబద్ధమాడుచున్నావెందులకు, 'బొంకాడెదవాడకాడకు' అనుటకు సూ. మధ్యమపురుష ఇకారమునకు సంధినిత్యము. బా. వ్యా. ఇచట 'ఆడెదవు' అనుటకు సూ. భావిక్రియాసుయస్యాస్యాదేత్వమేవ ప్రయోగతః, ఘుడ్వాదివర్ణేభూతార్థే, చాపితద్వద్భవేత్సదా' అథ. మఱి - మఱియును, నేను. ఓడినయంతెకాక - ఓడిపోయినమాత్రమే కాకుండ, ఉన్నపదార్థములు - నాకుఁగలవస్తువులన్నియు, ఈయనేర్తున్ + ఓ—ఈయగలిగియున్నాను. ఇది నిశ్చయార్థకము 'సూ. ఏదోతౌవ్యతిరేకాచపి సంప్రార్థనపరే క్రియాణాం స్తః' నన్న. సరిపన్నిదగాండ్రు - సమానులైన జూదరులు, హసింపన్ - నవ్వునట్లు, ఇయ్యెడన్ - ఈసమయమున, వేఁడన్ - ప్రార్థించుటకు, పాడియే - నీకుధర్మమా, ఈపద్యమున 'ఆడితి' అనుటలో 'వి' లోపించినందుకు శ్లో. భూతేతరయోర్వికల్పత్వం, మితికేచిత్ బభాషిరే, అని.

యధర్వ్యణోక్తి. ఉదా 'ఉ. చేసెతి జన్మముల్ తపము' అనిస్వా. మ. 'అక్షవిచక్షణ. ఆడెద వాద కాదకు' అనుప్రాసాలంకారమును 'వంశపయోధిచంద్ర' ఉపమాలంకారమును.

తా॥ ఓయీ! నీవు మొదట జూదమారంభించుచు నబద్ధము లాడనని పలికితివి గదా? ఇప్పుడేల యబద్ధములకుఁ బాల్పడుచున్నావు? నే నోడినది సత్యమే. అందువలన నీ కియ్యవలసినదాని నిత్తును. అంతే కాని నీ విప్పుడేనియో క్రొత్తని కావలెనని కోరఁదగునా? సరిపన్నిదగాండ్రిదె వినిన నవ్వరా ?

వ. అని యనేకప్రకారంబుల నాతఁతో మేలమాడి యిట్లనియె. 46

అ॥ అని — ఈప్రకారముగా, అనేకప్రకారంబులన్ — పలుభంగులుగా, ఆతనితోన్ — ఆనిరంకుశునితో, మేలమాడి — పరిహాసవచనము లుచ్చరించి, ఇట్లనియెన్ — ఈరీతిగా వచించెను.

ఉ. భూసురవంశపావన య ♦ పూర్వతరంబునుగాదు ముక్తికాం
తాసుఖ మేల కోరెదవు ♦ దానికి సందియ మింక మాను మా
దాసుఁడ వీవు నాదివిజ ♦ తామరసాక్షి గ్రహించి మానసో
ల్లాసము నొంది మమ్ముఁ ద ♦ లంచుచు నుండఁగఁ గొన్నినాళ్లకున్. 47

అ॥ భూసుర వంశపావన — బ్రాహ్మణకులమునఁ బవిత్రుఁడవైన యోనిరంకుశుఁడా, ముక్తికాంతాసుఖము — మోక్షమనెడి కాంతవలని యానందము, అపూర్వతరంబునుగాదు — నూతనముగా శక్యమగునదికాదు, ఏలకోరెదవు — ఎందుల కపేక్షించెదవు. నీకోరిక యిప్పుడు నెఱవేఱదనుట, దానికిన్ — నీవు కాంక్షించిన మోక్షమునకు, సందియము — అనుమానము, ఇంకన్ — ఇఁకమీఁద, మానుమా — విడువుము, అనఁగా నింకొకప్పుడిచ్చెదననుట, ఈవు — నీవు, దాసుఁడవు — నాయొక్క భృత్యుఁడవు, ఆదివిజతామరసాక్షిన్ — ఆదేవతాస్త్రీని, గ్రహించి — కైకొని, మానసోల్లాసమున్ — మనస్సున సంతోషమును, ఒంది — పొంది, మమ్ములన్ — మాయుభయులను, అనఁగాఁ బార్వతీపరమేశ్వరులననుట, దలంచుచున్ — స్మరించుచు, ఉండఁగన్ — ఉండినట్లయిన, కొన్నినాళ్ళకున్ — కొంత కాలమునకు, ఇందు 'సందియము, అనుప్రయోగమునకు 'మూ. ఇయాంతాస్సాధవశ్శబ్దాః. క్వచిదేదంతవాఽపివా' అని యధర్వ.

తా॥ ఓనిరంకుశుఁడా! ముక్తికాంతా సుఖము నీ విప్పుడు కోరినంతనే వచ్చునదికాదు. కాని నీవు నాదాసుఁడ వగుటచే నీరంభతో సుఖించుచు మమ్ముఁ దలంచుచుండుము. తరువాత నేనే యిచ్చెదను.

—: నిరంకుశుఁడు శివుని స్తుతించుట :—

క॥ అని పలికిన విని భూసుర, తనయుఁడు సాష్టాంగ మెరఁగి ♦ తగ నిట్లనియె
న్నినుఁ గనినయంత ముక్తికి, ననుమానమె తెలియఁ జాల ♦ నైతిన్ జడతన్. 48

అ॥ అని పలికినన్ — ఇట్లు వచించఁగా, విని — ఆకర్ణించి, భూసురనందనుఁడు — బ్రాహ్మణునికొడుకైన యానిరంకుశుఁడు, తగన్ — ఒప్పునట్లు, సాష్టాంగము — చేతులు కాళ్ళు ఱొమ్ము మోఁపులు భుజములు నేల సోఁకించి చేయునట్టి నమస్కారము, ఒనరఁగ — నమస్కరించి, ఇట్లనియెన్ — ఈప్రకారముగాఁ బలికెను, నినున్ — నిన్ను, కనినయంతటన్ — చూచినంతమాత్రముననే, చూచినంతనే, ముక్తికిన్ — మోక్షమునకు, అనుమానము — సందేహముకలదా, జడతన్ — నాయొక్క యజ్ఞానము వలన. నాయొక్క తెలివితేమి వలన, తెలియన్ — తెలిసికొనుటకు, చాలనైతిన్ — సమర్థుఁడను గాకుంటిని, 'ఐతిన్ జడతన్' అనుప్రాసాలంకారము.

తా॥ ఇట్లానతిచ్చిన విని యాబ్రాహ్మణ కుమారుఁడు సాష్టాంగనమస్కారము లాచరించి యిట్లు పలికెను. స్వామీ! భవద్దర్శన మైనవెనుక మోక్షమునకు సంశయింపఁ బనియున్నదా ? నాయొక్క యజ్ఞానమువలన గ్రహించలేకపోతిని గాని !

మ॥ అపరాధంబులు పెక్కు చేసితి మహా ♦ హంకారకామక్రియా
విపులాంభోనిధిఁ గ్రుంకువెట్టి జడతా ♦ వేశంబున న్మిమ్ము ది
వ్యపథోద్వృత్తినిఁ గొల్వనైతిని మనో ♦ వాక్కాయకర్మంబులం
జపలాత్ము న్ననుఁ బ్రోవ మీదయయ కా ♦ సాక్షాత్కటాక్షేక్షణన్. 49

అ॥ అపరాధంబులు — నేరములు, పెక్కు చేసితిన్ — అనేకము చేసియుంటిని, మహాహంకారకామక్రియా విపులాంభోనిధన్. మహా — ఎక్కువైన, అహంకార — గర్వముతోఁ గూడిన, కామక్రియా — స్త్రీసంభోగమనెడు, విపులాంభోనిధన్ — విస్తారమైన సముద్రమునందు, క్రుంకువెట్టి — మునకవేసి — మునిఁగి, జడతావేశంబునన్ — అజ్ఞానమువలన నొడలెఱుంగకపోవుటచేత, మిమ్మున్ — పరబ్రహ్మస్వరూపులైన మిమ్ములను, దివ్యపథోద్వృత్తినిన్ — దివ్యపథ — మంచిమార్గమున, ఉద్వృత్తినిన్ — ఉన్నతమైన నడవడికతో, కొల్వనైతిని — సేవించినవాఁడను గాకుంటిని, మనోవాక్కాయకర్మంబులన్ — మనః — మనస్సుయొక్కయు, వాక్ — మాటలయొక్కయు, కాయ — శరీరము యొక్కయు, కర్మంబులన్ — చేఁతలవలన, చపలాత్మున్ — చలించునట్టి మనస్సు గలవాఁడను, అయిన నన్నున్ — నన్ను, సాక్షాత్కటాక్షేక్షణన్. సాక్షాత్ — నాకంటికెదురుపడుట, ప్రత్యక్షముగా, 'ని. సాక్షాత్ప్రత్యక్షతుల్యయోః' అని అ. కటాక్ష — కడకంటియొక్క, ఈక్షణన్ — చూపువలన, ప్రోవన్ — రక్షించుటకు, మీదయయ కా — మీయొక్క కరుణయేకదా, ఇచట 'మీదయయకా' అనుటకు సూ. అకారనిత్యార్థకంబగు' ప్రౌ. వ్యా. శ్రీశంకరాచార్యకృతాపరాధస్తవము ననునిట్లు "ప్రౌఢోఽహం యౌవనస్థో విషయవిషధరైః పంచభిర్మర్మసంధౌ, దష్టోనష్టో వివేకస్సుతధన యువతి స్వాదుసౌఖ్యేనిషణ్ణః, శైవేచింతా విహీనోమమహృదయహితా మానగర్వాధిరూఢం క్షంతవ్యోమేఽపరాధ శ్శివశివశివ భో శ్రీమహాదేవశంభో" అనినాఁడు 'సాక్షాత్కటాక్షేక్షణన్' అనుప్రాసాలంకారము.

తా॥ అపరాధము లెన్నియో చేసితిని, అహంకారమువలనఁ గామాతురుఁడనై ప్రవర్తించుచు మైమఱచి పరబ్రహ్మస్వరూపుఁడ వగునిన్ను సేవింపకుంటిని. నామనోవాక్కాయ కర్మముల

యందు స్థిరత్వము లేదు. ఇట్టివాఁడ నగునన్నుఁ బ్రోవ మీయనుగ్రహముతోఁ గూడిన క్రేఁగంటి చూపుగాక వేఱొకటిలేదు.

మ. నిలుపం జాలను నీశివాఖ్య మదిలో ♦ నిక్కంబుగా నీకథల్
పలుకం జాలను వాక్కులన్ వెలయ నీ ♦ పాదాబ్జసంసేవనల్
గెలువం జాలను దేహకర్మముల దు ♦ ష్కృత్యాత్ముఁడన్ నామన
శ్చలనంబున్ దొలఁగించి ప్రోవవె శివా ♦ సద్భక్తరక్షాచణా. 50

అ॥ సద్భక్తరక్షాచణా. సద్భక్త — శ్రేష్ఠులయినభక్తులను, రక్షా — కాపాడుటయందు, చణా. నేర్పుగలవాఁడా, శివా — ఓశంకరుఁడా, నీ — నీయొక్క, శివాఖ్యన్ — ఆనందకరమైన నామమును — శుభకరమైననామమును, మదిలోన్ — నామనస్సున, నిలుపంజాలను — ఉంచుటకు సమర్థుఁడనుగాను, నీకథల్ — నీయొక్క పూర్వవృత్తాంతములు, నిక్కంబుగాన్ — యథార్థముగా, వాక్కులన్ — మాటలతో, పలుకంజాలను — చెప్పుటకు శక్తిగలవాఁడనుగాను, వెలయన్ — ప్రకాశించఁగా, నీపాదాబ్జసంసేవనల్ — తామరపువ్వులవంటివైన నీపాదములను మిక్కిలి భక్తితో ననుసరించుటయందు. గెలువంజాలను — జయించఁగలవాఁడనుగాను, దేహకర్మములన్ — నాచేతులు మొదలగువానితోఁజేసెడు పనులయందు, దుష్కృత్యాత్ముఁడన్ — పాపముతోఁగూడినవాఁడను, నామనశ్చలనంబున్ — నాహృదయముయొక్క చలించెడుస్వభావమును, తొలఁగించి — ఆవలికిఁబోఁజేసి, ప్రోవవె — రక్షింపుము, పురాతనకవులును శివమహిమను వర్ణనాతీతమనియే తలంచిరి "అసితగిరిసమంస్యాత్కజ్జలం సింధుపాత్రే, సురతరువరశాఖా లేఖినీపత్రముర్వీ, లిఖతియది గృహీత్వా శారదా సర్వకాలం, తదపితవగుణానామీశపారం నయాతి" మ. స్తో.

తా॥ భక్తులను రక్షించుటయందు నేర్పరితనముగల యోశంకరుఁడా! శుభకరమైన నీనామమును నామనస్సున నుంచికొనఁజాలను. నీకథలను నిజముగాఁ జెప్పలేను. నీపాదసేవ దృఢముగాఁ జేయలేను. నాయంతరింద్రియబాహ్యేంద్రియములు పాపకార్యములఁ జేయునవి. కనుక నామనస్సు చలింపకుండునట్లొనర్చి నన్ను రక్షింపుము.

ఉ॥ దేవ మహానుభావ జగ ♦ తీధరకార్ముక దుర్భవాపహా
మాధవరోప భక్తజన ♦ మానససారసలోకబాంధవా
గోవరవాహ దుర్వ్యసన ♦ కుంఠితకాననదావపావకా
ప్రోవఁగదయ్య మృత్యుహర ♦ మూర్ఖుని నన్నొకకాశ్యపీసురున్. 51

అ॥ దేవ — ఓపరమేశ్వరుఁడా, మహానుభావ — అధికమైన ప్రభావముగలవాఁడా, 'ని. అనుభావః ప్రభావేస్యాన్నిశ్చయేభావబోధకే' మే. జగతీధరకార్ముక — మహామేరుపర్వతమే విల్లుగాఁగలవాఁడా, దుర్భవాపహా — దుః — దుఃఖకరమైన, ని. 'దుస్స్యాత్కుత్సానిషేధయోః' అని వి. భవ — సంసారబంధమును, ని. 'భవఃక్షేమేశసంసారే సత్తాయాం ప్రాప్తి జన్మనోః' అనిమే. అపహా. తొలఁగించునట్టివాఁడా, మాధవరోప — విష్ణుమూర్తియే బాణముగాఁగలవాఁడా, భక్తజనమానస

లోకబాంధవా. భక్తజన — సేవించువారి సమూహముయొక్క, మానస సారస — మనస్సనెడి, పద్మములకు, లోకబాంధవా — సూర్యుఁడవైనవాఁడా, గోవరవాహ — శ్రేష్ఠమైన వృషభమే వాహనముగాఁగలవాఁడా, దుర్వినయకుంఠితకాననదావపావకా. దుర్వినయ — చెడ్డధర్మములవలని, కుంఠిత కానన — మాంద్యత్వము నెడి, అరణ్యమునకు. "కుంఠో కర్మణ్యమూర్ఖయోః" అని వి. దావపావకా- కారుచిచ్చయినవాఁడా, మృత్యుహర — మృత్యుదేవతను సంహరించినట్టివాఁడా, ఒకకాశ్యపీసురుఁ- ఒక్క బ్రాహ్మణుఁడను, అయిన నన్నుఁ — నన్ను, ప్రోవఁగదయ్య — రక్షింపఁగదవయ్యా, ఇందు 'ప్రోవగదయ్యా' అనుటకు 'సూ. ప్రార్థనార్థభవేన్నాంతాత్కచేత్పరః విశేషదః' అని అన. 'వన్నొక కాశ్యపీసురుఁ' అనుటలో నొకశబ్దము ల్పార్థమును సూచించినది. 'ఒకశబ్దంబొకచో నల్పార్థకంబగు' అని ప్రౌ. వ్యా. ఉదా 'మ. ఒకమున్నూఱుగదల్చి తెచ్చిన లంకా ♦ టోగ్రాత్మసంపాదనంబు' అని భాగ. వెండియు. 'ప్రోవఁగదయ్యా' అనుటకు 'సూ. ఆర్యాదిశబ్దో యుక్తస్స్యాత్ వచసంబంధార్థకగోచరే' అనియును. ఇందు నాలవపాదమునఁ బోలికయతి సెప్పఁబడినది. 'క. పోలుం బుఫుబుభులకు మకా- పోలికయతి శీలముల్ల ♦ మున కెన యనఁగా, శీలం బుల్లం బనఁగా, భూలోకం బనుగలోక ♦ మున కెన యనఁగఁ' అని అనం. దీనినే చక్కటియతి యని చెప్పఁబడియున్నది. 'క. అక్కజముగఁ బుఫుబుభులకుఁ, జక్కటియతి యయ్యె శృంగ ♦ సహితమకారం. బక్కమలజేశ్వరాదుల, మ్రొక్కులు గైకొను సమస్త ♦ భువనాధీశా' అని అనం. ఇదియే మకారయతి యందురు. "క. మెచ్చరికను బుఫుబుభులకు, నచ్చపుమాకొమ్ములే మ ♦ హాకవులాదిఁ. మెచ్చులుగ నిలిపిరచ్చట, నచ్చటను మకార యతు లంటంచును బ్రతులఁ' అనిఅప్ప. ఇచట నిరంకుశుఁడు శంకరుని ప్రార్థించుటనుగూర్చి 'ఆయుర్నశ్యతి పశ్యతాం ప్రతిదినం యాతిక్షయం యౌవనం, ప్రత్యాయాంతిగతాః పునర్నదివసాః కాలో జగద్భక్షకః, లక్ష్మీస్తోయతరంగభంగచపలా విద్యుచ్చలం జీవితం, తస్మాన్మాం కరుణాకరం కరుణయా త్వం రక్షరక్షాధునా, క్షంతవ్యో మేఽపరాధశ్శివ శివ శివ భో శ్రీమహాదేవశంభో' ఇట్లు శంకరాచార్యుఁడపరాధస్తవమున వచించినాఁడు, "భక్తజన మానససారసలోకబాంధవా — దుర్వినయకుంఠిత కానన దావపావకా" రూపకాలంకారము.

సీ॥ ప్రణవనృత్యభిరామ ♦ రామాసహితవామ, వామాహిరాడ్దామ ♦ సామకామ
రజనీచరకిరీట ♦ రసజాననకరోట, గగనగంగాజూట ♦ నిగమఘోట
యచరచరాధార ♦ యచలాధరాగార, నీరధితూణీర ♦ నిగమసార
దురితాభ్రవాతూల ♦ కరధృతాసమశూల, నాగాజినదుకూల ♦ నయవిశాల
గీ॥ దళితభవసైన్య యాదిమ ♦ ధ్వాంతశూన్య, హితజనశరణ్య సర్వలో ♦ కైకమాన్య
నిరుపమాగణ్య విస్ఫుటా ♦ నేకపుణ్య, సత్కృపానన్య దీనర ♦ క్షావదాన్య. 52

అ॥ ప్రణవనృత్యభిరామ. ప్రణవనృతి — ఓంకారధ్వనితోఁగూడిన నాట్యమువలన, ని "నృతిః క్రిమాన ర్తనేచ" అనివి. "నృతి — సం. వి. ఇ. స్త్రీ. నర్తనము — నాట్యము" సూ. ఆం. ని. అభిరామ — మనోహరమైనవాఁడా, రామాసహితవామ. రామా — గౌరియనెడు స్త్రీతో, సహిత వామ — కూడుకొనిన ఎడమప్రక్కగలవాఁడా, వామాహిరాడ్దామ. వామ — సుందరమైన, ని 'వామం సవ్యే ప్రతీపేచ. ద్రవిణేచాతిసుందరే, పయోధరేహరే కామే విద్యాగ్వామాపిచ స్త్రీగూం' అనీ

రాట్ — సర్పములకు రాజగు శేషుఁడే, దామ — హారముగాఁగలవాఁడా, సామకామ— సామవేదము నందభిలాషగలవాఁడా, రజనీచరకిరీట — చంద్రుఁడే మకుటముగాఁగలవాఁడా, రసజాసనకరోట. రసజ — పద్మమే, ని 'రసౌగంధరసేజలే' అనిమే. రసమనఁగా జలముకనుక జలమునందు బుట్టినది యనుట, ఆసన — పీఠముగాఁగల బ్రహ్మదేవునియొక్క, కరోట — తలపుఱ్ఱెగలవాఁడా గగనగంగా జూట. గగనగంగా — ఆకాశగంగయే, జూట — జడముడియందుఁగలవాఁడా, నిగమఘోట — వేదములే గుఱ్ఱములుగాఁగలవాఁడా, అచరచరాధార. అచర — వృక్షపర్వతాదులకును, చర — మనుష్య పశుపక్ష్యాదులకును, ఆధార — మూలమైనవాఁడా, అచలాధరాగార. అచలాధర — వెండికొండయే, అగార — నివాసముగాఁగలవాఁడా, నీరధితూణీర — సముద్రమే యమ్ములపొదిగాఁగలవాఁడా. నిగమ సార — శ్రుతులయందు, సకరమైనవాఁడా — శ్రుతులయందు శ్రేష్ఠమైనవాఁడా, దురితాభ్రవాతూల — దురిత+అభ్ర—పాపములనెడు మేఘములకు, వాతూల — వాయువులయొక్క సమూహమైనవాఁడా, కరధృతాసమశూల. కరధృత హస్తమున ధరింపఁబడిన—పట్టుకొనఁబడిన, అసమశూల— సమానరహితమైన శూలముగలవాఁడా, నాగాజినదుకూల. నాగాజిన — ఏనుఁగుయొక్క చర్మమే — గజాసురునియొక్క చర్మమే, దుకూల — సన్నని వస్త్రముగాఁగలవాఁడా, నయవిశాల — నీతియందు విస్తారమయినవాఁడా — నీతియందధికుఁడైనవాఁడా, దళితభవసైన్య. దళిత—భేదింపఁబడిన, భవసైన్య— సంసారబంధమనెడి సేనగలవాఁడా,' 'ని. భవః సత్తాప్తిజన్మసు రుద్రేశ్రేయసిసంసారే' హై. ఆదిమధ్యాంతశూన్య. ఆది — మొదలును, మధ్య — నడుమును. అంత — చివరయును, శూన్య — లేనివాఁడా, హితజనశరణ్య — హిత — ఇష్టులైన, జన—సమూహమునకు, ని ' జనస్సమూహే లోకేఽపి' అని నానా. శరణ్యా — శరణాగతులు చొచ్చఁదగినవాఁడా, సర్వలోకైకమాన్య. సర్వలోక — సమస్తభువనములచేత— సమస్తజగజ్జనులచేత, మాన్య- కొనియాడఁదగినవాఁడా, నిరుపమాగణ్య. నిరుపమ — సమానములేని, అగణ్య — గణింపనలవిగాని వాఁడా, విస్ఫుటానేకపుణ్య. విస్ఫుట — స్పష్టమైన, అనేకపుణ్య — చాల సుకృతములుగలవాఁడా, సత్కృపాసన్య — మంచిదయయందధికుఁడైనవాఁడా, దీనరక్షావదాన్య. దీన — దరిద్రులను, రక్షా — కాపాడుటయందు, వదాన్య — దాతృత్వముగలవాఁడా, ఈసీసపద్యపు ప్రతిపాదమునను నాలుగంత్య ప్రాసములు గలుగఁజెప్పుటయే కాక యెత్తుగీతియందును నెనిమిదంత్యనియమములను గల్పించి చెప్పినాఁడు. ఈపద్యలక్షణమప్పకవీయమునఁ గనఁబడదుగాని వసుచరిత్రమున మాత్రము 'సీ. లలనాజనాపాంగ ♦ వలనావసదనంగ, తులనాభికాభంగ ♦ దోః ప్రసంగ' మనుపద్యము కాన్పించుచున్నది. అయినను గీతమున నిట్టి నియమములేదు.

క॥ జయజయ శర్వ సదాశివ, జయజయ రతిరాజవిజయ ♦ జయజయ మృత్యుం
జయ జయ మాం జయపాలా, జయశీలా సకలభక్త ♦ జనతాలోలా . 53

అ॥ శర్వ — ఓయీశ్వరుఁడా, సదాశివ — ఎల్లప్పుడు శుభములుగలవాఁడా, రతిరాజవిజయ — మన్మథుని గెలిచినవాఁడా, మృత్యుంజయ — మృత్యువును గెలిచినవాఁడా, మాం — నన్ను, జయ పాలా — ఓటమిలేకుండునట్లు కాపాడునట్టివాఁడా, జయశీలా — అంతటను గెలుచునటువంటి మంచి నడతగలవాఁడా, సకలభక్తజనతాలోలా. సకల—సమస్తమైన, భక్త-సేవించువారియొక్క, జనతా— సమూహమునందు, లోలా — ఆసక్తిగలవాఁడా, జయ — సర్వోత్కృష్టుఁడవుగా నుండుముగాక.

ఆబ్రాహ్మణుని సమాయనకు, రంభను — రంభయను నప్సరసను, ఇచ్చితిన్ — ఒసంగితిని, కనుక ఆ వనజాసనకులవరేణ్య వర్ధనున్. వనజాసనకుల — బ్రాహ్మణవంశమున, వరేణ్యా — శ్రేష్టముగా, వర్ధనున్ — వృద్ధిఁబొందుచున్నవాఁడయిన యానిరంకుశుని, ఎనయన్ — కూడుటకు, దానికిన్ — ఆదేవ నేశ్వరుఁ, సెలవిమ్ము — అనుజ్ఞయొసగుము,

తా॥ ఓ దివ్యలోకాధిపతీ! ఈబ్రాహ్మణసమాయుని మెచ్చి యతనికి రంభ నొసంగితిని. కనుక నీవు దానికి సెలవిచ్చి వానిఁజేరఁ బంపుము.

గీ॥ అనిన విని పాకశాసనుఁ ♦ డామహేశుఁ, జేరి దండప్రణామము ♦ లొసఁగి పిదప
నూరుజితరంభ కఠినవ♦క్షోజకుంభ, హసితకరికుంభ యగురంభ♦ కనియెఁగాంచి. 56

అ॥ అనినన్ — ఇట్లుపచింపఁగా, విని — ఆకర్ణించి, పాకశాసనుఁడు — ఇంద్రుఁడు, ఆమహేశున — పరమేశ్వరుని, చేరి — సమీపించి, దండప్రణామముల్ — సాష్టాంగనమస్కారములు, చేసి — ఆచరించి, పిదపన్ — అటుపిమ్మట, కాంచి — ఆబిడనుజూచి, ఊరుజితరంభ, ఊరు — తొడల వలన, జిత — జయింపఁబడిన, రంభ — అరఁటిచెట్టుగలదియును, కఠిక......కుంభ, కఠిన — గట్టివి యైన, వక్షోజకుంభ — స్తనములనెడి కుండలచేత, హసిత — పరిహాసముచేయఁబడిన, కరికుంభ— ఏనుఁగుకుంభస్థలముగలదియును, అగురంభకున్ — అయినట్టి రంభతో, అనియెన్— ఇట్లుచెప్పెను, ఇందురంభకున్ + అనియెన్ అనుటలో దృతీయకుషష్ఠి చెప్పఁబడినది. 'సూ. షష్ఠీస్థానికంబగు కువర్ణం బొక్కొకచో ద్వితీయాది విభక్త్యర్థసమాఖ్యగాఁ బ్రవర్తకంబులంజూపట్టెడి' ప్రౌ. వ్యా. ఇచట రంభ శబ్దమునకు ఊరుజితరంభ, వక్షోజకుంభ — కరికుంభ ఇత్యాదిశబ్దయుక్తిచేత అంత్యాను ప్రాసాలంకారము. ఊరుజితరంభ — హసితకరికుంభ—అనుటచే వ్యతిరేకాలంకారము, "ఉపమా నా ద్య దన్యస్య వ్యతిరేకః స ఏవసః, హేత్వో రుక్తా వనుక్తీనాం, త్రయే సామ్యే నివేదితే. శబ్దార్థాభ్యా మథాక్షిప్తే శ్లిష్టే తద్వత్త్రిరిష్టసః' కా. ప్ర. ఉదా "ఇయంసునయనా దాసీకృతతామరసశ్రియా ఆననేనా కలంకేన నిందతీందుం కలంకితమ్" ఉద్భ. దీనినే యుపమాలంకారముగ నన్వయింపవచ్చును "తమ న్వేత్యనుబధ్నాతి. తచ్ఛీలం తన్నిషేధతి. తస్యైవానుకరోతీతి శబ్దాః సాదృశ్యవాచకాః' అనిదండి. 'రంభ — కుంభ కుంభరంభ' అంత్యానుప్రాసాలంకారము.

తా॥ ఈశ్వరుఁ డిట్లు చెప్పఁగా విని యాయింద్రుఁడు సాష్టాంగనమస్కృతు లొనరించి పిమ్మట రంభను పిలచి యాబిడతో నిట్లనియె.

—: ఇంద్రుఁడు రంభ కాజ్ఞయిచ్చుట :—

క॥ ఓనాతి యీమహీసుర, సూనునకు నభీష్టకామ ♦ సురతక్రీడా
నూనసుఖ మొసఁగి రమ్మన, నానలినాక్షియును మంచి ♦ దని మ్రొక్కి తగన్. 57

అ॥ ఓనాతి — ఓరంభా, ఈమహీసురసూనునకున్ — ఈబ్రాహ్మణయువకునకు, అభీ.........
సుఖము. అభీష్ట — ప్రియమైన, కామ — కోరికగల, సురతక్రీడా — రతికేళియందు — సంభోగము

నందు అనూన — తక్కువగాని — సంపూర్ణమయిన సుఖము — ఆనందము, ఒసంగి — ఇచ్చి, రమ్మ — తిరిగిరమ్మ, అనన్ — ఇట్లనుచుండఁగా, ఆనలినాక్షియును — ఆయొక్క రంభయును, మంచిదని — చిత్తమాలాగే చేయుదునని; మ్రొక్కి — నమస్కరించి, తగన్ - ఒప్పునట్లు, పైవచనముతో నన్వయము.

తా॥ ఓరంభా! ఈబ్రాహ్మణుని యిష్టముఁ దీర్చి సంతోషపఱచిరమ్ము. అనఁగాఁ జిత్తమాలాగే చేయుదునని నమస్కరించి.

—: రంభా నిరంకుశుల విహారము :—

వ॥ అటనుండె. మహేశ్వరుండును నిఖిలామరసమేతంబుగా నంతర్ధానంబు సేసె నమ్మహీసురసూనుండును నాదివిషన్నారీరత్నంబు నవలోకించి చేరఁ జనుదెంచి విస్ఫుట ప్రౌఢాలింగనం బొనరించి పునఃకృతపరీరంభణంబు వ్వలయ వెలయుచుండిర య్యిరువురు. 58

అ॥ అటనుండెన్ — అక్కడనేయుండెను, మహేశ్వరుండును - ఆపరమేశ్వరుండును, నిఖిలామరసమేతంబుగాన్ — సమస్తమైన దేవతలతోఁగూడినవాఁడై, అంతర్ధానంబుసేసెన్ — అదృశ్యుఁడయ్యెను — మఱుఁగుపడెను, అమ్మహీసురసూనుండును — ఆబ్రాహ్మణపుత్రుఁడగు నిరంకుశుఁడును, ఆదివిషన్నారీరత్నంబున్ — దేవవేశ్యలలో శ్రేష్ఠురాలయిన యారంభను, అవలోకించి - చూచి, చేరన్ — కలియునట్లు, చనుదెంచి — వచ్చి, విస్ఫుట ప్రౌఢాలింగనంబు — విస్ఫుట — స్పష్టమైన, ప్రౌఢ — నేర్పుగల, ఆలింగనంబు — కౌఁగిలించుట, ఒనరించి — చేసి, పునఃకృతపరీరంభణంబున్. పునఃకృత — మరలజేయఁబడిన, పరీరంభణంబున్ — ఆలింగనమును, వలయన్ - ఒప్పఁగా, వెలయుచుండిరి - ప్రకాశించుచుండిరి, అయ్యిరువురు - ఆయిద్దఱును,

తా॥ అచ్చటనే యుండెను. ఈశ్వరుఁడు దేవతలతోఁగూడ నదృశ్యుఁ డయ్యెను. ఆబ్రాహ్మణుఁడారంభను సమీపించి యాలింగన మొనర్చుచు నాయిద్దఱును,

సీ॥ చందనమాలూర ♦ మందార కేసర, తిందుకాశోకమా ♦ కందకుంద
కేతకీవకుళకం ♦ కేళికానవనీప, తాలహింతాలజా ♦ తీలవంగ
ఘనసారకదళికా ♦ క్రముకామలకనింబ, జంబీరబదరీర ♦ సాలసాల
ప్రముఖపుష్పితలస ♦ త్ఫలితపల్లవితవి, స్తారభూమీరుహ ♦ తతుల వెలయు
గీ॥ నట్టి తత్కాననమునందు ♦ నవ్యకీర, రవము లుప్పొంగ నిందింది ♦ రములు మొలఁగఁ
గోకిలలుగూయమృగముల ♦ మూఁకడాయ, మరుఁడుసుమశరములనిరు ♦ వురనునేయ 59

అ॥ చందన - గంధపుమ్రాఁకులయొక్కయు, మాలూర - మారేడుచెట్లయొక్కయు, మందార - పారిజాతములయొక్కయు, కేసర - పొన్నచెట్లయొక్కయు, పున్నాగచెట్లయొక్కయు, నిఘంటు "అథ కేసరే వకుళః" అని అ. ఇందువలనఁ బొగడచెట్టున కర్థమయినను ముందరి వకుళశబ్దముచే నీయన్వయము సరికాదు. తిందుక - తుమ్మికిచెట్లయొక్కయు, అశోక - అశోకవృక్షముల యొక్కయు, మాకంద - మామిడిచెట్లయొక్కయు, కుంద - మొల్లలయొక్కయు, కేతకీ - మొగలిచెట్లయొక్కయు, వకుళ -

పొగడచెట్లయొక్కయు, కంకేళికా - రక్తాశోకవృక్షములయొక్కయు, అనఁగా నెఱ్ఱని పువ్వులుపూయునట్టి యశోకమనుట, నవనీప - నూతనమైన కడిమిచెట్లయొక్కయు, తాల - తాడిచెట్లయొక్కయు, హింతాల - ఈతచెట్లయొక్కయు, జాతీ - జాజిచెట్లయొక్కయు, లవంగ - దేవకుసుమవృక్షముల యొక్కయు, ఘనసారకదళికా - కర్పూరపు టరఁటులయొక్కయు, క్రముక - ఎఱ్ఱిలొద్దుగుచెట్ల యొక్కయు, ఆమలక - ఉసిరికచెట్లయొక్కయు, నింబ - వేఁపచెట్లయొక్కయు, జంబీర - నిమ్మచెట్ల యొక్కయు, బదరీ - రేఁగుచెట్లయొక్కయు, రసాల - తియ్యమామిడిచెట్లయొక్కయు, సాల - మద్ది చెట్లయొక్కయు, ఏపెలని చెప్పవచ్చును. ప్రముఖ - ముఖ్యమైన, పుష్పిత - పూయఁబడినవియు, లసత్ - ఒప్పుచున్న, ఫలిత - పండినవియు, కాచినవియు, పల్లవిత - చిగిర్చినవియు, విస్తార - విరివియైన, భూమీరుహ తతులన్ - చెట్లయొక్క సమూహములచేత, వెలయునట్టి - ప్రకాశించుచున్నటువంటి, తత్కాననము నందున్ - ఆయుపవనమందున, నవ్యకీరరవములుహెచ్చంగన్. నవ్య - క్రొత్తవియైన, కీరరవములు, చిలు కలయొక్క పలుకులు, ఉబ్బంగన్ - అధికము కాఁగా, ఇందిందిరములు - తుమ్మెదలు, మెలఁగన్ - సంచరించఁగా, కోకిలలు - కోయిలలు, కూయన్ - కూఁతపెట్టఁగా, మృగములమూఁక - లేళ్ళయొక్క గుంపు, డాయన్ - సమీపించఁగా, మరుఁడు - మన్మథుఁడు, సుమశరములన్ - పుష్పబాణములతో, ఇరువురను - ఆయిద్దఱిని, ఏయన్ - వేయఁగా, అనఁగా బుష్పబాణములను బ్రయోగించఁగాననుట, 'కందకుంద - తాలహింతాల జాతీల' అనుప్రాసాలంకారము. 'కూయ. డాయ. ఏయ' అంత్యాను ప్రాసాలంకారము.

తా|| చిగిర్చినవియుఁ, బూచినవియుఁ, బండినవియునగు వివిధవృక్షములతో నొప్పుచున్న యుపవనమందుఁ జిలుకలపలుకులును, గోయిలలకూతలును, లేళ్ళగుంపుల సంచారమును, తుమ్మెదల ఝంకారములును, గలిగి యాయిరువురును గామోద్రేకులయిరి.

## —: రంభానిరంకుశుల సంభోగవర్ణనము :—

క|| ఉపవనమునఁ బోలె విహా, రపరవశు లగుచును దిరిగి ♦ రయమతి నతిర
త్యుపరతి సమరతి మతి మతి, నిపుణతఁ బెనఁగొనిరి చెలఁగు♦నేర్పులకొలఁదిన్. 60

అ|| ఉపవనమునఁబోలెన్ — ఊరదాపునఁగల తోటయందో యనునట్లు, విహార పరవశులు — తిరుగుటవలన మైమఱచినవారు, అగుచును — అయి, తిరిగి — సంచరించి, రయమతిన్ — త్వరితముతోఁగూడిన బుద్ధితో, అతిరతి — గాఢమైన సంభోగమును, ఉపరతి — కొసరి చేయునట్టి సురతమును, సమరతి — సమానముగాఁ జేయు సంగమమును, మతిమతి — ఉభయులప్రజ్ఞలయొక్క, నిపుణతన్ — సమర్థతతో, చెలఁగు — ఒప్పుచున్న, నేర్పులకొలఁదిన్ — ఉభయులకు సామర్థ్యములు గలిగినపట్టున, పెనఁగొనిరి — చుట్టుకొనిరి. ఇందు 'అతిరతి ఉపరతి' చెప్పుటచేత, 'కాంతి' అను గుణము తెలియఁబడుచున్నది. "అత్యుజ్జ్వలస్య బంధస్య. కావ్యేకాంతిరితీర్యతే" అని లక్షణము. ఇచట రంభానిరంకుశులయొక్క మోహావేశమునుగూర్చి యించుక యుదాహరణము. పరస్పర రూప రేఖా విలాసాదులచేతఁ గలిగిన యనురాగము పెనవైచికొనియుండి సాంగత్యములభింపక యుత్కంఠా వేశులై యొకానొక యేకాంతప్రదేశమున మిళితమైన కామినీకాముకులయొక్క చేష్టల నిట్లు వర్ణించిరి.

"కాంతే దృష్టిపథం గతే నయనయోరాసీ ద్వికాసో మహాన్, ప్రాప్తే నిర్జనమాలయం పులకితా జాతా తనుస్సుభ్రువః, వక్షోజ గ్రహణోత్సుకే సముభవత్సర్వాంగక ంపోదయః, కంఠాలింగన తత్పరే విగళితా నీవీదృఢాపిస్వయం" పుష్ప. సంభోగము. "అనుకూలే నిషేవేతే యత్రాన్యోన్యం విలాసినౌ, దర్శన స్పర్శనాదీని సంభోగోఽయముదాహృతః" ఉపరతినిగూర్చి. 'ఈషత్కుంపపయోధరం సుచకటీ ప్రోషత్ప్రహారాద్భుతం స్విద్యత్ఫాల మనేకహాస్యసరసం సంకష్య పాదద్వయమ్. వారంవారమురః ప్రపాత సుభగం సందశ్యమానాధరం. కించిద్దత్త నితంబదేశ నఖరంక్షన్యోరతం సేవతే" శార్ఙ్గ. 'వల్గత్కుంచంవ్యాకుల కేశపాశం. స్విద్యన్ముఖం స్వీకృతమందహాసం. పుణ్యాతిరేకాత్పుమసాలభం తే. పుంభావమంభోరుహలోచనానాం' శార్ఙ్గ. రయమతి - సతిరత్యుపరతి. సమరతిమతిషుతి, అలం. వృత్త్యనుప్రాసమును.

తా॥ ఉపవనమునఁ దిరిగినట్లు తిరిగి మోహపరవశులై స్వేచ్ఛగాఁగూడిరి.

వ॥ ఇట్లగణ్య పుణ్యలావణ్యతరకరకంకణ ఝణత్కార నినాదంబు లెసఁగం గౌఁగిలించుచు నిబ్బలికనుబ్బి గొబ్బునగుబ్బటిల్లు గబ్బిగుబ్బల నురంబునం బొరయ నుఱుముచుఁ గంధరా పరీరంభణంబుల మొగంబు మొగంబునం జేర్చుచుఁ దరస్ఫురిత కిసలయ, బింబాధర సరస మృదులసన్మాధురీ ధురీణామృతంబు లోలుక మదనకదన దాహంబు దీర్చుచుఁ దదధరసుధారసంబు గ్రోలుచు రదనక్షతంబులు గావించుచు నంతకంతకు నెక్కుడై నిశితాంతదురంతలతాంతమార్గణ గణాంగణితాగ్నికీల సంద్ధతి నోలయింప హుటుమ్మని బిట్టోదవుతమకమ్మునఁ గ్రుమ్మకొను బిగిచన్నిట్టల దట్టంబున దిట్టంబుగ బెట్టునయుఁ బిక్కటిలమణిఖచిత మహారజతకంచుకం బవియ నట్టిపసు నిట్టూర్పులుల్లసిల్లఁ బయఃపారావారాంతరచలస్మ ధరధరంబు తెఱం గెఱింగించుమురు వునఁ బెనంగుచుఁ గుచమండలనఖక్షతార్ధ చంద్రోదయంబు లుప్పొంగ, మందస్మిత చంద్రికలు వెలుంగ, స్వేదకణతారకామండలంబు వెలయ, నేత్రకువలయంబులు ప్రకా శింపఁ, జివురాకుశయ్యం బవ్వళించి యించుక నిదురించి మేలుకాంచి హస్తారుణోదయ కిసలయంబులఁ గలితాలకాంధకారంబులు దొలంగ స్సవరింప, రసతోషణంబుల ముఖ కమలంబులు వికసింపఁ, గంచుకోత్తరీయోదయరాగంబులు చక్కఁగాఁగఁ, గుచకోకం బులుడాఁగ, స్వేదకణనఖక్షతతారకాబ్జంబులు గ్రుంక, మానసానందామృతాననని షేచ నానంతర నిటలతట పూర్వదిగ్ధృత కుంకుమవర్తుల తిలకాబ్జ బాంధవోదయా నంతరంబున. 61

అ॥ ఇట్లు — ఈప్రకారముగా, అగణ్య..............దంబులు. అగణ్య — గణింప శక్యము గాని, పుణ్య — పవిత్రములయి, లావణ్యతర — సౌందర్యముతోఁగూడిన, కర — హస్తములయొక్క, కంకణ — ఆభరణములవలని, ఝణఝణత్కార— ఝణఝణయని చేయఁబడుచున్న, నినాదంబులు— ధ్వనులు, ఎసగఁగ — ఒప్పఁగా, కౌఁగిలించుచున్ — ఆలింగనమొనర్చుచు, ఇబ్బలికన్ — రెట్టింపుగా, ఉబ్బన్ — అతిశయించఁగా, గొబ్బునన్ — శీఘ్రముగా, గుబ్బటిల్లు — ఉప్పొంగుచున్న, గబ్బిగుబ్బ

లన్ — బటువైన స్తనములను, ఉరంబునన్ — ఱొమ్ముతో. పొరయన్ — కూడఁగా, నులిమిచున్ — నుగ్గుసేయుచు. కంధరశబ్దము మేఘమున కర్థము కనుక మేఘములు కలియునప్పు డురుములుచున్నవనియు భావము. కంధరాపరిరంభణంబులన్ — కంధరా — కంఠ ములయొక్క, పరిరంభణంబులన్ — ఒకరినొకరు రెండుచేతులతోఁ బెనఁచి కొనుట వలన, ఉభయుల భుజాంతరాలింగనములవలన, మొగంబుమొగంబునం జేర్చునన్ — ఒకరిమోము నొకరిమోమునఁ దాకించుచు, తిరస్కృత.........తంబులు. తిరస్కృత — అవమానింపఁబడిన, కిస లయ — చిగురాకులను, బింబ — దొండపండునుగల, అధర — క్రిందిపెదవియొక్క, సరస — ప్రేమ యుక్తమైన, రసవంతములైన, మృదు — కోమలమైన, లసత్ — ఒప్పుచున్న, మాధురీ — మాధుర్య మును, ధురీణ — వహించుచున్న, అమృతంబులు సుధారసములు, ఒలుకన్ — చిందఁగా, మదనకదన దాహంబు — సంభోగము చేయుటవలని దప్పిని, తీర్చుచున్ — లేకుండునట్లుసేయుచు, తదధరసుధా రసంబు. తదధర — ఆరంభయొక్క క్రిందిపెదవులవలన, సుధారసంబు — అమృతరసమును, గ్రోలు చున్ — పానముసేయుచు, అనుభవించుచు, రదనక్షతంబులు — మునిపంటిగాయములు, కావించుచున్ — కలుగఁజేయుచు, అంతకంతకున్ — క్రమక్రమముగా, ఎక్కుడై — అధికమై. నిశితాంత......... కీలలు. నిశిత — సానఁబెట్టఁబడిన, అంత — చివరలుగల, దురంత — అంతములేని, లతాంతమార్గణ — పుష్పబాణములయొక్క — పూవుటమ్ములయొక్క, గణ — సమూహముచేత, అగణిత — ఎంచనలవి గాని, అగ్నికీలలు — అగ్నిజ్వాలలు, ఉద్ధతిన్ — దుడుకుతనముతో, సహింపనలవిగానిస్వభావముతో, బలయింపన్ — వ్యాపించఁగా, హుమ్మని — హుంకారముచేసి, బిట్టూదవు — అతిశయించునట్టి, తమ కమ్మనన్ — తగులముతో, క్రమ్మకొను — వ్యాపించిన, కవిసిన, బిగిచన్మిట్టలన్ — గట్టివియైన చను గొండలను, దట్టంబునన్ — తఱచుగా, దిట్టంబుగన్ — గట్టిగా, బెట్టెనయన్ — దుస్సహమగునట్లు, పిక్కటిలన్ — నిండి యధికమగునట్లు, మణిఖచిత మహారజతకంచుకంబు. మణిఖచిత — రత్నములు కూర్చఁబడిన, మహారజత — సువర్ణముయొక్క, కంచుకంబు — రవిక — అవియన్ — చీలికలుకాఁగా, అవయన్. అనియు రూపముగలదు. ఉట్టిపడు — అకస్మాత్తుగా సంభవించు, నిట్టూర్పులు — దీర్ఘ శ్వాసములు, ఉల్లసిల్లన్ — ప్రకాశించఁగా, పయః.........తెఱంగు. పయఃపారావార — క్షీర సముద్రముయొక్క, 'ని. పయఃక్షీరేచనీరేచ' హే. అంతర — నడుమ, చలత్ — కదలుచున్న, మందర ధరంబు తెఱంగు — మందర పర్వతముయొక్క విధమును, ఎఱింగించు — తెలియఁజేయునట్టి, మురువు నన్ — సంతోషాతిశయముతో, పెనంగుచున్ — ఒకరినొకరు చుట్టికొనుచు, కుచ.........యంబులు. కుచమండల — స్తనప్రదేశములయందు, నఖక్షత — గోళ్ళగాయములనెడు, అర్ధచంద్రోదయంబులు — అర్ధచంద్రాకారములయొక్క యుత్పత్తులు, ఉప్పొంగన్ — అతిశయించఁగా, మందస్మిత చంద్రికలు — చిఱునవ్వులనెడు వెన్నెలలు వెలుంగన్ — ప్రకాశించఁగా, స్వేదకణతారకా మండలంబు. స్వేద కణ — సూక్ష్మమైన చెమటబిందువులనెడు, తారకామండలంబు — నక్షత్రములయొక్క సమూహము, వెలయన్ — ఒప్పఁగా, నేత్రకువలయంబులు — కన్నులనెడు కలువపువ్వులు, ప్రకాశించన్ — ఒప్పు చుండఁగా, ఉపమితసమాసము. చివురాకుశయ్యన్ — చిగురాకుల పాన్పుమీఁద, పవ్వళించి — పరుండి, ఇంచుకనిదురించి — కొంచెము సేపు విశ్రమించి, మేలుకాంచి — మేలుకొని, హస్తారుణోదయకిసలయంబులన్, హస్త — చేతులనెడు, అరుణోదయ — సూర్యోదయకాలపు, కిసలయంబులన్ — చిగురుటాకులను, కలితాలకాంధకారంబులు. కలిత — పొందఁబడిన, అలకా — ముంగురులనెడు, అంధకారంబులు —

చీఁకట్లు, తొలంగన్ — ఆవలికిపోవునట్లు, నవరింపన్—చక్కఁబఱుచుకొనఁగా, రసతోషణంబులన్ - అనురాగములవలని సంతోషములతో, ముఖకమలంబులు — ముఖములనెడు తామరపువ్వులు, వికసింపన్ — ప్రకాశించఁగా, ఉపమితసమాసము. కంచుకోత్తరీయోదయరాగంబులు, కంచుక — రవిక యొక్కయు, ఉత్తరీయ — పైవస్త్రము యొక్కయు, ఉదయరాగంబులు — సూర్యోదయకాలము వంటి యెఱ్ఱనికాంతులు, చక్కఁగాఁగన్-చక్కఁబడఁగా, కుచకోకంబులు - కుచ—స్తనములనెడు,కోకంబులు—చక్రవాకపక్షులు—జక్కవపిట్టలు, దాఁగన్-ముఱుఁగుపడఁగా, స్వేదకణనఖక్షతతారకాబ్జంబులు. స్వేదకణ — చెమటబిందువులనువట్టియు, నఖక్షత — గోళ్ళగాయములనువట్టియు, 'ని. ఘునగర్భవః కర మహోనఖో౽స్త్రీనఖజరో స్త్రియామ్' అ. తారకాబ్జంబులు—చుక్కలునుజంద్రుఁడును, ప్రంకన్—అస్తమించఁగా — కనుపడకుండఁబోఁగా మానసా......రంబునన్ - మానస - మనస్సునందుఁ గలిగిన, ఆనంద — సంతోషమనెడు, అమృత - అమృతముచేత, జలముచేత, ఆనన - ముఖమును, నిషేచన - కడుగుకొనిన, అనంతర — పిమ్మట, నిటలతట — నొసటిప్రదేశమనెడు పూర్వాదిక్ — తూర్పుదిశయందు, ధృత — ధరించఁబడిన, కుంకుమ — కుంకుమయొక్క, వస్తుల — సంప్రదాయమైన, తిలక — బొట్టనెడు, అబ్జబాంధవ — సూర్యునియొక్క, ఉదయ— ఉదయించిన కాలమునందు, అనంతరంబునన్ - తరువాత. ఇట్టిసంభోగమును బురుసాయతమందుచు. భవభూతియు 'ముక్తాభూషణ మిందుబింబ మజనివ్యాకీర్ణతారం నభః, స్మారం చాప మపేతచాపల మభూ దిందీవరే ముద్రితే' వ్యాలీనకలకంఠమందరణితం. మందానిలై ర్మందితం, నిష్పన్న స్తబకాచ చంపకలతా సా౽ప్యున్నజానే తతః' అని వర్ణించాడు. "స్విన్నం మండలమైందవం విలులితం స్రగ్భారసద్ధం తమః, ప్రాగేవ ప్రథమాన తతశిఖాలీలాయితం సుస్మితం, శాంతం కుండలతాండవం, కువలయద్వంద్వం తిరోమీలితం, శీతం విభ్రమసూత్కృతం సహితతో జానే కిమాసీ దితి" కావ్య. 'ఇట్లగణ్యపుణ్య: లావణ్య—నిబ్బలికనుబ్బగొబ్బునగుబ్బటిల్లు గబ్బిగుబ్బల ఇత్యాదులు వృత్త్యనుప్రాసాలంకారము "ఒకటి రెండును మూఁడునై యొలయు ప్రాలు, పద్యమున నచ్చటచ్చటఁ బరఁగు నేని' వృత్త్యనుప్రాస మన నది విస్తరిల్లు 'లలితకోకిలకల్ల విలాసమగుచు' కావ్య. చూ. ఇం దలంకారము స్వభావోక్తియు "మణిఖచిత మహోన్నతకంచుకంబవియ" అనుచోట స్వభావోక్తియు, 'పయఃపారావారాంతర చలన్మంథగదరంబులై చెంగలించు మురువున" అనుచోట ఉపమాలంకారమును, 'కుచము డలనఖక్షతాగ్ర చంద్రోదయంబు లుపొంగ' అనుచోట నుండి యంత్యమువఱకు సావయవరూపకమును, సంభోగావస్థయు వర్ణింపఁబడినది. "అనుకూలే నిషేవేతే, యత్రాన్యోన్యం విలాసినౌ. దర్శనస్పర్శనాదీని' సా సంభోగ ఉదాహృతః" ఉదా. "శూన్యం వాసగృహం విలోక్య శయనా దుత్థాయ కించిచ్ఛనై ర్నిద్రావ్యాజ ముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖం విశ్రబ్ధం పరిచుంబ్య జాతపులకా మాలోక్య గండస్థలీం. లజ్జానమ్రముఖీ ప్రియేణ హసతా బాలాచిరం, చుంబితా" అమరు. ఇచట "గంభప్రౌఢగా వర్ణింపఁబడినది. స్మరమందీకృత వ్రీడా, ప్రౌఢా సంపూర్ణయౌవనా" అని లక్షణము.

తా॥ ఈవిధముగా గణింపఁదరముగాని పవిత్రములై సౌందర్యముతోఁగూడిన, హస్తాభరణముల యొక్క ఝణఝణధ్వను లతిశయించుచుండఁగా నాలింగనమొనర్చుచు, నినుమడింపుగానుబ్బి వెంటనే యుప్పొంగుచున్న బటువైన స్తనములు నురమునఁగలియ గ్గనేయుచు నొకరినొకరు రెప్పలుచేఁతలతోఁ జెనవెచికొని యొకరిమోమునవొకరిమోము ద్రాకించుచుఁ జివురాకులను దొండపండును నవపూసించునట్లు

యధరమునందలి ప్రేమతోఁ గూడినమృదుమధుర సుధారసము లొలుకుచుండ, నాదివిజకాంతను సంభోగ జనితపిపాస దీర్చుచు, నాపెయొక్క యధరామృతమును పానముసేయుచుఁ బలునొక్కులుసల్పుచుఁ, క్రమక్రమముగా వృద్ధిఁబొందిన మన్మథశరపరంపరలచే నెన్నఁదరముగాని వేఁడిమిని సహింపఁజాలని స్వభావముతో హుమ్మనుచు నధిక మగువిరహముతోఁ గవిసినదృఢమయిన స్తనదుర్గములు మిక్కిలి గట్టిగా దుస్సహకరముగఁ బెంపొందినట్లును, రత్నఘటిత మగు బంగరుఱవిక చినుఁగునట్లును, నాక స్మిక దీర్ఘశ్వాసములు వెలయఁ, బాలకడలినడుమఁ జలించుచున్న మందరాచలవిధానముఁ దెలియఁజేయు చున్న సంతోషాధిక్యముతో నొకరినొకరు పెనఁగికొనుచు, స్తనప్రదేశములయందలి నఖచిహ్నములనెడు యర్ధచంద్రాకారము లుప్పొంగఁగను, జిఱునవ్వులనెడు వెన్నెలలు ప్రకాశింపఁగను, చిఱుచెమట లనెడు నక్షత్రములు వెలుంగఁగను, గన్నులనెడు కలువలు ప్రకాశింపఁగను, లేఁతయాకులపాన్పుమీఁద బడి కొంచెము సేపు విశ్రమించి మేలుకొని హస్తములనెడు ప్రాతఃకాలపు చిగురుటాకులచే ముంగు రులనెడు చీఁకట్లు తొలఁగఁజక్కఁబెట్టుకొనఁగను, ప్రేమాతిశయమువలనఁ గలిగినసంతోషములచే ముఖములనెడుపద్మములు వికాసమును బొందఁగాను, అవికయొక్కయుఁ బైవస్త్రముయొక్కయు నెఱ్ఱని కాంతులు బాలాతపముఁ జూపఁగను. స్తనములనెడు జక్కవపిట్టలు దాఁగఁగాను, చెమటచుక్క లనెడు చుక్కలును, గోళ్ళగాయములనెడు చంద్రుఁడును, నస్తమించఁగాను, మనస్సంతోషము నెడు జలములచే ముఖప్రక్షాళనముఁ గావించినతదుపరి ఫాలతలము నెడు తూర్పుదిక్కున ధరించినగుండ్రని కుంకుమబొట్టు నెడు సూర్యోదయ మయినతరువాత.

—: రంభ నిరంకుశుని శ్లాఘించుట :—

క॥ ఆసుదతి ముద మెలర్పన్, మహీసురసుతుఁ గౌఁగిలించి ♦ హితమతిఁ బలికె
న్నేసతి పుణ్యవతియొ నీ, తోసురతమునిరతి మొనయఁ ♦ దొంటిఫలమునన్. 62

అ॥ ఆసుదతి — ఆదేవవేశ్య, ముద మెలర్పన్ — సంతోషమతిశయించునట్లు, మహీసురసుతున్ — బ్రాహ్మణునికొడుకైన యానిరంకుశుని, కౌఁగిలించి — ఆలింగనమొనర్చి, హితమతిన్ — ఇష్టముగల బుద్ధితో, పలికెన్ — ఇట్లనెను, తొంటిఫలమునన్ — పూర్వపుణ్యసాఫల్యమున, నీతోన్ — నీతోడి, సురతమున్ — సంభోగమును, నిరతమున్ — ఎడతెగకుండ, ఎనయన్ — పొందుటకు, ఏసతి — ఏయొక్కస్త్రీ, పుణ్యవతియో — పుణ్యవంతురాలో కదా, అదృష్టవంతురాలో కదా, ఈపద్యమున 'పలికెన్నేసతి' అనుచోట ద్రుతమునకు ద్విత్వమువచ్చుటకు 'సూ. కొన్నియెడలఁ బ్రామాణిక ప్రయోగంబులందు ద్రుతంబున కచ్చుపరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి' ప్రౌ. వ్యా. ఉదా. మ. ఘన చక్రాయుధ నిష్ఠురక్షతగళ♦ద్రక్తాస్య సర్వాంగుని, న్ననుభూతాప్రతిమ ప్రగల్భ పరివా♦రాంతర్ధితో ద్విక్రమున్' ఉ. హరి. 'మ. తరుణీశాతకటాక్ష వీక్షలకొనల్ దాఁకన్న చోట్లంబలె' న్నురు శోభావిభవాకరంబులగుచు ♦ న్రోమాంకురస్థానముల్, పరఁగున్ కళా. అధర్వణాచార్యులుకూడ 'సూ. నోహాద్విత్వం క్వచిద్దిష్టంపర ప్రాణేనసంగతేః' అనియున్నారు. ఉదా. 'మదీయభాషణ మెన్న డున్నేని యమోఘంబుగాదు, ఆతని ధైర్యశక్తికిన్నరుదుగ, ఇత్యాదులాచార్య ప్రయోగములు 'హిత మతి, ఏసతి పుణ్యవతి, సురతము నిరతము' అనుప్రాసాలంకారము. ఇందుస్మృతియను శృంగార భావము చెప్పఁబడినది. క. స్మృతియగుఁ బూర్వానుభవస్మృతి అని కావ్యా. సం. 'పూర్వానుభూత

విషయజ్ఞానం స్మృతిరుదాహృతా, అని ప్రతా. ఉ. "క. నాటిపరిగంధసౌఖ్యము, నేఁటిబలెంబాయ దాత్మ నిండితోలఁదుచుఁ, బోటివృసింహునిబాయుని, పాటలసుమగంధులెంత భాగ్యాధికలో" అని కావ్యా. సం. ముదముకు ఉదా. క. అలులైకింశుక శిఖిశాఖలఁ జెలఁగుచు మున్నెంతతపము జేసెనొ చెలివే నలిరసింహుని యురమునఁ, జెలువగు చెంగల్వదండ చేసుపగలిగెఁ, కావ్యా. సం.

తా॥ ఆరంభ సంతోషముతో నిరంకుశుని గవుఁగిలించుకొని ఓ బ్రాహ్మణుఁడా నీతో నెల్లప్పుడును గలసియుండునట్టి స్త్రీ యెంతటిపుణ్యవంతురాలో కదా యనెను.

క॥ ఈతీరున సురతనయుల, చేతను దనియంగ నెఱుఁగఁ ♦ జెప్పెడిదేమీ
రాతిరిపగలై పగలే, రాతిరియై వెలయుచుండె ♦ రతిపరవశతన్. 63

అ॥ ఈతీరునన్ — ఇంతచక్కఁగా, సురతనయులచేతను — నలకూబరుడు మొదలగు దేవలోక యౌవనులవలన, సురత+నయులు — సురతమునందు నిపుణులైనవారివలనను, అనిభావము. తనియఁగన్ ఎఱుఁగన్ — తృప్తిపొందినదెఱుఁగను, రతిపరవశతన్ — సంభోగేచ్ఛవలనమైమరచుటచేత, రాతిరిపగలై — రాత్రియేపగలుగను, పగలేరాతిరియై — పగలేరాత్రిగను, అగుచు వెలయుచుండెన్ — ప్రకాశించుచున్నది, చెప్పెడిదేమీ — ఇంకఁ నేనుజెప్పవలసినదేమున్నది.

తా॥ నేనెల్లప్పుడును సురతనయులసంభోగము ననుభవించుదాననే. అయిన నింతటితృప్తిగా నెన్నఁడు ననుభవించి యెఱుఁగను. సంభోగపరవశత్వమున రాత్రియైనది పగలైనది విశదపడకయుండెనుగదా! ఇంక నేమిచెప్పవలయును.

క॥ మనసిజకేళికి భూసుర, తనయా నీసాటిరారు ♦ తలపఁగనేలా
యనరాదు గాని దాసులు, వినుమా నలకూబరాది ♦ విజయవిశాలుల్. 64

అ॥ భూసురతనయా — ఓ బ్రాహ్మణునికుమారుఁడా, వినుమా — నేఁజెప్పువచనము నాలించుము, నలకూబరాది విజయవిశాలుర్, నలకూబరాది — నలకూబరుఁడు మొదలగు, విజయవిశాలుల్ — గెలుపువలననొప్పుచుండెడివారు, వినుము+ఆనలకూబరాది అనియును, విను+మానలకూబరాది అనియును బదచ్ఛేదముఁ జేయవచ్చును. మనసిజకేళికిన్ — సంభోగమునందు, నీసాటిరారు — నీతోసమానులు కారు. తలపఁగనేలా — ఆలోచింపవలసినపనిలేదు, అనరాదుగాని — నేననఁగూడదుగాని, దాసులు — నీకుబంట్లుసుమా, ఈపద్యమునవిశాలుల్, అనిప్రయోగించుటకు "సూ. బహువచనలు వర్ణమునకు ఉకారలోపము వైకల్పికము" బా. వ్యా. సూ. లాన్తాత్తు రుకా తయోః క్రమేణ స్త్రః అని శబ్ద. చిం: బుద్ధిశాలులు బుద్ధిశాలులన్, మృదుతాలుబు, మృదుతాలులన్ అనియే యుండవలయును గాని ఇత్యాదిశబ్దములకు మాత్రి మీసూత్రము వర్తింపదు. ఉదా. "క. తనకనిపెట్టిన మణీసుము, కనకోన్నతపేశమునఁ బ్రకాశంబుగనిల్చినయెడఁ దోఁచిరి నారద, మునిప్రముఖులంతరిక్షమునను జ్వాలుల్లై, మ. చెలులుం జుట్టాలు నిష్టభృత్యులుం మహేంద్రబాణముల్ దాపను జ్వాలులై "క. యనునుత్సవమొప్పఁ జేసి రగణితబలులై" శ్రీ. శ్రీవేదం వేంకటరాయశాస్త్రిగారు శృంగారనైషధవ్యాఖ్యయందును "దానవిద్యాకరహాస్యముల తెలిగినబుద్ధిశాలులు (190 పు) అనియే వ్రాసిరి. ప్రతీపాలంకారము. "ఆక్షేప ఉపమానస్య ప్రతీప ముప

మేయతా త్వసైకైవ యది వా కల్పాన్యతిరస్కారనిబంధనమ్" కా. ప్ర. ఉదా. లావణ్యౌకసి సప్రతాప గరిమణ్యగ్రేసరే త్యాగినాం, దేవ త్వయ్యవనీభరక్షమభుజే నిష్పాదితే వేధసా, ఇందుః కిం ఘటితః కిమేషవిహితః పూషా కిముత్పాదితం, చింతారత్నమహో ముధైవ కిమమీ సృష్టాః కులక్ష్మాభృతః, ఖండ దివ్యపురుషులలో లోకోత్తరసుందరు లగు నలకూబరాదులను వచించుటచే లోకమున నెవ్వరును నీకుసాటిరాఁగలవారు లే రనునర్థముచే, నర్థాపత్తియు క. 'పరుసంగా నొకవస్తువు ♦ గిరకొనవ స్త్వంతరంబు ♦ కిముతన్యాయ, స్ఫురితంబై చనుదేరఁగ, ధర నర్థాపత్తి యయ్యె' కావ్యా. సం. ఈయర్థముచేతనే నాయికకు గర్వ మనుసంచారిభావము గోచరించుచున్నది. గర్వము. క. ప్రతిరయి కలంకాంకితునకు, సతియగు రోహిణియు నతని ♦ సతి యగు రతియుం, జతురనృసింహుని జెందిన, యతిధన్యత నాకు ననుచు ♦ నంగన నవ్వెన్. కావ్యా. సం.

తా|| ఓవిప్రతనయుఁడా దేవలోకమునఁ గల నలకూబరాది యౌవనులు సంభోగమునందు నీతో సమానులు కారు, నీకు బంట్లగుదురు.

క|| అని దివిజకాంత భూసుర, తనయునిఁ గీర్తించుచుండెఁ ♦ దా మోహితయై
విను సుగుణ వీవు గావున, ననుఁ బొగడితి వనుచు ననియె ♦ నయమున నతఁడున్. 65

అ|| అని—ఇట్లని, దివిజకాంత—దేవవేశ్య, తాన్—తాను, మోహితయై—మరులుగలదియగుచు, భూసురతనయునిన్ — ఆబ్రాహ్మణకుమారుని, కీర్తించుచుండెన్ — పొగడుచుండెను, అతఁడున్— ఆయొక్క బ్రాహ్మణుఁడును, నయమునన్—చక్కఁగా, విను — ఓసుందరి నేఁజెప్పుదానినాకర్ణింపుము, ఈవు—నీవు, సుగుణవు—మంచిబుద్ధిమంతురాలవు, కావునన్—కాఁబట్టి, నన్నున్—నన్ను, పొగడితివి—శ్లాఘించితివి, అనుచుననియెన్—అనిపలికెను, ఈపద్యమున 'ఈవు' అని ప్రయోగించుటకు 'సూ. క్వచిదన్యస్యచాన్యస్యాపి లోపో దీర్ఘశ్చకుత్రచిత్' అని యథ. 'సూ. ప్రథమాయా మేదన్మదః' అవిసన్న.

తా|| రంభ యిట్లుమోహపరవశయై యానిరంకుశుని బొగడుచుండ నతఁడును దివిజకాంతతో నీవు మంచిబుద్ధిమంతురాలవగుటచేతనే నన్ను మెచ్చుచుంటి వనెను.

క|| అపు డాద్విజుఁడును దివిష, చ్చపలాయతనయనఁ గూడి ♦ చనుదేరఁగ నా
విపులారణ్యము చెంగట, నుపమాశూన్యమగుపురము ♦ నొక్కఁడుగాంచెన్. 66

అ|| అపుడు - ఆసమయమున, ఆద్విజుఁడును — ఆబ్రాహ్మణుఁడును, దివిషచ్చపలాయతనయనన్ — చలించుచున్న విశాలమైనకన్నులుగల యాదేవతాస్త్రీని, కూడి - కలిసి, చనుదేరఁగన్ — రాఁగా, ఆ - ఆయొక్క, విపులారణ్యము చెంగటన్ - విస్తారమయినయడవియొక్క సమీపమున, ఉపమాశూన్యము—సమానములేనిది, అగుపురమున్ - అయినట్టిపట్టణమును, ఒక్కఁడు - ఒకదానిని, కాంచెన్ - చూచెను, ఈపద్యమున 'ఒక్కఁడు' అని యమహచ్ఛబ్దమునకు మహదర్థకశబ్దమును ప్రయోగించుటకు 'సూ. విశేషణానాం మహతో ద్రుజ్యాస్య దుభయథాపిచ, క్వచి ద్రుజ్మాత్రకే స్వార్థ విశేషణ మిహోచ్యతే' అని యథ. ఉదా. 'వ్యాఘ్రి యొక్కఁడు సను దెంచె ♦ వనములో నెఇళ్యాద్యులు;

తా॥ అయ్యెడ నాబ్రాహ్మణుఁడును రంభయునుఁ గలసి యావన సమీపమునఁ గలయొక పట్టణమునుఁ జూచి.

—: రంభానిరంకుశులొకపట్టణమునసనుండుట :—

వ॥ కాంచి తత్పట్టణంబు చేరం జనుదెంచి. 67

అ॥ కాంచి - కనుఁగొని, తత్పట్టణంబు - ఆపురమును, చేరన్ - చేరునట్లు, జనుదెంచి - వచ్చి,

క॥ అచ్చట సుఖులై వాయువి, యచ్చరరాడ్భోగ మొనయ ♦ నతులప్రౌఢిన్
బచ్చవిలుకాని కేళుల, నిచ్చ మెయిన్ జరపుచుండి ♦ రిరువురు వెలయన్. 68

అ॥ అచ్చటన్ — ఆప్రదేశమున, 'అచ్చట' యనునది నిత్యైకవచనము. "సూ. దేశ్యములనం దక్కడాదులు నిత్యైకవచనాంతములు" ప్రౌ. వ్యా. వారు — ఆనిరంకుశుఁడును రంభయును, సుఖులై — అనందముగలవారై, వియచ్చరరాడ్భోగము — ఇంద్రునివంటి సుఖమును, ఎనయన్ — పొందఁగా, ఇరువురున్ — ఆయిద్దఱును, ఇచట ఇరువురు' అనుటకు 'సూ. ఆదేశశ్చపురూపక్చ సబిందుర్దుత్త:మాత్పరః' అధ. వెలయన్ — ప్రకాశించునట్లు, అతులప్రౌఢిన్ — అసమానమైన నేర్పుతో, పచ్చవిలుకాని కేళులన్ — సంభోగములయందు, ఇచ్చ మెయిన్ — ఇష్టమువచ్చినట్లు, ఇచట 'మెయిన్' అనుటకు "సూ. జడపదంబుమీఁదితోడను మెయిమైలువికల్పంబుననగు" ప్రౌ. వ్యా. మయి అను రూపముకూడ కలదు. "ఉదా. అందఱుగూడి మోసలకు♦నర్థిమెయింజనుదెంచి" నిర్వ. జరపుచుండిరి — కాలమును గడపుచుండిరి.

తా॥ అచ్చోట నాయిరువు రానందముతో నింద్రభోగముగా సంభోగించుచు స్వేచ్ఛగాఁ గాలమును గడపుచుండిరి.

—: ఆశ్వాసాంతము :—

చ॥ ఘనఘన నవ్యనవ్య శితి ♦ కంధరకంధర దానదానవే
ధనధన తప్తతప్తకృత ♦ తారక తారక ధామధామవా
రణ రణరంగ రంగదరి ♦ రాజత్రిరాజితి దారుదారుకా
వనవనధీసధీనవృష ♦ వాహన వాహన సోమశేఖరా. 69

అ॥ ఘన — గొప్పవాఁడా, ఘననవ్య — అధికులచేత స్తుతింపఁదగినవాఁడా, ని 'నవంనస్యే పుమాన్ స్తుతౌ' అని మే. నవ్యశితికంధర. నవ్య — వర్ణింపఁదగిన, శితికంధర — నల్లుపుతోఁగూడిన కంఠముగలవాఁడా, ని 'శితిఃకృష్ణేశితిర్భూర్జే' విశ్వ. 'శితిర్ధవళనీలయోః' నానా. 'శితిర్భూర్జేనాసితాసితయోస్త్రిషు' మే. కంధరశబ్దమునకు ని 'కంధరోవారివాహేస్యా. ద్గ్రీవాయామపికంధరా' విశ్వంకంధరదాన — మేఘమువలె దాతృత్వముగలవాఁడా, ని 'దానంగజమదేత్యాగే పాలనచ్ఛేద శుద్ధిషు' అనివి. దానవేధనధనతప్త. దాన — మదముతోఁగూడిన గజాసురుని, వేధన — బాధించుట

యొసెడి, ఘన – ఘనముతోఁగూడిన, తప్త – దర్పముగలవాఁడా, ని 'తప్తోనద్యంతరేదర్పే కష్టా
ర్యామస్యహంకృతౌ' అనిమే. తప్తకృతతారక, తప్త – తపింపఁబడినవానినిగా, కృత – చేయఁబడినకీ
తారక – తారకాసురుఁడు గలవాఁడా, తారకధామధామ. తారక – వెండితోఁగూడిన, ని 'తారా
ముక్తాఫలసంశుద్ధా. తరళేశుద్ధమౌక్తికే, తారంచరజతేఽత్యుచ్చస్వరేఽప్యన్యవదీరితం, ఋక్షాక్షిమధ్య
యోస్తారా. సుగ్రీవగురుయోషితోః, బుద్ధదేవ్యాంచ తారా' అనివి. ధామ – ప్రకాశముగల,
కైలాసమే. మఱియు వెండికిస్థానముయిన కైలాసమే యనియుఁ జెప్పవొప్పును. ని 'ధామజన్మప్రభా
స్థాన, ప్రభావసుఖసద్మసు' అని నా. వారణరణరంగరంగదరిరాజిత. వారణ – నివారించుటగల,
ని 'వారణంతు నిషేధేస్యా. ద్వారణశ్చమతంగజే' అనివిశ్వ. రణరంగ – యుద్ధభూమియందలి,
రంగత్ – ఒప్పుచున్న, అరి – శత్రువులతోడి, రాజిత – ప్రకాశించఁబడినవాఁడా, ఇచ్చట అరి
రాజి – శత్రువులయొక్క సమూహముతో, త + రాజిత – కోపముతోఁగూడి ప్రకాశించఁబడిన
వాఁడా, అనియుఁజెప్పవచ్చును, ని 'తశబ్దః పుంసిసంభోగే నిశ్చయేకోపపుచ్ఛయోః' అని నానా.
రాజితదారుదారు కావనవన. రాజిత – ఒప్పుచున్న, దారు – దేవదారువృక్షములుగల, దారు
కావన – దారుకారణ్యమే, వన – పురసమీపమునఁగల తోటగాఁగలవాఁడా, ని 'వనం నపుంసకే
నీరనివాసాలయకాననే' అనిమే. ధీనధీన. ధీ – బుద్ధిగలవారిలో, ఇన – ప్రభువులైనవారికిని, అనఁగా
బుద్ధివిశేషముగలవారికిని, ధీన – స్వాధీనముగానివాఁడా, వృషవాహన – వృషభమే వాహనముగాఁ
గలవాఁడా, వాహనసోమశేఖరా. వాహన – వహించఁబడిన – అనఁగా ధరించఁబడినయనుట,
ని 'వహస్స్యాద్వృషభస్కంధే వాహే గంధవహేఽపిచ' అనిమే. సోమ – చంద్రుడే, శేఖరా –
సిగయందుఁ బువ్వులదండగాఁగల ధీరో సోమేశ్వరస్వామీ, అనియాశ్వాసాంతమునందుఁ గృతిపతి,
సంబోధనము. అలం – పదయమకము. ఇదియే ఛేకానుప్రాసము. 'గీ. అంధ్రనుప్రాసభేదంబు ♦ లైన
శబ్దభవదలంకారమును మున్ను ♦ బ్రస్తుతింతు; నడర నెడ లేక రెండు రెం ♦ డక్షరంబు, లెనయు
నియమంబు ఛేకమౌ ♦ నెట్లటన్న' ఉదా. 'పంచ. స్ఫురత్కృపాబలప్రతాప ♦ భూతి ధైర్య
భూధరా, స్థిరంగ దానబుద్ధి వైఖ ♦ రిన్నరిన్నరిన్నృధా, హరున్హరున్నిరిన్నిరిన్మ ♦ హానలున్నలుద్రమా,
గురున్గురుజ్జయింతు వౌఁద ♦ గున్నృసింహభూవరా' అని నరస. 'భవేదవ్యవధానేన ద్వయోర్వ్యూఢం
జనయుగ్మయోః. అవృత్తిర్యత్రసబుధైశ్ఛేకానుప్రాసఇష్యతే' అనిప్రతా.

మా॥ గగనపుర జిగీషా ♦ కాలకూటాన్నతోషా
నిగమచర సువేషా ♦ నేకపుణ్యప్రభాషా
అగణితఫణిభూషా ♦ హార్యచాపామనీషా
విగళసకలదోషా ♦ విస్ఫుటానన్యపోషా. 70

అ॥ గగనపురజిగీషా – గగన – ఆకాశమునందుఁగల, పుర – దానవులవైన మూఁడుపట్టణము
లను, జిగీషా – జయింపనిచ్ఛగలవాఁడా, పూర్వ మొకప్పుడు దేవతలకు నోడి యసురులు మయుని
శరణుఁజొచ్చిరి. మయుఁడు వారికి మూఁడుపట్టణములను వేఱువేఱబంగారుతోను, వెండితోను, యినుము
తోనుచేసి యవి యదృశ్యముగా సంచరించునట్లొనర్చి యిచ్చెను. అసురులాపట్టణములచే బోయి
దేవాదులను బాధించుచుండఁగా వారిప్రార్థనచే శివుఁడు ఆమూఁడుపట్టణములను దహించివైచెను.

కాలకూటాన్నతోషా. కాలకూట — కాలకూటమను పేరుగల విషమే, అన్న — భోజనముగాఁగలిగి తోషా — సంతోషించుటగలవాఁడా, దేవతలును దానవులును సముద్రమును మథించునప్పుడు కాలకూటమనియు, హాలాహలమనియుఁ జెప్పఁబడు మహావిషముదయించఁగా దానిని శివుఁడు మ్రింగినందున శివునకు విషాహారము కలవాఁడను ప్రసిద్ధికలిగినది. నిగమచరసువేషా. నిగమ—వేదములయందు, చర — సంచరించునట్టి, సువేషా — మంచిరూపములు ధరించినట్టివాఁడా, అనేకపుణ్యప్రభాషా. అనేక పుణ్య-సుకృతములతోఁగూడిన, ప్రభాషా — మంచిమాటలుగలవాఁడా, అగణితఫణిభూషా. అగణిత-ఎంచశక్యముగాని, ఫణిభూషా — పాములే సొమ్ములుగాఁగలవాఁడా, అహార్యచాపామనీషా. అహార్య-మహామేరువనెడి పర్వతమే, చాపా—విల్లుగాఁగలవాఁడా, మనీషా- సంపూర్ణమయిన ప్రజ్ఞగలవాఁడా, విగతసకలదోషా. విగత — పోఁగొట్టఁబడిన, సకల — సమస్తమయిన, దోషా- పాపములుగలవాఁడా, విస్ఫుటానన్యపోషా. విస్ఫుట — స్పష్టమైన, అనన్య — అధికమైన, పోషా — రక్షించుటగలవాఁడా, ఈవృత్తమునకు లక్షణము. "ననమయయయుతంబై, నాగవిశ్రాంతియై యిట్లనుపమగుణమాలీ న్యాప్తయంబరయ్యేభ్యాత్రిన్" అలం. ఈపద్యమున నంత్యప్రాసము సెప్పఁబడినది.

క॥ మోహజ్వర భైషజ్యస, మీహితకైలాసరాజ్య ♦ మేదుర తేజా
జేహీయమానదానవ, బాహాధార్ష్ణ్యజ్య త్రిదివ ♦ పాలకపూజ్యా. 71

అ॥ మోహ............ తేజా. మోహజ్వర — అజ్ఞానమనెడు వ్యాధికి, భైషజ్య — ఔషధముగా, సమీహిత — కోరఁబడిన, కైలాసరాజ్య — కైలాసమనెడు దేశమున, మేదుర—చిక్కనైన — దట్టమైన, తేజా — ప్రకాశముగలవాఁడా, ని 'తేజః ప్రభా వేదీప్తౌచ. బలేశుక్రేఽపి' అనిఅ. దీనికి నజంతమునుహలంతమునను రెండురూపములు కలవు. ఉ బా. 'అనంతరత్నాయుత తేజః' అనిపను. జేహీయ........జ్య. జేహీయమాన — హరించుచున్న, దానవ — రాక్షసులయొక్క, బాహా — భుజబలముయొక్క, ధార్ష్ణ్య — దిట్టతనముతోఁగూడిన, జ్య — వింటినారిగలవాఁడా, త్రిదివపాలకపూజ్యా. త్రిదివ — స్వర్గమునకు, పాలక — కాపాడునట్టి యింద్రునిచేత, పూజ్యా .. అర్చింపఁదగినవాఁడా.

గద్యము. ఇది శ్రీమత్కాళీవరప్రసాద లబ్ధలబ్ధవర్ణవర్ణనీయ నివిత్వతత్త్వధాగేయ, పెదలింగనార్యగర్భాబ్ధసపూర్ణమాత్రేయ, గురువరాచార్యపదారవింద మిళిందాయమానమానసా శ్రేయ, పండితమ్మన్యత రాజేయ, సకలవిద్వజ్జనవిధేయ, సుబ్రహ్మణ్యనామధేయ ప్రణీతంబయిన నిరంకుశోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము.

అ॥ ప్రథమాశ్వాసమునఁబోలె నెఱుంగునది.

ఇది శ్రీమద్గాయత్రీవిరాడ్విశ్వకర్మ వరప్రసాదజనిత కవితామృత రసపాత్ర, అహభూనస గోత్ర పవిత్ర, అచ్చమాంబా వేంకటశివార్యపౌత్ర, లక్ష్మాంబా కోటీశ్వర సుధీమణిపుత్ర, శిల్పవాస్తుజ్యోతిశ్శాస్త్రాది వివిధవిద్యాప్రవీణ, పదవాక్యప్రమాణ నిధాన, విమర్శకాచార్యశిల్పకళాకోవిదేత్యాది బిరుద నిరుపమాన, బుధారాధన విరాజమాన, సుబ్రహ్మణ్యాభిధాన; విరచితంబైన నిరంకుశోపాఖ్యాన సుధాతరంగిణీ వ్యాఖ్యానమున తృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు

# నిరంకుశోపాఖ్యానము

## సుధాతరంగిణీవ్యాఖ్యానసమేతము

### చతుర్థాశ్వాసము

క॥ శ్రీరమణీరమణీయప, రీరంభస్నేహవిస్ఫు ♦ రితసాయక ని
ర్దారితసుమనస్సాయక, భూరికృపావేశ కంద ♦ పురసోమేశా. 1

అ॥ శ్రీరమ......సాయక, శ్రీరమణీ – లక్ష్మీదేవియొక్క, రమణీయ – సుందరమైన, పరిరంభ – ఆలింగనముతోఁగూడిన, 'ని. పరిరంభః. పరీరంభః. అ. పు. కౌఁగిలి' శ. రూ. ర. స్నేహ–ప్రేమచేత, విస్ఫురిత – చలింపఁబడిన విష్ణువే, సాయక – బాణముగాఁగలవాఁడా, నిర్దారితసుమనస్సాయక. నిర్దారిత – చక్కఁగా భేదింపఁబడిన, 'ని. దారితే భిన్న భేదితౌ' అ. సుమనః+సాయక – పుష్పములే బాణములుగాఁగల మన్మథుఁడుగలవాఁడా, 'ని. స్త్రియః సుమనసః పుష్పం. ప్రసూనం కుసుమమ్ సుమమ్' అ. 'శరేషుర్ద్వేచసాయకః' అ. భూరికృపావేశ–భూరి – విస్తారమయిన, కృపా–దయతోఁగూడిన, ఆవేశ – మైనుఅచుటకలవాఁడా, కందపురసోమేశా – కందుకూరనుపట్టణమునఁగల యో సోమేశ్వరస్వామీ, అని యాశ్వాసాదియందుఁ గృతిపతికి సంబోధనము. ఇందు లక్ష్మీదేవియందనురాగముగల విష్ణువు శివునకు హస్తగతుఁడై యుండెననుటచేత పరికరాలంకారము. "క. సాకూతములైన ఫలత, చేకొన్న విశేషణములు ♦ వెలఁగఁబరికరం, బై కృతుల వెలయుచుండు" కా. సం. 'రమణీ రమణీయ' యమకాలంకారము. 'సాయక-సాయక-వేశ-సోమేశా' అంత్యానుప్రాసాలంకారము.

తా॥ సంపద్యుక్తయగు లక్ష్మీదేవియొక్క ఆలింగనమునందిచ్ఛగల విష్ణుమూర్తియే బాణముగాఁగలవాఁడవును, మన్మథుని సంహరించినవాఁడవును, అధిక దయగలవాఁడవును, అయిన యో కందుకూరిసోమేశ్వరస్వామీ.

తే॥ అవధరింపుము తత్త్వవి ♦ ద్యావివేక, దళితకామాదిరిపువర్గ ♦ కలహుఁడైన
పుంహుఁ డిట్లని పల్కె నా ♦ భూసురేంద్ర, శేఖరునితోడ వాక్యవై ♦ చిత్రి మొప్ప. 2

అ॥ అవధరింపుము – వినుము, తత్త్వ......హుఁడు. తత్త్వవిద్యా – వేదాంతశాస్త్రమునందలి, వివేక – జ్ఞానముచేత, దళిత – భేదించఁబడిన, కామాది – కామముమొదలగు, రిపువర్గ – అరిషడ్వర్గముయొక్క, అనఁగాఁ గామ క్రోధ లోభ మోహ మదమత్సరములయొక్క యనుట. కలహుఁడు – పరస్పర వివాదముగలవాఁడు, 'ని. అస్త్రియాంసమరానీకరణాః కలహవిగ్రహౌ' అ,

ఐన పులహుండు — అయినటువంటి పులహుండను నామధేయముగల బ్రహ్మ, ఆ భూవరేణ్యశేఖరుని తోడన్ — రాజులలో శ్రేష్ఠుఁడయిన యాధర్మశీలునితో, వాక్యవైచిత్రి మెఱయన్. వాక్య — మాటల యొక్క, వైచిత్రి — ఆశ్చర్యము, మెఱయన్ — ప్రకాశించఁగా, ఇట్లని — ఈమీఁదఁజెప్పెడువిధముగా, పల్కెన్ — చెప్పెను, ఇందు 'కలహుండు — పులహుండు, అనుప్రాసాలంకారము.

తా॥ వేదాంతవిద్యా జ్ఞానసమృద్ధిచేతఁ గామక్రోధ లోభమోహ మదమాత్సర్యములను నరిషడ్వర్గమును జయించినవాఁడయిన పులహుఁడు శ్రేష్ఠుఁడయిన యాధర్మశీలుఁడగు రాజున కీవిధముగాఁ జెప్ప నారంభించెను.

క॥ ఆరీతి నతఁడు దివిష, న్నారీతిలకంబుతోడ ♦ ననువుగ సురతా
పారవ్యాపారశ్రీ, పారగభావమున భ్రాంతి ♦ పడి వర్తిలుచున్. 3

అ॥ అతఁడు — ఆనిరంకుశుఁడు, ఆరీతిన్ — ఆప్రకారముగా, దివిషన్నారీతిలకంబుతోడన్ — దివిషన్నారీ — దేవతాస్త్రీలలో, తిలకంబుతోడన్ — ప్రకాశించుచున్నట్టి యారంభతోఁగూడి, తిలకము శ్రేష్ఠవాచకము. అనువుగన్, తగినట్లుగా, సురతా......పరన్, సురత — సంభోగము యొక్క, అపార — అవధిదరిలేని — అంతములేని, వ్యాపార — ప్రవర్తనముయొక్క, శ్రీ — సంపదయొక్క, పారగ — అవలిదరిఁజేర సంచరించునట్టి, సుఖస్ఫూర్తినిచ్చునట్టి, భావమునన్ — అభిప్రాయముతో 'ని. భావః సత్తాభిప్రాయచేష్టాత్మజన్మసు' అ. భ్రాంతిపడి — భ్రమించినవాఁడై, వర్తిలుచున్ — ప్రవర్తించుచు, ఇందు 'అపారవ్యాపారశ్రీపారగ' అని రేఫము పలుమారు చెప్పఁబడుటచేత వృత్త్యనుప్రాసాలంకారము.

తా॥ ఆ నిరంకుశుఁడావిధముగా సురకాంతతోఁ గలసి యెడతెగని సంభోగవాంఛతోఁ గూడిన భ్రమగలవాఁడై ప్రవర్తించును.

వ॥ ఒక్కనాఁడు తనతోఁ గ్రీడింపఁ ద్రిదివంబున నుండి వచ్చిన యయ్యచ్చరలేమయుం దానును విలాసార్థంబుగఁ బురంబు వెడలి. 4

అ॥ ఒక్కనాఁడు — ఒకదినమున, తనతోడన్ — తనతోఁగూడి, క్రీడింపన్ — విహరించుటకు, త్రిదివంబుననుండి — దేవలోకమునుండి, ఇచట సవర్ణకముగూర్చి "సూ. ఉండిపదంబు పరంబగుచో వలనకందు వర్ణకమట్లు సవర్ణకంబునగు" ప్రౌ. వ్యా. ఉదా 'క. ...సనత్కుమారుఁడు మహికిం, జనుదెంచె బ్రహ్మలోకం, బుననుండి' భార. వచ్చిన — అయ్యచ్చరలేమయున్ — ఏతెంచిన యా యప్సరోంగనయును, తానును — ఆనిరంకుశుఁడును, విలాసార్థంబుగన్ — స్త్రీపురుషులయొక్క శృంగారచేష్టల నిమిత్తము, 'ని. విలాసోహావభేదేస్యా. ల్లీలాయామపిపుంస్యయమ్' మే. 'అర్థోభిధేయరైవస్తుప్రయోజననివృత్తిషు' అ. పురంబువెడలి — ఆపట్టణమునుండి బయలుదేఱి,

—: రంభానిరంకుశు లుద్యానవనమునకుం జేరుట :—

సీ॥ సరసీరుహానవీన ♦ తరసీధురసపాన, భసలసుందరగాన ♦ భాసమాన
మసమానసహకార ♦ లసమానఫలవార, ససమాదరకుమార ♦ సమదకీర
మవమానదరణదార ♦ పవనాలసవిహార, భవనాగవిస్ఫార ♦ భవ్యహార
మవమానలవదూర ♦ పవమానసంచార, భవమాంద్యవిస్తార ♦ ఫణివిహార

తే॥ మంచితవిహంగమమురాజ ♦ హంసచంచు, దళితఫలసారజలపూర ♦ మిళితఫలిత
కలితఘనశాలినవశాలి ♦ ఖండమండ, లావరణదీవ్యమాన ము ♦ ద్యాన మొకటి. 5

అ॥ సరసీ......మానము. సరసీరుహ — తామరపువ్వులయొక్క, నవీనతర — నూతనమయిన, శ్రోత్రదిగ్గైన, సీధురస— మద్యమును, 'ని, మధ్వాసవో మాధవకో. మధుమాధ్వీకమద్యయోః, మైరేయ మాసవఃసీధు. ర్మేదకోజగలఃసమా' అ· మధ్వాసవః-మాధవకః-మధు-మాధ్వీక. ఇవి మధుకపుష్పోద్భవమద్యమునకును, మైరేయం-ఆసవః-సీధుః. ఇవి యిక్షుశాకాదిజన్యమద్యమునకును, మేదకః-జగలః- ఇవి సురాకల్కమునకును, అర్థములు. ఇచట 'సీధుః-శీధుః' అని రెండురూపములు కలవు. 'ని. మదిరా మస్సమైరేయం శీధుఃకాదంబరీత్విరా' ధనం. పాన — ఆస్వాదించుచున్న, భసల — తుమ్మెదల యొక్క, సుందరగాన — చక్కనిసంగీతము చేత, భాసమానము— ప్రకాశించుచున్నదానిని, అసమా... కీరము. అసమాన — సమానములేని, సహకార — మిక్కిలి పరిమళముగల తియ్యమామిడిచెట్లయందు 'ని. సహకారోఽతిసౌరభః' అ. లసమాన — ఒప్పుచున్న, ఫలవార — పండ్లయొక్క సమూహము చేత, ససమాదర — సన్మానముతో సహితమయిన, కుమార — ఎలప్రాయముగల, సమదకీరము — సంతోషముతోఁగూడిన చిలుకలుగలదానిని, "ని. ముత్ప్రీతిః ప్రమదోహర్షః ప్రమోదామోదసమ్మదాః" అ. అవ...హారము. అవనాదరణ — అవనియందు గౌరవింపఁబడనిదయిన, అనఁగా నతిశయింపనిదైనయనుట. దార — చీల్చుచుండెడు, 'ధా. విదారణే, ధాతు', పవన — వాయువువలన, అలస — మాంద్యముతోఁగూడిన స్వభావముతో, విహార — సంచరించుచున్నవారికి, భవన — ఇండ్లు గాఁగల, 'ని. భవనాగారమందిరమ్' అ. అగ — వృక్షములయొక్క, వ్యు. నగచ్ఛతీత్యగః. 'ని. శైల వృక్షౌనగావగౌ' అ. విస్ఫార — విశాలమయిన, భవ్య — శుభకరమయినట్టి, హారము- మనోహరమయినదానిని, వ్యు. 'హ్రియతే చిత్తమనేనహారః' అవ......విహారము. అవమాన — తిరస్కరింపఁ బడి, లవ — లేశమునైన, తునకలయిన, దూర — దవ్వుగల, పవమాన — వాయువులయొక్క, 'ని. నభస్వద్వాత పవన పవమాన ప్రభంజనాః, అ. సంచార — తిరుగుటవలన, భవ — పుట్టిన, 'ని. భవస్సత్తాయద్రగర్భ ప్రాప్తిసంసారజన్మసు' నానా. మాంద్య — జడత్వముచేత, విస్తార — ఎక్కువయైన, ఫణి — సర్పములయొక్క. 'ని. కుండలీ గూఢపాచ్చక్షుశ్శ్రవాః కాకోదరఃఫణీ' అ. విహారము — సంచారముగలదానిని, 'ని. విహారోభ్రమణేస్కంధే లీలాయాంసుగతాలయే'. మే. అంచిత — ఒప్పుచున్న, విహంగమము — పక్షులుగలిగినదానిని, 'ని. ఖగేవిహంగ విహగ విహంగమ విహాయసః' అ. రాజ...మానము. రాజహంస — ఎఱ్ఱని కాళ్లును ముక్కును గలిగి తెల్లగానుండెడు, రాయంచల యొక్క, "ని. రాజహంసస్తుతేచంచు చరణైర్లోహితైస్సితాః" అ. చంచు — ముక్కులచేత, "ని., చంచుస్త్రోటిరుభే స్త్రియా" అ. దళిత — భేదించఁబడిన, ఫల — పండ్లయొక్క, సారజల—రసముచేతను

నీటియొక్క, "ని. సారో బలే స్థిరాంశేచ మజ్జి పుంసి జలే ఘనే" మే. పూగ – పరివాహ ములతో, మిళిత – కూడినవై, ఫలిత – పండినట్టి, "ని. ఫలితా సత్వవారితౌ" నావా. కలిత – పొందఁబడిన, "ని. కలితం విదితాప్తయోః" విశ్వ. ఘనశాలి గొప్పతనముతో నొప్పుచున్న, నవశాలి – నూతనము లైనవరిధాన్యములుగల, ఖండ – సగపాలుగల – అర్ధభాగములుగల, మండల – దేశము యొక్క, అనఁగాఁ జతురస్రమైన భూమియొక్కయనుట. ఆవరణ – కట్టతోఁగూడియున్న దీవ్యమానసు- బాగుగాఁ బ్రకాశించుచున్న దానిని, ఉద్యానము – ఊరిగాపుననుండి సకలజనులకు భోగార్హమగుయున తోట. "ని. పుమానాక్రీడ ఉద్యానం రాజ్ఞః సాధారణం వనమ్" అ. ఇచట నుద్యానమను మహచ్ఛబ్దము కనుక ముప్రత్యయము వచ్చినది. సూ. "స్యాదనుమహతాం విభక్తౌ సోశ్చము" శబ్దని. ఉరుశ్రీ – ఉరు దానిని, ఇచట ద్వితీయకుఁ బ్రథమ చెప్పఁబడుటకు 'సూ. ఇతరత్రిచ ద్వితీయాతస్యాః ప్రథమాచజడ పదానాంస్యాత్' నన్న. 'సూ. క్వచిదన్య విభక్త్యర్థే ప్రథమాః ప్రదృశ్యతే' అధ. ఈసీసపద్యపు ప్రతిపాదమునను నాలుగంత్యప్రాసములు గలుగఁజెప్పినాఁడు. ఎత్తుగీతియందు 'మిళిత-ఫలిత-కలిత' వృత్త్యనుప్రాసాలంకారము. 'ఘనశాలినవశాలి – ఫలసారజలపూగ – దీవ్యమానసుద్యానము, ఇవి యమకప్రాసాలంకారము.

తా॥ తామరపువ్వులనుండి యప్పుడే వెడలుచున్న మద్యమును పానముసేయుచున్న తుమ్మెదల యొక్క మాధుర్యములగు పాటలచేత నొప్పిదమైనదియును, సాటిలేని యధికపరిమళముగల తియ్య మామిడిచెట్లయందలి ఫలములను భుజించుచు సంతోషముతోనున్న చిలుకలగుంపులు గలదియును వృక్షావలితోదట్టమయినదానియందెక్కువగాఁ జొరశక్యముగాక భేదించుకొనుచు వచ్చుచుండెడు వాయువులవలని మందగమనముతోఁ దత్ప్రదేశమున సంచరించువారలకు గృహమువలెనుండి యానంద మును గలిగించుచున్న గొప్పవృక్షములతో రమ్యమైనదియును, దూరమునుండి చిన్నచిన్నవిగా వచ్చు చున్న చల్లనిగాడ్పుల వరుసలయొక్క గమనమువలన నేర్పడిన మాంద్యభావముచేత నతిశయించిన త్రాఁచుపాములయొక్క విహారము కలదియును, మధురసఫలములు గల వృక్షములపైనుండిన రాజ హంసలు పరిపక్వములయిన ఫలములను దమ ముక్కులతోఁ బొడుచుచుండఁగా స్రవించి వాగులైపారు చుండెడు నీటివలనఁ దమకుఁదామె వృద్ధియై పండినవడ్లు గలిగి చుట్టును గట్టుతోనున్న పల్లపుభూముల సగపాలు గలదియును, అయి యలరారుచున్న భోగార్హమయిన యొక గ్రామసమీపవనమును.

తే॥ చూచి యచ్చోటిమహిమకుఁ ♦ జోద్యపడుచు,
ముమ్మరంబుగఁ బూఁదేనె ♦ మునురు గురియ
నచ్ఛతర గుచ్ఛములమీఁద ♦ నళులు గ్రమ్మ,
దెప్పరంబగులేఁదీఁగె ♦ చప్పరమున. 6

అ॥ చూచి – కనుగొని, ఇచట రెండుపద్యములను గలిపి యన్వయించుటకు 'సూ. పద్యంబు లకుఁ గులకంబగు' ప్రౌ. వ్యా. 'సూ. క్వచిత్కులకసంబంధోఽప్యత్రనాహితకృద్భవేత్, అర్థా హారస్య సంయోగ. త్స్వత్రనైవ సుఖావహః' అధ. ఉదా "తానొకపండుదెచ్చెరన్" "తాని వచ్చెదు" భార, అచ్చోటిమహిమకున్ – ఆప్రదేశమునందలి గొప్పతనమునకు, చోద్యపడుచున్ – ఆశ్చర్యమును జెందుచు, ఇచట 'చోద్యపడుచు' అనుటకు 'సూ, ఆదంతపానిశబ్దేషు పత్యర్థేనిందు

లోపకా వర్ణకస్యాత్రికథితా క్వచిత్సుకవిసమ్మతేః' అథ. ముమ్మరంబుగన్ — అధికముగా, పూఁదేనె. పుష్పములయందుఁగల మధురరసముయొక్క, ఇచట 'పూఁదేనె' అనుటకు 'సూ.శబ్దానామాదిభాగేషు నూతవత్వాదిబోధకాః ఏకద్వివర్ణశబ్దాస్స్యు రర్థభేదేఽపిచక్వచిత్'' అథ. ముసురు — ఎడతెగని వర్షము, కురియన్ — వర్షించుఁగా, అచ్ఛతర — తెల్లనివయిన, గుచ్ఛములమీదన్ — పూగుత్తులపైన, అళులు. — తుమ్మెదలు, క్రమ్మన్ — వ్యాపింపఁగా, దెప్పరంబు — అశక్యము, అగు లేఁదీఁగె — అయినట్టి లేఁతతీఁగలయొక్క, చప్పరమునన్ — చలిపందిరియందు, ఇందు 'అచ్ఛ గుచ్ఛ' అనుప్రాసాలంకారము. 'పూఁదేనెముసురుగురియ' ననుటచే నతిశయోక్త్యలంకారము.

తా॥ చూచి యచ్చటఁ గలవిశేషముల కచ్చెరువందుచు నెడతెగక కురియుచున్న పూఁదేనె సోనలకు సైఁపఁ జాలక తెల్లని పూఁగుత్తులమీఁద వ్యాపించిన తుమ్మెదలతో నతిశయించియున్న యొక లేఁతతీఁగెలుగల చలిపందిరియందు.

## —: రంభా నిరంకుశుల సురతకేళీవర్ణనము :—

సీ॥ వదనచత్వర విస్ఫృ ♦ త్వరరసజ్ఞారవో, న్నిద్రతాదికూలల ♦ ముద్రుజంబుఁ
గనకకంకణఝణ ♦ త్కారసముత్పాత, పంచాంగుళప్రియం ♦ భావుకంబు
మధురాధరోష్ఠస ♦ మంతాన్నిపీడనో, ద్ధత్యానుకంపామి ♦ తంపచంబు
నజ్ఞాతపూర్వర ♦ త్యైన్నత్య పునరుప, క్రమణయాచ్ఞావచో ♦ భ్రంలిహంబు
తే॥ గాఁగ సురతంబు సల్పి యు♦క్కమలముఖియు, నామహీసురసూనుండు♦ నంతఁ జాల
నలసి వలయితదివ్యాంబ♦రావృతాంగు,లగుచుఁదమచేతలకుఁదామె♦నగుచునుండి.7

అ॥ వదన...జంబుక్. వదన — ముఖముయొక్క, చత్వర — ముంగిలియందు, "ని. చత్వరం స్థండిలేంగణే" విశ్వ. విసృత్వర — ప్రసరించుచున్న, "ని. విసృత్వరో విసృమరః ప్రసారీచ విసారిణి" అ. రస — అమృతమును, "ని. శృంగారముఖ్యమధురాది సువర్ణరేతో, నిర్యాస రాగ గరళ ద్రవ పారదేషు, ఆస్వాదనధ్వని సుధాంబుగసాఖ్యధాతు, ష్వష్టో రసోఽధరసనా ధరణీ రసా స్యాత్" నానా. జ్ఞ — తెలియఁజేయఁజేయునట్టి, ఆరవ — రతికాలమునందు గొంతునఁ గలిగెడు గుబగుబ యను ధ్వనివలన, ఉన్నిద్రతా — మేలుకొనియుండుట, జాగరూకత గలిగియుండుట. ఇచట 'ఉన్నిద్రతా' అనుటకు 'సూ. త్వతలో ర్గుణవచనస్య, సిద్ధాం. వ్యా. శుక్లాయాభావః శుక్లత్వం. శుక్లతా. త్వ లౌ రితి, త్వప్రత్యయే తల్ప్రత్యయే చ పరే గుణోపసర్జనద్రవ్యావాచినః పుంవత్త్వం వక్తవ్య మిత్యర్థః. దిక్కూలముద్రుజంబుక్ — దిశలయొక్క దరులనొరయునదియును, అనఁగా దిగంతముల వఱకు [illegible] గల కంఠధ్వని యనుట. కూలముద్రుజ మనునది యేకపదము 'కూల ముద్రుజ తీతి కూలముద్రుజః' 'సూ. ఉది కూలే రుజి వహోః' ఇతిఖచో 'అరుర్ద్విష' దిత్యాది నాముమాగమః. 'ఉదా. కుర్వన్ పరిద్వారిసకూలముద్రుజమ్' రావ. "సరితాం కూలముద్రుజాః" రఘు."దిక్కూలముద్రుజబాటోపాః" ప్రతా. కనక......కంబుక్. కనకకంకణ— సువర్ణమయమైన హస్తాభరణములయొక్క, ఝణత్కార-ఝణఝణయనెడి ధ్వని చేయుచు. సముత్పాత—పైనఁబడుచున్న, సం + ఉత్ + పాత — సముత్పాత. అని తెలియవలెను. పంచాంగుళ—హస్తములయొక్క, ప్రియంభావుకంబుక్ — ఇష్టమును గలుగఁజేయు

నున్నదియును, అనఁగా నొండొరులపై హస్తములుంచఁబడుచున్నయట్టు సుఖ...... చంబుకా. ... — తియ్యనైన, అధరోష్ఠ — క్రిందిపెదవియొక్క, సమంతాత్ — అంతయును, నిపీడన — ... పెట్టుచున్న. అనఁగా. అధరామృతపానము సేయుచున్నయనుట. ఔద్ధత్య — మదించుటనముచేతను. అతిశయముచేతను. అనుకంపా — దయచేతను, మితంపచంబుకా — మితిగాపక్వమైనదట్టియును; ఇచట 'మితంపచ' శబ్దమునుగూర్చి 'సూ. పరిమాణేపచః' 'మితనఖేచ' సిద్ధాం. "ఉదా. ప్రోక్షితంపచాస్తు తే మితంపచాసా" గాన. అజ్ఞా......లిహంబుకా. అజ్ఞాత — అల్పముగాఁ దెలియఁబడిన, "తత్ర దృశ్యమభావశ్చ తదన్యత్వం తదల్పతా, అప్రశస్తి ర్విరోధశ్చ నఞర్థాః షట్ప్రకీర్తితాః" ప్రథమసంభోగముయొక్క, ఔన్నత్య — ఆధికముచేత, అనఁగా ... లయుక ... గాఁ దెలియకుండుటచే ననియర్థము. పునరుపక్రమణ — మరల నారంభించుటయు, ప్రార్థనా — అడుగుటయు నెడ, వచో—వాక్యములయొక్క, అభ్రంలిహంబుకా — ఆకాశము నాస్వాదించుట కలిగినట్టియును, అనఁగాఁ బునస్సంగమమునకుఁ బ్రార్థించుచున్న మాటలయొక్క ధ్వని యాకసము నంటుచున్నదనుట. కాఁగకా — అగునట్లుగా, సురతంబుసల్పి — సంపర్కముచేసి, అక్కమలముఖియుకా — పద్మమువంటిముఖము గలదయిన యారంభయును, ఇచట 'అక్కమలముఖి' అనుచోట "సూ. ఇదముద సేతద్వ్యతిచ్ఛ... రాన్వయే బహుళంప్రహ్వస్వంప్రపద్య దీర్ఘాన్వితత్వముపర్యక్షరస్యజనయంతి" సన్న. "ఊష్మరేఫాన్వినా ద్విత్వమయుక్తస్యహలోమతః, ఋకారంచవిముచ్యస్యాత్ప్రాణానాంద్విత్వసంగతిః" అథ. ఆమహీసుర తనయుండుకా — బ్రాహ్మణునికొడుకయిన యానిరంకుశుఁడును, అంతకా. అంతట, చాలకా + అలసి — ఎక్కువగా బడలినవారై, వల......సులు. వలయిత— చుట్టును జుట్టఁబడిన, దివ్యాంబర — మనోహరమయిన వస్త్రములచేత, ఆవృత — ఆవరింపఁబడిన, చుట్టుకొనఁబడిన, అంగులు — శరీరము గలవారు, అగుచుకా — అయి, తమచేఁతలకుకా — ఆయిరువురు చేసినపనులకు, తామె — వారంతట వారే, నగుచునుండి — నవ్వుకొనుచునుండి, ఇందు 'వదన...జంబు' 'పునరుప...లిహంబు' అనుక్తవిషయస్వరూపోత్ప్రేక్ష. "క. ఫలతను హేతుత వస్తుత, నలరెడు సంభావనంబు లగు నుత్ప్రేక్షల్, తొల్లిరెండును సదసద్విష, యము కథితాకథితవిషయ యంతియుయు నగుకా" అలం. సా. సం. ఈపద్యమంత్యానుప్రాసముతోఁ జెప్పఁబడినది. ఉదాత్తాలంకారమును. "ఉదాత్తం వస్తుతః సంపత్, మహతాం చోపలక్షణమ్" కా. ప్ర. 'ఉత్సాహభావమును. క. అత్యున్నతలోకోత్తర, కృత్యంబులు సేయ వేఁడి కృతకృత్యు విలకా, నిత్యముఁ దలఁచుప్రయత్నం, బత్యంతోత్సాహ మయ్యె" కా. సం. "వదన...జంబు" ఇత్యాదులచే సంభోగావస్థ వర్ణింపఁబడియున్నది. "అనుకూలే నిషేవేతే. యత్రాన్యోన్యం విలాసినౌ, దర్శనస్పర్శనాదీని స సంభోగఉదాహృతః" ఉదా. త్వం ముగ్ధాక్షి వినైవ కంచులికయా ధత్సే మనోహారిణీం, లక్ష్మీ మిత్యభిధాయిని ప్రియతమే తద్వీటికాసంస్పృశి, శయ్యోపాంతనివిష్టసస్మితముఖీనేత్రోత్సవానందితో, నిర్యాతః శనకై రలీకవచనోపన్యాస మాలీజనః" అమరు. "గాఢాలింగన పీడనస్తనతటంస్విద్యత్కపోలస్థలం, సందష్టాధరముక్తసీత్కృత ముఖభ్రాంతభ్రునృత్యత్కరం, చాటుప్రాయవచో విచిత్రమణితం ఘాతైరుతైశ్చాంకిత, వేశ్యానాంధృతిధామపుష్పధనుషః ప్రాప్నోతి ధన్యోరతమ్" శృం. తి. రంభానిరంకుశులు సంభోగముచే నలసియుండి రనుటకుఁ బ్రా. "మహాస్రగ్ధర. ఒకనాఁ డామ్రాంకురోఘం బురుకుసుమకుడుంగోదరక్షోణితల్పప్రకరంబై కాంక్షచేము నృతులఁ బదరిపైఁ బ్రౌఢివాటించినట్టూ, ర్పికదొట్టకా దస్సి వీరాయితమరిమఱితారెట్లొమున్నట్లయాసా, యికలం గందర్పు డోటంబెటిఁగితమివీఁ పైన్నానంటితోటకా" అను. మఱియు

"కాషత్కాంపపయోధరింగనుకితీ [illegible] ప్రహారాన్వితం, స్విన్నత్వాత్ [illegible] నేక హాస్యాస సం [illegible] త్యాదివ్యక్తి [illegible], [illegible] ప్రహారతుభగం [illegible] [illegible] [illegible] [illegible] [illegible]" [illegible] [illegible] "సీ. [illegible]" [illegible] శ్రీనాథుని "సీ. [illegible] [illegible] [illegible] [illegible] [illegible] 61 [illegible] [illegible] [illegible] [illegible] [illegible]

తా॥ ముఖమునందు వ్యాపించుచున్న యమృతమును దెలియఁజేయుచున్న రతికాలమున గొంతుకఁ గలిగెడు సుబసుబధ్వనివలన జాగరూకత వహించియున్న దిగంతములు గలదియును, కాంచనమయము లగు హస్తాభరణములయొక్క ఘణఘణయనెడు ధ్వనులతో నొండొరులపైఁ బడుచున్న హస్తములవలన స్నేహమును బుట్టించుచున్నదియును, తీయని యధరామృతపానము నెక్కువగాఁ జేయుటవలనఁ గనికరముతోఁ గూడి మిక్కిలి సన్నమైన మోవిగలదియును, ప్రథమసంభోగాతిశయము బాగుగాఁ దెలియకయుండుటచేత మరల నారంభించుటకుఁ బ్రార్థించుచున్న పలుకులయొక్క ధ్వని యాకసము నంటుచున్నదియును, అయిన సంభోగమునుజేసి యారంభమునందు నిరంతరసురతమును జాలశ్రమ నొంది యందమైన తమవస్త్రములను మొలచుట్టుఁ జుట్టుకొని యాయిరువురు చేసినపనులకుఁ దమలోఁ దామే నవ్వుకొనుచుండిరి.

ఉ॥ జారినకుంతలంబులు పొ ♦ సంగఁగ దువ్వుచుఁ జల్వపయ్యెదన్
దోరఘుఘర్మబిందువులు ♦ దూలఁగ వీవుచు వీడియంపుఁ గ
ర్పూరపువాసనల్ దిశలఁ ♦ బొల్పడ నించి మనోభవాహవో
దారకళావిశారదుఁడ ♦ వౌదువురా యని తన్ను మెచ్చుచోన్ 8

అ॥ జారినకుంతలంబులు — ముడివీడినతలవెండ్రుకలు, 'ని. చికురఃకుంతలోవాలః కచఃకేశః శిరోరుహాః' అమ. పొసంగఁగన్ — ఒప్పునట్లుగా, దువ్వుచున్ — నున్నఁగాదువ్వికొనుచు, చల్వపయ్యెదన్ — ధౌతవస్త్రముయొక్క మైజారున, తోరఘుఘర్మబిందువులు — అధికమయిన చెమటబొట్లు, 'ని. ఘర్మోనిదాఘఃస్వేదః' అ. తూలఁగన్ — చలించునట్లు, వీవుచున్ — విసరికొనుచు, అనఁగాఁజెమటయారునట్లు విసరికొనుచుననుట, వీడియంపుఁ గర్పూరపువాసనల్ — తాంబూలముయొక్క కప్పురముతోఁగూడిన పరిమళము, ఇచట 'వీడియంపుఁగర్పూరపు' అనుచోట్లఁ బుగాగమమును గూర్చి "సూ. సామానాధికరణ్యేతు ♦ బహుత్వార్థపరేఽపిచ, సుబ్వ్యర్థవేతాం ప్రంప్వాఖ్యావాదేశావగ్రసర్వదా" అథ. దిశలన్ — దిక్కులయందు, పొల్పడన్ — వ్యాపింపఁగా, నించి .. నిండింపఁజేసి, మనో......డవు. మనోభవ + ఆహవ — మన్మథునియొక్క సంగరమునందు .. సంభోగమునందు, ఉదార — అధికమయిన, 'ని. ఉదారోదాతృమహతోః' అ. ఉదా. 'ఉదారమతయః' సం.. బిల్హ. 'ఉదారకీర్తేః' కిరా. కళా . విద్యయందు, 'ని కలా స్యాన్మూలవృద్ధౌ [illegible]

సీ॥ కారుణ్యరసవృష్టిఁ ♦ గమనీయతనుయష్టి, చిగిరించెనా జటా ♦ శ్రీ దలిర్ప
నమృతఘనీభావ ♦ మనఁగ నొప్పువిభూతి, ధవళితాంగమరీచి ♦ దివిఁ జెలంగ
హస్తాంబుజంబుపై ♦ నాడుషట్పదపరంపరయో నాఁగ రుద్రాక్ష ♦ మాల తనర
సముదంచితానంద ♦ జలధి ఘూర్ణిలుమాడ్కి, మారుతాహతిచేత ♦ మహతి మ్రోయ

తే॥ ప్రకటతేజోవిశేషంబు ♦ బాలసూర్య, సృష్టి గావింప నయనసం ♦ తుష్టి గాఁగ
నరుగుదెంచుచున్నవాఁ ♦ డభ్రవీథి, నీతఁ డెవ్వాఁడొ దివిజపు ♦ రేందువదన. 10

అ॥ దివిజపురేందువదన — నిండుచంద్రునివంటి మోముగల యో దేవలోకకాంతా, కారుణ్యరసవృష్టిన్ — దయారసముయొక్క వర్షముచేత, దయయనెడు జలముచేతననియుఁ జెప్పవచ్చును. ఇచట 'కారుణ్యరస' మనుటకు. "సీ. కరుణారసము సొంపగి తొరఁగఁగ నామన్న, శశిరేఖ నమృతంబు జాలువాఱ" భార. రసశబ్దమునుగూర్చి 'ని. శృంగారాదౌ కసాయాదౌ ♦ ఘృతాదౌ చ విషే జలే, నిర్యాసే పారదే రాగే వీర్యే చ రస ఇష్యతే' నానా. "సుకేశరాగేద్రవేరసః" యాద. కమనీయతనుయష్టి — ఇంపైన దండమువంటి దేహము, అనఁగా సన్నని మేను. చిగిరించెనాన్ — పల్లవించెనేమో యనునట్లు జటాశ్రీ — జడలయొక్క సంపద, తలిర్పన్ — అతిశయించఁగా, అమృతఘనీభావము — సుధయొక్క గడ్డకట్టుట, అనఁగన్ — అనునట్లుగా, ఇచట అమృతశబ్దమునుగూర్చి 'ని. పీయూష మమృతం సుధా' అ. ఒప్పువిభూతి — ప్రకాశించుచున్న భస్మముచేత, ధవళిత — తెల్లనయియున్న, అంగమరీచి — శరీరముయొక్క కాంతి, దివిన్ — ఆకాశమునందు, చెలంగన్ — ఒప్పఁగా, హస్తాంబుజంబుపైన్ — తామరపూవువంటి చేతిమీఁద, ఆడుషట్పదపరంపర — వర్తించుచున్న తుమ్మెదలయొక్క పరంపరయో నాఁగన్ — అనునట్లు, రుద్రాక్షమాల — రుద్రాక్షలతోఁ గూడినజపమాలిక, తనరన్ — ప్రకాశించఁగా, సముదంచితానందజలధి, సముదంచిత — ఒప్పుచున్న, ఆనందజలధి — సంతోషమనెడుసముద్రము, ఘూర్ణిలుమాడ్కిన్ — ధ్వనిచేయునట్లుగా, అనఁగా సముద్రఘోషవలె ననుట. మారుతాహతిచేతన్ — వాయువులయొక్క తాఁకుడుచేత, మహతి — నారుతంత్రులు గలదయిన తనయొక్క వీణ, 'ని. వీణాభేదేఽపి మహతీ' అ. మ్రోయన్ — మ్రోయుచుండఁగా, ఇచట నారదునివీణ మహతి యనుటకు 'ని. విశ్వావసోస్తు బృహతీ. తుంబురోస్తు కలావతీ, మహతీ నారదస్య స్యాత్, సరస్వత్యాస్తు కచ్ఛపీ' వైజ. ప్రకటతేజోవిశేషంబు. ప్రకట — స్పష్టమయిన, తేజోవిశేషంబు — దీప్తియొక్క యతిశయము, బాలసూర్యసృష్టిగావింపన్. బాలసూర్య — ఉదయించుచున్నట్టి సూర్యునియొక్క, సృష్టి — పుట్టుకను, కావింపన్ — కలుగఁజేయుచుండఁగా, నయనసంతుష్టి. నయన — కన్నులకు, సంతుష్టి — ఆనందము, కాఁగన్ — కలుగఁగా, అభ్రవీథిన్ — ఆకాశమార్గమున, 'ని. ద్యోదివౌ ద్వే స్త్రియామభ్రం వ్యోమపుష్కరమంబరమ్' అ. అరుగుదెంచుచున్నవాఁడు — వచ్చుచున్నవాఁడు, ఈతఁ డెవ్వాఁడు — ఈపురుషుఁ డెవ్వఁడైయుండును, ఇచట 'ఈతఁడు' విశేష్యము ఉద్దేశ్యము 'ఎవ్వాఁడు' విధేయము. 'సూ. ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' ప్రౌ. వ్యా. 'ప్రకటతేజోవిశేషంబు బాలసూర్యసృష్టిగావింప' రూపమాలంకారము. పద్యమంతయు నుత్ప్రేక్షాలంకారము. "సంభావనమథోత్ప్రేక్షా ప్రకృతస్య సమేన యత్" కా. ప్ర. 'ఆనందజలధి-హస్తాంబుజము' రూపకాలంకారము. 'వృష్టి యష్టి' అనుప్రాసాలంకారము.

దోర్వీర్యంబు సాలించి యుంచదను పాటింగ' నిన్న. చ. 'ప్రియములే సెప్పిన నన్నుగైకొనక దర్పిం. చిల్లు జాల్మత్వ ద్యున్నయశీలంబున నూరకుండితివి' హై. భా. వృథా యను ప్రయోగమునకు ఋషా. అన్య యస్యేతరస్యాపి ప్రయోగో విష్ణుశర్మణాకృత స్వర్భవస్యాపి దీర్ఘాంతత్వం క్వచిద్భవేత్. అథ. ఉదా......'నీవు నిది చేసినదేమి వృథా శపింతువే' స్వా. ను. ఇందు ద్వితీయపాదమున సమాసగత మైన 'ఉ' కారమునకును విశ్రమస్థానమునఁ గల బకారముపైనున్న ఉకారమునకును ఖండయతి చెప్ప బడి యున్నది. ఉదా, జాంబవద్వీపమునందు గొప్పులకు నిపుణ్యగి కేయుటయును ప్రసన్నమై, అ.ని. కావ్యా లూ, 'కానీవీనికిగా నొకానొక' అనుప్రాసాలంకారము.

తా॥ కానిమ్ము యింపునమి త్తమై యూనునిపతితో నేనియో యుక్త ప్రస్తావము పలికెదను నా నేవ్వుకోలఁదని విశదీకరించి కొంతతగవును చెంచుటకుఁ దావున్నదిగదా విమన ప్రదేశములఁ ద్రిమ్మి వెలసి నిష్ప్రయోజనము. దేవలోకమున నిందుని సభకుఁ బోవనిదియు మంచిదయినది. అని తనలోఁ దానూహించుకొనుచుఁ గాంతుతో నేగను.

వ॥ అంత నక్కాంతాతిలకం బాతనితో నిట్లనియె, 17

అ॥ అంతఁ — అంతట, అక్కాంతాతిలకంబు — చక్కనిదై యొప్పుచున్న యారంభ, అతని తోఁ — ఆనిరంకుశునితో, ఇట్లనియెన్ — ఈచెప్పఁబోవువిధముగాఁ బలికెను. ఇందు 'అంతనక్కాంత' అనుప్రాసము.

—: రంభ విచారపడుట :—

ఉ॥ ఎక్కడివాఁడ వోయి యొక • యింతయెఱుంగవు బుద్ధికౌశలం
బెక్కడి కేగె నాలుకప • యున్నువుగింజయు నానసట్టి బ
ల్తక్కరి నారదుం డతఁడు • దైవతమార్గమునందు నేగఁగా
నక్కట నన్నుఁ బేర్కొనితి • వాతఁడువిన్న ననర్థమొందదే. 18

అ॥ ఓయి — ఓ బ్రాహ్మణుఁడా, ఎక్కడివాఁడవు — ఎక్కడినుండివచ్చితివి, ఒకయింత యెఱుంగవు — కొంచెమైనను దెలిసికొనలేవు, బుద్ధికౌశలంబు — మతియొక్క నేర్పరితనము, ఎక్కడి కేగెన్ — ఏస్థలమునకుఁబోయెను, ఏమయ్యెను, అతఁడు.. ఆముని, నాలుకపయిన్ — నాలుకమీఁద, రసజ్ఞాతలమున, నువుగింజయున్ — ఒక్కనువ్వుగింజసైతము, ఒక్కతిలబీజమైనను, నానసట్టి — నాను నంతటి కాలమైనను నిదానమును గుట్టునులేని, బల్ — అధికమైన, తక్కరి — మోసగాఁడయిన తక్క + అరి — తక్కరి. ఇదిటక్కరిరూపాంతరము, నారదుండు — కలహములుపెట్టువాఁడైన నారదమహర్షి, దైవతమార్గమునందున్ — దేవతలకు సంబంధమైన యాకాశపథమునందు, ఏగఁగాన్ — పోవుచుండఁగా, అక్కట — అయ్యో, ఇది సంతాపార్థకము, నన్ను బేర్కొనితివి — నాపేరునఁబిలుచు చున్నావు, ఇచటన్ పేర్కొనెదవు, అనియైననుండవచ్చును, నాతనికిఁ దెలియునట్లునాపేరుతోఁ బిలుచు చుంటివనుట, అతఁడువిన్నన్ — అతఁగవులమారి ముని వినినట్లయిన, అనర్థమొందదే — కీడుగలుగదా,

ఈపద్యమున 'నన్ను బేర్కొంటివి' అనుటకు 'సూ. వర్ణాగమోవిశేషః పురుషే ష్వక్షేషు చాపి వచనేషు' శబ్దచిం. నీవు పేర్కొనుటచే మనకు కష్టము సంభవించు నను హేతువుచేఁ గావ్యలింగము, 'కావ్యలింగం హేతోర్వాక్య పదార్థతా' కా. ప్ర.

తా॥ ఓయీ! ఎక్కడి కష్టముతెచ్చిపెట్టితివి. నీవు గొంతెత్తి నన్ను బిలిచితివే నీమతియేమైనది? నాలుక మీఁద నువ్వుగింజ నానునంతటి కాలమైనను నిదానము లేని గుట్టునులేని ముక్కంటి మోసగాఁడయిన నారదుఁ డాకసమునఁ బోవుచుండఁగా నయ్యో నాపేరుతోఁ బిలుచుచుంటివి. ఆతఁ డీమాట విని నట్లయిన మనకింక కష్టము గలుగదా.

క॥ ఆతఁడు విన్నప్పుడె పురు, హూతుఁడు వినుటయును బుద్ధి ♦ నూహింపు శచీ
నేత వినెనేని వెతయగు, చేఁతయె కా తెలిసికొనుము ♦ సిద్ధము గాఁగన్. 19

అ॥ బుద్ధిన్—నీమనసునందు, ఊహింపు—తర్కింపుము, ఇచట ముపర్ణలోపమునకు 'సూ. ప్రార్థనార్థే ముకేత్వేకత్వయోమన్యమార్థకః, విభాషాంతంపదం త్వేకే, సప్రాణేతుకవాచన' అధ. ఆతఁడు—ఆనారదుఁడు, విన్నప్పుడె—వినినకాలముననె, పురుహూతుఁడు—ఇంద్రుఁడు, వినుటయును—ఆలకించుటయును, ఇచటఁ గ్రియాన్వయి వాక్యంబు వ్యంగ్యముద్యోతకంబగుటకు 'సూ. క్రియాన్వయవాక్యంబులు కొన్ని వ్యంగ్యార్థద్యోతకంబులగు' ప్రౌ. వ్యా. శచీనేత—శచీదేవికి భర్తయగు నాయింద్రుఁడు, వినెనేని—ఆకర్ణించినట్లయిన, వెతయగు చేఁతయకా. కష్టముకలుగునట్టి, పనియే కదా ఇచటను వ్యంగ్యార్థద్యోతకముకలదు. 'చేఁతయకా' అనుటకు సూ. 'అకానిత్యర్థకంబగు' ప్రౌ. వ్యా. ఉదా. అపజయముకాలక్షించి, భార. సిద్ధముగాఁగన్—నిక్కముగా, తెలిసికొనుము—ఎఱుంగుము, ఇందు రంభయొక్క పాండిమనాయికాత్వము చెప్పఁబడినది. 'క. అన్యయనఁగ నన్యోన్యయు' అనిచంద్రా. అని నరన. అలం. అక్రమాతిశయోక్తి "అక్రమాతిశయోక్తి స్స్యాత్ సహత్వే హేతుకార్యయోః" అనిచంద్రా. ఈపద్యమున విషాద మను భావము చెప్పఁబడినది.

తా॥ అతఁడు వినఁగానే యింద్రునకుఁ జెప్పును. ఇంద్రుని వినిఁబడెనని కష్టముగలుగు పనియే కదా! రూఢిగాఁ దెలిసికొనుము.

గీ॥ మనము చేసినసుకృతసం ♦ పద సతంబు, వినక పోయిన బ్రతికితి ♦ మనఘవర్య
విన్నయప్పుడె యొకకీడు ♦ వెదకుఁ గాని, మానినెట్టిపతంత్రంబుఁ ♦ గానలేఁడు. 20

అ॥ అనఘవర్య—పుణ్యపురుషుఁడవైన యోనిరంకుశుఁడా, మనము—మనమిరువురమును, ఇచట 'సూ. ఉభయార్థే భవేదత్వమర్థభేదేక్వచిన్నతత్' అధ. 'సూ. భూయఉభయార్థవాచీయః కశ్చిద్భవతి నిత్యబహువచనః తస్యజనోముశసోల' శబ్దచిం. చేసిన సుకృతసంపదన్—పూర్వము చేసికొనిన, పుణ్యముయొక్క యతిశయముచేత, అతఁడు—ఆనారదుఁడు, వినకపోయినన్—వినకుండవెళ్లినట్లయిన, బ్రతికితిమి—సుఖముగాజీవించుదుము, విన్నయప్పుడె—వినినకాలముననే, ఒకకీడు వెదకున్—ఒక చేటును గలుగఁజేయుట కాలోచించును, కాని—అయినప్పటికిని, మాని—ఆబుషి—పెట్టినతంత్రంబున్—పన్నినయుక్తిని, 'ని. తంత్రంకుటుంబకృత్యేస్యాత్సిద్ధాంతే చౌషధోత్తమే, పరిఘానేతంతు

వాయేచశాస్త్రభేదే పరిచ్ఛదే' మే. కానలేఁడు — కనుఁగొనజాలఁడు, అనఁగా నారిమెండెంత చెప్పిన నంతయే తప్పక జరుగుచునుట, ఇందు 'మునియదృష్టమువలన నామహర్షి విశసించినచో మనము బ్రతుక గలము దురదృష్టవశమున నీపలు కతనిచెవిఁ బడినచోఁ గష్టముతప్పదు' అనుటచే విషాదమనుసంచారి భావమువిస్పష్టమగుచున్నది. "విషాదశ్చేతసో భంగ ఉపాయాపాయచింతనైః" అనిపరితా.

తా|| మనయిరువురి పూర్వపుణ్యసాఫల్యంబున నతఁడు వినకుండ వెళ్లెనేని బ్రతుకఁగలము. వినిన తోడనే యొకకీడు గలిగించ బ్రయత్నించును. అయిన నీబుషిపన్నుగడల నాయింపురిఁడు తెలిసి కొనలేఁడు.

## —: ధర్మశీలుఁడు ప్రశ్నించుట :—

క|| ఆమాట విని యొకించుక, భూమీపతి నవ్వి మౌని ♦ పుంగవ కరుణా
ధాముఁ డగు నారదునకే, భామామణి యింత యేల ♦ భయపడియె నొకో. 21

అ|| ఆమాట—ఇట్లుచెప్పిన యాపులహానివాక్యమును, విని— ఆలకించి. భూమీపతి — పృథివికిఁ బతియైన యారాజు, ఒకించుకనవ్వి — చిఱునవ్వునవ్వినవాఁడై, మౌనిపుంగవ — ఓయుని శ్రేష్ఠుఁడా, కరుణాధాముఁడు — దయకునివాసమయినవాఁడు, అగునారదునకే — అయినట్టి నారదునినిగూర్చిన మాత్రమునకే, భామామణి — ఆరంభ, ఇంత — ఇంతగొప్పగా, ఏలభయపడియెనొకో . ఎందుకు భీతిఁజెందెనొకొ దా, అనఁగా నాతోపకుఁడుఁ గోపముఁలేనివాఁ డింతలోనే యారంభ భయపడియ పడనునుట, ఇందు హాసమనుభావము చెప్పబడెను 'వికృతి దర్శనాదిజన్యా ముఖవికాసో హాసః' పరితా.

వ|| అని యడిగిన ధర్మశీలునకుఁ బులహుం డిట్లనియె. 22

అ|| అని — ఇట్లని, అడిగినధర్మశీలునకున్ — ప్రశ్నించిన ధర్మశీలుండనురాజునకు, పులహుఁడను మహర్షి, ఇట్లనియెన్ — ఈప్రకారముగాఁ జెప్పెను.

## —: పులహుని సమాధానము :—

సీ|| దివిజకాంతామణి ♦ యవనీస్థలంబున, కరుదెంచు టపరాధ ♦ మౌన కాద?
అది యునుంగాక మో ♦ హావేశమున మర్త్యు, ననుభవించుట నేర ♦ మౌన కాద?
ఇంత మాత్రమె చాల ♦ కే ప్రొద్దు వానికి, ననుకూల యాటకే ♦ ప్పౌన కాద?
అది కారణంబుగ ♦ నమరేంద్రు సేవకు, నరుగమి యాగడం ♦ బౌన కాద?

తే|| చూడు మా యెన్నివిఘములుఁ ♦ జూచికొన్న, రంభ యెడ దుండగమెధరా ♦ రమణవర్య
యది యెఱిఁగి చేరరాదయ్యె ♦ నమరమౌని. కొండెగానితనానకు ♦ గురువు గాన. 23

అ|| ధరారమణవర్య — రాజులలో శ్రేష్ఠుఁడవైనవాఁడా, దివిజకాంతామణి — దేవలోకమున నుండెడియావేశ్య, అవనీస్థలంబునకున్ — భూలోకమునకు, అరుదెంచుట — వచ్చుట, అపరాధము—

అతండు — ఆయింద్రుండు, ఏమనిశాసించునో — ఏవిధముగ నాజ్ఞాపించునోకదా. ఇచట 'ఏమని' అనుటను 'సూ. ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగానగు' బా. వ్యా అని — ఇట్లుతలంచి, ఆ మౌనిని - ఆమానవతి, అతనికిన్ - ఆనారదునకు, అంత - అంతయనేకసుగా, అలికెంబాఱెన్ - భయపడెనుసుమా.

—: నారదుండింద్రసభకుం జేరుట :—

వ॥ ఇట్లుండె నట నారదుండు చని యెదుట హాహాహూహూముఖ్య విఖ్యాతగాయన గేయ నవీన మాధురీ ఝరీతరంగనినదాయమాన మేనకాద్యప్సరః పాత్ర విచిత్రకంకణ ఝుణత్కారచామీకర మేఖలాకింకిణీ ఘళఘళనూపుర కలకలధ్వనులచే సంతసించుచు సంతతవందమానత్రయస్త్రింశత్కోటిదేవతా సంసేవ్యమానుండై రత్న సింహాసనంబున నాసీనుండై యున్న సహస్రలోచనుం గాంచి నిలిచిన. 26

అ॥ ఇది - ఈవృత్తాంతము, ఇట్లుండెన్ - ఇటులుండనిమ్ము, అట- అక్కడనుంచి, నారదుండు- ఆనారదమహర్షి చని- పోయి, ఎదుటన్-తనముందు, హాహా......ధ్వనులచే-హాహా...... హూహూ- హాహాహూహూవులను పేరుగల, ముఖ్య - గంధర్వ ప్రముఖులలో, విఖ్యాత - ప్రసిద్ధిగల, గాయన సంగీతమును బాడునట్టి పురుషులయొక్క, గేయ - పాట, నవీన - నూతనమైన, మాధురీ - మాధుర్య మనెడు, ఝరీ - ప్రవాహముయొక్క తరంగ - అలలతోడి, నినదాయమాన - ధ్వనించుచున్న, మేనకాది - మేనక మొదలగు, అప్సరః - దేవవేశ్యలలో అప్సరః, నీళ్లనుండిలేచినవారు అనివ్యు. "అప్సు నిర్మథనాదేవరసాత్తస్మాద్వరస్త్రియః ఉత్పేతుర్మనుజశ్రేష్ఠ తస్మాదప్సరసోఽభవన్" పాత్ర - నాట్యమాడెడుస్త్రీయొక్క, విచిత్ర - చోద్యమైన, కంకణ - హస్తాభరణములయొక్క, ఝుణఝుణ త్కార - ఝుణఝుణయనిమ్రోగుచున్నట్టియు, చామీకర - సువర్ణమయమైనమేఖలా - మొలనూలు యొక్కయు, కింకిణీ - చిఱుగంటలయొక్కయు, ఘళఘళ - ఘళఘళయనెడు, నూపుర-కాలియందెల యొక్కయు, కలకలధ్వనులచేన్- కోలాహలారావములచేత అనఁగా బహువిధములగు నినాదములచే ననుట, సంతసించుచున్ - సంతోషపడుచు, సంతత......మానుండై, సంతత- ఎడతెగని, వందమాన- నమస్కరించుచున్న, త్రయస్త్రింశత్కోటి - ముప్పదిమూడుకోట్ల, దేవతా - దేవతలచేత, సంసేవ్యమానుండై - కొలువబడుచున్నవాఁడై, రత్నసింహాసనంబునన్- దేవలోకమునఁగలమణులతోనిర్మింపఁబడిన రాజపీఠమునందు, సింహాసన మనఁగా సింహముఖమేర్పఱచియుండు కనకమయ మగు నున్నత పీఠము. ఆసీనుఁడై - కూర్చున్నవాఁడై, ఉన్న సహస్రలోచనున్ — ఉండిన, వేయికన్నులుగల యాయింద్రుని, కాంచి - వీక్షించి, నిలిచినన్- నిలఁబడఁగా, 'ముఖ్యవిఖ్యాత-గాయనగేయన-మాధురీ ఝరీ-పాత్రవిచిత్ర-కంకణఝుణఝుణ ఇత్యాదులనుప్రాసాలంకారము.

తా॥ దీనినిట్లుండనిమ్ము. అచ్చటినుండి కలహభోజనుం డరిగి తనయెదుట హాహాహూహూవు లనెడు గంధర్వప్రముఖులలోఁ బ్రసిద్ధికెక్కిన సంగీతవిద్యాధనులయొక్క గానమునందలి మాధుర్య మనెడు ప్రవాహముయొక్క యలలతోఁగూడి ధ్వనించుచున్న మేనక మొదలగు దివిజవేశ్యలలో నర్తకి యొక్క వింతయైన హస్తాభరణములయందలి ఝుణఝుణ యనుమ్రోఁతయొక్కయు,నపరంజి మొలనూలు

యొక్కయు, గిలుకుటలయొక్కయు ఘళ్ళుఘళ్ళయను కాలియందెలయొక్కయు మిశ్రితశబ్దములచేత నానందమునొందుచు ననిశము నమస్కరించుచున్న ముప్పదిమూఁడుకోట్ల దేవతలచేఁ గొలువఁబడుచు దివ్యమణులతో రచింపఁబడిన రాజపీఠమునందుఁ గూర్చుండిన వేయికన్నులవానిం గాంచి నిలువంబడఁగా.

—: ఇంద్రుఁడు నారదుని సమాచారములడుగుట :—

క॥ మునినాథుఁ గాంచి సురపతి, ప్రణుతసమారాధనార్ఘ్య ♦ పాద్యాదివిధు
ల్వినయమున నొసఁగి యర్హా,సనమునఁ గూర్చుండ నునిచి ♦ సలలితబుద్ధిన్. 27

అ॥ సురపతి - ఆదేవతాప్రభువు, మునినాథున్ - మునులలో శ్రేష్ఠుఁడగు నారదుని, కాంచి - వీక్షించి, సలలితబుద్ధిన్ — ప్రకాశించుచున్న తెలివితో, ప్రణుత......విధుల్, ప్రణుత - స్తోత్రము చేయఁబడిన, సమారాధన - పూజించుటయును, అర్ఘ్య - పూజాద్రవ్యమును, పాద్య - పాదోదకమును, ఆది - మొదలుగాఁగల విధుల్ - విధానములను, చేయుటలను, వినయమునన్ - నీతితో, ఒసంగి - ఇచ్చి, అర్హాసనమునన్, అర్హ - ఉచితమైన, ఆసనమునన్ - పీఠమునందు, కూర్చుండనునిచి - ఉపవిష్టుఁడగునట్లుచేసి,

తా॥ దివస్పతి యమ్మునిశ్రేష్ఠునిఁజూచి తనబుద్ధికుశలత దీపింపఁ బూజాద్రవ్యమును బాదోదకము నిడి తగినపీటయందు గూర్చుండఁజేసి.

క॥ మునియనుమతిఁ దానుచితా, సనమునఁ గూర్చుండి సత్ప్ర ♦ సంగంబున నో
యనఘాత్మ యెచటి కరుగుచుఁ, జనుదెంచితి రిటకు నాదు ♦ జన్మఫలమునన్! 28

అ॥ మునియనుమతిన్ - ఆనారదునియొక్క సమ్మతితో, తాన్ - ఆయింద్రుఁడును, ఉచితాసనమునన్ - తనకర్హతగల సింహాసనమున, కూర్చుండి - ఆసీనుఁడై, సత్ప్రసంగంబున్ - మంచిప్రస్తావనతో, ఓయనఘాత్మ - ఓపుణ్యపురుషుఁడా, ఎచటికరుగుచున్ — ఎచ్చోటికి బోవుచు, నాదుజన్మఫలమునన్ - నాయొక్క జననకాల శుభప్రాప్తివలన, ఇటకున్ - ఇచ్చటికి, చనుదెంచితిరి - వచ్చితిరి, ఈ బహువచనప్రయోగమునకు "స్యాత్పూజ్యత్వ వివక్షాయాం మహతాం బహుతా సతా" అని యర్థ. ఇచట ప్రస్తావనవశమున నారదునడుగుటయు నాతఁడు రంభయొక్క కృత్యములను జెప్పుటయును యుక్తి యుక్తమే 'సూతాః పౌరాణికాః ప్రోక్తా మాగధా వంశశంసకాః, వందినస్త్వమలప్రజ్ఞాః ప్రస్తావసదృశోక్తయః' అనిశాస్త్రము. 'మునియనుమతితానుచితా' అనుప్రాసాలంకారము.

తా॥ ఆసంయమిసమ్మతితోఁ దానును దనసింహాసనమునఁ గూర్చుండి మంచిప్రసంగసందర్భమున నోపుణ్యాత్మా! ఎచ్చటికేఁగుచు నాయదృష్టవశమున నిటకుదయచేసితిరి?

—: నారదుఁడు రంభనేరములఁజెప్పుట :—

క॥ అన విని ముని దరహసితా, ననమున సురలోకనాథ ♦ నానాదశలం
జని భువిని జిత్రమొక్కటి, గని వచ్చితి మీకుఁ దెలుపఁ ♦ గాఁ బనిగలదై. 29

అ॥ అనన్ - ఇట్లుపలుకఁగా, విని - ఆకర్ణించి, ముని - ఆనారదుఁడు, దరహాసిత - చిఱునవ్వుతోఁగూడిన, ఆననమునన్ - ముఖముతో, సురలోకనాథ - ఓస్వర్గాధిపతీ, నానాదిశలన్ - అనేకదిక్కులకు, చని - పోయినవాఁడనై చిత్రము - ఆశ్చర్యము, ఒక్కటి - ఒకటి, కని - చూచి, మీకుఁదెలుపఁగాన్ - దానిని మీకుఁజెప్పుటకు, పనిగలనై - కార్యముగలవాఁడనై, వచ్చితిన్ - ఏతెంచితిని, నారదుఁడు కలహములను బెట్టువాఁడగుటయేకాక యింద్రుని ప్రసంగవశమయినప్రశ్న యును హేతువేయయినది, 'అన. విని. ముని' అనుప్రాసాలంకారము.

తా॥ అన విని నారదుఁడు మందహాసముతో నోత్రివిష్టపాధిపతీ నే నన్నిదిశలయందు సంచరించి యొకచిత్రము చూచి దానిని మీకుఁజెప్పఁ బనిగలిగి వచ్చితి.

క॥ మునినాథ యేమిచిత్రము, గనుఁగొంటివొ యానతీయఁ ♦ గదవే యనిన
న్వినవోయి నముచిసూదన, యనిమిషతరుణీలలామ ♦ యవనీస్థలిలోన్. 30

అ॥ మునినాథ - ఋషిశ్రేష్ఠుఁడవగు నోనారదుఁడా, ఏమిచిత్రము - ఏమిచోద్యము; కనుఁగొంటివో - చూచియున్నావో, ఆనతీయ గదవే - సెలవియ్యఁగదవయ్యా, అనినన్ - ఇట్లువచింపఁగా, నముచిసూదన - నముచియను రాక్షసునిఁజంపిన యోయింద్రుడా, వినవోయి - నేఁజెప్పు వృత్తాంతము నాకర్ణింపుము, అనిమిషతరుణీలలామ - దేవవేశ్యలలో యౌవనవతి యగునారంభ, అవనీస్థలిలోన్ - భూమియందొకచోట, పైపద్యముతో నన్వయము. ఈపద్యమున 'ఆనతీయఁ గదవే' అనుటకు "ప్రార్థనార్థే భవే న్నాంతాత్కదేత్యర్థ విశేషదః" అధ.

తా॥ ఓమునీంద్రా నీవు కనుఁగొనిన వింతయేమియో సెలవిమ్మనఁగా సుత్రామావినుము. రంభ యను నప్సరోంగన భూలోకమునం దొకచోట.

క॥ అలనాఁటనుండి ద్విజునిం, గలగొని యిటు రాక యుండెఁ ♦ గా దానికి నా
యిలవేల్పే యిలువేలుపు, బలభేదన యేమిచెప్పఁ ♦ బనియున్న దిఁకన్. 31

అ॥ బలభేదన - బలాసురుని సంహరించినవాఁడా, అలనాఁటనుండి - శివునియానతి ననుసరించి నీవురంభకాజ్ఞయొసంగిన దినమునుండియు, ఇచట 'అల' దేశ్యము ప్రసిద్ధిని దెలుపునది. 'అల్ల' అనియు రూపముకలదు. ద్విజునిన్ - ఆబ్రాహ్మణుని, కలగొని - లోఁగొని, ఇటు - ఇక్కడికి, ఇది దేశ్యము. రాకయుండెఁగా - రాకయున్నదిగదా, దానికిన్ - ఆయొక్క రంభకు, ఆ ఇలవేల్పే - ఆబ్రాహ్మణుఁడే, ఇలవేలుపు - గృహదైవము, ఇంటియందు నిత్యమును బూజించుదేవుఁడు ఉదా. "చ. ప్రమదవిలాస నర్తనవి♦భాసుర గోపకిశోరమూర్తితోఁ, దమ కిలువేలుపై వెలయు♦తాండవకృష్ణ పదాబ్జసేవ" కళా. ఇఁకన్ - ఇఁకమీఁద, ఈచెప్పినదానికంటెననుట, ఏమిచెప్పబడియున్నది -, నేఁ జెప్పవలసిన పనియేమికలదు, సమస్తమునీకే తెలియుననుట, ఈపద్యమున 'నాయిలవేల్పే యిలువేలుపు' అనుప్రాసాలంకారము.

తా॥ ఓబలవైరీ శివునాజ్ఞననుసరించి నీవు రంభకు సెలవిచ్చిననాఁటనుండి యాబ్రాహ్మణుని ధనవశపఱచుకొని స్వర్గమునకే రాకుండెనుగదా! దాని కతఁడే యింటిదేవరయైనాఁడు. ఇఁక నేఁజెప్ప వలసిన దేమున్నది?

క॥ సురతనయుల సంభోగము, నిరసింపగ వింటి దాని ♦ నేరంబునకై
సురనాథ నిన్నయ 'వలెఁ, బరిపాలన మిట్లుచేయఁ ♦ బఱపితి వనుచున్. 32

అ॥ సురనాథ — ఓయింద్రుఁడా, సురతనయులసంభోగమున్ — దేవతలకుమారులైనయావనుల యొక్క సంభోగమునందు నీతిగలవారియొక్క రతికేళిని, నిరసింపఁగన్ — తిరస్కారముచేయఁగా, వింటిన్ — నేనువినియున్నాను, దానినేరంబునకు + ఐ — ఆబిడయొక్క దుష్టస్వభావముకొఱకుగాను, ఇట్లు — ఈప్రకారముగ, పరిపాలనము — ఈస్వర్గమును గాపాడునట్టి కార్యమును, చేయన్ — చేయుటకు, పఱపితివి — పొంపించితివి, అనుచున్ — ఇట్లుపలుకుచు, నిన్నయనవలెన్ — నిన్నేనిందించవలయునుసుమా, ఇచటఁ బరిపాలనాలోపము నీయదియే కాని దానివల్ల నేమికల దనుటచే వ్యాజస్తుత్యలంకారము. "వ్యాజ స్తుతిర్ముఖే నిందాస్తుతిర్వా రూఢి రన్యథా" కా. ప్ర. ఉదా. "క. అసమరణరంగములనీ, యసినటినటియింప గరుల♦హయులన్ విరులన్, వెసనొసఁగు నౌర యెంతటి, రసికుఁడు నీవైరి యోబరాజనృసింహా" కా. సం. "హే హేలాజితబోధిసత్త్వ వచసాం కింవిస్తరైస్తోయధే నాస్తి త్వత్సదృశః పరః పరహితాధానే గృహీతవ్రతః, తృష్యత్పాంథజనోపకారఘటనావైముఖ్యలబ్ధాయశో, భారప్రోద్వహనే కరోషి కృపయాసాహాయ్యకం యన్మరోః" పుంజ.

తా॥ ఆబిడ సంభోగవిద్యయం దారితేరిన దివిజకుమారులసైతము నిందింపఁగా నేను వింటిని. దాని నేమిచేయఁగలము. స్వర్గపరిపాలన మిట్లున్నందులకు నిన్నే తెగడవలయును.

సీ॥ కాన నీభోగసంపద♦ఘనము లిచటి, సొంపుపెంపును రంభకు♦ నింపుపుట్ట, దనుచుఁ
దోఁచుచున్నదో♦యనిమిషేంద్ర, మానవులమీఁదియధికస♦మ్మతముఁ జూచి 33

అ॥ ఓయనిమిషేంద్ర — సురపతివగు నోయింద్రుఁడా, ఆపెకు, మానవులమీఁది — నరులపైని, అధికసమ్మతమున్ — ఎక్కువైనయిష్టమును, చూచి — కనుగొంటిని, కానన్ — కనుక, ఉదా. 'సీ. కానఁబద్మహితుఁడు ఘనప్రకాలంబున' వి పు. నీభోగసంపదఘనములు, నీ — నీయొక్క, భోగ — సుఖముయొక్కయు, సంపద — కలిమియొక్కయు, ఘనములు — గొప్పతనములు, ఇచటి సొంపుపెంపు ఇచటి — ఈప్రదేశమునగల, సొంపు — యోగ్యతయొక్క, పెంపు — సమృద్ధి, రంభకున్ — దేవదాసియగు నాయొక్కరంభకు, ఇంపు పుట్టదనుచున్ — ఆనందము కలిగించుటలేదని, తోఁచుచున్నది— నాకుస్ఫురించుచున్నది. 'సొంపు పెంపు ఇంపు' అనుప్రాసాలంకారము.

తా॥ దానికి మానవులమీఁది మిక్కుటమైన యనురాగమును జూచి నీభోగసంపద్వృద్ధులారంభకేమాత్రమును సంతోషమును గలిగించుట లేదని నాకు విదిత మగుచున్నది.

చ॥ మననలకూబరాదు లవ♦మానము నొందెద రంచు నాఁడె నో
యనిమిషలోకనాథ యది♦ యాధరణీసురపుత్త్రితోడ నా
డినవచనంబులెల్లఁ బ్రక♦టింపను నట్టివిబైటఁబెట్టఁగా
మునులకు శాకు నేల విను♦ మోహముగా కది దానిపాపమే. 34

అ॥ ఓయనిమిషలోకనాథ – స్వర్గాధిపతివగు నోయింద్రుఁడా, విను – అవధరింపుము, అది – ఆయొక్క రంభ, ధరణీసురపుత్రుతోడన్ – బ్రాహ్మణునికొడుకైన యానిరంకుశునితో, మానలకూబరాదులు – మనస్వర్గమునందున్న నలకూబరుఁడు మున్నుగాఁగలవారిని, అపమానమున్ – పరాభవమును, ఒందెదరంచున్ – పొందెదరనుచు, ఆడెన్ – పలికెను, ఆడినపలుకులెల్లన్ – అదియానితోఁ జెప్పిన మాటలన్నియు, ప్రకటింపన్ – స్పష్టపఱచుటకును, అట్టిది – అంటివి, బైటఁబెట్టఁగాన్ – బహిరంగము చేయుటకును, మునులకున్ – ఋషులకు, మాకున్ – మావంటివారికి, అనఁగా ఋషులమైనమనుబోంట్లకనుట, ఏల – ఎందుకు, అక్కఱలేదనుట, అది – అట్టిప్రస్తుతి, మోహముగాక – వలపుగాక, దానిపాపమే – దానిదోషమా, అనఁగా వానియందాసక్తిఁగల మనుకాయున నటుల జరిగినది. గాని పాపము దానిదనుటవలన నేమిప్రయోజనమనుట, ఇందనురాఁగవపాపమున వర్గజయతి చెప్పఁబడినది. క. తమతమ యనునాసికవర్ణములు విడిచి వెనుక విప్రులు నాల్గుపదములోఁ, దమకు నర లేక నిలిచిన ననుసాహిత దమనవర్గయతులనఁబరఁగున్. అప్ప. 'అదిమోహముగాక దానిపాపమా' యనుటచేత అలంకారము వ్యాజనింద. 'నిందాయానింద యావ్యక్తిర్వ్యాజనిందేతి గీయతే విశ్లేష నిందోస్యయ స్త్రే ప్రోగేకమేవాహుశ్చిరః' అని కువ.

తా॥ ఓ స్వర్గప్రభూ విన్నావా మననలకూబరాది యశోవనులఁ బ్రాహ్మణకుమారునకు సరిరాక యవమానము బొందుదురనెను. అది పలికినపలుకులెల్లఁ దేటపఱచుటకును బైటఁబెట్టుటకును మునులమగు మావంటివారికేల? అదియంతయు మమకారముగాని దానినన్నందువలనఁ బ్రయోజనమేమి?

—: ఇంద్రుఁడు రంభపై నాగ్రహించుట :—

చ॥ అన విని వజ్రి మండిపడి ♦ యౌనవు నారద యద్దురాత్మురా
లనిమిషలోకభోగభర ♦ మల్పముగాఁ దలపోయకున్న న
మ్మనుజుని బాయకున్నె బళి ♦ మంచిది దానికి నేన గర్వముం
బెనిచితి నిన్నినాళ్లు నిఁకఁ ♦ బెద్దతికం బొకయింత కుంచెదన్. ౩౫

అ॥ అనన్ – ఇట్లువచించఁగా, విని – ఆకర్ణించినవాఁడై, వజ్రి – వజ్రమే యాయుధమ్ముగాఁ గల యాయింద్రుడు 'ని. వజ్రంత్వస్త్రీకులిశశస్త్రయోః మణివేధేరత్నభేదే' కేశవ. 'వజ్రపాణిర్మహేంద్రః సురగ్రామణీర్యామనేమిర్వృషా నాకనాథోహరిః' త్రి. శే. మండిపండి – కోపముయొక్క యధికముగలవాఁడై, నారద – ఓనారదమహర్షీ, ఔనవున్ – అవునవును, నీవుచెప్పినది సత్యమే యని త్వరితముగాఁజెప్పుట. ఉదా. శా. 'ఔనౌనేవెలయాల' దశా. చ. అద్దురాత్మురాలు – దుర్మార్గురాలైన యాయొక్క రంభ, అనిమిషలోకభోగభరమున్ – అనిమిషలోక – స్వర్గమునఁగల, భోగ – ఆనందముయొక్క, భరమున్ – అధికమును, అల్పముగాన్ – అణుమాత్రముగా – కొంచెముగా, తలపోయకున్నన్ – ఎంచకుండినట్లయిన, అమ్మనుజునిన్ – ఆమానవుని, పాయకున్నె – విడువకుండునా, బళి – మెచ్చుట-మంచిది – సరియేకానిమ్ము, అనఁగా దానిపని కనుగొనియెదనని కోపముతో నంగీకరించుట, దానికిన్ – ఆయచ్చరకు, నేన – నేనే, ఇన్నినాళ్ళు – ఇంతకాలమువఱకు, గర్వమున్ – అహంకారమును, ని. 'గర్వోఽభిమానోఽహంకారో చిత్తోద్రేకస్మయో మదః' అని అ.

పెనిచితిఁ — వృద్ధిఁ జేసితిని, ఇఁకఁ — ఇఁకమీఁదట, పెద్దతికంబు — ఆబిడయొక్క ఘనము, ఒక యింత — కొంచెము, కుంచెదఁ — తక్కువచేయుదును, ఇందు 'పెంపవుఁ' అనుటకు 'సూ. అద్రుతా న్తానాంజాతీనాం ద్విపర్యాప్తాపంత్యలోపతా, అన్యేషాంచద్విరుక్త్యాస్యుర్బహులోపాగమాదయః' అథ. మురాత్తునాలనుటకు 'సూ. దీర్ఘాన్తేఽత ఉకారః' అని నన్న. 'పెద్దతికము' అనుటకు 'సూ. అన్యే చ బహవో దేశ్యశబ్దాః అన్త్యే సతః క్త్వపి సంశ్లిష్టస్య లోపస్సాన్తత్వం దీర్ఘస్యమో మతః' అథ.

తా॥ ఇట్లుచెప్పఁగా విని వేల్పుఁగొన కినలి నాతఁడా అప్సరసలు. ఆమర్త్యస్త్రీలు దేవలోక సౌఖ్యాధికమును నల్పముగా నెంచుచున్న నాయనుని విడువఁజాలని ఓరా దానిసాహసము, సరే కానిమ్ము. దాని కంతటి మదమును బెంచినది నేనే ఇక నట్టిగొప్పతనమును దగ్గించెదను.

ఉ॥ ఓమునిసార్వభౌమ సర ♦ సోక్తుల బాపనమిండగానితో
నే మది నిందసేసె జగ ♦ దీడితరూప విలాససంపదు
ద్దామశరీరులం ద్రిదశ ♦ ధామకుమారుల లంజసానిసే
రోప్పి 'మనసశ్శునాంఘృతమ ♦ రోచక' మన్పలుకాచరించునో. 36

అ॥ ఓమునిసార్వభౌమ—ఋషులలోఁ జక్రవర్తివగు నోనారదుఁడా, బాపనమిండగానితోఁ— బ్రాహ్మణుఁడయిన అంకుడుగనితో, సరసోక్తులఁ — సరసములాడుటయందు, జగ......రులఁ, జగత్ — ఈమూఁడులోకములయందు, ఈడిత— స్తుతింపఁబడిన, 'ని. ఈడితశస్తపణాయిత పనాయిత ప్రణుత పణిత పనితాని అవగీర్ణవర్ణితాభిష్టుతేళితాని స్తుతార్థాని. అ. రూప — చక్కఁదనముతోఁ గూడిన, విలాస — ప్రకాశముయొక్క, సంపత్ — అతిశయమున, ఉద్దామ — మదించిన, శరీరులఁ- తనువుగలవారిని, త్రిదశధామకుమారులఁ — త్రిదశధామ — దేవతలకునివాసమగు స్వర్గమునఁగల. 'సూ. సంఖ్యయావ్యయాసన్నా దూరాధిక సంఖ్యాః సంఖ్యేయే, త్రిర్దశపరిమాణమస్యేతి త్రిదశాః, ఇత్యాది నాబహువ్రీహిః' 'సూ. బహువ్రీహౌ సంఖ్యేయేడజబహుగణాత్' సిద్ధాం. ఇతి క్షీరస్వామి. త్రిదశ తృతీయమైన కౌమారదశ సర్వదాకలవారనియ్యు. కుమారులఁ — గొమారవస్థగలవా లను, ని. 'కుమారో బాలకేస్కందే యువరాజేశ్వచారకే' విశ్వ. ఏమనినిందచేసెఁ — ఏమని దూషించినది. లంజసానిసేరొప్పి — వ్యభిచారస్త్రీలలో నధిపురాలైనదానియొక్క. జాణతనమైయుండు నేమో, "మనసశ్శునాంఘృత మరోచకమ్" (కుక్కలయొక్క మనస్సునకు నెయ్యిరుచించదనుండుట) అన్పలుకు — అనువాక్యమును, ఆచరించునో — నడుపునేమో, అనఁగాఁ గుక్క సేయుపనికిరాదని దుర్వాసనగల చెడుపదార్థములఁదినినట్లు దివ్యభోగముల నిరసించి మానవుని పొందఁగోరుచున్నదేమో యనుట. ఇచట 'ఆచరించునో' అనుటకు "సూ. ఏదోతౌవ్యతిరేకాదపి సంప్రార్థన పరాక్రియాణాం స్తః" నన్న. ఇందు 'సరసోక్తులఁ' అనుచోట 'ఇతరత్రచద్వితీయా' అనెడు సూత్రముచేత సప్తమ్యర్థమునందు ద్వితీయవచ్చినది. నాలుగవపాదమున నఖండయతి చెప్పఁబడినది. ఇందు 'మనసశ్శునాం ఘృత మరోచకం + అన్పలుకు, అని సంధిజేయుటవలన మకారమయినది. "సూ. శబ్దానామంత్యభాగేషు గోణాఽనుస్వారః ప్రదృశ్యతే, తస్యాచిపరతో మస్స్యాత్సర్వత్రహరిసమ్మతేః" అన్పలుకు అనుటకు సూ. పదాంతంబులై యసంయుక్తంబులయినను, లు, ను, లయుత్వంబునకు లోపంబు బహుళంబుగనగు. బా. వ్యా. లోకోక్త్యలంకారము. 'ఉద్దామశరీరులఁ త్రిదశధామ కుమారులఁ' అనుప్రాసాలంకారము.

తా॥ ఓఋషిచక్రవర్తీ! బాపనమిండగానితో సరసములాడునప్పుడు ముల్లోకమునవన్నెకెక్కిన చక్కఁదనముగల వేలుపుఁబోఁడె గాంద్ర నేమని నిందించినది? ఱంకులాడులలో దొరసానియైన దానిజాణ తనమో తనక్కనేయుపచించదనినట్లు, దివ్యభోగముల నిరసించిమానవుని పొందునభిలషించియున్నదో.

సీ॥ యజ్ఞతంత్రములందు ♦ హవిరన్నములచేతఁ, బుంజీభవించిన ♦ పొట్టక్రొవ్వు
జగదేకసౌందర్య ♦ చాతుర్యములచేతఁ, దుర్వారతరమైన ♦ గర్వరేఖ
సురతనూజులతోడి ♦ సురతసంసర్గచేఁ, గందళించినమహా ♦ నందగరిమ
నిపుణతదీపించు ♦ నృత్యవైఖరిచేతఁ, బెంపావహించిన ♦ పెద్దతికము

గీ॥ సరససంగీతసాహిత్య ♦ పరిచయమును, బ్రథమఁజెందినబహుమాన ♦ పాటవంబు
గొంత దివ్యులలోపలఁ ♦ గొంతెవడఁగఁ, గొంతె వేయుంతుఁగనుదీని ♦ కొంతకుదాని. 37

అ॥ యజ్ఞతంత్రములందుఁ — యజ్ఞయాగములయొక్క, తంత్రములందుఁ — ప్రయోగముల యందు, ఈలాగునఁజేయవలయుననెడి విధానము ననుసరించి చేయునప్పుడు, హవిరన్నములచేతఁ — హోమముచేయునట్టి యోగిరముతో, పుంజీభవించిన — రాశిగాఁగూడిన, ని. 'పుంజరాశీతూత్కరః కూటమస్త్రియాం' అ. పొట్టక్రొవ్వు — పొట్టయందుఁగలమదమును, జగ...చేతఁ, జగత్ — మూడు లోకములకు, ఏక — ముఖ్యమైన, సౌందర్య—అందముతోడను, చాతుర్యములచేతఁ — నేర్పుతోడను, దుర్వారతరము — వారింపనలవిగానిది, ఐనగర్వరేఖ— అయినట్టిదర్పముతోఁగూడిన శరీరసౌష్ఠవమును, సురతనూజులతోడి — దేవతలకుమారులతోఁగూడి, సురతసంసర్గచేఁ — సంభోగసంబంధమువలన, కందళించిన — అంకురించిన, మహానంద — అధికమయినసంతోషముయొక్క, గరిమ — గొప్పతనమును, నిపుణతఁ — నేర్పుతో, దీపించు — ప్రకాశించునట్టి, నృత్యవైఖరిచేతఁ — నాట్యముయొక్క క్రమమువలన, పెంపు — అభివృద్ధి, ఆవహించిన — ప్రవేశించినట్టి, పెద్దతికము — గౌరవమును, సరస....యమును, సరస — రసయుక్తమైన, సంగీత — పాటయందును, సాహిత్య — పాండిత్యము నందును, పరిచయమును — మాలిమియును, ప్రథమఁజెందిన — ప్రసిద్ధికెక్కిన, బహుమానపాటవంబు — గణ్యతయొక్కపటుత్వమును, ఇచట ప్రథమాశబ్దమునుగూర్చి 'సూ. దర్పతోహాలాదేర్ఘఘోః హాలా దేర్ఘఘోగ్వాకారస్వరః స్యాత్ ఇష్ఠేమేయస్తు 'టీ.' భస్యథేర్లోపః స్యాదిష్ఠేమేయస్తు పృథోర్భావః ప్రథిమా' సిద్ధాం. "శ్లో. పృథుంమృదుంభృశంచైవ కృశంచదృఢమేవచ పరిపూర్వంవృఢంచైవ షడేతాన్ రవిధౌస్మరేత్" అని వృత్తికారుఁడు. కొంత — కొంచెము, దివ్యులలోపలన్ — వేల్పులలో, కొంతెపడఁగన్ — తక్కువపడునట్లుగా, దానిన్ — ఆయొక్కరంభను, దీనికొఱకున్ — ఈనేరము నిమిత్తమున, కొంతెన్ — తగ్గయినచోట — నీచస్థానమున, వేయింతున్ — పడవేయించెదను. కను— చూడుము, ఇందలి 'కొంతె' యను పదప్రయోగమునకుదా. 'క. అంతటఁ గడలం దెల్లఁ గొ, అంత యొకింతయును లేక ♦ ఱంపిల్లె నినుల్, అచ్చతె. రా.' (మఱియు 'కొంతకన్' అని యన్వయించుపక్షమున ఉదా. 'మ. విరసుండై కొంతంబడుం గ కవి పృథ్వీభృత్సమీపస్థలిన్' స్వా. మ. ఇట్లన్వయించుట సమంజసముకాదు. ఏలయన నింద్రుఁడు రంభను భూలోకమునకుఁద్రోచెనేకాని కొఱ్ఱినవేయించలేదు.) 'కొంతె, కొంతె, కొంతకు' అనుప్రాసాలంకారము. సముచ్చయాలంకారము "తత్సిద్ధిహేతావేకస్మిన్ యత్రాన్యత్తత్కరం భవేత్, సముచ్చయోఽసౌ" కా. ప్ర.

తా|| యాగవిధానములయందగ్నిలో వేల్వఁబడుచున్న యన్నమును దినుటవలనఁ గూడినపొట్ట క్రొవ్వును, మూఁడులోకములయందుఁ బ్రధానముగ నొప్పుచున్న చక్కఁదనముతోను, నేర్పుతోను, వాంఛ నలవిగాకున్న దర్పము గల శరీరసౌష్ఠవమును, దివ్యపురుషులతోడి సంభోగసంబంధమువలనఁ జిగిరించిన యధికసంతోషముయొక్క గౌరవమును, నేర్పుగల నాట్యక్రమమునఁ బెంపొందిన గొప్పతనమును, రసయుక్తమైన సంగీతసాహిత్యములయందలి ప్రసిద్ధియును, విస్తారమైనగణ్యతాపటుత్వమును, గొంచెము దివిజాలలో డింభవడ నిందులకై దానిం గ్రిందఁ బడవేయింతును జూడుము.

వ|| అని పల్కునవసరంబున- 38

అ|| అని — ఈప్రకారముగా, పల్కు — పలుకుచున్న, అవసరంబునన్ — సమయమున,

—: రంభ యింద్రసభకు నేగుట :—

సీ|| మోవిపైఁ గెంపించు ♦ ముల్లువాఁడిపలునొక్కు, లాఁగి చిన్నికెంపుల ♦ సొగసుఁ జూపఁ
చెక్కులపై జాఱి ♦ చెదరుకుంతలములు, మకరికాపత్త్రసం ♦ పద వహింప
జిగిగుబ్బచన్నులఁ ♦ జిటులుగంధపుసరుల్, జిలుగుపయ్యెదలోనఁ ♦ జెంగలింప
నలువొందునునుమేని ♦ నవనఖాంకురములు, బాలేందురేఖల ♦ పస నుతింప

గీ|| జాఱుకొప్పున ముడిచిన ♦ జాజివిరుల, తావి తనతోడియచ్చర ♦ తలిరుఁబోండ్ల
కైశ్యకల్పప్రసూనసౌ ♦ గంధ్య మడఁప, రంభ చనుదెంచె దేవతా ♦ రాజసభకు. 39

అ|| రంభ — రంభయనునాయప్సరస, మోవిపైన్ .. క్రిందిపెదవిమీఁద, ఇచట 'మోవి' అను పదమునుగూర్చి "సూ. అజన్య జన్యభేదేనశబ్దాన్యుర్వికృతౌమతాః జన్యాంతగతవర్ణానాం భూయసీస్యాద్విచిత్రతా" అధ. సూ. అనుతాం స్త్రీరూపాం సమానాం సర్వస్య స్త్రీ సమస్యలోపః, స్త్రీవత్సస్య స్త్రీ సమాః" నన్న. కనిపించు .. అగపడునట్టి, ముల్లువాఁడిపలునొక్కులు — ముల్లువంటి పదనుగల దంతముల యొత్తిడివలన నణఁగినగుంటలు, ఒగిన్ — వరుసగా, చిన్నికెంపులసొగసున్ — చిన్నవియైన పద్మరాగమణులయొక్క సౌందర్యమును, చూపన్ — కనబఱచుచుఁగా, చెక్కులపైన్ — చెక్కిళ్ళమీఁద, జాఱి — దిగఁబడి, చెదరుకుంతలములు — ప్రసరించుచున్న తలవెండ్రుకలు, మకరికాపత్త్రిసంపదవహింపన్; మకరికాపత్త్రి - చెక్కులయందలంకారముగా లిఖించిన మకరికాపత్త్రిములయొక్క, సంపద - అతిశయమును, వహింపన్ - ధరించుచుఁగా, జిగిగుబ్బచన్నులన్ - కాంతిగలిగి గుండ్రనివైన స్తనములయందు, చిటులుగంధపుసరుల్ - తునుఁగుచున్నట్టి పరిమళముతోఁగూడిన పుష్పమాలికలు, జిలుగుపయ్యెదలోనన్ - సన్నమైనపయ్యెంటలో, చెంగలింపన్ - ప్రకాశించుచుఁగా. ఇచట 'చెంగలింపన్' అనుటకుఁబో "వ. కౌత్తుతేజముచు గనగనలివయును జెంగలించు జాంగలిక్షేత్రంబున వేత్రంబులకు నింపుసొంపు సంపాదింప" భీమే. పు. నలువొందునునుమేని - ఒప్పిదమైన నున్నని శరీరమునందుఁగల, ఇచట 'నునుమేని' అనుటకు "సూ. భవేదర్త్రాపిశబ్దస్య క్వచిద్యోగేనసాధుతా" అధ. నవనఖాంకురములు - నవ - నూతనమయిన, నఖ — గోళ్ళయొక్క, అంకురములు గుఱుతులు, బాలేందురేఖలపస. బాలేందు - బాలచంద్రునియొక్క, రేఖలపస - సన్ననియాకారములయొక్క

కాంతిని, బాలచంద్రుఁడు సన్ననిరేఖవలెనుండును. 'ని. రేఖాస్యాదల్పకే ఛద్మన్యాభోగోల్లేఖయో
రపి' విశ్వ. హసింపఁగ - పరిహాసముచేయఁగా, ఎగతాళిచేయఁగా. ఇచట నునుమేని నవనఖాంకురము
లనఁగా కామశాస్త్రమున నిట్లు చెప్పఁబడియున్నవి, 'నఖాఘాతః ప్రదాతవ్యా యథాస్థానాని కర్మసు
పార్శ్వయోః స్తనయోశ్చైవ ఊరౌ చనితంబకే, కక్షస్థలే చ కణ్ఠాంతే కపోలేబాహుమూలకే'
అనఁగా స్తనములు, చెక్కిళ్లు, చెవితమ్మెలు, బాహుమూలములు, మున్నగునవి. జాజుకొప్పునన్ -
కొంచెముక్రిందికి దిగఁబడిన ధమ్మిల్లమందు, ముడిచిన జాజివిరులతావి - ధరించినట్టి జాతీపుష్పముల
యొక్క పరిమళము, తనతోడియచ్చరలిరుఁబోండ్ల, తనతోసమానులైన పుష్పమువలె మనోజ్ఞాగాం
గ్రయిన యప్సరసలయొక్క, కైశ్యకల్పప్రసూనసౌగంధ్యము కైశ్య - కొప్పులయందలి, 'కేశానాం
సమూహః కైశికం కైశ్యం చ' 'సూ. కేశాశ్వాభ్యాం యఞ్ఛా వన్యతరస్యామ్' సిద్ధాం. పక్షే
ఠగణే కైశ్యం కైశికం కేశానాం సమూహ ఇతివిగ్రహః. కల్పప్రసూన - దేవలోకమునఁ గలకల్ప
వృక్షములయొక్క, సౌగంధ్యముఁ - సువాసనను, అడఁపఁగ - అణఁగియుండునట్లు చేయఁగా,
దేవతారాజసభకున్ - సురలకధిపతియగు నాయింద్రునియొక్క సుధర్మయనుసభకు, చనుదెంచెన్ -
వచ్చెను, ఇందు 'ముఖవాడి పఖనొక్కులు' అనుప్రయోగములకు "సూ. ప్రథమలుగపిద్విసులోవ్యాః"
సన్న. "సూ. అద్విత్వం చ భవే ద్విత్వం దీర్ఘో హ్రస్వస్య కేషుచిత్" అన. మఱియు నీసీసపద్యద్వితీయ
పాదమున 'మకరికాపత్త్రి సంపదవహింప' అనుచోట బిందుయతి చెప్పఁబడినది. "క. పనిబూని
నిలుచుఁ దమతమ, యనునాసికములకు బిందుయతులను వెనుకన్, గనుపట్టు నాల్గులిపులును, బెను
సున్నలు డాపి తనుకుఁ ♦ బొలుఁద గడియుచోనన్" అప్ప. ఇచట రంభయొక్క జాజుకొప్పున నున్న
జాజిపూవుల పరిమళమును గల్పప్రసూనములకంటె నెక్కువగా వర్ణించుటచేత రతికాలమునఁ గలిగిన
పరిమళమతిశయించెనని భావము. అలం. స్వభావోక్తి. "స్వభావోక్తి రసౌచారు యథావద్వస్తువర్ణ
నమ్" ప్రతా. మోవిపై... సొగసుఁజూప - చెక్కుల... వహింప-నునుమేని... హసింప, ఇత్యాద్యుప
మాలంకారము, "స్పర్ధతే జయతిద్వేష్టి ద్రుహ్యతిప్రతిగర్జతి, ఆక్రోశత్యవజానాతి కదర్థయతినిందతి,
తస్యచానుకరోతీతి శబ్దాః సాదృశ్యవాచకాః, ఉపమాయామిమేప్రోక్తాః కవీనాంబుద్ధిసౌఖ్యదాః"
దండి. ఇచట రంభ నిరంకుశునితోఁ గూడి విహరించి కేళీగృహమునుండి యప్పుడే బయటికి వచ్చిన
లక్షణములను దెలియఁజేసినాఁడు. సంస్కృతమునఁగూడ నిట్టివి కలవు. "బిభ్రాణాంకరపల్లవేన కబరీ
మేకేన పర్యాకులాం, మన్యేన స్తనమండలే నిదధతీ ప్రస్తం దుకూలాంచలం, ఏషాచందనలేశలాంఛిత
తను స్తాంబూలరక్తాధరా, నిర్యాతిప్రియమందిరా ద్రతిపతే సాక్షాజ్జయశ్రీరివ" పుష్ప. ఉత్ప్రేక్షా
లంకారమును, కూచిమంచి తిమ్మకవియు నిట్లువర్ణించినారు.

సీ. ఎడసిన జిలుఁగు ప ♦ య్యెదతోడ ముడివీడి, నేలజీరాడు పె ♦ న్నెఱులతోడఁ
గరఁగి నెమ్మొగమెల్లఁ ♦ జేరయుకస్తురితోడఁ. దొలఁగినచెవియాకు ♦ దోయితోడ
గుడుగకనినుచు ని ♦ ట్టూర్పుగాడ్పులతోడ, జాఱిన నెఱిబన్న ♦ సరముతోడఁ
జెదరినపాపట ♦ చేర్చుక్కబొట్టుతోఁ, బొడిపొడిమైనమే ♦ పూఁతతోడ
తే॥ మగనిపిమ్మట నెమ్మేను ♦ మఱదివిడసి, కొంపు సుకోపవనిజూచి ♦ చెలువలిపుడు
చెడుతెఱంగుబుఁగడుపనఁ ♦ బరఁగ నౌకంగొ, నంచునవలఁ జూచి చయ్యన ♦ నచటువదలి. అచ్చతె.రా.

తా॥ రంభ మోవిపైఁ జిన్నిచిన్న పద్మరాగములో యనునట్లు ప్రకాశించుచున్న దంతక్షత
ములతోను, చెక్కిళ్లపైఁ జెవరి మకరికాపత్త్రిములవలె దీపించుచున్న శిరోజములతోను, గుంభ్రని

స్తనములపైఁ బగుళ్ళవాఁజీఁగఁదముతోఁ గూడిన పుష్పమాలికలను మాటుపఱచిన పయ్యెదతోను, సుందరమయిన శరీరమున బాలచంద్రునికాంతిని మించుచున్న నఖరేఖలతోను, కొంచెము దిగజాఱిన కొప్పునఁ దనకీడగునచ్చరలతలలయందుఁగల దేవతాకుసుమముల సువాసన నడ్డగించుచున్న జాజి పువ్వుల పరిమళముతోను, సుధర్మాంతరమున కేతెంచెను.

తే॥ వచ్చి భయభక్తు లెసఁగఁగ ♦ వాసవాదు, లైన పెద్దల కొకపాటి ♦ యాననంబు
వంచి మడిసందులను హస్త ♦ వారిజంబు, లిడి యొకించుక వెనుకకు ♦ నేగి నిల్చె. 40

అ॥ వచ్చి — ఏతెంచి, భయభక్తులు — భీతియును సేవకావృత్తితోఁగూడిన యనుసరణమును, ఎసఁగంగన్ — ఒప్పునట్లుగా, వాసవాదులు — ఇంద్రుఁడు మొదలగువారు, ఐన పెద్దలకున్ — అయిట్టి గౌరవముగలవారలకు, ఒకపాటి — ఒకవిధముగా, మితముగాననుట. ఆననంబువంచి — మొగము వంచినదై, అనఁగా సంజ్ఞగానమస్కరించినదనుట. మడిసందులను — మడుచుకొనిన దండచేతులయందు, హస్తవారిజంబులు — పద్మములవంటి కరములను, ఇడి — ఉంచి, ఒకకొంత — కొంచెము, వెనుకకున్ — పశ్చాద్భాగమునకు, ఏగి — పోయి, నిల్చెన్ — నిలువఁబడెను, ఈపద్యమున 'సందులు' అనిప్రయోగించుటకు "సూ. డలటా ముదితాం లుక్స్యాత్ ప్రాయశో లేలువర్ణకే, వైకృతానాం లుకిత్వే ల్లటయో రేకరూపతా" అన. ఇందు వాసవాదులైన పెద్దల కొకపాటి యాననంబువంచి, అనుటచే రంభకుఁ గలగర్వము సూచితము. నాట్యస్త్రీలక్షణమును దెలియఁజేయుటచే స్వభావోక్త్యలంకారము.

తా॥ వచ్చి భయవినయములతో నింద్రుఁడు మొదలగు గొప్పవారలకు మితముగా నమస్కార సంజ్ఞను గనఁబఱచి సందిళ్ళు మడుచుకొని కొంచెము వెనుకకుఁబోయి నిలువఁబడెను.

—: రంభ నారదునిఁజూచి భయపడుట :—

క॥ తనజాడ లన్ని యచ్చటఁ, గని వచ్చినయట్టిమౌని ♦ కంఠీరవు న
య్యనిమిషసంయమిఁ గని య, య్యనిమిషలోచనకు హృదయ ♦ మట్టిట్టయ్యెన్. 41

అ॥ అచ్చటన్ — భూలోకమున, తనజాడలు — తానుచేసినసైగలు మున్నగు తనప్రవర్తన యొక్క రీతులు, ఇచట 'జాడలు' అనుటకుఁదా. "క. పరికింపరు తమజాడలు" పారి. అన్ని — సమస్తమును, కనివచ్చిన యట్టిమౌనికంఠీరవున్. కనివచ్చిన — కనుఁగొనివచ్చిన, అట్టిమౌనికంఠీరవున్ — అటువంటి మునిశ్రేష్ఠుని, ఇచట కంఠీరవుఁడనుటకు. "ని. సింహశ్శార్దూలనాగాద్యాః పుంసిశ్రేష్ఠార్థగోచరాః" అ. అయ్యనిమిషసంయమిన్ — దేవర్షియగు నా నారదుని, కని — వీక్షించినతోడనే, అయ్యనిమిషలోచనకున్ — మత్స్యమువంటి నేత్రములు గలదయిన యారంభకు, "ని. అనిమేషశ్చానిమేషో ప్యేతౌ ద్వావసురమత్స్యయోః" నానా. హృదయము — మనస్సు, అట్టిట్టయ్యెన్ — ఱిపరివిధముల విచారముగలదయ్యెను, ఈపద్యమున 'కనివచ్చినయట్టి మౌని' అనుచోట న. వచ్చుటకు 'సూ. కర్మాదేః కర్తృత్వం ప్రథమాచ నవర్ణకశ్చతద్వత్ స్యాత్' నన్న. అనిమిష శబ్దము రెండుమారులుచ్చరింపఁబడుటచే యమకాలంకారము.

తా॥ భూలోకమునఁ దనజాడలన్ని కనివచ్చిన నారదమహర్షిం గాంచినతోడనే యా వామలోచనకు మనస్సునఁ బరిపరివిధముల విచారము కలిగెను.

## —: ఇంద్రుఁడు రంభను బ్రశ్నించుట :—

ఉ॥ అప్పుడు వాసవుండు కడు ♦ నాగ్రహ మొప్పఁగ నత్తలోదరిం
దప్పక చూచి నిన్ను వసు ♦ ధామరసూతికిఁ గౌఁగిలిచ్చి నే
నప్పుడ రమ్మటంటి హరు ♦ నాజ్ఞ యలంఘ్యము గానఁ గోర్కెమై
నెప్పుడు వానితోడ మది ♦ నిష్టము సల్పుచు నుండు మంటినే. 42

అ॥ అప్పుడు — ఆసమయమున, వాసవుండు - ఇంద్రుఁడు, కడున్ — మిక్కిలిగా, ఆగ్రహము - కోపము, 'ని. ఆగ్రహోఽనుగ్రహాసక్తి నిగ్రహాగ్రహణేష్వథ' నానా. ఒప్పఁగన్ — ప్రకాశించఁగా, అత్తలోదరిన్ - ఆసురవేశ్యను, తప్పకచూచి - దృష్టి చెదరకుండఁజూచి - ఱెప్పవేయక తేఱిచూచి. నేను, హరునాజ్ఞయలంఘ్యముగానన్. హరునాజ్ఞ - శంకరునియానతి, అలంఘ్యముగానన్ - దాఁటనలవిగాదు కనుక, నిన్నున్ - నిన్ను, వసుధామరసూతికిన్ - పుడమికి వేలుపువంటివాఁడయిన సురశర్మకుమారునకు, కౌఁగిలిచ్చి - ఆలింగనమొసంగి అప్పుడ - ఆసమయమునే, రమ్మటంటిన్ - రావలయునని యాజ్ఞాపించితిని, కోర్కెమైన్ - కోరికతో, ఎప్పుడున్ - ఎల్లప్పుడును, వానితోడన్ - ఆవిప్రునితో, మదిన్ - మనస్సున, ఇష్టము సల్పుచున్ - ప్రేమకలిగించుచు, ఉండుమంటినే - ఉండుమని చెప్పితినా, ఇందు 'హరునాజ్ఞ' యనుటకు 'సూ. షష్ఠ్యా ఉత్తోచినుమ్వేచ' అనిశబ్దచిం. ఈపద్యమున ద్వితీయపాదమున నఖండయతి చెప్పఁబడినది. "ఉ. మానుగవిశ్రమాక్షరస ♦ మన్వితమైస్వరమూఁదినందదీ,, యానుగుణాక్షరం బె కొని ♦ యైనను జెప్పఁగవచ్చు నీక్రియన్, భానుసహస్రభాసివృష ♦ భాధిపుఁడన్నటులర్థయుక్తమై, పూనిన చోనఖండయతి ♦ పొల్పగునాదికవి ప్రణీతమై, ఉదా. "ఉ. అన్నవు తండ్రియట్లవిను ♦ మంతియకాదమి రాజరాజవే, మన్నఁగొఅంతలేదు మణి ♦ మండనముఖ్యములైన కానుకల్"- భాస్క. రా. "ఉ. దక్షతలేనియింటికిఁ బ ♦ దార్థము వేళ్లోకచోటనుండి వే, లక్ష్మలు వచ్చుచుండినఁ బ ♦ లాయనమైచను" భాస్క. శ.

తా॥ అప్పు డింద్రుఁడు మిక్కిలికోపముతో దానివంకఁజూచి నేను శివునాజ్ఞఁ దాటఁజాలక యా నిరంకుశుని కాలింగన మొసంగి యప్పుడే రమ్మని యాజ్ఞాపించితిని గాని కోరికతో నిరతము వాని స్నేహముతో నుండుమంటినా?

క॥ ఏమీ వరచామీకర, భూమీధరకటకకుంజ ♦ పుంజక్రీడా
సామీచీన్యము మానన, ధామవిహారంబుఁ బోల ♦ దా దుష్టమతీ. 43

అ॥ దుష్టమతీ - ఓసిచెడుబుద్ధిగలదానా, ఏమీ - ఏమిటి, క్రోధమును సూచించు ప్రశ్నార్థకమును, ఆశ్చర్యార్థకమును, ఉదా. "క. ఏమీనిక్కమె నున్నెఱుంగఁడె త్రిగర్తేశుండు" భార. "క. ఏమీ యిది దేవరకను ♦ దామెరలకు నింతవెఱఁగు దలకొని పెద్దున్నే ♦ నేమనఁగలనహహ్వన్నా, స్వామికి నభ్రమగుప్రోలు ♦ వసుమతిఁ గలిగెన్" ప్రభా. వర...చీన్యము. వర - శ్రేష్ఠమయిన, చామీ

కర - సువర్ణమయమైన, భూమీధర - పర్వతముయొక్క, కటక - మధ్యప్రదేశమునందలి, కుంజ - పొదరిండ్లయొక్క, పుంజ - సమూహమునందలి, క్రీడా - విహారముయొక్క, సామీచీన్యము, యోగ్యత, మానవధామవిహారంబుకన్ - మానవ - మనుష్యులయొక్క, ధామ - ఇండ్లయందలి, విహారంబుకన్ - సంచారమును, పోలదా - పోలియుండదా. అనఁగా సమానముకాదాయనుట. ఇందు 'ఏమీ' అను ప్రయోగమునకు 'క. ఏమీయెట్లోయేయన, నేమియనం బ్రశ్నమునకు' అని ఆం. ప.ని. 'ఏమీ వర, చామీకర, భూమీధర' 'కుంజ - పుంజ' అనుప్రాసాలంకారము.

తా॥ ఓసి మర్మార్థగర్వాలా! ఏమిటీ? శ్రేష్ఠమైన కనకపుకొండయొక్క మధ్య ప్రదేశమునగల పొదరిండ్లయందలి విహారము మనుజులయిండ్లయందుఁ దిరిగినమాత్రముగ నుండదా?

—: ఇంద్రుఁడు రంభకు శాపమిచ్చుట :—

ఆ॥ చంచలింప కిట్టి ♦ సాహసకృత్యంబు, చేసినావు గాన ♦ నోసి పోయి
భయదరూప మైన ♦ పాషాణమై పుట్టు, పల్లవుఁడు వసించు ♦ పట్టణమున. 44

అ॥ ఓసి - ఓసిరంభా, నీచసంబోధనము. చంచలింపక - ఏపాటియును భయపడక, ఇట్టి సాహసకృత్యంబు - ఇటువంటి తెగించినకార్యము, చేసినావు - ఆచరించితివి, కానన్ - కనుక, పోయి - నీవు తిరిగియచ్చటకేవెళ్లి, పల్లవుఁడు వసించుపట్టణమునన్ - పల్లవుఁడు - నీఅంకుమగఁడు. వసించుపట్టణమునన్ - కాఁపురముచేయుచున్న పురమునందు, భయదరూపము - భీతినిగలిగించునట్టి యాకారము, ఐనపాషాణమై - కలిగినబాయివై, పుట్టు - జన్మించుము. ఇందు 'ఓసి' అనుసంబోధనమునకు 'సూ. నీచతాయాం రిసీస్యాతాం క్వచిన్మైత్ర్యాంచ తద్బ్రుతిః' అథ. 'పుట్టు' అనుప్రయోగమునకు 'సూ. ప్రార్థనార్థే మురేకత్వే కథ్యతే మధ్యమార్థకః, విభాషాంతం పదం త్వేకే నప్రాణేతు కదాచన' అథ. ఉదా. "గీ. తోయజేక్షణ ననుఁ గృప ♦ తోడఁ జూడు" ఇచట రంభ శాప మనుభవించుటనుగూర్చి "ఆత్మాపరాధ వృక్షస్య ఫలాన్యేతాని దేహినాం దారిద్ర్యరోగదుఃఖాని బంధన వ్యసనాని చ" అనియును, "స్వయం కర్మకరోత్యాత్మా స్వయం తత్ఫలమశ్నుతే" అనియును,చాణ.

తా॥ ఓసీ! నిర్భయముగ నింతటి సాహసకృత్యమొనరించితివి. కనుక నీవు తిరిగివెళ్లి భూలోకమున నీఅంకుమగఁడుండెడుపురమున భయంకరమైన శిలవై పుట్టుము.

—: రంభ యింద్రుని బ్రార్థించుట :—

క॥ అని శాప మొసంగిన య, య్యనిమిషవిభుఁ జూచి రంభ ♦ యత్యంతభయం
బున సాఁగి మ్రొక్కి కరుణా, జనకంబుగఁ బలికె నముచి ♦ సంహారకుతోన్. 45

అ॥ అని - ఇట్లని, శాపమొసంగిన - శపించినటువంటి-తిట్టినట్టువంటి, అయ్యనిమిషవిభున్ - దేవతలకుఁ బ్రభువగునాయింద్రుని, చూచి - వీక్షించి. రంభ, ఆదేవవేశ్య, అత్యంతభయంబునన్ - మిక్కిలిభయముతో, సాఁగిమ్రొక్కి దండాకారముగ నేలకువ్రాలి నమస్కరించి - సాష్టాంగ నమ

సాత్కారము చేసి, నముచిసంహారకుతోన్ - నముచియనుదానవునిఁ జంపిన యాయింద్రునితో, కరుణాజనకంబుగన్ - దయను బుట్టించునట్లుగా, పలికెన్ - ఇట్లు వచించెను, ఈచెప్పఁబోవువిధముగా నానెను.

తా॥ అని శపించిన యాసురనాథుం గాంచి రంభ మిక్కిలిభయపడి సాఁగిలఁబడి మ్రొక్కి యాప్రభువునకు దయవచ్చున ట్లీవిధముగాఁ బలికెను.

ఉ॥ ఈమహనీయశాపమున ♦ కెయ్యది యంతము దెల్ప వయ్యయో
యో సురలోకనాథ సద ♦ యంబుగఁ జూడఁగదయ్య యోశచీ
వామదృగీశ నాకలుష ♦ వర్తన మెన్నకు మయ్య యోసుర
స్వామి యటంచు వేవగల ♦ సన్నుతి సేసిన నార్ద్రచిత్తుఁడై. 46

అ॥ అసురలోకనాథ - దేవతాసంబంధమైన స్వర్గలోకమునకు రాజువైనవాఁడా, ఈమహనీయశాపమునకున్ - గొప్పదియైన యీశాపమునకు, ఎయ్యదియంతము - విమోచనమేదియో తెల్పవు - తెలియఁజెప్పవైతివి, అయ్యయో - అయ్యయ్యో - సంతాపార్థకము, ఓశచీవామదృగీశ - శచీదేవి యనెడు మంచికన్నులుగల స్త్రీకి నాథుఁడవైనవాఁడా 'ని. బలారాతిశ్శచీపతిః' అ. సదయంబుగన్ - దయతోఁగూడినవాఁడవై, చూడఁగదయ్య - కనిపెట్టియుండవలదటయ్యా, ఓసురస్వామీ - దేవతలకధిపతియగునో ప్రభూ, నాకలుషవర్తనము - నాయొక్క పాపపునడతను, ఎన్నకుమయ్య - గణించవలదయ్యా, అటంచున్ - అనిపలుకుచు, వేవగలన్ - అనేకవిధములైన మనోదుఃఖరూపవిచారములచేత, సన్నుతిచేసినన్ - స్తోత్రముచేయఁగా, ఆర్ద్రచిత్తుఁడై - తడిసినహృదయముగలవాఁడై, మెత్తబడిన మనస్సుగలవాఁడై. ఆనఁగాఁబ్రార్థనమువలన మనస్సుకరిగినయమట, వ్య. అస్త్యర్థే పీత్యత్ర్యయిత్యార్థం, అః పూర్వః, తడుపఁబడునది, ఈపద్యమునఁ దెల్పవయ్య యనుటకు సూ. ఆర్యాదిశబ్దో యుక్తస్యా దసంబంధార్థబోధనే,అథ. "ప్రార్థనంబునందు వ్రుత్యయాంతక్రియలమీఁద గదకదవు పూర్వకంబు లన్నాదు లను ప్రయుక్తంబు లగు ప్రౌ. వ్యా. ఉదా. సుకీర్తి నగదన్న" భాగ, 'చెప్పగదయ్య' భాస్క. "గీ. కృపదలంపగదయ్యయో♦నృపవరేణ్య" శృ. నై. ఇందు "అమరలోకనాథ, శచీవామదృగీశ' ఇత్యాది సంబోధనలతోఁ బ్రార్థించుటచేఁ బరికరాలంకారము. "విశేషణైర్య త్సాకూతై రుక్తిః" కా. ప్ర.

తా॥ ఓదివ్యలోకాధపతీ! యీగొప్పశాపమునకు విమోచనమేదియో యానతిమ్ము. అయ్యో నేనేమిచేయఁగలను. ఓశచీపతీ, నన్ను దయతోఁగాపాడుము. ఓదేవప్రభూ, నాకలుషవర్తనమును గణింపకుము. ఇట్లు బహువిధముల స్తుతింపఁదొడఁగెను.

—: ఇంద్రుఁడు శాపవిమోచనవిధమానతిచ్చుట :—

క॥ రమణీ తప్పదు నావా, క్యము పాషాణత్వ మొందు ♦ మదియెన్నఁటికిం
దుము రై ధరణీస్థలిఁబడు, సమరగ శాపమును నాఁటి ♦ కంతము నొందున్. 47

అ॥ రమణీ - చక్కనిదానవగునోరంభా, ని. 'సుందరీరమణీరామా' అని అ. నావాక్యము - నేననినమాట, తప్పదు - తొలఁగిపోదు, పాషాణత్వము - శిలారూపమును, ఒందుము - పొందుము

రాయివికమ్మనుట, అది — ఆరాయి, ఎన్నఁటికిన్ — ఏదినమునకు, తుమురు + ఐ—పిండియై, ధరణీస్థలిన్—పుడమియందు, పడున్—పడునో, నాఁటికిన్ — ఆదినమునకు, శాపమును — ఈశాపముగూడ, అమరఁగన్ — ఒప్పునట్లుగా, అంతమునొందున్ — నశించును, విమోచనమగును.

తా॥ ఓరంభా! నావాక్యము తొలఁగదు. కావున శిలారూపమును దాల్చుము. అది యెప్పుడు చూర్ణమై పుడమిపైఁ బడునో యప్పటి కీశాపవిమోచన మగును.

## —: రంభ నిరంకుశునికడకువచ్చి దుఃఖించుట :—

వ॥ పొమ్ము ధరిత్రింబుట్టు మని నియోగించి కొలువుచాలించి శచీకాంతు డంతఃపురంబున కరిగె. సురగరుడోరగాదులందఱుఁ దమతమ నివాసములకుఁ జనిరి తదీయవిద్వేషిణు లగు కలభాషిణులు కొందఱు సంభృతానందలై గృహంబులకేగిరి. తదీయసఖు లగు సరోజముఖులు గొందఱు వందురుచు వెంటనచనుదెంచి రప్పుడు రంభ దుఃఖారంభయై వారల మగుడించి పుడమి కేతెంచి నిరంకుశునిగాంచి శోక భరం బాఁపలేక. 48

అ॥ పొమ్ము — ఇఁకఁదప్పుమవెళ్ళుము, సూ. పొమ్మునిశ్చయార్థంబునందగు, అని ప్రౌ. వ్యా. ఉదా. "అ, ల్లనిఁగల్యాణగుణోత్తరుంబడయకె…బోరఁబొమ్మంచు" అనినిర్వ. ధరిత్రిన్—భూలోకమున, పుట్టుము-జన్మించుము,అనినియోగించి — అనియాజ్ఞాపించి, కొలువుచాలించి—తనయాస్థానమును నిలుపుదలచేసి,శచీకాంతుఁడు—శచీదేవికి మనోహరుఁడగు నాయింద్రుఁడు, అంతఃపురంబునకున్—రాణివాసమునకు, అరిగెన్ — పోయెను, సురగరుడోరగాదులు — సుర — దేవతలును, గరుడ-గరుడులును ఉరగ — పన్నగులును, ఆదులు — మొదలగువారు, అందఱున్ — సమస్తమయినవారును, ఇచట 'అందఱున్' అనుటను సూ. "క్రియదర్థాదికాశ్శబ్దాధవంత్యర్థవిశేషదాః, భవంత్యజడవాచిత్వేర్వంతా శబ్దామనోహరాః" అథ. తమ తమనివాసంబులకున్ — వారివారిగృహములకు, చనిరి—ఏగిరి, ఇచట 'తమతమ' అనుటను సూ. కర్తృబహుత్వంబునఁదన తనకుఁ దమతమయునగు' ప్రౌ. వ్యా. తదీయ — ఆరంభయొక్క సంబంధమైన, విద్వేషిణులు — విరోధురాండ్రు, అగు కలభాషిణులు — అయిన మాధుర్యముగ మాట్లాడు…ట్టియచ్చరలు, కొందఱు—కొంతమంది, సంభృతానందలై. సంభృత—మిక్కిలి భరింపఁబడిన, ఆనందలై—సంతోషముగలవారై, గృహంబులకేగిరి—ఇండ్లకుఁబోయిరి, తతీదీయ— ఆరంభయొక్క—సంబంధులైన, సఖులు—స్నేహితురాండ్రు, అగుసరోజముఖులు—అయినపద్మములవంటిముఖములు గలయప్సరసలు, కొందఱు—కొంతమంది, వందురుచున్ — దుఃఖపడుచు, వెంటన — ఆపెవెనువెంటనే, చనుదెంచిరి — వచ్చిరి, అప్పుడు — ఆసమయమున, రంభ — ఆదేవవేశ్య, దుఃఖారంభయై— దుఃఖము యొక్క ఉపక్రమముగలదియై, వారలన్ — తనసఖురాండ్రను, మగుడించి— మరలునట్లుచేసి, అనఁగాఁ దిరిగి స్వర్గమునకంపియనుట, పుడమికిన్ — భూలోకమునకు, ఏతెంచి — వచ్చి, నిరంకుశునిన్ — నిరంకుశుడను పేరుగల యాబ్రాహ్మణుని, కాంచి — వీక్షించి, శోకభరంబు — దుఃఖభారమును, ఆఁపలేక — అడ్డగించుకొనఁజాలక, ఇందు 'విద్వేషిణులు' అనుప్రాసము. 'రంభ దుఃఖారంభ యై' యమకాలంకారము.

తా॥ పొమ్మి భూలోకమున నవతరించు మని యాజ్ఞాపించి కొలువుచాలించి పౌలోమీవల్లభుండు రాణివాసంబున కేగెను. దేవతలు, గరుడులు, పన్నగులు, మున్నగువారందఱును వారి వారి గృహంబులకుఁజనిరి. తన విరోధురాండ్రగు కొందఱానందించుచు నిండ్లకుఁ బోయిరి. స్నేహితురాండ్రగు కొందఱుదుఃఖించుచు నామె వెనువెంటనే చనుదెంచిరి. అయ్యెడ రంభ యేడ్చుచుఁ జెలులను దివి కంపి భూలోకమున కరుదెంచి యానిరంకుశునిఁ గని దుఃఖభారమును నిలుపఁజాలక.

చ॥ జలజముఖి నవీనసుమ ♦ సాయకముందఱ మందరామరా
చలపరిమాణ మైనబిగి ♦ చన్గవ యూర్పులఁ బిచ్చలింపఁగా
సొలవక యేడ్చె గాఢతర ♦ శోకతటాకము చాల నిండి రెం
డలుఁగులఁ బాఱెనోఁ యనఁగ ♦ నశ్రుకణంబులు జాఱెఁ గన్నులన్. 49

అ॥ జలజముఖి - తామరపువ్వువంటి మొగముగలదైన యాదేవవేశ్య, చంద్రునివంటి ముఖము గలదైనయనియుఁ జెప్పవచ్చును. జలా జ్జాయత ఇతి జలజః అనివ్యు. జలజముఖీశబ్దః జీబంతత్వ్యస్త్రావా జలజముఖి. జలజముఖ. ఈరెండు రూపములునుకలవు. నిరం I. 78 చూ. 7 ఉదా. 'నిద్రాచిరేణ నయనాభిముఖీబభూవ' రఘు. ఈనవీనసుమసాయకుముందఱ — నూతన మన్మథునివంటివాఁడైన యీ యొక్క నిరంకుశునియెదుట — మందరామరాచలపరిమాణము. మందర— మందరపర్వతమును, అమరాచల — దేవతలకు నివాసమయిన మేరుపర్వతమును, పరిమాణము — ప్రమాణము- సమానము, ఐన బిగి చన్గవ — అయిన దృఢమైన స్తనద్వయము, ఊర్పులన్ — నిట్టూర్పులచేత, దీర్ఘశ్వాసములచేత, పిచ్చలింపఁగాన్ -- తల్లడిల్లఁగా, సొలవక — వెనుదీయక — నిస్త్రాణపడక, ఉదా. గీ. నాతి రాయంచ గుమిగూడి♦నడచుమురువు, చెలుల గెలువఁగ జమునాఁటి♦ సొలపునలపు. విజ. ఏడ్చెన్ — దుఃఖించెను, గాఢతరశోకతటాకము. గాఢతర — అధికమైన, శోక — విచారమనెడు, తటాకము — చెఱువు, చాలన్ — విస్తారముగ, నిండి — సమృద్ధియై, రెండలుఁగులన్ — నీళ్ళెక్కువైనపుడు పోఁగొట్టెడు రెండుతూములతో. 'ని. అలుగు, అలువు, మరిగొమ్మ, ఆం. వా. పాఱెనో — ప్రవహించుచుండెనేమో, అనఁగన్ — అనునట్లు, కన్నులన్ — నేత్రములనుండి, అశ్రుకణంబులు — కన్నీటిబిందువులు, జాఱెన్ — స్రవించెను, ఇచట రంభ తన ప్రియుఁ డగపడినంతనే తనకుఁ గల్గినకష్టమును జెప్పఁజాలక దుఃఖించెనని కవివర్ణించినాడు, కాచవిభుఁడును విఠ్ఠలరాజు నీప్రకారముగవర్ణించిరి.

'ద్వి. అంతటరంభయు♦నంభోజసరసి, దంతిచొచ్చినచొప్పు♦ తనకుఁబాటిలిన
చింతాపరంపర♦ చిత్తంబులోన, నంతకంతకుదట్ట♦ మైకడల్కొనఁగఁ
దలఁకుచుఁ గొంకుచు♦ఁ దనలోనదానె, పలుకుచుఁ బులిబారిఁ♦ బడిపడిచెడిన
హరిణిచందంబున♦ నటఁదొట్రుపడుచుఁ, బిరిగొన్నదురవస్థఁ♦ బ్రియుపాలి కరిగి
యడుగులఁ బడి వేచి♦ యందందమేను, వడఁకంగ వదనంబు♦ వంచి హారములు
పెనఁగొనఁగ నయంబు♦ ప్రిదులలోఁజెరివి, కొనినపూవులుగందఁ♦ గ్రొమ్ముడి వీడఁ
దొంగలిఱెప్పలఁ♦ దోఁగుబాష్పములు, తుంగస్తనంబులఁ♦ దొరుఁగనట్లున్నఁ
గనుఁగొని యదియేమి♦ కాంతనీ చంద, మనవుడు. ద్వి. ఉ. ఖా.

ఇందు 'జలజముఖీ నవీనసుమసాయకుముందఱ అనుచోట సంధినిగూర్చి 'సూ. పత్రచిత్సం స్మృతీయోపి ప్రాణోప్య త్రచ్యుతోభవేత్' అథ. 'ఉదా. సకలశుభములు శౌరిచ్చు♦జనులకెపుడు. నవీనసుమసాయకుఁడు, శోకతటాకము, ఇవి ఏకదేశవర్తిసావయవరూపకము 'క. ధరనొఱయను వల్మీకము, సరభసగతి వెడలి నీదు♦ చటులాసిమదో♦ద్ధురచర దరి ధరణి ధురంధర జీవానిలముఁగ్రోలు ♦ నరసింహనృపా' వరస. 'మందరామరాచల పరిమాణమైన బిగిచన్నవ' ఉపమాలంకారము. 'రెండలుఁ గులబాఱెనోయనఁగ, క్రియాస్వరూపోత్ప్రేక్ష. 'చ. అనఘ నృసింహనీఘనజ♦ యానకజాత భయానకాదిక,ధ్వనులుగుహాగృహాగ్రముల♦వ్రాలఁ బ్రతిధ్వనిమేదురంబులై,తనరె దిగంతశైలములు♦ తమ్ముగనెదురొక్కనువైరికోటికిన్, నినుశరణంబువేఁడు మని♦ నేర్పునబుద్ధులునేర్పుకైవడిన్' కావ్యా. సం.సంభావనమథోత్ప్రేక్షాప్రకృతస్య సమేనయత్. కాప్ర. ఉదా. లింపతీవ తమోంగాని వర్షతీవాంజనం నభః అసత్పురుషసేవేవ దృష్టిర్విఫలతాం గతా. మృచ్ఛ. రంభ దుఃఖించుటకుఁ గారణమేమన "పునర్విత్తం పునర్మిత్రం పునర్భార్యా పునర్మహీ ఏతత్సర్వం పునర్లభ్యంనశరీరం పునఃపునః. చాణ. శ్రీనాథుని సీ.ప్రవిమలాక్షి నభోన♦భస్యాంబుదములకు, నవవృష్టిధారలై♦యవతరిల్లి,... తే.వేఁడియశ్రులునిగుడంగ♦ వెక్కి వెక్కి, యేడ్వఁదొడఁగెలతాంగి పృ♦ థ్వీశుప్రోల, మృదులపరిదేవనా కరోన్మిశ్రమధుర, కంఠకాకునికారకా♦కలికయలర' అనుపద్యమునుజూచి రామరాజభూషణుఁడు "శా. ఆజాబిల్లివెలుంగుడాయికలడా ♦ యన్నేకరా కానిశా, రాజశ్రీసఖమైనమోమునఁబటా♦గ్రంబెత్తియెత్తియా, రాజీవానన యేడ్చెఁగిన్నరవధూ♦ రాజత్కరాంభోజకాం, భోజీమేళవిపంచికారవసుధా ♦ పూరంబుతోలంబు, గాన్" అనియును, పెద్దనార్యుఁడు. "ఉ. పాటునకింతులోర్తురె కృ♦పారహితాత్మక నీవుద్రోయని చోఁటభవన్నఖాంకురము♦ సోఁకెఁగనుంగొనుమంచుఁ జూపియ, ప్పాటలగంధి వేదననె♦ పంబిడియేడ్చెఁ గలస్వనంబుతో, మీటిన గబ్బిగుబ్బచను ♦ మిట్టలనశ్రులు చిందువందఁగన్" అనియును. తిమ్మనార్యుఁడు. "ఉ. ఈసునఁబుట్టి డెందమున ♦ హెచ్చినశోకదవానలంబుచే, గాలినియేడ్చెఁ బ్రాణవిభు ♦ కట్టెదుటన్ లలితాంగి పంకజ, శ్రీసఖమైన మోముపయిఁజేల చెఱఁగిడి బాలపల్లవ, గ్రాసకషాయకంఠకల♦కంఠవధూకలకాకలీధ్వనిన్" అనియును వ్రాసియుండిరి. తెనాలిరామలింగ కవి యీ మువ్వురినిగూర్చి యిట్లు చెప్పెనని వదంతి. "అల్లసాని పెద్దన యల్లనల్లనయేడ్చె♦ ముక్కు తిమ్మనముద్దుముద్దుగానేడ్చె ♦ బట్టుమూర్తి బావురుమనియేడ్చె" రుద్రకవి యీమువ్వురివలెఁగాక వేఱుఫక్కిని వ్రాసెను.

తా॥ ఆకమలలోచన నవమన్మథునివంటివాఁ డయిన నిరంకుశునిప్రోల మందర మేరుగిరులతో సమానములగు స్తనములు నిట్టూర్పులచేఁ దల్లడమగునట్లేడ్చుచుండఁగా మిక్కుటమైనదుఃఖ మనెడు చెఱువు విస్తారముగ నిండి రెండుతూములఁ బాఱుచుండెనేమో యనునట్లు కన్నులనుండి బాష్పములు కాఱుచుండెను.

వ॥ ఇవ్విధంబు ననివ్వటిలు నెవ్వగలనేడ్చువధూమణింజూచి యతండిట్లనియె.50

అ॥ ఇవ్విధంబునన్ — ఈప్రకారముగా, నివ్వటిలు — అతిశయించుచున్న, నెవ్వగలన్ — గొప్పశోకదుఃఖరూపమయిన విచారముతో, నెర + వగ — నెవ్వగ, అగును, ఏడ్చువధూమణిన్ — దుఃఖించుచున్న సామాన్యస్త్రీలలో శ్రేష్ఠురాలగు నారంభను, చూచి — వీక్షించి, అతండు — ఆనిరఁ

ముఁడు, ఇట్లనియెన్ — ఈచెప్పఁబోవురీతిగాఁబలికెను, ఈవచనమున 'నివ్వటిలు' అని ప్రయోగించుటకు 'సూ. యథాశాస్త్రం యథాశక్తి యథాశ్రోత్రానురంజనం, యథాప్రసిద్ధి సర్వత్రశబ్దానాం కల్పనామతా' అథ. 'సూ. రంజయతిఘట్యాదీనాం బిందోశ్చస్యాపిలావుభౌభవతః' శబ్దచిం. 'ఇవ్విథంబున నివ్వటిలు నెవ్వగల' వృత్త్యనుప్రాసాలంకారము.

తా॥ ఇట్లుమించినవిచారముతో వగచుచున్నయారంభనుఁ జూచి నిరంకుశుండీరీతిగాఁ బలికెను.

## —: నిరంకుశుఁడు రంభతోఁబ్రశ్నించుట :—

చ. నెరయ విషాదహేతువుగ ♦ నీతెలిగన్నుల నశ్రుబిందువుల్
దొరఁగు టెఱుంగ మెన్నఁడు గు ♦ తూహల కారణ బాష్పజాలముల్
గురియుటె కాని నేఁడు కనుఁ ♦ గొల్కుల వెంబడి నశ్రుపూరముల్
పరఁగఁగ నేలయేడ్చెదవు ♦ వారిజలోచన యేర్పఱింపవే. 51

అ॥ వారిజలోచన — తామరపువ్వులవంటి కన్నులుగలదానా, నెరయన్ — నిండునట్టి, ఉదా. "తరళనయనాబ్జదళములు, నెరయఁగఁబైమున్నచల్లి ♦ నృపసుతుఁబూజిం,చిరి" భార. విషాద హేతువుగన్ — దుఃఖకారణముగా, నీతెలిగన్నులన్ — నీయొక్కస్వచ్ఛమయిన నేత్రములయందు, అశ్రుబిందువుల్ — కన్నీటిబొట్లు, తొరఁగుట—స్రవించుట - జాఱుట, ఎన్నఁడున్ — ఏదినమునను, ఎఱుంగము — మేముచూచియుండలేదు, కుతూహలకారణబాష్పజాలముల్. కుతూహల — కోరికకు, కారణ — హేతువైన, బాష్పజాలముల్ — కన్నీటిచుక్కలసమూహము, అనఁగా సంతోషపూరితమైనబాష్పపరంపరలనుట. కురియుటెకాని — వర్షించుటయేతప్ప, నేఁడు — ఈదినమున, కనుఁగొల్కుల వెంబడి — కనుఁగొనలనుండి - నేత్రాంతములనుండి, ఇచట 'కొలికి' బహువచనమున 'కొలుకులు' అగుట 'సూ. ఇదుపోత్తమోత్తమానాం బహువచనఉపోత్తమేతఊద్భవతి' శబ్దచిం, ఆ 'కొలుకులు' "సూ. నలడాదేరంతరుతశ్చ" "అన్యేషాంచ ప్రయోగమహితానాం" అనునన్నయభట్టీయసూత్రములచే'కొల్కులు' అయినవి. అశ్రుపూరముల్ — కన్నీటియొక్కప్రవాహములు, పరఁగఁగన్ — పాఱుచుండఁగా, - ప్రవహించఁగా, ఏలయేడ్చెదవు — ఎందులకువిలపించుచున్నావో, ఇచట 'వఱదలుగట్టనేడ్చెదవు' అనిపాఠాంతరము. అర్థము రెంటనుసమానమే. కవిరేఫశకటరేఫములకు మైత్రినిగూడఁజూపియున్నాఁడు. ఏర్పఱింపవే — స్పష్టమగునట్లు విభజించిచెప్పుము ఈపద్యమున 'పరఁగఁగన్' అనిప్రయోగించుట కుదా. 'మ. అ. స్తోకప్రవాహంబులై పరఁగెన్ రక్తనదుల్' భార. "ఎఱుంగమెన్నఁడు" అనుటకు 'సూ. వ్యతిరేకక్రియయర్థత్రయబోధకంబగు" ప్రౌ. వ్యా. ఉదా. "క. నలుఁగానమి వ్వనంబున" భార. కేవలనిరవయవరూపకాలంకారము. "క. ఇలనీదుకీర్తిచంద్రిక, యలఘుతరస్ఫూర్తినలిన♦ జాండకరండం, బులునిండివెల్లివిరిసె, న్నలనహుషసమానశీల, నరసనృపాలా" కా. సం.

తా॥ ఓకమలాక్షీ! ఎల్లప్పుడు నీనయనములయం దానందబాష్పజములు దప్ప నిండారిన వగపుతో నశ్రువులు స్రవించుట నే నెన్నఁడును జూచియుండలేదు. నేఁడు కనుగొనలయందు కన్నీటిధార యేఱులైపాఱున ట్లేడ్చుచున్నా వెందులకో వివరింపుము.

చ॥ తలఁపున మాటలం గ్రియలఁ ♦ దామరసేక్షణ నిన్నె కాని యే
పొలఁతుల నొల్ల నీనిజము ♦ పుష్పశరాసనుఁడే యెఱుంగు మొ
క్కలమున నున్న నేరము లొ ♦ కానొకనాఁడును జేయ వీయెడ
న్దెలియదు శోకహేతువు వి ♦ నీలశిరోజ యెఱుంగ జెప్పవే. 52

అ॥ తామరసేక్షణ — పద్మములవంటికన్నులుగలయోరంభా, తలఁపునన్ — ఆలోచనయందును, మాటలన్ — పలుకులయందును, క్రియలన్ — పనులయందును, అనఁగా మనోవాక్కాయకర్మంబులయందనుట. నిన్నెకాని — నిన్నొక్కదానినేతప్ప, ఏపొలఁతులన్ — ఏస్త్రీలను ఒల్లన్ — ఇష్టపడను, ఈనిజము — ఈచెప్పినట్టి నాయొక్కసత్యమును, పుష్పశరాసనుఁడే — పువ్వులుబాణములుగాఁగలమన్మథుఁడే, ఎఱుంగున్ — తెలిసికొనియున్నాఁడు, మొక్కలమున నున్నన్ — తెలియనిస్థితియందున్నప్పుడును, నేరములు — తప్పులు, ఒకానొకనాఁడును — ఏదో యొకప్పుడైనను, ఇచట 'ఒకానొక' యనుటకు సూ. ఒకానొకచోననిష్టార్థమందొక శబ్దమునకుంబూర్వాగమంబగు ప్రౌ. వ్యా. చేయవు — చేయునట్టిదానవుకాదు, ఈయెడన్ — ఈసమయమున, శోకహేతువు — దుఃఖమునకుఁగారణము. తెలియదు — నాకుబోధపడుటలేదు, వినీలశిరోజ — మిక్కిలి నల్లనైనతలవెంట్రుకలుకలదానా, ఎఱుంగఁజెప్పవే — తెల్లమగునట్లువచింపుము. యీ పద్యమున నంత్యపాదమునసంయుక్తయతి సెప్పఁబడినది. "క. వెలయఁగసంయుక్తాక్షర, ములలో నెద్దానినయిన ♦ మునుకొనివడిగా, నిలుపందగుఁబాదంబుల, నలఘుగుణాన్వితుఁడరేచ ♦ యసదృశదానా" సుల.

తా॥ ఓతమ్మికంటీ నామనస్సునను వాక్కులయందును గ్రియలయందును నిన్నుదప్ప యేస్త్రీల నిచ్చగింపను. ఈ సత్యము మన్మథునకే తెలియును. నీవుమఱపున నైననేదోయొక నేరమునుజేయు దానవుకాదు. అట్టి నీకుదుఃఖమునకుఁ గారణమేదియో గోచరింపకుండె విశదీకరింపుము.

—: రంభ నిరంకుశునితోఁ దన శాపకథనుజెప్పుట :—

క॥ అని యడిగిన భూసురునకు, ననిమిషవేశ్యాలలామ ♦ యాద్యంతంబున్
వినిపించి మఱుఁగ నేడువఁ, దనదుప్పటి మొగము దుడిచి ♦ తగ నిట్లనియెన్. 53

అ॥ అని — ఇట్లని, అడిగినభూసురునకున్ — ప్రశ్నించిన పుడమికివేల్పువంటివాఁడయిన యా నిరంకుశునకు, అనిమిషవేశ్యాలలామ — దేవవేశ్యలలో శ్రేష్ఠురాలగు నారంభ, ఆద్యంతంబున్ — మొదటినుండిచివరవరకును, అనఁగా జరిగినవృత్తాంతమంతయుననుట, వినిపించి — చెప్పి, మఱుఁగన్ — మరల, ఏడువన్ — విలపించుచుండగా, తనదుప్పటిన్ — తనయొక్క యుత్తరీయపుచెఱఁగుతో, మొగముదుడిచి — ఆబిడయొక్క కన్నీరుపోవునట్లుముఖమునుదుడిచి, తగన్ — ఒప్పునట్లు, ఇట్లనియెన్ — ఈచెప్పబోవువిధముగాఁబలికెను. స్వభావోక్త్యలంకారము.

తా॥ అని ప్రశ్నించిన నిరంకుశునితో నారంభ జరిగిన వృత్తాంత మంతయు నెఱింగించి మరల విలపించుచుండఁ దన యుత్తరీయపుచెఱఁగుతో ముఖమును దుడిచి యిట్లనియె.

—: నిరంకుశుఁడు రంభనోదార్చుట :—

ఉ॥ ఇంతెకదా లతాంగి మఱి ♦ యేమి యటంచు విషాద మొందితిం
జింతిల నేల యిప్పనికి ♦ శీఘ్రము శాపవిముక్తి చేసెదన్
అంతొనరింప కిక్షణమె ♦ ఱావయి నిల్వుము భీకరంబుగా
నెంతయు నిప్పురంబుకడ ♦ నేన యెఱుంగుదుఁ బై విచారమున్. 54

అ॥ లతాంగి — తీఁగవంటిశరీరముగలదానా, ఇంతేకదా — ఇంతమాత్రమేకదా, మఱియేమి యటంచున్ — ఇంక నేమిగొప్పయాపదయోయనుకొనుచు, విషాదమొందితిన్ — విచారపడితిని, ఇప్పనికిన్ — ఈ చిటికార్యమునకు, చింతిలనేల — వగవంబనిలేదు, శీఘ్రము — వెంటనే, శాపవిముక్తి — శాపమునుదొలగించుటను, చేసెదన్ — చేయఁగలను, అంతు+ఒనరింపక — పరిపరివిధములధ్వనిచేయక, ఇప్పురంబుకడన్— ఈపట్టణమునకుసమీపమున, ఈక్షణము—ఈసమయముననే, క్షణమనఁగా గడియలోనాలవవంతు "ని. అష్టాదశనిమేషాస్తుకాష్ఠాత్రింశత్తుతాఃకలాతాస్తుత్రింశత్క్షణః" అ. ఎంతయున్ — మిక్కిలి, భీకరంబుగాన్ — భయమునుగలిగించునట్లు, ఱావయినిల్వుము — పాషాణత్వమును దాల్చియుండుము, పైవిచారమున్—అమీఁదటజరుగవలసిన యాలోచనయంతయును, నేనయెఱుంగుదున్ — నేనేతెలిసికొనియున్నాను, ఇచటశాపవిమోచనమును వెంటనే చేయుదుననుటలో నిరంకుశునియొక్క సంపూర్ణసామర్థ్యము విశదమగుచున్నది. "శ్లో॥ కోఽతిభారస్సమర్థానాం, కిందూరంవ్యవసాయినాం, కోవిదేశస్సవిద్యానాం, కఃపరఃప్రియవాదినామ్" "క. దూరమువ్యవసాయకులకు భారంబుసమర్థులకును భానురవిద్యా, పారగులకునువిదేశము, వైరముప్రియవాదులకును వసుమతిఁగలదే" నీ. సా. ఇచట రంభతోనిరంకుశుఁడు గతించినదానికై వగవఁగూడదనుటనుగూర్చి "గతే శోకోనకర్తవ్యో భవిష్యంనైవచింతయేత్, వర్తమానేనకాలేన ప్రవర్తంతే విచక్షణాః" చాణ,

తా॥ ఓయువిదా! ఇంతమాత్రమేకదా! ఇంక నెంతగొప్పయాపదయో యని నామనస్సులోఁ జాలవిచారపడితిని. ఈపనికై వగవవలదు. వెంటనే నీయొక్క శాపవిమోచనము చేయఁగలను. పరిపరివిధముల ధ్వనిచేయక యిప్పుడే యీపట్టణమునకు సమీపమున నతిభయంకర మయిన శిలారూపము ను దాల్చుము. ఆమీఁదట జరుగవలసిన కార్యమును నేనే చేయఁగలను.

చ॥ అనవిని శుష్కహాసవద ♦ నాంబుజయై సురకాంత పల్కె నో
యనుపమరూప నీమహి ♦ మ ట్టిద యౌఁగద శాపమోక్షణం
బొనరఁగ నెట్లు చేసెదవొ ♦ కో యొకయింత వచింపరాదె నా
మనము విషాద మార్పనొక ♦ మాటకు నట్టివో లేక తథ్యమో. ౫౫.

అ॥ అనన్ — ఇట్లుపలుకఁగా, విని — ఆకర్ణించి, సురకాంత — దేవతాస్త్రీలలోఁ జక్కని దయిన యాయప్సరస, శుష్కహాసవదనాంబుజయై. శుష్కహాస — చట్టినవ్వుతోఁగూడిన, మనస్సున సంతోషమేమియులేక కేవలము నవ్వుతోమాత్రమే యనుట. వదనాంబుజయై పద్మమువంటి ముఖము గలదియై, పల్కెన్ — ఇట్లువచింపనారంభించెను, ఓయనుపమరూప — అసమానమయిన సౌందర్యము.

గల యోనిరంకుశుఁడా, నీమహిమలు— నీమాహాత్మ్యములు, అట్టివయాఁగద — అటువంటివేగ్గియున్న[illegible]కిని, శాపమోక్షణంబు — ఇంద్రునివలన సంభవించిన యీశాపమును తొలఁగించుకార్యము[illegible]. ఒన రఁగన్ — ఒప్పునట్లుగా, ఎట్లుచేసెదవో కో — ఏప్రకారముగాఁ [illegible] కొంచెము, వచింపరాదె — నాకుఁజెప్పఁగూడదా, నామనము విషా[illegible] — నా [illegible]గల దుఃఖమును బోఁగొట్టుటకు, ఇచట నలఘురేఫములఘురేఫమగుటకు 'సూ. అలఘురేఫములుప్రాచ్యము గుచోలఘురేఫంబగు' ప్రౌ. వ్యా. ఒకమాటకున్ + అంటివో — కొంచెము మాటమాత్రముగానని యున్నావో, లేక — అటులఁగాక, తథ్యమో — నిజమో, ఇందుమూఁడవపాదమునఁ గాకుస్వరయతి చెప్పఁబడినది. "గీ. వరుసదీర్ఘాంతసంబుద్ధి ♦ వచనయతులు, నమరుఁగ్రుతులందుఁగాకుస్వ♦ రముసహస్ర, నామశోభితగోపకృ♦ష్ణాయనంగ,నమరవందిత గోపకృ♦ష్ణాయనంగ' ఉదా. 'ఉ. వల్లభుఁడేగు దుర్లభుఁడు♦ వానిదెసందగులూఁది యిమ్మెయిన్,దల్లడమందెదేలయుచి♦తస్థితికిన్నుఁబాపఁ జూపినన్,దల్లియుబంధు లోకమును♦దండ్రియునేనును వారెఱింగిరే, నుల్లమయిట్లునీకుఁదగు♦నో తగదో పరికించిచూడుమా' విజ. సే. 'వదనాంబుజ' ఉపమాలంకారము.

తా॥ ఈరీతిగా వచించిన విని యాయిందకర్త్రె హృదయవికాసను లేక యూరకి నవ్వి యిట్లు పలుక నారంభించెను. ఓసాటిలేని చక్కఁదనముగలవాఁడా! నీమహిమ లాలాటివే యైనను నింతగొప్ప శాపము నెట్లుతొలఁగించెదవో కొంచెము నాకుఁజెప్పుము. నాదుఃఖము నుపశమింపఁజేయ నిట్లంటివో లేక నిక్కమో తెలిసికొనెదను.

వ॥ అని పల్కిననతండు. 56

అ॥ అని ఈప్రకారముగా, పల్కినన్ - వచింపఁగా, అతండు — ఆనిరంకుశుఁడు,

ఆ॥ అతివ మాట యొకటి ♦ యవ్వల నొనరిచు, చేఁత [illegible] ♦ జెప్పనేల
మాటకన్నఁ జేత ♦ మట్టు గాకు [illegible], [illegible] ♦ చె[illegible] [illegible]. 57

అ॥ అతివ — ఓరంభా, మాటయొకటి — మాటయొకరీతిగను, అవ్వలన్ - అటుపిమ్మట, ఒన రించుచేఁత — చేయునట్టిపని, ఏదియైనన్ — ఏదోయొకవిధముగా [illegible], చె[illegible] — వచించుట యెందులకు, మాటకన్నన్ — వాక్యమునకంటె, చేఁత — కార్యము, మట్టుగాకున్నను — సాధ్యము కాకుండినట్లయిన — మితిమించినపక్షమున, చేఁతననుసరించి — కార్యమును బట్టియే, శక్తికొలఁదియే యనుట. చెలఁగవలదె — వర్తించవలదా, అనఁగా శక్తినిమించి మాట్లాడ గూడదనుట.

తా॥ ఓనారీ! చెప్పుటయొకటి తదుపరి చేయునదొకటియైన చెప్పఁగూడదు. చెప్పుటకు సులభ ముగను జేయుట కసాధ్యముగను నుండినపక్షమున దానిననుసరించియే చెప్పవలెను.

—: రంభ శిలారూపమున దాల్చుట :—

క॥ నీవీమాటకు [illegible] దే, హావి[illegible]ంబు నొ[illegible] ♦ కబల కఠోర
గ్రావంబై పుట్టుము నా, నా వేఁడియు నట్లు చేసె ♦ నాపురము కడన్. 58

అ॥ అబల – ఓయాఁడుదానా, నీవు, ఈమాటకున్ – నేఁజెప్పిన యీవాక్యమునకు, సందేహా విర్భావంబున్. సందేహ – సంశయముయొక్క, అనుమానముయొక్క, ఆవిర్భావంబున్ – కలుగుటను, ఒందకు – పొందకుము, కఠోరగ్రావంబు - గట్టిరాయివి, ఐపుట్టుము – అయిజన్మించుము, నాన్ - అనగా, ఆవెలఁదియున్ – ఆసురవేశ్య, ఆపురముకడన్ – ఆపట్టణమునకు సమీపమున, అట్లుచేసెన్ – అతఁడు చెప్పినవిధముగాఁ నొనరించెను, అనఁగాఁ గఠినశిలారూపమును ధరించెననుట.

తా॥ ఓపడతీ! నీవు సంశయింపక గట్టిరాయివగుము. నావుడు దివిజవేశ్య యప్పురప్రాంతమున నొకగొప్పశిల యయ్యెను.

క॥ శతతాళదఘ్న మగున, య్యతులగ్రావమ్ముఁ జూచి ♦ యప్పుడు భయసం
గతులై యాశ్చర్యసమా, యతులై గజగజవడంకి ♦ రచ్చటిజనముల్. 59

అ॥ అచ్చటిజనముల్ – ఆపురమునఁగల మనుష్యులు, శతతాళదఘ్నము – నూఱు తాడిచెట్లు మునుఁగునటువంటిది, అనఁగా నూఱుతాడిచెట్లకంటె నెత్తయిన యనుట. ఇచట దఘ్నశబ్దమునకు. “సూ. ప్రమాణేద్వయసజ్ దఘ్నఞ్మాత్రచః” సిద్ధాం. ఉదా “తత్రోరుదఘ్నః క్షితిరేణురాజౌ, తతోనితంబద్వయ సశ్చభూత్వా, క్రమేణమూర్ధ్నః కరిమంథమాత్రః, సమేత్యరక్తాభిహతః శశామ” రావ. అగు – అయినట్టి, అయ్యతులగ్రావమ్మున్ – అయొక్క సమానరహితమయిన శిలను, చూచి – కనుఁగొని, అప్పుడు – ఆసమయమున, భయసంగతులై - భీతితోఁగూడుకొనినవారై, ఆశ్చర్యసమాయతులై – చోద్యముయొక్క విస్తారముగలవారై, గజగజవడంకిరి – మిక్కిలి కంపమునొందిరి. ‘గతులై – యతులై’ అనుప్రాసాలంకారము.

తా॥ అచ్చటిపౌరు లానూఱుతాళ్లయెత్తయిన యసమాన మగు శిలాకారముఁ జూచి భయమును నాశ్చర్యమును దోఁపఁగా గజగజవడంక నారంభించిరి.

క॥ అదిరా యౌన్నత్యభరం, బిదిరా విస్తారగరిమ ♦ వీక్షింపఁగ ని
ట్లదిరా కాఠిన్యగుణం, బదిరా యిది కొండ గాక ♦ యశ్మమె తలఁపన్. 60

అ॥ వీక్షింపఁగన్ – చూడఁగా, ఔన్నత్యభరంబు - పొడవుయొక్క యతిశయము, అదిరా - ఆకనుపడునట్టి శిలదేరా, అదిగాక మరియొకటిలేదనుట. విస్తారగరిమ – విరివియొక్క గొప్పతనము, ‘ని. విస్తారో విగ్రహోవ్యాసః’ అ. ఇదిరా – ఇదియేరా, ఇంతవిశాలమయిన దింకొకటిలేదనుట. కాఠిన్యగుణంబు – కఠినముతోఁగూడిన స్వభావము. అదిరా – అదియేరా, ఇంతకంటెగట్టిది వేఱొకటి లేదనుట. అదిరా – దానికేతగ్గునురా, మెచ్చుకొనుట. ఇట్లు – ఈవిధముగా, తలంపన్ – విచారించఁగా, ఇది – ఇన్నిలక్షణములుగలిగినరాయి, కొండగాక – ఒక పర్వతముగాక, అశ్మమె - సామాన్య శిలయగునా, కాదనుట ‘ని. పాషాణప్రస్తరగ్రావోపలాశ్మానః శిలాదృషత్’ అ. ఇచట నశ్మశబ్దమునకు ‘సూ. అన్వేషాంవాలుగన్తస్య, అను సూత్రముచే నకారములోపించి ‘సూ. ఆత్మనమనన్తానాండావా’ అను సూత్రముచే ముప్రత్యయమువచ్చినది. ఈపద్యమున ద్విప్రాసము సెప్పఁబడినది. ‘అదిరా - ఇదిరా’ ఇత్యాదులనుప్రాసాలంకారము. ఇది కొండగాక యశ్మమె’ అనుటచే తనపహ్నవాలంకారము. “ప్రకృతం యన్నిషిద్ధాన్యత్ సాధ్యతే సాత్వపహ్నుతిః” కా. ప్ర.

తా॥ ఇంతటి యున్నతమును విరివియును గట్టియునుగలది యొకతిప్పగాక రాయియగునా.

సీ॥ అస్మదాదులతోడ ♦ నాకృతి దాల్చిన, భాగ్యదేవతయొ యీ ♦ ప్రస్తరంబు
కాక లోకం బెల్లఁ ♦ గబళింప వచ్చిన, యాదిశక్తియొ యీమ ♦ హాదృషత్తు
బలిసద్మరంధ్రంబు ♦ వెలువడి యెగసిన, యురగేంద్రుఁడో యీదృ ♦ ఢోపలంబు
దుస్సహానిలగతిఁ ♦ దునిఁగి రాలినకాంచ, నాద్రిశృంగంబొ యీ ♦ యశ్మరాజ

తే॥ మీసమున్నతశిల నీర ♦ జాసనాండ, సదనసంస్థాపితోజ్జ్వల ♦ స్తంభమొక్కొ-
యీభయంకరపాషాణ ♦ మినజబాహు, దండకలిత సముద్దండ ♦ దండమొక్కొ. 61

అ॥ ఈపస్తరంబు – ఈఱాయి, 'ని. పాషాణ ప్రస్తరోగ్రావోపలాశ్మాన శ్శిలాదృషత్', అ. అస్మాదులతోడన్ – నేను మొదలుగాఁగల వారందఱితోఁగూడ, ఆకృతి – రూపమును, తాల్చిన భాగ్యదేవతయొ – ధరించిన యదృష్టదేవతయైయుండునేమో, కాక – అటులగానిపక్షమున, ఈమ హాదృషత్తు – ఈగొప్పశిల ఇచట'దృషత్తు, అనుటకు "సూ. ద్విత్వోత్వే సర్వహలాంప్రాస్స్యాత్" నన్న. లోకంబెల్లన్ – ప్రపంచమునంతయును, కబళింపన్ – మ్రింగుటకు, వచ్చినయాదిశక్తియొ – వచ్చినట్టి యాదిశక్తియైయుండునేమో, ఈదృఢోపలంబు – ఈగట్టి పాషాణము, బలిసద్మరంధ్రంబు – పాతాళలోకముయొక్క బెజ్జమును, "ని. అధోభువన పాతాళం బలిసద్మరసాతలం, నాగలోకః" అ. "ఛిద్రం నిర్వ్యథనంరోకం రంధ్రంశ్వభ్రం వపాశుషిః" అ. వెలువడి – బహిర్గతమై – బయటికివచ్చి, ఎగసిన+ఉరగేంద్రుఁడో – ఉడ్డీనముచేసిన (పైకిలేచిన) సర్పములకురాజగు శేషుఁడై యుండునేమో, ఈయశ్మరాజము – ఈశ్రేష్ఠమయినశిల, "ని. రాజాప్రభౌచ నృపతౌ క్షత్రియేరజనీ పతౌ, యక్షేశక్రేచపుంసిస్యాద్రాగేరక్త వికాముకే" మే. రాజశబ్దమున నకారము లోపించుటకు "సూ. అగుణవతాం సర్వహలాంసోర్లోపః" నన్న. ముప్రత్యయము వచ్చుటకు. "సూ. స్వార్థప్రధాన భావేస్యాద్రాజ్ఞోడుఃపుంసిచేతనే" అధ. ఈసూత్రమునను సరించి పుంలింగమునందుమాత్రమే డుప్రత్య యము వచ్చునుగాని నపుంసకమునందు ముప్రత్యయమే వచ్చును. ఉదా. నమస్మ నిరాజుండు- నమస్మ నిరాజసీత - బహురాజముదేశము" దుస్సహానిలగతిన్ – దుస్సహ – ఓరువరాని, అనిల – వాయువుయొక్క, గతిన్ – సంచారముచేత, అనఁగాఁ ప్రబలమైనవాయుతాడనము చేతననుట. తునిఁగి – తునుకయై, రాలిన కాంచనాద్రిశృంగంబొ-క్రిందఁబడిన మహామేరువుయొక్క శిఖరమైయుండునేమో, ఈసమున్నతశిల – ఈమిక్కిలి పొడవైనరాయి, నీర.........స్తంభమొక్కొ. నీరజాసనాండ – బ్రహ్మాండమనెడు- భూగోళ ఖగోళాదికమనెడు, సదన – ఇంటియందు, సంస్థాపిత – పాతిపెట్టఁబడిన, ఉజ్జ్వల – ప్రకాశించుచున్న, స్తంభమొక్కొ – కంబమైయుండునేమో, ఈభయంకర పాషాణము- భయమును గలిగించుచున్న యీశిల, ఇన.........దండమొక్కొ, ఇనజ – సూర్యునికుమారుఁడ యిన యమునియొక్క, బాహుదండ – దండమువంటిభుజమును, కలిత – పొందఁబడిన, సముద్దండ – అత్యంత భయంకరమయిన, దండమొక్కొ – దుడ్డుకఱ్ఱయైయుండునేమో, శుద్ధసందేహాలంకారము. "విషయో విషయీ యత్ర సాదృశ్యాత్కవిసమ్మతాత్, సందేహగోచరౌ స్యాతాం. సందేహాలం కృతిశ్చ సా" ప్రతా. "స సందేహస్తు భేదోక్తౌ తదనుక్తౌ చ సంశయః" కా. ప్ర ఉదా. "అయం మార్తాండః కిం సఖలుతురగైః సప్తభిరితః, కృశానుః కిం సర్వాః ప్రసరతి దిశో నైషనియ

తం, కృతాంతః కిం సాక్షాన్మహిషవహనో ఽసావితి చిరం. సమాలోక్యాజౌ త్వాం విదధతి వికల్పాన్ ప్రతిభటాః” “ఉ. ఇంద్రుఁడో యుపేంద్రుఁడో బ ♦ లీంద్రుఁడో పార్వణచంద్రుఁడో హరి,శ్చంద్రుఁడో రామచంద్రుఁడో ర ♦ సాభరణప్రసరాత్మ్రుఁడైననా, గేంద్రుఁడో యా నగేంద్రుఁడో మృ ♦ గేంద్రుఁడో యంచు, దలంతు రాహ్యలీ సాంద్రభుజప్రతాపరణ ♦ సాహసు నోబయ నారసింహునిన్” కా. సం. ‘దండకలిత సముద్ధంకదంశనెుక్కొ’ యపకాలంకారము.

తా॥ ఈరాయి మాయందఱియొక్కయాకారములలొక్కటిగా (దాల్చియవతరించిన యదృష్టదేవతయో, ప్రపంచమును మ్రింగనేతెంచిన యాదిశక్తియో, పాతాళలోకమునుండి పైకివచ్చిన శేషుఁడో, ప్రచండవాయుతాడనమువలన భగ్నమై భూమిమీద బడినమేరుశిఖరమో, బ్రహ్మాండ మను గృహమున స్థాపించబడిన స్తంభమో, యమునిభుజమునందుండెడు భయంకరమైనదండమో,

వ॥ అని యనేకప్రకారంబుల వితర్కించి యిది మహా దుర్నిమిత్తంబుగాని వేఱొండు గాదనినిర్ణయించి నిజనివాసంబుల కరిగి రంత దైవవశంబున. 62

అ॥ అని - ఇట్లని, అనేకప్రకారంబులన్ - పలువిధములుగా, వితర్కించి - ఊహించి, ఇది - ఈపాషాణము, మహాదుర్నిమిత్తంబు - ఎక్కువైనదుష్టహేతువునకు - మిక్కిలి చేటుగలిగించుటకు, కాని - ఏర్పడినదేకాని, వేఱొండుకాదు - మఱియొకటికాదు, అని - ఈవిధముగా, నిర్ణయించి - ఆవాక్యమునే నిశ్చయముచేసి, నిజనివాసంబులకున్ - తమతమగృహములకు, అరిగిరి - పోయిరి, అంతన్ - అంతట, దైవవశంబునన్ - దైవయోగమువలన,

తా॥ అని పలువిధముల నూహించి యిది గొప్పచేటుగలిగింపఁ బుట్టినదే కాని వేఱొకటి కాదని నిశ్చయించి వారివారి యిండ్లకుఁ బోయిరి. అనంతరమున విధివశంబున.

—: శత్రుందముఁడు శిలనుజూడవచ్చుట :—

ఉ॥ మందరధీరుఁ డన్యనృప ♦ మర్దనుఁ డాపురమేలురాజు శ
త్రుందముఁ డొక్కనాఁడు పరి ♦ తోషభరంబున మంత్రులెల్లఁ జూ
డందగ దన్నమానక హ ♦ ఠాత్తు హయోత్తము మొక్కఁ డెక్కి వ
చ్చెం దురుఫీలుకొన్ని తన ♦ చేరువ రా నుపలంబుఁ జేరఁగన్. 63

అ॥ మందరధీరుఁడు - మందరపర్వతమువంటి ధైర్యముగలవాఁడును, అన్యనృపమర్దనుఁడు - ఇతరరాజులను జయించుటగలవాఁడును, ఆపురమేలురాజు - ఆపట్టణమును పాలించునట్టివాఁడును, అయిన, శత్రుందముఁడు - శత్రువుల నిగ్రహించునట్టివాఁడను సార్థకనామముగలయారాజు, ఒక్కనాఁడు - ఒకదినమున, ఒకానొక దినముననుట. మంత్రులెల్లన్ - తనమంత్రులందఱును, పరితోషభరంబునన్ - సంతోషముయొక్క భారముతో. చూడన్ - చూచుచుండఁగా, తగదన్నన్ - ఇది కూడదని చెప్పినప్పటికిని, మానక - విడువక. హఠాత్తు - అకస్మాత్తుగా. దిడుక్కున, హయోత్తమము - శ్రేష్ఠమయినయశ్వమును, ఒక్కఁడు - ఒకదానిని, ఎక్కి - ఆరోహించినవాఁడై, కొన్ని తురుఫీలు - కొన్నియశ్వదళములు - గుఱ్ఱపుదండు. ‘ని. తురుఫీ - తురుఫు. (హిం. తురఫ్) అశ్వ

దళము' సూ. ఆం. ని. 'తురుష్క - తురుష్కీ - గుఱ్ఱపుదండు ద్రౌణ్యా. తనచేరువరాన్ - తనయొక్క సమీపమునవచ్చుచుండఁగా, ఉపలంబున్ - ఆరాతిని, చేరఁగన్ - సమీపించునట్లుఁగా, వచ్చెన్ - ఏతెంచెను. ఇందు హయోత్తమయొక్కఁడు, అనుప్రయోగమునుగూర్చి 'సూ. విశేషణానాం మహతోడుక్ స్యాదుభయథాపిచ, క్వచిద్ధుక్మాత్రకేస్యాద్విశేషణమిహోచ్యతే' అథ. 'సూ. క్వచిద మహతోపిడుక్ స్యాత్' శబ్దచిం. ఉదా. 'గీ. వ్యాఘ్రము యొక్కండు సనుదెంచె♦వనములోన' ఇత్యాదులు. 'హతాత్తుహయోత్తమ - ఒక్కఁడొక్క' అనుప్రాసాలంకారము. 'మందరధీరుఁడు' ఉపమాలంకారము.

తా॥ మేరుపర్వతమువంటి ధైర్యము గలవాఁడును, పరరాజుల జయించినవాఁడును. నగుశత్రుండమఁ డనుసార్థకనామధేయుఁ డగురా జాయశ్మమును జూడఁ గోరి తనమంత్రులు వలదన్న వినక కొంతసైన్యమును వెంట నిడికొని ఈటాలున గుఱ్ఱము నెక్కి యచ్చటి కరుదెంచెను.

—: బ్రహ్మరాక్షసుఁడు శత్రుఘ్నదమునావేశించుట :—

క॥ చనుదెంచి నయనగోచర ♦ మును వాగ్గోచరముఁ గాక ♦ భువనాద్భుతమై
తనరుబలుఱాతి గనుఁగొనఁ ♦ జననాథునిమది కొంకింత ♦ జనుపుదయించెన్. 64

అ॥ చనుదెంచి - వచ్చి, నయనగోచరమును — కన్నులకు స్పష్టముగాగనపడుటయును, వాగ్గోచరమును — చెప్పుటకునలవియును, కాక — కానట్టిస్వభావముకలదియై, భువనాద్భుతము — ప్రపంచమునంతటికి నాశ్చర్యమునుగలిగించునట్టిది, ఐతనరు — అయిఒప్పుచున్న, బలుఱాయి — గొప్పదియైనయాశిలను, కనుగొనన్ — చూడఁగానే, ఇచటద్వితీయకుఁ బ్రథమ చెప్పబడినది. "సూ. ఇతరత్రచ ద్వితీయాస్యాత్ ప్రథమాచజడపదానాంస్యాత్" నన్న. జననాథునిమదికిన్ — ఆరాజుయొక్కమనస్సులో, ఒకింతజడుపు — కొంచముభయము, ఉదయించెన్ — కలిగెను, ఇందు ద్వితీయపాదమున విభక్తియతిచెప్పఁబడినది. తే. పున్నపుంసక తత్సమం♦బులకడపలఁ, దత్సమానాంధ్రదేశ్య ♦బ్దములతుదలఁ, గదిసిన మకారశృంగముల్♦ కావ్యములను బొసఁగుచువిభక్తియతులనఁ♦బుష్ప బుభులకు' అప్ప. దీనినే పోలికయతియందురు. 'క. పోలున్ బుష్ప బుభులకుయతి' [illegible] మునకెనయనఁగా, శీలంబుల్లంబనఁగా, భూలోకింబమరలోక♦ [illegible] చక్కటి యతియనియెఁ జెప్పదురు. 'క. అక్కజముగ బుష్ప బు [illegible] శృంగ ♦ సహితమకారం, బక్కపులజేశ్వరాదుల, ప్రొక్కులుగైకొనుసమస్త♦ [illegible]' అ[illegible].

తా॥ వచ్చి చూచుటకును వర్ణించుటకును నలవిగానియారాతినిఁ గనినంతనే యారా జించుక భయపడెను.

మ॥ అపు డచ్చో నొకరావిచెట్టున మనో ♦ జ్ఞాకారసంపత్తికి
న్విపరీతం బగుబ్రహ్మరాక్షసుఁడు ను ♦ ద్వేగాతిరేకంబున
న్నృపచూడామణి నావహించె సచివుల్ ♦ నిర్విణ్ణులై చూడఁగాఁ
జపలాత్ముం గసిపెట్టి యుండుఁ గద య ♦ స్వాపంబులై యాపదల్. 65

అ॥ అపుడు - ఆసమయమున, అచ్చోన్ - ఆప్రదేశమున 'ని. చో. దే. స్థలము. కాలము. శ. చం. ఒకరావిచెట్టునన్ - ఒకయశ్వత్థవృక్షమునందు, మనోజ్ఞాకారసంపత్తికిన్, మనోజ్ఞ - మనస్సునకింపైన, ఆకార - రూపముయొక్క, సంపత్తికిన్ - అధికమునకు, విపరీతంబు - విరుద్ధము - వ్యత్యాసము, అగుబ్రహ్మరాక్షసుఁడు - అయినట్టి యొకానొకబ్రహ్మరాక్షసుఁడు, సచివుల్ - మంత్రులందఱును, నిర్విణ్ణులై - వ్యసనభయములతోఁగూడిన చిత్తమునని శ్చేష్టితులై, చూడఁగాన్ - వీక్షించుచుండఁగా, నృపచూడామణిన్ - రాజులలో శ్రేష్ఠుండయిన యాశత్రుందముని, ఉద్వేగాతిరేకంబునన్ - భయముయొక్క యధికముతో. 'ని. ఉద్వేగ ఉద్భ్రమే. అ. ఆవహించెన్ - శరీరమునందుఁ బ్రవేశించెను, ఆపదల్ - కష్టములు, 'ని. విపత్త్యాంవిపదాపదౌ' అ. అస్వాపంబులై - జాగరూకతకలవియై, 'ని. స్యాన్నిద్రాశయనంస్వాపః స్వప్నఃసంవేశఇత్యపి' అ. చపలాత్మున్ - చంచలమయిన మనస్సుగలవానిని - నిలుకడలేని మతిగలవానిని, కనిపెట్టియుండుఁగద - కాచుకొనియుండునుగదా. ఇందు 'చపలాత్ముంగనిపెట్టి యుండుఁగద యస్వాపంబులై యాపదల్, అనుటచేత నర్థాంతరన్యాసాలంకారము. 'సామాన్యంవావిశేషోవా తదన్యేన సమర్థ్యతే, యత్రసోఽర్థాంతరన్యాసః సాధర్మ్యేణేతరేణవా, కా. ప్ర.

తా॥ అపు డచట నొక యశ్వత్థవృక్షమున భీకరాకారముతో నున్నయొకబ్రహ్మరాక్షసుఁడు మంత్రులందఱు నివ్వెఱపడి చూడఁగా నారాజునుసోఁకెను. ఇక్కట్లుభయస్థులనే కనిపెట్టి యుండునుగదా.

క॥ ఒకలాగున మాటలు తొఁక, తొఁకలై వెడలంగఁ జొచ్చె ♦ దుడిదుడి నెందే
నొకఁడ చనఁ దొడఁగెఁ గన్నులు, పెకలించుక చూడ సాగె ♦ భీతి దలిర్పన్. 66

అ॥ మాటలు — ఆరాజుయొక్క పలుకులు, ఒకలాగునన్ — ఒకవిధముగా, తొఁకతొఁకలై — తడబడుచున్నవై — అవ్యక్తములై, వెడలంగఁజొచ్చెన్ — అతనినోటనుండి బయలుదేఱ మొదలుపెట్టెను. ఒకఁడ — తానొక్కఁడే, ఎందేన్ — ఎక్కడికయినను, దుడిదుడిన్ — తొందరతొందరగా, ఇచట 'దుడిదుడి' యనుటకుదా. "ద్వి. అడవియేనుఁగులు నీ♦రాసనీనది, కిదుడిదుడివచ్చి" రామాభ్యు. చనఁదొడఁగెన్ — పోవుటకు నారంభించెను, భీతి — భయము, తలిర్పన్ — చిగిరించఁగా, అనఁగా భయముగలుగునట్లుగా ననుట, కన్నులు — నేత్రములు, పెకలించుక — పెళ్ళగించుకొని, చూడ సాగెన్ — చూచుటకు మొదలిడెను, అనఁగా మిఱుచూపులు చూడనారంభించెననుట. ఇందు 'తొఁకతొఁకలై' అనుటకు 'సూ. కాంతిశబ్దాది శబ్దాస్తు ద్విరుక్తాస్సంతినైకశః, సాధారణాస్తదన్యేచ, వైచిత్ర్యం భూరివర్తతే' అధ. స్వభావోక్త్యలంకారము. 'స్వభావోక్తిస్తుడింభాదేః స్వక్రియారూపవర్ణనమ్' కా. ప్ర.

తా॥ ఆరాజునకు మాటలధోరణి యెక్కువయ్యెను చివ్వునలేచి యెక్కడికైన నొంటరిగాఁ బోనారంభించెను. కన్నులు పెద్దవిచేసి ఱెప్పలార్పక చూడ మొదలిడెను.

సీ॥ స్వప్నంబునఁ దైనఁ ♦ జాపల్య మెఱుఁగని, సార్వభౌమునకుఁ జం ♦ చలత తోఁచె
నేకాంతమున నైన ♦ హెచ్చుమాటలు లేని, వసుధేశతిలకంబు ♦ వదరఁ జొచ్చెఁ

బరిహాసమునకైన ♦ దరహాస మొందని ♦ నరనాథుఁ డూరక ♦ నవ్వఁ బూనెఁ
దలిరాకుఁబోఁడులొ ♦ ద్దను వికారము లేని, ధీరుం డహేతువి ♦ కారుఁ డయ్యె

తే॥ సూనృతమె కాని నాలుకఁ ♦ జొనుపనట్టి, నాయకాగ్రణి దబ్బఱ ♦ లూయ సాగెఁ
బసిఁడిసమ్మాళిగలు లేక ♦ పాద మిడఁగ, భరముపడురాజు బరిగాళ్లఁ ♦ బఱవసాగె. 67

అ॥ స్వప్నంబునందైనన్ — కలలోపలనయినను, చాపల్యము— చపలత్వమును, ఎఱుఁగనియట్టి సార్వభౌమునకున్ — తెలియనట్టి యాచక్రవర్తికి, చంచలత — నిలుకడలేనితనము, తోఁచెన్ — స్ఫురించెను, ఏకాంతమునన్నైనన్ — రహస్యాలోచనయందైనను, హెచ్చుమాటలు — అధికప్రసంగము, లేనివసుధేశతిలకంబు — లేనివాఁడయిన రాజులలోఁ బ్రకాశమానుండయినయతఁడు, వదరఁజొచ్చెన్- వ్యర్థమయినమాటలు మాటాడనారంభించెను, పరిహాసమునకైనన్ — ఎగతాళికైనను, దరహాసము — చిఱునవ్వు — ఇంచుకయైననవ్వు, ఒందనినరనాథుఁడు — పొందనివాఁడయినయారాజు, ఊరక నవ్వఁ బూనెన్ — వృథాగానవ్వుటకు మొదలుపెట్టెను, తలిరాకుఁబోఁడులొద్దను — స్త్రీలచెంతనయినను, వికారము — మనస్సుయొక్కగాని రూపముయొక్కగాని మాఱుపాటు, 'ని. వికారోవికృతౌరోగః' విశ్వ. లేనిధీరుండు — పొందనివాఁడయిన ధైర్యముతోఁగూడినవాఁడు, అహేతువికారుఁడు — నిష్కారణముగా వికారమును జెందినవాఁడు, అయ్యెన్ — అయ్యెను, సూనృతమెకాని — నిజమునుబలుకుటయే తప్ప, నాలుకఁజొనుపనట్టి నాయకాగ్రణి — అబద్ధమును నాలుకయందుఁ జొప్పించనటువంటి ప్రభువులలోఁ బ్రశ్రేష్ఠుఁడయినయతఁడు, దబ్బఱల్ — అబద్ధపుమాటలను, కూయసాగెన్ — పలుకనారంభించెను, పసిఁడిసమ్మాళిగలు — బంగారపుపావకోళ్లు, ఇది తద్భవము. ఉదా. "సీ. అట్టిటుదొడిగిన ♦ యంఘ్రుల రత్నంపు, సమ్మాళిగలుసారె ♦ జాఱుచుండ" కళా. లేక — లేకుండ, పాదమిడఁగన్ — భూమియందడుగుపెట్టుటకు, భరముపడురాజు— భారమనితలంచెడి యాప్రభువు, బరిగాళ్ళన్— రిక్తపాదములతో, పఱవసాగెన్ — పాఱిపోవుటకు మొదలిడెను, స్వభావోక్త్యలంకారము. "స్వభావోక్తిస్తుడింభాదేః స్వక్రియా రూపవర్ణనమ్" కా. ప్ర.

తా॥ ఆరాజు కలలోనైనఁ జపలత్వ మెఱుఁగకుండినను, మతినిలకడ లేనివాఁడయ్యెను, రహస్యమునందైన నధికప్రసంగము నెఱుఁగనివాఁడయినను వదరుపోతయ్యెను. ఎగతాళికయిన నించుక నవ్వనివాఁ డైనను వ్యర్థముగా నవ్వుచుండెను. స్త్రీలచెంత నయినను వికారమునఁగ పఱచని ధైర్యవంతుఁడయినను నిర్నిమిత్తముగా వికారముగలవాఁడయ్యెను. సత్యము నేతప్ప యసత్యము నెన్నఁడు నెఱుఁగని వాఁడయినను దబ్బఱ లాడుచుండెను. సువర్ణపాదుకలు లేక క్రింద నడుగిడనివాఁ డయినను రిత్తపాదములతోఁ బాఱిపోవుచుండెను.

క॥ అప్పుడు మంత్రులు కార్యము, దప్పెఁగదా యనుచు మెల్ల ♦ ధరణీనాథున్
గప్పుక చని రంతఃపుర, మొప్పుడు చేరెద మొ యనుచు ♦ నీవ దలంకన్. 68

అ॥ అప్పుడు — అట్టిసమయమున, మంత్రులు— రాజకార్యము నెఱింగినప్రధానులు, కార్యము— చేయదగినపని, తప్పెఁగదాయనుచున్ — తొలఁగిపోయినదిగదా యనుకొనుచు, మెల్లన్ — చల్లఁగా,

ధరణీనాథున్ — ఆయొక్కరాజును, కప్పక — వారందఱును గ్రమ్ముకొని, అంతఃపురము — రాణి వాసమును, ఎప్పుడుచేరెదమొ — ఎన్నఁటికిఁబోఁగలుగుదుమోకదా, అనుమనీష — అనునట్టిమనస్సునఁ గల కోరికతోఁగూడిన. తలంకన్ — భయముతో, చనిరి — పోయిరి, ఇందు 'కప్పక' అనుప్రయోగమునకుదా. "సీ. కొంగవాల్నరకునం ♦ గుళులఁబట్టుకజబ్బ, లంటఁగుట్టినవెజ్జు ♦ నరయువారు" ఆము. "క. రోలెక్కకనీపుత్త్రుఁడు:" భాగ. ఈపద్యమున నాలుగవపాదమున నిత్యసమాసయతిచెప్పఁబడినది. మనసః + ఈష — మనీష, అగును. "తే. పదమువిభజించి చెప్పఁజొ ♦ ప్పడనియదియు, నన్యశబ్దంబుఁగొని విగ్ర ♦ హంబుఁజెప్ప, నదియు నిత్యసమాసమై ♦ యతులఁగృతుల, నంటి సంధినిసచ్చహాళ్లయినవిరతి" సుల.

తా॥ ఆయెడ మంత్రులు మనము చేయఁదగిన పని యేమియు లేదుగదా యని మెల్లఁగా నా నృపతిని బరివేష్టించి రాణివాసమున కెప్పుడు చేరఁగలమో యనుతలంపుతో.

—: మంత్రులతని నంతఃపురంబునకుఁజేర్చుట :—

సీ॥ కాలసర్పముఁ బట్టఁ ♦ గడఁగుమాంత్రికులు నా, నొడిసిన నొక్కింత ♦ యొడియఁబాఱి
వనమదేభముఁ గట్టఁ ♦ జనెడుమావఁతులు నాఁ, దిరిగిన వెంటనే ♦ తిరువుగట్టి
తీవ్రప్రవాహ మీఁ ♦ దెడునీఁతకాండ్రు నా, వెలిఁబోక కాక వెం ♦ బడిన పోయి
చిచ్చార్పఁగాఁ బోవు ♦ చేర్వచుట్టములు నాఁ, జుఱుకు దాఁకినఁబోక ♦ మఱియుఁగదిసి

తే॥ యొకవిధంబున మంత్రులు ♦ యుక్తిచేత, బ్రహ్మరాక్షసనిర్వేశ ♦ భరసుదుర్ని
వారబహువిధచేష్టా వి ♦ కారశూరు, రాజవరుఁ దెచ్చి రంతఃపు ♦ రంబుఁ జేర. 69

అ॥ మంత్రులు—ఆరాజుయొక్క రాజకార్య రహస్యాలోచనపరులు, కాలసర్పమున్—ప్రళయసర్పమును, పట్టన్— పట్టుటకు, కడఁగుమాంత్రికులు — యత్నించు మంత్రవాదులో, నాన్ — అన్నట్లుగా, ఒడిసినన్ — తప్పించుకొనఁబోఁగా, గుర్తునతిక్రమించివర్తింపఁబూనఁగా, ఇచట 'ఒడిసి' యనుటకుదా "తే. గీ. ఒడిసి తలపట్టితిగిచి మ ♦ హోగ్రవృత్తి" భాగ. ఒక్కింత — కొంచెము, ఒడియఁబాఱి — పైకెగిరి పట్టుకొనఁబూని, వనమదేభమున్ — అడవియందుండెడు మదపుటేనుంగును, కట్టన్ — కట్టివేయుటకు, చనెడుమావఁతులు నాన్ — పోవుచున్నట్టి మావటీండ్రో యనునట్లుగా, ఇచట మావఁతులనుటకుదా. 'లయగ్రాహి. రావుతులతుండములు ♦ మాఁవతులనుగ్గు' భార. తిరిగినన్ = సంచరింపఁగా, వెంటనే — శీఘ్రముగా, తిరువుగట్టి— నిరోధముచేసి, అడ్డగించి, తీవ్రప్రవాహము — అతిశయమైన యేటివెల్లువను, ఈఁదెడునీఁతకాండ్రు నాన్ — ఈఁదుచున్నట్టి యీఁతకాండ్రోయను, నట్లుగా, వెలిఁబోకకాక — వెలుపలను నెట్టుకొని పోకుండ, వెంబడినపోయి — వెనువెంటనేవెళ్ళి చిచ్చార్పఁగాన్ — అగ్నినిఁనశింపజేయుటకు, పోవుచేర్వ చుట్టములు నాన్ — వెళ్ళుచున్నట్టి సమీపబంధువులోయనునట్లుగా, ఇది చేరువయొక్క రూపాంతరము. ఉదా॥ ఉ. చేర్వకుమీరురాఁగని వ ♦ సింపక యిచ్చటకొండవెల్ల" ఉ. రా. చుఱుకుదాఁకినన్ — వాఁడిమిసోఁకినను, పోక — ఆవలికిఁబోకుండ, మఱియుఁగదిసి — ఇంకనుసమీపించి, ఒకవిధంబునన్ — ఒకరీతిగా, యుక్తిచేతన్ — ఉ

పాయముతో. బ్రహ్మ.........శూరుఁ, బ్రహ్మరాక్షస-బ్రహ్మరాక్షసునియొక్క, నిర్వేశ-శరీర మునఁబ్రవేశించుటవలని, భర - భారముచేత, 'బిభర్తితిభరః' అనివ్యు, సు-లెస్సగా, దుర్నివార-వారింపనలవిగాని, బహువిధ - నానావిధములైన, చేష్టా - వ్యాపారములయొక్క, వికార- అనేక రూపములతోఁగూడిన, శూరుఁ - సాహసముగలవానిని, రాజవరుఁ - ఆరాజశ్రేష్ఠుని, అంతః పురంబుఁ - రాణివాసమును, చేరఁ - కదియునట్లు, తెచ్చిరి - తీసుకొనివచ్చిరి, పద్యమంతయు నుత్ప్రేక్షాలంకారము, "క. ఉపమేయమునకుగలిగిన, యుపమానగుణక్రియాది♦యోగముచేనా, యుప మానమెయని తలఁచిన, నపుడదియుత్ప్రేక్షయయ్యె" కా. సం. "చిచ్చా.........జుఱుకుదాఁకిన, ఇది శ్లేషాలంకారము. "శ్లేషఃసవాక్యేఏకస్మిఁ. యత్రానేకార్థతాభవేత్," కా. ప్ర.

తా॥ బ్రహ్మరాక్షసుడు సోఁకుటవలన నలవిగానినానావిధములగు చేష్టావికారములతో నేమియుఁ దెలియక తెగించి నడచుచున్న యారాజశ్రేష్ఠుని మంత్రులందఱును గాలసర్పమును బట్టఁబూనిన మాంత్రికులవలె నొడిసి తప్పించుకొననుంకించినను బోనీయక కవియుచు, నడవియేనుంగునుఁ బట్టుమావ టీంద్రవలె నందందు తిరుగుచున్నను జుట్టుముట్టుకొనుచు, గొప్పయేటివెల్లువ నీఁదుచున్న యీతగాంద్ర వలె వెలుపలకుఁబోవ వెంబడించుచు, మంటనార్పఁబోయిన సమీపబంధువులవలెఁ జుఱుకుదాఁకిన నావలికిఁబోక డాయుచు, నెటులనో తమ యుపాయములతో నంతఃపురమునకుఁ దీసుకొని వచ్చిరి.

## —: మాంత్రికుల రప్పించుట :—

తే॥ తోడుకొని వచ్చి యన్యులు ♦ చూడకుండ, నొక్కయేకాంతగృహమున♦నుండఁ జేసి
పదిలముగఁ గావలులు వెట్టి♦వెదకి వెదకి, మాంత్రికులఁ దోడితే నహ ♦ మ్మతిని వారు 70

అ॥ తోడుకొనివచ్చి-వెంటఁ బెట్టుకొనివచ్చి, అన్యులుచూడకుండఁ-ఇతరులకుఁగనపడకుండు నట్లుగా, ఒక్కయేకాంతగృహమునఁ - ఒకరహస్యమయిన యింటియందు, ఉండఁజేసి - ఉండు నట్లొనరించి, ఉంచియనుట, పదిలముగఁ- జాగ్రత్తగా, కావలులువెట్టి - ఎక్కడికి బోకుండునట్లు కావలివాండ్రనుంచి, మాంత్రికులఁ - మంత్రములు నేర్చినవారిని, వెదకివెదకి - బాగుగాఁబరిశోధించి తోడితేఁ - పిలుచుకొనిరాఁగా, వారు - ఆమంత్రవాదులు, అహమ్మతిఁ - ఇదియెంతయనెడు నహంకారబుద్ధితో - అజ్ఞానముతోననుట, "ని. అథాజ్ఞాన మవిద్యాహమ్మతిః స్త్రియాం" అ, నేన నెడు స్వతంత్రబుద్ధియనివ్యు. ఇందు వెదకివెదకి, అను ప్రయోగమునుగూర్చి "సూ. క్వచిదర్థవిశేషేతు పునరర్థసమాగతః, అధ.

తా॥ వా రవ్విధముగాఁ దీసుకొనివచ్చి యితరులకుఁ గనఁబడకుండు నట్లొకరహస్యగృహమునం దుంచిజాగ్రత్తగాఁ గావలివాండ్ర నునిచిమంత్రవాదులను బరిశీలించిరప్పింప వారహంకారబుద్ధితో.

సీ॥ ఎంతమాత్రం బిది ♦ యీక్షణంబునలేదు, బంతిఁ గావించెదఁ ♦ బ్రజ్ఞమీఱఁ
బూనిక నప్పటి ♦ పూరిమంత్రించనేఁ, బొమ్మన్నఁ బోదె యీ ♦ భూమి వెడలి
చూతుముగా పోవు ♦ బేతాళుఁ డైనను, నా పేరు విన్నని ♦ న్నాళ్ళుదాఁక
దానికేమూయె నెం ♦ దాఁక నాలస్యము, తెప్పింపుడు విభూతి ♦ తేటగలది

తే॥ యనుచు నొకనాఁడు నొక్కొక్క • డధికముగను,
నించు కటుమించుచుఁగాఁ బంత • గించుకొనుచు
దశదిశాబంధనము చేసి • ధరణినాథ,
శేఖరునిఁ జేరె మాంత్రిక • శ్రేష్ఠు లధిప. 71

అ॥ అధిప - ఓరాజా, మాంత్రికశ్రేష్ఠులు - మంత్రములు నేర్చినవారిలోఁ బ్రసిద్ధులైనవారు, ఇది — ఈబ్రహ్మరాక్షసావేశము, ఎంతమాత్రంబు— ఏపాటి— స్వల్పమనుట. 'ని. మాత్రంకార్త్స్న్యేవధారణే' 'మాత్రాస్వల్పేదకేఽపిచ,' 'స్త్రీయాంమాత్రాశ్రుతిః పుంసి' అ. 'సూ. నిర్ధారణాదౌ మాత్రంస్యాత్ క్వచిన్మాత్రాచకథ్యతే, నవర్ణకాదేస్తద్ధర్మాత్ క్వచిత్స్యాద్వ్యపధానతా' అథ. ఈక్షణంబునన్ — ఈసమయముననే, లేమ — పోయినదనుకొనుము, ప్రజ్ఞమీఁదన్ — నాయొక్క బుద్ధివిశేషముకొలఁది, "ని. ధీఃప్రజ్ఞాశేముషీమతిః" అ. బంతిగావించెదన్ — చేతియందుండు బంతి వలె నాడింతును, అంతయును నాస్వాధీనమేయనుట, పూనికన్ — హస్తమునందుంచుకొని, అప్పటి పూరిమంత్రించన్ — ఆకాలమునందలిదయిన గడ్డిపోఁచను మంత్రించఁగానే, నేన్ — పొమ్మన్నన్ — నేను పొమ్మనుటతోనే, ఈభూమి వెడలిపోదె — ఈపుడమి నుండి యింకొకలోకమునకుఁ బోకుండునా, చూతుముగా — చూచెదముగదా, నాపేరువిన్నన్ — నాపేరు చెవిసోఁకినంతనే, ఇన్నాళ్ళదాఁకన్ — ఇంతకాలమువఱకును — ఇప్పటివఱకుండునాయనుట. బేతాళుఁడైనను — పిశాచముల కధిపతియగు బేతాళుఁడయినప్పటికిని, పోవున్ — పాఱిపోవును, దానికేమాయెన్ — దానికేమిగాని, ఎందాఁక నాలస్యము — ఎంతదనుక జాగుచేసెదరు, ఎంత+దాఁకన్ — ఎందాఁకన్, అగును. ఉదా. 'సీ. సత్య లోకముదాఁక • సకలలోకంబులు, నాటపట్టులు మాకు • నబ్జవదన" శృం. నై. విభూతి— లిర్యక్పుండ్ర ధారులుధరించెడు భస్మమును, తేటగలది — నిర్మలమయినదానిని, తెప్పింపుఁడు — పట్టికొనివచ్చునట్లు చేయుఁడు, అనుచున్ — ఇట్లువచింపుచు, ఒకనాఁడు — ఒక్కదినమున, ఒక్కొక్కఁడు — ఒక్కొక్క మాంత్రికుఁడు, అధికముగను — ఎక్కువగా, ఇంచుకటుమించుచుగాన్ — అలాగునఁ గొంచెమధికమగు నట్లుగా, పంతగించుకొనుచున్ — ప్రతిజ్ఞలుచేయుచు, దశదిశాబంధనముచేసి — ఎక్కడికిఁబోకుండు నట్లుగా నెనిమిదిదిక్కులును భూమ్యాకాశములతోనుగూడి పదదిక్కులను గట్టివైచి, ధరణీనాథశేఖ రునిన్ — ఆరాజశ్రేష్ఠుని, చేరి — సమీపించి, దగ్గఱకుఁబోయి, ఈపద్యమున 'ధరణినాథశేఖరుని' అనుచోట దీర్ఘముహ్రస్వమగుటకు 'సూ. హ్రస్వోదీర్ఘసమాసేఽపి క్వచిన్ట్టిపః ప్రయోగతః' అథ. భూతవైద్యులలక్షణములను యథాస్థితిగ వర్ణించినాఁడు కనుక స్వభావోక్త్యలంకారము.

తా॥ ఓరాజా! మంత్రముల నభ్యసించినవారిలోఁ బ్రసిద్ధికెక్కినవారు వచ్చి యీబ్రహ్మరాక్షసుని బోఁదోలుట యనఁగా నెంత యిప్పుడే లేదనిపించెదను. నాప్రజ్ఞవలన దీనిని బంతివలె నాడింతును. చేత గడ్డిపోఁచను మంత్రించి వైచితినేని పొమ్మనఁగానే యీపుడమివిడిచి వేఱొకలోకమునకుఁ బోవునుసుమా. నాపేరు విన్నంతమాత్రముననే యింతవఱకు బేతాళుఁడైనను బారిపోవుచుండెను. ఈ మాటలకేమి గాని జాగుచేయక పరిశుద్ధమైన విభూతి దెప్పింపుఁడు. ఇట్లనుచు నొక్కొక్కనాఁడొక్కొక్క మంత్రవేత్త క్రమక్రమముగా నెక్కువ ప్రతిజ్ఞలు చేయుచు దశదిగ్బంధనమొనర్చి యారాజశ్రేష్ఠుని సమీపించి.

## —: మాంత్రికులప్రయత్నము నిష్ఫలమగుట :—

సీ॥ నరసింహాము జపింప ♦ నరసింహాము జపించు, నాదిభైరవమున ♦ కదియె నుడువు
శతరుద్రియముఁ బూన ♦ శతరుద్రియముఁ బూను, హనుమజ్జపంబున ♦ కదియె చేయు
నీలకంఠముఁ బల్క ♦ నీలకంఠముఁ బల్కు, నంబా స్తవంబున ♦ కదియె నెఱపు
శ్రీరామముఁ బఠింప ♦ శ్రీరామముఁ బఠించు, నష్టాక్షరిని నెన్న ♦ నదియె యెన్ను
తే॥ వీరభద్ర మెన్న ♦ వీరభద్రమె తెచ్చు, శరభ మన్న నదియె ♦ సంగ్రహించు
మనుజనాథ కడమ ♦ మంత్రంబు లాబ్రహ్మ, రాక్షసునకు నీళ్ళు ద్రాగినట్లు. 72

అ॥ మనుజనాథ — ఓరాజా, ఆమాంత్రికులు, అధ్యాహార్యము. నరసింహామున్ — నృసింహ మంత్రమును, జపింపన్ — పఠించుచుండిరేని, నరసింహాముజపించున్ — బ్రహ్మరాక్షసావేశుఁడయిన యారాజుకూడ నృసింహమంత్రమునే చదువుచుండును, ఆదిభైరవమునకున్ - ఆదిభైరవమంత్రము నుచ్చరించినప్పుడును, అదియెనుడువున్ — ఆమంత్రమునే చెప్పును, శతరుద్రియమున్ + పూనన్ — రుద్రము నూఱుపర్యాయములు జపముచేయఁగడంగినట్లయిన, శతరుద్రియమున్ + పూనున్ — ఆరుద్ర శతమునే తానునువాకొనును. ఇచట శతరుద్రియమనుటకు "సూ. శతరుద్రాద్ఘశ్చ" (వా. 2702 సిద్ధాం.) చాచ్ఛః శతం రుద్రాః దేవతా అస్యశతరుద్రియమ్ శతరుద్రీయమ్. హనుమజ్జపంబునకున్ — ఆంజనేయమంత్రము నావృత్తికి మొదలిడినప్పుడు, అదియెచేయున్ — ఆమంత్రమునే చెప్పుచుండును, నీలకంఠమున్ + పల్కన్ — నీలకంఠమను మహామంత్రమును దలంచుచుండినట్లయిన, నీలకంఠమున్ + పల్కున్ — ఆనీలకంఠమహామంత్రమునే వదరుచుండును, అంబా స్తవంబునకున్ — కాళీస్తోత్రమును జేయ నారంభించినప్పుడు, అదియెనెఱపున్ — ఆకాళీస్తోత్రమునే పలుకుచుండును, శ్రీరామమున్ + పఠింపన్ — శ్రీరామమంత్రమును జదువుచుండిరేని, శ్రీరామమున్ + పఠించున్ — శ్రీరామమంత్రమునే జదువుచుండును, అష్టాక్షరినిన్ — నారాయణాష్టాక్షరీ మంత్రమును, ఎన్నన్ — జపముచేయుచు లెక్కపెట్టుచునుండఁగా, అదియెయెన్నున్ — ఆమంత్రమునే జపము చేయుచుండును, వీరభద్రమెన్నన్ — వీరభద్రమంత్రమును దలంచినప్పుడు, వీరభద్రమెతెచ్చున్ — ఆవీరభద్రమంత్రమునే జ్ఞాపకమునకుఁదెచ్చును, శరభమన్నన్ — శరభమనుమంత్రమును జదువఁగా అదియె సంగ్రహించున్ — ఆమంత్రమునే పఠింపనారంభించును, ఆబ్రహ్మరాక్షసునకున్ — ఆరాజు నావేశించిన బ్రహ్మరాక్షసునకు, కడమమంత్రంబులు — తక్కినమంత్రములన్నియును, నీళ్ళుద్రాగినట్లు — నీళ్ళుద్రావినంత చులుకఁదనమైయున్నవి, ఆవలీలయనుట. ఇచట బ్రహ్మరాక్షసునియొక్క శక్తిని వర్ణించుటచే స్వభావోక్త్యలంకారము.

తా॥ ఆమాంత్రికు లేయేమంత్రముల జపించుచుండిరో యాయామంత్రములనే తానును చదువు చుండెను.

క॥ మొదలఁ గడుఁ బౌరుషస్థితి, తుది నేమియు లేక జనులు ♦ దూషణ సేయన్
గదుపులు కదుపులు గట్టుచు, మది లజ్జాపరతఁ జనిరి ♦ మాంత్రికు లధిపా. 73

అ॥ అధిపా — ఓరాజా, మాంత్రికులు — మంత్రశాస్త్రజ్ఞులు, మొదలన్ — ప్రథమమున, కడున్ — లెస్సైనన, పౌరుషస్థితి — పరాక్రమముతో నుండుటయును, తుదిన్ — కడపట, ఏమియు లేక — ఆపరాక్రమమంతయు నశించి, జనులుదూషణసేయన్ — లోకులు నిందింపఁగా, కదుపులు కదుపులు గట్టుచున్ — గుంపులుగుంపులుగాఁ గూడుచు, మదిన్ — మనస్సున, అనఁగా వారివారి మనస్సులయందు, లజ్జాపరతన్ — సిగ్గుతోఁగూడిన పరవశత్వమున, చనిరి — పోయిరి, ఆరంభ శూరత్వమును జూపిరనుట. ఈప్రయోగమునకు "సూ. అనేక కర్తృకక్రియకు సమీపకర్తయొక్క లింగవచనంబులగు" ప్రౌ. వ్యా. ఉదా. "వ, భూతంబులు దేవాసురులు వినాశగతులు కారె" రామా. "వ. తమసేనలు వారును విశ్రమించిరి" ఉ. హరివం.

తా॥ ఓరాజా ! ఆమంత్రవాదులందఱు ఆరంభమున మిక్కిలి పరాక్రమమును జూపి తుద కేమియుఁజేయఁజాలక ప్రజలు నిందించుచుండఁగా సిగ్గుతో గుంపులుగుంపులుగాఁ బోయిరి.

సీ॥ ఐతిహాసికమౌళి ♦ యనిపించు నొకవేళ, నొకవేళ శుష్కతా ♦ ర్కికత నెఱపుఁ
బాణినీయపుఫక్కి ♦ వాదించు నొకవేళ, నొకవేళ వేదాంత ♦ ముపచయించు
శ్రోత్రియాగ్రియవృత్తిఁ ♦ జూపించు నొకవేళ, నొకవేళఁ గడుజ్యోతి ♦ షికతఁ దనరు
సంగీతమాధురి ♦ చవిదేల్చు నొకవేళ, నొకవేళ సుకవితా ♦ యుక్తి వఱలుఁ
తే॥ జదువు నొకవేళఁగావ్యముల్ ♦ సరసఫణితి, నుడువు నొకవేళ మంత్రముల్ ♦ నూర్లు వేలు
సామవేదము నొకవేళఁ ♦ జదువుచుండుఁ, బ్రతిభ మీఱఁగ నాబ్రహ్మ ♦ రాక్షసుండు. 74

అ॥ ఆబ్రహ్మరాక్షసుండు — ఆరాజుయొక్క శరీరమునఁ బ్రవేశించిన బ్రహ్మరాక్షసుఁడు, ప్రతిభమీఱఁగన్ — బుద్ధివిశేష మతిశయించినట్లు, ఒకవేళన్ — ఒకసమయమున, ఐతిహాసికమౌళి — పూర్వపుకథలు చెప్పనేర్చినవారిలో శ్రేష్ఠుఁడు, అనిపించున్ — అనునట్లుగాఁజేయును, ఒకవేళన్ — వేఱొకకాలమున, శుష్కతార్కికత — వట్టితర్కముచే, నెఱపున్ — ప్రకాశింపఁజేయును, అనఁగాఁ గేవలతర్కమునే సంభాషించుచుండుననుట. ఒకవేళన్ — ఒకప్పుడు, పాణినీయపుఫక్కిన్ — వ్యాకరణశాస్త్రరీతిగా, వాదించున్ — సంభాషించును, ఒకవేళన్ — ఒకదినమున, వేదాంతముపచయించున్ — వేదాంతశాస్త్రమును వృద్ధిచేయును, ఒకవేళన్ — మఱియొక తరుణమున, శ్రోత్రియాగ్రియవృత్తిన్ — వేదముఁజదివినవారిలో ముఖ్యమైన ప్రవర్తనమును, చూపించున్ — కనఁబఱచును, ఒకవేళన్ — ఒక్కతఱి, కడుజ్యోతిషికతన్ — మిక్కుటమైన జ్యోతిశ్శాస్త్రమును దెలిసినట్లు, తనరున్ — చెలఁగును, ఒకవేళన్ — ఒక్కక్షణమున, సంగీతమాధురి — గానవిద్యామాధుర్యముయొక్క, చవిదేల్చున్ — రుచియందుఁదెప్పదేలునట్లుగాఁ జేయును, ఒకవేళన్ — ఒక్కముహూర్తమున, సుకవితాయుక్తిన్ — మంచికవిత్వముయొక్క పొందికతో, వఱలున్ — ప్రకాశించును, ఒకవేళన్ — ఒక్కకాలమున, కావ్యముల్ — సత్కవులు వ్రాసిన ప్రబంధములు, సరసఫణితిన్ — రసయుక్తమైన రీతిగా, చదువున్ — పఠించును, ఒకవేళన్ — ఒక్కసమయమున, మంత్రముల్ — నానా [illegible] మంత్రములు, నూర్లువేలు — వందలకొలఁదిగను వేలకొలఁదిగను, నుడువున్ — చెప్పుచుండును, ఒకవేళన్ — ఒక్కతఱి, సామవేదమున్ — (సంగీతమునకాదియగు) సామవేదమును, చదువుచుండున్ — పఠించుచుండును, పద్యమంతయు స్వభావోక్త్యలంకారము.

తా॥ ఆబ్రహ్మరాక్షసుఁడు తనబుద్ధికౌశలముతో నొకప్పుడు పురాణములను చెప్పును. మఱి యొకతఱి కేవలతర్కమునకుఁ బూనును. ఇంకొకసారి వ్యాకరణశాస్త్రమును జదువును. వేఱొకపుడు వేదాంతమును జెప్పును. ఒక్కసమయమున వైదికశ్రేష్ఠుఁడుగఁ గన్పట్టును. ఒక్కొకవేళ జ్యోతిశ్శాస్త్రపరిచయమును గనఁబఱచును. ఒకానొకకాలమునఁ జక్కఁగా సంగీతమును బాడును. ఒక్కొక తరుణమున రసవంతముగాఁ గవిత్వమును జెప్పును. ఒకానొకక్షణమునఁ బ్రబంధములను జదువును. ఒక్కొకయెడ వేలకొలఁదిమంత్రములు చర్చించును. ఒక్కొకపట్టున సామవేదమును బఠించుచుండును.

వ॥ ఇట్లు సకలమంత్రతంత్రంబులకు నసాధ్యంబైన యాబ్రహ్మరాక్షసావేశంబు సంస్తంభింపక విజృంభించులాగు చూచి ప్రధాను లెల్ల రాత్మగతంబున. 75

అ॥ ఇట్లు — ఈప్రకారముగా, సకలమంత్రతంత్రంబులకున్. -సకల — సమస్తమైన, మంత్ర తంత్రంబులకున్ — మంత్రములకును, ఉపాయములకును, అసాధ్యంబై — సాధింపనలవిగానిదియై, ఆబ్రహ్మరాక్షసావేశంబు — ఆయొక్క బ్రహ్మరాక్షసుఁడు శరీరమునఁబ్రవేశించినస్థితి, సంస్తంభింపక — ప్రసారణలేకుండనిలువక - స్థిరపడక, విజృంభించులాగు, చూచి — చెలరేగునట్టిరీతిని గనుఁగొని, ప్రధానులెల్లరున్ — ముఖ్యులైనమంత్రులందఱును, ఆత్మగతంబునన్ — వారివారిమనస్సులయందు, పైపద్యముతో నన్వయము.

తా॥ ఈప్రకారముగా ననేకమంత్రములకును నదుపాయములకును శక్యముగాక యాబ్రహ్మరాక్షసుఁడు సోఁకినపరవశత్వ మంతటితో నిలిచియుండక చెలరేఁగునట్టి యునికిం గాంచి మంత్రు లెల్లరుఁ దమతమమనస్సులయందు.

—: ప్రధానులు విచారపడుట :—

ఉ॥ మొత్తఁగఁ జొచ్చె గౌరవమ ♦ మ్మున్నతి వాయఁగ భూతవైద్యులం
దొత్తుల మొత్తినట్లు కడు ♦ దుర్భరభావము నొంది భూమిపా
లోత్తముదేహముం బడలె ♦ నున్నను గార్యము లే దిఁక న్వివే
కోత్తరబుద్ధిఁ జెప్పఁ డొక ♦ బుద్ధివిశేషము పెద్ద లందఱున్. 76

అ॥ బ్రహ్మరాక్షసునకు వశుఁడైనయీరాజు. భూతవైద్యులన్ — బేతాళాదిపిశాచములఁ బోఁగొట్టఁగల మాంత్రికులనుకైతము, గౌరవమున్నతి — తమకీర్తియొక్కయతిశయము, పాయఁగన్ — పోవునట్లుగా, తొత్తులన్ — దాసదాసీజనమును, మొత్తినట్లు — కొట్టినతీరున, మొత్తఁగఁజొచ్చెన్ — కొట్టుటకునారంభించెను, కడున్ — ఎక్కువయైన, దుర్భరభావమున్ — భరింపశక్యముగాని మనోవికారమును, ఒంది — పొందినవాడై, భూమిపాలోత్తముదేహమున్ — ఆరాజుయొక్క శరీరమునుగూడ బడలెన్ — అలసటనొందెను, ఉన్నను — మనమిట్లూరక చూచుచుండినను, ఇఁకన్ — ఇఁకమీఁదట కార్యములేదు — చేయఁదగినపని లేదు, పెద్దలందఱును, తెలిసిన వారెల్లరును, వివేకోత్తరబుద్ధిన్ — గుణాగుణవిచారజ్ఞానముకంటె శ్రేష్ఠమైనప్రజ్ఞతో, ఒకబుద్ధివిశేషము — ఒకమేధావంతమును,

చెప్పఁడు — వచింపుఁడు, 'భూతవైద్యులను దొత్తులమొత్తినట్లు మొత్తుట కారంభించెను, ఇది ఉపమాలంకారము.

తా॥ ఈరాజు భేతాళాదిగ్రహములను బట్టనేర్చిన మంత్రవాదులను సైతము భృత్యులను గొట్టినట్లు కొట్ట మొదలిడెను. భరింపశక్యము గాని మనోవికారమువలన మనరాజుగారిదేహమంతయు నలసట నొందెను. ఇఁక మనమిట్లూరక చూచుచుండుటవలనఁ బ్రయోజనము లేదు. కనుక తెలిసినవారేదైన నొక యాలోచన చెప్పుఁడు.

వ॥ అని వితర్కించుకొనుచున్న సమయంబున. 77

అ॥ అని — ఇట్లని, వితర్కించుకొనుచు — ఊహించుకొనుచు, ఉన్న సమయంబునన్ — ఉన్న కాలమున.

—: నిరంకుశుఁడా రాజుదగ్గరకుఁ జనుట :—

గీ॥ బ్రహ్మరాక్షసువార్త ని ♦ రంకుశుండు, విని మరుత్కాంతశాపంబు ♦ వెడలఁద్రోయ
నిదియె తఱియంచు వచ్చె భూ ♦ మీశమంత్రు, లున్నపనిలేక చింతించుచున్నకడకు 78

అ॥ నిరంకుశుఁడు — నిరంకుశుఁడను పేరుగల యా బ్రాహ్మణుఁడు, బ్రహ్మరాక్షసువార్తన్- బ్రహ్మరాక్షసుఁడు రాజును సోఁకిన వృత్తాంతము, విని — ఆకర్ణించినవాఁడై, మరుత్కాంతశాపంబు— దేవతాస్త్రీయగు నారంభయొక్క శాపమును, వెడలఁదోయన్ — పోఁగొట్టుటకు, ఇదియె తఱి — ఇది యేమంచిసమయము, అంచున్ — అనితనలో నూహించుకొనుచు, భూమీశమంత్రులు — ఆరాజుయొక్క మంత్రులు. ఉన్నపనిలేక — అప్పుడు చేయఁదగిన కార్యములేక, చింతించుచున్నకడకున్— విచారపడుచున్నచోటికి, వచ్చెన్ — ఏతెంచెను.

తా॥ అప్పుడు నిరంకుశుఁడు బ్రహ్మరాక్షసుఁడు రాజును సోఁకినవార్త విని రంభయొక్క శాపమును విముక్తిచేయుట కిదియె సమయమని యారాజమంత్రులందఱుఁ గూడి విచారపడుచున్న ప్రదేశమునకు వచ్చెను.

క॥ వచ్చి నమస్కారంబని, యచ్చోఁ గల పెద్దలెల్ల ♦ నాదరమునఁ జో
టిచ్చి వసింపఁగఁ జేయఁగ, నచ్చతురాననకులీనుఁ ♦ డనియె నృపాలా. 79

అ॥ నృపాలా — ఓరాజా, వచ్చి — ఏతెంచినవాఁడై, అచ్చోన్ — ఆప్రదేశమున, కలపెద్దలన్ — ఉండిన గొప్పవారందఱును, నమస్కారంబు — దండము, అని — అనిపల్కినవారై, ఆదరమునన్ — సన్మానముగా, చోటిచ్చి — కూర్చుండుటకుఁ దగినస్థానము నొసంగి, వసింపఁగన్— అచ్చట నాసీనుఁడగునట్లుగా, చేయఁగన్ — చేయఁగా, అచ్చతురాననకులీనుఁడు — శ్రేష్ఠమయిన బ్రహ్మవంశమునఁ బుట్టిన యానిరంకుశుఁడు, అనియెన్ — ఇట్లుపలికెను,

తా॥ రాఁగా నేయచ్చటఁగలపెద్దలు నమస్కరించియుచితాసనంబొసంగ నందాసీనుండై యిట్లుపలికెను,

ఉ॥ దుండుడుకార శాత్రవుల ♦ దోర్బలసంపదఁ జక్కఁజేసి ధా
త్రిం దనబాహుపీఠమునఁ ♦ దిన్నదనంబుగ నిల్పి భోగసం
క్రందనుఁ డై ప్రజల్పొగడ ♦ రాచతికం బొనరించునట్టి శ
త్రుందము నంతవానికిని ♦ దుష్టపుదైవము కీడుదెచ్చెనే. 80

అ॥ దుండుడుకారన్ — మిక్కిలి యుద్ధతిప్రకాశించఁగా, శాత్రవులదోర్బలసంపదన్ — పగతురయొక్క బాహుబలసంపదను, 'ని. ద్విడ్విపక్షాహితా౽మిత్రాః దస్యుశాత్రవశత్రవః' అ. చక్కఁజేసి — నశింపఁజేసి, ధాత్రిన్ — ఈభూమిని - అనఁగానీభూభారముననుట, తనబాహుపీఠమునన్ — తనయొక్క భుజమనెడు పీటయందు, తిన్నదనంబుగన్ — చక్కఁగా, నిల్పి — ఉంచి, భోగసంక్రందనుఁడై — సుఖముల ననుభవించుటయందు నింద్రునివంటివాఁడై, ప్రజల్పొగడన్ — ఈ భూమియందుండు జనులు కొనియాడఁగా, రాచతికంబు — రాజ్యము నేలుట, ఒనరించునట్టి — చేయుచుండినటువంటి, శత్రుందమునంతవానికిని — శత్రుందమునియంతటి గొప్ప వానికిసైతము, దుష్టపుదైవము — దురదృష్టము - దుష్ప్రారబ్ధము, కీడుతెచ్చెనే — హానిచేకూర్చెనా, ఇందు 'రాచతికము' అను ప్రయోగమునకు "సూ. అన్యేచబహవోదేశ్య వర్ణకా అర్థభేదకాః, క్వచిదంత్యస్యలోపస్స్యాత్క్వచిద్వర్ణాగమోమతః" అనియథ. మఱియు 'శత్రుందమునంతవానికిని' అను ప్రయోగమునకు "సూ. కచ్చిత్సాదృశ్య శబ్దస్య తదుత్కర్షేవ్యస్థితిః" అథ. ఉదా. "చ. అటుదగునే సురేశ్వరుని యంతటివానికి" ఇత్యాదులు.

తా॥ మిక్కిలిదుండగీం డ్రగు శత్రువుల నుక్కడించి, యీభూభారమును దనభుజపీఠమున నిల్పి యింద్రునివలె భోగసంపన్నుఁ డై యొప్పుచున్న శత్రుందమునివంటివానికి సైతము దురదృష్టము కీడుచేకూర్చెను గదా!

గీ॥ సత్యసంధులఁ జేర్చు న ♦ సత్యపరులఁ, ద్రోచు ననఘులరక్షించు ♦ దుష్టకర్మ
గల్గువారల శిక్షించు ఘనులఁబెంచు ♦ హీనులను ద్రుంచు ధర నిట్టి ♦ నృపతికలఁడె 81

అ॥ సత్యసంధులన్ — నిజముతోఁగూడిన వారలను. చేర్చున్ — తనసమీపమునకు రప్పించుకొనును, అసత్యపరులన్ — అబద్ధములందతిశయులైనవారిని, ద్రోచున్ — వెలుపలకు నెట్టివైచును. అనఘులన్ — పుణ్యాత్ములను, రక్షించున్ — కాపాడును, దుష్టకర్మగల్గువారలన్ — చెడ్డపనులు చేయువారలను, శిక్షించున్ — దండించును, ఘనులన్ — గొప్పవారిని - అనగా మంచివారిననుట, పెంచున్ — పోషించును, హీనులను — నీచబుద్ధిగలవారలను, త్రుంచున్ — తెగటార్చును, ధరన్ — ఈపుడమియందు, ఇట్టినృపతికలఁడే — ఇటువంటిరాజున్నాడా, లేడనుట, "అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చైవాప్యదండయన్, అయశోమహదాప్నోతి నరకంచైవగచ్ఛతి" మను. "న్యాయేనార్జనమర్థస్య వర్ధనంపాలనం తథా,సత్పాత్రేప్రతిపత్తిశ్చ రాజవృత్తంచతుర్విధమ్" కామం.

తా॥ నిజమాడువారిని రాఁబట్టును. అబద్ధములు చెప్పువారిని బోఁదోలును. పుణ్యాత్ములను గాపాడును, పాపకార్యము లొనరించువారలను దండించును. సద్బుద్ధిగలవారలను బోషించును, దుర్బుద్ధిగలవారిని హరింపజేయును, దయతో భూమిని బాలించుటయం దిట్టిరాజు లేఁడు,

—: నిరంకుశుఁడు నాకు దేవతావేశము కలదనుట :—

వ. అని యనేకవిధంబుల మనుజనాథు వర్ణనము చేసి పిదప దైవంబుఁ దిట్టి తలంచిన నాకౌకదైవలీల గల దంచుఁ బల్కి మెల్లన శరీరంబు గగుర్పొడువ. 82

అ॥ అని — ఇట్లుపలికి, అనేకవిధంబులన్ — పలుభంగులుగా, మనుజనాథున్ — ఆరాజును, వర్ణనముచేసి — గుణలక్షణాదులనుపన్యసించి, పిదపన్ — అటుతరువాత, దైవంబున్ — ప్రారబ్ధమును, తిట్టి — నిందించినవాఁడై, తలంచిన — స్మరించినట్లయిన, నాకౌకదైవలీల గలదంచున్ — నాకౌక దేవతాసంబంధమైన విలాసము కలదనుచు, పల్కి — వచించి, మెల్లన — చల్లఁగా, శరీరంబు — తనయొడలు, గగుర్పొడువన్ — పులకాంకురముదోఁపఁగా,

తా॥ ఇట్లా నృపాలునియొక్క సుగుణాతిశయముల నేకవిధంబులఁ బొగడి ప్రారబ్ధమును నిందించి నాకౌకదేవతాసంబంధమైన యావేశము గలదని చల్లఁగాఁ దనమేనఁ బులకలుపొడమ.

మ॥ ఒకనిట్టూరుపు పుచ్చి కన్నుఁగవ నీ ♦ రుప్పొంగఁగా నావలిం
చి కరాబ్జంబులు మీఁది కెత్తి తనుయ ♦ ష్టిం గంప మేపార నిం
చుక యాలాపము చేసి వెక్కసముగా ♦ శోకించి శోకించి వేఁ
డుకొనంగా నొకకొంతసేపునకు నా ♦ టోపంబు సంధిల్లఁ గన్. 83

అ॥ ఒకనిట్టూరుపుపుచ్చి — ఒక్కదీర్ఘశ్వాసమునువిడిచి, ఇచట నిడు + ఊరుపు — నిట్టూరుపు "సూ. కైసమాసమున నిడు, నీలు, కడు, నడు, నిడు, శబ్దముల ఱ, డ, ల, కచ్చుపరమయిన ద్విరుక్తటకారమగును," బాల్యా. కన్నుఁగవన్ — కన్నులయొక్కజంటయందు, నీరు — అశ్రువులు, ఉప్పొంగఁగాన్ — పైకివచ్చునట్లుగా, అనఁగాఁగన్నీరుపైకుబుకునట్లుగా, ఆవలించి — జృంభించి— ఒళ్ళువిఱుచుకొని, కరాబ్జంబులుమీఁదికెత్తి — పద్మమువంటి చేతులనుపైకెత్తికొని, తనుయష్టిన్ — దండమువంటిశరీరమందు, కంపము — వడఁకుట, ఏపారన్ — అతిశయించఁగా, ఇంచుకయాలాపముచేసి — కొంచెమెక్కువగామాటలాడి, వెక్కసముగాన్ — దుస్సహమగునట్లుగా - అతిశయముగా, శోకించిశోకించి — ఏడ్చియేడ్చి, వేఁడుకొనఁగాన్ ప్రార్థించఁగా, కొంతసేపునకున్ — కొంతకాలమునకు, ఆటోపంబు వేగిరపాటు, 'ని. సంభ్రమాటోపసంరంభాః' యా. సంధిల్లఁగన్ — కూడుకొనఁగా. అలం. స్వభావోక్తి. ఇచట నిరంకుశునకు దేవతావేశము లేకున్నను జనులమెప్పింపఁజేసిన పటాటోపమునుగూర్చి "నిర్విషేణాపిసర్పేణ కర్తవ్యామహతీఫణా. విషమస్తునచాప్యస్తు పటాటోపో భయంకరః" చాణ.

తా॥ ఒక్కదీర్ఘశ్వాసమును విడిచి కన్నులవెంట నీరుగార్చుచు నావలించి చేతులు పైకెత్తి [illegible] వణఁకగాఁ గొంచెముసే పెక్కువగా మాటలాడి మిక్కుటముగా నేడ్చి యేడ్చి వేఁడుకొనిన [illegible] కొంతసేపటికి దర్పముతో.

—: నిరంకుశుఁడు తత్పరిహారమును జెప్పుట. :—

సీ॥ ఇప్పుడు పుట్టినపాషాణ ♦ మెల్లఁ గొట్టి, తుమురుగాఁ జేసి ధరణిపైఁ ♦ దూరుపెత్త
రాజు [illegible] ♦ [illegible], విడుపుఁ గాని [illegible] 84

అ॥ ఇపుడు — ఈసమయమున, పుట్టిన — ఊరివెలుపల జన్మించిన, పాషాణముల్లక — బాయి నంతయును, కొట్టి — నలుగునట్లుగాఁగొట్టి, తుమురుగాఁజేసి — పొడియగునట్లుచేసి- చూర్ణముగాఁజేసి, ధరణిపైక — భూమిమీఁద, తూరుపెత్తక — తూర్పారఁబెట్టఁగా, రాజున్ — మనరాజును, పట్టిన — ఆవేశించియున్న, ఆబ్రహ్మరాక్షసుండు — ఆయొక్క బ్రహ్మరాక్షసుఁడు, విడుచుక — విడిచిపెట్టును, కాని — ఇంతేకాని, మఱేమిటక — ఇంకదేనివల్లను, విడువఁడు — వదలఁడు, అనినన్ — ఇట్లుచెప్పఁగా,

తా॥ యీరాతిని నలియఁ గొట్టి పిండిగాఁ జేసి తూర్పారఁ బెట్టినట్లయిన రాజును బట్టిన బ్రహ్మరాక్షసుఁడు వదలును గాని యింతమఁదప్ప దేనివలన విడువఁ డనఁగా.

—: మంత్రులు శిలను పిండి చేయించుట. :—

క॥ ఇదియౌ నిది గా దనియెడి, సదమలబోధంబు లేక ♦ సచివావళియౌ
నిది మంచికార్య మనుచు, న్మది నెన్న విపత్తి మతికి ♦ మతికిం బొందెన్. 85

అ॥ ఇదియౌను — ఈపనివల్లనగును, ఇదికాదు — ఈకార్యమువలనఁగానేరదు, అనియెడి — అనిచెప్పనట్టి, సదమలబోధంబు — పరిశుద్ధమైన జాగరూకత, లేక — మనస్సునసేపాటియులేక, సచివావళి-మంత్రులయొక్క-వరుస — అనగా మంత్రులయొక్క-సమూహమనుట, ఔను-ఈవాక్యము నిజమేను, ఇది మంచికార్యము — ఈ పనిచేయఁదగినదియే, అనుచున్ — ఇట్లు చెప్పికొనుచు; మదినెన్నక — తమతమ మనస్సులయందుగణింపఁగా, విపత్తి — ఆపద, మతికిమతికిన్ — ప్రతివారి బుద్ధికిని, పొందెన్ — తగిలెను.

తా॥ అతఁ డిట్లు చెప్పినతోడనే మంత్రులందఱు నిది యగునా కాదా యనువిచారణ లేకయే యేకగ్రీవముగా నిజమే యీపని చేయవలసినదే యనుచుండఁ బ్రజలు నంగీకరించిరి.

గీ॥ రాయి దిగులంగఁగొట్టిన ♦ రాజునొడలి, బ్రహ్మరాక్షసుఁ డేగునే ♦ పార్థివేంద్ర
ధరణిపైఁ 'బృష్ఠతాడనా ♦ ద్దంతపతన,' మనిన పరిహాసవాక్యము ♦ సార్థమయ్యె 86

అ॥ పార్థివేంద్ర — ఓరాజా, రాయిదిగులంగఁగొట్టినక — ఆబాయి చిన్నచిన్నముక్కలుగాఁ బగులఁగొట్టినట్లయిన, రాజునొడలి బ్రహ్మరాక్షసుఁడు — రాజును బూనియున్న బ్రహ్మరాక్షసుఁడు, ఏగునే — పోవునా, ధరణిపైక — ఈభూమియందు, 'పృష్ఠతాడనాద్దంతపతనం, వీపుమీఁదఁగొట్టిన దంతములురాలుట' అనిన పరిహాసవాక్యము — అనెడు హాస్యముతోఁగూడిన పలుకు, ఇచట 'దంత పతనం — అనిన' అని సంధికలుగుటకు "సూ. శబ్దానామంత్యభాగేషు యోఽనుస్వారః ప్రదృశ్యతే, తస్యాపిపరతోమస్స్యాత్, సర్వత్రపరిసమ్మతేః" అథ. సార్థమయ్యెక — ప్రయోజనముగలదాయెను, ఇందుఁజతుర్థ చరణమున స్వరయతి చెప్పఁబడినది అలం. లోకోక్తి. 'లోకప్రవాదానుకృతి ర్లోకోక్తి రితికథ్యతే' అని వచ.

తా॥ ఆపాషాణమును జితుకఁగొట్టిన రాజును సోఁకిన బ్రహ్మరాక్షసుఁడు పోవునా? 'ప్రహ్వ తాడనాద్దంతపతన' మనిన యెగతాళిమాటయే యిప్పుడు సార్థకమైనదిగదా!

వ॥ ఇట్లు నిశ్చయించి వారు సకల భూప్రజల రప్పించిన. 87

అ॥ వారు — ఆమంత్రులందఱును, ఇట్లు — ఈప్రకారముగా, నిశ్చయించి — స్థిరపఱచుకొని, సకల భూప్రజలన్ — భూమియందుండెడి సమస్తమానవులను, రప్పించిన‌న్ — వచ్చునట్లుచేయఁగా, పిలిపించఁగాననుట.

క॥ శతతాళదఘ్న మగున, య్యతులగ్రావంబుఁ జూచి ♦ యఖిలగ్రామా
గతులైన మానవులు తమ, శ్రుతిసాధనవిధులచేతఁ ♦ జూర్ణము సేయన్. 88

అ॥ అఖిలగ్రామాగతులు, అఖిల — సమస్తమయిన, గ్రామ — గ్రామములనుండి, ఆగతులు — వచ్చినవారు, ఐనమానవులు — అయినట్టిమనుష్యులు, శతతాళదఘ్నము — నూఱుతాటిచెట్లమితముగు నట్టిది, అగు — అయినట్టి, అయ్యతులగ్రావంబున్ — అసమానమైన యాశిలను, చూచి — పరీక్షించి, తమ శ్రుతిసాధనవిధులచేతన్, తమ— వారివారియొక్క, శ్రుత— శాస్త్రములయొక్కయు, 'ని. శ్రుతం శాస్త్రావధృతయోః' అ. సాధన— అభ్యాసముయొక్కయు, విధులచేతన్— నిర్ణయములచేత, చూర్ణము సేయన్ — పొడుముచేయఁగా.

తా॥ సమస్తగ్రామములనుండి వచ్చినవా రానూఱుతాళ్ళ యెత్తయినరాతిని తమ వినికిడి వలనను వాడుకవలనను దెలిసినప్రకారము పిండి చేయఁగా.

—; శిలాచూర్ణమునుండి రంభ జనించుట. ;—

సీ॥ గబ్బిగుబ్బలమీఁది ♦ కస్తూరికాపంక, మాణిముత్తెపుఁజేర్ల ♦ నంటుకొనఁగ
జాళువాబంగారు ♦ జలప్రోఁతకుచ్చుపై, నొడిదారములకాంతి ♦ జడికొనంగఁ
గులుకుఁజెక్కులలోన ♦ గురివెందతాటంక, దోచులు దాఁగిలి ♦ ప్రముచ్చులాడ
నుడురాజు చెంగట ♦ నున్నరోహిణిమాడ్కి, మోముపై ముంగర ♦ ముత్యమలరఁ
గీ॥ గాలఘనకల్పకైశికా ♦ కల్పకల్ప, పుష్పగంధంబు దిక్కుల ♦ బుగులుకొనఁగ
వెలఁది పాషాణచూర్ణంబు ♦ వెడలి నాఁడు, కడలిలోపలఁ బుట్టిన♦క్రమముదెలిపె 89

అ॥ గబ్బిగుబ్బలమీఁది కస్తూరికాపంకము — బటువులైన స్తనములపైనున్న కస్తూరితోఁ జేయఁబడిన బురద, ఆణిముత్తెపు జేర్లన్ — గుండ్రని ముత్యములయొక్కసరములను, అంటుకొనఁగన్ — తగులఁగా, జాళువాబంగారు జలప్రోఁత కుచ్చుపైన్ — చొక్కపుబంగారముయొక్క నీటిమెలాము పోయఁబడిన పట్టుజడకుచ్చుమీఁద, జలకము+ప్రోఁత — జలప్రోఁత, ఉదా. "వ. అజాండకరండంబు వెండిజలప్రోఁతగావించిన తెఱంగు" అనిపాఠి. ఒడిదారములకాంతి — చీరపైటకొంగులయొక్క చివరగల దారములయొక్క ప్రకాశము, జడికొనంగన్ — ఎడతెగకప్రకాశించఁగా, కులుకుఁజెక్కుల

లోనన్ — శృంగారవికార మగపఱచునట్టి చెక్కిళ్ళయందలి, గురువెందతాటంకరోచులు — గురిగిఁజ గుత్తులవంటి చెవికమ్మలయొక్క కాంతులు, దాఁగిలిముచ్చులాడన్ — దాఁగురుమూతలాడుకొను చుండఁగా, బాల్యక్రీడా విశేషము. (దాఁగిలు + ముచ్చులు) ఉదా. "గీ. గచ్చకాయలు దాఁగిలి ముచ్చులాట, బంతిమెకమాట చిందఱపఱపులాట, లనెడు శైశవదుర్వృత్తి నధిగమించి" ప్రలం. వే. ఉడురాజుచెంగటన్ — నక్షత్రములకధిపతియగు చంద్రునిసమీపమున, ఉన్నరోహిణిమాడ్కిన్ — ఉండిన రోహిణివలె, మోముపైన్ — మొగముమీఁద, ముంగరముత్యమలరన్ — నాసికాభరణము నందుఁగల ముత్యము ప్రకాశించుచుండఁగా, కాల.........గంధంబు. కాలఘన — నల్లనిమేఘము వలె, కల్ప — చేయఁబడిన, ని 'కల్పస్తుప్రళయే న్యాయే శాస్త్రే బ్రహ్మదినేవిధౌ, సురద్రుమేవికల్పేచ ప్రత్యయశ్చేత్సమార్థకః, అని నానా. "ఉదా. ప్రభాతకల్పారాత్రిః" అగ్నికల్పశ్శత్రుః, (ప్రాతః కాలసమానము రాత్రియనియు, నగ్నితుల్యుఁడుశత్రువనియుఁ దెలిసికొనునది) కైశిక = తలవెండ్రు కలయొక్క ముడియందు-కొప్పునందు, ఆకల్ప = అంతటను గల్పించఁబడిన, కల్ప — దేవలోకమునఁ గల కల్పవృక్షముయొక్క, పుష్పగంధంబు — పువ్వులయందుఁగల పరిమళము, దిక్కులన్ — అన్ని దిశలయందును, బుగులుకొనఁగన్ — వ్యాపించఁగా — గుప్పునఁగొట్టఁగా, ఇది గుబులుకొనుటకు మాఱురూపము. ఉదా 'సీ. బుగులుకొంచుఁదనర్చు భూరిసౌరభముచే, నొఱపైనమేపూఁతయొప్పు తోడ' పరమ. వి. వెలఁది—ఒకస్త్రీ-శాపవశమునఁ బాషాణమైనయారంభ,పాషాణచూర్ణంబు వెడలి— యారాతిపిండిలోనుంచి బయటికివచ్చి, నాఁడు — పూర్వమొకప్పుడు, కడలిలోపలన్ — (క్షీర) సముద్రమునందు, పుట్టినక్రమమున్ — జన్మించినవిధమును—అనఁగాఁబాలకడలిలో లక్ష్మీదేవి యుద యించినట్లుద్భవించినదనుట, తెలిపెన్ — తెలియఁజేసెను, అనఁగాఁజూచువారందఱికిని సముద్రము నందుఁబుట్టిన లక్ష్మీదేవియో యనునట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష. 'యత్రాన్యధర్మ సంబంధాదన్యత్వే నూపతర్కితమ్, ప్రకృతం హి భవేత్ ప్రాజ్ఞా, స్తా ముత్ప్రేక్షాం ప్రచక్షతే' అనిప్రతా. 'సంభావన మథోత్ప్రేక్షా ప్రకృతస్య సమేనయత్' కా. ప్ర.

తా॥ తేటగల గుండ్రని ముత్యములపేరుల నంటుకొనుచున్న వట్రువగుబ్బలపైఁ గల కస్తూరి యడుసుతోను, అపరంజియొక్క నీరు పోయఁబడిన పట్టుజడకుచ్చులమీఁద నెడతెగక ప్రకాశించు చున్న పయ్యెద చెఱఁగునందలి జలతారుకాంతితోను, గురిగింజ గుత్తులవంటి చెవికమ్మలయొక్క దీప్తి కనఁబడి కనఁబడకుండునట్లు చేయుచున్న చెక్కిళ్ళయొక్క కాంతితోను, చంద్రుని సమీపముననున్న రోహిణీనక్షత్రమువలె నొప్పుచున్న నాసికాభరణమునందలి ముత్యముతోఁగూడిన ముఖప్రకాశము తోను, నల్లనిమబ్బుతో సమానమైన తలవెండ్రుకలయందు గుప్పునవెదఁజల్లుచున్న తావిగల వేల్పుఁ జెట్టుపువ్వులతోను, బాలకడలియందుఁ బుట్టిన లక్ష్మీదేవివలె నారాతిపొడినుండి రంభ వెలుపలకు వచ్చెను.

వ॥ ఈరీతి నన్నాతి రాతిపొడి వెడలి నిలిచిన సకలజనంబులు మనమనంబుల. 90

అ॥ ఈరీతిన్ — ఈవిధముగా, అన్నాతి — ఆస్త్రీ, రాతిపొడివెడలి — ఆశిలాచూర్ణమునుండి బయటికివచ్చి, నిలిచినన్ — నిలఁబడఁగా, సకలజనంబులు — సమస్తముగుమానవులు, తమమనంబులన్ — వారివారి మనస్సులయందు, ఇందు 'ఈరీతినన్నాతిరాతి' వృత్త్యనుప్రాసము 'జనంబులు మనంబులు' అంత్యానుప్రాసము.

సీ॥ జొటజొటఁ గురియునో ♦ జుంటితేనియ మోవి, నొదవునో జాబిల్లి ♦ కొదమ నుదుట
విసరునో శృంగార ♦ రసవృష్టి కొప్పునఁ, దొలఁగునో యమృతంబు ♦ పలుకులందు
రాలునో కుముదప ♦ త్త్రములు చూపులయందుఁ, వెడలునో సిఁగిణి విండ్లు బొమల
వెళ్లఁబెట్టునొ పూర్ణ ♦ విధుకాంతి మొగమున, దిగఁబాఱునో పైఁడి ♦ తెలివి మేన
గీ॥ వెడలఁ బొంగునొ చెక్కుల ♦ విమలరత్న, దర్పణద్యోతనిగనిగల్ ♦ తఱచు గాఁగ
జోడుకూడి చెలంగునో ♦ చూడఁ జూడ, గబ్బిగుబ్బలఁ గోడెజ ♦ క్కవలకవలు. 91

అ॥ మోవిన్ — క్రిందిపెదవియందు, జుంటితేనియ — తేనెటీఁగలు కూర్చెడు తేనెవంటి తేనె, జొటజొటన్ — జొటజొట యను ధ్వనికలుగునట్లు, కురియునో — వర్షించునేమో, ఇచట 'జొట జొట' యనుద్విరుక్తినిగుఱించి 'సూ. కాంతిశబ్దాదిశబ్దాస్తు ద్విరుక్తాస్సంత్యనేకశః సాధారణాస్తదన్యేచ వైచిత్ర్యం భూరివర్తతే' అని అధ. ఉదా 'చ. జొటజొట ధారగా వడియుచున్' అని పాం. మా. నుదుటన్ — నొసటియందు, జాబిల్లికొదమ — బాలచంద్రుఁడు, ఒదవునో — పుట్టునేమో, కొప్పునన్ — కేశబంధమునందు, శృంగారరసవృష్టి - శృంగార - సంభోగమునుగూర్చిన 'ని. శృంగారస్సురతే నాట్యరసేఽపిగజమండనే' అని వి. రస - ప్రేమయొక్క, 'ని. శృంగారముఖ్య మధురాది సువర్ణరేతో నిర్యాసరాగగరళద్రవపారదేషు, ఆస్వాదనధ్వనిసుధాంబురసాఖ్యధాతు ష్విష్టోరసో' అని నా. వృష్టి- వర్షము, విసరునో - వ్యాపించునేమో, పలుకులందున్ - సంభాషణములయందు, అమృతంబు- సుధ, తొలఁగునో - చలించునేమో, చూపులయందున్ - వీక్షణములయందు, కుముదపత్త్రములు - తెల్ల గలువపూరేకులు, రాలునో - క్రిందఁబడునేమో, బొమలన్ - కనుబొమలయందు, భ్రూవులయందు, సింగిణివిండ్లు - శృంగధనుస్సులు, వెడలునో - వెలుపలకు వచ్చునేమో, మొగమునన్ - ముఖము నందు, పూర్ణవిధుకాంతి - నిండుచందురునియొక్క ప్రకాశము, వెళ్ళఁబెట్టునో - వెలువడఁజేయు నేమో, మేనన్ - ఒడలియందు, పైఁడితెలివి- బంగారముయొక్క పరిశుద్ధత్వము, దిగఁబాఱునో-క్రిందికి జాఱునేమో, చెక్కులన్-చెక్కిళ్ళయందు, విమలరత్నదర్పణ ద్యోతనిగనిగల్, విమల- నిర్మలమైన, రత్నదర్పణ - మణులతోఁజేయఁబడిన యద్దముయొక్క, ద్యోత - ప్రకాశమునందలి, నిగనిగల్ - నిగనిగయనుకాంతులు, తఱచుగాఁగన్ - అధికమగునట్లు, వెడలఁబొంగునో - అతిశయించి బయటికి వచ్చునేమో, చూడఁజూడన్ - మిక్కిలిపరిశీలించఁగా, గబ్బిగుబ్బలన్ - బటువులైనవక్షోజస్తనముల యందు, కోడెజక్కవలకవలు - యౌవనపు జక్కవలజతలు జోడుకూడి - ఒండొంటితోఁగలిసి, చెలంగునో - ఒప్పునేమో, రూపకాతిశయోక్త్యలంకారము. 'రూపకాతిశయోక్తి స్స్యాన్నిగీర్యాధ్యవసానతః. పశ్యనీలోత్పలద్వంద్వా న్నిస్సరంతి శితా శ్శరాః' కువ. 'నిగీర్యాధ్యవసానంతు ప్రకృతస్య పరేణయత్ ప్రస్తుతస్య య దన్యత్వం యద్యర్థోక్తౌ చ కల్పనమ్' కార్యకారణయో ర్యశ్చ. పౌర్వాపర్యవిపర్యయః, విజ్ఞేయోఽతిశయోక్తిఃసా' ఉదా. 'కమల మసంభసికమలేచ కువలయే తానికనకలతికాయాం సాచ సుకుమారసుభగే, త్యుత్పాతపరంపరా కేయమ్' కా. ప్ర. జక్కవల కవలు యమకాలంకారము.' యమకంపౌనరుక్త్యేతు' కా. ప్ర.

తా॥ ఈ స్త్రీ యింపైనపెదవియు, బాలచంద్రునివంటి నొసలును, మరులుకొలుపునటువంటి కొప్పును, తీయనిపలుకులును, తెల్ల కలువపూరేకులవంటి కన్నులును, వంచినవిల్లువంటి కనుబొమలును,

నిండుచందురునిబోలిన మోమును, బంగారుచాయగల మేనును, వజ్రపుటద్దముల కెనయైన కాంతిగల చెక్కిళ్ళను, జక్కవజంటవలె గుండ్రని స్తనములు గలిగియున్నది.

ఉ॥ గుత్తపుగుబ్బలాఁడి సుమ ♦ కోమలి ముద్దులగుమ్మ మల్లెపూ
గుత్తి మెఱుంగుఁదీఁగె లత ♦ కూన మనోజురవాళి జాళువా
ముత్తెపుఁగోల చంద్రకళ ♦ మోహనమంత్రము కాంతిరాశి యీ
పుత్తడిబొమ్మ యేకరణిఁ ♦ బుట్టెనొకో యుపలంపుధూళిలోన్. 92

అ॥ గుత్తపుగుబ్బలాఁడి - బిగువైనయౌవనము గలదియును - కఠినమైన స్తనములు గలదియును; సుమకోమలి - పుష్పమువలె మృదువైన మనోజ్ఞమైనదియును, ముద్దులగుమ్మ - ముద్దులుగులుగునట్టిది యును, మల్లెపూగుత్తి - మల్లెపూవులగుత్తివలె నింపైనదియును, ఇది మల్లీశబ్దమునకుఁ దత్సమము. మెఱుంగుఁదీఁగె - ఉత్కృష్టకాంతిగల విద్యుల్లతవంటిదియును, మెఱుపుఁదీఁగెను బోలినదియును, లత కూన - లేఁగీఁగవంటి తనువుగలదియును, మనోజురవాళి - మన్మథునియొక్క ధ్వనియైనదియును, ఇది రవళియొక్క రూపాంతరము ఉదా. 'సీ. కెరలిసెమ్మలుసేయు కేకారవమ్ములు లావుకలెత్తుసీలలరవాళి' ఆం. చంద్రా. జాళువాముత్తెపుఁగోల - అపరంజితోఁగూర్చిన ముత్యములయొక్క బాణమువలె సొగసైనదియును, చంద్రకళ - చంద్రునియందలి భాగమువలెఁ బ్రకాశమైనదియును, మోహనమంత్రము - మరులుకొలుపునట్టి యింద్రజాలవిద్య యైనదియును, మోహనమంత్ర మనుటకు 'వశ్యము, ఆకర్షణము, విద్వేషణము, ఉచ్చాటనము, మోహనము, స్తంభనము, మారణము, శమనము, అనునవి యెనిమిది విధములు గలవు. వానినెల్ల మంత్రశాస్త్రములయందుఁ జూడనగును. ఉదా. 'ఓం క్లైం క్లైం దేవి జగన్మోహిని క్లీం క్లీం మాయాస్వరూపిణి సకలజనానాం మోహనం కురు కురు క్లీం క్లీం స్వాహా' మం. శా 1. కాంతిరాశి - ప్రకాశముయొక్క ప్రోగుగాఁగూడినదియును, అయిన ఈపుత్తడిబొమ్మ - ఈయపరంజి ప్రతిమ, ఉపలంపు ధూళిలోన్ - రాతిపిండియందును, ఏకరణిన్ - ఏప్రకారముగా, పుట్టెనొకో - ఉద్భవించియుండెనొకదా, ఇందు 'పుత్తడిబొమ్మ' అనుటకుదా. 'సీ. తరతరంబులనుండి♦తనయింట నలరపు, త్తడిపైఁడి బుట్టుచు♦స్తమున వెలయు' అని శృం. ష. అలం. మాలారూపకము. 'మాలా తు పూర్వవత్' కావ్య. ప్ర. ఒకచోట బహూపమానములు కూడినప్పు డెటులమాలోపమ యగుచున్నదో యటులే యొకచోట ననేకధర్మముల నారోపించినపుడు మాలారూపక మగుచున్నది. ఉదా. 'సౌందర్యస్య తరంగిణీ తరుణిమోత్కర్షస్య హర్షోద్గమః కాంతేః కర్మణి కర్మనర్మరహసా ముల్లాసనావాసభూః, విద్యా వక్రగిరాం విధేరనవధి ప్రావీణ్యసాక్షాత్క్రియా, బాణాః పంచశిలీముఖస్య లలనా చూడామణిః సా ప్రియా' ర. గం.

తా॥ దృఢమైన యౌవనముగలదియును, పుష్పమువలె మనోజ్ఞమయినదియును, ముద్దులుగులుకుచున్నదియును. మల్లికాగుచ్ఛమువలె నింపైనదియును, విద్యుల్లతవోలెఁ బ్రకాశించుచున్నదియును. లేఁదీఁవవంటిదియును, మన్మథునివారువమగు చిలుకవలె నొప్పుచున్నదియును, బంగారముతో నమర్చఁబడిన ముత్యములబాణమును బోలినదియును, చంద్రకళతో సమానముగఁ బ్రకాశించుచున్నదియును, మోహమును గలిగించునట్టి యింద్రజాలవిద్యవలె నొప్పుచున్నదియు నగు నీచొక్కపు బంగారుబొమ్మ రాతిపొడియం దెట్లుజన్మించినదోకదా! అని తలంచిరి.

—: రంభ నిరంకుశునియొద్దకు వచ్చుట :—

సీ॥ జిలుఁగుపయ్యెద జాఱఁ ♦ జికిలిగుబ్బలకాంతి, దిగఁబాఱదిశలెల్ల ♦ దెలివిపఱుప
నలవోకగాఁజూడ ♦ నసమాస్త్రనిశితమా, ర్గణపరంపరలొక్క ♦ రాశిఁబడఁగఁ
గరపంకజములూఁపఁ ♦ గనకకంకణఝుణ, నాదసంపదగుమా ♦ నముగఁజెలఁగఁ
బ్రతిపదంబుననూపు♦రఝుళంఝుళవిరావ, మునమూఁగఁబడిహంస♦ములు దొలంగఁ

గీ॥ దనరుచాతుర్యధుర్య సౌం ♦ దర్యరేఖఁ, దగిలివీడనిచూపులు ♦ మగిడిడిగియ,
రాకమర్త్యులవెంటాడి ♦ రానమర్త్య. నీరజాక్షి నిరంకుశుఁ ♦ జేరవచ్చె. 93

అ॥ అమర్త్యనీరజాక్షి - దేవతాస్త్రీయగునారంభ; జిలుఁగుపయ్యెద - చిత్రలేఖనము గల చేలాంచలము దుకూలాంబరముయొక్క పైఁటయనియు జెప్పవచ్చును. జాఱన్ - దిగఁబడుచుండఁగా, చికిలిగుబ్బలికాంతి - తుడిచి చక్కఁజేసిన కుచములయొక్క ప్రకాశము, దిగఁబాఱన్ - క్రిందికిఁ బ్రసరించుచుండఁగా; దిశలెల్లన్ - దిక్కులన్నియును; తెలివిపఱపన్ - స్వచ్ఛముగాఁజేయుచుండఁగాను, అలవోకగాన్ - ఇష్టమువచ్చినట్లు - స్వేచ్ఛగా, చూడన్ - అవలోకించుచుండఁగా, అసమాస్త్రనిశితమార్గణపరంపరలు. అసమాస్త్ర - విషమసంఖ్యగల బాణములుగలవాఁడయిన మన్మథుని యొక్క; నిశిత - వాఁడియైన, మార్గణ - బాణములయొక్క, పరంపరలు - వరుసలు, అనుక్రమములు, ఒక్కరాశిన్ - ఒక్కప్రోవునందు, పడఁగన్ - చేరుచుండఁగాను, కరపంకజములు - పద్మములవంటిహస్తములు, ఊఁపన్ - ఊగించఁగా, కనకకంకణఝుణనాదసంపద-కనకకంకణ - సువర్ణమయమగు హస్తాభరణములవలన, ఝుణనాద - ఝుణత్కారముయొక్క, సంపద - అధికము, గుమానముగన్ - అవ్యక్తమధురముగా, 'ని. గుమానము - సందేహము' ఆం. వా. చెలఁగన్ - ఒప్పుచుండఁగాను, ప్రతిపదంబునన్ - అడుగడుగునందు, నూపుర - కాలియందెలయొక్క, ఝుళంఝుళవిరావమునన్ - ఝుళంఝుళయనెడు ధ్వనివలన, హంసములు - హంసలు, మూఁగఁబడి - చుట్టుకొని, తొలంగన్ - దారితొలఁగియావలికిఁ బోవుచుండఁగాను, తనరు - ఒప్పుచున్న, చాతుర్యధుర్యసౌందర్యరేఖన్ - చాతుర్య-నేర్పుయొక్క, ధుర్య - భారమునువహించుచున్న, సౌందర్య - చక్కఁదనముతోఁగూడిన, రేఖన్ - శరీరసౌష్ఠవముతో, తగిలి - పొంది, వీడని - విడివడనిఅనఁగా తప్పవాల్చనియనుట, చూపులు - వీక్షణములు, మగిడి - మరల - డిగియరాక - తక్కువపరచుటకు వీలుగాక అనఁగాఁ గమక్రమముగ నెక్కువయగునుగాని తక్కువకాదనిభావము. మర్త్యులన్ - మానవులను, వెంటాడిరాన్ - వెంబడించిరాఁగా, అనిమిషస్త్రీ యగుటవలన నాయువతిచూపుక్రమక్రమముగా నధికమై మానవుల నాక్రమించిన దని కవిహృదయము. పెద్దనార్యుఁడును 'ఉ. చూచి ఝుళం ఝుళత్కటక ♦ సూచిత వేగపదారవిందయై, లేచి కుచంబులుందుఱుము ♦ లేనడుమల్లలనాడ నయ్యెడం, బూచినయొక్క పోఁకనును♦ బోదియఁజేరి విలోకనప్రభా, వీచికలం దదీయపద♦వీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్' అనినాఁడు. రంభ నిరంకుశునియొద్దకు వచ్చునప్పుడు పయ్యెదజాఱుట కామేంగితము.

'ఓష్ఠః ప్రస్ఫురతీక్షణే విచలతః కూపాదకే మత్స్యవ
ద్ధమ్మిల్లః కుసుమాంచితో విగళతి ప్రాప్తోఽపి బద్ధం పునః
ప్రచ్ఛన్నౌ వ్రజతః స్తనౌ ప్రకటతాం శ్రోణీతటం దృశ్యతే,
నీవీ చ స్ఖలతి స్థితాఽపి సుదృశాం కామేంగితం యోషితాం రతి.

ఈశ్లోకమున కాంధ్రము:

చ॥ పెదవి గదల్చుఁ గన్నుగవ ♦ పెంపెసలారఁబిఱుందుఁజూచుచుఁ బ
య్యెదవిదిలించుఁ జన్నులు బ ♦ యల్పడఁ గొప్పుననున్న క్రొవ్విరుల్
సెదరినఁ బల్మరుందుఱుముఁ♦ జెక్కునజెమ్మట జీరనించుఁ గ
ట్టెదిరినఁ జక్కఁగట్టుఁ జప ♦ లాక్షి మనోహరమూర్తిఁ జూచినన్. కళా. శా.

నిరంకుశుఁ- నిరంకుశుఁడనెడు పేరుగలయాబ్రాహ్మణుని, యొద్దకుచేరవచ్చెన్- సమీపించెను, అలం-అతిశయోక్తి, విషయస్యానుపాదానా, ద్విషయ్యుపనిబధ్యతే, యత్ర సాఽతిశయోక్తి స్యాత్. కవి ప్రౌఢోక్తిజీవితా' అని ప్రతా. ఉదా. 'కమల మనం భసికమలే. చకువలయే తాని కనకలతికాయాం సా చ సు మారసుభగే త్యుత్పాత పరంపరా కేయం' కా. ప్ర.

తా॥ ఆదేవతాస్త్రీయొక్క పైఁట జాఱుచుండఁగా స్తనములకాంతి క్రిందికిఁబ్రసరించుచుం దిక్కులనిండుచుండెను. ఇచ్ఛవచ్చినట్లు చూచెడుచూపులవలన మన్మథబాణపరంపరలు కురియుచుండెను. కమలములవంటి హస్తముల నూఁపుచుండుటవలనఁ గాంచనహస్తాభరణములయొక్క ధ్వని యవ్యక్తమధురముగా నుండెను. నడచునప్పుడు కాళియందెలయొక్క చప్పుడువలన నంచలు పాదములఁజుట్టుకొనుచు మరలఁదొలఁగుచునుండెను. నేర్పుగలదియు నందకత్తెయు నైనయాబిడయొక్క చూపులు క్రమక్రమముగా వృద్ధియగుచు జనుల నాకర్షించుచున్నవి. ఇట్లానిరంకుశునిచెంతకు వచ్చెను.

## —: నిరంకుశుండు సంతోషించుట :—

క. చనుదెంచి యెదుట నిలిచిన, వనజేక్షణఁ గౌఁగిలించి ♦ వసుధా సురనం
దనుఁడు నయనాంచలాశ్రులు, కొనగోరం దొలఁగ మీటు ♦ కొనుచుం బలికెన్ 94

అ॥ చనుదెంచి - తనసమీపమునకువచ్చి, ఎదుటన్ - ముందరనిలిచిన, వనజేక్షణన్ - నిలిచియున్న పద్మములవంటి కన్నులుగలదైన యారంభను, వసుధాసురనందనుఁడు - పుడమికి వేల్పువంటివాఁడయిన యాసురశర్మకుమారుఁడు, కౌఁగిలించి - ఆలింగనముచేసి, నయనాంచలాశ్రులు - నయనాంచల - తనయొక్క కనుగొనలయందలి, అశ్రులు - కన్నీరును, కొనగోరన్ - కోటియొక్క చివరతో, ఇచట గోరన్ అనుటకు సూ. ఔప విభక్తికముల తృతీయా సప్తమీ విభక్తులకత్వంబాదేశం బగు బా. వ్యా. తొలంగన్ - స్వస్థానమును విడుచునట్లు, మీటుకొనుచున్ - ఎగఁజిమ్ముకొనుచు పలికెన్ - ఇట్లువచించెను.

తా॥ రాఁగానే యారంభను నిరంకుశుఁ డాలింగనమొనర్చి తన కన్నులనుండి స్రవించుచున్న యశ్రువులను గొనగోటితోఁ జిమ్ముకొనుచు నిట్లువచించె.

క. నాకై లోకైకస్తు, త్యాకారము ఱాతిలోన ♦ నణఁగించి మనో
వ్యాకీర్ణశోకభరమున, నాకులపడియుండవలసె ♦ నౌఁదరళాక్షీ. 95

అ॥ తరలాక్షీ - ఓచంచలమైన కన్నులుగలదానా, నాకై - నాకొఱకు, లోకైకస్తుత్యాకారముఁ. లోక - ప్రపంచమునందు, ఏక - ముఖ్యముగా 'ని. ఏకేముఖ్యాన్యకేవలాః' అని నానా. స్తుత్య - పొగడఁదగిన, ఆకారముఁ - చక్కఁదనమును, ఱాతిలోనఁ - శిలాగర్భమున, అణఁగించి - మాటుపఱచి, మనోవ్యాకీర్ణశోకభరమునఁ - మనః - మనస్సునందు, వి. విశేషముగా, 'ని. వి శ్రేష్ఠాతీతనానార్థే విస్పష్టత్వేక్షిణ్యా నవ్యయం.' అనివిశ్వ. ఆకీర్ణ - ఎడములేక, యంతటను నిండినట్టి, అనఁగాఁ బూర్ణీభవించియనుట, శోక - దుఃఖముయొక్క, భరమునఁ - అతిశయముతో, ఆకులపడి - కలఁతపడి, వ్యాకులముఁ జెంది, ఉండవలసెఁ - ఉండవలసివచ్చెను, ఔఁ - అవునుగదా.

తా॥ ఓరంభా! నీవు నానిమిత్త మిట్లు కఠినమైన శిలాగర్భమున నీచక్కఁదనమును దాఁచికొనియుంటివి గదా.

వ॥ అని విని యయ్యరవిందదళాయతాక్షి భూసురనందనున కిట్లనియె. 96

అ॥ అనఁ - ఇట్లుపలుకఁగా, విని - ఆకర్ణించినదై, అయ్యరవిందదళాయతాక్షి - తామర పువ్వులయొక్క రేకులవంటి విశాలమైనకన్నులుగల యాదేవవేశ్య, భూసురనందనునకున్ - పుడమికి వేలుపువంటివాఁడయిన యాసురశర్మ కొడుకునకు, ఇట్లనియెఁ - ఈ ప్రకారముగాఁ జెప్పెను. పైపద్యముతో నన్వయము.

తా॥ ఇట్లు వచించినతోడనే యానిరంకుశునితో రంభ యీరీతిగాఁ జెప్పఁబూనెను.

సీ॥ నలునకా శనిచేతి ♦ యలత హరిశ్చంద్ర, మహీపాలవరునకా ♦ మాలకొల్వు
రోహిణీభర్తకా ♦ రాహుచేఁ బడుపాటు, పంచసాయకునకా ♦ భస్మమగుట
వనజసంభవునంత ♦ వానికా తలపోక, పాకశాసనునకా ♦ బ్రహ్మహత్య
యరవింద నేత్రున♦కా బోయచేఁ జావు, హరునకా భిక్షాట ♦ నావసక్తి
గీ॥ ఘనుఁడు రామనృపాలున ♦ కా తలంప, నుత్కటంబైన పత్నీవి ♦ యోగదుఃఖ
మెంతవారికిఁ గాని మ ♦ హీసురేంద్ర, కర్మమనుభవనీయంబు ♦ గాకపోదు. 97.

అ॥ మహీసురేంద్ర - పుడమికి వేలుపులవంటివారిలో శ్రేష్ఠుఁడయిన వాఁడా, శనిచేతి యలత - శనిబాధించుటచేత నయినకష్టము, నలునకా - చక్రవర్తియైన నలునియంతటివానికేనా కలుగవలసినది, ఇది సంభవింపఁదగినది కాదనుట. ఇట్లే యంతటను నెఱుంగునది. ఇచట శనియనఁ గలిపురుషుఁడేయని తెలియవలయును. 'శ్లో॥ హరిశ్చంద్రో నలో రాజా పురుకుత్సః పురూరవాః సగరః కార్తవీర్యశ్చ షడైతే చక్రవర్తినః' అను ప్రసిద్ధినిబట్టి నలుఁడు కలియుగములోనివాఁడు కాఁడుగదా! కలియని భారతాదులందుఁ గన్పట్టుచున్నది. కాని యది యసంగత మని కలి యేపురాణములనుబట్టియో యుద్దేశించినట్లు ధ్వనిపడుచున్నది. 'సీ.నలునకా కలిచేతియలఁత' అని ననుగణదోషమూలేదు. మనము విమర్శించినంతలో

తే|| "పౌరుషమునకొంపకేశ వర్తనుండైన, యాత్రికంపుండువో తేజంబు భూరియెదరఁ
గాంతిసంపదఁగోల్పోయి కలియుగంబు, సాధ్వసాతిరేకంబునఁ జలదరించె" శృ. నై. సప్త 95.

అ|| 'కలహంసల నుగించుకలియుగంబు' శృ. నై. సప్త. 107

'కలిరాజాన్ - కలియుగమునకు నధిపతిని' (ఏకత్రింశద్వ్యాఖ్య 500 పు.) ఇట్లు శ్రీనాథాదులచేఁ గలియుగమని చెప్పఁబడుచున్న కలిపురుషుండు కలియుగారంభమున జనించుట సహజముగాని యంతకుఁ బూర్వయుగములయం దుండెననుట సమంజసము కాదు. శని యన్నియుగములయందుండు వాఁడు శనియే కలిపురుషాపరనామము గలవాఁడని కొన్ని పురాణగాథలున్నవి. ఇట్లే హరిశ్చంద్రకథయందును గౌరన కాలకౌశికుఁడు కలిపురుషుఁడేయనియును శంకరకవి యొకచోఁ గలిపురుషుఁడనియు నొకచో శనియనియుఁ జెప్పిరి. (శంక. హరి. సం. 183. చ. 99.) శిల్పశాస్త్రములయందుఁ గలిని యముని యొక్క మంత్రిగా వర్ణింపఁబడియున్నది. ద్విభుజః కృష్ణవర్ణస్తు ఖడ్గఖేటకసంయుతః కరాలదంష్ట్రివదనో రక్తమాల్యానులేపనః రక్తవస్త్రధరః శ్రోగ్రః కిరీటమకుటాన్వితః, దీప్తాగ్నిసదృశాక్షశ్చ మహామహిషవాహనః యమస్తు తస్యపార్శ్వస్థౌ × × × × చిత్రగుప్తః కలిశ్చైవ, ద్వారపార్శ్వే తు సంస్థితౌ, కృష్ణశ్యామనిభౌ తౌ చ రక్తవస్త్రధృతౌ శుభౌ పీఠపార్శ్వగతౌ మృత్యుసహితౌ వు × × × × నీలలోహితసంకాశౌ ద్వౌ చామరధృతౌ స్త్రియౌ పురతః సుస్థితౌ విప్రౌ. ధర్మాధర్మసమాహ్వయౌః యమః సింహాసనారూఢో మహిషారోహితస్తథా శి. ర. ఇచట హరిచ్చంద్రశబ్దము హరిశ్చంద్రః అగుటకు సూ. 'ప్రస్కణ్వ హరిశ్చంద్రావృషీ. సిద్ధాం. హరిశ్చంద్రగ్రహణ మమంత్రార్థమ్, ఋషీ ఇతికిం ప్రకణ్వో దేశః, హరిశ్చంద్రో మాణవకః, ప్రస్కణ్వహరిశ్చంద్రావృషీ అమంత్రార్థ మితి మంత్రేతు, హ్రస్వాచ్చందోత్తరపదే మంత్రే, ఇతి పూర్వసూత్రేణైవ సిద్ధ మితిభావః తత్సూత్రం వైదికప్రక్రియాయాం వ్యాఖ్యాస్యతే. మాలకొల్వు - కడజాతివాని కూడిగము చేయుట, హరిశ్చంద్రమహీపాలమౌళికా - రాజులలో శ్రేష్ఠుఁడయిన హరిశ్చంద్రునకేనా ప్రాప్తించవలసినది. రాహుచేఁబడుపాటు - విషధారులలో నధికుఁడైన రాహువుచే మ్రింగఁబడుట, రోహిణీభర్తకా - దేవతలందఱి కమృతము నొసంగెడి చంద్రునకేనా తటస్థించవలసినది, భస్మమగుట - కాలి బూడిదయైపోవుట, పంచసాయకునకా - ఉన్మాదన, రోదన, సమ్మోహన, శోషణ, మారణము లనునైదుబాణములు గలిగి ప్రపంచమునందలి స్త్రీ పురుష సముదాయమునంతటికిని సంతోషము గలిగించునట్టి మన్మథునికేనా దాపరించవలసినది. తలపోక - శిరస్సు తెగిపోవుట, వనజసంభవునంతవానికా - జగత్సృష్టికర్త యైనబ్రహ్మదేవునికిఁ బ్రాప్తించఁదగినదేనా, పూర్వము బ్రహ్మదేవున కైదుశిరములనియు నొకానొకప్పుడా యైదుశిరములలో నొకటి శివునిచే ఛేదించఁబడినదనియుఁ బురాణప్రసిద్ధి. బ్రహ్మహత్య - బ్రాహ్మణునిఁ జంపుటవలని పాపము, పాకశాసనునకా - పుణ్యలోకమున కధిపతియైన యింద్రునికిఁ దగులవలసినదేనా, ఇంద్రుఁ డొకప్పుడు త్వష్టృసుతుఁ డగువిశ్వరూపాచార్యునిఁ జంపినందున నతనికి బ్రహ్మహత్యాదోషము సంభవించి యిక్కట్లుచెందినట్లు భాగవతమునఁగలదు. బోయచేఁజావు - కిరాతునిచేఁజచ్చుట, అరవిందనేత్రునకా - దానవులను సంహరించువాఁడైన శ్రీ కృష్ణునకేనా సంభవించవలసినది. శ్రీరాముఁడు వాలిని బాణముతోఁగొట్టఁగా నాతఁడు నిష్కారణముగా నాపై నేల శరమువిడిచితివన రాముఁడు నీయుత్తరజన్మమున బోయవాఁడవై నేను కృష్ణావతారమును విడుచుసమయమున నీవును నిట్లే బాణమునాపైఁ

బ్రహ్మయోగింపఁగల వనుటయు నటులనే కృష్ణావతారాంతమున బోయవాని బాణప్రాప్తిచే శ్రీకృష్ణావతార సమాప్తియగుటయుఁ బురాణములయందుఁ గలదు. భిక్షాటనావసక్తి - అడుగుకొని తినుట, భూయనకా - వెండికొండ నివాసముగను సువర్ణపర్వతము హస్తమున విల్లుగను నన్నపూర్ణాదేవి భార్యగను గల శివునికేనా కలుగవలసినది, శివుఁడానెభిక్షుకుఁడని శాస్త్రప్రసిద్ధి. తలంపన్ - విచారించఁగా, ఉత్కటంబు - అధికము, ఐన - అయినట్టి, పత్నీవియోగదుఃఖము - భార్య యెడబాటగుటవలని శోకము, ఘనుఁడురామనృపాలునకా - గొప్పవాడయిన రఘురామునికి సంప్రాప్తించఁదగినదేనా, ఇచట షష్ఠీవిశేషణమునకు వికల్పముగాఁ బ్రథమావిభక్తియంతమగుటకు 'సూ. విభాషయాను సంతంస్యాదత్రషష్ఠీవిశేషణమ్, భ్యాద్యర్థవ్యవధానేతు భేద్యస్యనిఖిలంభవేత్' అథ. ఎంతవారికిఁగాని-ఎంతటి ఘనులకైనను, కర్మము- ప్రారబ్ధము,అనుభవనీయంబు - అనుభవించఁదగినది, కాకపోదు - అట్లుగాక వ్యర్థముగాఁబోదుసుమా, ఇచట నలునకాశనిచేతియలతగ ఇట్లుపమానములనుప్రాసము.ఎంతవారికినిఁగాని మహీసురేంద్ర కర్మమనుభవనీయంబుగాకపోదు, అనుటచే బహూసమానార్థాంతరన్యాసము. 'సామాన్యం వావిశేషోవా తదన్యేనసమర్థ్యతే, యత్రసోఽర్థాంతరన్యాసః సాధర్మ్యేణేతరేణవా' కా. ప్ర. ఇందుసీసపద్య చతుర్థ బృహత్పాదమునఁత్రృతీయ చెప్పఁబడినది.

తా॥ ఓనిరంకుశుఁడా! నలచక్రవర్తిని గలిపురుషుఁడు వేసించుటయు, హరిశ్చంద్ర సార్వభౌముఁడు మాలవానిని సేవించుటయుఁ, చంద్రుఁడు రాహువుచే మ్రింగఁబడుటయు, మన్మథుఁడు శివునికంటిమంటతో బూడిదయగుటయు, బ్రహ్మకు శిరస్సుతెగుటయు, నింద్రునకు బ్రహ్మహత్యదగులుటయుఁ, గృష్ణుఁడు కిరాతునిచేఁ జచ్చుటయు, శివుఁడు భిక్షమెత్తికొనుటయు, రాముఁడు సతి నెడబాసి దుఃఖమనుభవించుటయు, గలుగలేదా! వీరలెల్లరు సామాన్యులా ఇట్టివారిలో నేనెంతటి దానను. కావున నెంతటిమహనీయులకైనను ప్రారబ్ధమనుభవింపక తప్పదుగదా!

—: రంభ నిరంకుశుని బ్రశంసించుట :—

క॥ ఆపద లెవ్వరికైనన్, బ్రాపింపకపోవు వానిఁ ♦ బాపఁగ మిగులన్
బ్రాపగుచుట్టముగలుగుట, పో పుణ్యవిపాకఫలము ♦ భూసురవర్యా, 98

అ॥ భూసురవర్యా - పుడమికివేలుపులుగానున్నవారిలో శ్రేష్ఠుఁడా, ఎవ్వరికైనన్ - ఎటువంటివారికైనను, ఆపదలు - కష్టములు, ప్రాపింపకపోవు - రాకపోవు, వానిన్ - ఆకష్టములను, పాపఁగన్ - తొలఁగించుటకుఁగాను, మిగులన్-ఎక్కువగా, ప్రాపగుచుట్టము- 'ఆదరువుగలబంధువు, కలుగుటపో - లభించుటయేకదా, ఇచట 'కలుగుటపో' అనుటకు 'సూ. అన్యేష్వర్థవిశేషే ష్వరంతే శ్రుతిమనోహరాః' అథ. పుణ్యవిపాకఫలము - పుణ్యముపరిపక్వమునుజెందినఫలము- మహాదృష్టము, లోకముననెవ్వరికైన నాపదలు వచ్చునుగాని, వానిని దొలంగించఁగల బంధువులు లభించుటయే యదృష్టము . అనుటచే అప్రస్తుత ప్రశంసాలంకారము. 'అప్రస్తుతస్యకథనాత్ ప్రస్తుతం యత్రగమ్యతే, అప్రస్తుత ప్రశంసేయం సారూప్యాదినియంత్రితా' ప్రతా. 'అప్రస్తుత ప్రశంసాయా సాసైవ ప్రస్తుతాశ్రయా కార్యే నిమిత్తే సామాన్యే విశేషే ప్రస్తుతే సతి, తదన్యస్య వచస్తుల్యే తుల్యస్యేవేతి పంచధా' కా. ప్ర. ఉదా. 'సుహృద్వధూ బాష్పజలప్రమార్జనం, కరోతి వైరిప్రతియాతనేన యః, స ఏవ పూజ్యః సపుమాన్ సనీతిమాన్ సుజీవితంతస్య సభాజనం శ్రియః'

తా॥ ఓనిరంకుశుఁడా! కష్టము లేరికైన రాకపోవు గాని యట్టివానినిఁ బోఁగొట్టఁగల స్నేహితులు లభించుటయే పూర్వపుణ్యసాఫల్యముసుమా!

ఉ॥ ఆపదకైన బంధుజన ♦ మక్కఱదీర్చుధనంబు రోగమున్
బాపఁగఁ జాలునౌషధము ♦ పాపవిముక్తినిఁజేయుపుత్త్రుఁడున్
గోపమడంచుతెల్వి బుధ ♦ కోటికి మెచ్చగువిద్య దీనసం
తాపముఁజూడలేనిదయ ♦ దైవవశంబునఁగాక కల్గునే. 99

అ॥ ఆపదకున్ - కష్టసమయమునకు, ఐన - అక్కఱపు వచ్చిన, బంధుజనము - చుట్టముల యొక్క సముదాయమును, అక్కఱదీర్చు - అవసరమును దొలఁగించునట్టి, ధనంబు - ద్రవ్యమును, రోగమున్-వ్యాధిని, పాపఁగన్ పోఁగొట్టుటకు, చాలునౌషధము- శక్తిగలిగినటువంటిమందును, పాపవిముక్తినిన్ - పాపమునుబోఁదోలుట, చేయుపుత్త్రుఁడున్ - ఆచరించునటువంటి కుమారుఁడును, కోపమడంచుతెల్వి – కోపమునునశింపఁజేయునట్టి జ్ఞానమును, బుధకోటికిన్ – పండితుల యొక్క సమూహమునకు, మెచ్చగువిద్య - మెప్పుగలవిద్యయును, అనఁగాఁ బండితులు మెచ్చునటువంటివిద్య యనుట, దీనసంతాపమున్ - దరిద్రులయొక్క కాఁకను, చూడలేనిదయ - చూచి సహించలేని కారుణ్యమును, దైవవశంబునఁగాక - అదృష్టవశమున నేతప్ప, ఇచట 'దైవవశంబునఁగాక' అనుటకు 'సూ. క్వచిదర్థవిశేషేచ రూఢా విశ్రాంతిరుచ్యతే' అని. కల్గునే - ప్రాప్తించునా - ప్రాప్తించదనుట, ఇందు కార్యసాధనమున కొక్కసాధనమేచాలియుండ బెక్కుసాధనములను గార్యమునందు నన్వయించుటచే సముచ్చయాలంకారము. ఉదా. పగలు వెలవెలబాఱుచున్న చంద్రుఁడు కలువలులేని కొలను, లుబ్ధుఁడగురాజు దరిద్రులగు సజ్జనులు, రాజసభలో బలుకుబడిగల దుష్టులు, ఇవినాకుహృదయ శల్యములు.

తా॥ ఓనిశంకుశుఁడా వినుము! లోకమునం దెవ్వరికైనను గష్టకాలమున సహాయము చేయునట్టి స్నేహితులును, నవసరమైనప్పు డుపయోగపడు ధనమును, వ్యాధినిబోఁగొట్టఁగలిగిన యౌషధమును, తలిదండ్రులు చేసినపాపములను బోఁగొట్టునటువంటి సుతుఁడును, కోపమును రహితముచేయునట్టి శాంతముతోఁగూడిన జ్ఞానమును, ప్రాజ్ఞులు కొనియాడఁదగిన విద్యయును, దరిద్రులయొక్క పరితాపమునుగాంచి సహించలేని దయయును, నివియన్నియు నదృష్టవశముననే లభించునుగాని సామాన్యముగా సంప్రాప్తించవు గదా.

గీ॥ నాకు నినువంటివినయ♦నిర్ణయధురీణు, పొందు గలుగంగఁ గాదె యో♦ భూసురేంద్ర
పాకశాసనదత్త శా ♦ పము దొలంగె, వరతరంబైన నిర్జర ♦ త్వంబుఁగంటి. 100

అ॥ ఓభూసురేంద్ర – పుడమికి వేలుపులుగా నొప్పినవారిలో నధికుఁడైనవాఁడా, నాకున్ – నాకు, నినువంటి–నీవంటి,–నిన్నుఁబోలిన, వినయనిర్ణయధురీణుపొందు, వినయ–ధర్మమునందు,–నిర్ణయ – నిశ్చయమైన, ధురీణుపొందు– భారమునువహించెడివాని స్నేహము, కలుగంగఁగాదె– కలిగియుండుట చేతనేకదా, 'సూ. కాదెకదార్థకంబగు' అని ప్రౌ. వ్యా. ఉదా. 'శౌరికృపగాదెనాకున♦క్షయబలంబు' అని జై. భా. పాకశాసనదత్తశాపము. పాకశాసన – ఇంద్రునివలన, దత్త– ఇయ్యఁబడిన, శాపము –

తిట్టు, తొలంగెన్ — విమోచనమయ్యెను, వరతరంబు— శ్రేష్ఠతరము, ఐన— అయినట్టి, నిర్జరత్వంబు— దేవతాత్వమును, కంటిన్ — పొందితిని, ఈపద్యమున, 'నినువంటి' అను పదప్రయోగమునకుదా. 'సూ. అట్టిపోనిబోఁటి శబ్దంబులు వదర్థకంబులు, బోఁటితనంతఃప్రత్యయాన్తంబునగు, అట్టి ప్రభృతులు పరంబులగుచో నట్లు ప్రభృతి పరకనామాములకుంబలెఁ బూర్వపదంబులకు విభక్తులు త్రివిధంబులం బరఁగు, అందుబోఁటివంటులు సమానంబులు అవి పరంబులగుచో నాత్మార్థమునకు నామతచ్ఛబ్దంబులకుంబోలెఁగార్యంబు, పోనిపరంబగు చోడు వర్ణకంబుమీఁదద్రుతంబునిత్యంబు' ప్రౌ. వ్యా. "క. నిను వంటినీతిపరులున్" అనిశశాం. నాకు నీవంటి నీతిశాలిపొందు గలుగుటచేతనే యింద్రశాపము తొలఁగె నది, శ్రేష్ఠమైన దేవత్వము లభించినది, అనుటచే గర్వము అనుసంచారిభావ ముదయించినది. నీవు మానవుఁడవుగా నగపడినను దేవతాచక్రవర్తి యగు నింద్రుఁడు నాపైఁ బ్రయోగించిన ఘోరశాపమును దొలంగించితి వనుటకు "ఆ. మిరెఁపుగింజ చూడ ♦ మీఁదనల్లగనుండుఁ, గొఱికిచూడ లోనఁ ♦ జుఱుకు మనును, సజ్జను లగువారి ♦ సార మిట్లుండురా, విశ్వ" వేమ. 'జాడ్యం ధియో హరతి సించతి వాచిసత్యం మానోన్నతిం దిశతి పాపమపాకరోతి. చేతఃప్రసాదయతి దిక్షుతనోతి కీర్తిం సత్సంగతిం కథయ కిం నకరోతి పుంసాం" భర్తృ. మంచివారిస్నేహము సకలార్థసాధనము ఎట్లన సత్యసంభాషణము గలిగించు చున్నది. బుద్ధిమాంద్యమును బారద్రోలుచున్నది. గౌరవమును దెచ్చుచున్నది. చెడుబుద్ధుల నడచు చున్నది. యశశ్చంద్రికల దిశాంతములవఱకుఁ జాటుచున్నది. మనస్సును రంజింపఁజేయుచున్నది. సాధు సంగమము మనుష్యులకుజేయని మేలొక్కటియులేదు. నాకు నీవంటి మహనీయుని పొందుగలుగుట చేతనేకదా యింద్ర శాపముదొలఁగినది. శ్రేష్ఠమైన దేవత్వము లభించినది. అనుటకు 'జన్మతస్మన్మహో ధన్యం సంసర్గోయత్రసత్తమైః, సౌభాగ్యంపశ్య నింబస్య చందనాచలజన్మనః' హరిసు. మంచివారి స్నేహము సమస్తసుగుణముల నిచ్చును. మలయాచలమునఁ బుట్టుటచేతనేకదా వేఁపచెట్టు చందన పరి మళమునందఁగలిగినది. ఇచట నిరంకుశుఁడు వేశ్యమాతచేఁ బరాభవింపఁబడినవాఁడయ్యు దివ్యలోక వాసిని యగు రంభచేఁ గొనియాడఁబడుచున్నాఁడనుటకు "స్పర్థామర్థాంగిన్యాఃకన్యా కర్త్రీగిరీంద్ర నందిన్యాః, సాతదపిజహ్నుకన్యామూర్ధిన్యా ధూర్జటేర్జయతి' హరిసు. పార్వతి ద్వేషముచేత నిందించి నను గంగ శివునియొక్క జటాజూటముననే ప్రకాశించుచున్నదని భావము.

తా॥ ఓ నిరంకుశుఁడా నాకు నీవంటి నీతిశాలియొక్క స్నేహము లభించుటచేతనే కదా యింద్రునిశాపము సైతము విమోచనమయ్యెను. శ్రేష్ఠమైన బృందారకత్వమునుఁ బొందితిని.

క॥ అనిపలికి ధారుణీసుర, తనయాగ్రణి పూర్వమైన ♦ దయదప్పకుమీ
నినుమఱవ నేనె వత్తున్, గనియుం గనకుండఁగా నొ ♦ కానొకవేళన్. 101

అ॥ అనిపలికి — పైఁజెప్పిన ప్రకారముగావచించినదై, ధారణీసురతనయాగ్రణీ — శ్రేష్ఠుఁడ వగు నో బ్రాహ్మణకుమారుఁడా, పూర్వమైనదయ — కడఁచినకాలమున నీవు నాయందుంచిన కనికర మును, తప్పకుమీ — ఇంకను దప్పవలదుసుమా, నినుమఱవన్ — నిన్నుమఱచిపోను - నిన్నెప్పుడును జ్ఞాపకమునసుంచుకొనెదననుట. కనియుంగనకుండఁగాన్ — కనుపడికనుపడనట్లుగా, అనఁగా దేవతలు నన్నుఁజూచి పరాకుతోనుండెడి సమయమున నెవ్వరికిఁదెలియకుండననుట; ఒకానొకవేళన్ — ఏదో యొకసమయమునందు, నేనెవత్తున్ — నాయంతట నేనే నీదగ్గఱకువచ్చెదను, ఇందు ఓ బ్రాహ్మణ

శ్రేష్ఠుఁడా పూర్వస్నేహమును మఱవకుము, అని జ్ఞాపకముచేయుటచేత స్మృతియను సంచారిభావ మేర్పడినది. "పూర్వానుభూత విషయం జ్ఞానం స్మృతిరుదాహృతా" ప్రతా.

తా॥ ఓ బ్రాహ్మణుఁడా నీవు నాయందు దివఱకుఁ జూపుచున్నదయను వదలవలదు సుమా! నేనుమాత్రము నిన్నెన్నటికిని మఱవను. దేవతలకుఁ దెలియకుండ నేదోయొక సమయమున నాయంతట నేనే వచ్చుచుండెదను.

చ॥ వినయగుణోత్తముండవు వి ♦ వేకసమగ్రుఁడ వార్య కోటిలో
ఘనుఁడవు నీతిశాలి వవె ♦ గాక మనోహరమూర్తి వెంతయున్
వనితకు నిన్నువంటి మగ ♦ వాని కవుంగిలి గల్గుటల్ మనం
బునఁ దలపోయఁ బూర్వకృత ♦ పుణ్యవిపాకము గాక కొంచెమే. 102

అ॥ వినయ గుణోత్తముండవు — నమ్రతతోఁగూడిన గుణమునందు శ్రేష్ఠుఁడవు, వివేకసమగ్రుఁడవు — నిండారిన జ్ఞానముగలవాఁడవు. ఆర్యకోటిలోన్ — పూజ్యులైనవారిలో, ఘనుఁడవు — గొప్పవాఁడవు, నీతిశాలివి — న్యాయముతోనొప్పుచుండెడివాఁడవు. అదిగాక — అంతమాత్రమెకాకుండ, ఎంతయున్ — మిక్కిలి, మనోహరమూర్తివి — సౌందర్యముతోఁగూడిన శరీరముగలవాఁడవు, కనుక, వనితకున్ — ఆఁడుదానికి, నిన్నువంటి మగవానికవుంగిలి — నీబోఁటి పురుషునియాలింగనము, కల్గుటల్ — చేకూరుటయనఁగా, మనంబునన్ — మనస్సునందు, తలపోయన్ — విచారించఁగా పూర్వకృతపుణ్యవిపాకము, పూర్వకృత — క్రిందటికాలమునఁజేయబడిన, పుణ్య — భాగ్యముయొక్క, విపాకము — పరిపక్వము; — చక్కఁగాఁబండుట, కాక — అట్టిదిగాకుండ, కొంచెమే — స్వల్పమా, ఇందు "నిన్నువంటి" అను ప్రయోగమున కుదా. 'ఆ. నిన్నువంటి పుణ్యనిరతుండు, అని విష్ణు. రతి యనుసంచారిభావము వర్ణించఁబడినది. క. తరుణీమణులకుఁ బురుషుల, కరయఁగ సంభోగవిషయ ♦ మగునభిలాష, స్ఫురణము మనములఁబొడమిన, ధరలో నది రతి యనంగఁ ♦ దగు నెట్లన్నన్, ఉదా. ఉ. చల్లదనంబె చంద్రునకుఁ ♦ జక్కఁదనంబె ప్రసూనధన్వికిన్, సల్లలితోరుసౌరభమె ♦ చైత్రున కొక్కనికొక్కమేలిమే, తెల్లము గాకనాపతియు ♦ దీర్ణగుణాఢ్యుఁడు నారసింహభూ, వల్లభుఁ డట్లుసర్వగుణవైభవ మెవ్వరికైనఁగల్గునే" అని కా. సం. ద్వితీయసముచ్చయాలంకారము. ఖలేకపోతన్యాయేన బహూనాంకార్యసాధనే, కారణానాంసముద్యోగః సద్వితీయః సముచ్చయః " అని ప్రతా. చాంద్రాలోకమున సముచ్చయమనియే చెప్పినాఁడు, మఱియును "తత్సిద్ధిహేతావేకస్మిన్ యత్రాన్య త్తత్కరం భవేత్ సముచ్చయోఽసౌ. కా. ప్ర.

ఉదా. 'కులమమలినం భద్రామూర్తిర్మతిః శ్రుతిశాలినీ భుజబలమలం స్ఫీతంలక్ష్మీః ప్రభుత్వమఖండితమ్ ప్రకృతిసుభగాహ్యేతేభవా అమీభిరయం జనో వ్రజతిసుతరాం దర్పంరాజం స్తఏవ తవాంకుశాః" (గ్రంథవిషయం) యువతికి నీవంటిమగవానికవుంగిలి లభించుట పూర్వపుణ్యఫలమనుటచే, గర్వ మను సంచారిభావము గోచరించుచున్నది. 'పతియె కలంకాంకితునకు, సతియగు రోహిణియు నతనిసతియగు రతియుం, జతుగన్నృసింహునిఁ జెందిన యతిధన్యకు నాకు ననుచు నంగన నవ్వెన్" కా. సం.

తా॥ శ్రేష్ఠమయిన నమ్రతగలవాడవు, జ్ఞానసంపన్నుఁడవు, పూజ్యులలో నధికుఁడవు న్యాయవంతుడవు- చక్కనివాఁడవు, కనుక యువతికి నీవంటి సత్పురుషునియాలింగనము లభించుట పూర్వజన్మమునఁ జేయబడిన సుకృతముపలని యదృష్టముగాని వేఱొకటిగాదు.

క. తనువుం దనువుం గూడుట, ఘనతరసంసర్గఫలము ♦ గాదు తలంపన్
మనమున్ మనముం గూడుటయనుపమసంసర్గమహిమ ♦ యవనిసురేంద్రా. 103

అ॥ అవనిసురేంద్రా — పుడమివేలుపులవంటివారిలో నధికుఁడైనవాఁడా, తనువుందనువుం గూడుట — ఒకశరీరముతో మరియొక శరీరము కలియుట, ఇచట 'తనువు, అను శబ్దమునుగూర్చి సూ. సర్వత్రోదోతోర్వర్ణ్పవతిమువత్' నన్న. 'ఘనువట్వాదిశబ్దానాం నదుకేవశ్చప్రయుజ్యతే' అథ. ఘనతరసంసర్గఫలము — ఎక్కువగాఁగలయికయొక్క ప్రయోజనము, కాదు — కానేరదు, అనఁగా నట్టిది సంగమము కాదనుట, తలంపన్ — ఆలోచించఁగా, మనమున్ మనముంగూడుట — ఒకరి మనస్సుతో నొకరిమనస్సు కలియుటయే, అనుపమసంసర్గమహిమ, అనుపమ — అసమానమైన, - సమానములేని, సంసర్గ — కూడికయొక్క, మహిమ — గొప్పతనము, అలం, అర్థాంతరన్యాసాలంకారము. శరీరము శరీరము కలియుట సంభోగముకాదు, మనస్సు మనస్సు కలియుటయే సంభోగమగును. ఇరువురి మనస్సులొకటిగానిది సంభోగము కాదనుటకు "ఏతత్కామఫలంలోకేతద్వయోరేకచిత్తతా. అన్యచిత్తకృతేకామే శవయోరివసంగమః" భర్తృ-

తా॥ ఓయుత్తమబ్రాహ్మణుఁడా! ఒకశరీరముతో మఱియొకశరీరము కలియుట సంభోగము కాదు. ఒకరిమనస్సుతో నొకరిమనస్సుకలియుటయే. సాటిలేని సంభోగ మగును.

—; రంభ స్వర్గమునకుఁ జనుట ;—

క॥ అదిగాక మనకు మదియున్, మదియుం గలసినది యింక ♦ మఱపులుగలవే
ముదమొదవఁ బోయివచ్చెదఁ, ద్రిదివంబున కనుచు రంభ♦ దివికింజనియెన్ 104

అ॥ అదిగాక — అంతమాత్రమేగాక, 'అదిగాక' అనుటకు సూ. క్వచితర్థవిశేషేచరూఢా విశ్రాంతిరుచ్యతే. అథ. మనకున్ — మనయిరువురికిని, మదియున్ మదియున్ — నీమనస్సును నామనస్సును, కలిసినది — ఏకమైనది, ఇంకన్ — ఇకమీఁదట, మఱపులు — నన్నునీవు నిన్నునేను మఱచియుండుటలు, కలవే — ఉండునా, - ఉండవనుట, ముదమొదవన్ — సంతోషముకలుగఁగా, త్రిదివంబునకున్ — దేవలోకమునకు, పోయివచ్చెదన్ — వెళ్ళిమరలవత్తును, అనుచున్ — ఇట్లు పలుకుచు, రంభ — ఆదేవవేశ్య, దివికిన్ — స్వర్గమునకు, చనియెన్ — పోయెను. ఇందు మనయిరువురికి మనస్సుకలియుటచేత నొకరినొకర మెన్నటికిని మఱవముగదా! దేవలోకమున కేగి వత్తు వత్తుననుటచే ధృతి యనుసంచారిభావ ముత్పన్నమయినది. "ధృతి శ్చిత్తస్య నైస్పృహ్యం జ్ఞానాభీష్టాగమాదభిః" ప్రతా ఇచట రంభ నిరంకుశునితో మనకు మనస్సు లేకీభవించినవి కనుక దూరమునునుండినను సమీపముననున్నట్లే యనుటను గూర్చి "దూరస్థోఽపి నదూరస్థోయో యస్యమనసిస్థితః యో,

యస్యహృదయే నాస్తి సమీపస్థోఽపి దూరతః” చాణ. మనయుభయుల మనస్సు కలసినదికనుక నిక్క మఱవమనుట క్షీరనీరన్యాయమని యూహింపవలయును.

తా॥ మనయిద్దరికి సంభోగస్నేహమే కాక మనస్సు లేకీభవించుటవలన నొకరినొకరము మఱచి యుండము గదా: సంతోషముగా దివ్యలోకమున కేగి వచ్చెదను. అని యాదేవకాంత స్వర్గమునకుఁ బోయెను.

—: రంభ యింద్రసభకుఁ బోవుట :—

సీ. చామరగ్రాహిణీ ♦ స్వర్ణకంకణఝణ, త్కారపోషితనటీ ♦ కటకనినదుఁ
దనులతాముకుళమే ♦ ధావిధాయకసౌర, గాయకగేయ సం ♦ కలితపులకు
ధవళసారసలస ♦ త్కాసారమతికార, ణాంబకాంబుజ సహ ♦ స్రాంచితాంగు
వర్ణిత దోర్లతా ♦ స్వస్తికామరయోషి, దభిరామకాంతి భా ♦ గుభయభాగు
గీ. నిర్జరాచార్య జల్పిత ♦ నీతిశాస్త్ర, వచనకంపితమూర్ధ పా ♦ ర్శ్వప్రదీప్త
రత్నమయకుండలప్రభా♦ రాజమానునింద్రుఁ జేరంగవచ్చెఁబూ♦ర్ణేందువదన. 105.

అ. పూర్ణేందువదన — నిండుచందురునివంటి మొగముగలదైన యాసురకాంత, చామర...... నినదుక్. చామరగ్రాహిణీ— వింజామరములను జేఁబూనిన దాసీలయొక్క, 'ని. చామరంతు ప్రకీర్ణకం' అని అ. స్వర్ణకంకణ — అపరంజి హస్తాభరణములవలని, ఝణత్కార — ఝణఝణయనునట్టి ధ్వనిచేత, పోషిత — రక్షింపఁబడిన, నటీకటక — నాట్యముచేయుచున్న స్త్రీల కాలియందెలయొక్క, నినదున్ — ధ్వనిగలవానిని, తను......పులకున్. తనులతా — ఒడలనెడి తీఁగయందు, ముకుళ — అపుడు వికసించిన మొగ్గలవంటి, మేధా — ధారణాశక్తిగలబుద్ధితో, ని 'ధీర్ధారణావతీమేధా' అని అ. విధాయక - చేయుచున్న, సౌర- దేవతాసంబంధమైన, గాయక - గానముచేయువారియొక్క, గేయ - సంగీతముతో, సంకలిక - కూడుకొనిన, పులకుక్ — మేనియొక్క గగుర్పాటుగలవానిని, ధవళ.........తాంగుక్. ధవళ — తెల్లనిదైన, సారస — తామరపువ్వులవలన, లసత్ — ప్రకాశించుచున్న, కాసార — కొలననెడి, మతి — తలంపునకు — ఇచ్ఛకు, ని 'మతిర్ధీచ్ఛాస్మృతిష్వపి, అనివిశ్వ. కారణ — హేతువైన, అంబక — కన్నులనెడి, ని 'అంబకోజనకేబాణ నేత్రమందేషు చాంబకం' అని విశ్వ. అంబుజ - పద్మములయొక్క, సహస్ర - వేయింటిచేత, అంచిత - ఒప్పుచున్న, అంగుక్ - దేహముగలవానిని, వర్ణిత............భాగుక్. వర్ణిత - కొనియాడఁబడిన, దోర్లతా బాహువులనెడి తీఁగెలుగల, స్వస్తిక - శుభయుక్తమయిన, అమరయోషిత్ - దేవతాస్త్రీలయొక్క, 'ని. స్త్రీయోషిదబలాయోషా, నారీసీమంతినీవధూ' అ. అభిరామ — మనోహరమైన, కాంతి - ప్రకాశమును, భాక్ - పొందుచున్న, ఉభయభాగుక్ - ఇరుపార్శ్వములు గలవానిని, నిర్జ............మానుక్, నిర్జరాచార్య - వేలుపులకు గురువైనబృహస్పతివలన, జల్పిత - చెప్పఁబడిన, 'ని. ఉక్తంభాషితముదితం జల్పితమాఖ్యాతమభిహితంలపితమ్' అని అ. ఉదా. 'ఇతిస్ఖలిత జల్పితం మదవశాత్కురంగీదృశః' స. కం. నీతిశాస్త్ర - న్యాయశాస్త్రముయొక్క, వచన - వాక్యములవలన, కంపిత - కదలింపఁబడిన, మూర్ధ - శిరస్సుయొక్క, పార్శ్వ - రెండువైపులయందు,

ప్రదీప్త - మిక్కిలి ప్రకాశించుచున్న, రత్నమయ - మణిమయములైన, కుండల - కర్ణభూషణముల యొక్క, ప్రభా - కాంతిచేత, రాజమానున్ - ప్రకాశించుచున్నవానిని, ఇంద్రున్ - స్వర్గాధిపతి యగునింద్రుని, చేరఁగన్ - సమీపించునట్లుగా, వచ్చెన్ - ఏతెంచెను, 'సూ. కర్మప్రవచనీయయుక్తే ద్వితీయా' అనిశాస్త్రము. దివ్యలోకసభను వర్ణించుటచే, అలం. ఉదాత్తము. శ్లో॥ ఉదాత్తమృద్ధిశ్చరితం, శ్లాఘ్యంవాఽన్యోపలక్షణం' అని చంద్రా. 'పూర్ణేందువదన' ఉపమాలంకారము మఱియు 'కంకణఝణగాయకగేయ-కలితపులక- కాసారమతికార-అంబకాంబుజ-భాగుభయభాగు'ఇత్యాదుల నుప్రాసాలంకారము.

తా॥ దివ్యలోకమున నింద్రుఁడు కొలువుదీరియుండఁగా వింజామరములను వీచుచున్న దాశీల యొక్క సువర్ణహస్తాభరణముల ఝణత్కారమువలన నెదుట నాట్యము చేయుచున్న నాట్యస్త్రీల కాలియందెలచప్పుడు వినఁబడకుండెను. గంధర్వులయొక్క మేధాసంపత్తి గల గానమువలన మేను గగుర్పొడిచెను. వేయికన్నులతో నొప్పుటవలనఁ దెలిదమ్మిపువ్వులతో నలరారుచున్న కొలనువలె శోభావంతుఁడై యుండెను. స్తోత్రము చేయుచున్న దేవతాస్త్రీలయొక్క శరీరచ్ఛాయ యిరుపార్శ్వముల విరాజిల్లుచుండెను. బృహస్పతి వచించుచున్న ధర్మములకుఁ దలయూఁపుచుండఁగా రత్నములతోఁ జేయఁబడిన చెవిపోఁగులయొక్క కాంతులు సభ్యులపైఁ బ్రసరించుచుండెను. అట్టిసమయమున రంభ యింద్రుని సమీపమునకు వచ్చెను.

## —: ఇంద్రుఁడు కోపించుట .—

క॥ చనుదెంచి మ్రొక్కి నిలిచిన, వనితామణిఁ జూచె దివిజ ♦ వల్లభుఁడు రవు
లొ్కనుకోపవహ్నికీలల, కును బొమముడిధూమపంక్తి ♦ కొదువం దీర్పన్. 106

అ॥ చనుదెంచి - వచ్చి, మ్రొక్కి - నమస్కరించి, నిలిచిన వనితామణిన్- నిలఁబడినయారంభను, దివిజవల్లభుఁడు - దేవతలకు రాజగు నాయింద్రుఁడు, రవులొ్కను కోపవహ్నికీలలకును రవులొ్కను - ▪లుటకు మొదలుపెట్టుచున్న, కోపవహ్ని - క్రోధమనెడునిప్పుయొక్క, కీలలకును- జ్వాలలకు - మంటలకు, బొమముడి - కోపముచేతఁగలుగు బొమలముడియనెడి, ధూమపంక్తి-పొగ యొక్కవరుస, కొదువఁదీర్పన్ -తక్కువను బూరించునట్లు, చూచెన్-వీక్షించెను, అలం: అశ్లిష్టకేవల పరంపరితరూపకము.

తా॥ వచ్చి నమస్కారముచేసి నిలువఁబడిన రంభను దివస్పతి చూచెను. ఆ చూచునప్పు డత నికిఁ గ్రోధాగ్ని ప్రజ్వలించుచున్నట్లు బొమముడి యనుపొగవలనఁ దెలియుచుండెను.

వ॥ ఇవ్విధంబునఁ గోపోద్రిక్తంబుగాఁ జూచి యిట్లనియె. 107

అ॥ ఇవ్విధంబునన్ - ఈప్రకారముగా, కోపోద్రిక్తంబుగాన్ - క్రోధమతిశయించునట్లుగా, చూచి - వీక్షించి, ఇట్లనియెన్ - ఈవిధముగాఁ బలికెను.

ఆ॥ లంజ విటుఁ డొనర్చు ♦ లాలనభరమున, మఱచె నేమొ కాక ♦ మమ్ము లక్ష్య
ఘెట్టదో ప్రభావ ♦ పేశలత్వమున లే, కున్న శాపభీతి ♦ నొందకున్నె. 108

అ|| లంజ - ఆభోగముది, విటుఁడు - దానిమిండఁడగాఁడు, ఒనర్చు - చేయునటువంటి, లాలనభరమునన్ - లాలించుటయొక్క యతిశయమువలన, మఱచెనేమొ - మఱపుచెందియుండెనేమో కదా, కాక - అటులఁగానిపక్షమున, పరిభావపేశలత్వమునన్ - పరిభావ - గాంభీర్యముయొక్క, పేశలత్వమునన్ - మృదుత్వముచేత, మస్మన్ - అధికారులమైన మావంటివారిని, లక్ష్యపెట్టదో - సరకుసేయకుండెనేమో, దానికంటికి మావంటివారగపడుచున్నారో లేదోయనుట, లేకున్నన్ - ఈ రెండుపద్ధతులుగానియెడల, శాపభీతిన్ - నాయొక్క తిట్టువలని భయమును, ఒందకున్నె - పొందకుండునా,

తా|| ఆభోగముది మిండఁడగాని లాలింపుమాటలవలన మఱచినదో, లేక దానికిఁ గల గర్వము వలన మేము కంటి కగపడుటలేదో, కాకున్న శాపమునకు భయపడకుండునా.

వ|| అని రంభనుద్దేశించి. 109

అ|| అని — ఇట్లుపలికి, రంభను = ఆదివిజవేశ్యను, ఉద్దేశించి— నిశ్చయించి- బాగుగాఁజూచి,

ఆ|| తొలుతఁ జేసినట్టి ♦ దుష్టకర్మంబున, సంగ్రహింపరాని ♦ శాపమొందె
సద్రసంపునడకఁ ♦ జరియింపు మిప్పుడైన, మగువయోజ మాన♦మందు గలదె 110

అ|| తొలుతన్ — మొదట, చేసినట్టి — ఆచరించినటువంటి, దుష్టకర్మంబునన్ చెడ్డపని వలన, సంగ్రహింపరాని — సంపాదించుకొనఁగూడనిదైన. శాపము — తిట్టు, ఒందెన్ — నీకుఁదట స్థించెను, ఇప్పుడైనన్ — ఇంతటనైనను, సద్రసంపునడకన్, సత్ — ఒప్పుచున్న, రసంపునడకన్ — అను రాగముతోఁగూడిన ప్రవర్తనముతో, చరియింపుము — మెలంగుము, మగువయోజ — ఆఁడుదాని యొక్క స్వభావము, మానన్ — పరిహారమగుటకు, మందుగలదె — ప్రపంచమున నౌషధమున్నదా — లేదనుట, ఇందు 'మగువయోజ మాన మందుగలదె' అనుటచే అలం. అర్థాంతరన్యాసము— మునుపటి వలెనే మరల శాపము ననుభవింతు వనునర్థముచేఁగావ్యలింగము. 'కావ్యలింగం హేతోర్వాక్యపదార్థతా' కా. ప్ర.

తా|| నీవు మున్ను చేసిన దుష్కార్యమువలన స్వీకరింపఁదగని శాపమును బొందితివి. ఇంతటితో నైనను మంచి నడవడికతో మెలంగుము. ఆఁడుదాని యొగుడు దిగుడులను మాన్పుటకు లోకమున మందులేదు.

క|| భూవలయంబున బలురాయై వెలయు మటన్న విభవ ♦ మాసపడిదివిన్
నీ వెంతచుట్లఁబెట్టినఁ, బోవునె శాపంబు భోగ ♦ మునఁగా కబలా. 111

అ|| అబలా — ఓయాఁడుదానా, భూవలయంబునన్ — కుండలాకారమైన భూమియందు, బలురాయై — గొప్పదానివై, వెలయుము — ప్రకాశించుము, అటన్నన్ — అనిచెప్పఁగా, దివిన్ — ఈస్వర్గమునందుఁగల, దివియనుటకు 'సూ. ద్యుశబ్దము దివియనియు హృచ్ఛబ్దము హృదియనియు రూపములఁబొందును.' బా. వ్యా. విభవమున్ — సంపదను, ఆసపడి—ఆపేక్షించి, నీవు. ఎంతచుట్లఁ

బెట్టినన్ — ఎంతగాఁ జుట్టుకొని తిరిగినను, శాపంబు — నాయొక్క తిట్టు, భోగమునఁగాక — అనుభవించిననేతప్ప, పోవునె — విడుచునా - పోదుసుమాయనుట. ఓసీ! పుణ్యలోకమున నుండినమాత్రమున నీవు చేసినపాపము నశించు నని తలంచుచుంటి వేమో నాశాపము నెన్నటికైన ననుభవించియే తీరవలయును. అనుటచే అర్థాంతరన్యాసాలంకారము. 'సామాన్యం వా విశేషో వా తదన్యేన సమర్థ్యతే. యత్ర సో ఽర్థాంతరన్యాసః సాధర్మ్యేణేతరేణ వా" కా. ప్ర. "ఉదా. గుణానా మేవ దౌరాత్మ్యాత్ ధురిధుర్యో నియుజ్యతే. అసంజాత కిణస్కంధః. సుఖం స్వపితిగార్గలిః"

తా॥ ఓసీ! నిన్ను భూలోకమున శిలవగు మనిశపించియుండఁగా నీ వీస్వర్గమును బెనవైచికొని యున్నమాత్రమున ననుభవించకతప్ప ననుకొంటివా?

## —; రంభ తన శాపవిమోచనమును జెప్పుట :—

క॥ అని కోపగించిపలికిన, యనిమిషవిభునకును మ్రొక్కి ♦ యది వినిపించెన్
దను శపియించుట మొదలుగ, ఘనతరశాపోపశాంతి ♦ గడపల గాఁగన్. 112

అ॥ అని — ఈప్రకారము గా, కోపగించి— కనలినవాఁడై, పలికినయనిమిషవిభునకున్— సంభాషించిన యాయింద్రునకు, మ్రొక్కి — దండముపెట్టి, అది, ఆవృత్తాంతము, తనుశపియించుట — ఇంద్రుఁడుశాపమొసంగుట, మొదలుగన్ - ఆరంభముగా-మొదలుకొని, ఘనతరశాపోపశాంతి, ఘనతర — అధికమైన, శాప — తిట్టుయొక్క, ఉపశాంతి — లేకుండఁబోవుట - ఉపశమించుట, కడపలగాఁగన్ — కడపటయగునట్లుగా - అంత్యమగునట్లుగా, వినిపించెన్ — చెప్పెను.

తా॥ ఇట్లు కోపముతోఁ బలికినయింద్రునకు నమస్కరించి తానుశపించినది మొదలు శాపవిముక్తి వఱకు జరిగిన వృత్తాంతమంతయును జెప్పెను.

## —; ఇంద్రుఁ డాశ్చర్యపడుట ;—

క॥ ఓహో యింతయుపాయస, మీహితుఁడా విప్రసూతి ♦ యిటు గాకున్నన్
సాహసికుఁడై జయించునె, యాహా నెయ్యంబుతోడ ♦ హరు జూదమునన్. 113

అ॥ ఓహో — ఆశ్చర్యార్థకము, విప్రసూతి — ఆబ్రాహ్మణునికుమారుఁడు, ఇంతయుపాయసమీహితుఁడా — ఇంతటియాలోచనతోఁగూడినవాఁడా? యిటు — ఈప్రకారముగ, కాకున్నన్ — కానిపక్షమున, హరున్ — శంకరుని, నెయ్యంబుతోడన్ — స్నేహముతోనే, జూదమునన్ — పాచికలాడుటయందు, సాహసికుఁడై — చౌర్యవగలవాఁడై, ఇచట సాహసికుడను శబ్దమునకు సూ. ఆయుధాశ్చచ, 'హరత్యుసంగాదిభ్యః, "తస్యసాహసిక స్యమే" రావ. జయించునె — గెలువఁగలఁడా ఆహా — మెచ్చుకొనుటను తెలియజేయును, "బుద్ధిర్యస్యబలంతస్య నిర్బుద్ధేశ్చకుతోబలం, వనేసింహో మదోన్మత్తః శశకేననిపాతితః" చాణ. "అహోమహీయసాంపుంసా ముపర్యుపరి పౌరుషమ్, రామేణాజగవంశంభో, ర్భగ్నమంభోజనాలవత్" హరిసు.

తా॥ ఓరీ: ఆబ్రాహ్మణకుమారుఁ డింతప్రజ్ఞగలవాఁడా! అప్పుడు. కాఁపన్న శంకరునంత వానిని జూదమున గెలుచునా?

—; ఇంద్రుఁడు భూలోకమునకు వచ్చుట. ;—

మ॥ సొగటా లాడి హరుఁ జయించినజన ♦ స్తోతవ్యచారిత్రుఁ డా
జగతీదేవకుమారుఁ డాతనికి నీ ♦ శాపంబు వారించు టెం
త గణింపం గనుఁగొ ముదం బొదవె న ♦ ద్ధాత్రీసురుం జూతమం
చు గజశ్రేష్ఠమునెక్కి వచ్చె హరి య ♦ స్తోకోన్నతిన్ ధాత్రికిన్. 114

అ॥ ఆజగతీదేవకుమారుడు — పుడమివేలుపుకొడుకైన యానిరంకుశుఁడు, సొగటాలు— జూదపు పాచికలు, ఆడి — జూదమాడి, హరున్ — ఈశ్వరుని, జయించిన — గెలుపొందినట్టి, జనస్తోతవ్యచారిత్రుఁడు, జన — లోకులవలన, స్తోతవ్య - స్తుతింపఁదగిన, చారిత్రుఁడు—సత్ప్రవర్తనగలవాఁడు, గణింపన్ — ఎంచఁగా, ఆతనికిన్ — అటువంటిమహనీయునకు, నీశాపంబువారించుట — నీయొక్కశాపము నుఁబోగొట్టుట, ఎంత — ఏపాటి,- అనఁగాసులభమనుట, కనుఁగొన్ — అతనిఁజూచుటకు, సూ. "ముజ్జుపరంబగునపుడు కొశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు" (బా. వ్యా) ఉదా. "మ. కన్గొఁజాలకు జృంభిత. స్తనయుగ్మంబు" వసు. "తే.:వానిమాప్పునఁ జేరఁ్కొని ♦మానవతియు" శృ. నై. ముదఁబు — సంతోషము, ఒదవెన్ — కలిగెను, అద్ధాత్రీసురున్ — ఆ భూదేవతవంటివానిని చూతము — వీక్షించెదము, అంచున్ — అనిపల్కుచు,హరి — ఆయింద్రుఁడు, ని. 'హరిర్వాతార్క చంద్రేంద్ర, యమోపేంద్రమరీచిషు అనివిశ్వ. గజశ్రేష్ఠమున్ — శ్రేష్ఠమైన తన యైరావతమనెడి యేనుఁగును, ఎక్కి — ఆరోహించి; అస్తోకోన్నతిన్ — అల్పముగానిపొంకమున, ధాత్రికిన్ — భూలోక మునకు; వచ్చెన్ — ఏతెంచెను, ఇచట వేశ్యమాతచే నిందింపఁబడిన నిరంకుశుఁడు స్వర్గాధిపతియగు నింద్రునిచే శ్లాఘింపబడుచున్నాడనుటకు "నహాన్యంతే మహాత్మానో దుర్జనానాం కటూక్తిభిః, కాకముఖాత్సుచిక్షేప్త్రీరకింమలినీభవేత్" నీతి. ఇందు శంకరుని జూదమునవోడించిన యా విప్ర కుమారునకు శాపమును బోగొట్టుటెంతపని, యనుటచే అలంకారము అర్థాపత్తి. 'క. వరుస నొకా నొకవస్తువు, గిరికొన వస్త్వంతరంబు ♦ కిముతన్యాయ స్ఫురితంబై చనుదేఁటఁగ, ధరనర్థాపత్తియయ్యె" కావ్యా. సం.

తా॥ శివునితో జూదమాడి గెలిచిన సమర్థుండగు నావిప్రసుతునకు నీశాపవిమోచనమొనరించుట యనఁగా నెంత. అతనిం జూడఁ గోరిక గలిగెననుచుఁ దన యైరావతము నధిరోహించి మనుష్యలోకము నకు వచ్చెను.

క॥ సురరాజు వచ్చెఁ జనుదెం, చిరి తమతమవాహనములు ♦ చెలఁగఁగ విద్యా
ధరగుహ్యకాప్సరః కి, న్నరరక్షో యక్ష సిద్ధ ♦ నాకనివాసుల్. 115

అ॥ సురరాజు - వేలుపులకుదొరయగు నిందుఁడు, వచ్చెన్ - ఏతెంచెను, విద్యా……… వాసుల్, విద్యాధర - జీమూతవాహనుఁడు మొదలగు విద్యాధరులును, గుహ్యక - దివ్యముండెడి

పాంతర (నిధు) లను గాపాడువారైన మణిభద్రాదిగుహ్యకులును, అప్సరః - దేవతలలోఁజక్కని వారగు నూర్వశీ రంభా మేనకాదులును, 'అపసారయంతిష్ఠాలయంతి ధైర్యాంత్సర్వానిత్యప్సరసః' అనివ్యు. కిన్నర - కిన్నరులును, రక్షః - నిరృతియును, యక్ష - కుబేరుఁడు మొదలగుయక్షులును, సిద్ధ - విశ్వావసుఁడుమున్నగాఁగల సిద్ధులును, అయిన నాకనివాసుల్ - దేవతలును, తమతమవాహనములు - వారివారి గుఱ్ఱములు, చెలఁగఁగన్ - ఒప్పునట్లుగా, చనుదెంచిరి - వచ్చినవారైరి.

తా॥ ఇంద్రుఁడు తన పరివారముతోఁ బయలుదేరుటతోనే కడమ దిక్పాలురు మున్నగువారు వారివారి వాహనములతో వెంబడించి యందఱును గలసివచ్చిరి.

—: నిరంకుశుఁ డింద్రునిఁ స్తుతించుట :—

వ॥ అట్లు దనకుఁ బ్రత్యక్షమైన దేవేంద్రునకు దండప్రణామంబులు చేసి యా భూసురనందనుఁ డిట్లనియె. 116

అ॥ అట్లు - ఆవిధముగా, తనకున్ - ఆనిరంకుశునకు, ప్రత్యక్షమైన దేవేంద్రునకున్-సాక్షాత్కరించినట్టి దేవతాసార్వభౌమునకు, ఆభూసురనందనుండు - పుడమికి వేలుపువంటివాఁడగు సురశర్మకొడుకు, దండప్రణామంబులు - ఆజ్ఞాబద్ధమైన నమస్కారములు, చేసి - ఆచరించి, ఇట్లు - ఈరీతిగా, అనియెన్ - పలికెను, వక్ష్యమాణప్రకారముగాఁ బలికెననుట.

సీ॥ బలవృత్రనముచిజం ♦ భపులోమముఖదైత్య, వన వహ్ని హేతి యె ♦ వ్వాని హేతి
చిత్రసంగరజయ ♦ శ్రీకరగ్రహణని, ర్వహణవిహస్త మె ♦ వ్వానిహస్త
మనఘకర్మాయాత ♦ ఘనతరైశ్వర్యని, ర్వ్యథపుణ్యలోక మె ♦ వ్వానిలోక
మసమానకారుణ్య ♦ రసవర్షిలోచన, వనజనికాయ మె ♦ వ్వానికాయ
గీ॥ మమరవనమధ్యకేళిసౌ ♦ ధాంతరాళ, వర్ణ్యతరసంప్రచరణ మె ♦ వ్వానిచరణ
మట్టిలోకైకవందితు ♦ నప్రమేయు, నిన్ను వర్ణింపఁగా నేర్తు ♦ నే సురేంద్ర. 117

అ॥ సురేంద్ర — ఓదేవతా చక్రవర్తీ, ఎవ్వాని హేతి — ఎవ్వనియొక్కయాయుధము, ఇచట 'ఎవ్వాని' అనుటకు సూ. కొన్నియెడల మహదర్థంబున నే శబ్దంబునకు వాఁడు వారగు. అమహదర్థంబునంద్రికంబునకదియవులును స్వార్థంబున నేక బహువచనంబులంగ్రమంబుగ నను ప్రయుక్తంబులగు." ప్రౌ. వ్యా. బల........హేతిః బల — బలాసురుఁడును; వృత్ర — వృత్రాసురుఁడును, నముచి — నముచియను దానవుఁడును, జంభ — జంభాసురుఁడును, పులోమ — పులోమాసురుఁడను, ముఖ — ప్రధానముగాఁగల, ని. 'ముఖం ప్రధానే ప్రారంభే వక్త్రే నిస్సరణేఽపి చ, ఉపాయే ద్వారితాగ్రేమే" అని నానా. దైత్య — అసురులనెడి, వన — అరణ్యమునకు, హేతి—అగ్నిజ్వాలయో, ఎవ్వానిహస్తము — ఎవ్వనియొక్కచేయి, చిత్ర......హస్తము, చిత్ర — ఆశ్చర్యకరమైన, సంగర—యుద్ధమునందు, జయశ్రీ — జయమనెడిలక్ష్మియొక్క, కరగ్రహణ — పాణిగ్రహణమును,—చేయిపట్టుకొనుటను, నిర్వహణ — సమర్థించుటయందు, - కార్యమునుసాగించుకొనుటయందు, విహస్తము — నెమ్మదిలేనిమనస్సుగలదియో - అనఁగా వేగిరపడునదియోయనుట, ఎవ్వానిలోకము — ఎవ్వనియొక్క

భువనము, అన......లోకము, అనఘకర్మ — సుకృతకార్యమువలన, ఆయాత — వచ్చిన - లభించిన, ఘనతర — అధికతరమైన, ఐశ్వర్య — సంపదలును, నిర్వ్యథ — సుఖమునుగల, పుణ్యలోకము - మనోహరమైనలోకమో, ని, 'పుణ్యం మనోజ్ఞే౽భిహితం తథా సుకృతధర్మయోః, అనివిశ్వ. పుణతి శుభం కరోతీతిపుణ్యం, అనివృ - శుభమును జేయునది, ఎవ్వానికాయము — ఎవ్వని యొక్క మేను, అస.........కాయము, అసమాన — సమానములేని, కారుణ్యరస - కృపయనెడి రసమును, వర్షి - వర్షించునదియైన,- కురిపించునదియైన, లోచన — కన్నులనెడి, వనజ - పద్మములకు, నికాయము - నివాసమో, ని. 'నికాయో నిలయే లక్ష్మ్యేసముదాయే సధర్మిణాం, అసంహతానా మేకత్ర కరణే పరమాత్మని' అనినా. 'నికాయఃసద్మసంఘయోః, హై. ఎవ్వానిచరణము — ఎవ్వనియొక్క పాదము, అమర............ప్రచరణము, అమరవన — దేవతాసంబంధమైననందనవనముయొక్క, మధ్య — నడుమనున్న, కేళిసౌధ — క్రీడాభవనముయొక్క, అంతరాళ - మధ్యమున, వర్ణ్యతర — స్తోత్రముచేయందగిన, సంప్రచరణము - ఎక్కువైనసంచారమో? ని. సంచారే చరణం క్లీబే స్థండిలే ప్రాంగణే తథా ఏకశాఖాధ్యాయిషునా నస్త్రీ మూలే కులే పదే. అని నానా. అట్టి -అటువంటి లోకైకవందితుఁ, లోక - పదునాల్గుభువనములయందు, ఏక - ముఖ్యముగా, వందితుఁ - నమస్కరింపఁబడినవానిని, అప్రమేయుఁ - యదార్థము నెఱుఁగనలవిగానివానిని, నిన్నుఁ — నిన్ను, వర్ణింపగానేర్తునే - నీయొక్కగుణలక్షణాదులను స్తుతించఁగలుగుదునా, నాకుశక్యము కాదనుట. ఈపద్యముయొక్క యెత్తుగీతి నాలుగవపాదమున. 'నిన్నువర్ణింపఁగానేర్తు♦నే సురేంద్ర, అనికాకుస్వర యతిచెప్పఁబడుటనుగూర్చి,

'క. పలుకులతలఁగలవ్రాలకు, వలనగుచోఁబ్లుతమునిలిపి ♦ వానికిరెండుఁ
వళులుగఁజెప్పినఁగావ్యం, బులనదికాకుస్వరంబుఁ ♦ బ్లుతేవళియనగుఁ"
ఆ. ఏకమాత్రహ్రస్వ ♦ మినుమడించినదీర్ఘ, మయ్యెమూఁడుమాత్ర ♦ లయినఁబ్లుతము
భీతశోకతర్క ♦ గీతదూరాహ్వాన, సంశయార్థములను ♦ జరుగుఁబ్లుతము, అప్ప.
ఉదా. తే. ఆదితేయార్చితాంఘ్రి ప ♦ ద్మాయనంగ, ద్వారకాపురమధ్యప ♦ ద్మాయనంగ,
నసురకులవైరివీరులా ♦ రాయనంగ, రసికచిత్తోబ్జవాసులా ♦ రాయనంగ."

'వనవహ్ని హేతి యెవ్వానిహేతి, ఇట్లు చెప్పబడినవన్నియు, యమకాలంకారము. "అర్థేసత్యర్థ భిన్నానాం వర్ణానాం సా పునః శ్రుతిః" కా. ప్ర. మఱియు మాలారూపకమును, మాలా తు పూర్వవత్, కా. ప్ర. ఉదా. "సౌందర్యస్య తరంగిణీ తరుణిమోత్కర్షస్య హర్షోద్గమః కాంతేః కార్మణ కర్మనర్మ రహసా ముల్లాసనావాసభూః విద్యా వక్రగిరాం విధేరనవధి ప్రావీణ్యసాక్షాత్క్రియా. బాణః పంచశిలీముఖస్య లలనాచూడామణి స్సా ప్రియా" 'దైత్యవనవహ్ని హేతి' ఇట్టివి యుపమాలంకారము. ఘనతరైశ్వర్యనిర్వ్యథపుణ్యలోక మెవ్వానిలోకము' ఉదాత్తాలంకారము. 'నిన్ను వర్ణింపగానేర్తునే సురేంద్ర, అతిశయోక్త్యలంకారమును.

తా॥ ఓస్వర్గప్రభూ! నీయాయుధము బలాసురుఁడు మున్నగుదైత్యులనెడు మహారణ్యమును దహించుచున్నది. నీహస్తము మిగుల నాశ్చర్యకరమైన యుద్ధములయందు జయలక్ష్మినిగ్రహించుచున్నది. నీలోకము పుణ్యకార్యములవలన లభించినయైశ్వర్యములతోను నానందముతోను మనోహరమగుచున్నది. నీశరీర మసమానమైనదయారసమును గురియుచున్న పద్మములవంటివేయికన్నులతో

నొప్పుచున్నది. నీపాదము సంపన్మోద్యానమధ్యమునఁగల యంతఃపురములో సంచారయచేయుచున్నది. అట్టి మహనీయవైభవములచేఁ జతుర్దశభువనములవలనఁ గొనియాడఁబడుచుండువాఁడవును, మావంటి వారలకు నీయొక్క యథార్థమును దెలిసికొనలవికానివాఁడవు, నగు నిన్ను వర్ణింప నాకలవియగునా.

శా॥ వంశారణ్యముఁ గాల్చు పావకుగతిన్ ♦ వర్ధిష్ణువై విద్విష
ద్వంశారణ్యము నిర్దహించు భవదు ♦ ద్దామప్రతాపాగ్ని శీ
తాంశుస్ఫూర్తులు సంశ్రితావళికి నీ ♦ యాకార రేఖల్ త్రయ
స్త్రింశత్కోటిసుపర్వనాథుఁడవు కీ ♦ ర్తింప న్నినున్ శక్యమే. 118

అ॥ భవదుద్దామ ప్రతాపాగ్ని. భవత్ — నీయొక్క, ఉద్దామ — మదించిన, ప్రతాపాగ్ని — పరాక్రమమువలనఁబుట్టిన ప్రతిష్ఠయనెడు నగ్నివంటి తేజస్సు, వంశారణ్యమున్. వంశ — వెదుళ్ళ యొక్క, అరణ్యమున్ — అడవిని, కాల్చు — దహనము చేయునట్టి, పావకుగతిన్ — అగ్నిహోత్రుని వలె, వర్ధిష్ణువు — వృద్ధిబొందుచున్నది, ఐ. అగుచు, విద్విషద్వంశారణ్యమున్. విద్విషత్ — శత్రువుల యొక్క, వంశ — కులమనెడి, అరణ్యమున్ — అడవిని, నిర్దహించున్ — నిశ్శేషముగాఁ గాల్చును, ని 'నిర్ణిశ్చయనిషేధయోః' అని అ. నీయాకారరేఖల్ — నీశరీరసౌష్ఠవముయొక్క కాంతులు, సంశ్రితావళికిన్ — ఆశ్రితులయొక్క సమూహమునకు, శీతాంశుస్ఫూర్తులు — చంద్రునివలె నిండారునవి. చంద్రునివలెఁదోఁచునవి, త్రయస్త్రింశత్కోటిసుపర్వనాథుఁడవు. త్రయస్త్రింశత్కోటి — ముప్పది మూఁడు కోట్లయిన, సుపర్వ — దేవతలకు, నాథుఁడవు — రాజవు, నినున్ — అట్టి మహనీయుఁడవైననిన్ను, కీర్తింపన్ — పొగడుటకు, శక్యమే — నాతరమగునా, అలం. వంశారణ్యముఁగాల్చుపావకుగతిన్, ఉపమాలంకారమును 'విద్విషద్వంశారణ్యము నిర్దహించు భవదుద్దామప్రతాపాగ్ని' అనుటచే రూపకాలంకారమును. "తద్రూపక మభేదోయ, ఉపమానోపమేయయోః. అతిసామ్యాత్ (అనపహ్నుతభేదయోః) అభేదః" కా. ప్ర.

తా॥ నీప్రతాప మనునగ్ని వెదుళ్ళతోనిండినయడవిని గాల్చుచున్నకార్చిచ్చువలె శత్రువులకులమును రూపుమాపుచున్నది, నీశరీరకాంతి శరణాగతులకుఁ జంద్రుని వెన్నెలవలెనున్నది. ముప్పది మూఁడుకోట్లబృందారకుల కధిపతివగునిన్ను నుతించ నాతరమా!

గీ॥ తగఁ బరాగము గప్పిన ♦ తమ్మికొలను, మాడ్కి హరిచందనాలిప్య ♦ మగుచు వేయుఁ
గనులతో నొప్పునీయుద ♦ గ్రప్రదీప్త, తనువుఁ గీర్తింప నేర్తునే ♦ యనిమిషేంద్ర. 119

అ॥ అనిమిషేంద్ర — ఓవేలుపురేఁడా, తగన్ — ఒప్పునట్లు, పరాగము — పుప్పొడి, కప్పిన — క్రమ్ముకొనియున్న, తమ్మికొలనుమాడ్కిన్ - తామరపువ్వులుగల మడుగువలె, హరిచందనాలిప్యము. హరిచందన - కల్పవృక్షముయొక్క గంధము, 'హరిమింద్రంచందయతి ఆహ్లాదయతీతిహరిచందనం, అనివ్యు. ఇది పసుపువన్నెకలిగియుండును, ఆలిప్యము - అంతటను బూయఁబడినది, అగుచున్ — అయి, వేయుఁగనులతోన్ - సహస్రసంఖ్యగల నేత్రములతో, ఒప్పు - ప్రకాశించుచున్న, నీయుదగ్రప్రదీప్త తనువున్. నీ - నీయొక్క, ఉదగ్ర - భయంకరముగ, ప్రదీప్త - ఒప్పుచున్న, తనువున్ - శరీరమును, కీర్తింప నేర్తునే - నుతింపగలుగుదునా, అలం ఉపమ.

తా॥ ఓ వేల్పులరయెకిమీఁడా! పుష్పొడిచేఁ గప్పఁబడియున్న తామరపువ్వులు గలకొలనువలె, హరిచందనము పూయఁబడినతనువునందలి వేయి కనులతోనొప్పుచున్న భయంకరమగు నీశరీరమును నేను వర్ణింపగలుగుదునా.

వ॥ అని యనేకప్రకారంబులఁ గీర్తింప నన్నిలింపసార్వభౌముండు. 120

అ॥ అని - ఇట్లుపలికి, అనేకప్రకారంబులన్ - బహువిధములుగా కీర్తింపన్ - కొనియాఁడగా, అన్నిలింపసార్వభౌముండు; ఆదేవతాచక్రవర్తియగునింద్రుండు.

—: నిరంకుశుఁడు రాజుపిచ్చి పోఁగోరుట :—

ఉ॥ మెచ్చితి నీప్రవీణతకు ♦ మేలు ధరాసురవర్య వేఁడుకొ
మ్మిచ్చెద నీకభీష్ట మన ♦ నెంతయు సంతసమంది వాంఛితం
బిచ్చెద వేని నా కనిమి ♦ షేశ్వర యీధరణీతలేశ్వరున్
సచ్చరితాగ్రగణ్యుగ్రహ ♦ సంగ్రహు నిగ్రహుఁ జేసి కావవే. 121

అ॥ ధరాసురవర్య - ఓబ్రాహ్మణులలో శ్రేష్ఠుఁడైనవాఁడా, మేలు - ప్రశంసార్థకము, నీప్రవీణతకున్ - నీయొక్క నేర్పునకు, మెచ్చితిన్ - అనుగ్రహించితిని - ప్రేమగలవాఁడనైతిని, నీకున్ — నీకు, అభీష్టమున్ - ప్రియముగలదానిని, వేఁడుకొమ్ము - అడుగుము, ఇచ్చెదన్ - ఒసంగెదను, అనన్ - ఇట్లుపలుకఁగా, ఎంతయున్ - మిక్కిలి, సంతసము - సంతోషము, అంది - పొందినవాఁడై, అనిమిషేశ్వర - ఓదేవతలకు ప్రభువైనవాఁడా, వాంఛితంబు - నేను కోరినదానిని, ఇచ్చెదవేని - ఇయ్యదలంచియుండినట్లయిన, సచ్చరితాగ్రగణ్యున్ - మంచినడవడికయందు శ్రేష్ఠుండైనవానిని, ఈధరణీతలేశ్వరున్ - ఈరాజును, గ్రహసంగ్రహున్ - పిశాచముపట్టినవానిని, నిగ్రహున్ - ఆపిశాచమును గెలిచినవానినిగా, చేసి - ఒనరించి, కావవే - రక్షించుము. ఇచట నిరంకుశుఁడు తనంతటతానే రాజునకుపకారముజేయ వరమభిలషించుటకు "పద్మాకరం దినకరోవికచం కరోతి చంద్రో వికాసయతి, కైరవచక్రవాలం, నాభ్యర్థితో జలధరోఽపిజలం దదాతి సంతః స్వయం పరహితే విహితాభియోగాః" భర్తృ. "ద్యుమణి పద్మాకరము వికచముగఁజేయుఁ, గుముదహర్షంబుఁ గావించు నమృతసూతి, యర్థితుఁడుగాక జలమిచ్చు నంబుధరుఁడు, సజ్జనులు గారెపరహితాచరణమతులు. ఇందు 'ఎంతయు - సంతస' 'షేశ్వర- వేశ్వరున్' గ్రహ - సంగ్రహు - నిగ్రహు' ఇవి యనుప్రాసాలంకారము.

తా॥ ఓనిరంకుశుఁడా! మంచిది, నీచాతుర్యమునకు మెచ్చితిని. నీకుఁ బ్రియమగుదానింగోరుము. ఇచ్చెదను. అని యింద్రుఁడుపలుకంగా సంతోషపడి యోదివ్యప్రభూ! నాకోరిక నొసంగఁ దలఁచితి వేని యీరాజునావేశించియున్న భూతమును బోఁగొట్టి కాపాడుము.

—: నిరంకుశుఁడు రంభనిమ్మనుట :—

చ. అన నదియెంతమాత్రము ధ ♦ రామరనందన నేఁడు మింక నొం
డనుపమమైనకోర్కి యన ♦ నాబలసూదనుతోడ బ్రాహ్మణుం
డనిమిషలోకనాథ విబు ♦ ధాబ్జముఖీమణి రంభపట్టునన్
జన దభిలాష మేమియును ♦ సారసగంధిని నాకొసంగవే. 122

అ॥ అనన్ - అబ్రాహ్మణుఁడిట్లు పలుకఁగా, ధరామరనందన - ఓబ్రాహ్మణతనయుఁడా, ఇది యెంతమాత్రము - ఈవరమెసంగుటయనఁగా నాకుఁ దృణప్రాయము, ఇంకన్ - ఇదిగాక, ఒండు - ఒకటి, అనుపమము - అసమానము,- సాటిలేనిది, ఐనకోర్కి - అయినట్టికోరికను, వేఁడుము - అర్థింపుము, అనన్ - అనఁగా, బ్రాహ్మణుండు - ఆనిరంకుశుఁడు, ఆబలసూదనుతోడన్ - బలాసురుని సంహరించిన యాయింద్రునితో, అనిమిషలోకనాథ - ఓ స్వర్గలోకమునకధిపతియైనవాఁడా, విబుధాబ్జముఖీమణి - దేవతాస్త్రీలలో శ్రేష్ఠురాలైన, రంభపట్టునన్ - రంభయందు, అభిలాషము - నాకుఁగలకోరిక. ఇచట రెండురూపములుకలవు, 'ని. అభిలాష, అభిలాషము. ఇచ్ఛ, ఆం. దీ. ఏమియును - కొంచెమైనను, చనదు - పోదయ్యెను, కావున, సారసగంధిని - తామరపువ్వులవంటి పరిమళముగల యాస్త్రీని, నాకొసంగవే - నాకిమ్ము, ఇందు మొదటిపాదమున స్వరయతిసెప్పఁబడినది లక్షణ ముదాహరింపఁబడియున్నది.

తా॥ ఇట్లు పలుకుటతోడనే యింద్రుఁడదియనగా నెంత యట్లే యారాజు నావేశించియున్న భూతమును బోఁగొట్టితిని, గాని యింకొక గొప్పవరమును గోరుమన నతం డోసురనాథా! నాకు రంభయందుఁ గల యనురాగ మించుకయైనను వదలలేదు. కనుక నాయువతిని నాకొసంగుము.

—; రంభనిత్యము వచ్చుచుండునట్లు వరమిచ్చుట ;—

ఉ॥ నా విని నవ్వి యవ్విబుధ ♦ నాయకుఁ డిట్లను విప్రసూతితో
నోవిటసార్వభౌమ విక ♦ చోత్పలలోచన రంభ నిత్తుఁ గా
కావసుధాస్థలిన్ దివిజ ♦ కాంతలకుండఁగరాదు వచ్చుచుం
బోవుచునుండు భూతలికి ♦ భోగముఁ జేకొను పూర్వరీతిగన్. 123

అ॥ నాన్ - ఇట్లుపలుకఁగా, విని - ఆకర్ణించి, అవ్విబుధనాయకుఁడు - దేవతలకుఁబ్రభువైన యాయింద్రుడు, నవ్వి - హాసముచేసి, విప్రసూతితోన్ - ఆబ్రాహ్మణపుత్రునకు, ఇట్లనున్ - ఈ ప్రకారముగాఁజెప్పెను, ఓవిటసార్వభౌమ - ఓ వ్యభిచారపురుషులలో చక్రవర్తియైనవాఁడా. వికచోత్పలలోచనన్ — వికసించినకలువలవంటి కన్నులుకలదానిని, రంభను - నీవుకోరినయచ్చరను, ఇత్తుఁగాక - ఇచ్చెదనుగాని, 'కాక' యనునది యాశీరాద్యర్థకము, ఆవసుధాస్థలిన్ —ఆయొక్కభూలోకమునందు, దివిజకాంతలకున్ — దేవతాస్త్రీలకు, ఉండఁగరాదు — నివసించుటయెప్పుడు, కనుక. భూతలికిన్ — భూప్రదేశమునకు, వచ్చుచున్ — అప్పుడప్పుడువచ్చుచును, పోవుచుండున్ - మరలఁ బోవుచునుండును. పూర్వరీతిగన్ — మునుపటివలెనే, భోగమున్ - ఆబిడతోసౌఖ్యమును, చేకొను - అందుము, ఇట 'నవ్వి యవ్వి, అనుప్రాసాలంకారము, చేకొను అనుప్రయోగమునకు సూ. ఏకత్వే ఽధ బహుత్వే ముడుజౌ సంప్రార్థనార్థకేషు స్తః అనిశబ్దచిం. అనియున్నను, "సూ. ప్రార్థనార్థే మురేకత్వే కథ్యతే మధ్యమార్థకః, విభాషాంతం వదం త్యేకే న ప్రాణేతు కదాచన." అథ. ఉదా. తోయజేక్షణ నసఁ గృపతోడఁ జూడు, మఱియు 'న ప్రాణే తు కదాచన, అనుటచే హల్లుపరంబగు నపుడు వికల్పము. ఉదా. నను గృపజూడు భారతీ" ఇందు దృతీయపాదమున 'గాక + ఆవసుధ' అని ఛేదమున్నను కాకేయతి చెల్లినది.

ఉ॥ మానుగవిశ్రమాక్షరస ♦ మంచితమైస్వరమూవినన్దపీ , యానుగుణాక్షరంబుఁ గొని♦యైనను

జెప్పఁగనొప్పునీక్రియన్, భానుసహస్రభాసి వృపభాధిపుఁడన్నటు లర్థయుక్తమై, పూనినచో నఖండయతి ♦ పాల్వగునాదికవిప్రణీతమై" అనం. 'ఆవసుధాతలంబునను ♦ రాంగనలుండగరాదు' పాఠాం. అర్థముసమానమే ఇది స్వరయతియగును. మానశౌర్యతి - క్షుత్క్షామోఽపి జరాకృశోఽపి శిథిలప్రాయోఽపి కష్టాం దశా, మాపన్నోఽపి విపన్నదీధిత్థపి ప్రాణేషునశ్యత్స్వపి, మత్తేభేంద్రవిభిన్నకుంభపిశితగ్రాసైకబద్ధస్పృహః, కింజీర్ణంతృణమత్తి మానమహతా మగ్రేసరః కేసరీ" భర్తృ. ఉ "గ్రాసములేకస్రుక్కిన జ♦రాకృశమైన విశీర్ణమైన సా, యాసమునైన నష్టరుచి♦యైనను బ్రాణభయార్తమైన సంత్రాసమదేభకుంభపిశి ♦ తగ్రహలాలసశీలసాగ్రహా, గ్రేసరభాసమాన మగు ♦ కేసరి జీర్ణతృణంబు మేయునే"

తా॥ ఇట్లడిగిన యాబ్రాహ్మణుని పలుకుల కింద్రుఁడు నవ్వి యోభోగలాలసుఁడా! అటులనే రంభనొంగెదను. గాని దేవతాస్త్రీలు పుడమియం దుండఁజనదు. కనుక నీవుకోరినప్పుడు వచ్చిపోవుచుండును. మునుపటివలెనే దానితో సంభోగానందము నొందుచుండుము.

వ॥ అన ననేకదండప్రణామంబులు నేసినిలిచిన, 124

అ॥ అనన్ - ఇంద్రుడిట్లుపచించఁగా, అనేకదండప్రణామంబులు - ఎన్నియోశాస్త్రబద్ధమైన నమస్కారములు, చేసి - ఆచరించినవాఁడై, అనగా భక్తితోఁగూడిన నమస్కారము అనేకము చేసినవాఁడై యనుట, నిలిచినన్ - నిలువఁబడఁగా

—: ఇంద్రుఁడు దివికేఁగుట :—

శా॥ రింఖాపాతమునం జదల్ గదల ని ♦ ర్విచ్ఛేదవారానిశ
ప్రేంఖద్వాతపరంపరల్ దెసల నా ♦ భీలంబుగాఁ బర్వ వై
శృంఖల్యంబునఁ బట్టుకళ్లెపుసరుల్ ♦ చేర్వార నుచ్చైశ్శ్రవః
కంఖాణంబుఁ గదల్చె వాసవుఁడు ది ♦ క్పాలాదిసంసేవ్యుఁడై. 125

అ॥ వాసవుఁడు — ఇంద్రుఁడు, దిక్పాలాదిసంసేవ్యుఁడై. దిక్పాల — దిశలను బాలించువారైన యగ్నియమనిర్ఋతివరుణవాయుకుబేరేశానులు, ఆది-మొదలుగాఁగలవారివలన, సంసేవ్యుఁడై-కొలువఁబడినవాఁడై, రింఖాపాతమునన్ — కాలియొక్కగిట్టలు పడుటవలన, చదల్ — ఆకాశము, కదలన్-చలించుచుండఁగాను, నిర్విచ్ఛేదవారానిలప్రేంఖద్వాత పరంపరల్. నిర్విచ్ఛేద — ప్రత్యేకింపఁబడని-వేఱుగాని, అనఁగామితిలేనియనుట, వార — పరివారముయొక్క, అనిశ — ఎడతెగని, ప్రేంఖత్ అశ్వగతులవలనీ, వాతపరంపరల్ — గాలియొక్కవరుసలు, దెసలన్ — అన్నిదిక్కులయందును, ఆభీలంబుగాన్ —భయంకరముగా. పర్వన్—వ్యాపించుచుండఁగాను, అంతట నిండునట్లుగాను, వైశృంఖల్యంబునన్ —బంధసాధనమగు గొలుసువలన నడ్డులేకుండుటచేత, పట్టుకళ్ళెపుసరుల్ — పట్టు — చేత బట్టుకొనిన, కళ్ళెపుసరుల్ — కళ్ళెమునకుఁగట్టినత్రాళ్ళు. చేర్వారన్ — సమీపమునకు వచ్చుచుండఁ

గాను. ఉచ్చైశ్శ్రవః కంఖాణంబున్ — ఉచ్చైశ్శ్రవమను పేరుగల తనయశ్వమును, ఉచ్చైశ్శ్రవః కీర్తిర్యస్య ఉచ్చైశ్శ్రవాః అనివ్యు. ఉన్నతమైనకీర్తి కలది, కదల్చెన్ — చలింపఁ జేసెను — అనఁగాఁ బ్రయాణమయ్యెననుట, ఉదా. 'మ. గజకంఖాణశతాంగపత్తి జనవర్గంబున్ సమ గ్రంబులై ♦ భజియింపన్' విజ. 'ని. కంఖాణము. సం. వి. అ. పుం. గుఱ్ఱము' 'మ. జయనత్కాం ఖాణరింఖా విశృం, ఖలసంజాతధరాపరాంగపటలా ♦ క్రాంతంబు. రా. పాం. మఱియు సీ. కంఖా ణతురగరిం ♦ ఖాపుంఖితక్షమా. ధూళినభ్రపదంబు ♦ దూఁటుగట్ట' పరా. పు. అతిశయోక్త్యలంకారము.

తా॥ ఇంద్రుఁడు దిక్పాలురు కొలుచుచుండఁగాఁ దనగుఱ్ఱము నదలింప నది తనగిట్టల తాకుడు వలన నాకాశము కదలుచుండఁగాను, ఒక్కసుమిగా నందఱివాహనములు లేచుటవలన నుత్పన్నమైన గాలి దిశలెల్ల నిండఁగాను, అడ్డులేకుండఁ గళ్ళెమును వదలుటవలన బాగుగాఁ దలయెత్తుచుండఁగాఁ బల్లపుత్రాళ్లు వదులై సమీపించుచుండఁగాను, వేగముగాఁ బోవుచుండెను.

## —: నిరంకుశునకు రత్నాభిషేకమొనర్చుట :—

సీ॥ అప్పు డారాజు భూ♦ తావేశనిర్ముక్త, దేహుఁడై కాంతిసం♦ దీప్తుఁడయ్యెఁ
దదనంతరమున ర ♦ త్నంబుల నభిషిక్తుఁ, జేసిరి మంత్రులు ♦ భూసురేంద్రు
నాపిమ్మట నృపాల ♦ కాంతఃపురస్త్రీలు, తమతమసొమ్ము లెం ♦ తయు నొసంగి
రటుతరువాత దే ♦ వాంగనామణి యగు, రంభ యేతెంచి సం ♦ రంభ మొదవ

గీ॥ గ్రుచ్చి కౌఁగిటఁజేర్చి యో ♦ గుణసముద్ర, నీకతన శాపమోక్షంబు ♦ నాకు దొరకె
నీవలన నచ్చరలలోన♦ శేవ గంటి, నిన్నుఁ గూరిచి హరియు న♦న్నించెనన్ను. 126

అ॥ అప్పుడు — ఆసమయమున, ఆరాజు — ఆశత్రుందముఁడు, భూతావేశనిర్ముక్తదేహుఁడు. భూత — పిశాచము, ఆవేశ — శరీరమునఁజొచ్చుటను, నిర్ముక్త — విడువఁబడిన, దేహుఁడు — మేను గలవాఁడు, ఐ — అయియుండి, కాంతిసందీప్తుఁడు — ప్రకాశముతో నొప్పుచున్నవాఁడు, అయ్యెన్ — ఆయెను, తదనంతరమునన్ — అటుపిమ్మట, మంత్రులు — ఆరాజుయొక్క ప్రధానులు. భూసురేంద్రున్ — బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు నానిరంకుశుని, రత్నంబులన్ — వజ్రవైడూర్యాదిమణులతో, అభిషిక్తున్ — స్నానముచేసినవానినిగా, చేసిరి — ఒనరించిరి, ఆపిమ్మటన్ — అటుతరువాత, నృపాలకాంతఃపుర స్త్రీలు. నృపాలక - ఆరాజుయొక్క, అంతఃపురస్త్రీలు — రాణివాసాంగనలు, తమతమసొమ్మున్ — వారివారి యాభరణములను, ఎంతయున్ — మిక్కిలిగా, ఒసంగిరి — ఇచ్చిరి, అటుతరువాతన్ - ఆ పిదప, దేవాంగనామణి — దేవతాస్త్రీలలో సౌందర్యవతి, అగురంభ — అయినట్టిరంభ, సంరంభము - తత్తరపాటు, ఒదవన్ — కలుగఁగా, గ్రుచ్చికౌఁగిటఁజేర్చి — చక్కఁగాఁబట్టి యాలింగనమునర్చి, ఓ గుణసముద్ర - సద్గుణములయందు సముద్రమువంటివాఁడవైన యోనిరంకుశుఁడా, నీకతన్ - నీవలన నాకున్ - నాకు, శాపమోక్షంబు - శాపమువిడిచిపెట్టుట - శాపవిమోచనమగుట, దొరకెన్ - లభించెను, నీవలనన్ - నీమూలమున, అచ్చరలలోనన్ - నాతోడియప్సరస్త్రీలలో శేవగంటిన్ - ప్రకాశమునుబొందితిని, నిన్నుఁగూరిచి - నీకారణమున నే. నీవలననే, నన్నున్ - నన్ను, హరియున్ - ఆయింద్రుఁడుసైతము, మన్నించెన్ - గౌరవించెను. అపరాధమునుక్షమించెను, ఇందు హరియు

మన్నించె ననుటలో సమచ్చయార్థముయొక్క నుకారములోపించుటకు "సూ. విసాద్వితీయం స్యాదస్మ దాత్మనో స్వంతయోరపినోఽన్యస్యాపి సర్వం స్యాద్బహుళం సత్ప్రయోగతః, అని యథర్వణాచార్యులు అలం. ఉదాత్తము' పూర్వము నిరంకుశుఁడు వేశ్యమాతచే 'వైదికపుబాఁపలేడ భూవర కుమారయోగ్య సౌభాగ్యలగువారయువతులేడ' అనిపించుకొని యిప్పుడు మంత్రులచే రత్నాభిషిక్తుఁడయ్యెననుటకు "మణి ర్లుఠతి పాదాగ్రే కాచః శిరసి ధార్యతే, క్రయవిక్రయవేళాయాం కాచః కాచో మణిర్మణిః" అనిచాణ. మఱియు నిరంకుశునియందు వ్యభిచారాదిదోషము లెన్నియున్నను బ్రతిభావిశేషము కలవాఁడగుటచేతనే పూజింపఁబడినాఁడు "వ్యాలాశ్రయాపి విఫలాపి సకంటకాపి వక్రాపి పంకసహితాపి దురాసదాపి, గంధేనబంధురసి కేతకి సర్వజంతో, రేకోగుణః ఖలు నిహంతి సమస్తదోషాన్" అనిచాణ.

తా॥ అంతట నారాజు నావేశించినభూతము తొలఁగి ప్రకాశమానుఁడుకాఁగా నతనిమంత్రులా బ్రాహ్మణునకు రత్నములతో నభిషేకమొనర్చిరి. అంతఃపురాంగనలు వారివారి యాభరణముల నొసంగిరి. తదుపరి రంభ దగ్గఱకువచ్చి గట్టిగాఁబట్టికొని కవుఁగిలించి యోగుణవంతుఁడా! నీవలన నాకు శాపవిమోచన మయ్యెను. నాతోడియచ్చరలలో వన్నెకెక్కితిని. ఇంద్రుఁడు సైతము మన్నించెను.

## —: రంభ దేవలోకమునకుఁబోవుట :—

క॥ వినవోయి నిరంకుశ నీ, కునునాకును లోకభర్త ♦ కూర్చినయిష్టం
బునుఁ బాయమనియెఱుంగుము, చనియెద నిప్పటికిమగిడి ♦ చనుదెంతుఁజుమీ. 127

అ॥ నిరంకుశ - ఓనిరంకుశుఁడా, వినవోయి - నేఁజెప్పుదానినాకర్ణించుము, నీకును నాకును - మనయిరువురికిని, లోకభర్త - బ్రహ్మ. "ని. బ్రహ్మ ఆత్మభూస్సురజ్యేష్ఠః పరమేష్ఠీపితామహః. హిరణ్యగర్భోలోకేశః" అమ. కూర్చినయిష్టంబునన్ - పొందించినస్నేహమును, పాయము - ఎన్నఁటికిని విడిపోము, అనియెఱుంగుము - అనితెలుసుకొనుము, ఇప్పటికిన్ - ఈదినముననింతటితో, చనియెదన్ - దేవలోకమునకుఁబోయెదను, మగిడి - తిరిగి, చనుదెంతుఁజుమీ - వచ్చెదనుసుమా, సందేహపడవలదనుట, ఇందు భావశాంతి యనుసంచారిభావము చూపఁబడినది. ఇచట రంభ నీస్నేహమును వీడననుటకు "బంధనాని ఖలు సంతిబహూని, ప్రేమరజ్జుకృతబంధన మన్యత్, దారుభేదనిపుణోఽపి షడంఘ్రి, ర్నిష్క్రియోభవతి పంకజకోశే" చాణ.

తా॥ ఓనిరంకుశుఁడా! మనయిరువురకి భగవంతుఁడు కూర్చినస్నేహము నెన్నఁటికిని విడువము. ఈదినమున నింతటితోఁబోయి మరలివచ్చెదను. సంశయింపకుము.

## —: తలిదండ్రులు నిరంకుశుని గౌరవించుట :—

క॥ అని యనిమిషభామిని వో, యినపిమ్మటఁ దల్లిదండ్రు ♦ లెంతో సంతో
షనితాంత హృదయులై పు, త్త్రునిఁ గౌఁగిటఁ జేర్చి పులక ♦ ధూర్వహతనులై. 128

అ॥ అని - ఇట్లుచెప్పి, అనిమిషభామిని - ఆదేవకాంత. పోయినపిమ్మటన్ - వెళ్ళిన తరువాత, తల్లిదండ్రులు - ఆనిరంకుశునియొక్క జననీజనకులు, ఇచట పురుషమునకు సరళాదేశమగుటకు సూ. స్వర్భిన్నాద్దేవతస్మాత్తే వినాద్వంద్వంహరేర్మతే' అథ. ఎంతో - మిక్కిలి, సంతోషనితాంత హృదయులు, సంతోష - ఆనందముయొక్క, నితాంత - అధిక - తోఁగూడిన, హృదయులు మనస్సుగలవారు, ఐ - అగుచు, పుత్త్రునిన్ - తమకొడుకును, కౌగిటన్ జేర్చి - ఆలింగనముజేసికొని, పులకభూర్వహతనులు, పులక - గగుర్పాటుయొక్క, ధూః - భారమును, ని. 'ధూర్నాథూపేస్త్రీ తుకంపే చిత్తేభారేయుగాగ్రయోః, అని నా. వహ - మోయుచున్నటువంటి, ధరించియున్నటువంటి తనులు - శరీరముగలవారు, ఐ-అగుచు. పైపద్యముతో నన్వయము, ఇందు 'అనియనిమిష- ఎంతో సంతోష" అను ప్రాసాలంకారము.

తా॥ అని యాదేవకాంత సనినపిదప నతనితలిదండ్రులు మిక్కిలి సంతోషపడి సుతునిఁ గౌఁగిటఁ జేర్చి యొడలు గగుర్పొడవఁగా.

క॥ తనయా నిన్నింతె నయా, ఘ్యునిఁ బ్రాప్త మెఱుంగ లేక ♦ యొకమానవమా
త్రునిఁ గాఁగఁ జూచి నిరసిం, చిన యపరాధంబు నార ♦ సి సహింపఁగదే. 120

అ॥ తనయా - ఓకుమారా, నిన్నున్ - నిన్ను, ఇంతనయాఢ్యునిన్ - ఇంతటినీతిసంపన్నుని, ప్రాప్తమున్ - పొందఁబడుటను, ఎఱుంగలేక - తెలిసికొనఁజాలక, ఒకమానవమాత్రునిన్ - ఒక సామాన్యమనుష్యుని, కాఁగన్ - అగునట్లు, చూచి - కనుఁగొని, నిరసించిన యపరాధంబున్ - తిరస్కారముచేసిన నేరమును, ఆరసి - పరిశీలించి, సహింపఁగదే - సహించుము, "సూ. ప్రార్థనంబునం దన్నృత్యయాంత క్రియలమీఁద గద కదవు పూర్వకంబు లన్నాదు లను ప్రయుక్తంబు లగు" ప్రౌ; వ్యా. ఉదా. "క. తాపసమందార నాకు ♦ దయసేయఁ గదే" భాగ. ఇచటఁ దండ్రికంటెఁ గుమారుఁ డధికుం డగుటచేఁ బరవశంబున నిట్లువచించెను. ఉదా. "ఆ. తండ్రికంటెఁ గొడుకు ♦ తాగుణి యయ్యెనా, పిన్నపెద్దతనము ♦ లెన్నవలదు, వాసుదేవు విడిచి ♦ వసుదేవు నెంతురా" విశ్వ "నతేన వృద్ధోభవతియేనా స్యపలితం శిరః, యోవై యువః ఉప్యధీయానః స్త దేవా స్థవిరం విదుః" తరుణవయస్కుఁడైనను జ్ఞానవంతుఁడైనవాఁడే వృద్ధుఁడని దేవతలు పలుకుచున్నారు. "గుణాః పూజాస్థానం గుణిషునచలింగం నచవయః, అనియును బుధులు చెప్పియున్నారు. "యశోదయాశీల రూప మాధుర్యైరపి సర్వతః, సబాలోపిపుమాన్ వృద్ధః సాధుబృందావనేరతః" సూ. సం. మఱియు "ఏకేనాపి సువృక్షేణ శోభమానేన గంధినా వాసితం తద్వనం సర్వం, సుపుత్రేణ కులం యథా" "ఏకేనాపి సుపుత్రేణ విద్యాయుక్తేన సాధునా, ఆహ్లాదితో కులం సర్వం యథా చంద్రేణ శర్వరీ" చాణ. ఇందు తనయానిన్నింతనయాఢ్యుని, అనుప్రాసాలంకారము.

తా॥ పుత్త్రాఁ ఇంతటినీతిపరుఁడవు మాకు లభించుట యెఱుంగక నిన్నొకమనుష్యమాత్రునిగాఁ జూచి నిందించిన మాయపరాధముల సహించుము.

సీ॥ ఒకనికి శక్యమే ♦ యురగభూషణుతోడ, నలఘుచాతురి జూద ♦ మాడి గెలువ
గెలిచెఁ బో యొకనికిఁ ♦ దెలియునే సామాన్య, రమణుల నడుగక ♦ రంభ నడుగ
నడిగెఁ బో యొకనికి ♦ నలవియే సురకాంత, లాలించి భూమిని ♦ ల్లాలిఁ జేయఁ
జేసెఁ బో యొకనికిఁ ♦ జెల్లునే చిరభోగ్య, మగునింద్రశాపంబు ♦ నపుడె మాన్ప

గీ॥ నీకుఁ దక్కఁగ వికచనా ♦ ళీకలోచ, నామనోహర దేహసౌం ♦ దర్యధుర్య
తానివారితశీతల ♦ ధామ సోమ, ధరకృపాపాత్రపుత్త్రి కం ♦ దర్పదర్ప. 130

అ॥ వికచ..............ధామ. వికచనాళీకలోచనా వికసించిన తామరపువ్వులవంటి కన్నులు గలస్త్రీలకు, మనోహర — మనస్సునకిష్టము గలిగించునట్టి, దేహసౌందర్య — ఒడలిచక్కఁదనము యొక్క, ధుర్యతా — భారమును వహించుటచేత, నివారిత — అడ్డగించఁబడిన, శీతలధామ — చంద్రుఁడుగలవాఁడా, సోమ...............పుత్త్రి సోమధర — చంద్రుని జడయందుఁదాల్చిన శివునియొక్క, కృపా — దయకు, పాత్ర — అర్హుడవయిన, పుత్త్రి — తనయుఁడా, కందర్పదర్ప — మన్మథునివంటి గర్వముగలవాఁడా, నీకుఁదక్కఁగన్ — నీకుఁదప్ప- నీవుగాకయనుట, ఉరగభూషణు తోడన్ — పాములు సొమ్ములుగాఁగల శివునితోడి? అలఘుచాతురిన్ — గొప్పనేర్పుతో, జూదమాడి గెలువన్ — సొగటాలాడి జయించుటకు, ఒకనిశక్యమే — వేఱొకనికిఁదరమా, - మరియొకనికిఁదరము గాదనుట, గెలిచెఁబో — జయించుటసరియేకదా, సామాన్యరమణులన్ — అందరితో సమానమైన స్త్రీలను, — అనఁగా భూలోక స్త్రీలననుట, అడుగక — ఇమ్మనక, రంభనడుగన్ — దేవతాస్త్రీ యగు రంభనొసంగుమనుట, ఒకనికిఁదెలియునే — ఒకని కెఱుకపడునా, - ఎవ్వరికిఁదెలియదనుట, అడిగెఁబో — అడుగుటసరియేకదా, సురకాంతన్ — దేవతాస్త్రీలలో సౌందర్యవతియగు రంభను. లాలించి — లాలనముఁజేసి, - అధికమైన ప్రేమజూపి, భామిన్ — పుడమియందు, ఇల్లాలిన్ — తన భార్యనుగా, చేయన్ — చేసికొనుటకు, ఒకనికినలవియే — ఒకనికిశక్యమగునా, - కాదనుట, చేసెఁబో — ఆవిధముగా భార్యనుజేసికొనుట సరియేకదా, చిరభోగ్యము — బహుకాల[illegible] దగినది, అగు — అయినట్టి, ఇంద్రశాపంబున్ — ఇంద్రునియొక్కతిట్టును, అపుడేమాన్పన్ — ఆ[illegible] యముననే పరిహారముచేయుటకు, ఒకనికిఁజెల్లునే — ఇంకొకనికిఁగొనసాగునా, - మఱియొకనివలన గానేరదనుట, ఇందు నాయకునియొక్క సర్వోత్కర్షను వర్ణింపబడినది. ఉత్తరోత్తరోత్కర్షముచే సారాలంకారమును “ఉత్తరోత్తరముత్కర్షభవేత్సారః పరావధిః” కా. ప్ర.

‘క. నిరవధికముత్తరోత్తర. నిరతోత్కర్షంబుఁదెలుప ♦ నిఖిలకృతులయం
దరుదైతగు సారాలం, కరణము కవివినుతమగుచు,” నరస.

సౌందర్యధుర్య — ధామసోమ - పాత్రపుత్త్రి — కందర్పదర్ప, ఇవియను ప్రాసాలంకారమును ‘వికచ .........ధామ, ప్రతిషేధోపమాలంకారమును ‘నజాతుశక్తిరిందోస్తేముఖేన ప్రతిగర్జితుం. కళంకినో జడస్యేతి ప్రతిషేధోపమామతా’ కావ్యాద,

తా॥ సుపుత్త్రా! నీకుఁదప్ప నీలాకమున శివునితో జూదమాడి గెలువ నెవ్వరివశమగును, ఒకవేళ గెలిచినను ప్రపంచమునందలిస్త్రీలఁ గోరక దేవలోకమునఁ గలరంభ నిమ్మనుట యెవరికిఁ దెలియును. పోనీ అడిగినప్పటికిని వేల్పుటాండ్రలో మిక్కిలియందకత్తెయై చిరకాలము సంభోగమునం దారితేరినయారంభను లాలించి భార్యగాఁ జేసికొన నెవ్వరితరమగును. అథవా యెటులనో భార్యగాఁ జేసికొనినను యుగములపర్యంత మనుభవింపఁ దగిన యింద్రునిశాపమును వెంటనే పరిహరింప నెవ్వరి కలవి యగును.

—; నిరంకుశుఁడు దనభార్యయందు సుతులఁగాంచుట ;—

క॥ అని వినుతి సేయుజననీ, జనకుల బహుళార్థములను ♦ సంతుష్టులుగా
నొనరించి రంభయనుమతిఁ, దనయంగనయందు సునయ ♦ తనయులఁ గాంచెన్. 131

అ॥ అని — ఇట్లని, వినుతి — స్తోత్రము, చేయు — చేయుచున్నట్టి, జననీజనకులన్ — తలిదండ్రులను, బహుళార్థములను — అనేకమైనవస్తువులతోఁ, సంతుష్టులుగాన్ — సంతోషపడినవారినిగా, ఒనరించి — చేసి, రంభయనుమతిన్ — రంభయొక్కసమ్మతితో, తనయంగనయందున్ — తనభార్యయందు, సునయతనయులన్, సునయ — మంచినీతిమంతులైన, తనయులన్ — పుత్త్రులను, కాంచెన్ — కనెను, 'అనివినుతి - తనయంగనయం - సునయతనయ, ఇత్యాదులనుప్రాసాలంకారము'

తా॥ ఇట్లు పొగడినతలిదండ్రులన ననేకవస్తువులతో సంతసింపఁ జేసి యారంభయొక్కసమ్మతితోఁ దనభార్యయందు మిక్కిలి నీతిమంతులగు సుతులఁ గాంచెను,

వ॥ మఱియు నతండు వృషవాహనపదధ్యానాసక్తమానసతత్త్వ పరాయణ పరిప్రాప్త విజ్ఞానపాటవంబున నేకవాక్యప్రతిష్ఠాపనాచార్యుండును, ద్విజవంశపావనుండును, త్రివర్గనిరతుండును, జతుర్వేదపారాయణుండును, బంచశరాకారుండును, షడ్శాస్త్రపారీణుండును, సప్తాశ్వతేజోవిరాజమానుండును, నష్టభోగసంయుక్తుండును, నవనిధానసంపన్నుండును, దశదిశాపూరకీర్తిమండలుండు నై చెలంగె. 132

అ॥ మఱియున్ — అదిగాక, అతండు — ఆనిరంకుశుఁ వృష..............వంబునన్. వృషవాహన — వృషభమేయశ్వముగాఁగల శివునియొక్క. పద — చరణములను, ధ్యాన — మనస్సునిలిపి చింతించుటయందు, ఆసక్త — అధికమైనయిచ్ఛతోఁగూడిన, మానస — మనస్సుయొక్క, తత్త్వ — స్వభావమునందు, పరాయణ — ఆసక్తివలన, పరిప్రాప్త — మిక్కిలిపొందబడిన, విజ్ఞానపాటవంబునన్ — విశేషజ్ఞానముయొక్క పటుత్వముచేత, ని 'విజ్ఞానంశిల్పశాస్త్రయోః' అనిఅ, ఏకవాక్యప్రతిష్ఠాపనాచార్యుండును, ఏకవాక్య — ఒక్కమాటనే, సత్యమునే, ప్రతిష్ఠాపన — ఉంచుటయందు, ఆచార్యుండును — ఉపదేశగురువును, ద్విజవంశపావనుండును — బ్రాహ్మణకులమునఁ బరిశుద్ధమైనవాఁడును, త్రివర్గనిరతుండును — ధర్మార్థకామములను మూడింటియందెడతెగనివాఁడును, చతుర్వేదపారాయణుండును — ఋగ్యజుస్సామాథర్వణములను నాలుగువేదములకు ఆశ్రయమైనవాఁడును, 'ని. ఆశ్రయే తత్పరాభీష్టేపారాయణపదంవిదుః' శాశ్వ, 'సాకల్యాసంగవచనే పారాయణపరాయణే' అ. వేదమునందునర్గళవాగ్ధోరణిగలవాఁడని భావము. పంచశరాకారుండును—మన్మథునివంటి యందముగలవాఁడును. షడ్శాస్త్రపారీణుండును — వేదాంత, వైశేషిక, భాట్ట, ప్రాభాకర, పూర్వోత్తరమీమాంసలను ఆఱుశాస్త్రములుతుదముట్టఁజదివినవాఁడును, సప్తాశ్వతేజోవిరాజమానుండును — సూర్యునివంటి ప్రకాశముతోఁనొప్పుచున్నవాఁడును, అష్టభోగసంయుక్తుండును — ఎనిమిదివిధములైన సౌఖ్యములనుబొందినవాఁడును, అనగా. నన్నవస్త్ర గంధపుష్పతాంబూల వనితాశయనసంగీత విహారములనునవి, మఱియు దాసీ, బంధు సుత, భృత్య, వస్తువాహన, ధనధాన్యంబు లనునవియష్టైశ్వర్యములు, నవనిధానసంప

న్నుండును—ఎన్నటికిని ద్రవ్యముతఱుఁగకుండునట్టివియైన పద్మ మహాపద్మ శంఖ మకర కచ్ఛప ముకుంద కుంద నీల వరములను తొమ్మిదిపాతఱులతోఁగూడిన ధనసమృద్ధిగలవాఁడును, దశదిశాపూరకీర్తిమండలుండును — పదిదిక్కులయందు నిండినకీర్తియొక్క పరివేషముగలవాఁడును' దశదిశ లనఁగా నెనిమిది దిక్కులును నధోభాగమును నూర్ధ్వభాగము నని తెలియవలెను. అధోలోకమునకు శేషుడును, ఊర్ధ్వలోకమునకు బ్రహ్మయును నధిపతులు, ఐ — అగుమ, చెలంగెన్ — ఒప్పెను, ఇందేకసంఖ్య మొదలు దశమసంఖ్యవఱకు గుణవర్ణనాదులఁజెప్పుచు సంఖ్యానుప్రాసమును జిత్రించినాఁడు. మఱియు నాయకునియొక్క సర్వోత్కృష్ట వర్ణించుటచే నుదాత్తాలంకారమును ధర్మార్థకామనిరతుఁడనుటనుగూర్చి "ధర్మార్థకామమోక్షాణాం యస్యైకోఽపి నవిద్యతే, అజాగళస్తనస్యేవ తస్యజన్మ నిరర్థకమ్' అని చాణ. ధర్మార్థకామమోక్షలఁబొందని మానవుని జన్మము మేఁక మెడయందుఁ బుట్టెడి చన్నులవలె వ్యర్థమైనదని భావము. 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణిప్రథంతే' అని చెప్పఁబడియుండుటచే మంగళాంతముగఁగావ్యమును రచించినాడు.

క॥ ఎటువంటి దురాచారున, కెటువంటిజగత్ప్రసిద్ధి ♦ యెఱిఁగితె రాజా
అటుగానఁ బూర్వపుణ్యో, త్కటభావం బల్పునైన ♦ ఘనుఁగావించున్. 133.

అ॥ రాజా - ఓధర్మశీలనృపాలా, ఎటువంటి దురాచారునకున్ - ఏలాటి చెడ్డనడతకలవానికి ఎటువంటిజగత్ప్రసిద్ధి - ఏలాటిలోకప్రఖ్యాతిగలిగెనో, ఎఱింగితె - తెలిసికొంటివా, అటుగానన్ - అందువలననే, పూర్వపుణ్యోత్కటభావంబు-పూర్వ - క్రిందటికాలముదైన, పుణ్య - సుకృతము యొక్క - ఉత్కట - అతిశయమైన, "ని. స్యాదుత్కటోబలవతి, క్లీబేచవ్యాపితాత్రిషు" నానా. "క్లీబముత్కటస్త్రీవమత్తయోః" సే. భావంబు - సంపద, 'ని. భావస్స్వభావేఽభిప్రాయే, చేష్టా సత్తాత్మజన్మసు, క్రియాలీలాపదార్థేషు, బుధజంతువిభూతిషు' అని విశ్వ. అల్పునైనన్ - నీచునైనను, ఘనున్ -గొప్పవానినిగా, కావించున్ - చేయును, ఇందు 'పూర్వపుణ్యోత్కటభావం బల్పునైన ఘనుఁగావించున్ అనుటచేత ననుగుణాలంకారము. "యథా ధేనుసహస్రేషు వత్సో గచ్ఛతి మాతరం, తథా యచ్చకృతంకర్మ, కర్తార మనుగచ్ఛతి" చాణ. 'నామమాత్రేణ సంతుష్టాః, కర్మ కాండరతానరాః, మంత్రోచ్చారణహోమాద్యై ర్వ్యామితాఃక్రతువిస్తరైః' ఏకభుక్తోపవాసాద్యైర్ని యమైఃకాయశోషణైః, మూఢాః పరోక్షమిచ్ఛంతి మమమాయావిమోహితాః' గరు. మూఢులగు మానవులు నామాయ నెఱుంగనేఱక కర్మకాండరతులై మంత్రోచ్చారణ హోమాదిక్రియలతోఁ గూడిన యజ్ఞములు మున్నగువానినిజేయుచు, ఏకభుక్తము, ఉపవాసము, మున్నగుకాయశోషణము లగుకార్యములతో సంతుష్టిఁజెందుచు నామమాత్రముగఁ బరమాత్మను ధ్యానించుచున్నారు. ఎటువంటిదురాచారున కెటువంటిజగత్ప్రసిద్ధి యనుటకు "అపిచేత్సుదురాచారో భజతేమామనన్య భాక్, సాధురేవ సమన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః" భగ. ఇతరప్రయోజనమును దలఁపక నన్ను భజించువాఁడు మిక్కిలి దురాచారముగలవాఁడైనను, వానిని సాధువనియే తలంపవలయును. ఏలయన భగవంతుఁడే తనకు స్వామి గురువు మిత్త్రుఁడు భోగ్యము అనెడి మనోనిశ్చయముగలవాఁడు వాఁడేకదా! "క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి, కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి" భగ. అట్టివాఁడు శీఘ్రముగా దృఢమైన యధ్యవసాయముగలవాఁడై సదాచారపరుఁడై శాశ్వతమైన యుప

శమమును బొందును. అర్జునా! అట్టి దురాచారముగలిగినను నాభక్తునికి నాశములేదని సభాస్థలమునందుఁ బ్రతిజ్ఞచేయుము.

తా॥ రాజా! ఏలాటిదుష్ప్రవర్తనముగలవాని కేలాటిప్రపంచఖ్యాతికలిగెనో తెలిసికొంటివా! కనుకఁ బూర్వపుణ్యలబ్ధమైనయదృష్ట మెంతటి యల్పునైన నధికునిగాఁ జేయును.

చ॥ అని ముని ధర్మశీలవసు ♦ ధాధిపమౌళికి నేర్పుమించి చె
ప్పినకథ బాల్యచాపలము ♦ పెంపున స్వామికి విన్నవించితిన్
జనకుఁడు బాలుఁ డాడునప ♦ శబ్దవచోనివహంబుచేత నె
మ్మనమున మోద మందుక్రియ ♦ మామకవాక్కుల సంతసిల్లుమీ. 134

అ॥ అని - ఈప్రకారముగా, ముని - పులహుఁడనెడిమహర్షి, ధర్మశీలవసుధాధిపమౌళికిన్ - రాజులలో శ్రేష్ఠుఁడైన యాధర్మశీలునకు, నేర్పుమించి - చాతుర్యాతిశయముగలపలుకులతో, చెప్పిన కథ - ఆనతిచ్చిన పూర్వవృత్తాంతమును, బాల్యచాపలముపెంపునన్ - చిన్నతనమనెడి చపలత్వము యొక్క యతిశయముచేత, స్వామికిన్ - ఈశ్వరుఁడవైననీకు, విన్నవించితిన్ - విన్నపము చేసికొంటిని-నివేదించుకొంటిని, జనకుఁడు - తండ్రి, బాలుఁడు - తనచిన్నవయస్సుగలకొడుకు, ఆడు - చెప్పనట్టి, అపశబ్దవచోనివహంబుచేతన్ - అపశబ్ద-తప్పుమాటలనెడు - శాస్త్రశిక్షితముగాని శబ్దములతోఁ గూడిన, వచోనివహంబుచేతన్ - వాక్యములయొక్కసమూహముతో, నెమ్మనమునన్ - తనమనస్సునందు, మోదము - సంతోషము, అందుక్రియన్ - పొందినట్లు మామకవాక్కులన్ - నాయొక్క పలుకులచేత, సంతసిల్లుమీ - సంతోషమునొందుము. ఇందు, 'జనకుఁడు బాలుఁడాడు నపశబ్దవచోనివహంబుచేత నెమ్మనమున మోదమందుక్రియ మామకవాక్కుల సంతసిల్లుమీ' అనుటచేత నుపమాలంకారము.

తా॥ ఈవిధముగా ధర్మశీలనృపాలునకుఁ బులహమహర్షి చెప్పిన యుపాఖ్యానమును బిన్నవాఁడనైననేను శంకరుఁడవగునీకు విన్నవించితిని. కనుకఁ దండ్రి చిఱుతనియొక్క వచ్చిరాని ముద్దుమాటల వలన సంతస మందునట్లు నాకావ్యమునఁ గల యపశబ్దములను పాటించక యానందించుము.

—: ఆశ్వాసాంతము :—

మ॥ మదనధ్వంసక తారభూమిధరభా ♦ మా ధామధామాక్షస
మ్మదసంధాయక దివ్యనామ నిజవా ♦ మా వామవామాంగ దు
ర్మదదంతావళదానవప్రవరభీ ♦ మా భీమభీమత్వ సం
పదగారీకృతదుష్టదైత్య ధృతసో ♦ మా సోమసోమేశ్వరా. 135

అ॥ మదనధ్వంసక - మన్మథుని నాశముచేయుటగలవాఁడా, తారభూమిధరధామా - వెండికొండ యేనివాసముగాఁగలవాఁడా, ధామధామాక్షసమ్మదసంధాయక. ధామధామ — తేజస్సునకు నిధియైన యగ్నిహోత్రుఁడే, అక్ష — కన్నుగాఁగలిగి, సమ్మద — సంతోషమును, సంధాయక — కూర్చునటు

వంటివాఁడా, దివ్యనామ — మనోహరమైన ప్రఖ్యాతిగలవాఁడా, రమ్యమైన పేరుగలవాఁడా యనియుఁజెప్పవచ్చును, నిజవామా— నిజ— స్వకీయమైన, వామా — రమ్యముగలవాఁడా, 'ని వామం సవ్యేప్రతీపేచ ద్రవిణేచాతిసుందరే, పయోధరే హరేకామే విద్యాద్వామాపిచ స్త్రీయాం' అనివి వామ వామాంగ. వామ — సుందరియైన పార్వతితోఁగూడిన, వామాంగ — శరీరముయొక్క యెడమవైపు గలవాఁడా, దుర్మదదంతావళ దానవప్రవరభీమా. దుర్మద — దుష్టత్వముగల గర్వముతోఁగూడిన, దంతావళదానవ — గజాసురుడను, ప్రవర — శ్రేష్ఠునకు భీమా — భయంకరుఁడవైనవాఁడా, భీమ భీమత్వసంపదగారకృతదుష్టదైత్యా. భీమ — భయంకరులగువారికి సైతము, భీమత్వ — భయమును గలిగించుచున్న, సంపత్ — సమృద్ధికి, అగారీకృత — ఇల్లుగాఁజేయఁబడిన, దుష్టదైత్య — చెడువారైన రాక్షసులుగలవాఁడా, అనఁగాదుర్మార్గులగు రక్కసులకుమాత్రమే భయముగలిగించువాఁడనుట, ధృతసోమా — ధరించఁబడిన చంద్రుఁడుగలవాఁడా, సోమసోమేశ్వరా. సోమ — ఉమాసహితుఁడవైన, సోమేశ్వరా — సోమేశ్వరుఁడను పేరుగలయోస్వామీ, అని యాశ్వాసాంతమునఁ గృతిపతికి సంబోధనము, ఇందు ముక్తపదగ్రస్తమును దానివెంటనే ఛేకానుప్రాసాలంకారమును గూర్చుటయేకాక నాలుగు విశ్రమస్థానములయందును మకారమే వచ్చునట్లుకూడఁ జిత్రించఁబడియున్నది. ముక్తపదగ్రస్తమనఁగా ముగిసినపదమును వెంబడిగా నెండియుం గ్రహించుటమాత్రమే ఇట్టి యలంకారములతో శోభిల్లు పద్యములు కావ్యములందంతగాఁ గానఁబడవు.

శా॥ భస్మోద్ధూళితదేహపోషణకళా ♦ పారీణ వారాకరా
కస్మాదుత్థితకాలకూటవిషది ♦ గ్ధగ్రీవ పాదాంబుజా
తస్మర్తృవ్రజకల్పభూజ కరుణా ♦ ధన్యేక్షణా సేవమా
నాస్మత్పౌత్త్రిక మత్తనూభవక నా ♦ గాఖ్యాంకలింగాహ్వయా. 136

అ॥ భస్మో.........పారీణ. భస్మ — విభూతి, ఉద్ధూళిత — చెలరేఁగఁబడిన, ఎగయఁబడిన, దేహ — ఒడలియొక్క, పోషణ — వర్ధిఁబొందించుటయనెడి, కళా — విద్యయందు, పారీణ— అవలి దరిముట్టినవాఁడా — తుదముట్టనేర్చినవాఁడా యనుట, వారా.........గ్రీవ. వారాకరా — సముద్రమునందు, అకస్మాత్ — ఆకస్మికముగ — ఆ తెప్పపాటులోనే, ఉత్థిత — పుట్టిన, 'ని. ఉత్థితంస్యాత్త్రిషూత్పత్తే ప్రోద్యతే వృద్ధిమత్యపి' అనిమే. కాలకూటవిష — కాలకూటమను పేరుగలవిషముతో, 'కాలస్యవర్ణస్య కూటః కాలకూటః' అనివ్యు. దిగ్ధ — పూయఁబడిన, గ్రీవ — కంఠముగలవాఁడా, పాదా.........భూజ. పాదాంబుజాత — పద్మమువంటిచరణమును, స్మర్తృవ్రజ — స్మరించునట్టివారి సమూహమునకు, కల్పభూజ — కల్పవృక్షమైనవాఁడా, కరుణాధన్యేక్షణా. కరుణా — దయతోఁ గూడిన ధన్య — పుణ్యవంతమైన. కృతార్థతగల, ఈక్షణా — చూపుగలవాఁడా, సేవమా......... హ్వయా. సేవమాన — కొలుచుచున్న, అస్మత్పౌత్త్రిక — నాయొక్క మనుమలు గలిగినట్టియు, మత్తనూభవక — నాకుమారులు గలిగినట్టియు, నాగాఖ్య — నాగయ్యయను పేరుతోఁగూడిన, అంక — గుఱుతుగల, లింగాహ్వయా — లింగమనునామధేయముగలవాఁడా, అనఁగా నాగలింగమను నభిధానముగలవాఁడాయనుట, ఈనాగలింగమీకవికిఁ బితామహుఁడైయుండి స్వర్గము నలంకరించినట్లీపద్యము వలన బోధపడుచున్నది. 'సేవమానాస్మత్పౌత్త్రిక' అనుటచేఁబితృపితామహప్రపితామహులెల్ల శుభా

శుభ పుణ్యకార్యాదులయందుఁ బూజింపఁబడుచుండును. 'పౌత్రీస్యస్వర్శనాన్మర్త్యోముచ్యతేచ ఋణత్రయాత్, లోకానత్యేద్దివప్రాప్తిః పుత్రపౌత్రప్రపౌత్రకైః' అని గరుడపురాణమునఁ జెప్పఁబడియున్నను ప్రప్రపితామహుఁడుగూడ సేవింపఁబడు నపుడన్నమును బరికించియే చెప్పియుండెను. విస్తరభీతిచే విరమింపఁబడినది. కొందఱుకవులు గద్యమున. 'పౌత్రి, పుత్రి, నామధేయ' అని చెప్పుచుందురు.

ఆ॥ అతులతర సోమవార, వ్రతనియమధురీణహృదయ ♦ వారిజ సాధ్వీ
శత వినుత చెన్నమాంబా, ప్రతిదినసంసేవ్యమాన ♦ పదపంకేజా. 137

అ॥ అతు..........వారిజ. అతులతర — అసమానమయిన, సోమవారవ్రత — సోమవారమున నాచరించెడి శాస్త్రసిద్ధమైన కర్మము (నోము) యొక్క, నియమ — నిశ్చలబుద్ధియందు, ధురీణ— భారమును వహించుచున్న, హృదయవారిజ — మనస్సనెడి పద్మముగలదియును, సాధ్వీశతవినుత — బహుసంఖ్యాకమైన పతివ్రతలచేత స్తుతింపఁబడినదియును, నగు, చెన్న.........పంకేజా. చెన్నమాంబా - చెన్నమ్మయను నామెవలన, ప్రతిదిన— నిత్యమును, సంసేవ్యమాన— కొలువఁబడుచున్న, పదపంకేజా- చరణములనెడి కమలములుగలవాఁడా, ఈచెన్నమ్మయనునామె యీకవికిఁదల్లియగుటవలనను, నామె పరమేశ్వరప్రీత్యర్థముగ సోమవారవ్రతమాచరించుచుండుటవలనను, నిట్లువచించియుండెను.

గద్యము. ఇది శ్రీమత్కాళీవరప్రసాదలబ్ధ లబ్ధవర్ణవర్ణనీయ కవిత్వతత్త్వధారేయ, పెదలింగనార్యగర్భార్ణవపూర్ణిమాత్రేయ, గురువరాచార్యపదారవింద మిళిందాయమానమానసాత్రేయ, పండితమ్మన్యేతరాజేయ, సకలవిద్వజ్జనవిధేయ, రుద్రయనామధేయ ప్రణీతంబయిన నిరంకుశోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు సర్వంబుఁ జతుర్థాశ్వాసము.

అ॥ తృతీయాశ్వాసమునఁబోలె నెఱుఁగునది.

ఇది శ్రీమద్గాయత్రీ విరాడ్విశ్వకర్మ వరప్రసాదజనిత కవితామృత రసపాత్ర, అహభూనస గోత్రపవిత్ర, అచ్చమాంబా వేంకటశివార్యపౌత్ర, లక్ష్మాంబా కోటీశ్వర సుధీమణిపుత్ర, శిల్పవాస్తు జ్యోతిశ్శాస్త్రాదివివిధవిద్యాప్రవీణ, పదవాక్యప్రమాణ నిధాన, విమర్శకాచార్యశిల్పకళాకోవిదేత్యాది బిరుద నిరుపమాన, బుధారాధన విరాజమాన, సుబ్రహ్మణ్యాభిధాన, విరచితంబైన నిరంకుశోపాఖ్యాన సుధాతరంగిణీవ్యాఖ్యానమునఁజతుర్థాశ్వాసము.



నాగార్జున ప్రెస్, నిడుబ్రోలు.

# నిరంకుశోపాఖ్యాన పూర్వ ముద్రణమునందు దోషములకు సవరణలు

(సం — సంఖ్య, పూ — పూర్వముద్రణము, స — సవరణ)

## ప్రథమాశ్వాసము

| సం. | పూ. | స. |
|---|---|---|
| 2 | నెక్కిన | నెక్కిడు |
| ,, | తోఁడు | తోడు |
| 4 | మనస్సమధూళిసుమ ధూళి | మనస్సుమధూళిసమ దాళి |
| 6 | మున్నఁగా | మున్నగా |
| ,, | గాఁపురంబు | గాఁపురంబుఁ |
| ,, | చక్కఁదనమున | జక్కఁదనమున |
| 8 | బత్ర | బత్త్రి |
| 10 | అనియిట్లు | అనియిష్ట |
| ,, | నోసరించి | కోఅడించి |
| 14 | సమస | సమస్త |
| 19 | పాప | పాఁప |
| 20 | కందర్పుఁ | కందర్పు |
| ,, | విశాలుకూలి | విశాలకూల |
| 23 | దనుజ | తనుజ |
| 25 | గతశీతల (ప్రాసభంగము) | ఘటితామృత |
| 26 | ప్రేయస్సిత | ప్రేయస్స్మిత |
| 28 | రామంబుఁగా | రామంబుగా |
| 30 | గాపులహు | గాఁబులహు |
| 35 | తలంకనేము | తలంకకేను |
| 39 | కడు | శివ |
| 43 | లాటఁ | లాట |
| ,, | సూఫ్త్రితెలియ | సూఫ్త్రిఁదెలియ |
| ,, | మాటఁగొత్త | మాటక్రొత్త |
| ,, | లాటనమర | లాటయమర |
| ,, | సువర్ణాబ్జత | సువర్ణాబ్జతఁ |
| 45 | ధీధితి | దీధితి |
| ,, | బ్రోవఁ | బ్రోవ |
| 47 | సత్యా | సత్త్వ |
| ,, | యాజగ | యాజన |
| 50 | జిలుఁగుఁజెంగావి | జిలుఁగుచెంగావి |
| 51 | ముక్కువ | మక్కువ |
| 53 | కటకంబుపాద | కటకంబుఁబాద |
| 54 | యనఘ | యనిశ |
| 60 | లలామము | శిరోమణి |
| 61 | నిశాంతమునంధర | నిశాంతమునన్ధర |
| 64 | మదిచింతిలు | మదిఁజింతిలు |
| 65 | అనుటగాని | అనుట కాని |
| 68 | పుత్రు | పుత్త్రి |
| ,, | చంద్రు | చంద్ర |
| ,, | దుస్థితిన్ | దుస్స్థితిన్ |
| 70 | పుత్రుండు | పుత్త్రిండు |
| ,, | తనయుండు | తనుజుండు |
| ,, | సమకూఱు | సమకూర |
| 75 | యుఁకఁజోద్య | యొకచోద్య |
| 79 | జలజాంబకు యతిభంగము | జలజోదరు |
| ,, | పుత్రు | పుత్త్రి |
| ,, | నావుఁడున్ | నావుడుఁ |
| 79 | సముద్వామ యతిభంగము | సముద్యామ |
| ,, | జాత | జాతు |
| 81 | గాన | యైన |
| 83 | కళఁ | కళ |
| 87 | పుత్ర | పుత్త్రి |
| 88 | మొలకల | మొలకలు |
| 89 | కరణి | కరణిఁ |
| 94 | దుపేతంగుణ | దుపేతఁగుణ |
| 95 | ధని | విని |
| 96 | శృంగిరాజ | శృంగిణీశ |
| ,, | సురగంగా | శశిరేఖా |
| 100 | కవిత్వ | కవిత్వతత్త్వ |
| ,, | మాన | మానమానస |

## ద్వితీయాశ్వాసము

| సం. | పూ. | స. |
|---|---|---|
| 3 | ధరాసుర | ధరామర |
| 6 | నర్మిలులేరు | నర్మిలెయేరు |
| 8 | విభవంబు | విభవంబుఁ |
| 10 | తలఁపోసి | తలపోసి |
| 12 | మిగులఁ | మిగుల |
| ,, | ధరాసుర | ధరామర |
| 16 | సైకాలు | సౌకాలు |
| 17 | వోయి | పోయి |
| 19 | కామిల | కామినుల |
| 20 | మీఁదకప్పర | మీఁదఁగప్పర |

